# ఆంధ్రకవుల చరిత్రము.

## ద్వితీయ భాగము

## మధ్యకాలపు కవులు

By

**K. VEERESALINGAM**

వెల : 20—0—0

# విషయ సూచిక



కీ. శే. కందుకూరి వీరేశలింగం పంతులుగారు.

# ఆంధ్రకవుల చరిత్రము

## మధ్యకవులు

## కృష్ణదేవరాయలు

ఇతఁ డాముక్తమాల్యద యను నామాంతరముగల విష్ణుచిత్తీయ మనుప్రబంధమును రచించిన మహాకవి. ఇతఁడు కవీశ్వరుఁ డయి విద్వన్మహాకవుల నాదరించుట వలననేకాక మహారాజయి యనేకదేశములను జయించుటవలనఁగూడ సుప్రసిద్ధుఁ డయినవాఁడు. దక్షిణహిందూదేశమును పాలించినరాజులలో నింతదేశమును జయించి యేలినవాఁడును, ఇంత ప్రసిద్ధి కెక్కినవాఁడును, మఱియెవ్వఁడును లేఁడు. కాఁబట్టి యీతని చరిత్రమును వ్రాయుటకుముం దీతని పూర్వచరిత్రమునుగూడ సంక్షేపముగాఁ గొంతవ్రాయుట యుచితమని తోఁచుచున్నది. ఈతని రాజధాని బళ్ళారిమండలములోని యానెగొందికి సమీపమున తుంగభద్రాతీరమునం దున్న విజయనగరము. ఈవిజయనగరమునకు విద్యానగరమనియు నామాంతరము గలదు. ఈపట్టణము విద్యారణ్యస్వామి యని మహాప్రసిద్ధిగన్న మాధవాచార్యులవారి యాజ్ఞచేతఁ గట్టఁబడినది. ఈమాధవాచార్యు లాకాలమునందు బుక్కరాజువద్ద మంత్రిగా నుండెను. కంపభూపతి కుమారుఁడైన బుక్కరాజు క్రీస్తుశకము ౧౩౪౦ సంవత్సరము మొదలుకొని ౧౩౭౮ వ సంవత్సరమువఱకును రాజ్యము చేసెను. ఈరాజు హూణశకము ౧౩౩౬ వ సంవత్సరము మొదలుకొని ౧౩౫౦ వ సంవత్సరము వఱకునుగూడ తనయన్నయైన హరిహరరాజుతోఁ గలిసి రాజ్యము చేసెననియు, ఆకాలమునందుఁగూడ మాధవాచార్యుఁడే వారికి మంత్రియనియు, వారికిరాజ్యము మాధవాచార్యుని

వలననే వచ్చెననియు, కొందఱందురుగాని యది యెంతవఱకు సత్యమో తెలియదు. బుక్కభూపాలుని తండ్రియైన సంగ (కంప) రాజొకచిన్న సంస్థానాధిపతియైయుండి, మహమ్మదీయులు దండెత్తివచ్చి హిందూ రాజ్యమును నాశనముచేసి యోరుగంటి ప్రతాపరుద్రుని చెఱగొనిపో యిన కాలములో తనరాజ్యమును పోగొట్టుకొని యుండును. కొందఱ తఁడు గొల్లవాఁడని చెప్పుదురు. కాని యాతని పూర్వస్థితిని నిర్ధార ణము చేయుటకుఁ దగినయాధారములు లేవియు నిప్పుడు కానరావు. ఈ హరిహర బుక్కరాజులు సహితము ప్రతాపరుద్రుని యవసానదశయం దాతని సేనలో దండనాథులుగా నుండిరని యొకానొకరు వ్రాసి యున్నారు. ఏదియెట్లున్నను వీ రారంభదశలో రాజ్యహీనులయియుండి తమ ధైర్యసాహసముల వలనను తమ కులగురువైన మాధవాచార్యుని బుద్ధిబలమువలనను రాజ్యము సంపాదించి, స్వతంత్రులై మాధవాచా ర్యుని మంత్రిగాఁ జేసికొని యాతని యాలోచన ననుసరించి వర్తించు చుండినట్టుమాత్రము నిశ్చయముగా తెలియవచ్చుచున్నది. మాధవా చార్యులు తానొక దేవత నుపాసించి యా దేవతను బ్రత్యక్షము చేసికొని యామెవరముచేత బుక్కభూపాలునకు రాజ్యమిప్పించెనని కొందఱును, లక్ష్మీకటాక్షమునుబొంది సన్నిహితురాలయిన లక్ష్మీదేవిని త న్నైశ్వర్య వంతునిగాఁ జేయుమని కోరినప్పు డామె యాతని కాజన్మమునందు లక్ష్మి లభింపదని చెప్పఁగా జన్మాంతరతుల్యమైన సన్న్యాసమును స్వీకరించి వైభ వములను బొందెనని కొందఱును వ్రాసియున్నారు. ఇవి యిటీవలివారి బుద్ధికల్పితములు. ఇటువంటి కథలను కల్పించుటలో హిందువులకుఁ గల సామర్థ్యము మఱియెవ్వరికిని గానఁబడదు. మాధవాచార్యులకుఁ బూర్వ మునందు శంకరాచార్య పీఠమునకు వచ్చిన యతీశ్వరు లాదిశంకరుని వలెను, ఇతర సన్న్యాసులవలెను పాదచారులయి భిక్షాటనము చేయుచు, శిష్యపరంపరకు తత్త్వబోధను జేయుచువచ్చిరి. ఈ మాధవాచార్యుఁడు

బుక్కరాజువద్ద మంత్రిగానుండి సమస్తవైభవముల ననుభవించుచు సన్న్యసించినవాఁడగుటచేతఁ దాను సన్న్యాసియయ్యును తొంటివిభవములను విడువఁజాలనివాఁడయి జనులకుఁ దనయందుఁగల గౌరవాధిక్యమువలనను, రాజానుగ్రహము వలనను, గజాశ్వాందోళనాది సమస్తరాజ చిహ్నములను ధరించి, పీఠాధిపతుల కిట్టి యైశ్వర్యచిహ్నము లుండవచ్చునని నిబంధనముచేసి సమర్థించుకొనెను. ఏనుఁగులతోను, గుఱ్ఱములతోను, వాద్యములతోను పల్లకులలో నెక్కి సర్వసంగపరిత్యాగు లయిన సన్న్యాసులు మహారాజ వైభవముతో సంచరించుట దేవతావరాయత్తమని సాధించుటకై మనవారీ లక్ష్మీకథను తరువాతఁ గల్పించియుందురు. సన్న్యాసాశ్రమమును స్వీకరించినప్పుడు మాధవాచార్యులవారు విద్యారణ్యు లన్న నామమును స్వీకరించిరి. వీరికాలమునుండియే జగద్గురువు లనుకొనెడు స్మార్తాచార్యపీఠస్థు లయినయతుల కందఱకును గజాశ్వాదులును వాద్యములును పెండ్లిపల్లకులును పరంపరగా వచ్చుచున్నవి. ఈ మాధవాచార్యులవారు గొప్ప విద్వాంసులు. ఆదిశంకరుల తరువాత శంకరాచార్య పీఠమునకు వచ్చినవారిలో మాధవాచార్యులకుఁ బూర్వమునందుఁగాని పరమునందుఁగాని యింతటిపండితులు మఱియెవ్వరును లేరు. ఈయన పరాశరమాధవీయ మనుపేర పరాశరస్మృతి కొక్క గొప్ప వ్యాఖ్యానమును; కాలమాధవీయ మనునొక కాలనిర్ణయగ్రంథమును, శంకరవిజయమును, విద్యారణ్యమని ప్రసిద్ధిగన్న వేదభాష్యమును, నూటయెనిమిది యుపనిషత్తుల కొకవ్యాఖ్యానమును, సర్వదర్శన సంగ్రహమును, మాధవనిదానమును రచియించెను. రాఁబోయెడు విజయనగర రాజుల చరిత్రమును దివ్యజ్ఞానముచేత ముందుగానే తెలుపుచు నీ మహా విద్వాంసునిచే రచియింపఁబడిన దన్న కాలజ్ఞానమను పుస్తక మొకటి కలదుగాని యది విజయనగర సంస్థానము క్షీణించినతరువాత రచింపఁబడిన యాధునికగ్రంథ మయియుండును. మాధవాచార్యులవారు తుంగ

భద్రాతీరమునందున్న పంపానగరమునందు జన్మించిరి; వీరు బుక్కభూపాలునికి కులగురువులు; భారద్వాజసగోత్రులయిన తెలుఁగు బ్రాహ్మణులు; ఈయన తండ్రి మాయణుఁడు; అన్న సాయణుఁడు. అన్నయందును తండ్రియందునుగల గౌరవముచేత మాధవాచార్యుల వేదభాష్యములలోఁ గొన్నిటికి వారిపేరులు పెట్టెను. మాధవాచార్యులు తొంబదిసంవత్సరముల ప్రాయమున సిద్ధిపొందిరఁట; ఈయన ౧౩౮౮ వ సంవత్సరమునందు బుక్కరాజుమంత్రి యైయుండిన ట్లొక తామ్రశాసనమువలనఁ దెలియ వచ్చుచున్నది. మాధవీయాదిగ్రంథములలో మాధవాచార్యులవారు తమవంశమును దెలుపుచు వ్రాసిన రెండు శ్లోకముల నిందుఁ జూపుచున్నాను——

శ్లో॥ యస్య బోధాయనంసూత్రం శాఖాయస్యచయాజుషీ
భారద్వాజకులంయస్య సర్వజ్ఞ స్సహిమాధవః
శ్రీమతీయస్యజననీ సుకీర్తి ర్మాయణః పితా
సాయణోభోగ వాథశ్చ మనోబుద్ధిసహోదరౌ.

బుక్కరాజుతరువాత నాతనికి కామాక్షీదేవివలనఁ బుట్టినహరిహరనాథుఁడు ౧౩౭౯ వ సంవత్సరము మొదలుకొని ౧౪౦౧ వ సంవత్సరమువఱకును రాజ్యము చేసెను. ఈ హరిహరరాజునకు మల్లాదేవివలనఁ గలిగిన పుత్రుఁడైన వీరప్రౌఢదేవరాయలు ౧౪౧౨ వ సంవత్సరము వఱకును, ఆతనిపుత్రుఁడైన విజయభూపతి ౧౪౧౮ వ సంవత్సరము వఱకును, ఆతనికుమారుఁడైన దేవరాయలు ౧౪౨౨ వ సంవత్సరము మొదలుకొని ౧౪౪౭ వ సంవత్సరమువఱకును రాజ్యము చేసినట్లు శిలాతామ్రశాసనములవలనఁ దెలియవచ్చుచున్నది. కాని వీ రేయేసంవత్సరములయందు సింహాసన మెక్కిరో యేయేసంవత్సరములయందు పరమపదమును బొందిరో నిశ్చయముగాఁ దెలియదు. బుక్కరాజు

కాలమునుండియు వీరికి మహమ్మదీయులతో యుద్ధములు జరుగుచు వచ్చెను. ౧౩౬౮వ సంవత్సరమునందు మొట్టమొదట బుక్కరాజు మహమ్మదీయులను యుద్ధములో జయించెను. ఆతని పుత్రుఁడైన హరిహరరాజును మహమ్మదీయులతో యుద్ధము చేసి ౧౩౮౦వ సంవత్సరమునందు తురుష్కులను గోవానగరమునుండి వెడలఁగొట్టెను. ఈ హరిహరరాజు హిందూదేవాలయముల కనేకములకు భూదానములు చేసెను. హరిహరరాజుయొక్క కడపటిదినములలో సాళువగుండరాజు మంత్రిగా నుండెను. గుండరాజు జైమినిభారతము కృతినందిన సాళువనృసింహరాజుతండ్రి. గుండరాజు మంత్రిగాను దండనాథుఁడుగాను ఉండి కొంత రాజ్యమును సంపాదించెను. తదనంతర మాతనిపుత్రుఁడు సాళువ నృసింహరాజు దేవరాయలు సంతానములేక మృతుఁడగుటవలననో మఱియేలాగుననో కర్ణాటకరాజ్యము నాక్రమించుకొనెను. నరసింహరాజునకు తిమ్మరాజనుపేరుగల జ్యేష్ఠభ్రాత యొకఁడు గలఁడు. అతఁడే యీశ్వరరాజు తండ్రియైన సాళువతిమ్మరాజని తోఁచుచున్నది. సాళువ నృసింహరాజు భూదానములు మొదలయిన దానము లనేకములు చేసెను. ఇతఁడు చిత్తూరిమండలములోని వందవాసినగరమునకు పడమట నామడదూరములో నున్నవెల్లము గ్రామములోని దేవాలయమునకు శాలివాహనశకము ౧౩౯౧వ సంవత్సరమునం దనఁగా హూణశకము ౧౪౬౯వ సంవత్సరమునందుఁ గొంతభూమి యిచ్చెను; ఈతని రాజ్యకాలములోనే చిత్తూరిమండలములోని యావూరుగ్రామములోని శివాలయమున కొకరిచేత శాలివాహనశకము ౧౩౯౩వ సంవత్సరమునకు సరియైన క్రీస్తుశకము ౧౪౭౧వ సంవత్సరమునందుఁ గొంతభూమి యియ్యఁబడినది. ఈ నృసింహరాజు కాలమున తిమ్మరాజు పుత్రుడైన యీశ్వరరాజు దండనాథుఁడుగా నున్నట్లు వరాహపురాణ పీఠికవలనఁ దెలియవచ్చుచున్నది. ఈ నృసింహరాజు మరణానంతర మీశ్వరరాజుపుత్రుఁ

డయిన నరసింహరాజు రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు ౧౪౮౭వ సంవత్సరము వఱకును రాజ్యము చేసినట్లు శాసనములవలనఁ దెలియవచ్చుచున్నది. కొందఱితఁడు ౧౫౦౪ వ సంవత్సరమువఱకు మాత్రమే రాజ్యపరిపాలనము చేసె ననియు, ఆసంవత్సరము మొదలుకొని యాతని జ్యేష్ఠపుత్రుఁ డయిన వీరనృసింహరాయలు పరిపాలనము చేసెననియు చెప్పుచున్నారు. ఇదియే నిజమై యుండవచ్చును. పేరొక్కటియే యై యుండుటచేత శాసనములను పరీక్షించినవారు కొడుకునుగూడ తండ్రినిగా భ్రమించియుందురు. ౧౫౦౯ వ సంవత్సరమునందు కృష్ణదేవరాయల ప్రభుత్వ మారంభమైనది. కృష్ణదేవరాయలు రాజ్యమునకు రాకముం దాతని యన్నయైన వీరనృసింహరాయలు కొంతకాలము రాజ్యము చేసినట్లు కృష్ణదేవరాయల కంకితము చేయఁబడిన గ్రంథముల యం దెల్లను జెప్పఁబడియున్నది:—

క. వీరనృసింహుఁడు నిజభుజ
దారుణకరవాలపరుషధారాహతవీ
రారియగుచు నేకాతప
వారణముగ నేలె ధర నవారణమహిమన్.

క. ఆవిభు ననంతరంబ ధ
రావలయముఁ బాల్చెఁ గృష్ణరాయఁడు చిన్నా
దేవియు శుభమతి తిరుమల
దేవియునుం దనకుఁ గూర్చుదేవేరులుగన్—మనుచరిత్రము.

క. వారలలోఁ దిప్పాంబకు
మారుఁడు పరిపంథికంధిమంథాచలమై
వీరనరసింహరాయఁడు
వారాశిపరీతభూమివలయం బేలెన్.

శా. వీరశ్రీనరసింహశౌరి పిదప న్విశ్వక్షమామండలీ
ధౌరంధర్యమున న్జనంబు ముద మంద న్నాగమాంబాసుతుం
డారూఢోన్నతిఁ గృష్ణరాయఁడు విభుండై రాజ్యసింహాసనం
బారోహించె విరోధులు న్గహనశైలారోహముం జేయఁగన్.—

పారిజాతాపహరణము

శిలాతామ్రశాసనాదులవలనఁ దెలియవచ్చెడు వంశవిధమునఁగాక యీ వంశవిషయ ముయి పలువురు పలువిధముల పరస్పరవిరుద్ధముగా వ్రాసియున్నారు. అందొక విధము నిందుక్రిందఁ గనఁబఱిచెదను.—

| | మొదలు — వఱకు |
|---|---|
| హరిహరరాయలు | 1336—1350 |
| బుక్కరాయలు | 1350—1379 |
| హరిహరరాయలు | 1379—1401 |
| విజయబుక్కరాయలు | 1401—1418 |
| వల్లబుక్కరాయలు | 1418—1434 |
| గాడదేవరాయలు | 1434—1454 |
| రాజశేఖరరాయలు | 1454—1455 |
| విజయభూపతి | 1455—1456 |
| ప్రౌఢదేవరాజు | 1456—1477 |
| వీరప్రతాపరాయలు | 1477—1481 |
| మల్లికార్జునరాయలు | 1481—1487 |
| రామచంద్రరాయలు | 1487—1488 |
| విరూపాక్షరాయలు | 1488—1490 |
| నరసింహరాయలు | 1490—1495 |
| నరసరాయలు | 1495—1504 |
| వీరనరసింహరాయలు | 1504—1509 |
| కృష్ణదేవరాయలు | 1509—1530 |

ఈ పట్టిక యొక్కటియే చాలవఱకు శిలాతామ్రశాసనముల లోని కాలము ననుసరించి యున్నది.

కృష్ణదేవరాయలు జన్మించినదినముగాని సంవత్సరముగాని సరిగాఁ దెలియదు. కృష్ణరాయలజనన మొకరు ౧౪౬౫ వ సంవత్సరమునం దనియు, ఇంకొకరు ౧౪౮౭ వ సంవత్సరమునందనియు వ్రాసియున్నారు గాని యందేది సత్యమయినదియు నిశ్చయించుట కాధారము లేవియు దొరకలేదు. ఇతఁడు శాలివాహనశకము ౧౩౮౭ వ సంవత్సరమునం దనఁగా క్రీస్తుశకము ౧౪౬౫ వికృతిసంవత్సర పుష్యబహుళ ద్వాదశీ శుక్రవారమునాఁడు పుట్టినట్టు తెలిపెడి యీక్రిందిపద్య మొకటి వాడుకలో నున్నది:—

ఉ. అందలి శాలివాహనశకాబ్దము లద్రివసుత్రిసోములన్
వందిత మైనయవ్వికృతివత్సరమందలి పుష్యమాసమం
దుం దగుకృష్ణపక్షమున నుండెడిద్వాదశి శుక్రవాసరం
బం దుదయించెఁ గృష్ణుఁడు శుభాన్వితుఁ డానరసింహమూర్తికిన్.

ఇది యెంతవఱకు విశ్వసింపఁదగినదో బుద్ధిమంతులగువా రాలోచించుకొందురుగాక! అయినను, ఇది మొదటివారు చెప్పినకాలముతో సరిపోవుచున్నందున దీని నధికవిశ్వాసార్హముగా నెంచవచ్చును. ౧౮౨౯ వ సంవత్సరములో కావలి వెంకటరామస్వామిగారు కలకత్తానగరమునందుఁ బ్రచురించిన దక్షిణహిందూదేశకవుల చరిత్రములో కృష్ణరాయలు తన నలుబదవయేట శాలివాహనశకాబ్దములు ౧౪౪౬ వ సంవత్సరమునం దనఁగా క్రీస్తుశకము ౧౫౨౪ వ సంవత్సరమునందు మృతినొందినట్టు వ్రాసియున్నారు. దీనినిబట్టిచూడఁగా నీ రాయలవారు హూణశకము ౧౪౮౪ వ సంవత్సరమునఁ బుట్టిన ట్లేర్పడుచున్నది. అల్లసాని పెద్దన్న చెప్పినట్టు చాటుధారగా వచ్చుచున్న యీక్రింది పద్యములనుబట్టికూడ కృష్ణదేవరాయల మృతికాల మించుమించుగా దీనితో సరిపోవుచున్నది.

ఉ. బోరన యాచకప్రతతి భూరివిపద్దశ నొందుచుండఁగా
నారయ శాలివాహనశకాబ్దము లద్రియుగాబ్ధిసోములం
దారణవత్సరంబున నిదాఘదినంబున జ్యేష్ఠశుద్ధ ష
ష్ఠీరవివాసరంబున నృసింహుని కృష్ణుఁడు చేరె స్వర్గముం
ద్వారక నున్నకృష్ణుఁ డవతారసమాప్తము నొందు కైవడిన్.

ఈపద్యమునుబట్టి శకాబ్దములు ౧౪౪౭ టికి సరియయినహూణ శకము ౧౫౨౫ వ సంవత్సరమునఁ గృష్ణరాయ లంతరించినట్లు కానఁబడుచున్నను, ౧౫౩౦ వ సంవత్సరమువఱకు నాతని దానశాసనములు విస్తారముగా నున్నందున శాసనములను బరీక్షించిన యిప్పటి వారతఁడు ౧౫౩౦ వ సంవత్సరమునందే మృతినొందెనని నిశ్చయించియున్నారు. ౧౫౨౬, ౧౫౨౮, ౧౫౨౯ వ సంవత్సరములయం దచ్యుతదేవరాయల దానశాసనములు సహితము రెండుమూడు కానవచ్చుచున్నను, అవి కృష్ణరాయల జీవితకాలములోనే చేయఁబడినవి కావచ్చును. కృష్ణదేవరాయలతండ్రియైన నరసింహరాయనికి తిప్పాంబ యనియు, నాగమాంబ యనియు, ఇద్దఱు భార్యలు గలరు. ఆ యిరువురలో తిప్పాంబ పట్టపురాణియనియు, నాగమాంబ భోగకాంతయనియు, చెప్పుదురు. కొన్ని శాసనములయందుఁగూడ నిట్లే కానఁబడుచున్నది. ఆయిద్దఱు భార్యలలో తిప్పాంబకు వీరనృసింహరాయలును, నాగమాంబకు కృష్ణదేవరాయలును పుట్టిరి. నరసింహదేవరాయల కోబమాంబ యని యింకొక భార్య యున్నట్టును, ఆమె కచ్యుతదేవరాయలు పుత్రుఁ డయినట్టును, శాలివాహనశకము ౧౪౫౯ వ సంవత్సరమునకు సరియైన హూణాబ్దము ౧౫౩౭ హేవిళంబి సంవత్సరమున చిత్తూరిమండలములోని నారాయణపురము నొక బ్రాహ్మణునికి దాన మిచ్చుచు నచ్యుతదేవరాయలు వ్రాసియిచ్చిన తామ్రశాసనములోని యీక్రింది వాక్యములవలనఁ దెలియవచ్చుచున్నది:-

తిప్పాజీ నాగలాదేవ్యో కౌసల్యా శ్రీసుమిత్రయోః
జాతౌ వీరనృసింహేంద్ర కృష్ణరాయ మహీపతిః
అస్మాదోబాంబికాదేవ్యా మచ్యుతేంద్రోపి భూపతిః.

కృష్ణదేవరాయలతండ్రి నరసింహరాజే మధుర శ్రీరంగపట్టణము మొదలయినవానిని జయించి తద్దేశముల నాక్రమించినట్లు పారిజాతాపహరణములోని యీక్రిందిపద్యమువలనఁ దేటపడుచున్నది—

సీ. కుంతలేశ్వరుఁడు చిక్కుపడంగవిద్యాపురంబుఁ గైకొని నిజప్రౌఢి నెఱపెఁ
బారసీకునకు దుర్భరమానవత్వంబుఁ దొలఁగించె మానవదుర్గసీమఁ
జోళవల్లభునకుసురవధూమధురాధరములిచ్చిమధురాపురంబుగొనియె
శ్రీరంగ పట్టణసీమ ఖడ్గనటీవినోదంబు హూణనేంద్రునకుఁ జూపె
నతఁడు నుతికెక్కె రామసేత్వంతరాళ
కలితషోడశ దానవిఖ్యాతయశుఁడు
మండలీకర మేఘమార్తాండబిరుదుఁ
డీశ్వరాధిపు నరసపృథ్వీశ్వరుండు.

౧౫౦౯ వ సంవత్సరమునకు సరియైన శాలివాహనశకము ౧౪౩౦ శుక్లసంవత్సర వైశాఖమాసమునందు సింహాసనమునకు వచ్చువఱకును గల కృష్ణరాయనిచరిత్రము విశ్వాసార్హమైన దేదియు తెలియదు. వీర నృసింహరాయుని పై నిజాపు ప్రేమముకంటెఁ దండ్రి కృష్ణరాయనియెడ నధికప్రేమమును జూపుచు వచ్చెననియు, అదిచూచి సహింపలేక వీర నృసింహరాయని తల్లి తన సపత్నీపుత్రుని జంపింపఁ బ్రయత్నింపఁగా మంత్రియైన తిమ్మరుసు పాజాడఁ గనిపెట్టి యాతని దాఁచి ప్రాణమును రక్షించి కాపాడెననియు, తరువాతఁ గొంతకాలమునకు నృసింహదేవ రాయ లుబ్బుజబ్బుచేత బాధపడుచుఁ బ్రాణావసానకాలమునందుఁ గొడుకులను బిలిచి తనవ్రేలియుంగరమును దీసికొన్నవాఁడు రాజ్యార్హుఁ డని

చెప్పినప్పుడు తక్కినవారు తీయుట కుపాయముతోఁచక యూరకుండఁగాఁ గృష్ణరాయలు తనచేతిఖడ్గముతో జనకునివ్రేలు నటికి యుంగరమును గైకొనెననియు, అతని సాహసమునకు మెచ్చి తండ్రి యాతనినే పట్టాభిషిక్తుని జేయ నియమించి దేహావియోగమును బొందెననియు కథలు చెప్పుదురు. నరసింహరాయని యనంతరమున జ్యేష్ఠుఁడయిన వీరనృసింహరాయఁడే రాజ్యమునకు వచ్చినట్లు కృష్ణరాయని కంకితము చేయఁబడిన మనుచరిత్రాది గ్రంథములే చెప్పుచున్నందున, ఈ కడపటిసంగతి సత్యమయి యుండదు. కృష్ణదేవరాయఁడు సింహాసనమునకు వచ్చిన శీఘ్రకాలములోనే యుద్ధయాత్రచేసి తన రాజ్యమును నానాముఖముల వ్యాపింపఁజేసెను. దాసీపుత్రుఁడగుటచేత నాతనికి సత్కులీనులగు రాజు లెవ్వరును గన్య నియ్యనందున సింహాసన మెక్కినప్పటికి వివాహము కాలేదు. కృష్ణరాయలు ౧౫౧౩ వ సంవత్సరమునందు దక్షిణ దిగ్విజయయాత్రకు బయలువెడలి మహిసూరుదేశములోని యుమ్మటూరు, శివసముద్రము, శ్రీరంగపట్టణము లోఁబఱుచుకొని గంగవంశరాజులను జయింపఁగా, తరువాత మహిసూరుదేశమంతయు స్వాధీనమయినది. ఈ దేశమును జయించినసంగతి పారిజాతాపహరణములోని ద్వితీయాశ్వాసాంతమందలి యీ క్రిందిపద్యమునందు సూచింపఁబడినది:—

శా. సమ్మర్దక్షమధీనిబంధనవిధాసంక్రందనాచార్య శూ
రమ్మన్యాచలవజ్రపాత జగతీరక్షాంబుజాక్షా శర
ధ్యమ్మార్గస్థపళాస్య రాజ్యపమ సహ్యప్రోద్భవాతీరభా
గుమ్మత్తూరి శివంసముద్రపుర వప్రోన్మూలనాడంబరా.

ఆ సంవత్సరమునందే కృష్ణదేవరాయలు నెల్లూరిమండలములోని యుదయగిరిమీఁదికి దండెత్తి, దాని కధికారిగానున్న వీరభద్రపాత్రుని పినతండ్రియైన ప్రహరేశ్వరపాత్రుని జయించి యాదుర్గమును సాధించెను. అటుతరువాతఁ గృష్ణరాయల మంత్రియైన యప్పాజీ యను నామాంత

రము గల తిమ్మరుసు (సాళువతిమ్మరాజు) నెల్లూరిమండలములోని కని గిరి (కనకగిరి) కి రాజయినట్టియు, ఓరుగంటి ప్రతాపరుద్రుని సంతతి వారిలోఁ గడపటివాఁ డయినట్టియు వీరరుద్రగజపతి కూతనికొమార్తెను కృష్ణరాయల కిచ్చి వివాహము చేయుమని సందేశము పంపెను. ఆతఁడు హీనకులుఁడైన కృష్ణరాయనికిఁ దనపుత్రిక నియ్యనని స్పష్టముగాఁ జెప్పి యటువంటి బలవంతునితో విరోధము పెట్టుకొనుటకు సాహసింపఁజాలక, కొమార్తె నిచ్చెద నని చెప్పి రాయలను మంత్రిసహితముగా రప్పించి, అంతఃపురము చొచ్చినప్పుడు రాజుప్రాణములు గొనఁ బ్రయత్నించెను. కోటలోఁ బ్రవేశించిన తరువాత మంత్రియైన తిమ్మరు సీమోసమును గనిపెట్టి రాజుప్రాణములు కాపాడుటకై తాను రాజువేషమును వేసికొని కృష్ణరాయనికి సేవకవేషమువేసి తన వెంటఁగొనిపోయెను. కాని కృష్ణ రాయనిచేతివ్రేలినున్న ముద్రయుంగరమునుబట్టి యతఁడేరాజని యంతః పురములోనివా రానవాలు పట్టిరి. ప్రాణోపద్రవము సంభవింపనున్న యీ సమయమునందు ధీమంతుఁడైన మంత్రియుపాయమువలన రాజు తానును మంత్రియు నెట్లో ప్రాణములు దక్కించుకొని పాఱిపోయి స్వదేశమును జేరినతో డనే సేనలనుగూర్చి కనిగిరిమీఁద దండెత్తివచ్చి వీరరుద్రునిరాజ్యమును, అతనిపుత్రికయైన చిన్నాదేవినిగైకొని, ద్రోహి యైన యాతనిఁ జంపక కుటుంబసహితముగా వింధ్యపర్వత ప్రాంతము లకుఁ బాఱఁద్రోలెను. వీరరుద్రునిశుద్ధాంతస్త్రీలు వింధ్యపర్వతము పాలైన సంగతిని మనుచరిత్రమునం దల్లసాని పెద్దన యీరీతిగా వర్ణించి యున్నాఁడు :—

మ. ధరకెంధూళులు కృష్ణరాయలచమూధాటీగతి న్వింధ్యగ
హ్వరము ల్దూఱఁగఁ జూచి తా రచటఁ గాపై యుండుటం జాల న
చ్చెరువై యెట్టనివింతచీఁకటులు వచ్చెం జూడరే యంచు వే.
సొరిదిం జూతురు వీరరుద్రగజరాట్శుద్ధాంతముగ్ధాంగనల్.

కృష్ణరాయలు ౧౫౧౫ వ సంవత్సరమునందు పూర్వదిగ్విజయ యాత్ర వెడలి, ఆ సంవత్సరమునందె కొండవీడు, బెల్లముకొండ, బెజవాడ, కొండపల్లి, రాజమహేంద్రవరము మొదలయిన ప్రదేశములను జయించి, ౧౫౧౬ వ సంవత్సరమునందు విశాఖపట్టణమండలములోని భీమునిపట్టణమున కయిదుక్రోసులదూరములో నున్న పొట్నూరివద్ద రాతిజయస్తంభమును వేయించి, ఆమండలములోని వీరవల్లి తాలూకాలోని వడ్డాది జయించి, ఉత్కలదేశములోని కటకపురమువఱకును బోయి కటకపురమును గాల్పఁగా, కళింగదేశాధిపతియై యోఢ్రదేశమును బాలించుచుండిన ప్రతాపరుద్రదేవుఁడు తనకుమార్తెయైన తిరుమలదేవిని రాజున కిచ్చి వివాహముచేసి సంధి చేసికొనెను. అందుచేతఁ గృష్ణదేవరాయలు రాజమహేంద్రవరమువఱకును గల కళింగదేశమును మరలఁ బ్రతాపరుద్రదేవుని కిచ్చివేసి, ౧౫౧౬ వ సంవత్సరాంతమున కాంచీపురము ప్రవేశించెను. ఈతని ప్రథమభార్యయైన చిన్నాదేవికి అన్నపూర్ణాదేవియనియు నామాంతరముగలదు. ఈతనికిఁ దిరుమలదేవియు నన్నపూర్ణాదేవియు నిద్దఱుభార్యలగుటను గృష్ణదేవరాయలు తాను విష్ణుచిత్తీయమునం దిట్లు తెలిపియున్నాఁడు.—

క. ఆవిభు ననంతరంబ ధ
రావలయముఁ జూని తీవు రహిమైఁ దిరుమ
ల్దేవియును నన్నపూర్ణా
దేవియుఁ గమలాబ్జముఖులు దేవేరులుగన్.

ఈతఁడు పూర్వదిగ్విజయయాత్రలో సింహాచలమును దర్శించినప్పుడు భార్యాసహితముగాఁ జేసిన దానమునుగూర్చి సింహాచలదేవాలయములో నేడవస్తంభముమీఁదఁ జెక్కించిన యీ క్రిందియంశమును విశాఖపట్టణమండలచరిత్రమునుండి తీసికొనుచున్నాను.——

"శుభమస్తు శ్రీమత్ మహారాజాధిరాజ పరమేశ్వర మూరు రాయరగండ ఆదిరాయ విజయభాషాగీత ప్రవర రాయరగండ యవన రాజ్యసంస్థాపనాచార్య శ్రీవీరప్రతాపకృష్ణదేవమహారాజులువిజయనగరాన సింహాసనస్థుడై పూర్వదిగ్విజయయాత్రకు విచ్చేసి ఉదయగిరి, కొండవీడు, కొండపల్లి, రాజమహేంద్రవరము మొదలయిన దుర్గాలు సాధించి సింహాద్రికి విచ్చేసి స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వర్షంబులు ౧౪౩౮ అగు నేటి ధాత సం॥ చైత్ర బ ౧౨ స్థిరవారాన సింహాద్రినాథు దర్శించి తమతల్లి నాగాదేవమ్మగారికిన్ని తమతండ్రి నరసరాయునిగారికిన్ని పుణ్యముగాను దేవునికి సమర్పించిన కంఠమాల ౧-కి ముత్యాలు ౯౯౧ వజ్రమాణిక్యాల కడియాలజోడు ౧-టి శంఖచక్రాల పతకం ౧-న్ని పయిడిపళ్ళెం ౧-న్ని తూకాలు గ ౪౪౨౯౨ కానిమాడలు గ ౨౦౦౦ తమదేవి చిన్నాదేవమ్మగారిచేతను సమర్పించిన పతకం ౧-కి గ ౫౦౦ తిరుమలదేవమ్మగారిచేతను సమర్పించిన పతకం ౧-కి గ ౬౦౦ యింత మట్టుకు సమర్పించిన ధర్మశాసనము."

కృష్ణరాయలవిజయములనుగూర్చి పారిజాతాపహరణమునందును, మను చరిత్రమునందును జెప్పఁబడిన కొన్ని పద్యముల నిం దుదహరించుచున్నాను.—

చ. మునుకొని కొండవీటికడ మూఢత రుద్రుఁడు కృష్ణనందను
న్మనసిజునిన్ జయించె నది మానుషమే నరసేంద్రు కృష్ణరా
యన్నృపతి కొండవీటికడ సాహసభూమిఁ బ్రతాపరుద్రనం
దనుఁ డగువీరభద్రుఁ గిరుణాహుతిఁ గాచె జగత్ప్రసిద్ధిగన్.

చ. నెలకొని కృష్ణరాయధరణీవిభుఁ డుత్కలభూమిపాలుతోఁ
గలన నెదిర్చి హస్తికరకాండతతుల్మసకంపుఁబాములై
మలసినచోటఁ గూడిన సమగ్రయశోవసనంబు గప్పి తా
వలవఁగఁ జేసె భూసతిని వశ్యవిధిజ్ఞుఁడుగాన నేర్పునన్.

సీ. ఉదయాద్రి వేగనత్యుద్ధతి సాధించెవినుకొండ మాటమాత్రన హరించెఁ
గూటము ల్సెదరంగఁగొండవీడుగలంచె బెల్లముకొండ యచ్చెల్ల జెఱిచె
వేలుపుకొండ నుద్వృత్తి భంగము సేసి జల్లిపల్లె సమగ్రశక్తిఁ గూల్చె
గినుకమీఱ ననంతగిరి క్రిందుపడఁజేసె గంబంబుమెట్టు గ్రక్కునఁగదల్చె
బలని కాయము కాలుముట్టల నడంచుఁ
గటకమును నింక ననుచు నుత్కలమహీశుఁ
డనుదినమ్మును వెఱచు నెవ్వనికి నతఁడు
రాజమాత్రుండె శ్రీకృష్ణరాయవిభుఁడు :— పారిజాతాపహరణము.

సీ. తొలుదొల్త నుదయాద్రిశిలఁ దాఁకి తీండ్రించు నసిలోహమున వెచ్చనయిజనించె
మఱికొండవీ డెక్కి మాఱ్కొని నలిదైనయలకసవాపాత్రు నంటఁ రాఁజె
నటసాగి జమ్మిలోయఁబడి వేగదహించెఁ గోనబిట్టేర్చెఁగొట్టానఁదగిలెఁ
గనకగిరిస్ఫూర్తిఁ గరఁచె గౌతమిఁ గ్రాఁచె నవులనాపొట్నూరు రవులుకొనియె
మాడెములు వ్రేల్చె నొడ్డాది మసియొనర్చెఁ
గటకపురిఁ గాల్చె గజరాజు గలఁగిపఱవఁ
దోఁకచిచ్చన నార యుద్ధురతఁ గృష్ణ
రాయబాహుప్రతాపజాగ్రన్మహాగ్ని.

చ. అభిరతిఁ గృష్ణరాయఁడు జయాంకములన్ లిఖియించి తాళస
న్నిభముగఁ బొట్టుమూరికడ నిల్పినకంబము సింహభూధర
ప్రభు తిరునాళ్ళకుం దిగుసురప్రకంబు కళింగమేదినీ
విభు నపకీర్తికజ్జలము వేమఱుఁబెట్టిపఠించు నిచ్చలున్ :- మనుచరిత్రము.

పూర్వదిగ్విజయయాత్ర చేసి వచ్చినతరువాత మూడుసంవత్సరములవఱకును కృష్ణదేవరాయలు యుద్ధము లేమియుఁ జేసినట్టు కానఁబడదు. అతఁ డాకాలమునందంతటను విద్యావ్యాసంగమునందు ప్రొద్దు

పుచ్చుచుండెను. అల్లసానిపెద్దన తనస్వారోచిషమను చరిత్రమును, నంది తిమ్మన తనపారిజాతాపహరణమును, ౧౫౧౬ వ సంవత్సరమునకు తరువాతను ౧౫౨౦వ సంవత్సరమునకు లోపలను కృష్ణదేవరాయనికంకితము చేసిరి. ౧౫౧౯ వ సంవత్సరాంతమునందు బీజపురమహామ్మదీయులతో యుద్ధము చేసి, ౧౫౨౦ వ సంవత్సరమునందు సుల్తానయినయేడిల్ ఖానుని జయించెను. ఈయుద్ధవార్త పూర్వోక్తములైన రెండుగ్రంథములయందు నుదహరింపఁబడకపోవుటచేత నవి యీ యుద్ధమునకుఁ బూర్వమునందే రచియింపఁబడినట్లు నిశ్చయింపవలసియున్నది. అయినను గృష్ణదేవరాయలే తన యాముక్తమాల్యదయం దీయుద్ధవృత్తాంతము నీ క్రింది పద్యముచేఁ జెప్పియున్నాఁడు :—

మ. అలుక స్ఫోటకధట్టికాఖురపుటీహల్య స్థురాసానిపు
చ్చలుపోఁ దున్ని చలచ్చమూగజమదాసారప్లుతిన్ గీర్తిపు
ష్కలసస్యం బిడి యేకధాటి బళిరా కట్టించితౌ దృప్తి కే
దులఖానోగ్రకపాల మర్థపహరిద్భూజాంగలశ్రేణికన్.

పయిపద్యమునుబట్టి యాముక్తమాల్యద ౧౫౨౦ వ సంవత్సరమునకుఁ దరువాత రచియింపఁబడిన ట్లేర్పడుచున్నది. ఓరుగల్లు, గోలకొండ మొదలయిన సంస్థానములనుగూడ జయించి యితఁడు తనరాజ్యమును దక్షిణహిందూస్థానమునం దంతటను వ్యాపింపఁజేసెను. ఈదక్షిణదేశమును పాలించినరాజులలో నింతగొప్పరాజ్యమేలినరాజు మఱియెవ్వఁడును లేఁడు. ఒడ్డెరాజు లయిన గజపతులను, తురుష్కరాజు లయిన యశ్వపతులను, తెలుఁగురాజు లయిననరపతులను, జయించుటచేత నీతనికి మూరురాయరగండఁడని బిరుదు కలిగినది. ఇటువంటి బిరుదములనేకము లీయనకుఁ గలవుగాని యవి యన్నియు నిందు వివరించుట యనావశ్యకము. ఈతఁడు శ్రీరంగపట్టణము, మధుర, తిరుచనాపల్లి, మళయాళము మొదలయిన దేశములను పాలించుటకు తెలుఁగునాయకు

లను పాలకులనుగా నేర్పఱిచెను. ఈతఁడే తుంగభద్రానదికి విజయనగర మువద్ద వంతెన కట్టెను. ఈతనికి తిమ్మరుసు మంత్రిగా నుండెనుగాని యతఁడు రాజునకంటె మూఁడు సంవత్సరములు ముందుగా మృతి నొందెను.

ఈకృష్ణదేవరాయలది తుళువవంశము. ఇంటిపేరు సాళువవారు; పూర్వులావఱకు వసియించిన గ్రామనామములనుబట్టి సంపెటవా రనియు, సెలగోలవా రనియు కూడ గృహనామము గలదు. ఈకడపటి రెండుపేరులును కరణములు వ్రాసియుంచిన కొండవీటికవిలె చరిత్ర మునం దుదాహరింపఁబడి యున్నవి. ఇంతవఱకును రాజుయొక్క విజ యములనుగూర్చి సంక్షేపముగా వ్రాసియున్నాను. ఇఁక నీతని పాండిత్య ప్రభావాదులనుగూర్చి కొంత వ్రాయవలసి యున్నది. పూర్వకాలము నందు భోజరాజు సంస్కృతభాష నాదరించినట్లే యితఁ డాంధ్రభాష నాదరించి కవులను సమ్మానించి గ్రంథరచన చేయించుటచేత నీతని కాంధ్రభోజుఁడని బిరుదనామము గలిగినది. ఇతఁడు కవుల నాదరించి కావ్యములు చేయించుటయేకాక తానుగూడ విద్వాంసుఁడై సంస్కృ తాంధ్రములయందు గ్రంథములను రచియించుటకు సమర్థుఁ డయియుం డెను. ఈతఁడు సంస్కృతమునందుఁ బెక్కుగ్రంథములు రచించినట్టు విష్ణుచిత్తీయమునందలి యీపద్యమునందుఁ జెప్పఁబడియున్నది.—

సీ. పలికి తుత్ప్రేక్షోపమల జాతిపెం పెక్క రసికులౌనన మదాలసచరిత్ర
భావధ్వనివ్యంగ్యసేవధిగాఁగఁ జెప్పితివి సత్యావధూప్రీణనంబు
శ్రుతిపురాణోపసంహిత లేర్చి కూర్చితి సకలకథాసారసంగ్రహంబు
శ్రోత్రఘుచ్ఛటలు విచ్చుగరచించితిసూక్తినై పుణిజ్ఞానచింతామణికృతి
మఱియు రసమంజరీముఖ్యమధురకావ్య
రచనమెప్పించుకొంటి గీర్వాణభాష

నంధ్రభాష యసాధ్యంబె యందు నొక్క
కృతి వినిర్మింపు మీక మాకుఁ బ్రియముగాఁగ.

అయినను కృష్ణదేవరాయలు రచియించిన యీసంస్కృత గ్రంథము లేవియు నిప్పుడు గానరాకున్నవి. సంస్కృతముమాట యెటు న్నను కవులను బ్రోత్సాహపఱిచి కావ్యములను చేయించియు తాను జేసియు తెలుఁగుభాష కీయన మహోపకారము చేసి యున్నాఁడు. ప్రబంధరచనము క్రొత్తగా నీ కృష్ణదేవరాయల కాలమునందే యారంభ మైనది. అంతకుఁ బూర్వమునందున్న కవులు సంస్కృతమునుంచి యితి హాసములను బురాణములను మాత్రము తెనిఁగించుచు వచ్చిరి. వారిలోఁ గేతన యనుకవి యాజ్ఞవల్క్యధర్మశాస్త్రమును, దండివిరచితమైన దశకు మారచరిత్రమును, శ్రీనాథుఁడనుకవి శ్రీహర్షవిరచితమైన నైషధకావ్య మును పద్యకావ్యములనుగాఁ దెలిఁగించిరి. బాణవిరచితమైన కాదంబరి యాంధ్రీకరింపఁబడినట్టు కానఁబడుచున్నదిగాని కొన్ని లక్షణగ్రంథముల యందుదాహరింపఁబడిన పద్యములుతక్క గ్రంథ మెక్కడను పూర్ణముగా దొరకకున్నది.

ఏది యెట్లున్నను గృష్ణదేవరాయలకుఁ బూర్వకాలమునందలికవులు రచించిన యాంధ్రగ్రంథములన్నియు సంస్కృతమునుండి చేసిన భాషాం తరములేకాని స్వబుద్ధికల్పితముగా రచించిన నూతనగ్రంథమం దొక్క టియుఁ గానరాదు. తెలుఁగునందు నూతనముగా ప్రబంధరచనచేసి తరు వాతివారికి దారిచూపినవాఁడు కృష్ణదేవరాయని యాస్థానకవియైన యల్లసాని పెద్దనామాత్యుఁడు. అతఁడు రచియించిన మొదటిప్రబంధము స్వారోచిషమనుసంభవమను మనుచరిత్రము. ఈ గ్రంథమునందలి కథ మార్కండేయ పురాణమునుండి గ్రహింపఁబడినది. మొట్టమొదట నీమనుచరిత్రమును ప్రబంధరూపమున రచింపఁబట్టియే పెద్దనార్యున కాంధ్రకవితాపితామహుఁ డను బిరుదనామము కలిగినది.

కృష్ణదేవరాయలకు సంస్కృతాంధ్రములయం దసాధారణపాండిత్యము గలిగియుండుట నాతఁడు రచియించిన యాముక్తమాల్యదయే సహస్రముఖముల ఘోషించుచున్నది. ఆముక్తమాల్యద కృష్ణరాయకృతిము కాదనియు దానిని తదాస్థానకవియైన పెద్దనార్యుఁడు రచించి పుస్తకమునఁ దనప్రభువునకుఁ గర్తృత్వమును నారోపించెననియు వాడుక కలదుగాని యదియంతగా విశ్వసనీయముగాదు. కృష్ణదేవరాయ లల్లసాని పెద్దనను, రామరాజభూషణుని, ప్రబంధములను రచించి తెమ్మని యాజ్ఞాపించెననియు, తదాజ్ఞానుసారముగా వారిరువురును గ్రంధరచనచేసి తమప్రబంధములను దీసికొనిరాఁగాఁ జూచి రాజు వసుచరిత్రమునకంటె మనుచరిత్రము లేఁతపాకమునఁ బడినదని యభిప్రాయము తెలిపెననియు, అందుమీఁద పెద్దన "యాముక్త మాల్యద" యనుపేర విష్ణుచిత్తుని చరిత్రమును రచియించి తీసికొనిరాఁగా విష్ణుచిత్తీయము ముదురుపాకముగా నున్నదనియె ననియు, చెప్పుదురుగాని యిదియంతయు నిటీవలివారి స్వకపోలకల్పితము. వసుచరిత్రమును రచియించిన రాజరాజభూషణుఁడు కృష్ణదేవరాయని కాలమునం దుండెనో లేఁడో యని సందేహింపవలసి యున్నది. ఉండినపక్షమున నతఁ డాకాలమునఁ జిన్నవయసువాఁడయి యుండవచ్చును. ఆముక్తమాల్యదయు మనుచరిత్రమును రచియింపఁబడినతరువాత నేఁబదియేండ్లకుఁగాని రామరాజభూషణుఁడు వసుచరిత్రమును రచియింపలేదు. కాఁబట్టి పయికథ యెంతమాత్రమును నమ్మఁదగినదికాదు. ఆముక్తమాల్యదకును, మనుచరిత్రమునకును శైలియందు విశేషభేద ముండుటచేతను, ఆముక్తమాల్యద వ్యాకరణదోషయుక్తమయినదిగా నుండుటచేతను, ఆరెండుపుస్తకములు నేకకవిచే రచియింపఁబడినవి కావని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. పెద్దనకవిత్వములో లేనియికారసంధులును, తత్సమశబ్దములం దకారసంధులును, క్త్వార్థకసంధులును, ఆముక్తమాల్యదయందుఁ గానఁబడుచున్నవి అందుఁ

గొన్నిటి నిందు క్రిందఁ జూపుచున్నాను :—

ఇ కా ర సం ధు లు.

౧-గీ. నిం గిటు త్రిశంకుకతన మాతంగవాటి
యయ్యె నిఁక నుండఁదగదని యవనికరిగి
నట్టి నక్షత్రతారాగ్రహాళియనఁగఁ
గాంతనవరత్నరాసు లంగళ్ళఁ బొలుచు. ఆ ౨.

ఇందు మొదటిపాదమునందు "నింగి + ఇటు = నింగిటు" అని ప్రయోగింపఁబడినది.

౨-చ. హాతల నొనర్చె మోహితల నల్ల యయోముఖి నాపుల స్వభూ
సుతను విరూపలొట నసుచో ముసలిక్ బెదనిట్టతాడువం
టతివ రమించెఁ దా ముసలి యయ్యు రహస్యములుగుజ్జ్రేష్యకై
ధృతిచెడి యుగ్రసేనునకుఁ బ్రేష్యత నొందియు దిద్ది యేలఁడే. ఆ-౫

ఇందు మూడవపాదమునందు "నిట్టతాడువంటి + అతివ = నిట్టతాడువంటతివ" అని ప్రయోగింపఁబడినది.

తత్సమములం దకారసంధులు.

౧-చ. అడుగుననుండియుం బదిలమై చద లంటెడుకోటనొప్పు ప్రో
ల్చెడనికడంక దంచెనపుచేతులఁ గం గనుకాసె దూఱఁగా
నడుమనె యున్కిఁజేసి యల నాకపురి న్సరికై పెనంగి లా
వెడలఁగఁ బట్టివేయుటకు నెత్తె ననం జను మల్లుపోరునక్. ఆ-౨

ఇచ్చట రెండవచరణమున "గంగ + అను = గంగను" అని ప్రయోగింపఁబడినది.

౨-చ. తడితల డిగ్గిముంప జడతం దుదటెప్పలఁ గన్నువిప్పి పు
లొప్పడుచుచు నీరు వ[illegible]ంగరలపోలిక ముక్కులఁగూడ నోటఁ గొం
తొడియుచు గూఁటికత్తి సగ మొత్తుచు తెక్కవిదిర్చు మున్నుగా
వడఁకుచుకాక చేష్టుడిగెవక్షము పక్షులుజానపుల్ చొరన్. ఆ-౮

ఇచట నాలవచరణమందు "చేష్ట + ఉడిగె = చేష్టుడిగె" అని ప్రయోగింపఁబడినది.

3-శా. అబ్రహ్మణ్యము లోనవై చుకొనె నన్యాయంబున న్మాతృనతం
దాబ్రహ్మాదులమేర నిల్పియుఁ బ్రభుత్వం బూఁదియుం ద్రోఁతురే
యీబ్రక్కన్ద్విజుఁ జూడరయ్య సభవారీరంగభర్త్రంచు దుః
ఖాబ్రాళింబడి బాష్పకంఠుఁడు సముద్యద్గోషలాలుండునై. ఆ-౬

ఇచట మూడవచరణమున "రంగభర్త + అంచు = రంగభర్త్రంచు" అని ప్రయోగింపఁబడినది.

౧సీ. కొంగవాల్మఋకులంగుభులఁబట్టుకజబ్బలంటఁగుట్టిడవెజ్జునరయువారు
తలఁబడ్డ గుదియదెబ్బలఁబాఁతమసియిడియంబలిగంజిండ్లనడుగువారు
తమనేగఁజెప్ప లో దయమీఱ వినిచీరఁజిం చిచ్చువారి దీవించువారు
నోలఁబడ్డ నెపమునఁ గలలేసిసిరిఁజెప్పి చుట్టలపై దాడి వెట్టువారు
నైనపాంథులచేతఁ గ్రందైనయూళ్ల
జాడగా నిటఁ దెచ్చి యిస్నీడడించి
వారు నీ రానఁబోవనో వ్వారిమగిడి
వచ్చునాలోన నీరూపువచ్చెనాకు. ఆ-౬

ఇచ్చట మూడవపాదమునందు "చించి + ఇచ్చు = చించిచ్చు" అని ప్రయోగింపఁబడినది. మఱియు నీపద్యమునందే మొదటిచరణమున "పట్టుకొని" యనుటకు "పట్టుక" యనియు, రెండవచరణమందు "గంజి + ఇండ్లు = గంజిండ్లు" నసియు వ్యాకరణాదుష్టములయిన ప్రయోగము లున్నవి. ఈవిధముగానే,

శా. ఎట్టూ యిట్టగునయ్యపల్కు- దయలే కీన్నాళ్లు నీకూడె యీ
పొట్టంబెట్టి మహాఘలబ్ధిఁ దనువుం బోషించి యెన్నాళ్లకే
నెట్టే నొక్కతపస్వి యొక్కవ్రతిరాఁడే చూఁడఁడే తత్కృపన్
బుట్టు న్నీగెద దీని నా నొదవి యోపుణ్యాత్మ యెట్లంటివే —ఆ ౬.

"పుట్టునీగెద" (పుట్టుక్ + ఈగెద) మొదలయిన వ్యాకరణ విరుద్ధము లైన ప్రయోగములు మఱి కొన్నియందుఁ గానవచ్చు చున్నవి. కాఁబట్టి యీ యాముక్తమాల్యద సర్వలక్షణవేత్త యయిన యల్లసాని పెద్దన విరచితము కాదనుట స్పష్టము. అంతేకాక యీపుస్తకము పెద్దనకవనమువలె మృదువైనదియు, నల్లికగలదియుఁగాక కటుపద భూయిష్ఠముగా నున్నందునను పెద్దనార్యకృతము కాదని నిశ్చయింప వలసి యున్నది. అయినను కృత్యాద్యవస్థయందు వంశావళిలో పెద్దన ప్రణీత మయిన మనుచరిత్రములోని పద్యములే యిందుఁ గానఁబడు చున్నందున రెంటికిని గృతికర్త లొక్కరేయని యూహింపవలసి యుండు నని కొందఱందురుగాని యాయూహ సరియైనది కాదు. వంశావళిలో కృష్ణదేవరాయని జయములును గుణవర్ణనలు మాత్రమే యధికముగా నున్నందున, ఆత్మస్తుతిని దన పద్యములతోఁ జేసికొనుట కిష్టములేనివాడయి కృష్ణదేవరాయలు ప్రథమపురుషములను మధ్యమపురుషములనుగా మార్చి వేంకటేశ్వరుఁడు తన్నుఁగూర్చి పలికినట్లుగా మనుచరిత్రములోని పద్యములనే తన యాముక్తమాల్యదయందు వేసికొనియుండును. అయినను విష్ణుచిత్తీయమునందు ముఖ్యముగా నయిదవ యాఱవ యాశ్వాసములయందు పెద్దనపద్యములవంటి "యల్లిక జిగిబిగి" గల పద్యములును పెక్కులు కానఁబడుచున్నందునఁ గృష్ణదేవరాయలు తన యాస్థానకవీశ్వరులైనవారి సాహాయ్యమును స్వగ్రంథరచనమునందుఁ బొందియుండును. ఒక్కసాహాయ్యమే యననేల? ఆ యిరువురుకవులును ముఖ్యముగా నాంధ్రకవితాపితామహుఁ డని పేరొందిన యల్లసాని పెద్దనయు రచించిన పద్యములే పెక్కులాముక్తమాల్యదయం దున్నట్లు కానఁబడుచున్నవి. అంతమాత్రముచేత గ్రంథకర్తృత్వమును వారి కారోపించుట వలనుపడదు. గ్రంథమును రాజేచేయఁగా తదాస్థానకవులు కొన్నిపద్యములను మార్చియు, కొన్నిపద్యములను తమవిచేర్చియు నుందురు. కృతి

కర్త కృష్ణదేవరాయలనుట కాశ్వాసాంతమునందును కృత్యాదియందును జెప్పఁబడుటమాత్రమే కాక "పలికితు ప్రేక్షాపమల" నిత్యాది పద్యములో నుదాహరింపఁబడిన తద్రచిత గ్రంథనామములును తత్కర్తృత్వమును స్థాపించుచున్నవి.

ఈ కృష్ణరాయలు కవిత్వమునందు సమర్థుఁడని యాతనికాలమునం దాముక్తమాల్యదను రచించుటకుముందే యాతని యాస్థానకవులు చెప్పియుండుటకూడ విష్ణుచిత్తీయము కృష్ణరాయకృత మగుటను స్థిరీకరించుచున్నది. ఈరాజు కవిత్వమునందు నిపుణుఁడనుటను సూచించుచు రాజునుగూర్చి "కవితాప్రావీణ్యఫణీశ" యను విశేషణము నుపయోగించిన పారిజాతాపహరణములోని నంది తిమ్మనార్యుని పద్యము నొకదాని నిందు క్రిందఁ బొందుపఱుచుచున్నాను:—

క. శ్రీ వేంకటగిరివల్లభ
సేవాపరతంత్రహృదయ చిన్నమదేవీ
జీవితనాయక కవితా
ప్రావీణ్యఫణీశ కృష్ణరాయమహీశా. ఆ ౪.

అక్కడక్కడ వ్యాకరణ స్ఖాలిత్యము లున్నను కటువుగానున్నను మొత్తముమీఁద విష్ణుచిత్తీయముయొక్క కవిత్వము మిక్కిలి ప్రౌఢము గాను, అర్థగాంభీర్యము కలదిగాను, అలంకార బహుళమయి స్వభావ వర్ణనలు కలదిగాను ఉన్నది. అందుచేతనే రేఫ శకటరేఫములనిమిత్తమయి పెనఁగులాడిన యప్పకవివంటివాఁడు సహితము యతిప్రాసముల యందు ద్విరేఫమైత్రి నంగీకరించిన యీ కవిగ్రంథమును గుణబాహుళ్యమును బట్టి లాక్షణికమైనదానినిగా నంగీకరించి తన లక్షణగ్రంథమునం దాముక్తమాల్యదనుండి పద్యములను లక్ష్యములనుగాఁ దీసికొని యున్నాఁడు.

తాను బూర్వము దిగ్విజయయాత్రకు వెడలి బెజవాడయందుఁ గొన్నిదినములుండి కృష్ణామండలములోని శ్రీకాకుళమునందలి యాంధ్ర విష్ణుదేవుని సేవింపఁబోయిన హరివాసరమునాఁటి యాదేవుఁడు స్వప్నములోఁ దోఁచి వేంకటేశ్వరుని కంకితముగాఁ దెనుఁగుగ్రంథమును జేయుమనఁగా విష్ణుచిత్తీయమును రచియించినట్లు కవి తద్గ్రంథమునం దీక్రింది వచనములతోఁ జెప్పియున్నాఁడు.

"...కళింగదేశవిజిగీషామనీషం దండెత్తిపోయి విజయవాటిం గొన్నివాసరంబులుండి శ్రీకాకుళ నికేతునుండగు నాంధ్రమధుమథను సేవింపంబోయి హరివాసరోపవాసం బచ్చటఁ గావింప నప్పుణ్యరాత్రి చతుర్థయామంబున.

* * * * *

సీ. తెలుఁగదేలయన్న దేశంబు తెలుఁగేను
దెలుఁగువల్లభుండఁ దెలుఁగొకండ
యెల్లనృపులుఁ గొలువ నెఱుఁగవే బాసాడి
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స.

క. అంకితమో యన నీ కల
వేంకటపతి యిష్టమైనవే ల్పగుటఁ దదీ
యాంకితము చేయు మొకకృతి
సంకేతము కా కతఁడె రసజ్ఞుఁ గానే."

కళింగదేశ విజయయాత్ర కయి వెడలి విజయవాటి (బెజవాడ) కి వచ్చినది శాలివాహనశకము ౧౪౩౭ వ సంవత్సర మగుటచేత రాజీగ్రంథము నాసంవత్సరమునందుఁ జేయనుద్దేశించి ప్రారంభించియుండును. అయినను నుదహరించిన యుపోద్ఘాతములోని "అలుకన్ ఘోటక" ఇత్యాది పద్యమునందు వర్ణింపఁబడిన (౧౪౪౦ వ సంవత్సరమునందు జరిగిన) యేడిఖా

మని జయించినవర్ణన మిందుండుటనుబట్టి యీ గ్రంథము ౧౫౨౦ వ సంవత్సరమువఱకును ముగింపఁబడలేదు. ఈ పుస్తకమునందలి పద్యములు మొత్తముమీఁద శ్రుతికటువులుగా నున్నను, పెక్కు పద్యములర్థగాంభీర్యము కలవిగా నుండుటయే కాక మృదుమధురపదగుంభితములై కూడ నున్నవి. కవియొక్క ప్రౌఢిమయు కవననైపుణ్యమును తెలియుటకయి కొన్ని పద్యముల నిందుదాహరించుచున్నాను :—

మ. శయపూజాంబుజము ల్ఘటిం దడఁబడం జన్దోయి లేఁగౌనుపై
దయఁదప్ప న్బసుపాడి పాగడపుఁబాదం బొప్పఁ జెంగల్వాడి
గ్గియనీ రచ్యుతమజ్జనార్థము కటిం గీలించి దివ్యప్రబం
ధయుగాస్య ల్ద్రవిడాంగన ల్నడుతు రుద్యానంబులోఁ త్రోవలన్. ఆ-౧

చ. బలసిన హల్లకచ్ఛటలపైఁ దమజుంజురుముంగ్లు రాయఁగాఁ
గలమములుండుఁ బండియొఱుగంబడి నీ రెడలింపఁ దృష్ణ లోఁ
దలకొన వంగి మున్ జలముఁద్రావెడు క్రిందటివేళ్ళు మీఁదట
న్నిలిపి మరందమానుకరణి న్నికటోపవనానిలాహతిన్. ఆ-౧

మ. తరుణు ల్లల్లియొఱ న్గుచంబు లునుపం దచ్ఛైత్యము ల్దీములై
పెరరేపం జనుదెంచెఁగాక రవిదీప్తిం గ్రుంకి పాతాళగ
హ్వరముం దూఱినవాని నీయదుకుత్రాళ్ళా తెచ్చునా దీర్ఘత
చ్ఛిరకృష్టిం గనునట్టి శైత్య మలరించె న్నూతులం దత్తఱిన్. ఆ-౨

మ. గృహసమ్మార్జనమో జలాహరణమో శృంగారపల్యంకికా
వహనంబో వనమాలికాకరణమో వాల్లభ్యలభ్యధ్వజ
గ్రహణంబో వ్యజనాతపత్రధృతియో ప్రాగీపికారోపమో
నృహరీ వాదము లేల లేరె యితరు [illegible]

ఉ. నావుడు వార లమ్మనుజనాథున కిట్లని రుబ్బి [illegible]డుగా
దైవము గల్గె వేగ గురుదక్షిణగాఁ [illegible]

ర్వీవలయం బశేషమును వేడుము భూవర మమ్ము నందఱం
బ్రోవుము బాంధవాప్తజనపోషణకంబెను ధర్మ మున్నదే. ఆ-3

ఉ. హెచ్చిన మైత్రిఁ బద్మినుల కెల్ల ఘనాత్యయకారకుండు సా
మ్మచ్చుపడంగఁ జేయుటకునై యల క్రౌంచనగంబు పేరిక
మ్మ్మచ్చున నీడ్చు శర్వగిరియందలి వెండిశలాకపిండు నా
వచ్చి మరాళమాలికలు వ్రాలెఁ గొలంకులఁ జక్రఝంకృతిన్. ఆ-౪

సీ. వాతెఱ తొంటికై వడి మాట లాడదు
కుటిలవృత్తి వహించెఁ గుంతలంబు
లక్షులు సిరులురా నరచూడ్కిఁ గనుఁగొనె
నాడించె బొమగొని యాననంబు
సనుగొమ లెన్నగయ వక్ష ముపేక్షఁ గడకొత్తెఁ
బాణిపాదము లెఱ్ఱవాఱఁదొడఁగె
సారెకు మధ్యంబు దారిద్ర్యములె చెప్పె
జొచ్చోర్వ కిటు లోఁగఁజొచ్చె మేను
వట్టిగాంభీర్య మొక్కఁడు వెట్టుకొనియె
నాభి నానాఁటి కీగతి నాఁటిపొందు
చవుకయైనట్టి యిచ్చటఁ జనదు నిలువ
ననుచు జాఱెనకరణి బాల్యంబు జాఱె. ఆ. ౫

శా. సైరంధ్రుల్ వయి కెత్తి కజ్జలముఁ బక్ష్మశ్రేణికం దీర్ప వా
లారుంగన్నుల మీఁదుఁ జూచుతఱి ఘాచాంచచ్చతుర్థీనిశా
స్ఫారేందుం గనె వక్త్రి మక్కనుటఁగా పర్వేందుఁ డాత్మప్రభా
చోరుండుండఁగఁదన్నుఁదద్గతవిభాచోరంబనుఁగా లోకముల్ : ఆ. ౫.

చ. వినుమొకమాట రాత్రిచర వేగిర మెటక నిన్నయింతురే
యనిమిషులైన భాజనగతాన్నము నేనిఁక నెందుఁబోయెద

స్వైనఁగక ప్రాణరక్షణ ముపేక్షయొనర్చుట పాప మిందు కై
కనలకు నాకు మేనియెడఁ గాంక్షయు లేదిది వోపుఁజేయుర౯:-ఆ. ౬.

ఉ. బాసలు బండికంట్లు మఱి ప్రాణభయంబున లక్షచేసినం
గ్రాసము కృచ్ఛ్రలబ్ధ ముడుగ న్వశమే యిది నీకచెల్లె నో
భూసురవంశ్య పుణ్యజన పుణ్యజనాంకము తావకీనమే
పో పముకూరెడిం గులముపొత్తున దైత్యుల కెల్ల నంకత౯:-ఆ. ౬.

ఆముక్తమాల్యదనుబట్టియే కృష్ణదేవరాయలు విష్ణుభక్తుఁడనియు వైష్ణవ శిష్యుఁడనియు వేఱుగఁ జెప్ప నక్కఱలేకయే తెలిసికొనవచ్చును. అతఁడు విష్ణుభక్తుఁడైనను వైష్ణవశిష్యాగ్రేసరుఁ డైనను, ఇతరదేవతల యందుఁగాని యితరమతములవారియందుఁ గాని వైషమ్యము లేనివాఁడయి యుండెను. ఈ రాయలవారు విష్ణుదేవాలయములకు మాత్రమేకాక శివాలయములు మొదలైన వానికిఁగూడ భూదానములు చేసియున్నాడు. వైష్ణవమతాభిమానులను మాత్రమేకాక యితరమతావలంబులైన విద్వాంసులనుగూడ నాదరించియున్నాఁడు. ఆతని యాస్థానములో నల్లసానిపెద్దన మొదలైన వైష్ణవమత పక్షపాతులైన కవులుమాత్రమేకాక, స్మార్తుఁడై శివభక్తుఁడైన నందితిమ్మనార్యుఁడును, కేవల శైవులైన ధూర్జటియు, మాదనగారి మల్లన్నయు మొదలైన కవులునుకూడ సమ్మానము నొందియున్నారు. అష్టదిగ్గజములని పేరొందిన యెనమండ్రు తెలుఁగుకవు లీరాజుయొక్క యాస్థానమునందుండి ప్రసిద్ధినొందిరని చెప్పుదురు. అల్లసానిపెద్దన్న, నందితిమ్మన్న, అయ్యలరాజు రామభద్రుఁడు, ధూర్జటి, మాదయ్యగారిమల్లన్న, పింగళిసూరన్న, రామరాజభూషణుఁడు, తెనాలిరామకృష్ణుఁడు, అనెడి యెనమండ్రును అష్టదిగ్గజము లని వాడుకగలదు. కాని యిందుఁ జెప్పఁబడినవారిలోఁ గడపటి ముగ్గురును గృష్ణదేవరాయని కాలమునందున్నారో లేరో యని సందేహింపవలసి

యున్నది. మొదటి యైదుగురునుమాత్ర మాకాలమునం దున్నట్లు కొన్ని గ్రంథనిదర్శనములు కనఁబడుచున్నవి. వారిలో నల్లసాని పెద్దనార్యుఁడు తాను రచియించిన మనుచరిత్రమును, నందితిమ్మన్న తాను రచియించిన పారిజాతాపహరణమును, కృష్ణదేవరాయని కంకితములు చేసిరి. అయ్యల రాజు రామభద్రుఁడు కృష్ణదేవరాయుల కాలమునందు మిక్కిలి చిన్న వాఁడై క్రొత్తఁగాఁ గవిత్వముచెప్పుట కారంభించినవాఁడు. ఇతఁడు కృష్ణరాయలు జీవించియుండఁగాఁ నాతని యాజ్ఞాప్రకారముగా సకల కథాసారసంగ్రహము నారంభించి తరువాత ముగించెనుగాని యది రామాభ్యుదయమువలె నంత ప్రౌఢముగా నుండక వ్యాకరణదోషములు కలదిగా నున్నది. రామభద్రకవి తన్నుఁ గృష్ణరాయలు కోరుటచేత సకలకథాసారసంగ్రహమును జేసితినని వ్రాసియున్న భాగము నా గ్రంథ మునుండి యిందుదాహరించుచున్నాను :—

సీ. చినుకుపూనల నొనర్చినబిత్తరపుదండ దండాలుగల వేల్పుతపసికొండ
కొండాటములను జక్కులుపన్ను జడదారి దారిగట్టులరాయు చీరుటలుగు
అలుగుడింతికి వెన్నుఁ డిలకుఁ దెచ్చినచెట్టు చెట్టుగట్టుఁగఁజేయు
చెలువతోడు
తోడుచేడెలనేలుదొరకునుదోఁబుట్టు పుట్టులిబ్బుల జేనిపొందుగాఁడు
గాడుపూరిని గాంచిన కన్నతల్లి । తల్లిబిడ్డలఁ బెండ్లాడు గొల్లమనికి
మనికితముదీర్పువిలుకాని:జెనకువిందు।విందుసీకీర్తినరసింహవిభునికృష్ణ

వ. ఇట్లు కీర్తివిస్తారధురంధరుండగు కృష్ణరాయ నరపాలాఖండలుండు నన్నుఁ బిలిచి శ్రీమచ్ఛీతారమణ చరణకమల పరిచరణాయమాన మానసుండవు బహువిధ కవితా చమత్కారధుర్యుండవు సకల పురాణేతిహాస ప్రబంధరచనాదక్షుండవు మన్మనోరథకార్య నిర్వా హకుండవు నగుటంజేసి పురాతనమహాకవి విరచిత ప్రబంధంబు లన్వే

మించి భగవద్భక్తినిష్ఠాగరిష్ఠులగు రాజశ్రేష్ఠుల వృత్తంబులు ప్రసిద్ధంబు లగునట్లుగాఁ బ్రశస్తకథలు విన్యస్తంబులుగా సమకూర్చి సాహిత్యలక్షణచిత్ర కవిత్వప్రభావంబు లొక్కొక్కచోటఁ గనంబడ రచియింపవలయునని ప్రార్థించి మఱియు నిట్లనియె.

చ. అఱవెతగుబ్బ దస్వలె బయల్పడనీకయు ఘూర్జనారంగనా
గుఱుకుచయుగ్మమున్వలె నిగూఢముగాకయు నాంధ్రదేశపుం
గరితచనుంగవన్వలె నొకానొకయించుక గానిపించినన్
సరసులు మెత్తు రక్కవిత జాణలకుం గడురంజకం బగున్.

వ. కావున నతిమధుర రసాయన ద్రాక్షాపాకంబుగా శృంగారరసయుక్తం బగునట్లు సకలకథాసార సంగ్రహంబు గ్రంథవిస్తారంబు కాకుండు నట్లుగా రచియింపుమని యుపన్యసించిన సంతోషామృతతరంగితాంతరంగుండ నగుచున్న సమయంబున."

రాజశేఖర చరిత్రమును రచియించిన మాదయగారిమల్లన్న కృష్ణదేవరాయల కాలములో నుండి యా రాజు గోలకొండ బిజాపురపు తురక సంస్థానములను జయించినప్పు డాతని కీర్తిని వర్ణించినట్లు కుమారధూర్జటి కృష్ణరాయవిజయమునం దీక్రింది పద్యములతోఁ జెప్పియున్నాఁడు :—

గీ. అటులు జయలక్ష్మిఁ గైకొని యరులకరుల
హరుల ధనపంక్తులను దనపరము చేసి
వెలయు శ్రీకృష్ణరాయుల విభవగరిమ
గాంచి కన్నులపండువుగాఁగ నపుడు.

గీ. సరససాహిత్యరచనవిస్ఫురణ మెఱయ
సారమధురోక్తి మాదయగారి మల్ల
నార్యుఁ డెలయల్లసాని పెద్దార్యవరుఁడు
ముక్కుతిమ్మన మొదలైన ముఖ్యకవులు.

క. వినిపించిరపుడు వారికిఁ
గనకాంబరభూషణములు ఘనత నొసఁగి యా
జనవరుఁ డప్పాజిఁ గనుం
గొని యిట్టని పలికె నపుడు కుతుకం బలరన్. ఆ.3

ఈకుమారధూర్జటికవియే కాళహస్తి మాహాత్మ్యమును రచియించి తనపెదతాత యైన ధూర్జటికవి కృష్ణదేవరాయలసభలోఁ బ్రసిద్ధి పొందినట్లు కృష్ణరాయవిజయములో నీక్రింది పద్యముచేతఁ జెప్పియున్నాఁడు—

చ. స్తుతమతి యైనయంధ్రకవి ధూర్జటిపల్కుల కేలగల్గెనో
యతులిత మాధురీమహిమ నా మును మీ పెదతాత చాల స
న్నుతిగనెఁ గృష్ణరాయలమనోజ్ఞసభ న్వినుమీవు నట్ల మ
త్కృతబహుమానవై ఖరులఁ గీర్తివహింపుము ధాత్రిలోవలన్- ఆ.1

[అష్టమహిషీకళ్యాణమును ద్విపదకావ్యముగా రచించిన తాళ్ళపాక చిన్నన్న యనుకవి కూడ కృష్ణదేవరాయని కాలములో నున్నట్లు కొండవీటిచరిత్రములో కృష్ణరాయల దానములనుగూర్చి చెప్పిన యీ క్రిందివాక్యమువలనఁ దెలియవచ్చుచున్నది:—

"వినుకొండసీమలో మిన్నికల్లు తాళ్ళపాక చిన్నయ్యగారి కగ్రహార మిచ్చెను."

"అద్దంకిసీమలో వలపర్ల అను గ్రామము తాళ్ళపాక చిన్నయ్యగారి కిచ్చెను."

వీరుగాక తక్కినకవులు కృష్ణదేవరాయల యాస్థానమునందుఁగాని యాతనికాలమునందుగాని యున్నట్లు తోఁచదు. రామరాజభూషణాదులు కృష్ణరాయల యాస్థానమునం దున్నట్లనేక కథలు కానఁబడుచున్నవి కాని యితరనిదర్శనములు లేక యవి విశ్వసింపఁదగినవి కావు.

ఆయా కవుల కాలమును గూర్చియు వారివారి విషయమయి చెప్పఁబడు కథలనుగూర్చియు నాయాకవుల చరిత్రములయందుఁ వ్రాయఁబడును. ఆముక్తమాల్యదయందును, మనుచరిత్రమునందును గల యేకరీతి పద్యములనుగూర్చి సహేతు మిచ్చుట విస్తరించి వ్రాయుట యనావశ్యకము. అయినను దృష్టాంతము చూపుటకయి యొక్క పద్యమునుమాత్ర మిం దుదాహరించుచున్నాను:—

సీ. నీలమేఘముడాలు డీలుసేయఁగఁజాలు
మెఱుఁగుఁజామనచాయ మేనితోడ
నరవిందములకచ్చు లడఁగించుజిగిహెచ్చు
నాయితంబగు కన్నుదోయితోడఁ
బులుఁగురాయనిచట్టుపలవన్నె నొరవట్టు
హొంబట్టుజిలుఁగు రెంటెంబుతోడ
నుదయార్కబింబంబు నొఱపువిడంబంబు
దొరలంగ నాడుకౌస్తుభముతోడ
జయజయధ్వని మౌళి నంజలులుచేర్చు
శర్వ శతధృతి శతమన్యు శమన శరధి
పాలకైలబిలాది దేవాళితోడ
నెదుటఁ బ్రత్యక్ష మయ్యె లక్ష్మీశ్వరుండు:—

మనుచరిత్ర. ఆ. ౨.

మనుచరిత్రముయొక్క యాఱవయాశ్వాసమునందు స్వారోచిష మనువు విష్ణునిగూర్చి తపస్సు చేయఁగా నతఁడు ప్రత్యక్ష మయినట్టు జెప్పఁబడిన పయిపద్యమునే దీర్ఘపాదముల నేమియు మార్పక యెత్తు గీతమునుమాత్ర మీక్రిందిరీతిగా మార్చి యాముక్తమాల్యద ప్రథమాశ్వాసమునందుఁ గృష్ణదేవరాయఁడు తనకు శ్రీకాకుళాంధ్రదేవుఁడు ప్రత్యక్షమయినట్లు చెప్పినఘట్టమునందు వేసికొనియున్నాఁడు:—

సీ. నీలమేఘముడాలు..............కౌస్తుభముతోడఁ

గీ. దమ్మి కే లుండఁ బెఱకేల దండయిచ్చు
లేము లుడిపెడు లేఁజూపు లేమతోడఁ
దొల్కు దయఁదెల్పు చిఱునవ్వుతోడఁ గలఁద
దంధ్రజలజాక్షుఁ డిట్లని యానతిచ్చె :—

అముక్తమాల్యద. ఆ ౧.

కృష్ణరాయలను గూర్చి బహుకవులు చాటుపద్యము లనేకములు కూర్చియున్నారు గాని గ్రంథవిస్తారభీతిచేత వానినన్నిటి నిందు వ్రాయక రెండుమూడు పద్యములనుమాత్రము చూపుచున్నాను :—

౧-శా. శ్రీలీలాత్మజ కృష్ణరాయ సమరోర్వి న్నీదువైరిక్షమా
పాలు ర్వేఁగి హయాధిరూఢు లగుచుం బొల్చున్ ఘనీశాఖిశా
ఖాల్న గాయతకేశపాశు లయి యూఁగన్ గేకిసల్గొట్టి యు
య్యాలో జొంపము లంచుఁ బాడుదురు భిల్లాంభోజపత్రేక్షణల్.

౨-చ. పెనిమిటి చేయుపుణ్యజనపీడనవృత్తియుఁ దండ్రిభంగముల్
దనయు ననంగభావమును దమ్మునికార్శ్యముఁ జూచి రోసి స
జ్జనపరిరక్షు శౌర్యనిధిఁ జారుశరీరుఁ గళాప్రపూర్ణు న
వ్వనధికన్య చేరె జితవైరినికాయుని గృష్ణరాయనిన్.

3-చ. కాయమువంగి తా ముదిసెఁగన్నులునుం బొరగప్పెఁ గాలు వే
దాయె నటంచు రోసి నరపాధిపనందన కృష్ణరాయ యీ
భూయువతీలలామ నినుఁ బొందిన నాదిభుజంగ భర్తకున్
బాయనిచింతచేతఁ దలప్రాణము తోఁకకు రాకయుండునే ?

ఈకడపటి పద్యముయొక్క కర్తృత్వమును తెనాలిరామకృష్ణున కారోపింతురు. రాజు మాత్రమేకాక కృష్ణరాయని కొమార్తలును సంగీతసాహిత్యములయందు నిపుణురాండ్రనియు, (రామరాజుభార్యయైన

మోహనాంగి యనునామె "మారీచిపరిణయ" మను నైదాశ్వాసముల శృంగారప్రబంధము రచియించెననియు, ఒకరు వ్రాసియున్నారు గాని మా కాగ్రంథము లభింపకపోవుటచేత నిది యిట్లని నిశ్చయింపఁ జాలకున్నాము. కృష్ణరాయని యల్లుఁడయిన రామరాజు భార్యపేరు మోహనాంగి యైనట్టు నైతము గానఁబడదు. అయినను మోహనాంగి యను పేరు తిరుమలాంబకు నామాంతరమయి యుండవచ్చును.

మంత్రియైన తిమ్మరుసుయొక్క బుద్ధిబలముచేతను మంత్రశక్తి చేతను కృష్ణదేవరాయని కధికవిఖ్యాతి కలిగెనని చెప్పుదురు. ఇంటిపేరు సాళువవారయిన ట్లనేక శిలాతామ్రశాసనములవలనను కృష్ణరాజవిజయమువలనను దెలియవచ్చుచున్నందున, ఈమంత్రిశిఖామణి క్షత్రియుఁడై నట్లు కొందఱు తలంచుచున్నారు. అయినను కృష్ణామండలములోని కొండకాపూరి దేవాలయములోని యొక శిలాదానశాసనములో మాత్ర మాతనిపేరు సాళువతిమ్మరుసయ్యంగారని వ్రాయఁబడియున్నది. అయ్యంగారని యుండుటనుబట్టి కొంద ఱాతఁడు బ్రాహ్మణుఁడని భ్రమపడినను, "సాళువ" యనెడి యింటి పేరునుబట్టియు నితరనిదర్శనములనుబట్టియు నతఁడు బ్రాహ్మణుఁడు కాఁడనియు "అయ్యంగా" రని గౌరవార్థముగా నుపయోగింపఁబడెననియు నిశ్చయింపవలసియున్నదని స్యూయల్ దొరవారు వ్రాసియున్నారు. మాదయ్యగారి మల్లన్న యీమంత్రిశిఖామణి యల్లుఁడగునప్పామాత్యున కంకిత మొనర్చిన రాజశేఖరచరిత్రమువలన నితఁడు బ్రాహ్మణుఁడే యనియు నాఱువేలనియోగి యనియు నిస్సందేహముగాఁ దెలియవచ్చుచున్నది. ఈసాళువతిమ్మరాజు కృష్ణరాయని తండ్రి యైన నరసింహరాజుతమ్ముఁడని కొందఱు చెప్పిరి. ఈసంగతి యథార్థము కాకపోయినను, అతఁడు నృసింహరాయని యొద్ద మంత్రిగా నుండెను. ఈర్ష్యచేత నృసింహరాయని పట్టమహిషి సవతికొడుకైన కృష్ణదేవరాయనిఁ జంపింప యత్నించినప్పు డాతనిని దనయొద్ద నుంచు

కొని కాపాడిన దీసాళువ తిమ్మరుసే. ఈహేతువునుబట్టియే కృష్ణదేవ రాయలు తిమ్మరుసు నప్పాజీ యని పిలుచుచుండుటయు సుప్రసిద్ధము. ఈమంత్రిశిరోమణి ౧౪౧౫ వ సంవత్సరమునందు రాజు కొండవీటి మీఁదికి దండెత్తినప్పుడు తాను సేనాపతిగానుండి సేనలను నడిపి కొండ వీటిదుర్గమును జయించెను. ఈతఁడు కృష్ణదేవరాయలకంటె మూఁడు సంవత్సరములు ముందుగా ననఁగా శాలివాహనశకము ౧౪౫౨ వ సంవత్స రమునందు మృతినొందెను. (తిమ్మరుసు బ్రాహ్మణుఁడనియు చిన్నతన ములో మిక్కిలి బీదవాఁడయి విద్యలేక తిరుగుచుండెననియు చెప్పెడు కథ యొకటి కొంతకాలమునుండి పరంపరగా వచ్చుచున్నది) ఆకథ యొక్క సత్యమెట్టి దయినను వినువారికి వినోదకరముగా నుండునని యెంచి యిందు సంగ్రహముగా వ్రాయుచున్నాను:—

"తిమ్మరుసు నియోగిబ్రాహ్మణుఁడు. ఈతఁడు బాల్యమునందే తల్లిదండ్రులను బోఁగొట్టుకొని నిరాధారుఁడై చదువును సంధ్యయు లేక తిరుపతి సమీపమున పసులఁగాచి బ్రతుకుచు, పిమ్మట గుత్తికిఁబోయి యచ్చటఁ బుల్లెలుకట్టి కొంతకాలము జీవించి, తరువాత చంద్రగిరిలోఁ గొంతకాలము మాధుకరవృత్తిచే దినములుపుచ్చి, అనంతరము పెను గొండలో సత్రములో నుద్యోగము సంపాదించి తద్దుర్గాధీశ్వరుని తాంబూలపుతిత్తులు మోచి తదనుగ్రహమువలనఁ గ్రమక్రమముగా వృద్ధినొంది గొప్పయుద్యోగములు సంపాదించి, కడపట తనబుద్ధిబలము వలన మంత్రిపదమును బొందెను. ఇతఁడు చిన్నతనములో తిరుపతి సమీపమునఁ బసులను గాచుచు బడలి యొకనాఁటి మధ్యాహ్నసమ యమున నొకచెట్టునీడను విశ్రమించెను. అంతట సూర్యుఁడు పశ్చిమ మున వ్రాలుటచే సూర్యకిరణము లాతని మీఁదఁబడినను మెలఁకువ రాక యతఁడు మైమఱచి గాఢనిద్రను పొందుచుండుట చూచి యొక కృష్ణసర్పము చేరవచ్చి తనఫణమువిచ్చి యాచిన్నవాని ముఖమున

కెంపు సోఁకకుండ గొడుగువలె నడ్డముపెట్టెను. ఈయద్భుతచర్య నప్పుడు దారిపట్టిపోవుచున్న బట్టుమూర్తి యనుబట్రాజు చూచి యీతఁడు శీఘ్రకాలములోనే మహైశ్వర్యవంతుఁడు కాఁగలఁడని తెలిసికొని, సమీపమునకుఁ బోఁగా సర్పమాతనిని విడిచి పాఱిపోయెను. ఆబట్రాజు తరువాత నాచిన్నవాఁడు మేల్కొనువఱకును వేచియుండి లేచినతరువాత "అయ్యా! నీ కచిరకాలములోనే గొప్పయైశ్వర్యము పట్టును. అప్పుడు నన్ను మఱచిపోకుము" అని చెప్పి సెలవుగైకొని స్వగ్రామమునకుఁ బోయెను. అటుపిమ్మట తిమ్మరుసు పయిని జెప్పినరీతిని క్రమక్రమముగా వృద్ధినొంది విద్యాబుద్ధులు సంపాదించి కొంతకాలమునకు మంత్రిపదము నొందెను. అప్పుడు బట్టుమూర్తి తిమ్మరుసుదర్శనార్థముపోయి యతఁడు తగినంత యాదరముచూపి గౌరవింపక యుపేక్షించుటచూచి,

శా. గుత్తిం బుల్లెలు కుట్టి, చంద్రగిరిలోఁ గూడెత్తి, పెన్గొండలో  
హాత్తిన్సత్రమునందు వేఁడి, బలుదుర్గాధీశు తాంబూలపుం  
దిత్తుల్మోసి, పదస్థులైన ఘనులన్ దీవించ

అనునంతవఱకుఁ బద్యము చెప్పునప్పటికి భయపడి తిమ్మరుసు తనకుఁ గృష్ణదేవరాయలు పట్టాభిషేకమహోత్సవసమయమునం దిచ్చిన పచ్చలపతకమును బట్టుమూర్తి మెడనువేసెను. అదియందుకొని యాబట్టు తక్కిన పద్యభాగము నీరీతిని బూరించెను—

......దీవించెదన్

మత్తారాతియయాతి నాగమసుతు న్మంత్రీశ్వరుం దిమ్మనన్.

అని చదివి యప్పుడే యీ క్రింది పద్యమును గూడఁ జెప్పెను :—

క. అయ్యా వనిపించుకొంటివి। నెయ్యంబునఁ గృష్ణరాయనృపపుంగవుచే  
నయ్యా నీసరియేరీ। తియ్యనివిలుకాఁడవయ్య తిమ్మరుసయ్యా.

అట్లు గారుత్మతహారమును బట్టున కిచ్చుటచే నాప్రధానచంద్రుఁడు "బట్టుమూర్తికిఁ గిన్కఁ బెట్టింపఁ బచ్చలహార మర్పించెఁ దిమ్మరుసుమాళి" యని ప్రసిద్ధిఁగాంచెను.

(ఈతనికిని బట్టుమూర్తికినిగల కాలవ్యత్యాసమును బట్టి కూడఁ బయికథ విశ్వాసార్హ మయినదికాదు. కృష్ణదేవరాయనికిఁ బుత్రసంతానము లేనట్టే యనేక స్థలములయందుఁ జెప్పఁబడియున్నది. అచ్యుతదేవరాయలే కృష్ణదేవరాయని పుత్రుఁడని యొకచోటను, సదాశివదేవరాయలు కృష్ణదేవరాయని పుత్రుఁడని యొకచోటను, చెప్పఁబడెను. గాని వానిసత్యమునుగూర్చి యింకను సందేహింపవలసియున్నది.) కృష్ణదేవరాయని మరణకాలమునం దాతని కిద్దఱు కొమార్తె లుండిరి. వారి కప్పటికి వివాహముకాలేదు. తరువాత తిరుమలదేవికొమార్తెను రామరాజును చిన్నాదేవికొమార్తెను దధనుజుఁడైన తిరుమలదేవరాయఁడును పరిణయమైరి. ఇట్లు కర్ణాటరాజ్యమును మహోచ్ఛదశయందుంచి కృష్ణదేవరాయలు శుక్లసంవత్సర వైశాఖమాసము మొదలుకొని వికృతిసంవత్సరము వఱకును ఇరువదియొక్క సంవత్సరములు రాజ్యముచేసి శాలివాహనశకము ౧౪౩౦ వ సంవత్సరమునందుఁ గీర్తిశేషుఁడయ్యెను. అచ్యుతదేవరాయ లా సంవత్సరమున రాజ్యమునకువచ్చి, పండ్రెండుసంవత్సరములు పరిపాలనముచేసి, తిరుచునపల్లి మొదలైన దేశములను జయించి పరలోకగతుఁడయ్యెను.

# 2. అల్లసాని పెద్దన్న

అల్లసాని పెద్దనార్యుఁడు నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు; చొక్కనామాత్యుని పుత్త్రుఁడు; బళ్లారి ప్రాంతములయందున్న దూపాడు పరగణాలోని దోరాలగ్రామ మీతని జన్మస్థలము; కృష్ణదేవరాయల యాస్థానకవీశ్వరులలో నెల్ల నితఁడు ముఖ్యుఁడు. ఈతఁడు కృష్ణదేవ రాయల యనంతరమునఁగూడ కొంతకాలము జీవించియుండుటచేత, ఇంచుమించుగా ౧౫౩౫ వ సంవత్సరము వఱకును బ్రతికియుండెనని చెప్ప వచ్చును. కృష్ణరాయలు మృతి నొందినతరువాత నీతఁడు చెప్పిన జాలిని పుట్టించెడి యీ క్రింది పద్యమీతఁడు రాయలయనంతరమున జీవించి యున్నట్టు తెలుపుచున్నది:—

సీ. ఎదురైనచోఁ దన మదకరీంద్రము డిగ్గి
కేలూఁత యొసఁగి యెక్కించుకొనియె
మనుచరిత్రం బందుకొనువేళఁ బుర మేఁగఁ
బల్లకి తనకేలఁ బట్టియెత్తె
బిరుదైన కవిగండ పెండేరమున కీవె
తగు దని తానె పాదమునఁ దొడిగెఁ
గోకటగ్రామా ద్యనేకాగ్రహారము
లడిగినసీమలయందు నిచ్చె
నాంధ్రకవితాపితామహ యల్లసాని
పెద్దనకవీంద్ర యని నన్నుఁ బిలుచునట్టి
కృష్ణరాయలతోఁ దివి కేఁగలేక
బ్రతికియుండితి జీవచ్ఛవంబ నగుచు.

అంతేకాక కృష్ణదేవరాయలు లోకాంతరగతుఁడు కాఁగానే కట కమునుండి గజపతి దండెత్తివచ్చినట్లును, అల్లసాని పెద్దన యీ క్రింది

పద్యమును వ్రాసిపంపఁగా నతఁడు సిగ్గుపడి మరలిపోయినట్టును జెప్పుచున్నారు :—

సీ. రాయరావుతుగండరాచయేనఁగువచ్చి
యోరట్లకోటఁ గోరాడునాఁడు
సంపెటనరపాలసార్వభౌముఁడువచ్చి
సింహాద్రి జయశిలఁ జేర్చునాఁడు
సెలగోలుసింహంబు చేరి ధిక్కృతిఁ గంచు
తల్పులఁ గరుల డీకొల్పునాఁడు
ఘనతరనిర్భరగండపెండెర మిచ్చి
కూఁతు రాయలకును గూర్చునాఁడు
నోడ తెలుంగవా చచ్చితో యుర్వి లేవా
చేరఁజాలక తల చెడి జీర్ణమైత్రో
కన్నడం బెట్లుచొచ్చెదు గజపతీంద్ర
తెఱచినిలుకుక్క చొచ్చిన తెఱఁగుతోఁప.

ఈ కవి రాజునొద్ద మిక్కిలి గౌరవముపొందినవాఁ డయి, రాజు చెప్పుమన్నప్పుడు గాక తనయిష్టమువచ్చినప్పుడు మాత్రమే కవిత్వము చెప్పు స్వాతంత్ర్యము గలవాఁడనియు, రాజొకనాఁడు కృతి చెప్పుమని వేఁడఁగా నతఁడు చెప్పక యీ క్రిందిపద్యమును జెప్పెననియు వాడుక గలదు :—

చ. నిరుపహతిస్థలంబు రమణీప్రియదూతిక తెచ్చియిచ్చుక
ప్పురవిడె మాత్మ కింపయినభోజన ముయ్యెలమంచ మొప్పుత
ప్పరయురసజ్ఞు లూహ తెలియంగలలేఖకపాఠకోత్తముల్
దొరకినఁగాక యూరక కృతు ల్రచియింపుమటన్న శక్యమే ?

ఈ కవియే కవిత్వ ముండవలసిన రీతినిగూర్చి యీ క్రింది పద్యమును గూర్చెనని చెప్పుదురు :—

చ. ఘనతరఘూర్జరీకుచయుగక్రియ గూఢముగాక ద్రావిడీ
స్తనగతిఁ దేటగాక యరచాటగునాంధ్రవధూటిచొక్కపుం
జనుఁగవలీల గూఢతయుఁ జాటుతనంబును లేకయుండఁ జె
ప్పినయదెపో కవిత్వ మసిపించు నగిం చటుగాక యుండినన్.

ఈపద్యము వేంకటనాథకవికృత మగు పంచతంత్రమునందుఁ గానఁబడుచున్నది. పెద్దనార్యుఁడు సంస్కృతాంధ్రములయం దసమాన సాహిత్యము గలవాఁడు. ఇతఁ డొకనాఁడు కృష్ణదేవరాయలయాస్థానములో సకలకవీశ్వరులు నుండఁగా రాజు కోరికమీఁద నుభయభాషా పాండిత్యము వెల్లడి యగునట్లుగా నొక యుత్పలమాలిక నాశుకవిత్వముగాఁ జెప్పి సభవారినందఱిని మెప్పించి కాలికి బిరుదండె వేసికొన్నవాఁడు. రాజు కవిగండపెండేరమును బసిఁడిపళ్లెరమున నునిచి, సంస్కృతాంధ్రములందు సమానముగా కవిత్వము చెప్పఁగలవారు దీనిని ధరింప నర్హులని పలికినప్పుడు పెద్దనార్యుఁడు లేచి యీక్రింది యుత్పలమాలికను జదువఁగా రాజు మెచ్చి తానే యీకవిగండపెండేరమును కవిపాదమునఁ దొడిగెనఁట—

ఉ. పూఁతమెఱుంగులుం బసరుపూపబెడంగులుఁ జూపునట్టివా
కైతలు జగ్గుసగ్గు వెనగావలెఁ గమ్మనఁ గమ్మనన్వలెన్
రాతిరియున్ బవల్ మఱపురాఁ హొయల్ చెలియారజాపుని
ద్దాతరితీపులంబలెను దారసిలన్వలె లోఁదలంచినన్
బ్రాతిగఁ బైకొనన్వలెను బైదలి చత్తుకలోనిపల్లటీ
కూఁత లనన్వలెన్ సొగసుకోర్కులు రావలె నాలకించినన్
జేతికొలందిఁ గౌఁగిటను జేర్చినఁ గన్నియచిన్నిపొన్నిమే
లూఁతలచన్నదోయివలె ముచ్చట గావలెఁ బట్టిచూచినన్
డాతొడనున్న మిన్నలమిటారపుముద్దులగుమ్మ కమ్మనో
వాతెఱదొండపండువలె వాచవిగావలెఁ బంట నూఁదినన్

గాతలఁ దమ్మిచూలిదొరకై వసపుంజవరాలి సిబ్బెపు
న్మే-తెలియబ్బురంపుజిగినిబ్బరపుబ్బగుగబ్బిగుబ్బపొం
బూఁతలనున్నకాయసరిపోఁడిమి కిన్నెరమెట్లబంతి సం
గాతపు సన్నబంతి బయకారపుఁ గన్నడగౌళవంతుకా
సాతత తానతానల పసం దివుటాడెసు గోటమీటు బల్
మ్రోఁతలునుం బలెక్ హరువు మొల్లముగావలె నచ్చుతెస్గు లీ
రీతిగ సంస్కృతం బుపచరించినపట్టున భారతీవధూ
టీ తపనీయ గర్భనికటీభవదానన పర్వసాహితీ
ఖ్యాతికనాటకప్రకరభారతభారత సమ్మతప్రభా
శీతనగాత్మజా గిరిశశేఖర శీతమయూఖరేఖికా
పాతసుధాప్రపూర బహుభంగ ఘుమంఘుమ ఘుంఘుమార్భటీ
జాతకతాళయుగ్మ లయసంగతి మంచువిపంచికామృదం
గాతత తేహిత త్తహిత హాధిత దంధణు ధాణుదింధిమి
వ్రాత నయానుకూలపద వారకుహూద్వహా హారికింకిణీ
నూతన ఘల్లులాచరణ నూపుర ఝూంఝరఝుళీమరంద సం
ఘాతవియద్ధునీ చకచకద్వికచోత్పల సారసంగ్రహా
యాతకుమారగంధవహా హాసిసుగంధ విలాసయుక్తమై
చేతము చల్లఁజేయవలె జిల్లునఁ జల్లవలె న్మనోహర
ద్యోతక గోస్తనీఫల మధుద్రవ గోఘృత పాయసప్రసా
రాతి రసప్రసార రుచిరప్రతిమంబుగ సారెసారెకున్.

పెద్దనార్యుఁడు హరికథాసారము, స్వారోచిషమనుచరిత్రము మొదలైన పెక్కుగ్రంథములను రచియించెను. వానిలోనెల్ల మనుచరిత్రము మిక్కిలి ప్రసిద్ధమై యెల్లయెడల వ్యాపించి యున్నది. ఈయనకుం బూర్వమునం దున్నకవు లెవ్వరును స్వకల్పనమును విశేషముగాఁ జేర్చి ప్రబంధములను రచియించి యుండలేదు. వారు పురాణేతిహాసాదులను

మాత్రము తెనిఁగించిరి. ఈతఁడే మార్కండేయ పురాణమునుండి స్వారోచిష మనుసంభవ కథను గైకొని పెంచి స్వకపోలకల్పనతో మొట్ట మొదట మనుచరిత్రమును ప్రబంధరూపమున రచియించిన కవి యగుట చేత నీతని కాంధ్రకవితాపితామహుఁ డన్న బిరుదనామము కలిగినది. ఈతనికాలము మొదలుకొని రామరాజభూషణుఁడు వసుచరిత్రము చేయు నంతవఱకును గల కవులందఱును జాలవఱకుఁ దమ ప్రబంధములను మను చరిత్రరీతినే చేసిరి. (ఈ కవి జన్మముచేత స్మార్తుఁడే యయినను, నడుమ వైష్ణవము పుచ్చుకొని వైష్ణవాగ్రేసరుఁడయి విష్ణ్వాలయములకు భూదానాదులను జేసెను. ఈ విషయమే మెకంజీ దొరవారు సంపాదించి యుంచిన రాజకీయప్రాగ్దేశపుస్తక భాండాగారమునందలి వ్రాఁతపుస్తకములయందుఁ దెలుపఁబడియున్నది. అందున్న కోకటాగ్రహారమును గూర్చిన యంశము నిందు క్రింద వ్రాయుచున్నాను—

"అల్లసాని పెద్దయ్యంగారు బ్రాహ్మణుఁడు, నందవరీకుఁడు, చొక్కరాజుగారి కొమారుఁడు. కోకటగ్రామమును శ్రీకృష్ణదేవరాయలవారీ కవీశ్వరుని కియ్యఁగా, అతఁడు వైష్ణవము పుచ్చుకొని యీ గ్రామము శ్రీవైష్ణవుల కగ్రహారము చేసియిచ్చెను. అప్పుడు దానికి పెట్టినక్రొత్తపేరు శఠగోపపురము. ఈ కవి శాలివాహనశకవర్షములు ౧౪౪౦ బహుధాన్యసంవత్సర వైశాఖశుద్ధ ౧౫ లు నాఁడు ఈ గ్రామమునందుండు సకలేశ్వరస్వామికి నైవేద్య దీపారాధనలకై రెండు పుట్లచేను ధారపోసియిచ్చి సదరు దేవాలయములో శిలాశాసనము వేయించినాఁడు. పయిసంవత్సరము కార్తికశుద్ధ ౧౨ శి నాఁడు చన్నకేశవస్వామికి నాలుగున్నర పుట్లభూమి ధారపోసి శాసనము వేయించినాఁడు......కృష్ణదేవరాయలతర్వాత సదాశివదేవరాయల కాలములోను, రామరాయలకాలములోను, నంద్యాలరాజైన మట్లఅనంతరాజు కాలములోను కోకటాగ్రహారము బ్రాహ్మణులకుఁ జెల్లెను."

ఈకవి కోకటాగ్రహారమునకు శఠగోపపురమని పేరు పెట్టుటయే కాక తన మనుచరిత్రములోను హరికథాసారములోనుగూడ శఠగోప యతిని దనగురువునుగా స్తుతించి యున్నాఁడు—

క. కొలుతు న్మద్గురు విద్యా
నిలయుం గరుణాకటాక్ష నిబిడజ్యోత్స్నా
దళితాశ్రితజనదురిత
చ్ఛలగాఢధ్వాంతసమితి శఠగోపయతిన్.

మనుచరిత్ర.

క. శఠగోపయతికి శఠతరు
కుతారకోపమమతికిని గురుమతహృత్క
ర్మఠనిరతికిఁ జతురాగమ
పఠనాయతనియతికి నజపాసంభృతికిన్.

హరికథాసారము.

లక్షణగ్రంథములయం దక్కడక్కడ నుదాహరింపఁబడిన పద్యములు లభించుటయేకాని హరికథాసారము పూర్ణముగా దొరికినదికాదు. హరికథాసారములోని యీరెండు పద్యములును రంగరాట్ఛందస్సునం దుదాహరింపఁబడి యున్నవి—

క. అంబరముపగుల నార్చి ప్ర
లంబాసురుఁ డాగ్రహము వెలయఁ గదిరినవే
ళం బలరాముఁడు చేముస
లంబున వానితలఁ ద్రుంచె లావు మెఱయఁగన్.

హరికథాసారము. అ. ౪.

క. తెంపరియై మది యింత చ
లింపక యనిలోనఁ దెగియె నెవ్వఁ డతఁడు నై
లింప సభ నుండు ననుడుఁ బ
దంపడి యాచార్యుతోడఁ దా ని ట్లనియెన్.

హరికథాసారము.

ఈకవియే మొట్టమొదటఁ దెలుఁగు గ్రంథములలో తురక మాటలు లోనగు నన్యభాషాపదములను స్వేచ్ఛముగాఁ బ్రయోగింప నారంభించినాఁడు. ఆంధ్రకవితాపితామహుని యీక్రింది చాటుపద్య ములోఁ దురుష్కభాషావాక్యమే వేయఁబడినది.

మ. సమరక్షోణిని గృష్ణరాయలభుజాశాతాసిచేఁ బడ్డ దు
ర్దమదోర్దండపుళిందకోటియవనవ్రాతంబు సప్తాశ్వ మా
ర్గమునం గాంచి శబాసహాహా హరిహరంగాఖూబు ఖోడాకి తే
తుముకీబాయిల బాయిదేమలికియందు ర్మింటికిం బోవుచున్.

ఈతని జూచి యాకాలమునందలి యితరకవులును దమచాటు పద్యములలోను గ్రంథములలోను యవనభాషావాక్యాదులను జొప్పిం చిరి. అట్టివారిలో నొక్కఁడగు నందితిమ్మన్న యొకచాటుపద్యములో-

శా. రాయగ్రామణి కృష్ణరాయ భవదుగ్రక్ష్మారఖడ్గాహిచేఁ
గాయం బూడ్చి కళింగదేశనృపతుల్ కానిర్ఝురీపోషణీ
మాయాభీకుముటూకులోటుకుహుటూ మాయాపటా జాహరే
మాయాగ్గేయ మడే యటంచ్రు దివి రంభాజారునిన్ యక్షునిన్.

అని చెప్పియున్నాఁడు. ఈలాగుననే పెద్దనార్యుఁడు గ్రంథము లలో నన్యభాషాపదములను బ్రయోగించినందుకు మనుచరిత్రలోని యీక్రిందిపద్యమును దృష్టాంతముగాఁ జూపవచ్చును—

సీ. పచ్చనిహురుమంజిపనివాగెపక్కెర పారసిపల్లంబు పట్టమయము
రాణ నొప్పారు పైరాణంబుసింగిణి తళుకులకోరీలతరకసంబు
మిహి పసిండిపరుంజు మొహదాకెలంకుల రావుగుజ్జరివన్నె కేవడంబు
డాకెలంకునసిరాజీకరాచురకత్తి కుఱుఁగటఁ గ్రొవ్వాఁడి గొఱకలపొది
పీలికుంచె తలాటంబు పేరొజంబు
మణులమొగముట్టుఁ బన్ని సాహిణిమొకండు

కర్తయెదుటికిఁ గొనివచ్చె గంధవాహ
బాంధవం బగునమ్మహాసైంధవంబు.

మనుచరిత్రము. ఆ. ౪.

ఈయనను జూచి యాకాలపువాఁ డయిన ధూర్జటికవియుఁ దన కాళహస్తి మాహాత్మ్యమునం దీక్రిందిరీతి పద్యములం దన్యభాషాపదములు చేర్చి కూర్చినాఁడు—

సీ. బిజమాడుదేవర నిజకృపామహిమఁ జెన్నారునాయిల్లు బిడారునీకు
నాకునీపాదార్చనముసేయనడలింగమూర్తి చేకుఱవచ్చిమూర్తమాడి
యొడయచిత్తేశ నాయునికి నీమజ్జనమాడు శివార్చన మాడుబేకు
విచ్చేయుఁ డిది బూదివీడియం బందుకో జంగమస్వామి నాసదనమునకు
నోగిరంబులు మంచిమే లోగిరమున
నావటించెదఁ బదుఁడు మీ రారగింపఁ
బ్రతిదినంబును జంగమార్చనము లేక
దనువు వడనొల్ల రూపకందర్ప యనఁగ.

కాళహస్తిమాహాత్మ్యము.

ఈయన మనుచరిత్రమునుగూర్చి వ్రాయుచు నొకరు "కొన్ని యెడల నైషధమార్కండేయ పురాణములయందలి వాక్యములకును నిందలి వాక్యములకును నంతయేనియు భేదమగపడక" యున్నదని యించుక దోషారోపణము చేసియున్నారు. మార్కండేయ పురాణమునందు విపులముగాఁ జెప్పఁబడిన స్వారోచిషమను సంభవకథనే గ్రహించి మారన తెనిఁగించిన యా పురాణమును జదివియే పెద్దన మనుచరిత్రమును రచియించినందున నందలి కొన్ని వాక్యము లిందుఁ బడియున్నవి. అంతేకాక యీ కవి శ్రీనాథుని కవిత్వమునం దత్యాదరము కలవాఁడయి యున్నట్లీతని గ్రంథపఠనమువలన స్పష్టముగాఁ గానవచ్చుచున్నది. మొట్ట మొదట తెనుఁగు కవిత్వమునందు సాంస్కృతిక దీర్ఘసమాసములను

విస్తారముగా నుపయోగించినవాఁడు శ్రీనాథుఁడు. ఆతని కవనరచనయం దత్యాదరము కలవాఁడయి పెద్దన యాతని గ్రంథములను బలుమాఱు చదివి యొక్క చతుర్థాశ్వాసమునుదక్కఁ దక్కినపుస్తకము నంతను ఆతనివలెనే సంస్కృతపద భూయిష్ఠముగా రచియించి యుండుటచేత శ్రీనాథుఁ డుపయోగించిన వాక్యములును గొన్ని మనుచరిత్రమునందుఁ బడినవి. అంతమాత్రముచేత నీతనియందు గ్రంథచౌర్యము నారోపించుట న్యాయముకాదు. ఈతఁ డొక్కఁడు మాత్రమేకాక యిటీవలి కవులనే కులు కొన్నిచోట్ల పూర్వకవుల వాక్యములను దమకబ్బములయందుఁ జొప్పించియున్నారు. మఱియు నల్లసాని పెద్దనార్యుఁడు శ్రీనాథుని నైషధమునుండి కొన్ని వాక్యములను గ్రహించుటయేకాక యాతని పద్యములను జదివి యారీతి పద్యములనే పెక్కింటిని మనుచరిత్రమునందుఁ గూర్చియున్నాఁడు. అందుకు నిదర్శనముగా నొకటి రెండుపద్యముల నిందుఁ జూపుచున్నాను :—

సీ. నలినసంభవువాహనమువారువంబులు
 కులముసాములు మాకుఁ గువలయాక్షి
చదలేటి బంగారుజలరుహంబులతూండ్లు
 భోజనంబులు మాకుఁ బువ్వుఁబోఁడి
సత్యలోకముదాఁక సకలలోకంబులు
 నాటపట్టులు మాకు నబ్జవదన
మధురాక్షరము లైనమామాటల వినంగ
 నమృతాంధసులు యోగ్యు లనుపమాంగి
భారతీదేవి ముంజేతి పలుకుచిలుక
సమదగజయాన సద్బ్రహ్మచారి మాకు
వేదశాస్త్ర పురాణాదివిద్య లెల్లఁ
దరుణి నీయాన ఘంటాపథంబు మాకు—

శృంగారనైషధము. ఆ. ౨.

సీ. చిన్నివెన్నెలకందు వెన్నుఁదన్నిసుధాబ్ధిఁ
బొడమినచెలువ తోఁబుట్టు మాకు
రహిపుట్టఁ జంత్రగాత్రముల తారల్గరఁగించు
విమలగాంధర్వంబు విద్య మాకు
వనవిల్తుశాస్త్రంబు మినుకు లావర్తించు
పని వెన్నతోఁడఁ బెట్టినది మాకు
హయమేధ రాజసూయము లనఁ బేర్వడ్డ
సవనతంత్రంబు లుంకువలు మాకు
గనకనగసీమఁ గల్పవృక్షములనీడఁ
బచ్చరాగట్టుగమి రచ్చపట్టుమాకుఁ
పద్మసంభవవైకుంఠ భర్గసభలు
సాముగరిడీలు మాకు గోత్రామరేంద్ర—

మనుచరిత్రము. ఆ. ౨.

ఉ. వానిఁ బ్రశంసచేయఁ దగు వాఁడు కృతార్థతముండు వానిచే
నీనిఖిలంబు పావన మహీనకృపావిభవం బెలర్ప నె
వ్వానిగృహాంగణంబునకు వచ్చినత్రోవరజంబులందు నీ
మానితపాదయుగ్మక మమర్చుఁ బ్రఫుల్లసరోజదామముల్—

నైషధ. ఆ. ౩.

ఉ. వానిది భాగ్యవైభవము వానిది పుణ్యవిశేష మెమ్మెయిన్
వాని దవంధ్యజీవనము వానిదెజన్మము పేరుసేయ నె
వ్వానిగృహాంతరంబున భవాదృశయోగిజనంబు పావన
స్నానవిధాన్నపానముల సంతస మొందుచుఁ బోవు నిచ్చలున్—

మను. ఆ. ౧.

ఇట్టివాని నింకను బెక్కులు చూపవచ్చును. పెద్దన చెప్పిన పద్య ములను గొన్నిటిని తెనాలి రామలింగకవి యాక్షేపించినట్లు కొన్ని

కథలు గలవుగాని యవి విశ్వాసార్హములు గావు. అయినను దీనిం జదువు వారికి వినోదకరముగా నుండవచ్చునని యెంచి యందొక పద్యమును దానిమీఁది యాక్షేపణమును నిందుదాహరించు చున్నాను :—

క. కలనాఁటిధనము లక్కఱ। గలనాఁటికి దాఁచఁ గమలగర్భునివశమా
నెలనడిమినాఁటివెన్నెల। యలవడునే గాదెఁబోయ నమవసనిసికిన్.

అనుపద్యమును పెద్దన రచియింపఁగా నందలి "యమవసనిసి" యన్నప్రయోగము నవ ప్రయోగమునుగా భావించి రామకృష్ణకవి యప భ్రంశపదములతోఁ గూడిన యీక్రిందిపద్యముచేత నాతని నాక్షేపించి యున్నాఁడని చెప్పుచున్నారు :—

క. ఎమితిని సెపితివి కపితము
బ్రమపడి వెఱిపుచ్చకాయ వడిఁ దిని సెపితో
యుమెతక్కఱియ దిని సెపితో
యమవసనిసి యన్నమాట యలసని పెదనా.

"అమవసనిసి" యన్నమాట తప్పు కాకపోవుటచేతను, రామ కృష్ణకవి యలసానిపెద్దన కాలములో నున్నవాఁడు కాకపోవుటచేతను. ఈకథ కేవలకల్పితమే కాని యిందు సత్య మెంతమాత్రమును లేదు. కృష్ణదేవరాయల యాస్థానమునకు వచ్చిన విద్వత్కవీశ్వరులను బరీక్షించు టకయి యాంధ్రకవితాపితామహుఁడె నియమింపఁబడుచు వచ్చెననియు, అతఁ డావచ్చిన కవీశ్వరులకు నానావిధము లయిన సమస్యలనిచ్చి వారు పూరించిన పద్యపూరణములనుబట్టి వారి సామర్థ్యమునను నిర్ణయించుచు వచ్చెననియు జనశ్రుతి గలదు. ఒకనాఁడు రాధామాధవుఁ డనుకవి తదాస్థానమునకు వచ్చినప్పుడు పరీక్షార్థముగా పెద్దన్న 'నగరు' 'తగరు' 'త్రాగరు' 'వగరు' అను పదములు ప్రాసస్థానములందుంచి రామాయణ పరముగాఁ బద్యమును గూర్పు మనఁగా నాకవి యిట్లు చెప్పెనఁట :—

చ. నగరు పగాయె నింక విపినంబుల కేగుఁడు రాజ్యకాంక్షకుం
దగరు కుమారులార యని తల్లి వగ ల్మిగులంగఁ దోఁపఁగాఁ
దొగరున రక్షఁగట్టి మదిఁ దోచక గద్గదఖిన్నకంఠయై
వగరుచు చున్నఁ జూచి రఘువంశవరేణ్యుఁడు తల్లి కిట్లనుక్.

అని చెప్పఁగా సంతోషించి యీప్రాసములతోనే భారత భాగవతపరముగాఁగూడఁ బద్యములను రచింపు మని యడుగఁగా నాకవీశ్వరుఁడు వరుసగా నీక్రింది రెండు పద్యములను జెప్పి తనప్రావీణ్యమును జూపెనఁట.–

చ. తొగరుచి కన్నుదోయిఁ గడుఁదోఁచఁగఁ గర్ణుఁడు భీమసేనుపైఁ
దగరు ధరాధరంబుపయిఁ దాఁకినభంగిని దాఁకి నొచ్చి తా
వగరుచుచుక్ వెసం బరుగువాఱిన నచ్చటిరాజలోకముల్
నగరు సుయోధనాజ్ఞ మది నాటుటఁజేసి ధరాతలేశ్వరా.

చ. వగరుపుమాత్రమే వరుఁడు వశ్యుఁడుకాఁడు సఖీనఖత్వ మె
న్న గరుడవాహనుండు మము నాఁ డటు డించుటయెల్ల నుద్ధవా
తగ రని కాక మోహపులతాతనువైన విడంగఁ జూతురే
తొగరుచి మోహపంకీశునకుఁ దోఁపఁగఁజేయు నె వీడనాడఁగన్.

అల్లసానిపెద్దన్నది మృదుశైలి; కవిత్వము సలక్షణముగాను మధురముగాను నుండును. ఈవిషయమునే కృష్ణరాయలు "కృతి రచింపుము మాకు శిరీషకుసుమపేశల సుధామయోక్తులఁ బెద్దనార్య" యన్న వాక్యము బోధించుచున్నది. మనుచరిత్రము శృంగారరస ప్రధానమయినదిగా నున్నది. ఆగ్రంథము సాధారణముగా సంస్కృతపద భూయిష్ఠముగా నున్నను, కొన్నిచోట్ల మనోహరముగా సంస్కృతాంధ్రపదములు రెండును సమానముగాఁ గలిసినదిగాను నాలవయాశ్వాసము కేవలాంధ్రపదభూయిష్ఠమైనదిగాను నున్నది. ఈతని కవిత్వమునందలి పదవాక్యజటిలత్వమునుబట్టి "యల్లసానివాని యల్లిక బిగియును" అను

ప్రసిద్ధి వచ్చినది. ఈయన కవితారీతిని తెలుపుట కయి మనుచరిత్రము నుండి కొన్ని పద్యముల నిం దుదాహరించుచున్నాను.—

చ. అటఁజని కాంచె భూమిసురుఁ డంబరచుంబిశిరస్సరజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠదభంగతరంగమృదంగనిస్స్వన
స్ఫుటనటనానుకూలపరిఫుల్ల కలాపకలాపిజాలమున్
గటకచరత్కరేణుకరకంపితసాలము శీతశైలమున్. ఆ. ౨.

మ. అకలంకౌషధసత్త్వముం దెలియ మాయా ద్వార కావంతి కా
శి కురుక్షేత్ర గయా ప్రయాగముల నే సేవింప కుద్దండ గం
డక వేదండ వరాహ వాహరిపు ఖడ్గవ్యాఘ్రము మిమ్మంచుఁ గొం
డకు రాఁజెల్లునె బుద్ధిజాడ్యజనితోన్మాదుల్గదా శ్రోత్రియుల్. ఆ. ౨.

ఉ. ఎక్కడియూరు కాల్నిలువ కింటికిఁ బోయెదనంచుఁ బల్కెదీ
వక్కడి మీకుటీరనిలయంబులకు న్నరిరాకపోయెనే
యిక్కడిరత్నకందరము లిక్కడినందనచందనోత్కరం
బిక్కడి గాంగసైకతము లిక్కడియాలవలీనికుంజముల్. ఆ. ౨.

ఉ. చేసితిజన్నముల్ తపముఁ జేసితి నంటి దయావిహీనతం
జేసినపుణ్యము ల్ఫలముఁ జెందునె పుణ్యము లెన్నియేనియుం
జేసినవాని సద్గతియె చేకుఱు భూతదయార్ద్రబుద్ధి నో
భూసురవర్య యింత తలపోయవు నీచను వేల చెప్పుమా. ఆ. ౨.

ఉ. ఎంతతపంబు చేసి జనియించినవారొకొ మర్త్యభామినుల్
కాంతుఁ డవజ్ఞఁ జేసినను గాయముఁ బాయుదు రే నమర్త్యనై
చింతలవంతలం జివికి సిగ్గరితి న్మృతిలేనినాడుచె
ల్వింతయు శూన్యగేహమున కెత్తినదీపిక యయ్యె నక్కటా. ఆ. 3.

ఉ. ఓయి దయావిహీనమతి యూరక యీపసిబిడ్డఁ గొట్టఁగాఁ
జే యెటులాడె నీకు నిది చేసిన దేమి వృథాశపింతురే

బోయవె యాఁడుతోఁడునను బుట్టవె శాపనిమిత్తమే తపం
బీయెడ నున్నశాంతిపరు లేమనువా రిఁక నీచరిత్రకున్. ఆ. ౪.

శా. తండ్రీ నాకు ననుగ్రహింపఁగదె వైద్యం బంచుఁ బ్రార్థించినన్
గండ్రల్గా నటు లాడి ధిక్కృతులఁ బోకాల్మంటి వోహో మదిం
దీంద్ర ల్గలినవారి కేకరణినేని న్విద్య రాకుండునే
గుండ్రా డాఁచినఁ బెండ్లియేమిటికిఁ జక్కం గష్టముష్టింపచా. ఆ. ౫.

శా. నీవైశిష్ట్యము లిట్టుల న్మెఱయునే నీకంటె నేఁ దక్కువే
యీవే కన్యక నీవుగాక మఱి మద్వృత్తాన్వయాచారముల్
నీవా పేర్కొనుపాటివాఁడ విటఁ గానీ నిల్తుఁ గా కేమి పో
పో విప్రాధమ సన్నుఁ బోల నిఁక నల్వు ల్లేరు దంభవ్రతా. ఆ. ౬.

---

## 3. నంది తిమ్మన్న

ఈకవి కృష్ణదేవరాయని యాస్థానమునం దుండి ప్రసిద్ధిగన్న వారిలో నొకఁడు. ఇతఁడాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు; కౌశికగోత్రుఁడు; నంది సింగన్నకును తిమ్మాంబకును పుత్రుఁడు; వరాహపురాణాది గ్రంథములను రచించి ప్రఖ్యాతి కెక్కిన మలయమారుతకవికి మేనల్లుఁడు. ఈతఁడు శివభక్తుఁడు. అఘోర శివ గురుని శిష్యుఁడు. ఈకవిని సాధారణముగా ముక్కుతిమ్మన యని వాడుదురు.

శా. నానాసూనవితానవాసనల నానందించుసారంగ మే
లా నన్నొల్లదటంచు గంధఫలి బల్కానం దపం బంది యో
షానాసాకృతిఁ దాల్చి సర్వసుమనస్సౌరభ్యసంవాసియై
పూనెం బ్రేక్షణమాలికామధుకరీపుంజంబు నిర్వంకలన్.

అను ముక్కునువర్ణించిన యీ పద్యమును తిమ్మకవి రచియించె నని యు, ఈపద్య చమత్కృతిని జూచి మెచ్చి రామరాజభూషణుఁడు నాలుగువేల వరాలిచ్చి కొని తన వసుచరిత్రమునందు వేసికొనియె నినయు, ముక్కుమీఁది యీ పద్యమును రచించుటచేతనే యీ కవిని ముక్కుతిమ్మన్న యని యెల్లవారును వాడుచు వచ్చిరనియు, లోక ప్రవాదము కలదు. కాని యిదియుఁ గవులను గూర్చి మనవారు సాధారణముగాఁ జెప్పుకొను కల్పనాకథలలోఁ జేరినదే కాని నిజమయినది కాదు. మొట్టమొదట రామరాజభూషణుఁ డీకవి కాలములో లేనేలేఁడు, ఒకవేళ నున్నాఁడనుకొన్నను వసుచరిత్రమువంటి మహాప్రబంధమును రచియింపఁ గలిగిన కవిగ్రామణి యింతమాత్రపు కల్పనను నాసికా వర్ణనముఁగూర్చి చేయలేకపోయెననుట పరిహాసాస్పదము. కాఁబట్టి యీ కథ యణుమాత్రమును విశ్వాసపాత్ర మయినదిగాదు. కాకపోయినయెడల నందివారని యింటిపేరుగల యీ కవిని ముక్కుతిమ్మన్న యని జనులేలపిలుతురని కొంద ఱడుగవచ్చును. ఈ కవికి ముక్కు పెద్దదనియు, అందుచేత నీతని నెల్లవారును ముక్కుతిమ్మన్న యని పిలుచుచు వచ్చిరనియు, ఇంకొక వాడుకగూడఁ గలదు. ఈతనిని ముక్కుతిమ్మన్నయని యాడుట కిదియే నిజమయిన కారణము కావచ్చును. ఈతనిపలుకులు ముద్దులు గులుకుచుండుటచేత నిటీవలివారు "ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకు" అని గ్రంథములయందీతని మృదుపదరచనను శ్లాఘించియున్నారు. తిమ్మనకృతమయిన పారిజాతాపహరణము మృదుమధుర పదములతో రసికజనహృదయరంజకముగాఁ గూర్పఁబడినది.

అల్లసానిపెద్దన నొక్కనివిడిచినపక్షమునఁ గృష్ణదేవరాయ లీతనినే యెల్ల కవులకంటె నధికముగా గౌరవించుచు వచ్చెనని చెప్పవచ్చును. పెద్దనకృతమైన మనుచరిత్రమువలెనే తిమ్మనకృతమైన పారిజాతాపహరణ ప్రబంధమును గృష్ణదేవరాయునికే యంకితము చేయఁబడినది. ఇంచు

మించుగాఁ బారిజాతాపహరణము మనుచరిత్రము రచియింపఁబడిన కాలమునందే రచియింపఁబడిన దగుటచేత హూణశకము ౧౫౨౦ వ సంవత్సరమునకుఁ బూర్వముననే పారిజాతాపహరణము ముగింపఁబడినది. తదనంతరమీకవి కొన్ని సంవత్సరములుమాత్రము బ్రతికి కృష్ణదేవరాయఁడు జీవించియుండఁగానే మృతినొందెను. కాఁబట్టి యితఁడు దాదాపుగా ౧౫౨౮ వ సంవత్సరమువఱకును జీవించియుండెనని చెప్పవచ్చును. ఈ కవియొక్క జన్మస్థలము గణపవరమని యొకరు వ్రాసియున్నారుగాని దానిసత్యమును నిర్ధారణము చేయుటకుఁ దగినయాధారమేదియుఁ గానరాదు. మఱియు నీతనిని కృష్ణదేవరాయనిభార్య తన పుట్టినింటి యరణపుఁ గవినిగాఁ దెచ్చెనని చెప్పుదురుగాని యదియు పుక్కిటిపురాణమే. ఈతని పూర్వులు మొదటినుండియు రాయలవారి పూర్వుల వద్దనే విద్వత్కవులుగా నుండి వారికిఁ గృతు లిచ్చుచు వచ్చినట్లు గ్రంథనిదర్శనములు గలవు. తిమ్మన పూర్వుఁడైన నందిమల్లనయు, మేనమామయైన మలయమారుతకవియుఁ గృష్ణదేవరాయల తండ్రియైన నరసరాయల యాస్థానమునందుండి యిద్దఱును గలిసి వరాహపురాణమునుఁ దెనిఁగించి నరసరాజును దానికిఁ గృతిపతినిజేసిరి. తిమ్మకవి తన పారిజాతాపహరణమునఁ బ్రథమాశ్వాసములోఁ గృష్ణుఁడు పారిజాతపుష్పమును రుక్మిణి కిచ్చుటవలన వచ్చిన కోపమును దీర్చుటకై సత్యభామకు మ్రొక్కెననియు, మ్రొక్కఁగా నాపడఁతి యెడమకాలితో నాతనితల దన్నెననియు, అందుల కాతఁడలుగక ముండ్లవంటి తనగగుర్పొడిచిన తలవెండ్రుకలు సోఁకి కాలు నొచ్చెనని యా ప్రియభార్య నూరార్చెననియు, ఆమె యంతటితోను ప్రసన్నురాలుగాక నాథుని నిష్ఠురోక్తులాడెననియు, ముద్దులు గులుకు పలుకులతో నీ క్రింది పద్యములయందుఁ జెప్పెను :—

ఉ. పాటలగంధి చిత్తమునఁ బాటిలుకోపభరంబుఁ దీర్ప నె
ప్పాటను బాటుగామి మృదుపల్లవకోమలతత్పదద్వయీ
పాటలకాంతి మౌళిమణిపఙ్క్తికి వన్నియవెట్ట నాజగ
న్నాటకసూత్రధారి యదునందనుఁ డర్మిలి మ్రొక్కె మ్రొక్కినన్.

మ. జలజాతాసనవాసవాదిసురపూజాభాజనంబై తన
ర్చులతాంతాయుధుకన్నతండ్రిశిర మచ్చో వామపాదంబునన్
దొలఁగం ద్రోచె లతాంగి యట్లయగు నాథుల్ నేరముల్సేయఁ బే
రలుకం జెందినయట్టికాంత లుచితవ్యాపారముల్ నేర్తురే ?

క. కోపనపదహతిఁ గుహనా
గోపాలుఁడు గాంచి మెయి గగుర్పొడవఁగ ను
ద్దీపితమన్మథరాజ్య
ప్రాపితుఁడై పలికెఁ గూర్మి బయలుపడంగన్.

చ. నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁగిన్కఁ బూని తా
చినయది నాకు మన్ననయె చెల్వగునీపదపల్లవంబు మ
త్తనుపులకాగ్రకంటకవితానము తాఁకిన నొచ్చు నంచు నే
ననియెద నల్క మానవుగదా యిఁకనైన నరాళకుంతలా.

చ. అన విని మానినీతిలక మప్పుడు మేయరదోఁప నిక్కి వీ
డినకచపంక్తిఁ బల్మఱు ముడి న్వెడఁద్రోఁపుచుఁ బైచెఱంగు గ్ర
క్కునఁ జనుదోయిఁ జేర్చుచు మొగంబున లేఁజెమ రంకురింప జం
కెన నెఱచూపుచూచి పలికెం జళితాధరపల్లవాగ్రయై.

ఉ. ఈనయగారవుఁబ్రియము లీపస లీమొగమిచ్చుమాట లే
లా నిను నమ్మియుండినఫలం బిదె తోడనె కల్గె నీకు నీ
యాన సుమీ ననుం జెనకి యాఁడివెట్టిన నవ్వువారలం
గాన వెఱుంగునే పసులకాపరి భావజమర్మకర్మముల్.

ఉ. ఇంకిటు విన్ను నమ్మి నను నేమిటికిం గెరలించె దెంతయుం
బొంకముగాని యీవలనిబొంకులు మాచవిగావు రుక్మిణీ
పంకజపత్రనేత్రకును బ్రాణపదంబులుగాన వల్లవీ
కింకర చాలుఁజాలు నడకింపకు నింపకు లేనిసూరుముల్.

ఉ. గట్టివచేఁతలుం బసలుఁ గల్లఁదనంబులు నీవు పుట్టఁగాఁ
బుట్టిన వెందు లేనిపలుఁబోకలమాయలు నీకు వెన్నతోఁ
బెట్టినవో కొటింగియును బేలతనంబున నిన్ను నమ్మి నా
గుట్టును దేజము న్మిగులఁ గోల్పడిపోయితి నేమిచేయుదున్.

చ. మునిపతివచ్చి పూవొసఁగి మోదముతోడ భవత్ప్రియాంగనన్
వినుతి యొనర్పఁగా వినినవీనుల మాచవిగాని మాటలున్
వినవలసెంగదా యిపుడు నీ విటవచ్చుట పారిజాతవా
సనఁ బ్రకటించి నాకు నెకసక్కెము చేయనకాదె చెప్పుమా.

క. మానంబె తొడవు సతులకు
మానమె ప్రాణాధికంబు మాన మఖిలస
మ్మానములకు మూలం బగు
మానరహిత మైనబ్రదుకు మానిని కేలా?

ఈపద్యములను విన్నపిమ్మట లోకమున భార్యాభర్తలలో నిట్టి వినోదము జరుగుట స్వాభావికము కాదని యెంచి రాజిది స్వభావవిరుద్ధమని పలికెనఁట! కవి యప్పు డేమియుఁ బ్రత్యుత్తర మియ్యక యూరకుండెనఁట! అటుపిమ్మటఁ గొన్నిదినములకే రాజు ప్రణయకలహము సంభవించినప్పుడు భార్యవలనఁ దనకు నిట్టిగౌరవమే సంప్రాప్తముకాఁగా కామావేశపరవశుఁ డయి యానందించి వెంటనే సభకు వచ్చి పుస్తకములో నెల్ల నీభాగమే మిగుల స్వభావసిద్ధముగా నున్నదని శ్లాఘించెనఁట! ఈకథనే కొంద ఱింకొకవిధముగా మార్చి పాలయులుకలో

నాఁడలు తెలియక భార్య తనశిరస్సును వామపాదముతో నలంకరింపఁగా గోపించి రాజు భార్యతో సహాశయ్యాసంభాషణములు మానివేసె నఁయు, కవి యీసంగతి తెలిసికొని యీదంపతులను మరలఁ గలుపుటకై యీగ్రంథమును జేసి వినిపింపఁగా రాజు బుద్ధి తెచ్చుకొని కృష్ణునంతటివానికే యట్టి యవస్థ తటస్థించినప్పుడు తన కేమిలెక్క యని మరల భార్యతోఁ గూడె ననియు చెప్పుచున్నారు.

ఈకవియొక్క దాతృత్వమునుగూర్చి యొక కథగలదు. ఇతఁడు పారిజాతాపహరణమును రాజున కంకితము చేసినప్పుడు రాజు చతురంతయానమహాగ్రహారములును మణికుండలములును బహుమానము చేసెను. ఆయమూల్యమణికుండలములను ధరించి తిమ్మన వాకిటఁ గూరుచుండి యుండఁగా నొకబట్టు వచ్చి యాతని కవనమై పుణి నిట్లు స్తుతించెనఁట !

క. మాకొలఁది జానపదులకె । నీకవితాశివి ? యబ్బునే కూపనట
    ద్భేకములకు గగనధునీ । శీకరములచెమ్మ ? నంది సింగయతిమ్మా !

స్తుతింపఁగానే యతఁడు తనయొద్ద నప్పుడు మఱేఁయు నమూల్యవస్తువు లేకపోవుటచేత వెంటనే తనచెవి నున్నయమూల్యరత్నకుండలమొకటి యాబట్టుకవి కిచ్చెనఁట ! మఱునాఁడు తిమ్మకవి యొంటిచెవికుండలముతోనే రాజాస్థానమునకుఁ బోయి యుండఁగా నచ్చటి కాబట్టుకవియు వచ్చెనఁట ! అప్పుడు ప్రస్తావవశమున రా జాకుండలదానవృత్తాంతమును బట్టు చెప్పినపద్యమును విని,

క. మాకొలఁది జానపదులకె । నీకవితాశివి ? యబ్బునే కూపనట
    ద్భేకములకు నాకధునీ । శీకరములచెమ్మ ? నంది సింగయతిమ్మా!

అని 'గగన' యనుటకు మాఱుగా 'నాక' యని యుండినచో మరింతసరసముగా నుండునని సెల విచ్చెనఁట ! అప్పు డాపద్దెమునకు వన్నె దెచ్చితిరని చెప్పి తన చెవికుండలమును బట్టుకవియు, తనచెవికుండల

మును తిమ్మకవియు, రాజుముందఱం బెట్టి సమర్పించిరంట! రాజు వారి యౌదార్యమునకును సరసత్వమునకును మెచ్చి యిరువురకును నర్హా బహుమతులుచేసి సత్కరించి పంపెనంట!

రాయల యాస్థానమునందుఁ గొంతకాల మొకబట్టుకవి ప్రబలుఁడుగా నుండి యితరకవులను సరకుగొనక యవమానించుచుండఁగా పెద్దనాది కవులందఱును గూడి యొకనాఁడు తిమ్మకవి వాకిటఁ గూరుచుండి యాలోచించుచుండిరనియు, అప్పుడా బట్టా మార్గమునఁ బోవుచు వారిని జూచి వారికి వినఁబడునట్లుగాఁ దనభటుఁడైన మాధవునితో

క. వాకిటికావలి తిమ్మని। వాకిటికవికోటి మాధవా కిటికోటే

అనిపలికి పరిహాసించెననియు, అదివిని కుపితుడయి యాంధ్ర కవితా పితామహుఁడైన యల్లసాని పెద్దన

క. ప్రాకృత సంస్కృత ఘుర్జర। మూకీకృతకుకవితుంగముస్తాతతికిన్
వాకిటికావలి తిమ్మన। వాకిటికవికోటి మాధవా కిటికోటే.

అని పద్యమును బూరింపఁగా బట్టుకవి సిగ్గువడి తలవంచుకొని పోయెననియు ఒక కథను జెప్పుచున్నారు. వాకిటికావలి తిమ్మన నంది తిమ్మన కాఁడనియు అతఁడు రాజునొద్ద సేనాధిపతిగానుండి దుర్గసంరక్షణము చేయుచుండు పటిమొక తిమ్మనయనియు, అతఁడొకనాఁడు రాజభవనమువాకిట రాజిచ్చిన యమూల్యవస్త్రమును గప్పుకొని కావలి కాచుచుండఁగా రాజదర్శనార్థము లోపలికిఁ బోవుటకయి యచ్చటికి కల్లసాని పెద్దనయు, ముక్కుతిమ్మనయు, బట్టుమూర్తియు, తెనాలి రామకృష్ణుఁడును వచ్చి యాతనిజూచి వారిలోఁ బెద్దన మొదట

క. వాకిటి కావలితిమ్మా

అని పద్యము నారంభించి లోపలికిఁ బోయెననియు, అటుపిమ్మట నందితిమ్మన

ప్రాకటముగ సుకవివరులపాలిటి సామ్మా

అని రెండవచరణమును పూరించి లోనికిఁ జనియెననియు, తరువాత బట్టుమూర్తి

సీ కీదె పద్యము గొమ్మా

అనిపలికి లోపలి కరిగెననియు, కడపట వికటకవియైన రామకృష్ణుఁడు

నా కీపచ్చడమెచాలు నయమున నిమ్మా.

అని పద్యము పూర్తిచేయఁగా నతఁడు వెంటనే తనపచ్చడమును రామకృష్ణునిమీఁద వైచెననియు, రాజావార్తవిని యాతని సాహసౌదార్యములకు మెచ్చి గొప్ప బహుమానమిచ్చెననియు ఇంకొకకథను జెప్పుచున్నారు. ఇటువంటి కథలనేకము లున్నవి. ఒకనాఁడు రాయలవారాస్థానమునఁ గొలువుండి తన పార్శ్వములనున్న తిమ్మన్నను పెద్దన్నను బట్టుమూర్తిని జూచి వరుసఁగా తామరాకులోని నీటిబొట్టును కుక్కుటమును వరాహమును దిరస్కరించుచుఁ బద్యములను జెప్పుఁడని వేఁడఁగా వా రాశుకవిత్వముగా నీమూఁడు పద్యములను జెప్పిరఁట :—

ఉ. స్థానవిశేషమాత్రమునఁ దామరపాకున నీటిబొట్టు నీ
బూసిక మౌక్తికంబనుచుఁ బోల్చినమాత్రనె గర్వ మేటికిన్
మానవతీశిఖామణులమాలికలందును గూర్పవత్తువో
కానుక లియ్యవత్తువొ వికాసముఁ దెత్తువొ మేలు దెత్తువో :—

ముక్కుతిమ్మన.

శా. రంతు ల్మానుము కుక్కుటాధమ దరిద్రక్షుద్రశూద్రాంగణ
ప్రాంతోలూఖలమూలతండులకణగ్రాసంబుచేఁ గ్రొవ్వి దు
ర్దాంతాఖిలవిశేషభీషణధణాంతర్మాంసపంతోషిత
స్వాంతుండైన ఖగేంద్రుకట్టెదుట నీజంఝూటము ల్సాఁగునే—

పెద్దన్న.

ఉ. తక్కక నేల ముట్టిగొని త్రవ్వఁగనేర్తు నటంచుఁ దాఁకు తా
నొక్క లెజాతియంచు ముద మొందకు బుద్ధిని వెట్టిపంది నీ
వెక్కడ యాదిఘోణియన నెక్కడ యద్రిసముద్రదుర్గధా
త్ర్యాకుకతలంబు నొక్కయరపంటనె మింటికినెత్త నేర్తువే—

బట్టుమూర్తి.

ఈ తిమ్మకవి కవిత్వము శ్రుతికటువుగాక యర్థగాంభీర్యమును పదలాలిత్యమును గలదయి సలక్షణ మయినదిగా నున్నది. ఈయన శయ్యాలాలిత్యమును జూపుటకుఁ బూర్వోదాహృతము లైన పద్యములే చాలియున్నను పారిజాతాపహరణములోని మఱికొన్ని పద్యములను గూడ నిందుఁ బొందుపఱుచుచున్నాను :—

చ. అతులమహానుభావ మని యవ్విరిఁ దానొక పెద్ద చేసి య
చ్యుతునకు నిచ్చుకం బొదవ సూడిద యిచ్చిన నిచ్చెఁగాక తా
నతఁడు ప్రియంబు గల్గునెడ కర్పణచేసినఁ జేసెఁగాక యా
మతకరివేలుపుందపసి మమ్మేఁ దలంపఁగనేల యచ్చటన్— ఆ. ౧.

ఉ. ఓచెలి శౌరి కిచ్చెనట యొక్క లతాంతముఁ దెచ్చి నారదుం
డాచపలాక్షి కిచ్చెనట యాతఁడు నవ్విరి యిట్టిమాట లా
హా చెవుల న్వినంబడియుఁ బ్రాణము దాల్చెద మేన నింతగా
నోచితి నింక నెట్టిది కనుంగొని నెమ్మియి నున్నదాననో— ఆ. ౧.

చ. అరదము నెక్కి కేతనపటాంచలచంచల మైన తాల్మితోఁ
దురగజవంబు ము న్నడవఁద్రోచి కడం గెడు త త్తరంబుతోఁ
దిరిగెడుబండికండ్ల పగిదిన్ భ్రమియించు మనంబుతోడ నా
హరి చను దెంచె సత్యసముదంచితకాంచనసౌధవీథికిన్— ఆ. ౧.

మ. ఎలదేఁటు ల్తమవాఁ గన్నవలపై నిందీవరభ్రాంతిచే
మెలఁగం జేరలఁ గప్పుకో నలవిగామిం జీదఱం జెంది యి

చ్చులఁ గాంక్షించిరి నిర్నిమేషజలజాస్యల్మానుషత్వంబు ల
య్యళిభీతి న్ముకుళీకృతాక్షి యగుసత్యాకాంత నీక్షించుచున్. ఆ.౫

ఉ. తానటె పారిజాతవసుధారుహముం గొనిపోవువాఁడు క
న్గానఁడు యాదవుం డనుచుఁ గన్నులువేయును జేవురింప వై
శ్వానర ధర్మ దైత్యవర వారిధిపానిల యక్షనాయ కే
శానులదిక్కు చూచి కులిశంబు కరంబునఁ బూన్చి పట్టినన్. ఆ.౫

ఉ. సొమ్మన నెద్ది యే ననఁగ సొమ్మున కెవ్వఁడు కర్త వీవు నీ
సొమ్మఖిలప్రపంచమును శూరకులంబు నలంకరించు నీ
వమ్మహి నుండు నంతకు ననన్యము రాపము పారిజాతభూ
జమ్మును నుండు నన్న వికసన్ముఖుఁడై హరి వీడుకొల్పుచున్. ఆ.౫

---

# 4. ధూర్జటి కవి

ఇతఁడు పాకనాఁటి యాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; భరద్వాజగోత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు: కాళహస్తిపుర నిలయుఁడు; శివభక్తుఁడు. ఈతఁడు కృష్ణదేవరాయలకాలములో నున్నందున దాదాపుగా ౧౫౨౦ - 30 వ సంవత్సర ప్రాంతములం దున్నవాఁడని చెప్పవచ్చును. ఇతఁడు కాళహస్తిమహాత్మ్యమను నాలుగాశ్వాసములుగల పుస్తకమును, కాళహస్తీశ్వర శతకమును రచించి కాళహస్తీశ్వరున కంకితముచేసెను. ఈయన కవనము సలక్షణ మయి మిక్కిలి మధురముగా నుండును. ఈతని కవిత్వ మాధుర్యమున కాశ్చర్యపడి కృష్ణదేవరాయ లొకనాఁడు సభలోఁ గూరుచుండి తన యాస్థానకవులకు

చ. స్తుతమతి యైనయాంధ్రకవి ధూర్జటిపల్కులఁ కేల కల్గెనో
యతులిత మాధురీమహిమ—

అని సమస్య యిచ్చినట్లును వారిలో నొక రీక్రిందిరీతిని సమస్యా పూరణము చేసినట్లును చెప్పుచున్నారు:

చ. స్తుతమతి యైనయాంధ్రకవిధూర్జటిపల్కుల కేల గల్గెనో
యతులిత మాధురీమహిమ? హా తెలిసెన్ భువనైకమోహనో
ద్ధత సుకుమారవార వనితాజనతా ఘనతాపహారి సం
తత మధురాధరోదితసుధారసధారలు గ్రోలుటంజుమీ.

పయిపద్యమునుబట్టి చూడఁగా ధూర్జటికవి సంతత వేశ్యాప్రియుఁ డయిన రసికపురుషుఁ డయినట్టు కనుపట్టుచున్నాఁడు. అట్టి యఖండ శివ పూజాధురంధరుఁడైన భక్తాగ్రేసరుని నట్టి జారత్వదోష మేల విడువకుండెనో యూహింపఁజాలకున్నాము. మనదేశముయొక్క దౌర్భాగ్యము చేతఁ జిరకాలమునుండి యిచ్చట విశుద్ధచరిత్రము మతమునుండి విడిపోయినది. ఎట్టి దుశ్చరిత్రముగలవాఁ డయినను విభూతి, రుద్రాక్షలు మొదలయిన బాహ్యచిహ్నములను ధరించినమాత్రమున భక్తాగ్రేసరుఁడుగాఁ బరిగణింపఁబడుచున్నాఁడు. అయినను క్రమముగా నిప్పుడిప్పుడు మతమునకు సత్ప్రవర్తన మావశ్యకమన్న సత్యము జనుల మనస్సులలో నాటుకొనుచున్నందున కొంతయు సంతసిల్లవలసి యున్నది. ఈ మహాకవియొక్క కవితాధార తెలియుటకయి కాళహస్తిమహాత్మ్యములోని కొన్ని పద్యముల నిం దుదహరించుచున్నాను:-

చ. అమితము లైనజంతువుల కక్కడ నుత్తమ మధ్య మాధమ
త్వము లరయంగఁ గాన మపవర్గరమాసతిఁ బెండ్లియాడుచో
సమతయె కాని తత్పురముసాటిగ నన్యపురంబు లెన్నఁగా
నమరు నటన్న నా స్తిమితశైలకాంతర మంతియ వాసి చూచినన్. ౧౧

చ. పరిచితబంధనైపుణి నపారకళానుభవప్రసక్తి నా
దరసవివేకసంపద సహాశుకవాక్యసుధానుభూతి మో
హరహితవృత్తిఁ బ్రస్ఫురదనంగరహస్య విచారబుద్ధి న
ప్పురమునఁ గామినీజనులు పొల్తురు యోగిజనంబుపోలికన్. ఆ. ౧

శా. ఆవేళం బురపల్లవప్రకరనేత్రానందబాష్పాంబుధా
రావర్షాగమచంచలాలతిక దుర్వారప్రసూనాస్త్రి తే
జోవైశ్వానరసామిధేని రశనాసూత్రస్థితస్వర్ణపే
టీవిన్యస్తకపర్ది యొక్క కలకంఠీరత్న మేతెంచుచున్. ఆ. ౧

మ. ప్రణుతు ల్సేయుచుఁ గాంచెఁ గుంభజుఁడు లోపాముద్రతోఁగూడి ద
క్షిణకైలాసము నంబికాహరకృత శ్రీపాదుకాన్యాసమున్
మణిమంత్రౌషధవాసమున్ భవమహామాయావిపర్యాసమున్
గణనాతీత నటీవిలాసము సమగ్రశ్రీసముల్లాసమున్. ఆ. ౧

చ. పులులు కురంగముల్ కరటిపోతము లేనులు మన్నుఁబిళ్ళు దు
ప్పులు కణఁతుల్ కిటుల్ చెవులపోతులు కొర్నవగండ్లు భల్లుకం
బులు చమరీమృగంబు లెనుబోతులు కస్తురిపిల్లు లాదిగాఁ
గల మృగరాజిఁ బెక్కువిహగంబులఁ గానుక లంపెఁ దండ్రికిన్-ఆ.3.

# ౫. మాదయ్యగారి మల్లన్న

ఈతఁడుకూడ కృష్ణరాయని కాలములో నున్న లక్షణికుఁడయిన కవులలో నొకఁడు. (ఆవఱకు మల్లన్నయని మఱియొక కవి యుండి యుండుటచేత నీతని తండ్రి పేరితోడఁగూడఁ జేర్చి మాదయ్యగారి మల్లన్న యని చెప్పుదురు.) ఇతఁడు శైవబ్రాహ్మణుఁడు. కొండవీటి పురమందుండినవాఁడు. ఈతనికిఁ బూర్వమునందుండి (యేకాదశీమాహాత్మ్య మనునామాంతరము గల రుక్మాంగదచరిత్రమును రచియించిన మల్లన్న ప్రౌఢకవి మల్లన్న యనఁబడును) మాదయ్యగారి మల్లన్న రాజశేఖరచరిత్రమను మూడాశ్వాసముల గ్రంథమును యౌవనారంభ దశయందే రచియించెనఁట! ఈరాజశేఖర చరిత్రము నాదిండ్ల యప్పయామాత్యున కంకితము చేయఁబడినది. ఈకవి కృష్ణరాయల యనంతరము గూడ జీవించియుండుటచేత నించుమించుగా హూణశకము ౧౫౮౦ వ సంవత్సరప్రాంతమువఱకును బ్రతికియుండెనని చెప్పవచ్చును. ఈతని కవిత్వము మృదుమధుర పదగుంభనము కలదయి మనోహరముగా నున్నది. ఈ కవి చరిత్రమునుగూర్చి మఱియేమియుఁ దెలియకపోవుటచేత రాజశేఖర చరిత్రమునుండి కొన్ని పద్యముల నుదాహరించుచు విరమించుచున్నాను :—

ఉ. చొచ్చినఁ బోకుపోకు మనుచున్ నృపకేసరి తేరు డిగ్గి నీ
వెచ్చటి కేగిన న్వీడుతునే పటుబాణపరంపరాహతిన్
బచ్చడి చేయువాఁడ నని ఫాలనటద్భ్రుకుటీకరాళుఁడై
యిచ్చ నొకింతయేని చలియింపక తద్బిలవీథి దూఱఁగన్—ఆ. ౨.

ఉ. సాహసికాగ్రగామి నృపసత్తముఁ డట్లు తదీయ ఘోరమా
యామహిమల్ హరింపుచు నిరంకుశ విక్రమకేళిఁ జూప ను

త్సాహము తక్కి యాత్మపురిచక్కటి నొప్పెడుకాళికా
గేహముచొచ్చి తద్దనుజకీటము పాటిలుభీతి పెంపునన్—ఆ. ౨.

మ. కలమాన్నంబు ఘృతంబుఁ బాయసము శాకవ్రాతము ల్పిండివం
టలుఁ బా త్తేసియ జున్ను వెన్నయిడి నూనా లుక్కెర ల్చక్కెరల్
ఫలము ల్పానకము ల్రసాయనము లంబ ళ్ళూరుఁబిం డ్లూరుఁగా
యలు బజ్జు ల్దధిపిండఖండములు నం దావిర్భవించె న్వెసన్— ఆ. ౨.

శా. కేళీకాంచనసౌధవీథికలచక్కిం దొట్లలోఁ బెట్టి యో
ప్రాలేయాచలకన్య కాధవకృపాపారంగతా నిద్రవో
వే లావణ్యపయోనిధీ యనుచు నావిర్భూతమోదంబుతో
జోలల్పాడుదు రక్కుమారకునకున్ శుద్ధాంత కాంతామణుల్-ఆ.౨

ఉ. రాహువుఁగాను ని న్నరగరాచినశూలినిగాను సీతను
ద్రోహముచేసినట్టియలరోహిణితండ్రినిగాను దజ్జగ
న్మోహిని నీలనీలకచ ముద్దులచక్కెరబొమ్మఁ గూర్ప క
య్యో హరిణాంశ తావకమయూఖముఖంబుల నేచ నేటికిన్—ఆ.౨.

వెనుకటి కూర్పులయందుఁ బయివిధమునఁ బ్రకటించినతరువాత, ఈటీవల నాకు రాజశేఖరచరిత్రము సమగ్ర మయిన ప్రతియొకటి దొరకినది. అందలి యాశ్వాసాద్యంతముల యందుండిన ఈ క్రిందిపద్యములను బట్టి కృతిపతి యింటిపేరు నాదిండ్లవారనియు, పేరప్పామాత్యుఁడనియు, అతఁడాఱువేల నియోగిబ్రాహ్మణుఁ డనియు, కృష్ణమాంబాకుమారుఁ డనియు, మంత్రియు దండనాథుఁడు ననియు, తెలియవచ్చుచున్నది.—

శా. వైరించప్రతిభావదావదవచోవైయాత్య సాతత్యస
త్యారూఢస్థితిపాండవాగ్రజ మహీయస్స్వచ్ఛకీర్తిచ్ఛటా
పారావారనిమగ్నశత్రుగణ శుంభత్పూర్వ భూభృద్దిశా
నారీమన్మథ బంధురక్షణచణా నాదిండ్లవంశాగ్రణీ—ఆ. ౧.

మాలిని. హరిచరణపయోజధ్యానసంధానమార్గా
స్థిరమతిగుణధారా శిష్టశాఘప్రచారా
సురసురభివితీర్ణి స్తోత్రపాత్రప్రకారా
గిరిచరదరివీరా కృష్ణమాంబాకుమారా!—ఆ. ౧.

క. శ్రీరమణీరమణీయుని । సారాయితసూత్నరోచనాంభోజయుగా
దోరమితికీర్తినిరసిత । తారకుభృత్కాశ యప్పదండాధీశా— ఆ. ౨.

సుగంధి. సారదప్రభావిభాసిభద్రకీర్తివాహినీ
పూర దానధూలదివ్యభూజకామధేను దు
ర్వార యాఱువేలవంశవార్ధిపూర్ణచంద్రమా
సాగబుద్ధిజాలనీతశత్రుభూమిభృద్రమా— ఆ. ౨.

క. శ్రీచక్రచారుకుచయుగ । సూచకగాఢోపగూహసూచితపులక
ప్రాచుర్య తత్త్వతత్పర । యాచకసంస్తుత్య మంత్రియప్పామాత్యా.—

ఈ యప్పామాత్యుఁడు కృష్ణదేవరాయని మంత్రియైన తిమ్మరుసున కల్లుఁడు. మాదయ్యగారి మల్లన్న తా నఘోరశివశిష్యుఁడయిన ట్లాశ్వాసాంతగద్యమున నిట్లు తెలిపికొనియున్నాఁడు :-

"ఇది శ్రీమదఘోరశివాచార్యగురు కరుణావిశేషలబ్ధ సారసారస్వత మాదయామాత్యపుత్ర మల్లయనామధేయ ప్రణీతంబైన రాజశేఖర చరిత్రంబను మహాప్రబంధంబునందు సర్వంబును దృతీయాశ్వాసము."

ఈ యప్పామాత్యుఁడు కవిని,

ఉ. శంకరపాదసేవ నవశంవదమానస పంకజాత ని
శ్శంకవచోవిలాస రుచిసారవినిర్జితపూర్ణపూర్ణిమా
శాంక దురక్షరాన నభయంకర శౌనకగోత్రపాత్ర య
య్యంకిపురాగ్రహారవిభవాకర మాదయమల్లసత్కవీ.

అని సంబోధించి యుండుటచేత మల్లన శౌనకగోత్రసంజాతుఁ డనియు, అయ్యంకిపురాగ్రహారస్వామి యనియు తెలియవచ్చుచున్నది. అయ్యంకి

కృష్ణామండలములోని చల్లపల్లిసంస్థానములో మచిలీబందరునకు పడునాలుగు మైళ్ళదూరములో నున్నది. దీనినిబట్టి కవి కృష్ణామండలములోని వాఁడగుట స్పష్టము. ఈకవిశ్రేష్ఠుఁడు కృత్యాదియందు

గీ. సరసనంస్కృతపుష్పగుచ్ఛప్రభూత
మగుతెనుంగనునెత్తావి కఖిలదిశలఁ
దరుణపమానమగు కవిత్రయవిశేష
చతురవాచానిరూఢి కంజలి యొనర్చి

అని పూర్వకవిస్తుతి చేసి

క. చెప్పఁదగుఁ గవిత రసముల్
చిప్పిల నప్పప్ప బళిబళీ యన లేదా
యెప్పుడుఁ జేయకయుండుటె
యొప్పఁజూమీ సుకవి కెంతయుచితజ్ఞుఁడొకో.

శా. గాఢార్థప్రతిపాదనక్రమకళాకౌశల్యము ల్లేక వా
చాఢక్కార్భటితోడఁ దామ తము మర్యాయఁచుఁ గైవారముల్
ప్రౌఢింజేయుచుఁ బ్రాజ్ఞుల న్నగుచు గర్వగ్రంథులై యుండు న
మ్మూఢస్వాంతుల మెచ్చకుండుటయె సమ్మోదంబు మాబోంట్లకున్.

సుకవియగువాఁడు కవిత్వముఁ జెప్పినచో రసము లుప్పతిల్లునట్లుగాఁ జెప్పవలయును లేదా యూరకుండవలయు ననియుఁ జెప్పి కేవలవాగాడంబరమును జూపువారియెడఁ దిరస్కృతినిజూపెను. కవి కృతిపతి మామగారును కృష్ణదేవరాయనిమంత్రియు నయిన తిమ్మరుసును వర్ణించి, అప్పామాత్యుఁడు తిమ్మరుసు కూఁతురైన తిరుమలాంబను పెండ్లియైన వార్త నీక్రిందిపద్యములలోఁ జెప్పెను—

సీ. ఏమంత్రిమణి నిజస్వామికార్యక్రియాతత్పరమానసోత్సాహశాలి
యేమంత్రిమణి మిత్రహితబాంధవాశ్రితప్రకరరక్షణకళాప్రౌఢబుద్ధి
యేమంత్రిమణి వచోహేలాతినైర్మల్యశీతలతాధూతశీతరోచి

యేమంత్రిమణి సుధాధామశాంభవధామధాళధళ్యసుతుల్యధవళకీర్తి
యట్టి మంత్రికులోత్తంస మహితనృపతి
పటలమకుటాగ్రఘటితపత్పద్మయుగళి
సకలకర్ణాటరక్షావిచక్షణుండు
దీనసురశాఖి సాళువతిమ్మమంత్రి.

సీ. అమ్మహామంత్రి కతనియర్థాంగలక్ష్మిఁ
సకలపుణ్యాంగనాజనశ్లాఘనీయ
లక్ష్మమాంబకు నుదయించి లలినిమెఱయు
తిరుమలాంబికఁ బెండ్లియై తేజరిల్లె.

కృతిపతియొక్క తమ్ముఁడైన గోపనయు గుత్తిదుర్గమునకు దండనాథుఁడయి యుండినట్లు కవి యీక్రిందిపద్యమునఁ జెప్పియున్నాఁడు—

ఉ. ప్రాపితరాజ్యుఁడై భవ నిరాకృతిపాకవిరోధియైన యా
గోపనమంత్రి ధర్మధనగోపనసమ్మతిగుత్తిదుర్గల
క్ష్మీపరిపాలనక్రమసమిద్ధభుజాబలశాలి రూపరే
ఖాపరమత్స్యలాంఛనుఁ డయావహకార్యధురంధరుం డిలన్.

కృతిపతియైన నాదెళ్లయప్పామాత్యుని ముత్తాతతమ్ముఁడైన చిట్టిగంగన్న కృష్ణదేవరాయుని తాతయగు నీశ్వరరాజునకుఁ బ్రభువుగా నుండినట్టియు జైమినిభారతకృతిపతి యయినట్టియు సాళువనారసింహరాజునొద్ద మంత్రిగానున్నట్లు చెప్పిన యీక్రింది పద్యము కవికాలనిర్ణయమునకుఁ దోడుపడునదియే యయినను దీనిసాహాయ్య మక్కఱలేకయే కృతిపతి తిమ్మరుసునుజామాత యగుటచేతనే కవికాలము మనకుఁ దెలియ వచ్చినది—

ఉ. సాళువనారసింహమనుజప్రభుకార్యకళాధురంధరుం
డై లవణాబ్ధివేష్టితధరాధిపదుర్మతమంత్రమంత్రిశుం

డాలవిత్రానకేసరి యనంగ ననంగసమానరూప రే
ఖాలలితాంగుఁ డట్టిచిటిగంగన యొప్పు గుణానుషంగుఁడై.

రాజశేఖర చరిత్రమునందలి పద్యములు మృదుమధురవాగ్గుంభనము కలవయి ముద్దుపలుకులచే వీనులకు విందు గొలుపుచున్నవి. రాజశేఖర చరిత్రమునుండి యీవఱ కుదాహరింపఁబడిన పద్యములన్నియు ద్వితీయాశ్వాసములోనివే యైనందున మఱికొన్ని పద్యముల నిందుదాహరించుచున్నాను :—

ఉ. చందురువంటి నెమ్మొగము చక్కటిదూలఁగఁ బుట్టువెండ్రుకల్
కెందలిరాకుఁబాదములఁ గీల్కొనఁ జేసినయట్టిచిన్నిపైఁ
దంజెలు గల్లుగల్లుమన నాడుచు నల్లన జేరవచ్చి నా
ముందఱనాడ నెన్నఁడొకో ముద్దియముద్దుఁగుమారుఁగాంచుటల్ - ఆ ౧

శా. రాజచ్చంద్రశిలాతలాంతరలతారమ్యప్రదేశంబులన్
గాజుం గుప్పెలలోనియచ్ఛతరగంగావారి నోలార్చి యా
రాజున్ దేవులు మంత్రపూతముగ హేరాళంపుఁబూగుత్తులం
బూజ ల్సేయుదు రిచ్చలం జెలఁగి ముప్పూటం బురారాతికిన్ — ఆ. ౧

ఉ. పాలిక మేలుకొల్పి నరపాలశిఖామణి వింటివే వినీ
లాలక నిన్నరేయి యొకయచ్చెరు వాశ్రితపారిజాత మ
బ్బాలశశాంకమౌళి మనపాలిటికొంగుపసిండి మందమం
దాలసలీల వచ్చె దరహాసవిభాసిముఖారవిందుఁడై — ఆ. ౧

ఉ. ముంపటి రాజ్యగర్వమున ముందఱఁగానవుగాక ధాత్రిఁ బా
లింపరొ తొంటిరాజులు దిలీపముఖుల్ మునికోటికూఁత లా
లింపరొ నోంపరో మదవిలీఢకఠోరనిశాటఝాటముల్
నింపరొ దిక్కటాహముల నిర్మలకీర్తిసుధాంశుచంద్రికల్ — ఆ. ౩

శా. ఓరోరీ కలగంటివో భ్రమసితో యుగ్రాహవాటోపదు
ర్వారప్రక్రమమామకీనభుజగర్వం బెన్నరో కాక నా

పే రెవ్వారు నెఱుంగరో యకట నిర్భీతి న్నరుండెవ్వఁడేఁ
జేరన్వచ్చునె నన్ను బెబ్బులిపయిం జింబోతునుం బంచునే— ఆ.౨

ఉ.–రమ్మ నృపాల నీదగుపరాక్రమకేళికిఁ జాలమెచ్చి మా
యమ్మ భవాని సంయమికులాగ్రణికూరిమిబిడ్డ నిచ్చి రాఁ
బొమ్మన వచ్చితిన్ శిఖరిపుత్రికసేవకురాల నాదుగే
హమ్మున నున్న యప్పడుచు నప్పనచేసెద నంచుఁ బల్కినన్—ఆ.౨

ఉ. ప్రన్ననిపాదముల్ చిలుకపాటినఁ గందెడు మేనుదీఁగెయున్
వెన్నెలవారునెమ్మొగము నిద్దపుముద్దుమెఱుంగుజెక్కులున్
క్రొన్నెలవంటి నెన్నుదురుఁ గోమలబాహుమృణాళయుగ్మమున్
గన్నులఁగట్టినట్లు పొడగానఁగనయ్యెఁడు నాకు నెచ్చెలీ—ఆ. ౨

చ. అగునగునయ్య యచ్చెలియ యట్టిద యెంత నుతింప నంతకున్
దగుఁదగు మర్త్యలోకవనితావినుతాంగి యొనన
ద్విగుణితచంద్రమండల తదీయసితాతకటాక్షపాతముల్
తగిలిన మారుఁ డెవ్వరి హాళాహాళిసేయఁడు వాఁడితూపులన్- ఆ 3

మ. కులనిర్మూలనకారణంబు ప్రతిభాకుట్టాక ముద్వేగకో
పలతాదోహద మాజవంజవసుఖప్రత్యూహ మాత్మవ్యధా
జ్వలనజ్వాలిక కామినీనయనవీక్షాపాతసంరోధి ని
త్యలఘుత్వాశ్రయభూమి లేమి యది యాహా యేమి గావింపదే-ఆ 3

ఉ. రాములు కేళికాననధరాస్థలికిన్ మును క్రీడసల్ప రా
రో మనసారఁ గమ్మనివిరుత్తమనేర్పులఁ గోసికొంచుఁ బో
రో మదవృత్తి నీగతి మరుల్గొని పోరినవారిఁ గాన మొం
డేమనువారమమ్మ తరళేక్షణ ప్రాంతఫలం బిటుండఁగన్ —ఆ. 3

చ. కలితసుధారసంబు దొలఁకన్ సరసప్రియభాషణంబులం
బలికిన శీతకాలమగుఁ బల్లవపాదములెత్తి లీలమై

మెలఁగ వసంతకాలమగు మించుఁగనుంగవఁ దేఱఁజూచినన్
దలఁకొను కారుకాలమగుఁ దస్వవిలాసవిచిత్ర మెన్నఁగన్ — ఆ. 3

శా. డాకేల న్నిజకన్యకామణులకంఠశ్రేణిఁ గీలించి వీ
ణాకంజాతము లాత్మపాదనఖరేఖం దార్చి సంగీతవి
ద్యాకౌశల్యము గానరా మతికి నాహ్లాదంబు సంధిల్ల గౌ
రీకళ్యాణముఁ బాడిరప్పుడు పురంధ్రీరత్నము ల్వేడుకన్ — ఆ. 3

---

# 6. తాళ్ళపాక చిన్నన్న

(అష్టమహిషీకళ్యాణ మనుద్విపదకావ్యమును రచియించిన యీ కవి కృష్ణదేవరాయల కాలమునందున్నవాఁడు.)

గీ. చిన్నన్న ద్విపద కెఱఁగును
బన్నుగఁ బెదతిరుమలయ్య పదమున కెఱఁగున్
మిన్నంది మొరసె నరసిం
గన్నకవిత్వంబు పద్యగద్యశ్రేణిన్.

అని యప్పకవి తెనాలిరామకృష్ణమ్మ చెప్పినట్లుగా నుదాహరించిన పద్యమువలన నితఁడు ద్విపదను నిర్దుష్టముగాను మనోహరముగాను రచించినట్లు కనుపట్టుచున్నది. లక్షణగ్రంథములయం దుదాహరింపఁబడిన చిన్నముక్కలు దక్క నీతనిపుస్తకము నాకు లభింపలేదు. ఈక్రింది రెండు పంక్తులు నప్పకవీయమునం దుదాహరింపఁబడియున్నవి.

ఇంతుల మేల్బంతి యిడినసేవంతి
బంతి చేదోయి నుపాయన మిచ్చి — అష్టమహిషీకళ్యాణము.

రంగరాట్ఛందమునం దీక్రిందిపంక్తు లుదాహరింపఁబడినవి—

ఉన్నాఁడు తడవుగా నున్నాఁ డతండు
మన్నాఁడు మమ్ముఁ బెమ్మన్నాఁ డటన్న.—అష్టమహిషీకళ్యాణము.

---

# 7. సంకుసాల నృసింహకవి

[ఇతఁడు కవికర్ణరసాయన మను మాంధాతృచరిత్రమును రచియించిన మహాకవి. ఈ కవి కృష్ణదేవరాయనికాలమునం దుండె ననుటనుగూర్చి యొకకథ గలదు.] దానినిచ్చట సంక్షేపించి చెప్పుచున్నాను. పెద్దన్న మనుచరిత్రమును రచించినతరువాత నృసింహకవి కష్టపడి కవికర్ణరసాయనమును జేసి, దానిని కృష్ణదేవరాయని కంకితము చేయఁ దలఁచి, విజయనగరమునకువచ్చి తదాస్థానకవియైన పెద్దన్నను దర్శించి, తనగ్రంథము నామూలాగ్రముగా నాతనికి వినిపించి, రాజదర్శనము చేయింపవలెనని వేఁడెనఁట! ఆంధ్రకవితాపితామహుఁ డాగ్రంథచమత్కారమున కద్భుతపడి, అట్టిగ్రంథమును రాజునకుఁ జూపినయెడలఁ దన మనుచరిత్రముమీఁది గౌరవము తగ్గునని యెంచి, ఈర్ష్యచేత నాతనికి రాజదర్శనము కానియ్యక 'యిదిగో, అదిగో' అని చిరకాలము గడపి యూరక పంపివేసెనఁట! అతఁడు రాజాస్థానమున లాభప్రాప్తి లేకపోఁగా మీఁదు మిక్కిలి తనవెంటఁ దెచ్చుకొన్న కాసుపైసములను సహితము వ్యయపెట్టుకొని, దినభుక్తి జరగక తనపుస్తకములోని కొన్నిపద్యములను విక్రయింపవలసినవాఁ డయి, తుదకు విసిగి రాజులను దూషించుచు లేచిపోయి తనగ్రంథమును శ్రీరంగనాథున కంకితముచేసి కృతార్థుఁ డయ్యెనఁట! అప్పుడు విక్రయింపఁబడిన పద్యములలో నొకటి రెండెట్లో కృష్ణదేవరాయల కూఁతురైన మోహనాంగిచేతిలోఁ బడెనఁట! [కృష్ణరాయనికి మహావిదుషియైన మోహనాంగి యనుకూఁతురు గలదనియు, ఆమె యనుపమానసాహిత్యము కలదయి మారీచిపరిణయ మనుశృంగారప్రబంధమును రచియించె ననియు, రామరాజుభార్య యనియు కొందఱు వ్రాసియున్నారు. ఆగ్రంథము నాకు లభించినది కాదు. రామరాజు భార్యపేరు తిరుమలాంబ. అయినను తిరుమలాంబకు

మోహనాంగి యనునామాంతర ముండిన నుండియుండవచ్చును. ఆచిన్నది యొక్కనాఁడు తండ్రితో చతురంగ మాడుచు, తనబలము లోని బంటొకటి మంత్రియొక్కయు, నేనుఁగుయొక్కయు నగచేత తోలఁగవలసి వచ్చినప్పుడు "ఉద్ధతుల మధ్యమునఁ బేద కుండఁదరమె" యని చదివెనఁట! అదివిని రాజు పద్యమంతయుఁ జదువుమని పుత్రి నడుగఁగా నామె కవికర్ణరసాయనములోని మూఁడవయాశ్వాసమునందలి యీపద్యము నిట్లు చదివెనఁట—

గీ. ఒత్తుకొనివచ్చుకటికుచోద్వృత్తిఁ జూచి
తరుణితనుమధ్య మెచటికో తలఁగిపోయె
నుండెనేనియుఁ గనఁబడ కున్నె యహహా!
యుద్ధతులమధ్యమునఁ బేద కుండఁదరమె?

అప్పుడు రాజాపద్యముయొక్క చమత్కృతి కానందించి యెక్కడి దని యడిగి తెలిసికొని పెద్దన్న చేసినమోసము నెఱిఁగి ఖేద పడెనఁట!

రాజసంస్థానమునందుఁ దనకుఁ గలిగినయనాదరణచేత కుపితుఁ డయియే నృసింహకవి తనమాంధాతృచరిత్రమునం దీక్రింది రాజదూషణ పద్యమును జొప్పించెనని చెప్పుదురు —

సీ. ఆందోళికలయందు నంతరచరులై నసదికృతాకృతులపిశాచజనులు
పరకరాళంబులై ప్రార్థింపఁ గనుఁగొనక వాయెత్తకుండుజీవచ్ఛవములు
వాలవీజనములఁ గ్రాలుచు నీఁగకు నంటీనిఖరవర్తులాండసములు
వేత్రపరంపరావిలకంటకావృతిఁ జేరఁ బోరానిబర్బూరతరులు
శంఖనాగస్వరస్వరశ్రవణసమద
విస్ఫుటచ్ఛత్రవిస్ఫారితస్ఫటాక
విష్టవిషవైద్యవశవర్తి దుష్టఫణులు
ప్రభుదురాత్ముల సెవ్వాఁడు ప్రస్తుతించు.

అయినను పయికథ యిటీవలివారిచేత నెవ్వరిచేతనో కల్పింపఁబడినట్లు తోఁచుచున్నది. (ఆంధ్రకవితాపితామహుఁ డైన యల్లసాని పెద్దన్న యంత యసూయాగ్రస్తుఁ డగుటకుఁ దగినకారణ మేదియుఁ గానరాదు.) కవికర్ణరసాయనము మొత్తముమీఁద మంచిదే యయినను, పెద్దనార్యకృత మయిన మనుచరిత్రముకంటె నేవిషయమునందును గుణాతిశయము గలదికాదు.

గీ. యతి విటుఁడుగాకపోవు టె ట్లస్మదీయ
కావ్యశృంగారవర్ణ నాకర్ణనమున ?
విటుఁడు యతిగాకపోరాదు వెస మదీయ
కావ్యవైరాగ్యవర్ణనాకర్ణనమున.

అని నృసింహకవి తన కవిత్వసామర్థ్యమును గూర్చి గ్రంథాదియం దాత్మస్తుతి చేసికొని యున్నాఁడు. మఱియుఁ దక్కిన కవుల వలెఁగాక కుకవిదూషణముఁ బెక్కుపద్యములతోఁ జేసియున్నాఁడు. కాఁబట్టి యితఁడు స్వాతిశయభావము గలవాఁ డయినట్టు కనుపట్టుచున్నాఁడు. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడయినను భట్టపరాశరాచార్యుల శిష్యుఁడై వైష్ణవమతమునం దధికాభిమానము కలవాఁడై యుండెను. మాంధాతృచరిత్రము విశేషభాగము దీర్ఘసమాస సంస్కృతపద భూయిష్ఠముగా నున్నను బహుస్థలములయందు తెలుఁగుపదములతోను చక్కని లోకోక్తులతోను గూడఁ గూడియున్నది. చేసినవర్ణనము లనేకములు హృదయాహ్లాదకరములుగా నున్నవి. కవిత్వమునం దక్కడక్కడఁ గవిత్రయము వారి ప్రయోగములకు విరుద్ధములైన ప్రయోగములు కానఁబడుచున్నవి. ఈ కవియొక్క కవనసైపుణిని జూపుటకయి కవికర్ణ రసాయనములోని కొన్ని పద్యముల నిందుదాహరించుచున్నాను:—

శా. ఫణీలోచన లాత్మనవ క్త్రరుచిచే నేణాంకసౌభాగ్య మ
క్షీణప్రౌఢి హరింప సౌధపరిసంకీర్ణేంద్రనీలోపల

శ్రేణీనిర్మలకుట్టిమంబులపయిన్ శీతాంశుఁడంబేదయై
ప్రాణాచారము వడ్డయట్లు ప్రతిబింబవ్యాప్తి చూడందగున్—ఆ. ౧

ఉ. గర్భమునిల్చి కుక్షి యధికంబుగఁ గానఁగవచ్చి గ్రక్కునన్
దుర్భరతీవ్రవేదనలఁ దూలుచు సోలుచు నేల వ్రాలఁగా
నర్భకుఁ డొక్కఁ డయ్యెను కులాగ్రణిగర్భ మగల్చికొంచు నా
విర్భవ మొందె భూజనులు విస్మయమగ్నులుగాఁగ నయ్యెడన్—ఆ౧

క. కా కేమి తన్నుఁ దిట్టెనె?
కోకిల తన కేమి ధనము కో కొమ్మనెనే?
లోకము పగ యగుఁ బరుసని
వాకునఁ జుట్ట మగు మధురవాక్యమువలనన్.

ఉ. ప్రోడవుగాన నీ పలుకు పోలదు కాదనరాదుగాక యీ
వీడినతాపవేదనల వేఁగెదుచెన్నటిమేనఁ బ్రాణముల్
కూడి వసింపనోర్వ వివిగో చనుచున్నవి యేల వ్రీడయుం
గ్రీడయు నాకు హారమును గీరముఁ జూతము గీతముం జెలీ— ఆ. 3

మ. పటికి న్నార్చినలీలఁ జందనముఁ బైఁబైఁబూయ నంగారక
చ్ఛటలం గాచు తెఱంగునం జిగురుసెజ్జం బోర్లఁగా నప్పుట
ప్పటికిం జేరఁగనిల్చిన ట్లొడలిపైఁ బన్నీరు చల్లంగ ను
త్కటమయ్యెం బెనుకాక బంగరుసలాకంబోలు నబ్బాలకున్— ఆ.3

గీ. తొట్రుకొను నడ్గులును వెడద్రొక్కుపల్కు
లుల్లముల సిగ్గుఱుంగమియును ఘటించి,
జవ్వనులకును మరల శైశవముఁ దెచ్చు
వారుణియు నెట్టిసిద్ధౌషధీరసంబొ—ఆ. ౪

ఉ. లజ్జకుఁ బాపు శీలముఁ గులంబు వడి న్వెడిపించు సూనృతం
బుజ్జనసేయఁ జేయు మొగమోటమిఁ దూలుచుఁ బాతకంబులన్

మజ్జన మార్చు నార్చు నభిమానము రోఁతల కియ్యకొల్పు నీ
ముజ్జగ మైనఁ ద్రిప్పు దుదిముట్టదు తా ధనకాంక్ష యేరికిన్ - ఆ. ౫

ఉ. ఏకడఁజొచ్చునో సుకృత మెచ్చటడాఁగునో తృప్తి యెప్పుడో
పోకడ శాంతి కెం దడఁగిపోవునో సౌఖ్యము మాన మేమియౌ
నో కృప యెట్లు మాయ మగునో యశ మేగహనంబుదూఱునో
లోకమునం దెఱుంగ మొకలోభ మెదిర్చినమాత్రఁ జిత్రమై— ఆ. ౫

ఉ. ఖండసుధాకరాలికలు గాఢవిరక్తిఁ దపస్విశిష్యులై
యుండిరి పూవుదప్పుటకు నుల్లము రోసి రతీశుఁ డిక్షుకో
దండముఁ బుష్పబాణములతండముఁ బాఱఁగవైచి చేతులన్
దండమునుం గమండలువుఁ దాలిచి మస్కరి గాకయుండునే— ఆ. ౬

---

## 8. కాసె సర్వప్ప

(ఇతఁడు సిద్ధేశ్వరచరిత్ర మనునామాంతరముగల ప్రతాపచరిత్రమును ద్విపదకావ్యముగా రచించెను. ఈకవికాల మెప్పుడో నిశ్చయముగాఁ దెలియదుగాని యితని గ్రంథము మిక్కిలి పురాతన మైనదనుటకు సందేహము లేదు. ఇతఁడు ప్రతాపరుద్రుని యనంతరమునఁ గొంతకాల మయినతరువాత నుండినవాఁడు) ఈతని కవిత్వమునందు లక్షణవిరుద్ధము లైనప్రయోగము లనేకములు గానఁబడుచున్నను, చరిత్రముగా నీగ్రంథము మిక్కిలి యుపయుక్త మయినది. ఈతని గ్రంథమునుండియే కూచిమంచి జగ్గకవి తనసోమదేవరాజీయమునందు విశేషభాగమును గ్రహించి యున్నాఁడు. తిక్కన సోమయాజి చరిత్రమునం దీగ్రంథమునుండి కొంతభాగ ముదాహరింపఁబడినందున, ఇందుండి యిప్పుడు గొన్నిపంక్తులు మాత్రమే గ్రహింపఁబడును.

ద్వి. గణపప్రసాదతఁ గలిగినసుతుని
గణపతినామంబు ఘనముగాఁ బెట్టి
తూర్పుదేశం జేగి తూర్పురాజులను
నేర్పుతో సాధించి యోర్పుమీఱంగఁ
బాండుదేశాధీశు బాహుబలాఢ్యుఁ
గాండంబులనుగొని గం డడఁగించి
చండవిక్రమకళాసారదుర్వార
పాండిత్య ధనురస్త్రభద్రుఁ డారుద్రు ఁ&c.

*   *   *   *

ఇది శ్రీసకలవిద్వదిభపాదకమల
సదమలసేవన సభ్యసంస్మరణ
భాసురసాధుభావనగుణానూన
భూసురాశీర్వాద పూజసేయుండు
కాసె మల్లనమంత్రి ఘనకుమారుండు
వాసిగాఁ జెప్పె సర్వప్పనునతఁడు.

# 9. భాస్కరపంతులు

ఈకవి కన్యకాపురాణమనెడి యెనిమిదాశ్వాసముల పద్యకావ్యమును రచించెను. రాజరాజనరేంద్రుని తండ్రియైన విష్ణువర్ధనమహారాజు గోదావరీమండలములోని పెనుగొండలోనుండిన కుసుమసెట్టియను కోమటియొక్క కొమార్తెను కామించి యామెను తన కిమ్మని యడుగఁగా తండ్రి యియ్యనన్నట్టును, అందుమీఁద విష్ణువర్ధనుఁ డాకన్యను బలాత్కారముచేత గ్రహించుటకుఁ బ్రయత్నింపఁగా కుసుమసెట్టియు కూఁతురును నూటరెండు గోత్రముల యితరవైశ్యులును నగ్నిహోత్రములోఁబడి మృతులయినట్టును, కోమట్లలో నూఱుకుటుంబములు పడమటకును, ఎనుబది కుటుంబములు తూర్పునకును, ఇన్నూఱు కుటుంబములు దక్షిణమునకును, నూటముప్పది కుటుంబము లుత్తరమునకును పాఱిపోయినట్టును, కన్యకాశాపముచేత విష్ణువర్ధనుఁడు శిరస్సు వ్రక్కలయి చావఁగా నాతనిపుత్రుఁ డయిన రాజనరేంద్రుఁడు వైశ్యులను శాంతపఱిచి కుసుమసెట్టి కొడుకైన విరూపాక్షుని పదునెనిమిదిపట్టణముల కధికారినిజేసి మిగిలిన కోమట్లను పెనుగొండలో నుండునట్లు చేసినట్టును ఇందుఁ జెప్పఁబడినది. ఇప్పటికిని పెనుగొండ కోమట్లకు ముఖ్యస్థలము. అక్కడ కన్యకాపరమేశ్వరిపేర దేవాలయము కట్టఁబడి వైశ్యులచే మిక్కిలి గౌరవముతో చూడఁబడుచున్నది. గ్రంథకర్తయైన భాస్కరపంతులను బ్రాహ్మణుఁడు పెనుగొండ, కొండవీడు, రాజమహేంద్రవరము మొదలయిన ప్రదేశములయందుండిన కోమట్లకు గురువయియుండి కన్యకాపురాణమును రచించి, వైశ్యులవిషయమయి కొన్ని కట్టుపాట్లుమఁజేసి, నూటరెండు గోత్రములవారి నాకట్టుఁబాట్లకు లోఁబఱిచి, తత్కట్టుపాట్లను మీఱినవారిని వర్ణభ్రష్టులనుగా బహిష్కరించి తనకు వశ్యులయినవారికిఁ దా నాచార్యుఁడును పురోహితుఁడును

నయ్యెను. గ్రంథసామగ్రి తక్కువగుటచేత నీతనికాలమిదియని నాకిప్పుడు నిశ్చయముగాఁ దెలియక పోయినను, ఇతఁడు పదునాఱవశతాబ్దమునకు బూర్వుఁడని తెలియవచ్చుచున్నది.) ఈతని కన్యకాపురాణమునుండి రెండు పద్యముల నిం దుదాహరించుచున్నాను.—

ఉ. అంతట నింగితజ్ఞుఁ డగునాకుసుమాఖ్యుఁడు నాదరంబునన్
గాంతను జూచి పల్కె ననుకంప దలిర్పఁగ నీమనంబునన్
జింత వహించి యిట్లునికి చెప్పుము నీకు మనోరథార్థముల్
సంతసమంద నిత్తును విచారము మానుము దైన్య మేటికిన్. ఆ. ౫.

చ. జలనిధి మేరదప్పిన నిశాకరబింబము త్రోవదప్పినన్
బలువిడి ధాత్రి క్రుంగినను భాస్కరుఁ డిట్లుదయింపకుండినన్
గులగిరి సంచలించినను గూర్మము భూమి భరింప కుండినన్
బలికిన బొంకనేరరు కృపాసధులై తగువైశ్యు లెప్పుడున్. ఆ. ౭.

---

# 10. బైచరాజు వేంకటనాథకవి

(ఇతఁడు పంచతంత్రమును పద్యకావ్యమునుగా రచియించెను. ఈ కవి క్షత్రియుఁడు ఈతని తాతయైన బైచరాజునుబట్టి యీ కవి కీయింటిపేరు కలిగినట్లు తోఁచుచున్నది.) కవి తనవంశకర్తయైన బైచరాజు నిట్లు వర్ణించియున్నాఁడు :—

ఉ. ధీరత రాజవంశజలధిం బ్రభవించె మహావిరోధిసం
హారవిహారి సాళ్వబిరుదాంకుఁడు బైచనృపాలుఁ డద్ధరి
త్రీరమణీమనోహరునితీవ్రయశస్స్ఫురితికిన్ హరాద్రినీ
హారవసుంధరాధరము లయ్యె సమగ్రవిహారశైలముల్.

ఈ కవికాలమును సరిగా నిర్ణయించుటకుఁ దగిన యాధారము లేవియు దొరికినవి కావు. తమనిఘంటువునందు బ్రౌన్ దొరవా రితఁడు ౧౫౦౦ వ సంవత్సరప్రాంతముల యందుండినట్లు వ్రాసియున్నారు. ఇందుకు విరుద్ధములైన ప్రమాణములు కనఁబడు వఱకును మన మాకాల మునే సిద్ధాంతముగా గ్రహింపవచ్చును. ఈ వేంకటనాథుఁడు పూర్వకవి వర్ణనము నీ క్రిందిపద్యమునఁ జేసియున్నాఁడు—

మ. హృదయబ్రహ్మరథం బతిప్రియతమం బెక్కింతుఁ జేతోమరు
త్సదనాస్థానికిఁ దెత్తు మానసనభస్సంచారిఁ గావింతు హృ
ద్విదితక్షీరసముద్రఖేలనమునం దేలింతు నుత్కృష్టవ
స్తుకులం బ్రాజ్ఞులఁ దిక్కయజ్వ నమరేశున్ సోము శ్రీనాథునిన్.

ఇందు శ్రీనాథుఁడు పేర్కొనఁబడియుండుటచేతఁ గవి ౧౪౪౦ వ సంవత్సరమునకుఁ బూర్వపువాఁడు కాఁడనుట నిశ్చయము. కవి కత పెదతండ్రినిగూర్చి "లింగక్షోణిపాలుండు యవనసైంధవకాననానలుండు" అని వ్రాసియున్నందున నతఁడు మహమ్మదీయులకును హిందువులకును దక్షిణహిందూస్థానములో యుద్ధములు జరుగుచున్న కాలములో నుండి యుండవలెను. ఇతఁడు తన గ్రంథమును హరిహరనాథున కంకితముచేసి, ఆ విషయమున నిట్లు వ్రాసికొనియున్నాఁడు—

క. ఏచనవు గలదు హరిహర। సాచివ్యము నొంద నన్యజనులకు మది నా
లోచింపఁ దిక్కయజ్వకు। వాచనసోమునకు మఱియు నాకుం దక్కన్.

హరిహరనాథునకుఁ గృతియిచ్చుటచే నితఁడు నెల్లూరిమండలము లోనివాఁడని తోఁచుచున్నది. అప్పకవిగాని మఱి యే యితర లక్షణ కర్తగాని యీతనిపద్యములను లక్ష్యములనుగాఁ జేకొనియుండ లేదు. ఆ హేతువునుబట్టి యితఁడాధునికుఁడని యూహించుటకంటె నీతని గ్రంథమునందు లక్షణవిరుద్ధములయిన ప్రయోగము లుండుటచేత నుదహ

రింప మూసిరని తలఁచుట మేలు. ఇతఁడు కవిత్వ మెట్లుండవలెనో యీ క్రిందిపద్యమునఁ దెలిపియున్నాఁడు—

చ. ఘనతరఘూర్జరీకుచయుగక్రియ గూఢముగాక ద్రావిడీ
స్తనగతిఁ దేటగాక యరచాటగునాంధ్రవధూటిచొక్కపుం
జనుఁగవఁబోలి తేటయును జాటుదనంబును గాకయుండఁ జె
ప్పినయదెపో కవిత్వ మనిపించు నగిం చటుగాకయుండినన్.

వ్యాకరణదోషము లనేకము లున్నను మొత్తముమీఁద నీతని కవిత్వము పయినిజెప్పినట్లే యుండి ప్రౌఢమయి హృదయాహ్లాదజనకముగా నున్నది. పర్వతరాజపుత్త్రుఁడయిన యీ వేంకటనాథకవి పంచతంత్రములోని కొన్ని పద్యములను నిందుదాహరించుచున్నాను—

చ. పలికినమాట నిల్వఁ డెడపందడపం జెడనాడు వచ్చుమె
చ్చుల దిగమ్రింగుఁ దొల్తొలుతఁ జూచినచూపులఁ జూడఁ డేర్పడం
జులకదనం బొనర్చు నెరసుల్ఘటియించు నదల్చివైచుఁ గే
వలనృపసంశ్రయంబు పగవారలకు న్వల దివ్వసుంధరన్—

మిత్రభేదము.

చ. ఇట ననుడించి యేమిగత మేగెను చెప్పఁగదన్న యెట్టులె
క్కటిని జరింతు నన్న తృటికాలము ని న్నెడఁబాసియున్కి దు
ర్ఘటముగదన్న నాకడను గల్గిన యీధృతి యెందుఁ బోయె ని
ప్పటికి విచిత్ర మన్న విధి భద్రవిరోధిగదన్న యెన్నఁగన్—

సుహృల్లాభము.

చ. సురియ కరంబునం గొనక శూరుఁడు నీతికళావిలాసభా
సురుఁడు వధించు వైరి విరసున్ దవుదవ్వులఁ జెంత నుండియున్
సురియ ధరించియున్ మగువచొప్పున నేమియుఁ జేయలేఁడు త
న్నెరలఁగఁజేయు మానవ నికృష్టుఁడు మాటలు వేయునేటికిన్—

సం. విగ్ర.

ఉ. చెప్పిన నంతరంగమున సింగఁడుబూరఁడునై ప్రియంబు సాం
పుప్పతిలంగఁ బల్కెనది యోయి కృతఘ్నుఁడ నీవు కావె యు
ప్పప్ప సుహృత్తముం డయినయాయన నింటికిఁ దెచ్చి వెల్వ నే
చొప్పునఁ గొల్తు రట్లు పరిశుద్ధసపర్యలఁ గొల్చు టొప్పదే—

లబ్ధనాశము.

ఉ. నావిని బ్రాహ్మణుండనియె నన్నుఁ బ్రయత్నమెలర్పఁ బట్టికిం
గావలిపెట్టి పుట్టినిలు గాల్పఁగ నీ వటుపోవ నేను నా
లో వివరంబుమాలి మృగలోచన ముంగిస నే కిశోరర
క్షావిధి కొప్ప నేర్పఱచి జాటితి మందిరబాహ్యభూమికిన్—

అసంప్రేక్ష్యకారిత్వము.

---

# 11. అయ్యలరాజు రామభద్రుఁడు

ఈకవి యాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; తిప్పయార్యుని ప్రపౌత్రుఁడు; పర్వతన్నపౌత్రుఁడు; అక్కయార్యుని పుత్రుఁడు. ఈతఁడు కడపమండలములోని యొంటిమెట్ట గ్రామములోఁ బుట్టి పెరిఁగినవాఁడు; పరవస్తు ముమ్మడి వరదాచార్యునకు శిష్యుఁడయి వైష్ణవమతాభిమానము గలిగియుండినవాఁడు. ఇతఁ డొంటిమెట్టలో నున్నకాలములో నచ్చటి వీరరాఘవస్వామిమీఁద నొకశతకమును జేసెను. ఇతఁడు మొట్టమొదటఁ గృష్ణదేవరాయల యంతిమదశలో విజయనగరములోఁ బ్రవేశించి కృష్ణదేవరాయనిచేతఁ దద్విరచితమయిన సకలకథాసారసంగ్రహమును తెనిఁగింపఁ గోరఁబడెను. కాని గ్రంథపూర్తి కాకముందే కృష్ణదేవరాయలు పరమపదము నొందినందున రామభద్రకవి గ్రంథము నాతని కంకితము చేయక యవతారికయందుఁ గృష్ణదేవరాయల ప్రార్థన చేతఁ దానాగ్రంథమును రచించితినని మాత్రము వ్రాసెను. ఈసకల

కథాసారసంగ్రహము శ్రీరామ పురహరవశ్చరిత్రాదులనుగల తొమ్మిది యాశ్వాసముల గ్రంథముగా నున్నది. ఈగ్రంథమునందును రామభద్ర కవి సూక్ష్మబుద్ధి గలవాఁడని యూహించుటకుఁ దగినమార్గము లనేకములు గానఁబడుచున్నను, కవిత్వము ప్రౌఢముగాక వ్యాకరణదుష్టమయి బాలవిరచిత మని సూచించుచున్నది. ౧౫౩౦ వ సంవత్సరమున కొకటి రెండేండ్లముం దీకవి గ్రంథరచన కారంభించినట్లు తోఁచుచున్నది. ఈకవి సకల కథాసారసంగ్రహముయొక్క యవతారికయందుఁ దాను గ్రంథరచన చేయఁబూనుటనుగూర్చి యీక్రిందిపద్యమును వ్రాసి యున్నాఁడు—

ఉ. నన్నయ తిక్కనాదికవినాథులు చెప్పినయట్లు చెప్పలే
కున్నఁ దదుత్తరాంధ్రకవు లూరకయుండిరె తోఁచినట్లు ని
త్యోన్నతబుద్ధిఁ గబ్బములు యోజ రచింపక యందు జ్ఞానసం
పన్నులకావ్యముల్ హరిసమర్పణమైఁ జెలువొందు నెందునున్.

ఈబాలకావ్యమయిన సకలకథాసారసంగ్రహమునుగూర్చి యిందు విస్తరించి వ్రాయుక యంసలి పద్యములను మాత్రము రెంటిమూఁటి నిం దుదాహరించుచున్నాను—

సీ. కానకకన్న సతూనుండు నేఁటికిఁ
గానకకన్న సతూనుఁ డయ్యెఁ
బుణ్యాజనోత్కీర్ణ పురుషుండు నేఁటికిఁ
బుణ్యాజనోత్కీర్ణ పురుషుఁ డయ్యె
ద్విజముఖ్యులనుగూడితిరుగుబాలుఁడు నేఁడు
ద్విజముఖ్యులనుగూడి తిరుగుటయ్యె
గోత్రపావనుఁ డైనకోమరుండు నేఁటికి
గోత్రపావనుఁ డైనకోమరుఁ డయ్యె

మత్తగజదానధారార్ద్రిమార్గములను
దరులసీడల నెప్పుడుఁ దిరుగువాఁడు
మత్తగజదానధారార్ద్రిమార్గములను
దరులసీడల నెప్పుడుఁ దిరుగుటయ్యె.

చ. చదువు వివేకమూల మని సద్గురుసన్నిధి ధర్మశాస్త్రముల్
చదివి సుధాకరుండు నిజసద్గురుపత్నిని దా రమించుటన్
జదు వవివేకమూలమయి సంభవ మయ్యె నదేమనందు నా
మదనమహత్త్వ మెన్న నసమానపరాక్రమ మెన్నిభంగులన్.

చ. వినుతనిజాంఘ్రుల న్విడిచిపెట్టక పట్టుక నేలవ్రాలి లే
వనిగయుకు న్నరుండు బలుబాసల నమ్మిక లిచ్చి యాదరం
బునఁ గరమంది లేవనిడి భూతదయాంచితమానసోన్నతిన్
దనరినయాత్మవంశకథనంబు వచించిన లేచె వాఁడొగిన్.

సకలకథాసారసంగ్రహమును ముగింపకమునుపే కృష్ణదేవరాయలు మృతినొందినందున, ఆదరించుప్రభువులు లేక బీదవాడయిన రామభద్రకవి యందందుఁ దిరిగి గుత్తియప్పలరాజు మొదలైనవారి నాశ్రయించి వారిమీఁదఁ జాటుపద్యములను జెప్పుచుఁ గొంతకాలము జీవనముచేసి, కడపటఁ గృష్ణదేవరాయని యల్లుఁ డయిన రామరాజుయొక్క మేనల్లుఁ డగు గొబ్బూరి నరసరాజువద్దఁ జేరి తాను తరువాత రచియించిన రామాభ్యుదయము నారాజున కంకితము చేసెను. ఈకవి గుత్తియప్పలరాజుపయిని జెప్పిన చాటుపద్య మొకటి యిందు క్రిందఁ బొందుపఱుచుచున్నాను—

రాజమనోజా! విద్యా! భోజా! దీనార్థికల్పభూజా! రిపుసం
భాజా! వైభవవిజితబిడౌజా! రవితేజ! గుత్తి యప్పలరాజా!

ఈకవి చిరకాలము జీవించి బహుసంతానవంతుఁ డయి దారిద్ర్యముచేత బాధపడినవాఁడు. ఈతని సంతానాధిక్యమునుబట్టి యితనిని

జనులు పిల్లల రామభద్రయ్య యనియు పిలిచెడువాడుక గలదు. ఇతఁడు కృష్ణదేవరాయని యాస్థానకవి యన్న పేరే కాని యీతనికాల మంతయు నించుమించుగా నారాయనియనంతరమునసే గడపఁబడినది. ఇతఁడు కొంతకాలము పింగళి సూరన్నకును, తరువాత రామరాజ భూషణునకును సమకాలికుఁడుగానుండి కృష్ణదేవరాయల మరణానంతర మున నించుమించుగా నలుబది యేబది సంవత్సరములు బ్రదికి ౧౫౭౦వ సంవత్సరప్రాంతమునందు మృతినొందెను. ఈతఁడు చేసినగ్రంథము రామాభ్యుదయము ముఖ్య మయినది. ఇది మిక్కిలి ప్రౌఢమయిన కవితాధోరణి కలదయి, పదగుంభనమునందు పాండురంగ మహాత్మ్యమును బోలి యమకానుప్రాసములను గలదిగానున్నది. ఈకవి ప్రారంభదశ యందుఁ గృష్ణదేవరాయల దర్శనార్థముగా విజయనగరము వచ్చినప్పు డూరిబయల రామరాజభూషణునిశిష్యు లొకపద్యమును గుర్వాజ్ఞాను సారముగాఁ జెప్పఁబూని కుదురక యాలోచించుచున్నట్లును, వారు చలిచేత వడఁకుచు నచ్చటకు రాఁ దటస్థించిన యీ కవికి చలిమంట వేసి కప్పుకొన బట్ట నిచ్చి యతనిచేత

సీ. మోహోపదేశ తమోముద్రితము లైన
కనుదమ్ములఁ హిమాంబు లునుపరాదు
శ్రమబిందుతారకాగమభిన్నకుచకోక
ములఁ జంద్రనామంబు దలఁపరాదు
శీర్యదాశావృంత శిథిలతాసులతాంత
మసియాడ వీవన ల్విసరరాదు
పటుతాపపుటపాక పరిహీణతను హేమ
మింకఁ బల్లవపుటా ర్చిడఁగరాదు
లలన కానంగకీలికీలాకలాప
సంతతాలీఢ హృదయపాత్రాంతరాళ

పూరితస్నేహాపూరంబు పొంగిపొరలఁ
జల్లనిపటీరసలిలంబు చల్లరాదు.

అనుపద్యమును చేయించి తాము రచియించిన పద్యముగాఁ జెప్పి తమగురువునకు సమర్పించినట్లును, రామరాజభూషణుఁ డాపద్యముయొక్క చమత్కృతికిసంతోసించి దానిని తనవసుచరిత్రమునందు వేసికొన్నట్లును, ఒక పుక్కిటపురాణము కలదు గాని యది యెంతమాత్రమును విశ్వాస పాత్ర మయినదికాదు. కృష్ణదేవరాయలకాలములో రామరాజభూషణుఁడు కవిత్వమును జెప్పుట కారంభించినట్లే కనఁబడక పోవుటచేత నాతని కప్పటికే శిష్యబృంద మున్నదన్నవార్త యసందర్భ మగుటను బట్టియు, వసుచరిత్రము కృష్ణదేవరాయల యనంతరమున ముప్పదియైదు సంవత్సరములవఱకును బ్రకటింపఁబడక పోవుటచేత నంతటి మహాప్రౌఢ గ్రంథమును రచియించిన రామరాజభూషణుఁ డొక్కపద్యమును రచించుట కశక్తుఁ డయి యంతకాలమునకు తరువాత నితరకవియొక్క పద్యమును దనదిగాఁ దనపుస్తకమునందుఁ జేర్చుకొనె ననుటకంటె హాస్యాస్పద మయినమాట వేఱొకటి లేకపోవుటనుబట్టియు, ఈగ్రంథ చౌర్యకథ కల్పననిపుణులదేకాని కవిది కాదనుట స్పష్టము.

రామభద్రకవియొక్క కవితాపటిమనుజూచి రామరాజభూషణుఁడు మాత్సర్యగ్రస్తుఁ డయి యతఁడుచేసిన రామాభ్యుదయము యొక్క ద్వితీయాశ్వాసములోని "సింహనఖాంకురచ్ఛిన్నే" త్యాది పద్యమునుజదివినప్పుడు 'పృథుల షడ్జస్వరోద్గతభిల్లపల్లవాధరాగీతి కాకర్ణ నాతిభీతిపరవశాత్మపటీరకోటరకుటీరలీనఫణి' యనుచో వీణానాదమునకుఁ ఫణులు బెదరుట స్వభావవిరుద్ధమని తప్పుపట్టె ననియు, దాని పయిని రామభద్రకవి నెమలియొక్క షడ్జస్వరముచేతఁ బాములు భయపడుట స్వభావసిద్ధమే యని సమాధానముచెప్పి యాతని గర్వ

భంగము చేసె ననియు, మఱియొకకథ చెప్పుదురు. కొంచెము మంచి గ్రంథమును రచించిన కవికెల్ల నతని యిష్టదేవతయో సరస్వతియో వచ్చి గ్రంథరచనము చేసిపెట్టినట్లుగా మనలోఁ జెప్పుకొనెడు వాడుక ప్రకారముగా రామభద్రకవికిని రాజునొద్ద దా నాఱునెలలలో గ్రంథమును జేసి తెచ్చెదనని ప్రతిజ్ఞనుపట్టి తేలేక పోయినప్పుడు మితిపెట్టిన కడపటి దినమురాత్రి యాతని యిష్టదైవమయిన శ్రీరామమూర్తియే రామాభ్యుదయమును జేసిపెట్టి కవియొక్క మానము కాపాడెనని జనప్రతీతి యొకటికలదు. సకలకథాసారసంగ్రహమునందున్న రీతి పద్యములలో ననేకము లీరామాభ్యుదయమునందుఁ గానఁబడుచున్నవి. వానిలోనొక్క దాని నిం దుదాహరించుచున్నాను—

సీ. కానకకన్న సంతానంబుగావునఁ
గానకకన్న సంతానమయ్యె,
నరయ గోత్రనిధానమై తోఁచుగావున
నరయ గోత్రనిధానమయ్యె నేఁడు,
ద్విజకులాదరణవర్ధిష్ణుండు గావున
ద్విజకులాదరణవర్ధిష్ణుఁ డయ్యె,
వివిధాగమాంతసంవేద్యుండు గావున
వివిధాగమాంతసంవేద్యుఁ డయ్యె

గీ. కటకటా దాశరథి సముత్కటకరీంద్ర
కటకలితదానధారార్ద్రకటకమార్గ
గామి యెట్లుచరించు నుత్కటకరీంద్ర
కటకలితదానధారార్ద్రకటకతటుల.

ఈకవి రేఫ శకటరేఫములభేదమును పాటింపక యతిప్రాసము లందు యథేచ్ఛముగా మైత్రి కలుగఁజేసినవాఁడు. ఈతని కవిత్వరీతి దెలుపుట కయి రామాభ్యుదయములోని కొన్నిపద్యముల నిందు వ్రాయుచున్నాను—

చ. ప్రమద మెలర్ప నుగ్రమృగబాధ హరింపఁగ వేఁటమై నర
ణ్యమునకు రా నఘం బొదవె నక్కట! ధర్మముఁ జాలుఁ గుక్కఁ బ
ట్టు మనుట యెంచి విల్లటు తటుక్కున ధారుణి వైచి సారమే
యముల మరల్పఁ బంచె మృగయాక్రియ మాని విభుండు ఖిన్నుఁడై.

అ. ౨.

ఉ. అక్కట! కోసలక్షితివరాత్మజ కానకకన్నముద్దులేఁ
జక్కనిమంచిరాకొమరుఁ జందురుఁ డెక్కడ ? యధ్వరావనం
బెక్కడ ? దైత్యసంహరణ మెక్కడ ? ఘోరవనాంతరాశ్రమం
బెక్కడ ? యెట్టు లంపుమనియె న్మని ? నో రెటులాడె నింతకున్ ?

అ. ౪.

ఉ. వింధ్య మధిత్యకాకటకవిస్ఫుటపాదపపుష్పగుచ్ఛసౌ
గంధ్యము హేమధాతుమయకల్పితసంధ్యము బద్ధమేరుసా
గంధ్యము చండకేసరనికాయనిరాకృతభద్రదంతిద
ర్పాంధ్యముఁ గ్రుంగఁద్రొక్కితి మహాగుణభూషణ సత్యభాషణా.

అ. ౫.

ఉ. చూచుటలే దశోకవనిఁ జొచ్చి యటుంజని చూచెదంగదా !
యాచపలాక్షి మజ్జనని యచ్చటనుండినయేని లెస్స లే
దా చతురాననుండు మొదలైన సుపర్వు లెఱుంగఁ జిచ్చులో
వైచెదఁగాక యీయొడలు వానరవీరులమ్రోల వైతునే?

అ. ౬.

# 12. వెల్లంకి తాతంభట్టు.

(ఇతఁడు కవిచింతామణి యనులక్షణగ్రంథమును జేసిన గొప్ప కవి.) ఈతఁడు వైదికబ్రాహ్మణుఁడు; ఈతని తండ్రి యబ్బయ్య; తల్లి యెఱ్ఱమ్మ. ఈకవి కృష్ణరాయని రాజ్యారంభకాలమునం దుండిన వాఁడు. కొంద ఱీతఁడు కృష్ణదేవరాయని కాలమునకుఁ బూర్వమునందే యుండెనని చెప్పుదురుగాని యితఁడు తనకవిచింతామణిలో నైషధము, భోగినీదండకము, జైమినిభారతము మొదలగు గ్రంథములనుండి యుదాహరణములు గైకొని యుండుటచేతను, జైమినిభారతమును రచించిన పిల్లలమఱ్ఱి పినవీరన్న కృష్ణదేవరాయని తండ్రితాతలకాలములోనే యున్నవాఁ డగుటచేతను, తాతంభట్టు- (కృష్ణరాయనికాలమునకుఁ బూర్వమునం దుండినవాఁ డయినట్టు తోఁచదు.) ఇతఁడు కవిచింతామణి యందు వ్యాకరణమును, ఛందస్సును, కావ్యలక్షణమునుగూడఁ గొంత వఱకుఁ జెప్పియున్నాడు. ఈలక్షణవేత్త కవిచింతామణియందుఁ దన్నుఁ గూర్చి వేసికొన్నపద్యము నిం దుదాహరించుచున్నాను.—

సీ. శుచి యెఱ్ఱమాగర్భశుక్తిముక్తామణి యబ్బధీమణిసూనుఁ డనఘబుద్ధి,
పావనవశితశాలావతగోత్రుఁ డహార్యధైర్యుండు రామార్యుతమ్ముఁ,
డష్టభాషాప్రక్రియాలబ్ధవర్ణుండు సన్నుతసాహిత్యచక్రవర్తి,
యనవద్యసర్వవిద్యాపారదృశ్వుండు విద్వజ్జనవ్రాతవిశ్రుతుండు,

సకలహరిదంతరాళవిశ్రాంతవిశద
కార్తికచంద్రికాయతకీర్తి కాంతి
హరినిభుం డాస్యవాణీవిహారవసతి
తామసోల్లంఘి వెల్లంకితాతసుకవి.

ఈతఁడు రచియించినది లక్షణగ్రంథమగుటచేఁ గవిత్వనైపుణినిగూర్చి

వ్రాయుట యుచితముకాదు. అయినను గవిత్వరీతిఁ దెలుపుట కయి కవిచింతామణినుండి రెండుపద్యముల నిం దుదాహరించుచున్నాను—

క. ఆది బురాణాగమములు
వేదంబులు నోరఁగాయవేయక నుడువన్,
వాఁడేలా కవివరులకు
మేదిని నెవ్వారు సాటి మించినగరిమన్.

శా. ని న్నాడింపఁగవచ్చు గోపతనయుల్ నెయ్యంబున న్వేదిపై
నున్నా రీకడఁగొమ్ము జోగులు కరాళోన్మత్తులై వచ్చెదర్
నెన్నా మీఁగడయున్ ఫలం బొసఁగెదన్ వేగంబె రా రమ్ము మా
యన్నా యంచును వ్రేతపెట్టు హరి యా యమ్మా నగు న్మాటికిన్.

---

# 13. కుమ్మర మొల్ల.

రామాయణమును తెనుఁగున రచియించిన యీమొల్ల యాతుకూరి కేసనసెట్టికూఁతురు. ఈమె తనపుస్తకమునం దెక్కడను దన వంశమునుగూర్చి చెప్పుకొనకపోయినను, ఈమె కులాలవంశజాతయని పరంపరగా వాడుకవచ్చుచున్నది. ఈమె నివాసగ్రామము పడుగుపాడనియు, ఈమెయు తిక్కన సోమయాజులు భారతమును దెనిఁగించి నప్పుడు లేఖకుఁడుగానుండిన కుమ్మరగురునాథుఁడును సోమయాజుల తండ్రియైనకొమ్మనకు రంగప్ప యనుకుంభకారునిపుత్రివలన జన్మించి రనియు, కొందఱు వ్రాసియున్నారుకాని యావ్రాఁత నిరాధారమయి నది. ఈమొల్ల తిక్కనసోమయాజికాలములోనే యుండిన దయిన పక్షమున,

"స్తుతగుణోద్దాము నాచన సోము భీము
నవ్యమంజులవాగ్ధుర్యు నన్నపార్యు
రసికుఁ డైనట్టి శ్రీనాథు రంగనాథు"

అని తనరామాయణమందలి కవిస్తుతిలోఁ దిక్కనసోమయాజి కించుమించుగా నిన్నూఱుసంవత్సరములతరువాత నున్న శ్రీనాథుని స్తుతించుట సంభవింపనేరదు. కాఁబట్టి మొల్ల శ్రీనాథునికాలమునకుఁ దరువాత నున్నదనుటకు సందేహము లేదు. ఈమె కృష్ణదేవరాయల కాలములోని యల్లసాని పెద్దనాదుల నెవ్వరిని స్తుతియించి యుండక పోవుటచేత మొల్ల యాకాలమున కెంతో తరువాతిది కాదనియు స్పష్ట పడుచున్నది. ఈమె కృష్ణదేవరాయలకాలములోనే యున్నట్టు కథ లనేకములున్నవి. మొల్ల యాకాలమునందలిది కాదని సంశయించుటకు హేతువులేమియు గానరానందునను, ఆకాలపుకవులను స్తుతింపనందునను, ఆమె కృష్ణదేవరాయలకాలమందే యున్నదని నిశ్చయింపవలసి యున్నది. ఇప్పుడున్న తెలుఁగుగ్రంథములను బట్టిచూడఁగా, ఆంధ్ర కావ్యములను జేసినస్త్రీలలోనెల్ల నీమెయే ప్రాచీనురాలుగాఁ గానఁబడు చున్నది. ఈమె తన రామాయణములో,

"... ... ... ...గోప
వరపుశ్రీకంఠమల్లేశువరముచేత
నెఱిఁ గవిత్వంబు చెప్పంగ నేర్చినాను"

అని చెప్పుకొనుటచేత నీమె నివాసస్థలము నెల్లూరిమండలము లోని గోపవర మని తెలియవచ్చుచున్నది. ఈమె కవిత్వమునుజూచి తెనాలిరామకృష్ణుఁ డింటిపేరును గూర్చి యడిగి యాక్షేపించిన ట్లొక కథ కలదుగాని యది యిం దుదాహరింపఁదగినది కాదు. అక్కడక్కడఁ గొన్నివ్యాకరణదోషము లున్నను మొత్తముమీఁద నీమెకవిత్వము మిక్కిలి మృదువయి మధుర మయి రసవంతముగా నున్నది. ఈరామా

యణమును గొంతకాలముక్రిందటివఱకును వీధిబడులలో బాలురకు పాఠమునుగాఁ జెప్పుచుండిరి. ఇది పురుషులుచెప్పినగ్రంథములలో ననేకములకంటె మనోజ్ఞమై ప్రౌఢమై యున్నది. మొల్ల రామాయణము నందలి కొన్నిపద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. రాజులు కాంతియందు, రతిరాజులు రూపమునందు వాహినీ
రాజులు దానమందు, మృగరాజులు విక్రమకేళియందు, గో
రాజులు భోగమందు, దినరాజులు సంతతతేజమందు, రా
రాజులు మానమందు, నగరంబున రాజకుమారు లందఱున్.

బాలకాండ.

చ. సుడిగొని రాముపాదములు సోఁకినధూళి వహించి రాయి యే
ర్పడ నొక కాంత యయ్యెనఁట పన్నుగ నీతనిపాదరేణు వి
య్యెడ వడినోడసోఁక నిది యె ట్లగునోయని సంశయాత్ముఁడై
కడిగె గుహుండు రాముపదకంజయుగంబు భయంబుపెంపునన్.

అయోధ్యా

చ. చించెదదైత్యసంఘములఁ జెండఁదలఁ ఖండదలఁ చేసి బ్రహ్మ బా
ధించెద లోకపాలకులఁ ద్రెళ్ళఁగ నేసెద భూతలంబు గ్ర
క్కించెద శైలజాలములఁ గీటడఁగించెద భూమినందనన్
గాంచెదఁ దల్లడిల్లకుము కంజహితాన్వయవార్థిచంద్రమా.

అరణ్యకాం.

ఉ. సాలముపొంత నిల్చి రఘుసత్తముఁ డమ్మరివోసి శబ్దవి
న్మాలముగాఁగ విల్దివిచి ముష్టియు దృష్టియుఁగూర్చి గోత్రభృ
త్కూలము వజ్రపాతహతిఁ గూలువిధంబునఁ గూలనేసె న
వ్వాలిఁ బ్రతాపశాలి మృదువందనశీలి సురాలి మెచ్చఁగన్.

కిష్కింధాకాం.

శా. వీరాలాపము లాడ నేల వినుమీ విశ్వప్రకాశంబుగాఁ
బారావారముఁ గట్టి రాఘవుఁడు కోపస్ఫూర్తి దీపింపఁగా
ఘోరాజి న్నినుడాసి లావుకలిమిన్ గోటీరయుక్తంబుగాఁ
గ్రూరాస్త్రంబుల మస్తముల్ దునిమి భుక్త్యైట్టు భూతాళికిన్.

సుందరకాం.

మ. అనఘుం డుజ్జ్వలచాపదండమున బ్రహ్మాస్త్రంబుసంధించి యొ
య్యనఁ గర్ణాంతముగాఁ గడుం దివిచి ప్రత్యాలీఢపాదస్థుఁడై
దనుజాధీశ్వరుబాహుమధ్యము వడిం దాఁకంగ లక్ష్యంబుగాఁ
గొని బిట్టేసె నదల్చి తీవ్రతరమాకోపంబు దీపింపఁగన్.

యుద్ధకాం.

---

# 14. పిడుపర్తి సోమనాథుఁడు

ఇతఁడు శైవబ్రాహ్మణుఁడు; పిడుపర్తి బసవనారాధ్యుని పుత్రుడు. ఇతఁడు పాల్కురికి సోమనాథుఁడు రచియించిన ద్విపద బసవపురాణమును తెనుఁగున నేడాశ్వాసముల పద్యకావ్యముగా రచియించెను. పాల్కురికి సోమనాథుఁడు రచియించిన పండితారాధ్యచరిత్రము మొదలయిన గ్రంథములను శ్రీనాథాదు లీకవికిఁ బూర్వమునందుఁ బద్యకావ్యములనుగాఁజేసిన ట్లీబసవపురాణపీఠికయం దీకవి యీక్రింది పద్యముచేఁ జెప్పియున్నాఁడు.—

సీ. విరచించె జైమిని వేదపాదస్తవం బొకపాదమున వేదయుక్తి నిలిపి
హరభక్తి వైదికం బని శ్రుతు లిడి చెప్పెఁ బ్రతిభ సోమేశుఁ
డారాధ్యచరిత

సరవి శ్రీనాథుఁ డాచరిత పద్యప్రబంధముచేసె ద్విపదలు తఱచునిలిపి
యాతండె పద్యకావ్యముచేసె నైధష మంచితహర్షవాక్యములఁ బెట్టి
సోమగురువాక్యములు పెట్టి భీమసుకవి
గరిమ బసవపురాణంబు గణనఁజేసెఁ
గానఁ బూర్వకావ్యము వేఱుగతిరచించు
వారి కాదికావ్యోక్తులు వచ్చినెగడు.

"సోమగురువాక్యములుపెట్టి భీమసుకవి...బసవపురాణంబు... చేసె" నన్న పయివాక్యమునుబట్టి వేములవాడ భీమకవి నన్నయభట్టారకుని కాలములోనివాఁడుగాక పాల్కురికి సోమనారాధ్యున కెంతో తరువాత నుండినవాఁ డయినట్టు విస్పష్టమగుచున్నది. ప్రతాపరుద్రునికాలములో ప్రతాపరుద్రుని మంత్రులలో నొకఁడును తన శిష్యుఁడును నయిన యిందులూరి యన్నదండనాథుని సాహాయ్యముచేత పాల్కురికి సోమనార్యుఁడు గ్రంథకర్త పూర్వులకు దోకిపర్తియను నగ్రహారమిప్పించెను. ఈయగ్రహారమునకుఁ దరువాత భంగము కలుగఁగా గ్రంథకర్తయొక్క ముత్తాతయైన సోమనారాధ్యుఁడు ప్రౌఢదేవరాయని రాజ్యకాలములో దానిని మరల సంపాదించెను. ఈసంగతి బసవపురాణములో నీక్రింది పద్యమునందు జెప్పఁబడినది.

క. ఆదిన్ బ్రతాపుఁ డిచ్చిన
యాదోకిపురంబు నడుమ నంకిలి పడినన్
మోదమునఁ బ్రౌఢరాయమ
హీదయితునివలనఁ దెచ్చె నెల్లరు నెఱుఁగన్.

కృతికర్తయైన సోమనాథునితండ్రి బసవయ్య, బసవయ్యతండ్రి దేవయ్య, దేవయ్యతండ్రి సోమనాథుఁడు. కాఁబట్టి ప్రౌఢదేవరాయని రాజ్యకాలములో దోకిపర్తి యగ్రహారమును మరల సంపాదించిన

యీ సోమనాథుఁడు కవికి ముత్తాత. ప్రౌఢదేవరాయఁడు హూణశకము ౧౪౨౨ వ సంవత్సరము మొదలుకొని ౧౪౪౭ వ సంవత్సరమువఱకును రాజ్యము చేసినందున, అతని రాజ్యకాలములో నుండిన సోమనాథుని మునిమనుమఁడు తరువాత నఱువది డెబ్బది సంవత్సరముల కుండి యుండును. కాఁబట్టి యీ కవి ౧౫౧౦ వ సంవత్సరప్రాంతములఁ గృష్ణదేవరాయని రాజ్యారంభకాలములో నున్నాఁడని చెప్పవచ్చును. బసవపురాణకథానాయకుఁడైన బసవేశ్వరుఁడు శ్రీశైలమునకు పశ్చిమమున నుండు హింగుళేశ్వరాగ్రహారమునందు వాసము చేయుచుండిన శివభక్తుఁడయిన మండంగి మాదిరాజను బ్రాహ్మణుని పుత్రుఁడు. ఇతఁడు శివుని వాహనమైన నందియొక్క యంశముచేత భూమిమీఁద నవతరించెనని శైవులు నమ్ముచున్నారు. తల్లిదండ్రు లీతని కుపనయనము చేయఁ బోయినప్పుడు చేసికొనక తాను శివునిఁదప్ప వేఱొకని గురువునుగా నంగీకరింపనని నిరాకరించెను. ఇతఁడు పెద్దవాఁడయిన తరువాత పదునొకండవ శతాబ్దమునందు కళ్యాణపురాధీశ్వరుఁడుగా నున్న బిజ్జలరాజునొద్దఁ జేరి యాతని దండనాయకుని గూఁతునయిన గంగాంబను వివాహము చేసికొని కడపట బిజ్జలరాజునకు మంత్రియయ్యెను. ఈతఁడే యీ దక్షిణహిందూస్థానమునందు వీరశైవమతోద్ధారణము చేసినవాఁడు. ఈతని మేనల్లుఁడయిన చెన్నబసవన్న కూడ వీరశైవమును దేశమునందంతటను వ్యాపింపఁజేసెను. బసవపురాణమునందు బసవేశ్వరుని మహిమ లనేకములు చెప్పఁబడియున్నవి.

సోమనాథకవియొక్క కవిత్వరీతిఁ జూపుటకయి కొన్ని పద్యముల నిందుదాహరించుచున్నాను :—

ఉ. ఖండశశాంకశేఖరు నఖండమహత్త్వమెకాని యాత్మ వే
ఱొండు దలంపఁ డెన్నఁడు పయోజభవాన్వయదుగ్ధవార్ధిచం

ద్రుంపు దురత్యయోరుభవదోషవిదూరమనఃప్రచారుఁడై
మంచఁగి మాదిరాజు గుణమండితవందితుఁ డొప్పు నప్పురిన్ — ఆ. ౧

ఉ. పట్టకు పట్ట కింక **వృ**షభం బది మాటలు చెల్లినప్పుడే
పెట్టితి లింగముద్ర యది బీరము తప్పఁగఁ బట్టి తేనియున్
గొట్టుకునీశిరంబు ధరఁగూలఁగ మాబసవన్నయాన చే
పట్టులఁ గాచుటెల్ల శివభక్తులకుం బిరుదంబుగావునన్ — ఆ. ౫

శా. ఆనందాశ్రుపయోధి సట్టవాడువన్ హర్షోత్థరోమాంచన
శ్రీ నెమ్మేనికి భూషణంబుగ లసద్గీర్వాద్గమద్గద్గద
ధ్యానమ్ముల్ గురుకర్ణసత్వములుగాఁ దాత్పర్యముం భక్తియున్
లోనన్ గీల్కొనియున్న యాత్మసుతు నాలోకించి మై పెంచుచుం — ఆ. ౭

---

# 15. పిడుపర్తి బసవకవి

ఇతఁడు శైవబ్రాహ్మణుఁడు. బసవపురాణమును పద్య కావ్యముగా రచియించిన సోమనాథుని తమ్ముఁడయిన పాలనార్యుని పుత్రుఁడు. కాఁబట్టి యీ కవియు నించుమించుగా సోమనాథుని కాలమునందే యున్నవాఁడగుటచేత ౧౧౭౦ వ సంవత్సరప్రాంతమునం దున్నవాఁడని చెప్పవచ్చును. ఇతఁడు పాల్కురికి సోమనాథుఁడు రచియించిన ప్రభులింగలీలను తెనుఁగున నైదాశ్వాసముల పద్యకావ్యమునుగా రచించెను. ఈ ప్రభులింగలీలయందు బసవేశ్వరునికిని బసవేశ్వరుని మేనల్లుఁడయిన చెన్నబసవన్నకును గురువయిన యల్లమప్రభుఁడను జంగముదేవరయొక్క కథ చెప్పఁబడియున్నది. పిడుపర్తి బసవకవియొక్క కవనవిధము తెలియుటకై ప్రభులింగలీలనుండి రెండుమూడు పద్యముల నుదాహరించుచున్నాను.—

ఉ. ఊరును నిల్లుఁ బల్లియలు నొల్లక సల్లలితాంతరంగులై
ఘోరతరాటవిన్ ఘననికుంజములన్ సెలయేళ్ళచెంత శృం
గారవంబులన్ భయదగహ్వరసీమఁ దపంబుఁ జేసి పెం
పారుమహామునీశ్వరులయాత్మలుఁ దత్తఱ మందె నత్తఱిన్. ఆ. ౧.

ఉ. చిత్తసరోజ మిష్టమునఁ జేరిచి చూపులు ప్రాణలింగమున్
హత్తఁగఁ జేసి భావమునఁ గంచితతృప్తి యొసంగి సంగముల్
రిత్తలు చేసి యెందును జరింపఁగ నేరిచి తేని నీవ య
త్యుత్తమలింగమూర్తి వివి యొప్పుగఁ జేకొను సిద్ధరామునా. ఆ. 3.

మ. బసవయ్యా భవదీయమందిరమునన్ భక్తిన్ సదాభోజనం
బసలారంగ నొనర్చుజంగమము లాత్మాసక్తి నాఁకంటిచే
విసువంగా నికనేల తామసము రీవిన్ వారిఁ దోడ్తెచ్చి మీ
రసమానస్థితి నారగింపఁ గదరయ్యా హాయిగా నేటికిన్. ఆ. ౪.

---

# 16. కోట శివరామయ్య

ఈకవి సానందోపాఖ్యాన మను నాలుగాశ్వాసముల పద్యకావ్యము రచించెను. ఇతఁడు శూద్రుఁడు; కౌశికగోత్రుఁడు; కోట బాపనయ్య పుత్త్రుఁడు; కాళహస్తిపుర నివాసుఁడు. ఇతఁడు తాను కృష్ణదేవరాయలకాలములో నున్నధూర్జటికవి శిష్యుఁడ నని గ్రంథములో జెప్పుకొని యుండుటచేత ౧౫౨౫ - ౧౫౫౦ వ సంవత్సరములకు మధ్య నుండియుండును. సానందోపాఖ్యానమునందు లక్షణవిరుద్ధము లైన ప్రయోగములు కొన్ని కానఁబడుచున్నవి. కవిత్వము మృదువుగానే యున్నది. ఈ గ్రంథమునందలి రెండు మూడు పద్యముల నిందుదాహరించుచున్నాను—

ఉ. గారెలు బూరె లిడ్డెనలుఁ గమ్మనిదోసెలుఁ జక్కిలంబులున్
జారులుఁ గూరలున్ ఫలరసంబులుఁ దేనెలుఁ బానకంబులున్
సారెలుఁ బాయసాన్నములుఁ జక్కెర లప్పడంబులున్
జేరిననేతులుం జెఱకుబిళ్ళలుఁ జల్లనినీరుమజ్జిగల్. ఆ. ౧.

ఉ. పాపము చేయవల్దనుచుఁ బల్మఱుఁ బెద్దలు చెప్పిన న్మహా
కోపముమీఱ వారియెడఁ గుత్తుకబంటివిషంబు గ్రక్కుచున్
బాపము నీవ మేఁడది నెపం బిడి జీవము దాఁటిపోయి యే
దాపున నెందుఁ బోవునో నిదాన మెఱుంగ రివేటిబోధనల్. ఆ. ౨.

మ. జమువెంటం బురవీథులం జనుచు భాస్వత్పట్టణశ్రీవినో
దము లీక్షింపుచుఁ జూడఁజూడ మఱియుం దండోపతండంబులై
భ్రమ కల్పించుపురీవిశేషములకుం బ్రాజ్యాద్భుతానీతుఁడై
యమునిం గన్గొని పల్కె సంయమి మరందానందసాంద్రోక్తులన్. ఆ. 3.

---

# 17. కుమార ధూర్జటి

ఈకవికి నిజ మయినపేరు వేంకటార్యుఁడు. ఇతఁడు పాకనాటి నియోగిబ్రాహ్మణుఁడు, కాళియామాత్యుని పుత్రుఁడు; ధూర్జటికవి పౌత్రుఁడు. ఈకవి యాకువీటిరా జయిన చినవేంకటాద్రియొక్క కోరిక మీఁదఁ గృష్ణరాజవిజయ మనుపేర కృష్ణదేవరాయల చరిత్రమును శ్రీరామాంకితముగా రచియించెను. ఈతని కవిత్వము మిక్కిలి రసవంతమైనది. ఇతఁడు కృష్ణరాజవిజయ మనెడి యీనాలుగాశ్వాసముల గ్రంథమును మాత్రమేకాక సావిత్రీచరిత్రము, ఇందుమతీవివాహము మొదలయిన గ్రంథములనుగూడఁ జేసినట్లు తెలియవచ్చుచున్నది. కృష్ణరాజవిజ

యమునందలి యీ క్రింది కవిస్తుతి పద్యమువలననే యీకవియొక్క ప్రౌఢిమ తేటపడుచున్నది—

సీ. వాక్ప్రౌఢిసనుం డగువాని నిక్కంబుగా నల్లసాని పెద్దన్నదేవుఁడేయని నుతింతుఁ
గుండలీంద్రసమాఖ్యుఁ గొమరొందుకవిచంద్రు ననువొంద శేషాహి యని తలంతు
శ్రీనాథవిఖ్యాతిజెన్నొందుబుధవర్యుఁబురుషోత్తముఁడటంచుబుజ్జగింతు
ధూర్జటిప్రౌఢిచే నూర్జితుం డగువాని సాక్షాచ్ఛివుండని సంస్మరింతు
నవని మఱియును వెలసిన యాంధ్రకవుల
నాధునిక పూర్వకవుల యశోధనికుల
సారసాహిత్యసౌహిత్యసరణి వెలయ
వర్ణన లొనర్తు రమణీయవాక్యములను.

ఈకవి తన్నుఁగూర్చి కృష్ణరాజవిజయమునం దీక్రిందిరీతిగాఁ జెప్పుకొన్నాఁడు—

సీ. నను భరద్వాజగోత్రుని సదాపస్తంబసూత్రుని బాంధవస్తోత్రపాత్రుఁ
బాక నాఁటూర్వేలవంశప్రసిద్ధుని ధూర్జటిపౌత్రు బంధురచరిత్రు
సద్గురుకారుణ్యసంప్రాప్తవిద్యావిహారుని శ్రీకాళహస్తినిలయ
చిత్ప్రసూనాంబికాశ్రీకరానుగ్రహాసాదితకవితారసజ్ఞహృదయు
సారరచనాధురీణుఁ గుమారధూర్జ
టిప్రధానాగ్రగణ్యుఁ బటీరహీర
మహితసత్కీర్తిఁ గాళియామాత్యపుత్రు
వేంకటార్యుని బిలిపించి వేడ్క ననియె.

క. బాలుఁడ వయ్యును విద్యా। శీలుఁడవు గభీరమధురశృంగారకళా
లాలితచాతుర్య కవి। త్వాలోచననిపుణ వేంకటామాత్యమణీ.

ఉ. చిత్రముగాఁగఁ బిన్నపుడె చెప్పితివౌ రసము ల్చెలంగ సా
విత్రిచరిత్రముఁ గిగుల వేడుక నిందుమతీవివాహమున్

స్తోత్ర మొనర్ప నద్భుతమగుసూక్తిగతిన్ రచియించితౌఁ గదా
ధాత్రిఁ బ్రసిద్ధిఁగాంచితివి ధన్యుఁడ వౌర కుమారధూర్జటీ.

*           *           *           *           *

చ. తెలుఁగునఁ జెప్ప నేర్చినసుధీజను లెల్ల సెబాసు ధూర్జటీ
బళి యనఁ దళ్కుగుళ్కువగఁ బాటిలు తేటతెనుంగుమాటలన్
మెలఁకువగాంచు బెళ్కుజిగిమించఁ బ్రబంధములన్ ఘటించితౌ
పలుకులముద్దరాలిమిహిబంగరుటందెరవల్ చెలంగఁగన్.

*           *           *           *           *

క. మాకరుణకుఁ బాత్రుండవు। ప్రాకటగతిఁ బద్యకావ్యఫణితిం జెపుమా
శ్రీకృష్ణరాయచరితము। నీకవితాప్రౌఢి సుకవినికరము మెచ్చన్.

శ్రీకృష్ణరాజవిజయములోని యీక్రిందిపద్యమునుబట్టి చూడఁగాఁ గృష్ణదేవరాయల పట్టాభిషేకమహోత్సవమునాఁటి కార్వేటి బుక్కరాజు జీవించియున్నట్టే కనఁబడుచున్నది.—

సీ. చక్కెరవిలుకాని చక్కఁదనముగల్గి చొక్కమా నార్వేటి బుక్కరాజు,
సాకల్యముగఁ గీర్తి సర్వదిక్తటులందుఁ బ్రాకటస్థితిమించు నాకువారు,
కంటకరాజన్య గర్వంబు లడఁగించి లీలచే మించునంద్యాలవారు,
ధాటీపిరాఘాట ఘోటీహతవిరోధికోటులై వెలయు వెల్గోటివారు,
చండతరశౌర్యు లగు పెమ్మసానివారు
బూదహాళివారు మొదలైనభూమిపతులు
గొలువఁ బట్టాభిషిక్తుఁడై చెలువుమీఱె
రమ్యగుణపాళి శ్రీకృష్ణరాయమౌళి.

ఈ కవియొక్క తాత కృష్ణదేవరాయుని యాస్థానమునం దున్నవాఁడగుటచేతను కృష్ణరాజవిజయమును జెప్పినప్పటి కితఁడు బాలుఁడని చెప్పఁబడియుండుటచేతను కృష్ణరాజవిజయము ౧౫౫౦ వ సంవత్సర

ప్రాంతమునందు రచియింపఁబడి యుండును. ఈ కవియు ౧౫౬౦-౯౦ సంవత్సరముల వఱకు జీవించియుండునని యూహింపఁదగియున్నది. ఈతని కవిత్వము మృదుమధుర వాక్యరచనాధురీణమయి కర్ణరసాయనముగా నుండును. ఈతని కవనధోరణిని దెలుపుటకుఁ గృష్ణరాయవిజయములోని రెండుమూఁడు పద్యము లిందుదహరింపఁబడుచున్నవి—

ఉ. కీవిగ నొకవారును గడిందిరహిన్ వెలుగోటివార లా
రావెలవారుఁ గూడుకొని రాత్రిపగల్ చతురంగసేనతో
నేవగఁ జూచినన్ దివియ నెంతయు శక్యముగాని దుర్గమా
భూవరమౌళి కాంచి యొకపూఁటనె తీసెదనంచు నుగ్రుఁడై.

శా. ఔరా చూచితిగాదె రాయలబలం బౌరౌర యేనుంగు ల
య్యారే యీచతురంగసంఘము లహోహో మన్నెవారల్ బళీ
ధీరుల్ రాజకుమారు లంచు మది నెంతేనద్భుతం బొందుచున్
ఘోరన్ శక్యమె యీనృపాలమణితో భూరిస్థిరప్రౌఢిమన్—ఆ. 3

మ. చెలువల్ త్రోటొక్కనిరా మణీఖచితమంజీరధ్వను ల్మ్రోంచఁగాఁ
దళుకుం జెక్కు మెఱుంగుటద్దములపైఁ దాటంకరత్నద్యుతుల్
వెలయం దా గజరాజపుత్రి యగుశ్రీవిం దెల్పుచందాన వ
చ్చె లతాంగీమణి మందమందగతులన్ శృంగార ముప్పొంగఁగన్-ఆర

# 18. దోనూరి కోనేరుకవి

ఈ కోనేరుకవి తెలుఁగున బాలభాగవతమును రచియించెను. ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; శ్రీవత్సగోత్రుఁడు; ఆశ్వలాయన సూత్రుఁడు; దోనూరి నాగయ్యమంత్రి పుత్రుఁడు. కవి తనవృత్తాంతమును బాలభాగవతములోని యీ క్రిందిపద్యమునందుఁ జెప్పుకొని యున్నాఁడు :—

సీ. శ్రీమదహోబిలశ్రీనృసింహసమగ్రకరుణావివేషప్రకాశమహితు
భాసురసంస్కృతప్రాకృతాదికశాస్త్ర భాషాకవిత్వ సౌభాగ్యనిపుణు
జనవర్ణితాశ్వలాయనసూత్రపావను శ్రీవత్సగోత్రాబ్ధిశిశిరకరుని
సారస్వవినుతు దోనూరి నాగయమంత్రిపుత్రుఁడ నైనట్టి బుణ్యచరితుఁ
జతురభూనాయకాస్థాన సకలసుజన
వందితుని నన్నుఁ గోనేరు నాథసుకవి
నర్థిఁ బిలిపించి సత్కార మాచరించి
పలికె నిట్లని గంభీరభాషణముల.

ఇట్లు కవిని బిలిపించి గ్రంథరచన చేయుమన్నది తిరుమలరాజు. ఈ తిరుమలరాజు వసుచరిత్రము కృతినందినయతఁడుగాక యాతని పెద్ద తండ్రి కుమారుఁడయిన మఱియొక తిరుమలరాజు. బాలభాగవతము నందుఁ జెప్పఁబడిన వంశానుక్రమమునుబట్టి యార్వీటి బుక్కరాజునకు తిమ్మరాజనియు, కొండరాజనియు, శ్రీరంగరాజనియు ముగ్గురు కొమాళ్లు గలరు. వారిలో నగ్రజుఁడయిన తిమ్మరాజునకు భార్యయైన గోపమాంబ వలన తిరుమలరాజనియు, విఠ్ఠలరాజనియు, చినతిమ్మరాజనియు, పాప తిమ్మరాజనియు, నలుగురు పుత్రులు గలిగిరి. వీరిలో జ్యేష్ఠుఁడయిన తిరుమలరాజు కాలమునం దీ బాలభాగవతము రచింపఁబడినది. ఈ తిరుమలరాజు తండ్రియగు తిమ్మరాజునకు తమ్ముఁడయిన శ్రీరంగరాజునకు కోన

రాజు, తిమ్మరాజు, రామరాజు, తిరుమలరాజు, వేంకటరాజు అని యైదుగురు కొడుకులు. వీరిలో మూడవవాఁడైన రామరాజు కృష్ణదేవ రాయల యల్లుఁడు. ఈ రామరాజువద్దనే వసుచరిత్రమును రచించిన రామరాజభూషణుఁడు మొదట ఆస్థానకవీశ్వరుఁడుగానుండి యాతని మరణానంతర మతని తమ్ముఁడైన తిరుమలదేవరాయనికి వసుచరిత్రము నంకితము చేసెను. దీనినిబట్టి చూడఁగా శ్రీరంగరాయని పుత్రులైన రామరాజ తిరుమలదేవరాజులును, తిమ్మరాజుపుత్త్రుఁడైన తిరుమలరాజును పినతండ్రి పెదతండ్రి పుత్రు లగుటచేత సమకాలికులని యేర్పడు చున్నది. వీరిలో రామరాజు క్రీస్తుశకము ౧౫౪౨ వ సంవత్సరము మొదలుకొని ౧౫౬౫ వ సంవత్సరము వఱకును రాజ్యము చేసి యా సంవత్స రమునందు తాలికోటయుద్ధములో మృతుఁడగుటచేతను, ఆతనితమ్ముఁడైన తిరుమలదేవరాయలు ౧౫౬౫ వ సంవత్సరము మొదలుకొని ౧౫౭౩ వ సంవత్సరము వఱకును రాజ్యము చేసియుండుటచేతను, బాల భాగవతమును చేయించిన తిరుమలరాజుసహిత మించుమించుగా ౧౫౫౦ వ సంవత్సరప్రాంతమునం దనఁగా పదునాఱవశతాబ్ద మధ్యమునం దుండియున్నాఁ డనుట స్పష్టము. కడపమండలములోని కడప పట్టణము నకు పశ్చిమోత్తర దిగ్భాగమునందు ౧౬ మైళ్ళ దూరములోనున్న యెఱ్ఱగుడిపాడు గ్రామములోని విష్ణ్వాలయములోని శాలివాహనశకము ౧౪౭౩ వ సంవత్సరమునం దనఁగా హూణశకము ౧౫౫౧ వ సంవత్స రమునందు తిమ్మరాజు కుమారుఁడయిన తిరుమలరాజు దానము చేసి నట్టున్న శిలాశాసనముకూడ ఈ యంశమును స్థాపించుచున్నది. అయినను బళ్ళారిమండలములోని విజయనగరమునందలి హజారరాముని దేవాల యములో ముఖద్వారముయొక్క దక్షిణపు గోడమీఁద తిమ్మరాజు కుమారుఁ డయిన తిరుమలరాజు శాలివాహనశకము ౧౪౪౭ వ సంవత్స రమునందు దానముచేసినట్టు శిలాశాసన మొకటి కానఁబడుచున్నది.

దీనినిబట్టి చూడఁగా నితఁడు రామరాజు పెదతండ్రికుమారుఁ డగుటచేత రామరాజుకంటె పెద్దవాఁ డయినట్టును, సామంత రాజయిన యీ తిమ్మ రాజు ముందుగా మృతుఁడగుటచేత నాతని కుమారుఁ డయిన తిరుమల రాజు రామరాజుకంటె పదిసంవత్సరములు ముందుగానే రాజ్యమునకు వచ్చినట్టును, ఊహింపఁదగియున్నది. అందుచేత నీ తిరుమలరాజు క్రీస్తు శకము ౧౫౨౦వ సంవత్సరము మొదలుకొని ౧౫౫౧ వఱకును రాజ్యముచేసినట్టు రూఢిగా చెప్పవచ్చును. కాఁబట్టి దోనూరి కోనేరు నాథ కవియు పదునాఱవ శతాబ్దముయొక్క పూర్వార్థమునందే యుండి, తిరుమలరాజుయొక్క రాజ్యారంభదశలోనే బాలభాగవతమును రచి యించి యుండును. బాలభాగవతము తిరుమలరాజుయొక్క ప్రేరణచేతనే రచియింపఁబడినను, అది తిరుమలరాజున కంకితము చేయఁబడక యాతని ప్రార్థనమీఁద మృతుఁ డయిన యాతనితండ్రి తిమ్మరాజున కంకితము చేయఁబడినది. తెలుఁగు పుస్తకములయందును తామ్రశాసనాదుల యందును తిమ్మరాజునకు తిరుమలరాజనియు, తిరుమలరాజునకు తిమ్మ రాజనియు యథేచ్ఛముగా పర్యాయపదములవలె వాడఁబడినవి. సంస్కృత పండితులయిన పురాణవిద్వాంసు లొకరు రాచూరికోటలో నొక గుమ్మ మునకు దక్షిణముగా గోడలోఁగూర్చిన సుమారు నలువదియొక్క యడుగుల పొడుగును మూడడుగుల వెడల్పును గల రాతిపలకమీఁద చెక్కిన తెలుఁగు శాసనములో:

“శ్రీమతు మీసరగండగొత్త్రె గంగయ్యరెడ్డివారు పెద్దమానపురము నందు సుఖసంకథావినోదంబున పృథివీరాజ్యము చేయుచుండగాను తద్రాజ్య రత్నామణి అయిన శ్రీనారాయణదేవ దివ్యశ్రీపాదపద్మా రాధక సకలజన ప్రతిపాలక పరబలసాధక సకలదయాసాధక పుణ్యా గుణసనాథ విఠ్ఠలనాథ భూనాథుండు ఆదావాని తుంబికి మాగుద హోలువదుర్గాలు సాధించి తదనంతరంబు రాచూరి పట్టణ పట్టిసాభి

ముఖుండై సుఖసంకథావినోదంబున పృథివీరాజ్యము సేయుచునుండి శకవర్షంబులు ౧౨౧౬ అగు జయసంవత్సర మార్గశిర శుద్ధ దశమి రవివాసరంబునందు స్వరాష్ట్ర సమస్త ప్రజారక్షణార్థము గిరిదుర్గము రచియించెను."

అని కాకతీయప్రభువుల కాలములో శాలివాహన శకము ౧౨౧౬ వ సంవత్సరమునం దనఁగా క్రీస్తుశకము ౧౨౯౪ వ సంవత్సరమునందు గొట్టి గంగయ్యయు నొకానొక విఠ్ఠలరాజును ఉన్నట్లు చెప్పఁబడి యుండుటచేతను.

ఉ. "బొంకనిధర్మజుం డనఁగఁబోవనిపన్నగశాయి యాజిలోఁ
గొంకనియర్జునుండు కళంకుందులు లేనిశశాంకు డెన్నఁడుక్
గ్రుంకనిభానుఁ డన్యసతిఁ గోరనిజిష్ణుఁ డనంగఁబొల్చు ధ
ర్మాంకుఁడు విఠ్ఠలక్షితివరాగ్రణి మానధనాగ్రగణ్యుఁడై

మ. తనకు న్నెచ్చెలి యైనక్రీడిపయి నంతర్మోహబంధంబు వో
వనివాఁడై హరి విఠ్ఠలేశ్వరుఁడు తద్వంశంబునన్ సంపదల్
తనర న్నల్వదియేన్తరంబు లగునంతం దిమ్మభూపాలనం
దనుఁడై విఠ్ఠలరాజమూర్తి పొలిచెన్ ధర్మావనోద్యోగితన్"

ఇత్యాది పద్యములతో బాలభాగవతమునం దొకవిఠ్ఠలరాజు వర్ణింపఁబడియుండుటచేతను, ఆవిఠ్ఠలరాజే యీవిఠ్ఠలరాజని భ్రమించి యీకవియు విఠ్ఠలరాజును పదునాల్గవశతాబ్దారంభమునం దున్నట్లు వ్రాసియున్నారు. కాని వారు వివరించినకాలము సరియైనది కాదు. కాకతీయప్రభువులకాలములో నున్న విఠ్ఠలరాజు వేఱొకఁడు కాని యీతఁడు కాఁడు. అతఁ డొకవేళ రంగనాథరామాయణకృతికర్తయగు కోనబుద్ధరాజుతండ్రియైన విఠ్ఠలరాజయిన నయియుండవచ్చును. కోనేరు కవి తనబాలభాగవతమునందు పదునేనవశతాబ్దారంభమం దున్న శ్రీనా

ఘునిఁ బూర్వకవినిగా స్తుతించియున్నాఁడు. కోనేరుకవియు విఠ్ఠలనాథుఁడును పదునాల్గవ శతాబ్దారంభముననే యుండినపక్షమున తరువాత నూఱుసంవత్సరములకు పయిగా పదునేనవశతాబ్దములో నున్నశ్రీనాథునిఁ బూర్వకవినిగా పరిగణించుట సంభవించి యుండదుగదా ? కాఁబట్టి యీకవి పదునాఱవశతాబ్దమధ్యమునం దున్నాఁ డనుటయే విశ్వసనీయము. ఈతనికవిత్వ మనర్గళధార గలిగి హృదయరంజకము గానే కానఁబడుచున్నది. ఇప్పుడు బాలభాగవతములోని రెండుపద్యములనుమాత్ర మిం దుదాహరించుచున్నాను—

చ. కలియును రాజచిహ్నములు గ్రక్కున మాని భయోపతాపదు
ర్బలుఁ డయి తత్పదాబ్జములపై నిజహస్తము చేర్చి, దేవ! నీ
లలితకృపాణపుత్రిక ధళద్ధళితం బగుచున్న యంతలోఁ
జలమడియుక్ ఝళఝ్ఝళితసంగత మయ్యె మదీయచిత్తమున్. ఆ.౧

ఉ. మాన్యుల మమ్మెఱుంగ కవమానముచేతను దుష్టజన్మతా
దైన్యము కల్గె మాకు ననుతాపము నొందకుఁ డీర లింక నే
మన్యము నొల్ల మేమియును నచ్యుతుఁ గ్రమ్మఱఁజేరగల్గు సౌ
జన్య మనుగ్రహింపుఁ డని సారెకుఁ బ్రార్థనసేయ నత్తఱిన్. ఆ. ౨.

---

# 19. పింగళి సూరనార్యుఁడు

పింగళిసూరన్న నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; గౌతమగోత్రుఁడు. ఈతనితాత సూరన్న; తండ్రి యమరన్న; తల్లి యబ్బమ్మ; అమలన్న, ఎఱ్ఱన్న తమ్ములు. విష్ణుపురాణమును రచియించిన వెన్నెలగంటి సూరన్న తరువాత నున్నందున, ఈతనిని పింగలి (వెనుకటి) సూరన్న యందురని యొకానొకరు చెప్పిరిగాని యది సరిగాదు. పింగలి యనునది ఈకవియొక్క గృహనామము. ఈతనిపూర్వులును పింగలివారనియే చెప్పఁబడుచు వచ్చిరి. పింగలియనునది కృష్ణామండలములోని యొకయూరు. కాఁబట్టి యాగ్రామనామమునుబట్టి నే యీకవివంశమువారి కిటువంటిపేరు గలిగినది. ఈకవి ప్రభావతీప్రద్యుమునందు తనవంశమునకు మూలపురుషుఁ డయిన గోంకనామాత్యుని వర్ణించుచు, ఆతనిని పింగళిపురాంకునిగా నీక్రిందిపద్యమునందుఁ జెప్పియున్నాఁడు—

క. ఆగౌతమగోత్రంబున
నాగమనిధి పుట్టె గోంగ నామాత్యుఁడు స
ద్భోగక్షేత్రస్వామ్యస
మాగతిఁ బింగళిపురాంకుఁడై యతఁ డొప్పెన్.

ఈపింగళి గోంకనామాత్యుఁడే పేకియనుదానిని దాసినిగా నేలి నట్లీగ్రంథములోని యీక్రిందిపద్యమునఁ జెప్పఁబడినది—

ఉ. పేర్వెలయంగ నాఘనుఁడు పింగలి గోంకబుధోత్తముండు గం
ధర్వ నొకర్తుఁ బేకియనుదానిని దాసిగ నేలె యోగితా
గుర్వనుభావుఁడై నెఱపె గోపకుమారునిఖడ్గవర్ణనన్
బర్వపునిండువెన్నెలలపై నెఱిచూపెడుకీర్తిసంపదన్.

ఈపింగళివారి పేకికథను జను లీప్రాంతములయం దిప్పుడుసహి తము వాడుకగా చెప్పుకొనుచున్నారు. పింగళి గోంకనామాత్యుం డొకనాం డరణ్యములో సంచరించుచుండగా, ఆతని కొకసుందరమయిన పూస దొరకినదంట. అతం డాపూసను దెచ్చి తనపెట్టెలోవేసి దాంచె నంట. ఆదినమునందే పేకి యనుపేరిటి నొకతెవచ్చి వారియింట దాసిగా కుదిరి మిక్కిలి విశ్వాసముతో పనులుచేయ మొదలుపెట్టెనంట. ఇట్లు కొంతకాలము జరగిన తరువాత గోంకనామాత్యునిభార్య గర్భ వతియై ప్రసవసమయము సమీపించినప్పు డాపురుటింటిలో పేకిని కావలి పెట్టిరనియు, అది యాకావలియున్నదినములలో నొకనాంటిరాత్రి తాను శయనించినస్థలమునుండి లేవకయే నాలుకను దీర్ఘముగాచాచి దాసితో దీప మెగసనంద్రోచెననియు, అదిచూచి యాతని భార్య భయపడి జర గిన వృత్తాంతమును మఱునాండు భర్తతో చెప్పెననియు, అందుమీంద వారు దాని నేలాగుననైన వదల్చుకోవలెనని యెటువంటి యసాధ్యము లయినపనులు చెప్పినను పేకి వానినెల్ల నిమిషములో నిర్వహించుచు వచ్చెననియు, అందుమీంద వారు దానిని వదల్చుకొను సాధనములేక కాశికిపోయి గంగ తెమ్మని దానిని దూరదేశమునకుం బంపి యది యింట లేనిసమయమందు సమస్తసామగ్రితోను పొరుగూరికి లేచిపోయిరనియు, ఇంతలో పేకి కాశినుండి గంగతీసికొనివచ్చి యింటివారు పొరుగూరికి పోవునప్పు డింట దిగవిడిచిపోయిన నలువు రెత్తలేని పెద్దరాతిరుబ్బు రోటిని నెత్తిమీంద పెట్టుకొని యిది మఱచి వచ్చితిరని పొరుగూరికి పోయి వారికి చేర్చినదనియు, అప్పుడు గోంకనామాత్యుండు నీవు మమ్మెట్లు విడిచెదవని దానిని మంచిమాటలతో నడుగంగా నాండరణ్య ములో దొరికిన పూస నిచ్చివేసినయెడల పోయెదనని యది చెప్పె ననియు అంతట దానియభిమతమునుదీర్చి వారు దానిని పంపి వేసిరనియు, కథ చెప్పుచున్నారు.

ఈకవి పూర్వులు మొట్టమొదట కృష్ణామండలములోనివా రయినను, తరువాత దక్షిణదేశమునకు బోఁగా కృష్ణదేవరాయని యనంతరమునందు విజయనగరరాజ్యము చెడి యనేకులైన చిన్నచిన్నరాజుల యధీనమయి యున్నకాలములో నితఁడు కందనూలు (కర్నూలు) మండలములోని యాకువీడు, నంద్యాల, మొదలగుసంస్థానములలో జేరినట్టు కానఁబడుచున్నది. ఈతఁడు కృష్ణదేవరాయనియొక్క యాస్థానకవీశ్వరు లయిన యష్టదిగ్గజములలో నొక్కఁడని కొందఱు చెప్పుదురు గాని యీకవి యాకాలమునందుఁగాని యాస్థానమునందుఁగాని యున్నట్టు నిదర్శనము లేవియుఁ గానరావు. ఈసూరకవి పదునాఱవశతాబ్దమధ్యమునం దున్న ట్లూహించుట కనేకనిదర్శనములు కనఁబడుచున్నవి. ఈకవిరచించిన కళాపూర్ణోదయము నంద్యాల సంస్థానాధిపతియైన కృష్ణరాజున కంకితము చేయఁబడినది. ఈకృష్ణరా జార్వీటిబుక్కరాజుయొక్క యాఱవ సంతతి వాఁ డయినట్లు కళాపూర్ణోదయములోని కృతిపతియొక్క వంశానువర్ణనమువలన స్పష్టముగా గానఁబడుచున్నది. ఆర్వీటి బుక్కరాజుయొక్క పెద్దకుమారుఁడు సింగరాజు; అతని పుత్రుఁడు నరసింగరాజు; ఆతని పుత్రుఁడు నారపరాజు; ఆతని పుత్రుఁడు నరసింగరాజు; ఆతనిపుత్రుఁడు కళాపూర్ణోదయము కృతినందిన కృష్ణరాజు. ఆర్వీటి బుక్కరాజు క్రీస్తుశకము ౧౪23 వ సంవత్సరము మొదలుకొని ౧౪౮౧ వ సంవత్సరము వఱకును రాజ్యముచేసెను. అటుతరువాత వచ్చిన యతని సంతతివారు నలుగురు నొక్కొక్క రిరువదేసి సంవత్సరము లుండి రనుకొన్నపక్షమున, ఈకృష్ణరాజు క్రీస్తుశకము ౧౫౬౦ వ సంవత్సరప్రాంతముల నున్నట్లెంచవలసి యున్నది. ఈకృష్ణరాజు విజయనగరమును సదాశివదేవరాయలు పాలించుచుండిన కాలములో నంద్యాల రాజయి యున్నట్టు కానఁబడుచున్నది. కృష్ణదేవరాయల యనంతరమున ౧౫30 వ సంవత్సరమున రాజ్యమునకు వచ్చిన యచ్యుతదేవరాయఁడు ౧౫౪౨ వ సంవ

త్సరమునందు మృతినొందెను. ఆకాలమునందు సదాశివదేవరాయఁడు పసివాఁడయినందున సకలము తిమ్మరాయ రాజ్యమును దానాక్రమించుకొని కృష్ణదేవరాయల యల్లుఁడయిన రామరాజును రామరాజు తమ్ముఁడయిన తిరుమలదేవరాయని బట్టి చెఱలోఁ బెట్టవలెనని ప్రయత్నింపఁగా వారిద్దఱును పెనుగొండకు పాఱిపోయి యక్కడఁ గొంతసైన్యమును గూర్చుకొని తరువాత కందనూలురాజు మొదలయినవారి సాహాయ్యమును బొంది విజయనగరము మీఁదికి దండెత్తివచ్చి సలకము తిమ్మరాయ నోడించి చంపి ౧౫౪౩ వ సంవత్సరమునకు సరియైన శుభకృత్ సంవత్సర జ్యేష్ఠమాసమునందు బాలుఁడయిన సదాశివరాయని సింహాసనమెక్కించిరి. ఈకార్యమువలనఁ రామరాజు సదాశివరాజ్యసంస్థాపకుఁడని పేరుపొంది, పేరునకు సదాశివరాయఁడే రాజయినను నిజమైన యధికారమునంతను దానే వహించి రాజ్యపరిపాలనము చేయుచుండి ౧౫౬౫ వ సంవత్సరమునందు మహమ్మదీయరాష్ట్రముల వారిసేనతో తాలికోటవద్ద జరగిన యుద్ధమునందుఁ జంపఁబడెను. అప్పుడు మహమ్మదీయప్రభువులు విజయనగరమునందుఁ బ్రవేశించి యనేక క్రూరకృత్యములను జరపి రాజ్యమంతయు పాడుచేసి తమలోఁ దమకు సంభవించిన కలహమువలన రాజ్యమును పూర్ణముగా నాక్రమించుకొనక వెడలిపోయిరి. తరువాత నయిదు సంవత్సరములవఱకు రాజ్య మించుమించుగా నరాజకము కాఁగా నీలోపల ౧౫౬౭ వ సంవత్సరప్రాంతమున సదాశివరాయఁడు స్వర్గస్థుఁ డయ్యెను. ఆసంవత్సరమునందే తిరుమలదేవరాయఁడు విజయనగరమును విడిచి పెనుగొండఁజేరి తానురాజునని ప్రకటించి ప్రమోదూతసంవత్సరములో ననఁగా ౧౫౬౯ వ సంవత్సరమున పెనుగొండరాజ్యమునందు స్థిరపడి ౧౫౭౩ వ సంవత్సరమునందు లోకాంతరగతుఁ డయ్యెను. ౧౫౭౩ వ సంవత్సరమునకు సరియైన అంగిరస సంవత్సర వైశాఖశుద్ధదశమినాఁ డాతనిపుత్రుఁ డయిన శ్రీరంగరాయలు

రాజ్యమునకు వచ్చి ౧౫౮౫ వ సంవత్సరమువఱకును రాజ్యముచేసి స్వర్గస్థుఁ డయ్యెను. ౧౫౮౫ వ సంవత్సరమునకు సరియైన పార్థివసంవత్సర మాఖశుద్ధదశమినాఁ డాతని తమ్ముఁడైన వేంకటరాయఁడు సింహాసనమునకు వచ్చినతోడనే తనరాజధానిని పెనుగొండనుండి చంద్రగిరికి మార్చి ౧౬౧౪ వ సంవత్సరమువఱకును రాజ్యముచేసి సంతానహీనుఁడయి పరమపదమును బొందెను. నంద్యాల రాజైన కృష్ణరాజు సదాశివదేవరాయని కాలములోనివాఁడై యుండును, అతని రాజ్యకాలము ౧౫౪౭ వ సంవత్సరమునకు లోపల నారంభమై యుండును. కాఁబట్టి పింగళి సూరన్న నంద్యాలసంస్థానమునందుండి కృష్ణరాజునకుఁ గళాపూర్ణోదయము నంకితముచేసిన కాల మించుమించుగా ౧౫౬౦ వ సంవత్సరప్రాంత మని చెప్పవచ్చును. ఈసదాశివదేవరాయఁ డచ్యుతదేవరాయని కుమారుఁ డయినట్టు కొన్ని శిలాతామ్రశాసనములయందు జెప్పఁబడినదిగాని కృష్ణామండలములోని సత్తెనపల్లెతాలూకాలో దొరకిన శాలివాహనశకము ౧౪౭౦ సిద్ధార్థిసంవత్సరమునకు సరియైన క్రీస్తుశకము ౧౫౪౮ వ సంవత్సరపు సదాశివరాయల తామ్రశాసనములో నతఁడు రంగరాజునకును తిమ్మాంబకును బుత్రుఁ డయినట్టును రామరాజునకు మఱఁదియైనట్టును ఈక్రింది శ్లోకముచేఁ జెప్పఁబడినది:—

"తిమ్మాంబావరగర్భమౌక్తికమణీ రంగక్షితీంద్రాత్మజః
అత్రాలంకరణేన పాలితమహాకర్ణాటరాజ్యశ్రియా
శౌర్యౌదార్యదయావతా స్వభగినీభర్త్రా జగత్త్రాయిణా
రామాఖ్యప్రభుణా ప్యమాత్యతిలకైః క్లుప్తాభిషేకక్రమః"

ఈ శ్లోకమునందలి రంగక్షితీంద్రుఁడన్నది ప్రమాదజనితమేమో! నంద్యాలకృష్ణరాజు వేంకటపతిరాయల రాజ్యారంభదశలోను జీవించి

యున్నాఁడఁట. అందుచేత నతఁడు ౧౫౭౫ వ సంవత్సరమునకుఁ దరు వాతకూడ నల్పకాలము రాజ్యమేలియుండును.

మఱియును కళాపూర్ణోదయములో కృష్ణరాజు తాతయైన నారప రాజును వర్ణించుచో నతఁడు కుతుబ్ మల్కును కొండవీటివద్ద నోడిం చినట్లీక్రింది పద్యమునందుఁ జెప్పఁబడినది.

చ. వడలక యుత్కలేంద్రుని సవాయి బరీదు నడంచునుర్జయున్
గుదుపనమల్కుఁ దల్లడిలఁగొట్టె మహాద్భుతసంగరంబులో
నెదిరిచి కొండవీటికడ నెవ్వరు సాటి విచిత్రశౌర్యసం
పదపస నారసింహవిభుపట్టికి నారనృపాలమౌళికిన్.

గోలకొండయందు కుతుబ్ షావంశరాజ్య సంస్థాపకుఁ డయిన యీ కుతుబ్ మల్కు క్రీస్తుశకము ౧౫౧౨ వ సంవత్సరము మొదలుకొని ౧౫౪౩ వ సంవత్సరమువఱకును గోలకొండయందు రాజ్యముచేసెను. కృష్ణదేవరాయని కాలములో కొండవీటివద్ద జరగిన యీ యుద్ధము ౧౫౧౫ వ సంవత్సరమునందగుటచేత నాతనితో యుద్ధముచేసిన నారప రాజు మనుమఁడయిన కృష్ణరాజటుతరువాత ముప్పది నలువది సంవత్స రములైన పిమ్మట రాజ్యము చేసెననుట సత్యమునకు దూరమయి యుండదు. కాఁబట్టి దీనినిబట్టియు సూరకవి ౧౫౬౦ వ సంవత్సరప్రాంత ముల యందున్నట్లు నిశ్చయింపవలసియున్నది. ఈ విషయమునే రాఘవ పాండవీయములోని కృతిపతివంశానువర్ణనము నుండియు నొకవిధముగా నూహింపవచ్చును. రాఘవపాండవీయము కర్నూలు మండలములోని యాకువీటి సంస్థానాధిపతియైన పెదవెంకటాద్రి కంకితము చేయఁబడినది. ఆకువీడు కోవిలకుంటకు పడమట నాలుగుకోసులదూరములో తుంగభద్రా తీరమునం దున్నది. అందు విరూపాక్షస్వామి దేవాలయమున్నది. ఈ వేంకటాద్రియొక్క తాతయైన యిమ్మరాజు రాజమహేంద్రవరమును జయించినట్లీ క్రిందిపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది:-

క. రాజమహేంద్రవరాధిపు
రీజైత్రవిచిత్రములఁ బరిభ్రాజితుఁడై
యాజిఘనుండా యిమ్మ మ
హీజాని ప్రసిద్ధిఁగాంచె నెంతయు మహిమన్.

రాఘవపాండవీయ కృతిపతితాత యయిన యీ యిమ్మరాజును, కళాపూర్ణోదయ కృతిపతితాతయైన నారపరాజును, కృష్ణదేవరాయని కాలములో నాతనికి లోఁబడిన సామంతరాజు లయి యుండి, ఆతనితోఁ గలిసి సేనాధిపతులుగా మహమ్మదీయులు మొదలయిన వారితో యుద్ధముచేసిరని తెలియవచ్చుచున్నది. కృష్ణదేవరాయనికి సహాయులుగా నున్నవారిని వర్ణించిన కృష్ణరాజవిజయములోని యీ క్రిందిపద్య మీ సంగతిని కొంత స్థాపించుచున్నది:-

సీ. కోటలు దుర్గముల్ గొనుచు దోఃపటుబలధాటిచే మించు నార్వీటివారు
కంటకాహితకంఠలుంఠనోద్ధతలీల దంటలై తగు తోరగంటివారు
నిర్భరంబుగ శత్రునికరంబు నడఁగించి ధీరులై మించు గొబ్బూరివారు
చాలదోర్బలలీల నరదారిసంఘంబుఁ దూలించి వెలయు నంద్యాలవారు
నాదిగాఁగల్గు రాజులు మేదురగతిఁ
దుళువదొరలును బోయలు దురుసుగాఁగ
బ్రతిదినంబును ఘోరమౌ రణ మొనర్ప
నిలిచి పోరాడె గజపతి బలము లపుడు.

౧౫౧౫ వ సంవత్సరమునందు కృష్ణదేవరాయలు రాజమహేంద్రవరమును జయించెను. కాఁబట్టి యిమ్మరాజా కాలమునం దాతనితో నుండియుండును. దీనినిబట్టి చూచినను సూరనార్యుని కాలము పయిని చెప్పఁబడినదే యయి యుండవలెను. ఈ యాకువీటిరాజులు విజయనగర రాజులకు లోఁబడినవా రయినందుకు నిదర్శనముగా రాఘవపాండవీయములో నుపోద్ఘాతములో నీ క్రిందివాక్యము కానబడుచున్నది:

క. వడిగలతనాన నీగిని
విడిముడిపసఁ బ్రాభవమున విజయనగరిలోఁ
గడు నెన్న నేర్పుఁగల మేల్
నడకలఁ బెదవేంకటాద్రి నరవరుఁ డొప్పున్.

ఈ పద్యమునుబట్టి విజయనగరరాజ్యము చెడకముందనగా ౧౫౬౪ వ సంవత్సరమునకుఁ బూర్వమే రాఘవపాండవీయము రచియింపఁబడిన దగుట నిశ్చయము.

(కృష్ణదేవరాయని కాలములోనున్న ధూర్జటికవియొక్క మనుమఁడయిన కుమారధూర్జటి కృష్ణరాజవిజయమును రచించెను.) అతఁడు కృష్ణరాజవిజయములోని యీ రెండవపద్యమునందు,

సీ. జగదధిష్ఠానభాస్వజ్జ్యోతి యగువాఁడు
బ్రహ్మాదులదరు దురాయివాఁడు
చలిగట్టురాపట్టి సామేనఁ గలవాఁడు
చిఱునవ్వువెన్నెలల్ చిలుకువాఁడు
వాఁడువీఁడనక యెవ్వని నైనఁ బ్రోచువాఁ
డఖిలదైవతగురుం డైనవాఁడు
లీలమై శూలంబు కేలఁ బూనినవాఁడు
నలమేనిదొరతూపు గలుగువాఁడు
కలితపంపాతటంబున నిలుచువాఁడు
శ్రీవిరూపాక్షశివుఁడు రక్షించు నెప్పు
డఖిలసద్గుణమణిపేటి యాకువీటి
చిన్న వేంకటరాయని చెలువుమీఱ.

అని వర్ణించిన యీ చినవేంకటరాయఁడు రాఘవపాండవీయములో వర్ణింపబడిన కృతిపతి తమ్ముఁడయిన చినవేంకటాద్రియే యయినపక్షమున, ఈ పద్యమును పయికాలమును స్థిరపఱుచుచున్నది.

పింగళిసూరన్న కృష్ణదేవరాయనికాలములో నుండెనని యొకా నొక రనుచున్నారు. ఆర్వీటి బుక్కరాజు ముమ్మనుమఁడైన యళియ రామరాజే ౧౫౬౫ వ సంవత్సరమువఱకు నుండినప్పుడు బుక్క రాజు ముమ్మనుమని మనుమఁడయి కళాపూర్ణోదయ కృతిపతియైన నంద్యాల కృష్ణరా జంతకుఁబూర్వమునం దుండెననుట పొసఁగనేర నందున వారిమాట విశ్వాసార్హమయినది కాదు. ఇతఁడు ౧౫౬౦ వ సంవత్సరమునకు లోపలనుండుట తటస్థింపదు.

గ్రంథస్థములైన యీ నిదర్శనము లటుండఁగా మఱియొక కట్టు కథకూడ వాడుకలో నున్నది. ఈ సూరనార్యుఁ డల్లసానిపెద్దన్న మనుమ రాలిభర్త యనియు, చిన్నతనములో నితఁడు చదువులేక మూఢుఁడై తిరుగుచుండుటచూచి యితనినిమాత్రమే కాక యీతని భార్యను సహి తము మూఢభర్త నోరకెనని యెల్లవారును పరిహసింపుచువచ్చిరనియు, అందుమీఁద సూరనకు రోషమువచ్చి దేశాంతరముపోయి చదువుకొని పండితుఁడై వచ్చి రాఘవపాండవీయమును చేయ నారంభించెననియు, అప్పుడా చిన్నది తనభర్తను వెంటఁబెట్టుకొని తాతగారియొద్దకుఁ బోయి నీ మనుమఁడు రాఘవపాండవీయమును జేయుచున్నాఁడని చెప్పఁగా నతఁ డందులోని పద్యము నొకదానిని చదువుమని యడిగెననియు, అందు మీఁద సూరన,

"తలఁపం జొప్పడి యొప్పె నప్పుడు"

అని పద్యమును జదువ నారంభింపఁగానే యల్లసానిపెద్దన్న 'యింత లోనే నాలుగువిఱుపులా' యని యాక్షేపించె ననియు, తరువాత సూరన పైభాగము నందుకొని,

"............తదుద్యజ్జైత్రయాత్రాసము

త్కలికారింఖదసంఖ్యసంఖ్యజయవత్కంఖాణరింఖావిశ్రం

ఖలసంఘాతధరాపరాగపటలాక్రాంతంబు మిన్నే రవ
ర్గళభేరీరవనిర్దళద్గగనరేఖా లేపసంకాకృతిన్.

అని చదువఁగా మెచ్చుకొనెననియు చెప్పుదురు. ఈ కథ యెట్టిదైనను సూరన కృష్ణదేవరాయని తరువాతి కాలపువాఁడైనట్టు స్థిరపఱుచుచున్నది. అల్లసాని పెద్దన కృష్ణదేవరాయని యనంతరమం దనఁగా ౧౫౩౦ వ సంవత్సరమునకు తరువాతకూడ జీవించియున్నందున, సూరనార్యుఁ డల్లసాని పెద్దన్న మనుమరాలి మగఁడయినను కావచ్చును. కళాపూర్ణోదయమును రచింపకపూర్వమునం దీకవి యాకువీటిరాజుల వద్ద మొట్టమొదటనుండి రాఘవపాండవీయమును జేసి వారి కంకితము చేయుటచే రాఘవపాండవీయము నీకవి ౧౫౫౦ వ సంవత్సర ప్రాంతములయందు మంచి పడుచుతనములో రచియించియుండును. ఇంతకుఁ బూర్వపుదైన గారుడపురాణము బాలకవిత్వ మగుటచే నశించిన దేమో! తిక్కన సోమయాజికి తరువాత నింత ప్రౌఢముగా కవిత్వము చెప్పిన తెనుఁగుకవి మఱియొకఁడు లేఁడు. ఈ సూరన కావ్యరచనయందు సర్వతోముఖ చాతుర్యము కలవాఁడు. ఈతని కవిత్వము మృదుపదగుంభితమై ద్రాక్షాపాకముగా నుండును. ప్రభావతీ ప్రద్యుమ్నములోని యీ క్రింది పద్యమువలన నితఁడు గరుడపురాణమును, రాఘవ పాండవీయమును, కళాపూర్ణోదయమును, ప్రభావతీ ప్రద్యుమ్నమును, మఱికొన్ని గ్రంథములును రచించినట్లు కానఁబడుచున్నది.

మ. జనముల్ మెచ్చఁగ ముద్రచించితి సదంచద్వైఖరిన్ గారుడం
బును శ్రీరాఘవ పాండవీయముఁ గళాపూర్ణోదయంబున్ మరిన్
దెనుఁగుంగబ్బము లెన్ని యేనియును మత్పిత్రాదివంశాభివ
ర్ణన లేమిం బరితుష్టి నాకవి యొనర్పంజాల వత్సంబునన్.

ఇందు పేర్కొనఁబడినవానిలో గారుడపురాణము మాత్రము మాకు లభించినదికాదు. రాఘవపాండవీయము క్లిష్టార్థములు లేకుండ

మృదుమధుర సులభపదములతో రామాయణభారతార్థములు వచ్చునట్లుగా రచియింపబడిన శ్లేషకావ్యమును రచియించుట మఱియొకరికి సాధ్యముకాదు. ఈగ్రంథముయొక్క ప్రౌఢిమను కృష్ణరాజు మెచ్చుకొన్నట్లుగా కవియే కళాపూర్ణోదయమునం దిట్లు చెప్పియున్నాఁడు—

మ. ఇటము న్గారుడసంహితాదికృతు లీవింపొందఁగాఁ జెక్కొన
ర్చుట విన్నారము చెప్పనేల యవి సంస్తుత్యోభయశ్లేషసం
ఘటనన్ రాఘవపాండవీయకృతి శక్యంబే రచింపంగ ని
చ్చట నెవ్వారికి నీకె చెల్లె నది భాషాకావ్యముం జేయఁగన్.

కళాపూర్ణోదయము విచిత్ర మయినకల్పితకథను గలదై తెలుఁగు గ్రంథములలో నిరుపమానముగా నున్నది. సంస్కృతనాటకములలో మాత్ర మిటువంటి కథాచమత్కారము కానఁబడుచున్నదిగాని తెలుఁగులో నెక్కడను నింతవింతయైన కల్పితకథ మఱియొకటి కానరాదు. ఇది నాతికఠినమై మృదుమధురశైలి గలదై యున్నది. ప్రభావతీప్రద్యుమ్నము చక్కని స్వభావోక్తులను గలదయి లలితఘటితమై కథాచమత్కృతి గలిగి చదువువారికి కర్ణరసాయనముగా నుండెడు ప్రౌఢకావ్యము. ఈతఁడు రచియించినపుస్తకములలో నిది కడపటి దగుటచేఁ గవి దీనిని ౧౫౭౦ వ సంవత్సరప్రాంతములయందు రచియించి యుండును. ఈకాలమునకే యీతఁడు వయసుమీఱినవాఁ డగుటచేతఁ దరువాత శీఘ్రకాలములోనే కీర్తిశేషుఁ డయి యుండవచ్చును. ఈతని కవిత్వశైలి తెలియుటకై పైపుస్తకములనుండి రెండేసిపద్యముల నిం దుదాహరించుచున్నాను.

రాఘవపాండవీయము

ఉ. హారిమృగవ్యనవ్యవిహితాదరుఁ డాధరణీతలేశుఁ డ
ధ్వారచితశ్రమాకలితుఁడై కడు మెచ్చె సురాపగాజలా

సారసపూగమూర్ఛితమసారససారససారసౌరభో
దీరణకారణంబు నతిధీరసమీరకిశోరవారముల్. ఆ. ౧.

చ. అలవి యెఱుంగలేక యితరాంగనలంబలె నన్నునిమ్మెయిం
గలఁచుట యుక్తమే యెుదవుఁగాక భవత్కృతదుష్టచేష్టితం
బులకు ఫలంబు నేఁ డొకటి పూర్ణముగా నుపభోగ్యమై కడుం
జలమున నెందు నీమగతనంబు కడంకల రూపుమాలుటల్. ఆ. 3.

కళాపూర్ణోదయము

శా. అమ్మా నీపలు కెల్ల నెంతయు నిజంబై యిష్టగాన్పించె నే
నిమ్మాయావిప్రకార మి ట్లగుట యూహింపంగలే కొక్కయ
ర్థమ్ముల్ వీనికృపం గడింతునని యత్యంతాశ ప్రేరేపఁగా
నిమ్మాడ్కిం దెగివచ్చితిం దెరువులే దీపాటు దప్పింపఁగన్. ఆ. ౪.

చ. అన నిఁక నేమిచెప్పుదు జనాధిప యాయతిముఖ్యుఁ డంత నె
మ్మనమును బట్టలేక ప్రతిమన్ బిగియారఁ గవుంగిలించె నిం
పొనరఁగ లేచివచ్చి కడ నొక్కమఱుంగున నష్టసుగ్రహుం
డునికి యెఱుంగమిన్ నగియె నుండగలే కతఁడుం గికాకికన్. ఆ. ౮.

ప్రభావతీప్రద్యుమ్నము.

ఉ. పాడిదొఱంగ జన్నె యొకపట్టునఁ గొల్చెదనంచు నెంతమా
టాడితి సర్వదైవతకులాధిప యోడలబంట్లువచ్చు బం
ట్లోడలవచ్చు నోండొరుల కొక్కొకచో ననువాదుటాలకుం
గూడుట యిష్టబంధులకుఁ గ్రొత్తయె యిత్తఱి నింతయేటికిన్. ఆ. ౧

ఉ. వట్టిమఱుంగువెట్టి నొదువం బనిలే దదియెల్ల భేరిజో
కొట్టుటగాక నిన్ గెలువఁగూడునె మాటల నీవుకంటె న
న్నట్టిశుభాంగుఁ డీరమణిమానసల కాస్పద మిప్పు డాతనిన్
గట్టిగ నన్వయాదికథనంబుగఁ దెల్పి యనుగ్రహింపవే. ఆ. 3.

పింగళిసూరన్న గిరిజాకళ్యాణములోని దని యీక్రిందిపద్యము రంగరాట్ఛందస్సులో నుదాహరింపఁబడి యున్నదిగాని యీపుస్తకము నాకు లభించలేదు.

క. కోపాటోపంబున ధర • జీపాలకచంద్రముఁడు మునిశిఖామణులన్
   ద్రోపించిన వారు దురా • లాపము లాడుచును బోయి రాసమయమునన్.

# 20. అద్దంకి గంగాధరకవి.

ఈ గంగాధరకవి నియోగిబ్రాహ్మణుఁడు; వీరనామాత్యుని పుత్రుఁడు. (ఇతఁడు గోలకొండనబాబైన మల్కిభరాము (ఇబ్రహీమ్ మల్కు) వద్ద నాస్థానకవీశ్వరుఁడుగా నుండెను.) యయాతిచరిత్రమును రచియించిన పొన్నికంటి తెలగనార్యుఁడుగాక తనగ్రంథమును మహమ్మదీయుల కంకితముచేసిన తెలుఁగుకవి యీతఁ డొక్కఁడే యైనట్టు కానఁబడుచున్నాఁడు. ఈకవి రచియించిన గ్రంథములలో ముఖ్యమైనది తపతీసంవరణ మను శృంగారప్రబంధము. ఈగ్రంథమునందు కృతినాయకుఁడైనమల్కిభరా మీక్రింది రీతిని వర్ణింపఁబడెను.—

సీ. సకలవేదపురాణశాస్త్రపారగుఁ లైన
            యొంటరివిద్వాంసు లొక్కచోట
   నష్టభాషలయందు నాంధ్యంబు లేకుండు
            హరాంతకారికవీంద్రు లొక్కవంక
   గజపతి నరపతి క్ష్మాభర్త లంపిన
            యొడికంపురాయబా ర్లొక్కదండ
   మేరుమందరముల మించఁగల్గినమన్ని
            యులు దండనాథు లొక్కొక్కయెడలఁ

   జేరికొల్వ భద్రాసనాసీనుఁ డగుచు
   రమ్యగుణహారి మల్కిభరామశౌరి
   భారతక్షీరమయసింధుబంధమధ్య
   లలిత పుణ్యకథాసుధాలహరిఁ దేలి.

దక్షిణహిందూస్థానమునందు భామినీవంశీయతురుష్క రాష్ట్రావసానదశయందు స్వతంత్రులయిన యయిదుగురు మహమ్మదీయ ప్రభువులలో నొకఁడయి గోలకొండ రాజ్యసంస్థాపకుఁడయి క్రీస్తుశకము ౧౫౧౮వ సంవత్సరము మొదలు ౧౫౪౩ సం॥ వఱకును రాజ్యముచేసిన కుతుబ్ షా కీయిబ్రహీము చతుర్థపుత్రుఁడు. గోలకొండ రాజ్యస్థాపకుఁడయిన కుతుబ్ షా హిందువులను మాత్రమే కాక మహమ్మదీయులను సహితమనేకులను జయించి తన రాజ్యమును వ్యాపింపఁజేసెను. ఆతని విజయములను గూర్చి తపతీసంవరణములోని యీ క్రింది పద్యము కొంత వివరించుచున్నది—

సీ. పడమటను సవాయి బసవసిఁ గాఁజేసి
యచటఁ గొయ్యలకొండ నావరించె
దమదిమల్లాఖాను దక్షిణంబునఁ గొట్టి
హరియించెఁ బానుగల్లాదిగిరుల
నుత్తరంబునఁ బరిదోడి పాఱఁగఁదోలి
మెతుకుదుర్గం బాక్రమించి మించెఁ
బ్రథమదిక్కున నొడ్డి క్షాత్రసామంతుల
ధట్టించి కంబముమెట్టు గొనియె
నతనిఁ బొగడంగఁ దగదె యాచతురసీతి
రాఢిగిరిదుర్గలుంఠనప్రౌఢతేజు
వాహశిఖరాధిరోహ రేవంతమూర్తి
కుతుబుశాహినిత్మ్రవాలు గుణవిశాలు.

అయినను కృష్ణదేవరాయలు క్రీస్తుశకము ౧౫౧౬ వ సంవత్సరమునందు తెలుఁగుదేశమంతయు జయించి, ఓఢ్రరాజులయిన గజపతుల కొమార్తెను తాను వివాహమాడుటచేత తత్సంబంధమునుబట్టి రాజమహేంద్రవరము ప్రధాననగరముగాఁగల యాంధ్రదేశమునంతను గజ

పతులకిచ్చెను. కాని కృష్ణదేవరాయల మరణానంతరమున కుతుబ్‌షా కొండపల్లివద్ద జరిగిన యుద్ధములో హిందువుల నోడించి కృష్ణా గోదావరీ మధ్యరాష్ట్రమునంతను నాక్రమించుకొనెను. ఈయంశము నే పూర్వోక్తగ్రంథములోని

"కటకేశ్వరునిఁ దోలి కైవసంబుగఁజేసెఁ
గొండంతజయముత్తొఁ గొండపల్లి."

అను సీసపాదము చెప్పుచున్నది. కుతుబ్‌షాయొక్క యనంతరమునందాతని ద్వితీయపుత్త్రుఁడైన జామ్‌షీదు రాజ్యమునకు వచ్చి క్రీస్తుశకము ౧౫౪౩ వ సంవత్సరము మొదలుకొని ౧౫౫౦ వ సంవత్సరమువఱకును రాజ్యముచేసెను. ఇతఁడు మహాక్రూరుఁడు, రాజ్యాశచేత తన యన్నగారి నేత్రములను తీయించివేసి యాతని నంధునిగాఁ జేసిన పాపాత్ముఁడు. ఈతని దుష్టస్వభావము నెఱిఁగి భయపడి పాఱిపోయి యిభరామ్‌షా తనయన్నగారి మరణమువఱకును విజయనగరమునందు కృష్ణదేవరాయని యల్లుఁడైన రామరాజుయొక్క సంరక్షణమునందుండెను. ఇతఁడక్కడనున్న కాలములోనే రామరాజభూషణుఁడు మొదలయిన కవులతోడి సహవాసముచేత సంస్కృతాంధ్ర సాహిత్యమును సంపాదించి, కవిత్వమునం దభిరుచిగలవాఁడయి క్రీస్తుశకము ౧౫౫౦ వ సంవత్సరమునందు తాను రాజ్యమునకు వచ్చినది మొదలుకొని యాంధ్రకవులనాదరించి పెక్కుకృతుల నొందెను. ఇతఁడు తన రాజ్యకాలములో హిందువులతో మైత్రిగలవాఁడయి హిందూరాజులను వారివారి కవీశ్వరులతోడఁ గూడ తన యాస్థానమునకుఁ బిలిపించి తఱుచుగా పండితగోష్ఠిని కాలము గడుపుచువచ్చెను. ఈతఁడొక్కసారి తన యాస్థానమునకు పెమ్మసాని తిమ్మనాయనిని, అనంతపురపు హండెయప్పయను, మట్ల అనంతరాజును, బంగారేచమనాయనిని, వేరమల్లారెడ్డిని, పిలిపించి వారివారి కవీశ్వరులు వారివారిని స్తుతించిన పద్యములను వినుచుండఁగా కాపువాఁ

డయిన మల్లారెడ్డి కవీశ్వరుఁడు చెప్పిన యీ క్రింది పద్యమునకు రాజులందఱును గోపించి యుద్ధసన్నద్ధులయినప్పుడు మల్కిభరామువారిని వారించి శాంతపఱిచినట్లొక పుస్తకమున వ్రాయఁబడియున్నది.—

చ. బలరిపుభోగ కృష్ణనరపాలుని పేరకుమారమల్ల మీ
కలితయశఃప్రభావములు కన్గొనలే కలకట్టుమన్నెమూఁ
కలు తల లొల్లరో బిరుదుగద్దియములుఁ చదివించుకొంచు రా
కొలఁదిమెఱుంగఁజాల కలకుక్కలు చుక్కలఁజూచి కూయవే.

పయిని జెప్పిన యితర రాజుల కవులు చెప్పినపద్యములుకూడ నింపుగా నుండవచ్చును గాన వాటిని వరుసగా నిందు క్రిందఁ బొందుపఱుచు చున్నాను.—

ఉ. చాలుగుఱాలు మూళిగడిసంగడిరాజులు గొల్వరంగహో
హాలమహోగ్రఘాలదహనాత్మునియంతటిధాటివాఁడు నా
యేలిక వేంకటాద్రిధరణీశునితిమ్మఁడు పెమ్మసానిభూ
పాలుఁడు హెచ్చు ధాత్రిఁ గలపార్థివు లెల్లను లొచ్చు వీనికిన్.

ఉ. మట్టకళాఁడు బెట్టురికి మన్నెకుమారుల సీమ ధూళిగాఁ
గొట్టకమానఁడేగద యకుంఠితసింహతలాధిరాయఁ డీ
పెట్టినదండుఁ దీఁడు రణభీష్ముఁడు పాండియయప్పశౌరికిం
బెట్టుఁడు వేగ దండములు బింకము లేటికి శత్రుభూపతుల్.

ఉ. కొద్దిసిరాఁడు దిండుఱికి కోటులుకొమ్మలు గొన్నెశూరుఁ డా
గద్దఱిగబ్బిరాచపులి గండరబాలుఁడు మట్లనంతుఁ డే
ప్రొద్దును వైరిభూభుజులపొంక మడంపనె పుట్టినాఁడు మీ
పెద్దఱికాలు సాగ విఁకఁ బ్రేలకుఁడీ గడిమన్నెభూపతుల్.

ఉ. ఎక్కనఁ గొండతోఁ దగరు డీకొని తాఁకినజోక గాక యీ
బిక్కపకీరుమన్నెసరిబేసిదొరల్ మొన లందు నిల్వ నా

నిక్కము బంగరేచనృప నీవు రణస్థలి మోహరించినన్
బక్కున లోకముల్ పగిలిపాఱవె కూలవె దిగ్గజంబులున్.

ఈ యిభరామమల్కు (ఇబ్రహీమ్ మల్కు) క్రీస్తుశకము ౧౫౬౭ వ సంవత్సరమునందు రాజమహేంద్రవరమువఱకు దండెత్తి వచ్చి దానిని జయించి శ్రీకాకుళము వఱకునుగల కళింగదేశమునంతను స్వాధీనము చేసికొనెను. ఇతఁడు హూణశకము ౧౫౫౦ వ సంవత్సరము మొదలుకొని ౧౫౮౧ వ సంవత్సరము వఱకును రాజ్యము చేసినందున, ఈతని యాస్థానకవియైన గంగాధరకవియు నాకాలమునందే యున్న వాఁడు. ఈకవికృత మయిన తపతీసంవరణము సరసమయిన దయి మంచి కల్పనలఁగలిగి దాదాపుగా వసుచరిత్రమునుబోలి వఱలుచున్నది. ఈతని కవిత్వధోరణిని దెల్పుటకై తపతీసంవరణములోనుండి రెండు పద్యముల నిందుఁ జూపుచున్నాను.—

ఉ. అక్కమలాక్షి హస్తములయందము నేమనివిన్నవింతు నే
నొక్కొకవేళ నక్కిసలయోష్ఠిసమీపమునందునున్నచోఁ
జొక్కపుఁదమ్మిపూవు లనుచుం దరుణభ్రమరాళి వ్రాలుఁ బెం
పెక్కినపల్లవంబు లనుచిచ్చను డాయును గండుగోయిలల్. ఆ. ౨.

మ. చివురుందామరపాకులన్ సలలితశ్రీఖండపంకంబులన్
నవనీహారజలాభిషేచనములన్ నాళీకపాళీమృణా
ళవితానంబుల మౌక్తికగ్రథితమాల్యశ్రేణులన్ బాలప
ల్లవతల్పంబుల శీతలక్రియలు చాలం జేసి రయ్యింతికిన్. ఆ. ౩.

# 21. పొన్నికంటి తెలగన్న

ఈ తెలగనార్యుఁ డచ్చతెనుఁగు గ్రంథములు చేసినవారిలో మొదటివాఁడు. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; భావనార్యుని పుత్రుఁడు. అచ్చతెనుఁగునందు గ్రంథములు రచియించుట మిక్కిలి కష్టము. ఈకవికిఁ బూర్వమునం దెవ్వరును శుద్ధాంధ్రభాషలో ప్రబంధములు చేయుటకు ప్రయత్నించినవారైనను లేరు. ఇట్టిగ్రంథరచన కితఁడు మొట్టమొదటివాఁడే యయినను, ఈకవి రచియించిన యయాతి చరిత్రము సర్వవిధములచేతను కూచిమంచి తిమ్మకవి రచియించిన యచ్చతెలుఁగు పుస్తకములకంటె శ్రేష్ఠతరముగా నున్నదని నాయభిప్రాయము. ఈయనకుఁ బూర్వమునం దుండినకవులు కొందఱు తమ కృతులలో నక్కడక్కడ నొక్కొక్క యచ్చతెలుఁగు పద్యమును వేయుచు వచ్చిరి. అట్టివానిని జూచియే జను లత్యాశ్చర్యపడుచుండిరి. ఈయంశము కృతిపతి యన్నట్లుగా యయాతి చరిత్రముయొక్క పీఠిక యం దీక్రిందిపద్యముతోఁ జెప్పఁబడినది.—

ఉ. అచ్చతెనుంగుపద్దె మొక టైనను గబ్బములోనఁ నుండినన్
హెచ్చని యాడు చుందు రదియెన్నుచుఁ బెద్దలు పొత్త మెల్లని
ట్లచ్చతెనుంగున న్నొడువ నంకులచంద మెఱుంగువారు నిన్
మెచ్చరొ యబ్బురం బనరొ మేలనరో కొనియాడరో నినున్.

ఈకవి తనగ్రంథము నమీనుఖానునకు కృతి యిచ్చెను. ఈ యయాతిచరిత్రముగాక యింకొక తెలుఁగు గ్రంథము మాత్రము మహమ్మదీయప్రభువున కంకితము చేయఁబడెను. (అమీనుఖాను ఇభరాముశాయొద్ద కొలువున్నట్టు యయాతి చరిత్రములోని యీక్రిందిపద్యము వలనఁ దెలియవచ్చుచున్నది.—)

సీ. తెలిని సింగంపుగద్దియలరా తెఱగంటిదొరలెల్ల మోడ్పుచేతులనెకొల్వఁ
బూని నేఁబదియాఱుమానిసి నెలవులపుడమిఱేం డ్లాడిగంబులకుఁజొరగ
శ్రీని మున్నీటిలో దీవు లన్నియు నేలుమన్నీలు మెట్టదామరలకెరఁగఁ
దనతేజు సుడిగట్టువెనుక చీఁకటి నెల్ల విరియించు తమ్ములమిందుగాఁగ
వెలయు మలికిభరాముశాఁ గొలిచిమనుచు
కలనఁ దనచెయ్యి మీఁదుగాఁ గడిమిమెఱసి
మేటిసిరు లందునట్టి యమీనుఖాన
యొడయఁ డొకనాఁడు నిండుపేరోలగమున.

(ఇబ్రహీమునే మనవారు గ్రంథములలో నిభరామని వాడి యున్నారు. ఈతనిపేరనే కృష్ణామండలములో నిభరామపురమని యొకయూరు కట్టఁబడినది. ఈతని పూర్ణమైన పేరు ఇబ్రహీమ్ కుతుబ్ షా. ఇతఁడు కుతుబ్ షా వంశీయులయిన గోలకొండనవాబులలో మూఁడవవాఁడు. ఈతని తండ్రిపేరు జామ్షీద్ కులికుతుబ్ షా. ఇతఁడు క్రీస్తుశకము ౧౫౫౦ వ సంవత్సరము మొదలుకొని ౧౫౮౧ వ సంవత్సరము వఱకును రాజ్యము చేసెను.) కాఁబట్టి గ్రంథకర్త యయిన తెలగనార్యుఁడును ఈకాలములోనే యున్నట్టు స్పష్టమగుచున్నది. యయాతిచరిత్రములోని యీక్రింది పద్యములో నమీనుఖానుని కొడుకయిన ఫాజిలఖాన్ విజయనగరపురాజైన శ్రీరంగరాయని గోలకొండకుఁ దీసికొనివచ్చి మైత్రిచేసినట్టు చెప్పఁబడి యున్నది.—

చ. కని తను రాజు లెన్నుకొనఁగాఁ బెనుపౌఁజులతో సిరంగరా
యనికడ కేగి మాటలనె యాయనఁ దేటిచి తెచ్చి మల్కుకున్
మనుకువ నంటుచేసి యొరిమం దగ మెచ్చులుగొన్న మేటి నే
మని పొగడంగవచ్చు నవునౌ సిఁక ఫాజిలఖానరాయనిన్.

ఇంనువల్ల శ్రీరంగరాయని రాజ్యకాలములో యయాతిచరిత్రము రచియింపఁబడినట్టు స్పష్టమగుచున్నది. తిరుమలదేవరాయని పుత్రుఁడైన

శ్రీరంగరాయఁడు క్రీస్తుశకము ౧౫౭౪ వ సంవత్సరము మొదలుకొని ౧౫౮౫ వ సంవత్సరమువఱకును రాజ్యము చేసినట్టు కానఁబడుచున్నది. శ్రీరంగరాయలు రాజ్యమునకు వచ్చినతరువాతను, ఇబ్రహీమ్‌షా మరణము పొందకముునుపును, యయాతిచరిత్రము రచియింపఁబడి యున్నందున, ౧౫౭౪ వ సంవత్సరమునకును ౧౫౮౧ వ సంవత్సరమునకును నుధ్యకాలమునందు యయాతిచరిత్రము రచియింపఁబడినట్టు నిశ్చయముగాఁ దెలియవచ్చుచున్నది. ఈకవియొక్క శైలి మొదలైనవి మిక్కిలి చక్కఁగా నున్నవని యీవఱకే చెప్పియున్నాను. శైలి తెలియుటకయి యయాతిచరిత్రములోని రెండు పద్యముల నిందుదాహరించుచున్నాను—

ఉ. పిన్నవుగాన నీవు కడుఁ బ్రేముడి ముంగిటిలోనఁ దిమ్మరన్
సిన్నబలెం దలంపఁబడు నీ విటనిల్చిన పెక్కుఁలేండ్లు మా
కన్నను వాచు నీ మొగము గానక యెప్పుడుఁ జూడ కున్న నా
యన్న యిదేటి కీతమక మారసిచూచిన వింతవాడవే—ఆ. 3

ఉ. తొంగలిపువ్వుఁదేనియలఁ దూఁకొని మత్తలి తుమ్మెదల్ పయిన్
బొంగుచు వ్రాల నొ ప్పెనఁగఁ బూచినపొన్నఁ గడంగికాంచి మున్
గ్రుంగినయావిసంబు వెస మీఁదికిఁ బిచ్చిలువేఁడికంటియా
జంగ మటంచు మ్రొక్కె నొకచాన నెలంతలు చూచి నవ్వఁగ౯—ఆ౪

# 22. రామరాజ భూషణుఁడు

రామరాజభూషణుఁడు వసుచరిత్రమను శృంగారప్రబంధమును రచియించిన మహాకవి. (రామరాజభూషణుఁడనునది రామరాజుయొక్క యాస్థానమం దుండుటచేత వచ్చిన బిరుదునామమనియు నిజమయిన పేరు భట్టుమూర్తి యనియు చెప్పుదురు.) ఇతని జన్మభూమి బట్టుపల్లెయను గ్రామము. ఈ గ్రామమును కృష్ణదేవరాయలు కవిత్వమునందుఁ బ్రవీణులై ప్రబంధాంకమువారని బిరుదుపొందిన యీతని పూర్వులగు బట్టురాజుల కిచ్చెను. ఈబట్టుపల్లె బళ్ళారిమండలములోని పాలమండలమునకు సమీపమున నున్నదని యొకరును, కడపమండలములోని పులివెందల తాలూకాలో నున్నదని యొకరును వ్రాసియున్నారు. ఈ కవి కృష్ణదేవరాయల కాలములోఁ బుట్టి యుండవచ్చును గాని యాతని యాస్థానమునందలి యష్టదిగ్గజము లనఁబడు కవులలో నొకఁడుమాత్రము కాడు. ఇతఁడు మొట్టమొదట ౧౫౪౨ వ సంవత్సరము మొదలుకొని ౧౫౬౫ వ సంవత్సరమువఱకును సదాశివరాయల పేర విజయనగరములో రాజ్యముచేసిన కృష్ణదేవరాయల యల్లుఁడయిన రామరాజు యొక్క యంతిమదశలో నతని యాస్థానమునందుఁ బ్రవేశించి యాతని మీఁదఁ గొన్ని చాటుప్రబంధములను చేసి రామరాజుభూషణుఁడని బిరుదు పేరొందెను. కాఁబట్టి యీతని కవిత్వము ౧౫౬౦ వ సంవత్సర ప్రాంతములయం దారంభ మయినదని చెప్పవచ్చును. ఈతఁడు రామరాజుయొక్క జీవితకాలములోనే యాతనిమీఁద కృతులు చెప్పినట్టు వసుచరిత్ర కృతినాయకుఁడయిన తిరుమలదేవరాయలు కవినిగూర్చి పలికిన యీ క్రింది పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

శా. శ్రీరామక్షితిపున్మదగ్రజు జయశ్రీలోలు నానాకళా
పారీణున్ బహుసంస్కృతాంధ్రకృతులం బల్మాఱు మెప్పించి త

త్కారుణ్యంబున రత్నహారహయవేదండాగ్రహారాది స
త్కారం బందితి రామభూషణకవీ ధన్యుండ వీవన్నిటన్—ఆ. ౧

ఈ పద్యమునందుఁ జెప్పఁబడినతఁడు కృష్ణదేవరాయని యల్లుఁడయిన యారవీటి రామరాజు. కృష్ణదేవరాయని యల్లుఁడయినందున నీతనికి నళియరామరాజని సాధారణముగా వాడుకకలదు. ఈతఁడు కృష్ణదేవరాయని యల్లుఁడయి సదాశివరాయని రాజ్యభారమును వహించిన సంగతి రామాభ్యుదయములోని యవతారికయందీక్రింది పద్యమునఁ జెప్పఁబడినది—

ఉ. ఆపటుకీర్తి రామవసుధాధిపచంద్రుఁడు కృష్ణరాయధా
త్రీపతిసార్వభౌమదుహితృప్రియుఁడై వితతప్రతాపసం
తాపితశత్రుఁడై యలసదాశివరాయనిరంతరాయవి
ద్యాపురరాజ్యలక్ష్మికి విధానము దా నయి మించె నెంతయున్.

ఈ రామరాజు వివాహము చేసికొన్న కృష్ణదేవరాయని కూఁతురి పేరు తిరుమలాంబ. ఆమెవలన నీతనికి కృష్ణరాజు, పెదతిమ్మరాజు అని యిద్దఱుపుత్రులు కలిగిరి. ఈ సంగతి నరపతి విజయమునందీక్రింది పద్యములలోఁ జెప్పఁబడినది—

గీ. అనఘుఁడౌ వైరసేని భీమాధిపేంద్రు
పట్టి దమయంతిఁ జేపట్టినట్టిరీతి
రామభూపాలకుఁడు కృష్ణరాయతనయ
యగుతిరుమలాంబ నుద్వాహమయ్యె వేడ్క.

చ. శతమఖునిం బులోమజను శంకరుని న్గిరిపుత్రి శంబరా
హితు రతిదేవిఁ బోలుచు నహీనసుఖానుభవాప్తి రామభూ
పతియును దిర్మలాంబయును భానుసమానునిఁ గృష్ణపాఖ్యు నం
చితగుణుఁ బెద్దతిమ్మనృపశేఖరుఁ గాంచిరి హర్షమొప్పఁగన్.

రామరాజుయొక్క యనంతరమున మాతామహార్జితమయిన విద్యానగరరాజ్యమునకు రావలసినవాఁడు కృష్ణరాయని దౌహిత్రుఁడయిన కృష్ణరాజే యయినను, రామరాజు తమ్ములయిన తిరుమలదేవరాయలును వేంకటపతిరాయలును బలవంతు లయి యాతనికిఁ దక్కనియ్యక యారాజ్యమును తామే యాక్రమించుకొని యేలసాగిరి.

మూర్తి యనియు రామరాజభూషణుఁ డనియు నిద్దఱు వేఱువేఱుకవు లనియు నందు మూర్తికవి నరసభూపాలీయమును, రామరాజభూషణకవి వసుచరిత్ర, హరిశ్చంద్ర నలోపాఖ్యానములను రచియించి రనియు కొందఱును, ఇద్దఱు నొక్కరే యనియు మూర్తి యనునది నిజమయినపేరనియు రామరాజభూషణుఁ డన్నది రామరాజుయొక్క సభకలంకారముగా నుండుటచేత వచ్చిన బిరుదుపే రనియు నతఁడు సూరపరాజున కౌరసపుత్రుఁ డయి తదగ్రజుఁ డయిన వేంకటరాయభూషణునకు స్వీకృతపుత్రుఁ డనియు మఱి కొందఱును జెప్పుచున్నారు. "శ్రీరామచంద్రచరణారవిందవందన పవననందనప్రసాద సమాసాదిత సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్య సర్వంకష చతుర్విధకవితా నిర్వాహకసాహిత్యరసపోషణ రామరాజభూషణప్రణీతం" బని వసుచరిత్రములోని గద్యమొకవిధముగాను "శ్రీహనుమత్ప్రసాదలబ్ధకవితాసార సారస్వతాలంకార నిరంకుశప్రతిభాబంధుర ప్రబంధపఠన రచనాధురంధర ప్రబంధాంక వేంకటరాయభూషణపుత్ర తిమ్మరాజపౌత్ర సకలభాషావిశేష నిరుపమావధాన శారదామూర్తి మూర్తిప్రణీతం" బని నరసభూపాలీయములోని గద్య మింకొకవిధముగాను నుండుటను బట్టియు, హారిశ్చంద్ర నలోపాఖ్యానములో "ప్రబంధాంక సింగరాజ తిమ్మరాజ ప్రియతనూజ ధీర సూరపాత్మజుఁడ రామనృపభూషణాఖ్య సుకవి" ననియు నరసభూపాలీయములో "ప్రబంధాంక సింగరాజసుత తిమ్మరాజపుత్ర ప్రసిద్ధ సరస వేంకటరాయభూషణసుపుత్రు నను బుధవిధేయు శుభమూర్తి

నామధేయు" ననియు తంత్రములను వేఱువేఱుగాఁ జెప్పుటనుబట్టియు, వేఱువేఱు కవులయినట్టు పయికిఁ గానవచ్చుచున్నను గొన్ని హేతువులను బట్టి రెండవపక్షమువారు చెప్పెడి యంశములుకూడ సావధానముగా విచారింపవలసినవిగా నున్నవి. ఉభయపక్షములవారును జెప్పెడుయుక్తులను జక్కఁగా గ్రహింపఁగలుగుట కయి వంశక్రమమును దెల్పెడు పూర్వోక్తము లయిన రెండు పద్యములను పూర్ణముగా నిం దుదాహరించుట యావశ్యకమని తోఁచి యట్లు చేయుచున్నాను. మొట్టమొదట బుస్తకములను జదివినప్పు డిరువురుకవులఁను వేఱువేఱనియే నేనును నభిప్రాయపడినను రెండవవారి యుక్తులను విన్నపిమ్మట నామనస్సునకుఁ గొంత సందేహము కలిగినందున, ఏతన్నిర్ణయమును దీసిని జదువువారికి విడిచిపెట్టి గ్రంథసౌలభ్యము నిమిత్త మిం దుభయుల నొక్కరినిగానే భావించి వ్రాసెదను. ఇరువురును భిన్ను లయినను కాకపోయినను చరిత్రభాగమునందు వేఱువేఱుగా వ్రాయవలసిన యంశము లేవియుఁ గానఁబడవు.

౧. సీ. శతలేఖినీపద్యసంధానధౌరేయు ఘటికాశతగ్రంథకరణధుర్యు
నాశుప్రబంధబంధాభిజ్ఞు నోష్ఠ్యనిరోష్ఠ్యజ్ఞు నచలజిహ్వోక్తినిపుణుఁ
దత్సమభాషావితానజ్ఞు బహుపద్యసాధితవ్యస్తాక్షరీధురీణు
నేకసంధోచితశ్లోకభాషాకృత్యచతురు నోష్ఠ్యనిరోష్ఠ్యసంకరజ్ఞు

నమితయమకాశుధీప్రబంధాంకసింగ
రాజసుత తిమ్మరాజపుత్ర ప్రసిద్ధ
సరస వేంకటరాయభూషణసుపుత్రు
నను బుధవిధేయు శుభమూర్తినామధేయు. నరసభూపాలీయము.

౨. సీ. వనధిలంఘనకృపావర్ధితోభయకవితాకళారత్నరత్నాకరుండ
సకలకర్ణాటరక్షాధురంధరరామవిభుదత్తశుభచిహ్నవిభవయుతుఁడ

వసుచరిత్రాదికావ్యప్రీతబహునృపప్రాపితానేకరత్నప్లవుండ
శాశ్వతశ్రీవేంకటేశ్వరానుగ్రహానిరుపాధికైశ్వర్యనిత్యయశుఁడ

శ్రీకరమహాప్రబంధాంక సింగరాజ
తిమ్మరాజప్రియతనూజ ధీరసూర
పాత్మజుఁడ రామనృపభూషణాఖ్య సుకవి
నంకితముొనర్తు నీకావ్య మనఘభక్తి.-హరిశ్చంద్రనలోపాఖ్యానము

మ. నను శ్రీరామపదారవిందభజనానందున్ జగత్ప్రాణినం
దనకారుణ్యకటాక్షలబ్ధకవితాధారసుధారాశి సం
జనితైకైకదినప్రబంధఘటికాసద్యశ్శత గ్రంథక
ల్పను సంగీతకళారహస్యనిధిఁ బిల్వంబంచి పల్కెం గృపన్.-వసుచరిత్ర

పయిపద్యములలో నుపయోగింపఁబడిన విశేషణములు కొన్ని భిన్నములుగా నున్నను పరస్పరవిరుద్ధము లయిన వేవియు లేనందున వానినిబట్టి గ్రంథకర్తలు భిన్నులని సాధించుట కాధార మేదియు లేదు. రెండు గ్రంథములను జేసినవా రాంజనేయ ప్రసాదలబ్ధ కవిత్వవైభవుల మని వ్రాసికొనుటచేతను, రెండు కవిత్వములు నేకరీతినే యుండుట చేతను, ఆదినుండియు నిప్పటివఱకును బట్టుమూర్తియే వసుచరిత్రము రచియించెనని జనశ్రుతి వచ్చుచుండుటచేతను, కవికిఁ దరువాత నల్ప కాలములోనే వసుచరిత్రమునకు వ్యాఖ్యానము చేసినవారు కొందఱు బట్టుమూర్తి తాను రచించిన నానారసభాసురమగు ప్రబంధమునందలి వివిధాలంకారములకు లక్షణగ్రంథముగ నుండునట్లు నరసభూపాలీయ మను నలంకార గ్రంథమును రచియించెనని వ్రాసియుండుటచేత, తద్గ్రంథత్రయకర్త యొక్కఁడే యై యుండునేమో యని యెట్టివారికిని సందేహము కలుగకమానదు. ఇఁక పైపద్యములలోని యంశములనుబట్టి విచారింపవలెను. నరసభూపాలీయకృతికర్త పేరందలి గద్యమునుబట్టి

మూర్తియనుట స్పష్టము. దానికి బట్టు మొదలయిన పదములను వేనిని జేర్చినను, అవి కులనామములో బిరుదనామములో యయి యుండును. కావ్యాలంకారసంగ్రహ మనఁబడెడు నరసభూపాలీయములోని పూర్వోదాహృతమయిన పద్యములో "శుభమూర్తినామధేయు" నని 'శుభ' విశేషణమొకటి గానఁబడుచున్నది. ఈ శుభవిశేషణ మెట్లు వచ్చినది, ఎవ్వరికిఁజెందినది, అన్నవిషయము నాలోచింపవలయును. పూర్వోదాహృత మయిన హరిశ్చంద్రనలోపాఖ్యానములోని పద్యములో రామభూషణకవి "రామవిభుదత్త 'శుభ' చిహ్న విభవయుతుఁడ" నని వ్రాసికొని యున్నాఁడు. కాఁబట్టి దీనినిబట్టి చూడఁగా శుభబిరుదమును రామరాజిచ్చెననియు, రామరాజభూషణనామము గలవానికిది చెందు ననియు, విస్పష్టమగుచున్నది. నరసభూపాలీయ కృతికర్త తనకు శుభ విశేషణమును వేసికొనుటయు, హరిశ్చంద్ర నలోపాఖ్యాన కృతికర్త తనకు రామరాజు శుభచిహ్న మిచ్చెనని చెప్పుకొనుటయు, ఈ రెంటిని గూర్చి చిరకాలమునుండి పరంపరగావచ్చుచున్న జనప్రతీతితోఁజేర్చి విచారించినపక్షమున నారెండు గ్రంథములను రచించినవా రొక్కరేయని చూపుట కది యొక ప్రబలసాక్ష్యముగాఁ గనఁబడుచున్నది. రామరాజ భూషణపదము బిరుదనామమే యైనపక్షమున, పైపుస్తకములయందలి నామవ్యత్యాసములనుబట్టి కవులు వేఱనిచెప్పుట కవకాశ ముండదు. రామరాజభూషణపదము బిరుదుపేరుగాక పేరే యై యుండినయెడల నది యంతట నేకరూపముగా నుండునేకాని పై పద్య గద్యములయం దున్న ట్లొకచోట 'రామరాజభూషణ' యనియు, ఇంకొకచోట 'రామభూషణ' యనియు, వేఱొకచోట 'రామనృపభూషణ' యనియు నుండదని యొక యుక్తి చెప్పుదురుగాని యదియంత ప్రబల యుక్తి కాదు. కట్టకడపటఁ జేసిన హరిశ్చంద్ర నలోపాఖ్యానములో "వసుచరిత్రాదికావ్య" "బహునృపప్రాపితానేకరత్న" పదములను బ్రయోగించుటచే నాదిపద ప్రయో

గముచేత రెంటికినడుమ నతఁడు చేసినకావ్య మింకొకటి యుండవలసి నందున నదియే నరసభూపాలీయమనియు, బహుపదప్రయోగముచేత నిద్దఱికంటె నెక్కువరాజు లుండవలసినందున వారే రామరాజు తిరుమలరాజు నరసరాజు ననియు, మూఁడుగ్రంథములను రచించినవాఁ డొక్కఁడేయనుట కిది కారణమని యుక్తి జెప్పుచున్నారు. ఈ యుక్తి యెంత యాదరణీయమో బుద్ధిమంతులు తమలోఁ దాము నిర్ణయించుకోవలెను. ఈకవి తన జనకపితను పాలకపితనుగూడ సంతోషపెట్టుటకయి యొక పుస్తకమునందు కన్నతండ్రిపేరు వేసెననియు, ఒకపుస్తకమునందు పెంచుకొన్న తండ్రిపేరు వేసెననియు, ఒకపుస్తకమునం దెవ్వరిపేరును వేయక విడిచెననియుఁ జెప్పుచు, ఆయాపుస్తకములయం దుపయోగింపఁబడిన పదములే యొకఁడు జనకపితయనియు నొకఁడు పాలకపితయనియు సూచించుచున్నవని చెప్పుచున్నారు. హరిశ్చంద్ర నళోపాఖ్యానములోని "సూరపాత్మజుఁడ" నను వాక్యమువలన సూరపరాజున కౌరసుఁడని యాత్మజ శబ్దము దృఢపఱుచు చున్నదనియు, నరసభూపాలీయములోని "వేంకటరాయభూషణ సుపుత్రు" నను వచనమువలన వేంకటరాయ భూషణునకు దత్తుఁడని సుపుత్రశబ్దము దృఢపఱుచుచున్నదనియు వాదించుచున్నారు. ఈ యర్థములయం దాత్మజశబ్దమునకుఁ దనవలనఁ బుట్టినవాఁడుకాని దత్తుఁడు కాఁడనియు, సుపుత్రశబ్దమునకు పున్నామనరకము నుండి రక్షించు దత్తుఁడుకాని కన్నవాఁడు కాఁడనియు గ్రహింపవలెను. ఈ యంశముల కనుకూలముగానుండు కథలు కొన్నికలవుగాని గ్రంథ విస్తారభీతిచే వానిని విడుచుచున్నాను.

వసుచరిత్ర కర్తయు నరసభూపాలీయకృతికర్తయు నొక్కఁడేమో యని నాకు సందేహము కలిగించుటకుఁ గారణములయిన యంశములను మఱికొన్నిటిఁగూడ నిప్పుడిందుఁ జేర్చుచున్నాను. వీనిని పయినిజెప్పిన వానితోఁ జేర్చి చదివి బుద్ధిమంతులు తమ యిచ్ఛవచ్చిన సిద్ధాంతము చేసికొనవచ్చును.

౧. గీ. తా రచించిన వసుచరిత్రమునఁ గన్న
తండ్రి సూరన వెలయించి తలఁపఁ డయ్యె
నన్ను మన శారదామూర్తి నాఫలంబె
దత్తుఁ డగువానిఁ జేపట్టఁదరమె నాకు.

అను చాటుధారాపద మొకటి రామరాజభూషణుఁడు తన వసుచరిత్రములో జనకపితయైన సూరపరాజు పేరుదాహరించి తన్నుఁ బేర్కొనకపోవుటచేత పాలకపితయైన వేంకటరాయభూషణునిచేఁ జెప్పఁబడినదని వాడుకలోనున్నది.

౨. చతుర్భుజాభిషేకము, యౌవనచరిత్రము, గంగాగౌరీసంవాదము అను ప్రబంధములను రచించి ప్రసిద్ధుఁడయి వసుచరిత్రమునకు వ్యాఖ్యానముచేసిన సోమనాథకవి గ్రంథాదిపీఠికలో నిట్లు వ్రాసియున్నాఁడు—

శా. ఈరీతిం గవితావితానవృతగౌరీశానకాళిస్థలో
దారోద్దేశుఁడ నై ననాకు వెస విద్యావంతు లెల్లన్మనో
హారప్రక్రియ మూర్తిచేత రచితంబై విశ్రుతంబౌ వసు
క్ష్మారాట్చిత్రచరిత్రటీక కయి యుత్సాహంబు పుట్టించినన్.

ఉ. కారణజన్ముఁడై కవినికాయము మెచ్చఁగఁ గావ్యకర్తయై
భూరికళాకలాపుఁ డయి పొల్పువహించెడు బట్టుమూర్తిచే
నీరితమై సుభారవదహీనపదాస్పద మైనయావసు
క్ష్మారమణప్రవృత్తము సుసాధ్యముకాదు తలంచిచూడగన్.

అని యిందలి మొదటిపద్యములో వసుచరిత్రము "మూర్తి" చేత రచిత మనియు, రెండవపద్యములో "బట్టుమూర్తిచే నీరిత" మైనదనియు, వ్యాఖ్యాత చెప్పియున్నాఁడు. ఈ వ్యాఖ్యాత యేకాలమునందుండినవాఁడో సరిగా తెలియదుగాని, అప్పటి కవికిని వహాబలపతికిని దరువాత నల్పకాలములోనె పదునేడవశతాబ్దాంతమున నున్నట్లు తెలియ

వచ్చుచున్నది. పూర్వకాలమునందే యితఁడిట్లు వ్రాయుటనుగూర్చి యేమిచెప్పినరు? ఇతఁడు సావధానముగా గ్రంథమును బరిశీలించి ప్రతి వాదులు తమ వాదమున కనుకూలములుగా నుదాహరించెడు గద్య పద్యముల కన్నిటికిని బ్రతిపదార్థమును వ్రాసి విమర్శించినవాఁడేకదా?

3. అనేక గ్రంథములను జేసిన గొప్పకవులు సమానవర్ణనలు వచ్చెడుపట్టున తాము మొదట రచియించినగ్రంథములలోనుండి పద్యము లను జేకొని యావశ్యకములైన మార్పులను జేసి తరువాత రచియిం చెడుగ్రంథములలో జేర్చుకొనెడి యాచారముగలదు. తిక్కనసోమయాజి తననిర్వచనోత్తరరామాయణములో మూడవయాశ్వాసమున,

చ. గుణమున లస్తకంబునను గోటియుగంబునఁ గేలఁ దార భీ
షణముగ నుప్పతిల్లి రభసంబున రేఁగినమాడ్కిఁ దీవ్రమా
ర్గణనికరంబులొక్కట నరాతిబలంబులఁ గప్ప శార్‌ఙ్గని
క్వణనము రోదసీకుహరకర్పరముం బగిలింప నుగ్రతన్.

అని రచియించినపద్యమునే విరాటపర్వములో నయిదవయాశ్వా సమునఁ గొంచెము మార్పుచేసి యీక్రిందిరీతిగాఁ బ్రయోగించు చున్నాఁడు—

చ. గుణమున లస్తకంబునను గోటియుగంబునఁ గేలఁ జాల భీ
షణముగ నుప్పతిల్లి రభసంబునఁ రేఁగినమాడ్కిఁ దీప్రమా
ర్గణనికరంబు లొక్కట నరాతిబలంబులఁగప్ప గాండివ
క్వణనము రోదసీకుహరకర్పరముం బగిలింప నుగ్రతన్.

ఇందు "తార" యనునది "చాల" గను "శార్ఙ్గనిక్వణ మనునది "గాండివ క్వణనము" గాను, మార్పఁబడినవి. మఱియు సోమయాజులు,

మ. కలగెం దోయధిపుస్తకంబు గిరివర్గం బెల్ల నూటాడె సం
చలతంబొందె వసుంధరావలయ మాశాచక్ర మల్లాడెఁ గొం

దల మందెం ద్రిప శేంద్రుపట్టణము పాతాళంబు ఘూర్ణిల్లె నా
కుల మయ్యెం గ్రహతారకాకులము సంక్షోభించె నవ్వేధయున్.

అనుపద్యమును మార్పుచేయకయే నిర్వచనోత్తరరామాయణములో నైదవయాశ్వాసములోను విరాటపర్వములో నాలవయాశ్వాసములోనుగూడ వేసియున్నాఁడు. ఈ ప్రకారముగానే వసుచరిత్రము ప్రథమాశ్వాసములోని,

శా. రామజ్యోత్స్నవరుదానత్రోయ తటినీవ్రాతంబు కల్లోలినీ
స్వామిం జెంద యశంబు మేఘములఁ బర్వం గల్గువర్షాశర
త్సామానాధికరణ్యలబ్ధి కచటం జక్రాయుధుం డొందు ని
ద్రాముద్రానుగతప్రబోధములఁ జిత్రం బేక కాలంబునన్.

అనుపద్యము కొంతవఱకు మార్పఁబడి నరసభూపాలీయము ద్వితీయాశ్వాసములో,

శా. ఆమోదంబున శ్రీనృసింహవిభుదానాంభోనదు ల్సాగర
స్వామిం జెంద యశంబు మేఘములఁ బర్వం గల్గువర్షాశర
త్సామానాధికరణ్యశంక నచటం దామోదరుండొందు ని
ద్రాముద్రానుగతప్రబోధములఁ జిత్రం బేక కాలంబునన్.

అని ప్రయోగింపఁబడియున్నది. ఇద్దఱు నేకకవులయినం దక్క నిట్టిప్రయోగముల నెట్లు సాధువుగా సాధింపవచ్చును? ఈగ్రంథద్వయకర్త యొక్కఁడు కాఁడనెడుపక్షమున, ఈమహాకవులను గ్రంథచౌర్యము చేసెడి యల్పకవులలోఁ బరిగణింపవలసివచ్చును. ఈవిధముగానే వసుచరిత్రము ప్రథమాశ్వాసములోని,

శా. ఆమందాకిని మౌళిఁ బూని నను నర్ధాంగీకృతం జేసితౌ
నౌ మే ల్మేలని యార్య యల్గఁ బ్రణతుండై తత్పదాంభోజయో
గామర్షంబున గంగయు న్మొరయఁ జూడాభోగసమ్యక్క్రియా
సామర్థ్యంబున నేఁడుశంభుఁడు కృతిస్వామిం గృపం బ్రోవుతన్.

అను శివస్తుతిపద్యార్థమును గొంచెము మార్చి యధికసార
స్యము గలిగించి,

శా. గంగం దాల్చితి వుత్తమాంగమున నన్ గైకోలు కావించి త
ద్ధాంగీకారమనం బురంధ్రి నిను వామాంగంబునం దాల్ప నే
శృంగారోన్నతిఁ జూడు మంచు గిరిజన్ శీర్షావగాబింబిత
స్వాంగానందితఁ జేయు శంభుఁడు నృసింహాధీశ్వరుం బ్రోవుతన్.

అని నరసభూపాలీయములోఁ గవి ప్రయోగించియున్నాఁడు. మొదటిపద్యములోని కొన్ని పదముల శ్లేషార్థముల నటుండనిచ్చినయెడల, ఉభయపద్యములలోను గంగను శిరస్సునఁ దాల్చి నన్నర్థాంగీకృతను జేసితివని పార్వతి కుపితురాలు కాఁగా శివుఁ డామె కోపమును దీర్చుట కయి పాదములఁబడె నన్నయర్థము సామాన్యముగాఁ జెప్పఁబడినది. వీనిలో మొదటిపద్యమున శివుఁడు పార్వతికిఁ గోపశాంతి చేయలేక పోవుటయే కాక గంగకుఁగూడ కోపము తెప్పించి యామెను వేఁడుకో వలసినవాఁ డయ్యెను. రెండవపద్యమున గంగాప్రతిబింబితస్వరూపమును బార్వతికిఁ జూపి తా నామెనుఁగూడ నుత్తమాంగముననే ధరించి భ్రమ కలిగించి శివుఁ డామెను శాంతచిత్తురాలిని జేయఁగలిగెను. ఈ రెండు కావ్యములకు నొక్కరినే కర్తలనుగాఁ జెప్పకపోయినపక్షమునఁ వారి యందుఁ బదార్థచౌర్య మారోపింపవలసి వచ్చును.

౮. రామరాజభూషణునికాలములోనే యుండి యాకాలము లోనే మనుమల నెత్తిన వేంకటపతిరాయల విద్యాగురువగు మండ రామానుజాచార్యుని మునిమనుమని మనుమఁ డగు లక్ష్మీనరసింహాచా ర్యులు తాను రచించిన యాంధ్రకౌముదియందు,

"ముప్రత్యయాభావస్య అల్లసాని పెద్దనార్యశిష్యేణ బట్టుమూర్తి మహాకవినా విరచితే వసుచరిత్రే-"

ముప్రత్యయాభావమున పెద్దనార్యశిష్యుఁడైన బట్టుమూర్తి మహాకవిచేత రచితమైన వసుచరిత్రమునందని వ్రాసి,

"సీ. రాజహంసలుగాని రాజహంసలుగారు
సరసకళాసారసారరుచుల"

అను వసుచరిత్రలోని యీసీసపాదమును లక్ష్యమునుగాఁ జూపి యున్నాఁడు. బట్టుమూర్తికి నూఱుసంవత్సరములలోపలనే యిట్లు గ్రంథస్థము చేసినవ్రాఁతను నిరాకరించుటకు ప్రబలప్రమాణము కావలసి యుండునుగదా?

౫. అప్పకవీయములో నుదాహరింపఁబడి యించుమించు రామరాజభూషణునికాలములోనే రచియింపఁబడిన లక్షణదీపికలో ౪౧౬ వ పద్యము తరువాత,

"మంజీర శబ్దమునకు బట్టుమూర్తి వసుచరిత్ర మొదటిపద్యము ప్రథమచరణమున హల్లునకుఁ బ్రయోగము-"

అని వ్రాయఁబడి,

"శా. శ్రీభూపుత్రివివాహవేళ నిజమంజీరాగ్రరత్నస్వలీ. &c.

ఇత్యాది వసుచరిత్రపద్య ముదాహరింపఁబడియున్నది. సరికాలమువారుకూడ సుప్రసిద్ధుఁడైన రామరాజభూషణుని బట్టుమూర్తియని భ్రమించుట పొసఁగ నేరదు గాన నిరువురు నొక్కరేయనుట యధిక విశ్వసనీయము.

ఈరామభూషణకవి మొట్టమొదట రచియించిన కావ్యము వసుచరిత్రము. ఈప్రబంధముతో సరిరాఁదగిన శ్లేషకావ్యము తెనుఁగున మఱియొకటిలేదు. ఇందలివర్ణనలు మిక్కిలి మనోహరము లయి యున్నవి; పదములకూర్పు మిక్కిలి సుందరముగా నున్నది. శబ్దార్థాలంకారము లాహ్లాదకరముగానున్నవి; రసభావాదులు యథాయోగ్యములుగా నున్నవి. ఈగ్రంథము రచియింపఁబడినతరువాత నేఁటివఱ

కును ప్రబంధములను జేయఁబూనినకవు లెల్లరు వసుచరిత్రమును ప్రతి రూపముగాఁ జేకొని దాని ననుసరించి తమగ్రంథములను రచియించు చున్నారు. ఈవసుచరిత్రము హూణశకము ౧౫౭౦ వ సంవత్సరమునకుఁ దరువాతనే రచియింపఁబడినది. వసుచరిత్ర కృతిపతియైన తిరుమలదేవ రాయఁడు ౧౫౬౭ వ సంవత్సరమునందు తనరాజధానిని పెనుగొండకు మార్చెను. ఈతఁడు పెనుగొండను రాజధానిగాఁ జేసికొన్నతరువాత మహమ్మదీయులతో జరిగిన యుద్ధవార్త వసుచరిత్రలోని యీపద్యము నందుఁ జెప్పఁబడియున్నది—

చ. తిరుమలరాయశేఖరునిధీరచమూభటరాజి యాజి భీ
కరయవనేశ్వరప్రహితఖానబలంబులఁ జక్కు సేయ ని
ద్ధరఁ బెనుగొండకొండలు మదద్విపచర్మకపాలమాలికా
పరికరభూషితంబు లయి బల్విడిఁ గాంచె గిరీశభావముల్.

తిరుమలదేవరాయలు తనజ్యేష్ఠపుత్రుఁ డయిన రఘునాథరాజు మృతుఁడయినతరువాత ద్వితీయపుత్రుఁ డయిన శ్రీరంగరాజును యువ రాజునుజేసి రాజ్యభారము నాతనిమీఁదమోపిన కథగూడ సూచనగా నీపుస్తకమునందుఁ జెప్పఁబడియున్నది—

చ. హరిపదభక్తిశీలుఁడగు నారఘునాథనృపాలుకూర్మిసో
దరుఁడు సిరంగరాయవసుధావరుఁ డాత్మగుణప్రమోదవ
త్తిరుమలరాయశేఖరవితీర్ణ మహాయువరాజపట్టబం
ధురుఁడయి సర్వభూభువనధూర్వహశక్తి వహించు నెంతయున్.

తిరుమలదేవరాయఁ డవసానదశలో తనరాజ్యభారము నంతను కొడుకులమీఁద వదలివేసినతరువాత మూఁడవకొడు కయిన వేంకటపతి రాజు ఆలీ ఆడిల్‌షాతో యుద్ధము చేసి పరాజితుఁడయి ౧౫౭౭ వ సంవత్సరమునందు రాజధానిని పెనుగొండనుండి చంద్రగిరికి మరల మార్చెను. వేంకటపతిరా జోడిపోయినసంగతిని జెప్పకపోయినను కవి

వసుచరిత్రములోని యీ క్రిందిపద్యములో వేంకటపతి రాజధానిని చంద్రగిరికి మార్చినసంగతి సూచించియున్నాఁడు——

మ. హరుఁ డాతారకశైలమార్గమున నధ్యాసీనుఁడై రాజశే
ఖరవిఖ్యాతి వహించుఁ జందగిరిదుర్గంబందు శ్రీవేంకటే
శ్వరుఁ డొప్పెన్, బహురాజశేఖరసదాసంసేవ్యుఁడై యారయ
ద్ధర బంటేలికవాసి తద్గిరులకున్ దద్వల్లభశ్రీలకున్.

ఈపద్యముల నన్నిటిని బట్టి చూడఁగా వసుచరిత్రము ౧౫౭౭ వ సంవత్సరము తరువాతనే ముగింపఁబడినట్లు స్పష్ట మగుచున్నది. తిరుమలరాయఁ డేసంవత్సరమునందు మృతిఁబొందెనో స్పష్టముగాఁ దెలియకుగాని ౧౫౭౮ వ సంవత్సరమువఱకును నాతఁ డిచ్చిన దానశాసనములు కనఁబడుచున్నవి; ౧౫౭౮వ సంవత్సరము మొదలుకొని ౧౫౮౬వ సంవత్సరమువఱకును అతని రెండవకొడుకయిన శ్రీరంగరాజు దానశాసనములును, ౧౫౮౫వ సంవత్సరము మొదలుకొని ౧౬౧౪వ సంవత్సరమువఱకును మూఁడవకొడుకయిన వేంకటపతియొక్క దానశాసనములును కానవచ్చుచున్నవి. తిరుమలదేవరాయఁడు ౧౫౭౮వ సంవత్సరమునకుఁ దరువాత రాజ్యభారమునంతను పూర్ణముగా కొడుకుల కప్పగించి తాను విద్వద్గోష్ఠితో ప్రొద్దుపుచ్చుచుండియుండవచ్చును. ౧౫౭౭వ సంవత్సరమునందు ఆలీఆదిల్‌షా తిరుమలదేవరాయని పెనుగొండనుండి చంద్రగిరికి పాఱఁదోలినట్టు మహమ్మదీయులు వ్రాసినచరిత్రమునం దున్నది. దీనినిబట్టిచూడఁగా తిరుమలదేవరాయఁడు ౧౫౭౭ వ సంవత్సరమునకుఁ దరువాతకూడఁ గొంతకాలము జీవించియున్నట్టు తోఁచుచున్నది. రామరాజభూషణుఁడు తిరుమలరాయనికి వసుచరిత్రము నంకితము చేయునపుడు తెనాలిరామకృష్ణుఁ డక్కడకు వచ్చి "శ్రీభూపుత్రి" యని మొదటిపద్యమును జదువ నారంభింపఁగానే పకపకనవ్వి యీకృతి చదువుటతోనే శ్రీపోయెనని గేలిచేసె ననియు, అదియెట్లని సభవా రడు

గగాఁ నతఁడు చేతిలో బూడిద వేసికొని యందు శ్రీ యనునక్షరమును వ్రాసి చేయి నోటిదగ్గఱగాఁ బెట్టుకొని బిగ్గరగా శ్రీభూపుత్రి యను (భూ) ద్వితీయాక్షర మొత్తి చదువఁగానే యాగాలిచేత చేతిలో వ్రాసిన శ్రీ యెగిరిపోవుట చూపె ననియు, అందుమీఁద రాజు కృతి నందక నిరాకరించెననియు పసికిమాలిన కథయొకటి చెప్పుదురు. ఈప్రకారముగానే రామరాజభూషణుడు 'నానాసూనవితానవాసన'లన్న పద్యము నందితిమ్మన్నయొద్దను "మోహాపదేశ తమోముద్రితములైన" యను పద్యము నయ్యలరాజు రామభద్రుని యొద్దను కొని తన వసుచరిత్రము నందు వేసికొనెనని కొందఱు కొన్నికథలు కల్పించి యున్నారుగాని యవి యన్నియు నవిశ్వసనీయములే. అటువంటి యుద్గ్రంథమును జేయఁ గలిగిన మహాకవి రెండు సామాన్యపదములను జేయలేక యితరులవలన దొంగిలించి తనవిగాఁ దన గ్రంథమునందు వేసికొనెనని చెప్పుటకంటెఁ బరిహాసాస్పద మయిన మాట మఱియొకటి యుండదు.

రామరాజభూషణుఁ డొకనాఁడు సభలో రాజాజ్ఞమీఁద కవీశ్వరులకు "కుంజరయూథంబు దోమకుత్తుకఁ జొచ్చెన్" అని సమస్య యియ్యఁగా తెనాలిరామకృష్ణుఁడు

క. గంజాయి త్రాగి తురకల
సంజాతులఁ గూడి కల్లు చవిగొన్నావా ?
లంజెలకొడుకా ! యెక్కడఁ
గుంజరయూథంబు దోమకుత్తుకఁ జొచ్చెన్ ?

అని పూరించె ననియు, అదియే రాజు తాసిచ్చినట్లు భావించి పూరింపుమని యడుగఁగా

క. రంజన చెడి పాండవు లరి
భంజనులై విరటుఁగొల్వఁ బాల్పడి రకటా !

సంజయ ! విధి నేమందును ?
గుంజరయూథంబు దోమకుత్తుకఁ జొచ్చెన్.

అని పూరించెననియు, రాజాతని సమయోచితబుద్ధికి సంతోషించి బహుమాన మిచ్చెననియు చెప్పుదురు. తెనాలిరామకృష్ణుఁడు రామరాజభూషణునియొక్క కడపటి దినములలో నున్నవాఁడగుటచేత నిది సత్య మయినను కావచ్చును.

నరసభూపాలీయము రచియించినకవి యెవ్వరయినను కృతిపతి రామరాజ తిరుమలదేవరాయలకు మేనల్లుఁడయిన నరసరాజు. ఈనరసరాజుయొక్క మాతామహుఁడయిన శ్రీరంగరాజునకు కోనరాజు, తిమ్మరాజు, రామరాజు, తిరుమలరాజు, వేంకటపతి, అని యయిదుగురు కొడుకులును, లక్కమాంబ, ఓబమాంబ, కోనమాంబ అని ముగ్గురు కూఁతులును ఉండిరి. ఆ కొమార్తెలలో లక్కమాంబ కుమారుఁడయిన నరసరాజు కావ్యాలంకార సంగ్రహమను నరసభూపాలీయమును కృతి నొందెను; ఓబమాంబ కుమారుఁడయిన గొబ్బూరి నరసరాజు రామాభ్యుదయమును కృతినందెను; కోనమాంబ కుమారుఁడయిన తిమ్మరాజు పరమయోగివిలాసమును రచియించెను. వీనిలో నరసభూపాలీయము ప్రతాపరుద్రీయమునకు తెలుఁగు. నాటక ప్రకరణమును మాత్రము విడిచి ప్రతాపరుద్రీయములోని లక్షణభాగమునంతను కవి తెనిఁగించినను లక్ష్యములను నరసభూపాలునిపేర క్రొత్తగా రచించెను.

రామరాజభూషణుఁడు సాహిత్యమునందు మాత్రమే కాక సంగీతమునందును మిగుల ప్రావీణ్యము గలవాఁడు. ఈతఁడు రచియించిన కృతులు కొన్ని యక్కడక్కడ నేటివఱకును పాడఁబడుచున్నవి. ఒకవేళ వసుచరిత్రములో తిరుమలదేవరాయఁడు కవినిగూర్చి "బహుసంస్కృతాంధ్రకృతులం బల్మాఱు మెప్పించితి" వన్న కృతులివియే యయి యుండునేమో !

కవులిప్పటివలెనే పూర్వకాలమునందును విద్యామత్సరము కల వారయి యొండొరులతో వివాదములు పెట్టుకొనుచుండినట్లు కనఁబడు చున్నది. ఇట్టి యసూయాపరత్వము రామరాజభూషణునివద్ద సహితము బొత్తిగా లేకపోలేదు. ఇతఁడొకసారి యయ్యలరాజు రామభద్రకవి కవిత్వమునందు తప్పుపట్టఁబోయి యవమానము నొందెనఁట. రామభద్ర కవి విరచితమైన రామాభ్యుదయమునందు తప్పుచూపెదనని పంతము పట్టి, తప్పు చూపలేకపోయినయెడల తలఁమీఁద తా నాతనిచెన్ను తినెద నని రాజసభలో రామరాజభూషణుఁ డొప్పుకొనెనఁట. అంతట మధ్య వర్తుల సమక్షమునందు గ్రంథపఠన మారంభించి చదువుచుండఁగా ద్వితీయాశ్వాసారంభములోని

సీ. సింహనఖాంకురచ్ఛిన్నవారణకుంభజసితముక్తాఫలశర్కరిలము
సమదసూకరపరస్పరభీకరాఘాతశిథిలదంష్ట్రాచూర్ణసికతిలంబు
గంధసింధురఘటాకటకటాహస్రవద్బంధురదానాంబుపంకిలంబు
దవగంధవహబంధుదహ్యమానానేకకాళికాగురుధూపగంధిలంబు

పృథులషడ్జస్వరోద్గీతభిల్లపల్లి
వాధరాగీతికాకర్ణనాతిభీతి
పరవశాత్మపటీరకోటరకటీర
లీనఫణియగు నక్కాన కాన నయ్యె.

అను పద్యముకడకు వచ్చునప్పటికి రామరాజభూషణుఁడు రామభద్రకవిని వారించి "శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణిః" యనున్యాయముచేత సంగీతమునకు సర్పము లానందింపవలసియుండఁగా భయపడి పటీరతరు కోటరములలో దాఁగినట్లు చెప్పితివిగాన నిది దోష మని యాక్షేపించెనఁట. దానికి రామభద్రకవి తాను కేవల సంగీతము నకు భీతిల్లినట్లు చెప్పక షడ్జస్వరముతో పాడఁబడినగీతికకు పాములు

భయపడినట్లు చెప్పితినియు. "షడ్జం మయూరో వదతి" యని యుండుటచేత షడ్జస్వరోద్గీతమైన గీతమును విని నెమలిగూఁతయని పాములు భయపడి పాఱి తొఱ్ఱలుదూఱుట స్వభావమేయనియు, సమాధానమును చెప్పెనఁట. సభవారా యాక్షేపణ సమాధానములు విని రామరాజభూషణుఁడే యోడెనని నిర్ధారణము చేసిరఁట! అంతట పట్టిన ప్రతిజ్ఞ ననుసరించి రామభద్రకవి రామరాజభూషణుని శిరోవేష్టనము తీయించి క్రిందఁ బెట్టించి సభలో నాతనితల దన్నెనఁట! కొందఱాతని తలకు మాఱుగా శిరోవేష్టమునే తన్నెనని చెప్పుదురు. ఈ కథ యిప్పుడు క్రొత్తగా వచ్చినదిగాక యప్పకవికాలమునాఁటికే యున్నందున దీని యందుఁ గొంత సత్యమున్నదని యూహింపవలసియున్నది. అప్పకవి పూర్వకవివర్ణనము చేయుచు తన గ్రంథములో

"రామరాజవిభూషణరత్నఖచిత
చారుమస్తకలాపాపహారివాక్య
గౌరవము పెక్కుభంగుల గణనచేసి"

అని రామరాజభూషణునియొక్క కిరీటమును దీయించినవాఁడని రామభద్రకవికి విశేషణముగాఁ జెప్పినాఁడు.

హరిశ్చంద్రనలోపాఖ్యానమును రచించునప్పటికి రామరాజభూషణుఁడు వృద్ధుఁడయినాఁడు. అప్పటికే విద్యానగరసంస్థాన మంతయు పూర్ణముగా నశించిపోయినది. పింగళి సూరనార్యుఁడు రాఘవపాండవీయమును జేసినతరువాత రామరాజభూషణుఁడు హరిశ్చంద్రనలోపాఖ్యానమును రచియించెను. ఈ రెండుగ్రంథములలోని గుణదోషము లెట్టివైనను రాఘవపాండవీయమునకు వచ్చిన ప్రసిద్ధి యీ గ్రంథమునకు రాలేదు. రామరాజభూషణుఁ డీ ద్వ్యర్థికావ్యమును శ్రీరామాంకితము చేసెను. ఈకృతి పదునాఱవ శతాబ్దాంతమునందు రచియింపఁబడినట్లు

కనఁబడుచున్నది. కాఁబట్టి రామరాజభూషణుఁడు ౧౫౫౦ వ సంవత్సరము మొదలుకొని ౧౫౯౦ వ సంవత్సరమువఱకును గ్రంథరచన చేయుచున్నట్లు చెప్పవచ్చును పూర్వోక్తములయిన మూఁడు గ్రంథముల నుండియుఁ గొన్ని పద్యముల నిందుదాహరించుచున్నాను.—

వసుచరిత్రము

మ. సతియూరుద్యుతిఁ జెందఁబూని సజకుశ్చర్మాపనోదక్రియా
రతిఁ బాథోలవపూరితోదరములై రంభేభహస్తంబు లు
న్నతజిన్ పీఁజె మరుద్విభూతిఁ గదళిం ద్వగ్దోష మాచంచలో
ద్ధతశుండాతతిఁ బాయ దయ్యె నదె పో తద్వైరమూలం బిలన్. అ. ౨

శా. రాజీవాక్షుల నేచు పాతకివి చంద్రా! రాజవా నీవు? నీ
రాజత్వంబునఁ జక్రముల్ మనియెనో? రంజిల్లి సత్సంతతుల్
తేజం బందెనొ? డించెనో యహిభయోద్రేకంబు? తాఁ జెల్లరే!
రాజై పుట్టుట రశ్మిమాత్రఫలమే? రా జౌట దోషార్థమే? ఆ ౪.

హరిశ్చంద్ర నలోపాఖ్యానము.

ఉ. కమ్మనిపువ్వుఁదేనియలఁ గాఁక లడంచుఁ బ్రవాళతాళవృం
తమ్ముల సేదదేర్చు విరతావులచల్వలు గ్రమ్మ మంచిపూ
దుమ్ములఁ బూజసల్పుఁ బ్రతతు ల్వరమంజులతాధిరాజ్యయో
గమ్మునఁ బొల్చు నాసుగుణకల్పకవల్లి వనిం జరింపఁగన్. ఆ. 3.

చ. కుదురుమెఱుంగునిబ్బరగుబ్బలపై నయనాంబుపూరముల్
చెదరఁగ నేల యేడ్చెదవు చెల్వ దురంతవిషాదవేదనా
విదళితమానసాబ్జవయి వే తగు నాయువు శాశ్వతంబె సం
పదలు స్థిరంబులే విధివిపాకము దాఁట, దరంబె యేరికిన్. ఆ. ౫.

నరస భూపాలీయము.

మ. బలితంబై నమనోజబాణహతిచేఁ బల్మాఱు నిల్వోపలే
కలినీలాలకప్రాణము ల్వెడలి నేత్రాంభోజమార్గంబునన్

గలయంబ్రాఁకుచువచ్చి యన్నెలవున్ గన్నీటియే యడ్డమై
నిలుప న్నిల్చె నృసింహభూరమణ మన్నింపంగఁ బాఁడింతటన్. ఆ. ౨

ఉ. చందనశైలసానువులఁ జాలఁ జెలంగుభుజంగబాలికా
బృందము శ్రీనృసింహవిభుఁ జేర్కొని పాడఁ దదీయగానని
ష్యందము లానువేడ్క బెరయంగఁ గురంగతురంగ మేగమిన్
మందగతిప్రసంగములు మానవు దక్షిణగంధవాహముల్. ఆ. ౫.

---

# 23. మల్లారెడ్డి.

ఇతఁడు రచియించిన షట్చక్రవర్తులచరిత్ర మను నెనిమిదాశ్వాసముల పురాతనగ్రంథ మొకటి నాయొద్దనున్నది. దీనిని తాలపత్రముల మీఁద వ్రాసినవా రేహేతువుచేతనో కృత్యాదిపద్యములను వదలివేసి షష్ఠ్యంతములు మొదలుకొని వ్రాసియున్నారు. ఈపుస్తకమునందలి యాశ్వాసాంతగద్య మిట్లున్నది.

"ఇది శ్రీమద్బిక్కనవోలిపట్టణ ప్రసిద్ధ సరస్తటావలంబ సిద్ధరామేశ్వర వరప్రసాద సమాసాదిత సంస్కృ తాంధ్రభాషాకవి రతాసపోషణ విశేషతా చమత్కార గురుభక్తివిహార రాచుర్ల గోత్ర పవిత్ర కాచభూపాలపుత్ర బుధవిధేయ మల్లారెడ్డి నామధేయ ప్రణీతంబైన షట్చక్రవర్తి చరిత్రంబను మహాప్రబంధంబునందు——ఆశ్వాసము."

ఈమల్లారెడ్డి యిభరామసి మనపుస్తకములలోఁ జెప్పఁబడిన యిబ్రహీము గోలకొండ నవాబుగా నున్నకాలములో నుండి యొకసారి యాతని యాస్థానమునకు దనయాస్థానకవీశ్వరునితోడఁగూడఁ బోయి నప్పుడు,

చ. బలరిపుభోగ కాచనరపాలునిపెద్దకుమార మల్ల నీ
కలితయశఃప్రభావములు కన్గొనలే కలకట్టు మన్నెమూఁ
కలు తల లొల్లరో బిరుదుగద్దియము ల్చదివించుకొందురా
కొలఁది యెఱుంగఁజాల కలకూక్కలు చుక్కలఁజూచి కూయవే.

అను పద్యమును దనకవిచేత చదివించుకొనఁగా రాజులందఱును గోపించి యుద్ధసన్నద్ధులయియున్నప్పుడు మల్కిభరాము వారినివారించి ప్రశాంతులను జేసెనని యీవఱకే గంగాధరకవిచరిత్రమునందు వ్రాసి యున్నాను. దీనినిబట్టి యీకవి యిబ్రహీము కాలములో నున్నట్లు తెలియవచ్చుచున్నది. ఇబ్రహీము క్రీస్తుశకము ౧౫౫౦ వ సంవత్సరము మొదలుకొని ౧౫౮౧ వ సంవత్సరము వఱకును గోలకొండరాజ్యమును పాలించెను. "కుమారమల్ల" యని పయిపద్యములోఁ జెప్పఁబడి యుండుటచేత మల్లారెడ్డి యిబ్రహీముకాలములో కౌమారదశయందుండి ౧౬౦౦ వ సంవత్సరప్రాంతముల వఱకును జీవించియున్నట్లూహింపవలసియున్నది. ఈమల్లారెడ్డి కాపుకులజుఁడు; కాచరాజుపుత్రుఁడు; గోదావరిమండలములోని బిక్కనవోలుసంస్థానప్రభువు. ఇతఁడు రాజమహేంద్రవరమును పాలించిన వీరభద్రరెడ్డి మొదలైనరెడ్లసంబంధుఁడని తోఁచుచున్నది. ఈతనికవిత్వము రసవంత మయి సలక్షణముగా నున్నది. ఈతని షట్చక్రవర్తిచరిత్రమునుండి కొన్నిపద్యముల నిందుదాహరించుచున్నాను—

సీ. గోపుర గోపుర గోపురప్రతిమంబు
కల్పద్రు కల్పద్రుగౌరవంబు
మానవ మానవ మానవాభిశయంబు
మణిజాల మణిజాలమంజిమంబు
సారంగ సారంగ సారంగనయనంబు
సుమనోబ్జ సుమనోబ్జశోభితంబు

బహుధామ బహుధామ బహుధామచిత్రంబు
ఘనసార ఘనసారగంధిలంబు
భవ్యకాసార కాసారబంధురంబు
జవనసైంధవ సైంధవసంకులంబు
బహుళకేతన కేతనభస్థలంబు
నై విజృంభించె సిరి నయోధ్యాపురంబు. ఆ. ౧.

ఉ. రాజవు నీవు సద్గతి తెఱంగు లెఱింగి బుధానురాగివై
యాజరుచిం జెలంగి సముదంచితవిష్ణుపదానువర్తి వి
భ్రాజితసత్కళానిధివి రశ్మి యొకానొకవేళ సండినన్
హా జనపాలకా కువలయం బడలన్ గృశియించు టొప్పునే. ఆ. 3.

చ. అతను వియోగతాపము నిజాంగమునం దగ నిండియుండఁగా
నతివ సతృష్ణయై నలకథామృత మెంతయుఁ గ్రోలె నందునన్
మిత మెడల న్వెసన్ జ్వరము మించె నటంచును దత్సఖీభిష
గ్వ్రతతులు దానికిం దగుచికిత్సలు చేయఁ దొడంగి రత్తఱిన్. ఆ. ర.

సీ. గోరక్షణము చేయుశౌరి యుండుటఁ జేసి
గోరక్షణము చేయుకోర్కె మెఱసె
బుధులఁ బ్రోచెడు చతుర్భుజుఁ డుండుటనుజేసి
బుధులఁ బ్రోచుచునుండు బుద్ధిమించె
సత్యానురక్తుఁ డౌ చక్రి యుండుటఁజేసి
సత్యానురక్తుఁడై చాల వెలసె
బలభద్రయుతుఁడు శ్రీపతి యుండుటనుజేసి
బలభద్రయుక్తుఁడై ప్రజ్ఞ మీఱె
నొడలఁ బురుషోత్తముఁడు పూనియుంటఁజేసి
తాను బురుషోత్తముం డన ధాత్రి నొప్పె

భవ్యలక్ష్మీవిలాసవిభ్రమము లలరు
చక్రధరమూర్తి పురుకుత్సచక్రవర్తి. ఆ. ౬.

చ. ఘనములదర్పణంబు లిభకర్ణతలాగ్రము లెండమావు ల
వ్వనధితరంగము ల్సిరులు, వాయువుముందఱ నిడ్డదీపముల్
వనములబుద్బుదంబులు జలంబులపై లిఖియించువర్ణముల్
తనువులు, రాకుమార పరితాపము వల్వదు నీమనంబునన్. ఆ. ౭.

చ. సరసులఁ దేలి పుష్పవనసంతతిపైఁ గదుఁవ్రాలి సుస్తబం
భరములఁ దోలి చారుశుకపంక్తుల నేలి ప్రసూనగంధ మా
దరమునఁ గ్రోలి పుష్పితలతాతరు లెక్కుచు సోలి మెల్లఁగా
జరగఁగఁజొచ్చె దక్షిణపుఁజల్లనిగాలి వయాళిపెంపునన్. ఆ. ౮.

---

# 24. రామరాజు రంగప్పరాజు.

ఈక్షత్రియకవి సాంబోపాఖ్యాన మనెడి యైదాశ్వాసములప్రబంధమును రచించి శ్రీరంగనాయకున కంకితము చేసెను. ఈకవి కృష్ణదేవరాయనియల్లుఁడైన రామరాజునకుఁ బెదతండ్రికొడుకు కోనేటి తిమ్మరాజున కాశ్రితుఁడై యుండినవాఁడు. కాఁబట్టి కవి ౧౫౫౦వ సంవత్సరప్రాంతములం దుండినవాఁ డని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. కోనేటితిమ్మరాజునకును రామరాజునకును తాత యగు నార్వీటిరామరాజును, కృష్ణదేవరాయనియల్లుఁ డగురామరాజును, కవి తనసాంబోపాఖ్యానమునం దిట్లు వర్ణించియున్నాఁడు—

ఉ. పోరుల నారువీటిపురబుక్కయరామనృపాలుఁ డాగ్రహో
దారత వాలు పూనిన సదాగతికంపితజీర్ణపర్ణలీ
లారభటిన్ విరోధిమహిళాంగవిభూషణరాజిరాలు దై
వారుఁ బ్రతాపపల్లవశుభప్రభ వర్ధిలుఁ గీర్తిపుష్పముల్

మ. దివిజేంద్రాభుఁడు కృష్ణరాయధరణీదేవేంద్రుజామాత శ్రీ
ధవపాదాంబుజబంభరం బమరు మేధావేధ రామప్ప శా
త్రవకంఠాంతరరక్తశీకరసమిద్ధారోర్మిసిద్ధౌతఖ
డ్గవనీకీర్తిలతాంతగంధిలహరిత్కాంతాకచాభోగుఁ డై

క్షత్రియవంశజుఁ డై నయీకవి యాపస్తంబసూత్రుఁడు; ఆత్రేయ గోత్రుఁడు; తిరుమల శ్రీనివాసాచార్యశిష్యుఁడు. ఈతనిది సలక్షణమై నిరర్గళధార గల మంచికవిత్వము. కవనరీతి తెలియుట కయి సాంబో పాఖ్యానములోనిపద్యములఁ గొన్నిటి నిం దుదాహరించుచున్నాను—

చ. పరమజ్ఞానిహృదంతరాళమణిదీపంబుల్ నమన్నాగకి
న్నరనక్తంచరనాక నాయకశిరోనాళీకరాగప్రభాం
కురనీరాజితముల్ నిజాంఘ్రితలముల్ గోపాలబాలుండు ని
ల్పె రటద్గోఖురధూళిధోరణుల నాబృందావనక్షోణులన్. ఆ. ౧.

ఉ. వల్లవవల్లభుండు చెలువ ల్జలమాడఁగఁ దత్కటీతటీ
పల్లవముల్ హరించి తనుఁ బ్రార్థనచేసిన నీక నవ్వు నా
పల్లతికాలవిత్రమయి పాండవపత్నికి నెట్టు లిచ్చెనో
చుల్లరవెట్టుప్రల్లదపుజూదరి సిగ్గుపడం జటావళిన్. ఆ. ౧.

శా. ఆనియమంబు నాయమము నాదమ మాశమ మానిరంతర
ధ్యానవిధాన మాబహువిధాసనబంధవిదగ్ధభావ మా
మానస మెందుమున్ జననిమట్టును గుట్టును మాను తానసం
గాఁ నతఁ డొప్పు భక్తికలికాకిలికించితబోధమాధురిన్. ఆ. ౨.

ఉ. నడి గాకుండఁగ నుగ్రసేననృపు భిక్షావృత్తిఁ బట్టంబునం
దిడి కంసార్జితరత్నకోటులు మహాహేమంబు లాందోళికల్
పడఁతు ల్పర్వతసన్నిభేభములు ఝంపాసంపతద్వాహముల్
నడపించెం దనయింటి కీ వెలుఁగవే నారాయణుం డుద్ధవా. ఆ. ౧.

చ. కళలు భజింప వచ్చు శశికాంతివిధంబున నేగు దెంచె నా
యెలుఁగుల జేనియాజ్ఞఁ గమలేక్షణుసన్నిధికిన్ సఖీజనా
వళి భజియింప జాంబవతి వజ్రమయాభరణౌఘశింజితం
బులు పదవమ్మ నీ వనుచు బుజ్జవ మారఁగ బల్కునట్లుగన్. ఆ.౨.

ఉ. భోజనపాత్ర మొక్కటి యపూర్వము పర్వతధారి కిచ్చెనం
భోజభవప్రసూతి యది భోజనవేళఁ దలంచుభోజ్యముల్
యోజనసేయఁజాలు నది యోజనమాత్రవిసారికాంతివి
భ్రాజితగారుడాశ్మవిసరస్థగితంబు విషాపహారియున్. ఆ. ౩.

మ. అమృతస్యందము కందళింప దరహాసాంకూరముల్ లోచనా
గ్రములం దాండవ మాడఁ జంద్రధరుఁ డాకంజాక్షు నీక్షించి యో
కమలాక్షా పరురీతి నీవు వ్రతదీక్షన్ రూక్షచర్యాసము
ద్యమమున్ జూపుదు వయ్య యెయ్యెడ సుహృద్భావంబె
యాచందముల్. ఆ. ౪.

చ. కమలసహస్రము న్నయనకాంతి యొనర్పఁగ ఫాలబింబముల్
గుముదహితాయుతంబు నొడఁగూర్పఁ బెనంగు మృగాక్షి మోముతోఁ
గమలవుఁ జంద్రుఁ బోల్చుకవిగాథల కెయ్యది మేర యుత్తమో
త్తము నధము న్సమాన మనఁ దారదె బుద్ధి యవజ్ఞం జేరదే. ఆ.౫.

చ. అనుచుం జెగ్గిలి కుందునంగనల నయ్యబ్జాక్షి వీక్షించి యో
యనుఁగున్నెచ్చెలులార మీరలు సరోజాలి న్మనోజాతుఁ గ్రొ
న్ననలం జిల్కలఁ గోకిలప్రతతి నిందఁ జేయఁగా నేల నా
తనువే నిత్యము ప్రాణ మేమి ధ్రువమే తర్కింపుఁడీ యాదెసన్. ఆ.౬

ఉ. కౌరవనాథ నీకుఁ గలుగఁగాఁ గలశీతనయుండు గల్గఁగాఁ
పౌరుషసింహమూర్తు లగుబాహ్లికముఖ్యులు కల్గియుండఁగా
నూరక కుందె దేటి కిది యోధులచందమె శీరసాధనున్
వారణచేసి సాంబు నని వ్రాలిచి లక్షణఁ దెత్తుఁ గ్రమ్మఱన్. ఆ.౫.

---

## 25. మల్ల అనంతభూపాలుఁడు.

ఈక్షత్రియకవి కాకుస్థవిజయ మనెడి యైదాశ్వాసముల ప్రబంధమును రచియించి తనతండ్రి యైన యెల్లభూపాలున కంకితముచేసెను. తనతండ్రి సభాసీనుఁడయి యభినవాంధ్రకవితాపితామహుఁ డైనయుప్పుగుండూరిపురి వేంకటకవినిజూచి శాశ్వతమగు ధర్మ మెద్దియని యడుగఁగా నక్కవికంఠీరవుఁ డిట్లనియెనని తనకృత్యాదిని వ్రాసికొని యున్నాఁడు—

ఉ. కోనయయెల్ల వైరినృపకుంజరభంజన కంజదళాక్షుసే
వానిరవద్య యాద్యజనవల్లభనీతిసార యా
రా నవఖండరాజరసనాంచలరంగముల న్నటింపఁ ద
న్మానసగర్వపుందెరఁ దెమల్చి యమర్చితి కీర్తినర్తకిన్.

శా. ధారాపాతము వాసినప్పుడ ఘనత్వం బేర్పడుం జంద్రహా
సారూఢి న్విలసిల్లుచున్నపుడ శైత్యం బెల్లఁ గాన్పించు రా
నీరాజద్భుజఖడ్గరాజ మభివర్ణింప న్వశంబే మహో
గ్రారిధ్వంసక మల్ల కోనవిభునెల్లా రాజకంఠీరవా.

గీ. అమితచారిత్ర పుణ్యమార్గములు గలవు
పెక్కులయ్యును సత్కీర్తి కెక్కునవియు
సప్తసంతానములు నందు శాశ్వతంబు
కావ్య మందుము సత్కవి కలిగె నీకు.

క. మహీ నీపుత్రుఁ డనంతుఁడ
బహుమహిమం జెప్పనేర్చు భవమౌళిధునీ
లహరీఘుమఘుమితవచో
మహితముగా నెల్లశౌర్యమాయాభిల్లా.

* * * *

ఈకవి పూర్వులలో వరదరాజను నతఁడు కృష్ణదేవరాయని కల్లుఁడై నట్లు కవి యీక్రిందిపద్యమునఁ జెప్పియున్నాఁడు—

చ. వనజదళాక్షుశంకరులు వార్ధికి నద్రికిఁ బోలె గృష్ణరా
యనికి ననుంగుటల్లుఁ డటులై తనరుఁ వరదక్షమాధవుం
డనిమిషవాహినీమునిగజాశ్వమహీరుహధేనుభీమవా
హనమకుటావతంసకుధరాభరణాదికహేతుకీర్తియై.

కవి తనతండ్రిని,

ఉ. ఎక్కడఁ గాన మెల్లధరణీశ్వరుహేతి కరాతి భీతిమై
నెక్కనిధారుణీధరము లేగపదుర్గదిగంతరాళమున్
ద్రొక్కనికాననాంతరముఁ దోఁగనిదివ్యనదీప్రవాదంబులుఁ.
ద్రొక్కనితాలునుం దిననిమూలపలాశిపలాశజాలముఁ.

ఇత్యాది పద్యములలో వర్ణించిన వర్ణనునుబట్టి యతఁడు క్షత్రియుఁడగుటయే కాక భూపాలుఁడనియు దెలియవచ్చుచున్నది. తండ్రిమాత్రమే కాక కుమారుడైన యనంతభూపాలుఁడును గోలకొండ నవాబయిన యిబ్రహీముషా కాలములో రాజ్యపరిపాలనము చేయుచుండినట్లు చరిత్ర నిదర్శనములు కనఁబడుచున్నవి. కాఁబట్టి కవి ౧౫౫౦-౬౦ వ సంవత్సర ప్రాంతములయం దుండినవాఁ డయినట్లు తెలియవచ్చుచున్నది. ఈకవి సూర్యవంశజుఁడు; రంగాంబాపుత్రుఁడు; తిరుమల శ్రీశైలశ్వాచార్య

శిష్యుఁడు. ఈతనికవిత్వము నిర్దుష్టమయి హృదయంగమముగానున్నది. కాకుస్థవిజయములోని కొన్నిపద్యముల నిందు బొందుపఱుచుచున్నాను.-

ఉ. మనుతనయుండు నంతట సమాధిసమాహనవేళ్లయైన లో
చనములు విచ్చి ముందటఁ బ్రసన్నపరిస్ఫుటబింబ మొప్ప ని
ల్చినసెల నిల్వుటద్దమువలెన్ మెఱయంగ మరుండు మాధవుం
డును నునుగావ్పు మేనులకు నోచఁగ నచ్చర లాట లాడఁగన్. ఆ-౧

చ. కలువలవిందున క్తమును గమ్మకొలంకులగాడ్పు క్రుంకుఁ జె
ల్వాలజడల్ వసంతువనవాసముఁ గ్రొవ్విరికత్తిగోఁతలున్
వెలసిన నాదుమాధుకరవృత్తి విశిష్టగుణంబు నెంచియో
చెలిమియుఁ బ్రేమయుం బొదలఁజేసె మహాముని యాతిథేయముల్.
ఆ. ౨.

ఉ. నీ విదియెక్కి పద్మభవనిర్జరనాథులఁ జూడ నెవ్వఁడుం
బోవుచు వచ్చుచుండి పనిపుట్టిన వేల్పుల పాలఁగల్గి చే
చేవయొకింత చూపు మని చెప్పి తిరోహితుఁ డయ్యె నయ్యెడన్
దైవతలోకశిల్పి యరదం బటువెట్టి మహాద్భుతంబుగన్. ఆ. ౨.

చ. పుడమికి నీవు రాజ వయి పుట్టితివెన్నఁడు నాఁటనుండియున్
గొడవలు గట్టిపెట్టి నినుఁ గొల్చిరి రాజులు కన్నుదోయికిన్
బడలికగాక యేకలహపారణ గట్టునఁ బ్రేచెదర్ వ్యథం
దడవులఁబట్టి చూడనికతంబున మాసెఁజుమయ్య వీణయున్. ఆ-౨

ఉ. వేల్పులకంటె ము న్నసురవీరుల మేము సృజించుటెంచి స
కల్పము మాప్రసన్నతకుఁగా నొనరించితి నన్న వీవచః
కల్పన కర్థ మేమి యలకయ్యము మాకు ననిష్టమంచునో
యల్పులఁ ద్రుంచి లోకములమాపదఁ దీర్చితి వింతయొప్పదే. ఆ-౩

ఉ. వచ్చిన నిచ్చట న్నొలచి వచ్చితిరే యన నోల లాడుచున్
వచ్చితి మమ్మ యేము నొకవారిరుహాకరవీధి నీజటా

భృచ్ఛ్రుతునానయుండు మొలపింపఁగఁ దమ్ములతోడఁబుట్టి మా
కిచ్చె సుగంధగంధి పదహీరకిరీటము లబ్జనామముల్. ఆ. ౩.

చ. అడవుల నీవుదాల్చునడియాలపుసొమ్ము లటుండఁగాని మా
తోడవులు వెట్టుమంచుఁ గృపతో మణిమంజులభూష లాదిగా
నుడుగర లిచ్చిన న్వెఱచు చోయ్యాన నంది యతండు సైఁచుమీ
విడువనితప్పు నేఁడు వెతఁబెట్టక మానితి వేఁటకానుకల్. ఆ. ౪.

ఉ. ఎల్లరుఁ దృప్తులైన నొకయించుకసే పట విశ్రమించి రా
గిల్లినమూఁకతోడఁ దమకింపనియానముతోడ భిల్లరా
డ్వల్లభలక్ష్మితోడ వనవల్లభుతోడ జయంబుతోడ భూ
వల్లభనందనుండు హయవల్గన మొప్పఁగ వచ్చె వీటికిన్. ఆ. ౪.

ఉ. ఆరభసంబునష్టకఠినాదులచేఁ దలలేని బొందులన్
జూరెఁ గడంక లూరెనని చూపఱుమెచ్చుల మీఱిఁబోయి రా
సూరెల మున్ను కన్నడినసూటిన, వామభుజాభుజాదులన్
బీరముసూపి త్రెళ్లె నవి భీమమహోక్షఖురాహతంబులై. ఆ. ౫.

ఉ. అక్కడఁజూడు నిన్న రొయొడయం డరదీఱెను దల్లిదండ్రితో
నక్కట నేఁడు కల్యకఠినాదులలోపల నొక్కఁడేనియున్
ద్రిక్కకపోయెనే యనుక దేఱెను తావకశౌర్యవార్ధియం
దుక్కివులై రె వేల్పు లొకఁ డూఱటగా నిఁక నేమిచెప్పుదున్. ఆ. ౫

# 26. ఎల్లన

ఈకవి కొక్కోకమును, సకలనీతికథానిధానమును తెనుఁగునఁ బద్యకావ్యములఁగా రచియించెను. కొక్కోకమునకు రతిరహస్యమని నామాంతరము. దీని కవిత్వము హృద్యముగానేయున్నను నీతిమంతులు చదువఁ దగినగ్రంథముకాదు. ఈగ్రంథము కుంటముక్కల మల్లయామాత్యున కంకితము చేయఁబడినది. శైలిని జూపుటకయి కొక్కోకములోని రెండు పద్యముల నిం దుదాహరించుచున్నాను—

చ. పెనిమిటిభాగ్యరేఖగుణబృందము లేనరు లైన ముందటన్
వినుతులు చేయ సౌఖ్యమొదవించును నాథునియందు మిత్రులం
గనుఁగొని సంతసిల్లుఁ గలకంఠిగుణంబులుచూడఁ జూచి చ
య్యనఁ దెలియంగవచ్చు మదనాంకురభావముఁ జూడకుండినన్. అ-౧

చ. తరుణులు పువ్వుకోమలులు తత్తఱపాటున నేమిచేసినన్
విరసము పుట్టుఁ గావున వివేకమునం బురుషుండు తత్సఖీ
పరిచితభంగి రాగరసబంధురుఁడై యెట నేప్రయోజనం
బురమణి కిష్టమౌనదియె పూర్వముగా నెడఁబాటుచేయుచున్. అ-౨

ఈకవి యుండిన కాలమువిషయమై మన మిప్పుడు కొంచెము విచారింపవలసి యున్నది. కవి కృతిపతియగు భైరవమల్లామాత్యుని వర్ణించుచు—

సీ. హరిపదధ్యానతత్పరుఁడు చండలమహాలక్ష్మీప్రసాదైకలబ్ధవరుఁడు
రహిఁ గజపతిమహారాయ లిచ్చినసమంచితమహాపాత్రప్రసిద్ధయశుఁడు
నాజమాఖానరాయనిచేతనొడయుఁడై వినుకొండదుర్గమేలినఘనుండు
కృతివననిక్షేపపృథుతటాకాలయతనయాదిసప్తసంతానఘనుఁడు

మునిపరాశరసగోత్రసంజనితుఁ డార్య
సేవ్యతిరువేంగళాచార్యశిష్యుఁ డనఘ
మంత్రి పెరుమాళ్ళకొమ్మయమనుమ యోబ
మంత్రి తెలగయ భైరవమల్లమంత్రి.

అని యతఁడు జమాఖానునిచేతఁ బ్రభువుగాఁ జేయఁబడినట్లు చెప్పియున్నాఁడు. ఈ జమాఖాను పదునాఱవ శతాబ్దమధ్యమునం దుండినట్లు తెలియవచ్చుచున్నది. కవికాలమును నిర్ణయించుట కీగ్రంథములో నింకొకయాధారముకూడఁ గానవచ్చుచున్నది. ఇతఁడు పూర్వకవులను వర్ణించుచు,

సీ. * * * *
* * * *

ఆ. "రావిపాటి తిప్పరాజాదిముఖ్యులౌ
గారకవుల నెల్ల గారవించి"

అని రావిపాటి తిప్పరాజును బేర్కొనియున్నాఁడు. ఈరావిపాటి తిప్పరాజు—

మ. సరిబేసై రిపు డేల భాస్కరులు భాషానాథపుత్రా వసుం
ధరయం దొక్కఁడు మంత్రియయ్యె వినుకొండన్ రామయామాత్యభా
స్కరుఁడా యా నతఁడే సహస్రకరశాఖ ల్లే వవే యున్నవే
తిరమై దానముఁ జేయుచో రిపుల హేతి న్వ్రేయుచో వ్రాయుచో.

పయిపద్యమును రామయామాత్యభాస్కరునిమీఁదఁ జెప్పిన ట్లప్పకవీయములో నుదాహరింపఁబడియున్నది. ఈరామయభాస్కరుఁ డచ్యుతదేవరాయని కాలములో నుండినట్లు కొండవీటిలోని గోపీనాథస్వామివారి దేవాలయద్వారశాఖయందు వ్రాయఁబడియున్న యీక్రింది పద్యమువలన స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నది—

సీ. నిర్మించె నేమంత్రి నిరుపమప్రాకారనవకంబుగా గోపినాథపురము
గెలిచినాఁ డేమంత్రి లలితవిక్రమమునఁ బ్రబలుఁడై యవనులబలము నెల్ల
నిలిపినాఁ డేమంత్రి నియతవైభవమున గోపికావల్లభుఁ గూర్మి వెలయఁ
బాలించె నేమంత్రి ప్రకటధర్మఖ్యాతి మహిమ మీఱఁగ నాంధ్ర
మండలంబు

నతఁడు భూపాలమంత్రీంద్రసతతవినుత
ధీవిశారదుఁ డచ్యుతదేవరాయ
మాన్యహితవర్తనుఁడు శౌర్యమహితయశుఁడు
భానుతేజుండు రామయభాస్కరుండు.

దీనినిబట్టి రావిపాటి తిప్పరాజు ౧౫౪౦ వ సంవత్సరప్రాంతముల యం దుండెననుట స్పష్టము. ఈరావిపాటి తిప్పరాజును స్తోత్రముచేసిన వెన్నెలకవి యాతనికాలమునందో తరువాతనో యుండియుండవలెను. కోకోకమును రచించిన కొన్ని సంవత్సరముల కీవెన్నెలకవి సకలనీతి కథానిధానమును రచించి కోకోక కృతిపతియైన మల్లామాత్యుని యన్నకొడుకగు కుంటముక్కల పినభైరవామాత్యున కంకితముచేసి నందునఁ గవి ౧౫౬౦-౭౦ సంవత్సరప్రాంతములయం దుండెనని చెప్ప వచ్చును. సకలనీతికథానిధానములోఁ గృతిపతి కవినిగూర్చి చెప్పిన ట్లున్న యీక్రింది పద్యములు పయియంశమును తెలుపుడు చేయు చున్నవి—

సీ. శ్రీవత్సగోత్రవారిధిపూర్ణ శీతాంశుఁ డగుకూచమంత్రికి నాత్మజుఁడవు
వివిధాష్టభాషాకవిత్వవాచాప్రౌఢిఁ బూర్వకవీంద్రులఁ బోలినాఁడ
వఖిలపురాణేతిహాసకావ్యస్మృతిచయము రచించినచారుమతివి
మాపినతండ్రియా మల్లమంత్రికిని గోకోకంబు చెప్పినకోవిదుఁడవు
రసికు లభినుతిచేతఁ బురాణసార । మనుపమంబుగ నా కిచ్చినట్టిప్రోడ
వట్లుగావున నొకటి నిన్నడుగఁ దలఁచి।యిచ్చటికి బిల్వబంచితి వెన్నెలార్య.

క. భావమునం దోఁచెఁ గలియుగ । పావనభూపాలకథలు బంధురకావ్య
శ్రీ వెలయ నాంధ్రభాషను । గావింపఁగవలయు సుప్రకాశిత నాకున్.

పయిపద్యములనుబట్టి యితఁడు పురాణసారమను గ్రంథమును గూడ రచించినట్లు కనఁబడుచున్నదిగాని యీ గ్రంథము దొరకలేదు.

చ. వినుతియొనర్తు నాంధ్రసుకవీంద్రుల నన్నయభట్టుఁ దిక్కయ
జ్వను నమరేశ్వరుం బెదలువాడమహాత్ముని మారనార్యు నా
చనసుతుసోము భాస్కరుని జక్కయనుం గవిసార్వభౌమునిన్
వనరుహపుత్రసన్నిభుల వర్ణితకావ్యకళావిధిజ్ఞులన్.

అని కవి తన సకలనీతికథానిధానములో శ్రీనాథుని వఱకును గల కవులనేస్తుతించి యున్నాఁడు. "చంద్రశేఖర క్రియాశక్తి రాయలయొద్దఁ బాదుకొల్పితి సార్వభౌమ బిరుద" మని యుండుటనుబట్టి యీ పద్యమునందుఁ బేర్కొనఁబడిన కవిసార్వభౌముఁడు శ్రీనాథుఁడనుటకు సందేహము లేదు. ఇంచుమించుగా సమకాలికులగుటచేఁ గాబోలు నల్లసాని పెద్దనాదుల నితఁడిందుఁ బేర్కొనలేదు.

సీ. ప్రభవించె నేవీటఁ బర్వతాగ్రంబున నరిగెరీశ్వరుఁడు శ్రీనాయకుండు
వసియించె నేవీట వర్ణితసాలాంతరమున మూలస్థానరాజమౌళి
యుదయించె నేవీట నుత్తరాశాతటీభూషణీకృతనింబ పుట్టలాంబ
వరియించె నేవీట వలదిశాకోణంబునందు గుబ్బటలమైలారమూర్తి
వినుతిగాంచె నేవీటను విప్రరాజ । వైశ్యశూద్రాదిబహువిధవర్ణ సమితి
యట్టి పురరత్నమొప్పుభవ్యాంబుజాత । మండితామరతరువల్లి కొండపల్లి

క. ఇటువంటి కొండపల్లి । పుటభేదనమంత్రిమకుటభూషణ మరిరా
ట్పటుకవిభేదనఘటనో । ద్భటుండు కుంటముకుల పినభైరవుఁడొప్పున్.

ఇత్యాది పద్యములనుబట్టి సకలనీతికథానిధానకృతిపతి కొండపల్లి కధికారియైనట్లు కనఁబడుచున్నాఁడు. ఇట్లొక కృతిపతి వినుకొండపను

మఱియొక కృతిపతి కొండపల్లికిని ప్రభువగుటచేత నీకవి కృష్ణామండలములోని కొండవీటిసీమవాఁ డయినట్టు స్పష్టపడుచున్నది. కొక్కోకము నందు కవి తన్నుగూర్చి యిట్లు వ్రాసికొనియున్నాఁడు—

సీ. శ్రీవత్సగోత్రప్రసిద్ధసంభూతి నాపస్తంబసూత్రప్రశస్తఘనుఁడ
గురుదయానిధి యైనకూచనమంత్రికి నంగనామణి ముత్తమాంబికకును
దనయుండ సత్కవీంద్రసుమాన్యచరితుండ శివకృపాసుజ్ఞానశేఖరుండ
నారూఢవిద్యాచలానందయోగీంద్రశిష్టప్రచారవిశిష్టఘనుఁడ
నెల్లనామాత్యుఁడను సత్కవీంద్రహితుఁడఁ
గలితవాక్ప్రౌఢిఁ గొక్కోకకవివరుండఁ
జతురమతితోడ రతికళాశాస్త్ర మిదియుఁ
దెనుఁగు గావింతు రసికులు వినుతిచేయ.

ఈ కవి యాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; శ్రీవత్సగోత్రుఁడు; కూచనామాత్య పుత్రుఁడు. ఇతఁడు తా నష్టభాషాకవితాప్రవీణుఁ డయినట్టును నవఘంటసురత్రాణ బిరుదాంకితుఁ డయినట్టును, గ్రంథమునం జెప్పుకొనియున్నాఁడు. ఈతని కవిత్వము మనోహర మైనదని యీవఱకే చెప్పియున్నానుగదా. ఇప్పుడీతని సకలనీతి కథానిధానమునుండి నాలుగు పద్యముల నిందుదాహరించుచున్నాను—

శా. ధారాపట్టణ మేలు భోజుఁడు మహోదారుండు వాహ్యాళిగా
నారణ్యంబున కేగి వచ్చు నెడ బ్రహ్మప్రాప్తభూసూవనా
శారంభస్థలిచేరువం జనఁగ సైన్యవ్రాతముం జూచి యు
ప్పాఱుం డిట్లనె జొన్నచొచ్చి వలెనా భక్షింపుఁడీ బియ్యముల్—ఆ౧.

ఉ. ఊరక యేలయుండ మన మోహనకరత్నము యస్మదీయసం
చారవినోదము ల్కలిసి సల్పుద మన్నఁ దొలంగు చేర కో
కీరమ పూరుషు ల్బహుళకిల్బిషచారు లసత్యభాషణుల్
క్రూరులు వారితోడ నొడగూడి మనంగలరే వధూమణుల్—ఆ.౨

చ. అధిపతి నంచు గ్రద్ద మిము నందఱ నీనగవింధ్యవాసకున్
వధ యొనరించి మాంసము లవారణగా బలిపెట్టఁజూచె మీ
రధములువోలెనుండఁ దగదన్న ఖగంబులుపల్కె మమ్ము నీ
విధమునఁ బాపఁగాఁదలఁచి వీడఁగనాడుట మీకు ధర్మమే.—ఆ. 3

ఉ. అంతట రాగమంజరి గృహంబున సీధురసంబు గ్రోలి నే
కాంతమ యప్పురంబు చిఱుగ్రంతల నేగఁ దలారిమానుసుల్
చెంతల డాసి పట్టుకొని చేతుల దంపిన నన్నుమిన్న యా
ప్రాంతమునందుఁ ద్రెళ్ళి కెళవారయుదూతికఁ గాంచె నాదటన్.-ఆ4

---

# 27. శంకరకవి

ఈకవి హరిశ్చంద్రోపాఖ్యానమును పద్యకావ్యమునుగా రచించెను. ఈకావ్యమును నెల్లూరికావ్య మనియు, కవిని నెల్లూరి శంకరకవి యనియు, బ్రౌన్‌దొరగారు వ్రాసిరికాని యావ్రాఁత నిరాధారమైనది. కవి గోదావరిమండలములోనివాఁడు; కృతి నాయకుఁడైన యీడూరి యెల్లనయు గోదావరీమండలములోనివాఁ డయి యీడూరి కరణమును కార్ణొలనువాస్తవ్యుఁడు నయియుండెను. ఈయంశములను కవి తనపుస్తకమునం దిట్లు చెప్పినాఁడు.—

గీ. మతి వితర్కింపఁ గేవలమంత్రిమాత్రుఁ
డే ధనంజయబాహుశౌర్యాధికుండు
సత్యవర్తనుఁ డీడూరిశాసనుండు
హితవచోహరి బాచయయెల్లశౌరి.

వ. అమ్మంత్రినిధానంబునకు నిజస్థానంబు.

మ. అరవిందాసనవాసవాద్యమరలోకారాధ్యకరోట్కటకే
శ్వరకారుణ్యసదాభిరక్షితము భాస్వద్దీప్తిమదూర్భసురో
త్కరనిత్యశ్రుతిపాఠనిస్స్వన ముదాత్తశ్రీ నజస్రంబు ని
ద్ధరణిం బేర్కొన నొప్పుఁ గార్కొలను గోదావర్యుపాంతంబునన్.

ఒక్క కృతిపతిమాత్రమేకాక కృతిపతియొక్క తాతముత్తాతలును గోదావరిమండలములోనే పుట్టి పెరిఁగి యక్కడనే సంబంధబాంధవ్యములను జేసికొనుచుండిరి. కవి కృతిపతియొక్క ముత్తాతను వర్ణించుచు నతఁడు గోదావరిమండలములోని యుండి గ్రామములో సంబంధము చేసికొన్న ట్లీక్రిందిపద్యమునఁ జెప్పినాఁడు.—

చ. ప్రెగడనమంత్రి బంధుజనబృందము పేర్కొన నుండిశాసనుం
డగుమతిశాలివీరసచివాగ్రణిపుత్రికఁ దిప్పమాంబికన్
దగుమహిమ న్వివాహ మయి ధన్యచరిత్రులఁ గాంచెఁ బుత్రులన్
జగదభివర్ణనీయుల విశాలయశోవిభవాభిరాములన్.

ఈడూరికరణమునకుఁ గృతి యిచ్చినకవియు తద్గ్రామపరిసరమున నివసించువాఁడే యై యుండవలెనుగాని యెక్కడనుండియో నెల్లూరినుండి వెదకుకొనుచు వచ్చినవాఁడయి యుండఁడు. కవి తన గ్రంథములోనే తానాయెల్లనార్యునికి బంధుఁడును విధేయుఁడు నయినట్లును తన్నతఁడింటికిఁ బిలిపించి హరిశ్చంద్ర చరిత్రమును దన కంకితము చేయుమని కోరినట్లును చెప్పిన పద్యములలో నొకటి యిందు వ్రాయుచున్నాను—

మ.ననుఁ గౌండిన్యమునీంద్రగోత్రజు సుధాంధస్సింధుకల్లోలతు
ల్యనిరాఘాటవచోధురంధరుని దేచామాత్యసత్పుత్త్రుఁ బా
వనచారిత్రు శశాంకమౌళిపదసేవాలబ్ధసాహిత్యస
ద్ధనునిన్ బంధు విధేయు శంకరకవిన్ దాక్షిణ్యపుణ్యాధికున్.

కృతిపతియుఁ గృతికర్తయు నిరువురునుగూడ నాఱువేలనియోగులు. వారిరువురును కుతుబ్‌షా గోలకొండ నవాబుగా నున్నకాల

ములో నున్నట్లు కవికృతినాయకుని గూర్చి పంచమాశ్వాసాంతమున సంబోధించిన యీ పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది—

క. అలఘుప్రతాపకుతుబన । మలకేంద్రకృపాసమగ్రమహిమాన్విత కా
ర్కొలనిగ్రామనికేతన । జనసీమారక్షణైకచాతుర్యనిధీ.

ఈకుతుబనమలకేంద్రుఁడు సాధారణముగా నిభరామని చెప్పఁబడెడి యిబ్రహీము కుమారుఁడయినమహమ్మదు కుతుబ్ షా. ఇతఁడు క్రీస్తుశకము ౧౫౫౦వ సంవత్సరము మొదలుకొని ౧౫౮౧వ సంవత్సరమువఱకును గోలకొండలో రాజ్యము చేసినందున, కవియు నప్పుడే యుండి పదునాఱవ శతాబ్దాంతముననో పదునేడవశతాబ్దాదియందో యీపుస్తకమును జేసియుండును. శంకరకవివిరచితమైన హరిశ్చంద్రోపాఖ్యానము మృదుమధురపాకము గలదయి రసవంతమయి సహృదయాహ్లాదకరముగా నుండును. ఇందలి పద్యముల నొక్కొక్కయాశ్వాసమునుండి యొక్కొక్కదాని నిం దుదాహరించెదను—

శా. ఆకర్ణింపుము పాకశాసన సుపర్వానీకసంసేవ్య భూ
లోకాధీశుఁ డగణ్యపుణ్యుఁడు కృపాలోలాత్మకుం డర్థిర
క్షాకల్పద్రుమ మద్రిధీరుఁడు హరిశ్చంద్రాభిధానుండు ధా
త్రీకాంతుం డొకఁ డొప్పు సూనృతవచఃశ్రీవైభవోపేతుఁడై. ఆ. ౧.

చ. మును ధర యేలి చన్ననృపముఖ్యు లనేకులు చర్చచేసినన్
జనవర వారిలోన విలసన్మతిపారగు లెవ్వరైన సొం
పునఁ దమవెంట ముంటిమొనమోపఁగఁజాలినయంతమేరయున్
గొని చనిరే ధరాతలము కొంకకుమీ యిల దానమిచ్చుచోన్. ఆ. ౨

సీ. పరమపావనతేజ పావక సదయాత్మ హరిణాంకమౌళిపర్యాయకాయ
యనఘపాతివ్రత్యమున మనోవాక్కాయకర్మవిస్ఫూర్తిచే ధర్మనిరతిఁ
బూని చరించితినేని మత్ప్రాణేశ్వరుండు సూనృతవచోరూఢి మెఱసి
భూనుతకీర్తివిభూతిశోభితుఁ జేని శీతలాకృతి మానిశిష్యునకును

విశదవాత్సల్యమున మున్ను కుశలమొసఁగి
పిదపఁ గౌశికఋణము సంప్రీతిఁదీర్పఁ
గూడునట్లుగఁ బెసమిటిఁ గొడుకుఁ గరుణ
నరసి రక్షింపవయ్య జోహారునీకు.

శా. ఏణీలోచన నానిమిత్తమున నీ కీపాటు పాటిల్లెనే
క్షోణీనాథులరాణివాసములు చక్షుఃకౌతుకాపాదిని
శ్రేణీలాలితహర్మ్యవాటికలలోఁ గ్రీడావిశేషంబులన్
బ్రాణేశాన్వితలై నిరంతరసుఖప్రౌఢిన్ వినోదింపఁగన్. ఆ. ౪

మ. అకటా చేకొను నేలనుం దగఁడె సప్తాంభోధివేష్టిభవ
త్సకలద్వీపకలాపభూపమకుటాంచత్పద్మరాగోజ్జ్వల
ప్రకటానర్గళనిర్గళత్కిరణశుంభత్పాదుఁడై నట్టిరా
జుకుమారుం డని యెఱ్ఱ గన్నుఁగవ నశ్రు ల్కాల్వలై పాఱఁగన్.
ఆ. ౫.

---

# 28. కంచి వీరశరభకవి.

ఈకవియు శంకరకవివలెనే హరిశ్చంద్రోపాఖ్యానము నయిదాశ్వాసములపద్యకావ్యముగా రచియించెను. కవి శైవబ్రాహ్మణుఁడు; కాశ్యపగోత్రుఁడు; శోభనాద్రీశునకును పండితారాధ్యుల వీరనారాధ్యుని పుత్రియగు గురవమాంబకును బుత్రుఁడు. ఈయిరువురుకవులు నించుమించు నేకకాలమునందే తమకావ్యములను రచియించినట్లు తోఁచుచున్నది. ఇందు శంకరకవిపుస్తకమునకంటె నేఁబదిపద్యము లధికముగా నున్నవి. ఒకరు వ్రాయుచున్నకథ నొకరెఱుఁగక యిరువురుకవులును గౌరనమంత్రికృతమైన ద్విపదకావ్యము ననుసరించి తమ పద్యకావ్య

ములను జేసి యుండవచ్చును. ఒకవేళ పేయిజీలో నొకరు చేసిన వాని కావ్యమును జూచి తరువాతఁ దనపుస్తకమును జేసియు నుండ వచ్చును. ఈయంశమును దీనిం జదువువారు నిర్ధారణ చేసికొనఁ గలుగుట కయి యిందుమించుగా శంకరకవిగ్రంథములోనుండి యుదాహరించిన పద్యముల యర్థమునిచ్చెడు పద్యములనే యిందుదాహరించుచున్నాను—

చ. ఉరుతరసత్యవాక్యవినయోచితభూరిగుణప్రసిద్ధికిన్
నరపతు లేమిలెక్క పదునాలుగులోకములందుఁ జూడ గి
న్నరసురయక్షకింపురుషనాయకులం దొకఁ డైన లేఁడు ని
ర్భరమహితప్రభావమునఁ బన్నిద మిత్తుఁ బురారిసన్నిధిన్. ఆ. ౧.

ఉ. మానవనాథ యీకొఱఁత మాటలఁ దీఱదు గాధిసూనుఁ డీ
పూనికఁ దప్పఁ డింకఁ గొనిపోయిరె మున్ను ధరిత్రి చేరెఁడం
తైన నరేంద్రముఖ్యులు దివాకరవంశపయోధిచంద్ర నీ
మానితవాగ్వదాన్యమహిమం బెడబాయు టదేమి చూడఁగన్.
ఆ. ౨.

చ. ధృతిమెఱయంగ నే నిటు పతివ్రత నేని, ధరిత్రిమీఁద మ
త్పతిఘనసత్యవాక్యనయభాసురుఁ డేని కృశాన నీ విదే
హితమతి శీతలాకృతి వహించి ధరామరవర్య భూవిభున్
సుతుఁ డగులోహితాస్యు దయఁజూచి మునీంద్రుఁడు బుణంబుదీర్పుమా.
ఆ. ౨.

ఉ. ఏమనవచ్చు మున్ను ధర యేలినరాజుల దేవులెల్ల స
త్కామవినోదవైభవసుఖప్రదలై వసియింప, నిన్ను బల్
బాములఁ గప్పి కాఱడవిపాలుగఁ ద్రిప్పి కృతఘ్నబుద్ధిచే
నీనుము దప్పి యుమ్ముకొన నేరుపు గల్గె లతాంగి యేమనన్. ఆ. ౪.

శా. సప్తద్వీపసముద్రముద్రితమహీసర్వంసహాచక్రసం
 ప్రాప్తశ్రీకమనీయలక్షణజగత్ప్రావీణ్యసత్యవ్రతో
 ద్దీప్తప్రాభవుఁ డైనరాజసుతుఁ డర్థిన్ దైన్యభావోదయ
 వ్యాప్తిన్ బెట్టెఁడునేల కైనఁ దగఁడే యంచు న్విలాపించుచున్.

ఆ. ప.

---

## 29. తెనాలి రామకృష్ణుఁడు.

ఈతనికి మొట్టమొదట రామలింగ మని పేరనియు, ఆపేరుతో నితఁడు శివభక్తిపరాయణుఁ డయి లింగపురాణమును తెనిఁగించెననియు, చెప్పుదురు గాని యిది యెంతవఱకు నిజమో తెలియదు. ఈతనిచే నాంధ్రీకరింపఁబడినదన్న లింగపురాణ మిప్పు డెక్కడను గానఁబడదు. అప్పకవి మొదలగువారు రచించిన లక్షణగ్రంథములలో నందలిపద్య మొక్కటియు నుదాహరింపఁబడి యుండకపోవుటచే పూర్వకాలము నందుసహితమట్టి గ్రంథ మున్నట్టు తోఁచదు. ఈకవి మొట్టమొదట శివభక్తుఁ డయినను విష్ణుభక్తులగు చంద్రగిరిరాజులను సంతోషపెట్టుట కయి తరువాత విష్ణుభక్తుఁ డయి వైష్ణవులను గురువులనుగాఁ గైకొనెననియుఁ గూడ జెప్పుదురు. ఈకథ సత్యమైనను గావచ్చును. ఇతఁడు రచియించినట్టు చెప్పెడు చాటుపద్యములలోఁ గొన్నిటిలో నీతనిపేరు రామలింగమని కానఁబడుచున్నది. అందొకపద్యము నిం దుదాహరించుచున్నాను—

ఉ. లింగనిషిద్ధుఁ గల్వలచెలింగని, మేచకకంధరుం ద్రిశూ
 లింగని సంగతాళి లవలింగని, కర్దమదూషిత న్మృణా
 లింగని, కృష్ణచేలుని హలింగని నీలకచన్ విధాతృనా
 లింగని, రామలింగకవిలింగనికీర్తి హసించుదిక్కులన్.

కూర్మపురాణమునందు రాజలింగకవి కవిస్తుతిచేయుచు "రంగ నాథుని రామలింగకవిని" అని రామలింగనామమునే వాడియున్నాఁడు. *రామకృష్ణకవి కృష్ణామండలములోని తెనాలిగ్రామమునందు శాలి వాహనశకము ౧౩౯౮ వ సంవత్సరమున ననఁగా క్రీస్తుశకము ౧౪౭౬ వ సంవత్సరమున జనన మొందెననియు, ఈతనియింటిపే రీశ్వరప్రెగడవా రనియు, పయికాలమును సూచించెడి యీతని జన్మపత్రికవలన నితఁడు మంచిలగ్నమునఁ బుట్టినట్టు కానవచ్చుచున్నదనియు, ఆఱువదిసంవత్సర ములక్రిందట తమదక్షిణహిందూస్థానకవిచరిత్రమునందు కావలి వేంకట రామస్వామిగారు వ్రాసియున్నారు. అయినను మన కీతనికాలమును గూర్చి యిప్పుడు దొరకిన నిదర్శనములనుబట్టి చూడఁగా పూర్వోక్త కాలము సరియైనదని నమ్ముటకు వలనుపడదు. రామకృష్ణకవి దని చెప్పఁబడెడు జన్మపత్ర మిటీవలివారిచేత సృష్టింపఁబడిన దయి యుండ వలెను. అటుగాక యితఁడు పయిని జెప్పఁబడిన సంవత్సరమునందే జన్మించి యుండినపక్షమున, ఈకవి కృష్ణదేవరాయలు సింహాసనమునకు వచ్చునప్పటికే దాదాపుగా నేఁబదియేండ్లప్రాయము గలవాఁ డయి యుండవలెను. రామకృష్ణకవి యప్పయదీక్షితులవారితోను తిరుమల తాతాచార్యులతోను సమకాలికుఁ డయి చంద్రగిరిరా జగు వేంకటపతి రాయల ప్రభుత్వకాలములో నుండినవాఁ డయినట్లు కొన్ని నిదర్శనములు కనఁబడుచున్నవి. ఈవేంకటపతిరాయలు వసుచరిత్రమును కృతినందిన తిరుమలదేవరాయల యనంతరమున తనరాజధానిని విజయనగరమునుండి చంద్రగిరికి మార్చుకొని క్రీస్తుశకము ౧౫౮౫ వ సంవత్సరము మొదలు కొని ౧౬౧౪ వ సంవత్సరమువఱకును రాజ్యము చేసినవాఁడు. కృష్ణ రాయని మరణానంతరమున నేఁబదియేను సంవత్సరములకు రాజ్యమునకు వచ్చిన వేంకటపతిరాజుయొక్క రాజ్యకాలములోనున్న రామకృష్ణకవి నిజముగా నొకవేళ కృష్ణదేవరాయలకాలములోఁగూడ నుండుటయే తటి

స్థించినపక్షమున, అతఁ డప్పుడు బాలుఁ డయియుండవలెనుగాని జన్మ పత్రమునందుఁ జెప్పఁబడినప్రకారము వయసుమీఱినవాఁ డయియుండఁ జాలఁడు. కాఁబట్టి యీజన్మపత్రి మెంతమాత్రమును విశ్వాసపాత్ర మయినదికాదు. ఈకాలవ్యత్యాసమును సరిపఱుచుట కయి కొందఱు అప్పయ్యదీక్షితులవారుకూడ కృష్ణదేవరాయలకాలమునాఁటివారే యని చెప్పుచున్నారు. అప్పయ్యదీక్షితులవారు మిక్కిలి వృద్ధు లగువఱకును జీవించినవా రగుటచేత బాల్యమున కృష్ణరాయని దినములలో నుండిన నుండవచ్చునుగాని యీసంస్కృత విద్వత్కవి వేంకటపతిరాయల యాస్థానమునందే యుండి ప్రసిద్ధుఁ డయినవాఁడు. ఈదీక్షితులవారు కాంచీపురమునకు నలుబదిమైళ్ళదూరములోనున్న యడెపోల మను నగ్రహారమున నీశ్వరాంశచేత నారాయణదీక్షితులకు పుత్రుఁడయి పుట్టె ననియు, ఇతఁడు తనపండ్రెండవసంవత్సరము నాఁటికే వేదాధ్యయనము చేసి "శివార్చనచంద్రిక" "శివతత్త్వవివేకము," "శివమణిదీపిక" "ఆత్మా ర్పణము" మొదలయిన శైవగ్రంథము లనేకములు చేసెననియు, వాదము నందు వేంకటపతిరాయలసంస్థానమున రాజగురువయిన తాతాచార్యుల నోడించి రాజసమ్మానము పొందెననియు కావేరీతీరమునందనేక యాగ ములుచేసి యవసానదశయందు కాశీవాసము చేయవలెనని యెుబది యేండ్లు నిండినతరువాత ప్రయాణ మయిపోవుచుండఁగా త్రోవలో చిదం బరపురనివాసు లాశివపోనీయక తమయూర నుండునట్లు ప్రార్థించి నిలిపి నందున నపరకాశి యగు చిదంబరమునందుండి యందే దేహావియోగము నొందెననియు అతఁడు నూటికంటె నెక్కువపుస్తకములు రచించె ననియు చెప్పుదురు. ఇప్పు డీమహాకవి రచించినగ్రంథము లనేకములు నశించినవి. కువలయానందమనెడి యలంకారశాస్త్రము సుప్రసిద్ధమయి సర్వదేశములయందును వ్యాపించియున్నది. తనతండ్రికిఁ గలిగిన గెలుపు లను వర్ణించుచు నీలకంఠవిజయమును. సంస్కృతగ్రంథమును జేసిన

యయ్యాదీక్షితు లప్పయదీక్షితులవారికి మేనల్లుఁ డయి మధురరాజగు తిరుమలనాయకునియొద్ద మంత్రిగా నుండినందునను, ఈతిరుమలనాయకుఁడు మధురాపురము రాజధానిగా శాలివాహనశకము ౧౬౨౩ మొదలు కొని ౧౬౫౯వ సంవత్సరమువఱకును పాండ్యదేశమును పాలించినందునను, ఆకాలమునందుండిన యయ్యాదీక్షితుల మేనమామయైన యప్పయ్యదీక్షితులవారు నూఱుసంవత్సరములక్రిందట కృష్ణదేవరాయలసభయందుండిరనుట నమ్మఁదగినదికాదు. అందుచేత దీక్షితులవారితోడిసమకాలికుఁడయిన రామకృష్ణకవియు కృష్ణరాయని యాస్థానమునందుండలేదనుట నిశ్చయము.

రామకృష్ణునిగూర్చి తాతాచార్యులవారితో సంబంధించినకథలనేకములు చెప్పుచున్నారుగాన, దీక్షితులవారి చరిత్రమువలెనే తాతాచార్యులవారిచరిత్రమును మనకథతో నంతగా సంబంధించినది కాకపోయినను తాతాచార్యులవారినిగూర్చికూడ నిచ్చటఁ గొంచెము వ్రాయుచున్నాను. ఈయనజన్మస్థలము కాంచీపురము; ఈతఁడు గొప్పవిద్వాంసుఁడును, సంస్కృతకవియు, ధర్మాత్ముఁడును అయి యుండెను. అప్పయ్యదీక్షితులవారు శివాంశచేత పుట్టిరని చెప్పినట్లే యితఁడు విష్ణ్వంశచేతఁ గలిగెనని జనులు వాడుకొందురు. ఇతఁడు తనధనముతో బీదలకనేకవివాహములు చేయించినందున వీరివంశనామము తిరుమల వారయినను తరువాత కన్యాదానమువా రని మాఱినది. ఈతఁడు గీర్వాణభాషలో "సాత్త్విక బ్రహ్మవిద్యావిలాసము" అనుగ్రంథమును జేసెను. ఇతఁడు చంద్రగిరిరాజులకు వంశగురువయి తఱుచుగా కాంచీనగరము నుండి చంద్రగిరికిఁబోయి వేంకటపతిరాయలసంస్థానమునందు వసించుటచేత, ఈయన కక్కడ రామకృష్ణకవితోడి సంబంధము కలుగుచు వచ్చెను. ఈతాతాచార్యులు మొట్టమొదట రామరాజుయొక్క రాజ్యాంతదశలోఁ దలయెత్తి, వైష్ణవమతమునం దత్యంతాభినివేశము

గలవాఁడయి తనశిష్యులయిన రాజులబలముచేత బలవంతముగా జనులను బట్టి చంక్రాంకణాదులు చేయుచువచ్చెను. అందుచేతనే "తాతాచార్యులవారిముద్ర భుజము తప్పినను వీపుతప్పదు" అనుసామెత నేఁటివఱకును వచ్చుచున్నది.

రామకృష్ణకవియొక్క కాలమును నిర్ధారణము చేయుటకుఁ దగిన యాధారములు కొన్ని తద్విరచితమైన పాండురంగమాహాత్మ్యమునందే కనఁబడుచున్నవి. కవి యీక్రిందిపద్యమునందు కృతిపతియైన విరూరి వేదాద్రియొక్క గురువునుగా కందాళ యప్పలాచార్యులవారిని వర్ణించి యున్నాఁడు—

సీ. వేదపూర్వప్రతిష్ఠాదైవతజ్యేష్ఠుఁ డభ్యస్తషడ్దర్శనార్థరాశి
యతిరాజరచితభాష్యగ్రంథనిర్ణేత యఖిలపురాణేతిహాసకర్త
బంధురదివ్యప్రబంధానుసంధాత పంచసంస్కారప్రపంచచణుఁడు
వాధూలమునిచంద్రవంశవర్ధనమూర్తి సకలదేశాచార్యనికరగురువు
పట్టమేనుంగు శ్రీరంగపతికి నణ్ణ
గారిగర్భాంబురాశిసీహారరశ్మి
సారసాహిత్యసర్వస్వశయ్యపేటి
యాళవందారు కందాళయప్పగారు.

వై జయంతీవిలాసమును రచియించిన సారంగు తమ్మకవియు నీకందాళ యప్పలాచార్యులవారినే తనగురువునుగా విప్రనారాయణ చరిత్రము యొక్క ప్రథమశ్వాసమునం దీక్రిందిపద్యముచేతఁ జెప్పియున్నాఁడు—

క. వందారు దాసజనతా
మందారు న్వేదశాస్త్రమహితప్రజ్ఞా
బృందారకగురు నుద్గురుఁ
గందాళాప్పలగురుక జగద్ధితుఁ గొలుతున్.

పయిపద్యద్వయమునుబట్టి చూడఁగా రామకృష్ణకవియు తమ్మకవియు సమకాలీను లగుట స్పష్ట మగుచున్నది. వీరిలో తమ్మకవి తన వైజయంతీవిలాసమునందు తాను గోలకొండ కరణ మయినట్టును తనకాలము నందా దేశమును మహమ్మదుశాహి పాలముచేయుచుండినట్టును ప్రథమాశ్వాసములో నీక్రిందిపద్యమునఁ జెప్పియున్నాఁడు—

చ. ఇనసమతేజులౌ నృపుల నెల్ల మహమ్మదుశాహి యేలు నీ
యెనుబదినాల్గుదుర్గముల నేలినయేలిక గోలకొండ త
ద్ఘనసగరస్థలిన్ గరణికం బొనరించును దమ్మమంత్రి యా
జనపతి రమ్ము పొమ్మనఁ బ్రజ ల్లయపెట్ట గృహస్థు లౌననన్.

ఈమహమ్మదుశాహి నవాబుగానుండి గోలకొండరాజ్యమును క్రీస్తుశకము ౧౫౮౧ వ సంవత్సరము మొదలుకొని ౧౬౧౧ వ సంవత్సరమువఱకును పాలించినందున్న, ఈతని కాలమునందున్న తమ్మకవియు నాకాలమునందే జీవించియుండెను. తమ్మకవితోడి సమకాలికుఁ డయిన రామకృష్ణకవియు నించుమించుగా నీకాలమునందే యనఁగా పదునాఱవ శతాబ్దాంతమునందును పదునేడవ శతాబ్దాదియందు నుండెననుటకు సందేహము లేదు. కవియొక్క కాలనిర్ణయము చేయుటకు పాండురంగ మాహాత్మ్యమునం దింకొకయాధారముకూడ కనఁబడుచున్నది. పాండురంగమాహాత్మ్యమును కృతి నందిన విరూరి వేదాద్రి యొక చిన్నజాగీరు దారయిన పెదసంగమరాజువద్ద ప్రధానిగా నుండెను. ఈవిషయము పాండురంగమాహాత్మ్యమునం దిట్లు చెప్పఁబడినది— .

సీ. తనకులాచారవర్తన వైష్ణవాచారపర్యాయముల కొజ్జబంతియనఁగఁ
దనసూనృతముపురాతనసత్యసంధులయున్నతికిఁ బునఃప్రతిష్ఠితముగాఁగఁ
దనబుద్ధి నీతిశాస్త్రరహస్యములు తెల్లముగఁ దెల్పువ్యాఖ్యానముద్ర
గాఁగఁ
దనప్రాయుగంటంబు మొనవాఁడి విశ్వంభరాప్రజలకుఁ బ్రాణరక్షగాఁగ

వెలయు మంగయగురువభూవిభుని పెద్ద
సంగభూపాలమణి వ్రాయసప్రవర్తి
ప్రియయుతుం డైన రామానుజయసుతుండు
భద్రచారి విహారి వేదాద్రిశౌరి.

కృతినాయకుఁ డైన వేదాద్రికి ప్రభువగు సంగరాజుయొక్క తండ్రి గురువరాజు సదాశివదేవరాయని రాజ్యకాలములో నుండి యాతని వలన శాలివాహనశకము ౧౪౬౫ వ సంవత్సరమునం దనఁగా హూణ శకము ౧౫౪౩ వ సంవత్సరమునందు దేవుని నిమిత్తము నాలుగుగ్రామములు సంపాదించినట్టు మెకెంజీదొరవారు సమకూర్చి చెన్నపురిలో ప్రాగ్దేశలిఖితపుస్తకనిలయమునం దుంచిన స్థానికచరిత్రమువలనఁ దెలియ వచ్చుచున్నది. మంగయకొడుకైన గురువరాజును మంగయతమ్మునిగాఁ జెప్పిన యాచరిత్ర మెంత నమ్మవచ్చునో యాలోచనీయముగా నున్నది. ఈకాలమును బట్టిచూచినను గురువరాజుకొడుకయిన సంగభూపాలుఁడు పదునాఱవ శతాబ్దముయొక్క కడపటి భాగమునందు రాజ్యము చేసినట్లే యూహింపఁదగియున్నది. ఆతని యాశ్రితుఁ డగుటచేత రామకృష్ణకవియు ౧౫౭౦ - ౮౦ సంవత్సరప్రాంతమునుండి కవియై యుండవచ్చును. కవి పాండురంగమహాత్మ్యమును వేదాద్రి కంకితము చేయునప్పటికే వేదాద్రికి కొడుకులు మొదలయినవారు కలిగియున్నట్లీపద్యము వలనఁ దెలియవచ్చుచున్నది.

క. సోదరులు సుతులు సతులును
వేదోదితమార్గచర్య వినయము నయముల్
శ్రీదాంపత్యము నెసఁగఁగ
వేదాద్రిమహాప్రధాని వెలయుం గృతులన్.

రెట్టమతమును రచియించిన యయ్యలరాజు అయ్యలభాస్కరుల కాలమునుబట్టి చూడఁగా రామకృష్ణుఁ డింకను దరువాతివాఁడని తెలి

యవచ్చుచున్నది. పాండురంగ మాహాత్మ్యకృతిపతియగు విరూరి వేదాద్రి కాశ్రయుఁడగు పెదసంగభూపాలుని మేనల్లునికి రెట్టమతము నంకితమొన ర్చిన యాకవులు తమకాలము నీక్రిందిపద్యముచేఁ దెలిపికొనియున్నారు—

సీ. కలియుగప్రథమభాగమునాల్గువేలయెన్మిదినూర్లపై నిడెబ్బదియునొకటి
శాలివాహనశకసమలిలవేయునాన్నూటతొంబదిరెండు నూఢిగాఁగఁ
బ్రభవాదిగతములు పరఁగ నిర్వదిమూఁడు నేండ్లయ్యె నెంతయు
నెన్న బుధులు
అట్టికాలంబున నయ్యల భాస్కర కవివర్యు లలరాజకమలహితుని
యాజ్ఞఁబూరోక్త రెట్టమతాఖ్యకావ్య
మునునొనర్చిరి యాచంద్రముగను గీర్తి
వక్తృశ్రోతలకునుగల్గ వసుధమీఁద
నలయహోబల నృహరికి నర్పణముగ.

సంగభూపాలుని యనుగ్రహమువలన వేదాద్రిసంపదల నొందినట్లు

గీ. గుణుతుగలరాజు మంగయ గురువరాజు
పుత్రుఁ బెదసంగభూపాలుశత్రుజైత్రు
భానుసమతేజు విద్యావధానభోజుఁ
గొల్చి వేదాద్రి నిత్యలక్ష్మిలఁ దలిర్చు.

ఇత్యాది పాండురంగమాహాత్మ్యములోని పద్యములు చెప్పు చున్నవి. పెదసంగభూపాలుఁడు గురువరాజుయొక్క తొమ్మండ్రుపుత్రు లలో జ్యేష్ఠుఁడు. ఈతని తమ్ములనామము లాగ్రంథమునందుఁ జెప్పఁబడి యుండకపోవుటచేత గ్రంథరచనకాలమునకు వారు బాలురనియు సంగ భూపాలుఁడు యౌవనదశయం దుండినవాఁ డనియు స్ఫురించుచున్నది. పెదసంగభూపాలుని తమ్ములనుగూర్చి రెట్టమతములోఁ గృతిపతియొక్క తండ్రి యగుపెదతిమ్మరాజును వర్ణించుసందర్భమున నిట్లు చెప్పఁబడినది—

గీ. అట్టి పెదతిమ్మరాజు ధైర్యాద్రిరాజు
మంగవిభుగుర్వశౌరియనుఁగుఁగూఁతు
నంగనాశిరోమణిఁ బాపసంగమాఖ్యఁ
బ్రేమవరియించె విభవాభిరాముఁ డగుచు.

క. గుణనిధి యగుతత్కన్యా
మణిజనకుఁ బోధజనకు మంజులభాషా
ఫణివరు రణవిజయార్జునుఁ
బ్రణుతింపఁ దరంబె గురువపార్థివవర్యున్.

సీ. పృథులవిక్రమశాలి పెదసంగనృపతియు సత్యసంధుఁడు చినసంగరాజు
ధర్మగుణాఢ్యుండుతమ్మభూపాలుండురు చిరకీర్తిధనుండు రుద్రఘనుఁడు
ప్రథనాంగణకిరీటి బసవనరేంద్రుండుస్థిరభాగ్యనిధి పెదచిట్టఘనుఁడు
సింధుగాంభీర్యుండు చినచిట్టవర్యుండు సతతధన్యుఁడు పోట్టిసంగశౌరి
కలితతేజుండు పాపసంగప్రభుండు
ననఁగ బరఁగినతొమ్మండ్రు తనయవరులఁ
గాంచి విజయసంశీలుఁడై మించె నౌర
మంగరాజన్యగురువసమ్రాడ్వరుండు.

క. ఆగురువరాజవరునకుఁ। ద్యాగసముద్రునకు నల్లుఁడయి వెలసె ధరా
భాగధురంధరతను నా। భాగుఁడు పెదతిమ్మరాజు ప్రజలు నుతింపన్.

కృతిపతితల్లియు మంగయగురువరాజుకూఁతురు నైన పాపసంగమాంబ పెదసంగభూపాలాదులగు తొమ్మండ్రకును జెల్లెలయియుండవచ్చును. అట్లయినచో నీమె సంగభూపాలునికంటె నిరువదియిరువది యైదేండ్లు చిన్నది కావచ్చును. కృతిపతియైన వేంకటరాజీమెయొక్క గురుపుత్రులలో మూఁడవవాఁడు. కాఁబట్టి యితఁడు తల్లి కించుమించుగా నిరువదియైదువత్సరములప్రాయమునందు జనించి యుండవచ్చును. అందుచే నీవేంకటరాజు తనమేనమామ యగు పెదసంగ

భూపాలునికంటె నేఁబదియేండ్లు చిన్నవాఁ డగుట యసంభవము కానేరదు. రెట్టమతమునందు కృతిపతియొక్క విక్రమధురంధరులైన యేఁడుగురు కొడుకులు వర్ణింపఁబడుటయేకాక కృతిపతియొక్క కొడగొట్టు తమ్మునిపుత్రులుసహిత మేవురు బాహుబలశాలులయినట్లు వర్ణింపఁబడియున్నారు. అందుచేత నతఁడీగ్రంథమును గృతినందినకాలమున కనఁగా ౧౭౭౬ వ సంవత్సరమునాఁటికి మిక్కిలిఁ వృద్ధుఁ డయి యుండవలెను. అతని కప్పు డెనుబదిసంవత్సరములవయ స్సుండె ననుకొందము. అట్లను కొన్నను పాండురంగమాహాత్మ్యము రచియింపఁబడినకాలము ౧౬౫౦వ సంవత్సరమునకంటెఁ బూర్వమయి యుండదు. అప్పటికి రామకృష్ణుఁడు వృద్ధుఁ డనుకొన్నను, అతఁడు కృష్ణదేవరాయల యాస్థానమునందలి కవుల నాక్షేపించె నన్న కథలన్నియు నసత్యకల్పనములనుట స్పష్టము. అయినను మన మీకవులకాలమునుగూర్చి యింకను విచారింపవలసి యున్నది.

ఈరామకృష్ణకవి యాజ్ఞవల్క్య బ్రాహ్మణుఁడు; కౌండిన్యసగోత్రుఁడు; తండ్రి రామయ్య; తల్లి లక్ష్మమ్మ. తాను తెనాల్యగ్రహారనివాసి యయినట్లును, ఆశుకవిత్వాదులయందు మేటియైనట్లును, కృతిపతి తన్నుద్దేశించి పలికినట్టుగా కవియే పాండురంగమహాత్మ్యమునం దీక్రింది పద్యములతోఁ జెప్పుకొనియున్నాఁడు—

క. నను రామకృష్ణకవిఁ గవి
జనసహకారావళీవసంతోత్సవసూ
క్తినిధిఁ బిలిపించి యర్హా
సనమునఁ గూర్చుండఁ బనిచి చతురత ననియెన్.

సీ. నలుదెఱంగులకావ్యనవసుధాధారలఘనుఁడనాశువునందుఁగరముమేటి
వఖిలభూమీపాలకాస్థానకమలాకరోచ్ఛ్రయతరుణసూర్యోదయుఁడవు

శైవవైష్ణవపురాణావళి నానార్థరచనాపటిష్ఠైకరమ్యమతివి
లౌకికవైదికలక్షణచాతుర్యధైర్యప్రభాయూఢకార్యచణుఁడ
వాంధ్రభూమిలోని చాగ్రహారాభమైన
శ్రీతెనాల్యగ్రహారనికేతవర్గ
శాఖికాకోకిలమ వీవు సరసకవివి
రమ్యగుణకృష్ణ రామయరామకృష్ణ

క. కౌండిన్యసగోత్రుఁడ వా
ఖండలగురునిభుఁడ వఖిలకావ్యరససుధా
మండనకుండలుఁడవు భూ
మండలవినుతుఁడవు లక్ష్మమాంవరతనయా.

క. యశముఁ గలిగించు నీమృదు
విశదోక్తులఁ బాండరీకవిభుచరితఁ జతు
ర్దశభువనవినుతముగ శుభ
వశగతి నాపేర నుడువు వరతత్త్వనిధీ.

ఉ. స్కాందపురాణనీరనిధికౌస్తుభమై ప్రభవించు దేవకీ
నందనుసత్కథోద్యమము నవ్యకవిత్వకళాకలాపమున్
కుందనమున్ ఘటించి కడునగ్గొత్తగు సొమ్ముగ నొనరించి విష్ణుసే
వం దిలకించునప్పరమవైష్ణవకోటి నలంకరింపుమా.

మ. ఉదయం బస్తనగంబు సేతువు హిమవ్యూహంబునుం జుట్టిరా
విదితంబై నమహిన్మహాంధ్రకవితావిద్యాబలప్రౌఢి నీ
కెదు రేరీ సరసార్థబోధఘటనాహేలాపరిష్కార శా
రద నీరూపము రామకృష్ణకవిచంద్రా సాంద్రకీర్తీశ్వరా!

ఈపద్యములనుబట్టి చూడఁగా కవి కొంతవఱ కాత్మశ్లాఘాప్రియుఁ డని తోఁచక మానదు. ఇతఁ డెంతప్రౌఢకవియైనను స్వోత్కర్షప్రకట

నము నింతగాఁ జేసికొనక నమ్రతనుజూపినచో నధికశ్లాఘాపాత్రుఁడయి యుండును. ఈతనినివాసస్థలము కృష్ణామండలములోని తెనాలియగ్రహారము; ఇతనిపూర్వులు కాపుర ముండినచోటు తెనాలికి రెండుక్రోసుల దూరములోనున్న గార్లపాడు గ్రామమనియు, ఇతఁడు తననివాసము నచ్చటనుండి తెనాలిగ్రామమునకు మార్చుకొనెననియు నొకరు వ్రాసి యున్నారు. ఇతఁడు చిన్నతనములో బట్టుపల్లియను గ్రామమునం దుండు బట్రాజులతో సాంగత్యముచేసి, వారిచెలిమిచేత సంస్కృతాంధ్ర సాహిత్యమును కవిత్వకౌశలమును సంపాదించి బుద్ధిబలముచేత ప్రబంధ కవీశ్వరుఁడయి వన్నెకెక్కెనఁట. ఇతఁడు రచియించిన పుస్తకము పాండురంగమహాత్మ్య మను స్థలపురాణము. ఇందుఁ గొన్నివర్ణనలు విలక్షణముగానుండును. "పాండురంగ విభుని పదగుంభనంబును" అన్నట్లితనికవిత్వము పదములకూర్పుచేత మేలిమి గన్నది. అందు నిరర్థక పదము లెక్కడనోకాని కానఁబడవు.

క. అటు లేనియుఁ జెప్పెద నీ
పొటిపొటితలపోఁత లెల్లఁ బోవ నడువు మా
రట ముడుగు నెమ్మనము నొ
క్కటిగా నొనరించి గట్టిగా విను మధిపా.

ఇత్యాదిపద్యములలోఁ గట్టిగా లోనగుపదము లొకానొకటి యక్కడక్కడ వ్యర్థములుగాదోఁచినను మొత్తముమీఁదఁ బదసందర్భ మితనికిఁ గుదిరినట్లు మఱియొకకవికిఁ గుదిరెన దని చెప్ప వలనుపడదు. ఈపాండురంగమాహాత్మ్యమునకే పాండురంగవిజయమని నామాంతరము గలదు. ఇదిగాక పాండురంగవిజయమని రామకృష్ణకవివిరచితగ్రంథము వేఱొకటియున్నదని కొంద ఱందురుగాని యామాట పాటింపఁ దగినది కాదు. ఈకవికి తరువాత నల్పకాలములోనే యున్నయప్పకవి లోనుగాఁ గలలాక్షణికు లొక్కరును పాండురంగవిజయ మున్నదనిచెప్పి దాని

లోనుండి యొక్కపద్యమునైన నుదాహరించియుండలేదు. ఇప్పుడు పాండురంగవిజయములోనివని యందురుఁ జదువఁబడెడు పద్యములలో ననేకము లితరగ్రంథములలోనివిగాను కొన్ని యప్రౌఢకవికల్పితములుగాను గానఁబడుచున్నవి. ఎట్లనఁగా,

సీ. భుజగలోకాధీశభోగతల్పశయాన హరిరూపధర మహాపురుష యనుచు
నతులాబ్జజమకుటవర్ణితపాదరాజీవ రామార్చనీయ శ్రీరంగ యనుచు
మారీచమదభంగ మహితవాయవ్యాస్త్రశరదనిద్రితనేత్రశౌరి యనుచు
సముద్రగవర్షావసరయోగనిద్రాణ కరిరాజవరద శ్రీకాంత యనుచుఁ
దలఁకు నులుకును నలుకు బెగ్గిలుచుఁ బలుకు
సఖులనయనస్వరశిరోజచరణకలన
పవనకందర్పఘనహంసజవనతురగ
భటనటప్రియసముదాయపటిమదోఁప.

ఈపద్యము పాండురంగవిజయములోనిదని సర్వసాధారణముగాఁ జదువుదురు. నిజము విచారింపఁగా నిది పైడిమఱ్ఱి వేంకటపతికృతచంద్రాంగదచరిత్రమునందలి చతుర్థాశ్వాసములోనిది. ఇట్లే

గీ. అరుణపల్లవరుచిఁబోలు నాపదంబు
లాపదంబులఁబోలు నయ్యలకజాత
మలకజాతముఁబోలు నిత్యసుఖలీల
నిత్యసుఖలీలఁబోలు నన్నెలఁతనడుము.

అను నీపద్యము పాండురంగవిజయములోని దని కొందఱు చెప్పుచున్నను, ఇది సింహాద్రి వేంకటాచార్య విరచితమైనచమత్కారమంజరిలోఁ గనఁబడుచున్నది. ఈప్రకారముగానే పాండురంగవిజయములోనివని చదువఁబడెడు మఱికొన్ని పద్యము లితరప్రబంధములోనివిగాఁ గనఁబడుచున్నవి. తాను ప్రబంధరూపముగాఁ బాండురంగమహాత్మ్యములోఁ జెప్పినకథనే స్వీకరించి యాకవియే మరలపాండురంగవిజయమని మఱి

యొకప్రబంధము జేయవలసిన యావశ్యకముసహితము నుండదుగాన పాండురంగవిజయమని వేఱొకప్రబంధ మున్న దన్నవార్త కల్లయని నిశ్చయింపవలసి యున్నది. ఇతఁడు నిరోష్ఠ్యరామాయణము మొదలయిన చిత్రకావ్యములను రచియించెనని యొకప్రవాదము కలదుగాని యదియు నిజమయి యుండదు. ఇతఁడు వికటకవి యనియు, అనేకుల ననేకవిధముల వంచించె ననియు, పెక్కుకథలు చెప్పుదురుగాని పాండురంగమాహాత్మ్యము నంతటి భక్త్యావేశముతో రచియించిన 'వైష్ణవభక్తాగ్రేసరుఁడు పామరజనైకాదరణీయములైన తుచ్ఛకార్యములకు లోనగునా' యని సందేహింపవలసియున్నది. ఈదేశములో పామరజనులు కవులు రసికులను చూపుట కయి వారికి వేశ్యాగమనదోషాదు లారోపించుట చిరకాలమునుండి యాచార మయి యున్నది. ఇతఁడు వికటకవియని చూపుట కయి యితఁడు రచియించిన పుస్తక మొక్కటియు లేదు.

"శప్పవిజయంబు చెప్పెదఁ జిత్తగింపు
మేకదంతుండు నీకిచ్చు నింతబొచ్చు."

ఇత్యాదు లగుయతిభ్రంశదోషాదులను గలిగిన పనికిమాలిన బూతుపుస్తకము నొకదాని నెవ్వరో మహాత్ములు "శప్పవిజయ" మనెడి యపాత్రపు పేరితో రచియించి దాని కర్తృత్వమును రామకృష్ణున కారోపించిరిగాని యం దొకపద్యము నైనను జదివినవారి కాపాడుపుస్తకమునందుఁ జూపినయహంభావమునుబట్టి యితఁ డితరకవులగ్రంథముల నాక్షేపించి పద్యములు చెప్పెనన్నంతవఱకు నమ్మవచ్చును.

ఈరామకృష్ణకవికి మొట్టమొదట రాజాస్థానమునందుఁ బ్రవేశము కలుగకపోయినను రాజపురుషుల నాశ్రయించి వారిమీద పద్యములు చెప్పి వారిమూలమున కడపట రాజానుగ్రహము సంపాదించుకొనెనఁట! అట్లయ్యు నితఁడు సాధుస్వభావము కలవాఁడు కానందునను, పరుల వంచించుటయందును పరిహసించుటయందును ఆసక్తి కలవాఁడయినందు

నను, ఏవో కొంటెపనులు చేయుచువచ్చి పలుమాఱు రాజుల యాగ్రహమునకు పాత్రుఁ డగుచు వచ్చెనఁట! ఇందుఁ గొంతసత్య ముండక పోదు. అట్లుకానియెడల నితఁడు తనగ్రంథములను పేరుగలరాజుల కెవ్వరికి నంకితము చేయక యొకవ్రాయసగాని కంకితము చేయుట తటస్థించి యుండదు. మహమ్మదీయుల దాడిచేత పేరుగల హిందూరాజ్యములు నశింపఁగా ధనసంపన్నుఁడుగాని రామకృష్ణకవి స్వకుటుంబపోషణార్థమయి ధనస్వీకారముచేసి తనగ్రంథమును సంగరాజుజాగీరులోని విరూరికరణమున కంకితము చేసినను చేసియుండవచ్చును. కృతిపతి యయిన వేదాద్రికి వాసస్థానముగా నుండినవిరూరు నెల్లూరుమండలములో పినాకినీనదికి వంతెనగట్టఁదలఁచిన సంగమునకు రెండు క్రోసులదూరమున నున్నది.

రామకృష్ణుఁడు చేసినయపరాధములను దెలిపెడుకథలలో నొకటి రెంటి నిం దుదాహరించుచున్నాను—

ఒకప్పుఁ డితఁడు రాజగురు వయినతాతాచార్యులవిషయమున చెప్పరాని మహాపరాధమును జేసినందున, రాజు దురాగ్రహాగ్రస్తుఁడై యాతనిని తలవఱకు భూమిలో పాతిపెట్టి యేనుఁగుచేత తల త్రొక్కింపుఁడని రాజభటుల కాజ్ఞ యిచ్చెనఁట. రాజభటు లాతనిని గొనిపోయి యూరిబయలను కంఠములోఁతు మంటిలోపాతిపెట్టి, త్రొక్కించుటకొఱకేనుఁగును దీసికొనివచ్చుటకై వెళ్ళిరఁట. ఈలోపల గూనిచాకలివాఁ డొకఁ డామార్గమునఁ బోవుచు రామకృష్ణుని జూచి యిది యేమని యడుగఁగా, అతఁడు తనకు సంభవించిన గూను పోఁగొట్టుకొనుట కయి వైద్యులయాజ్ఞచొప్పునఁ బా నీచికిత్సను జేయించుకొనుచున్నా ననియు గూను పోయినదో లేదో పయికితీసి చూడవలసిన దనియు వానితోఁ జెప్పెనఁట. వాఁ డాప్రకారముగాఁ జేసి యాతనికి గూను లేకుండుట కద్భుతపడి తన కాచికిత్స చేయుమని కోరఁగా, రామకృష్ణుఁడు వానిని

పాతిపెట్టి తాను పలాయితుఁ డయ్యెనఁట. అటుతరువాత రాజభటు లేనుఁగును గొనివచ్చి దానిచేత చాకలవానితల త్రొక్కించిరఁట. రాజ భటులు పోయి తాము రామకృష్ణుని జంపినమాట రాజుతో విన్నవించిన తరువాత రామకృష్ణుఁడు రాజసభకుఁ బోయి సభవారందఱు విస్మయ పడునట్లుగా రాజసందర్శనము చేసి తనయం దీశ్వరుఁ డనుగ్రహించి చచ్చినవానిని మరల బ్రతికించి పంపెనని రాజునకు నమ్మకము పుట్టు నట్లుగాఁ జెప్పి నమ్మించి రాజువలన నూఱుతప్పులు క్షమించునట్లు వరము పొందెనఁట.

ఇంకొకసారి రామకృష్ణుఁడు తాతాచార్యులను మోసముచేసి తన్ను మూఁపుమీఁద నెక్కించుకొని రాజమందిరము చేరువనుండి మోసుకొనిపోవునట్లొడఁబఱిచె ననియు, ఆచార్యులవా రాతనిని మోసుకొని రాజవీథిలోఁ నడచుచుండఁగా రాజు మేడమీఁదనుండి చూచి కోపించి పయివానిని తన్ని యీడ్చుకొనిరండని తనభటులకాజ్ఞ యిచ్చెననియు, రామకృష్ణుఁ డామాటలువిని చివాలున తాను క్రింద కుఱికి గురువర్యులపాదములమీఁదఁ బడి తానుచేసిన భాగవతాపచా రము క్షమింప వేడుకొని పాప పరిహారార్థముగా నాతనిని తనవీఁపు మీఁద నెక్కించుకొని మోచెదనని చెప్పి యొప్పించి తాతాచార్యులను భుజములపయి నెక్కించుకొని నడుచుచుండఁగా రాజభటులువచ్చి పయి నున్నగురునే తన్ని రాజసన్నిధి కీడ్చుకొని పోయిరనియు, అందుమీఁద రాజునకు మఱింత యాగ్రహమువచ్చి గురుద్రోహియైన యాఖలుని వెంటనే శిరశ్ఛేదము చేయుఁడని భటుల కాజ్ఞయొసఁగె ననియు, రాజ భటుల కతఁడు లంచమిచ్చి తన్నువిడిచిపెట్టి యొకమేనుజంపి దాని నెత్తురు గొనిపోయి రాజునకు జూపునట్లు వారి నొడఁబఱిచెననియు, రాజు కోపముతీఱి బ్రహ్మహత్య చేయించినందునకుఁ బశ్చాత్తాపపడుచున్న కాలములోఁ దాను బ్రహ్మరాక్షసుఁ డయినట్లు వేషమువేసి రాజును

జడిపించి తరువాత నిజమును జెప్పి రాజుచే మన్నింపఁబడి బహుమానములు నందెననియు మఱియొక కథగలదు.

ఇట్లే యితఁ డనేకకవులను విద్వాంసులనుగూడ నాక్షేపించినట్లు పెక్కుకథలుగలవు. అవి యెంతవఱకు సత్యములో చెప్పఁజాలము. అయినను వానిలోఁ గొన్ని సత్యములు కావనియు నిటీవలివారిచే గల్పింపఁబడినవనియు మనము సులభముగా నూహింపవచ్చును. తాను రచియించినపాండురంగమాహాత్మ్యకృతికి నాయకుఁడగు వేదాద్రియొక్క గురువైన కందాళ అప్పలాచార్యులువారు సభకు వచ్చినప్పుడు వ్యాకరణశాస్త్రమునందలి యాయనపాండిత్యప్రకర్షమును శ్లాఘించుచు నొకశిష్యుఁడు,

శ్లో. "అపశబ్దభయం నాస్తి । అప్పలాచార్యసన్నిధౌ"

అని చెప్పఁగా రామకృష్ణుఁడు,

"అనాచారభయం నాస్తి । తిష్ఠన్మూత్రస్యసన్నిధౌ"

అని శ్లోకపూర్తిచేసి పరిహాసించెనని చెప్పుదురు. దీనిని తెనిఁగించినచో శిష్యుఁడు చేసిన శ్లోకముయొక్క పూర్వార్థము

గీ. "అప్పలాచార్యసన్నిధియందు (వీస
మంతయిన) నపశబ్దభయంబు లేదు"

అనియు, దానిని పూరించిన రామకృష్ణునియొక్క యుత్తరార్థము

"నిలిచి మూత్రవిసర్జన సలుపువాని
వద్దఁ (గూడ) ననాచారభయము లేదు"

అనియు నగును. శబ్దశాస్త్ర పాండిత్యమునుబట్టి యెట్టి యపశబ్దము నైన సుశబ్దమునుగా సాధింపఁగల సామర్థ్యముగల తనగురువు వద్ద నెవ్వరును నపశబ్దమునకు భయపడవలసిన యక్కఱలేదని యర్థము వచ్చునట్లు శిష్యుఁడు శ్లాఘించినప్పుడు నిలుచుండి మూత్రము విడుచు

వానివద్ద ననాచారభయ మెట్లుకల్గిన లేదో యట్లే శంకరయైన యీ యాచార్యునివద్ద నపశబ్దభయ మక్కఱలేదని విపరీతార్థము వచ్చునట్లు శ్లోకము పూరించి యాక్షేపించి వైష్ణవభక్తాగ్రేసరుఁడైన రామకృష్ణుఁడు భాగవతాపచారము చేయునని నమ్మఁదగియుండ లేదు.

"కలనాఁటిధనము లక్కఱగలనాఁటికి" అను పెద్దనపద్యముపై రామకృష్ణకవి యాక్షేపణ చేసె నన్నకథ కల్పితమని యీవఱకే యల్లసాని పెద్దన చరిత్రమునందుఁ జెప్పియున్నాముగదా ? ఆప్రకారముగానే రామకృష్ణకవి ముక్కు తిమ్మనార్యునియెడఁ గూడ నొకయపరాధము చేసెననియు, తిమ్మన యలిగి పండ్లూడఁదన్నఁగా నొకనాఁడు రామకృష్ణకవి దుప్పికొమ్ముతో నూడినపల్లమర్చుకొని కృష్ణరాయలసభకు వచ్చి కూరుచుండ రామభూషణకవి యెఱిఁగి రాజు "రవిగాననిచోఁ గవి కాంచునే కదా" యన్న సమస్య నిచ్చినప్పుడు

ఉ. ఆరవి వీరభద్రుసిపదాహతి డుల్లినబోసినోటికిన్
 నేరఁడు, రామకృష్ణకవి నేరిచెఁబో మనముక్కుతిమ్మరాట్
 క్రూరపదాహతిం బడినకొక్కిరిపంటికి దుప్పికొమ్ము ప
 ల్గా రచియింప ; నౌర ! రవిగాననిచోఁ గవి గాంచునే కదా.

అని పూరించి యతని నవమానపఱిచెననియు, చెప్పెడికథ కూడ రామకృష్ణకవి ముక్కు తిమ్మనకాలములో నుండినవాఁడు కాక పోవుటచేత నిటీవలి బుద్ధిమంతులచేఁ గల్పింపఁబడినదనియే నిశ్చయింపవలసియున్నది. ఇతఁడు రామరాజభూషణునితో సమకాలికుఁడే యయినను, రామరాజభూషణుని వసుచరిత్రములోని "శ్రీ భూపుత్రి" యను పద్యముమీఁద రామకృష్ణుఁడు చేసెనన్న యాక్షేపణము పండితులు చేయఁదగినది కానందున దానిని సహితము సత్యమని నమ్ముట కాధారము కనఁబడదు. ఇతఁడు రామరాజభూషణుని కవిత్వము నాక్షేపించుచు,

క. చీపరపాపరతీఁగలఁ । జేఁపలబు ట్టల్లినట్లు చెప్పెదు నీయీ
కాపుకవిత్వపుమాటలు । బాపనకవివరుసచెవికిఁ బ్రమదం బిడునే?

అని చెప్పెనఁట. నిజముగా రామకృష్ణకవియే చెప్పిన దయిన యెడల నీర్ష్యచేతనే చెప్పినదనవచ్చును. ఒకానొకకవి రాయలయాస్థానమునకు వచ్చినప్పుడు

క. తువ్వఁట బాబా, తలపై
పువ్వఁట జాబిల్లి, వల్వ బూదఁట, చేఁదే
బువ్వఁట, చూడఁగను హాళి
క్కవ్వఁట, యరయంగ నట్టిహరునకు జేజే.

అను పద్యమునుజెప్పి తాటాకుమీఁద వ్రాయుమని యిందలి 'తువ్వ' 'హాళుక్కి' అను పదములను వికారముగాఁ జదివి రామకృష్ణుఁడాకవిని పరాభవించి పంపెనని చెప్పుదురు. ఈకథ కేవలపామరజనైకాదరణీయము. అప్పకవీయమునం దుదాహరింపఁబడిన రామకృష్ణకవి యొక్క చాటుపద్యముల రెంటిలోను,

క. బసవనకుఁ బుట్టినప్పుడె
పసరము గోవిందరాజు పసరం బైనన్
గస వేటికిఁ దినఁ డనఁగాఁ
గసవుం దిను శత్రు లాజి గదిసినవేళన్.

అను పద్యమువలన నతఁడు పరులను దూషించుస్వభావము కలవాఁడయినట్టు కనఁబడుచున్నను,

క. చిన్నన్న ద్విపద కెరఁగును
బన్నుగఁ బెదతిరుమలయ్య పదమున కెరఁగున్
మిన్నంది మొరసె నరసిం
గన్నకవిత్వంబు పద్యగద్యశ్రేణిన్.

అను పద్యమువలన నతఁ డితరులకవిత్వమందలి గుణములను గ్రహించి శ్లాఘించు గుణగ్రహణపారీణుఁ డనియు స్పష్టపడుచున్నది.

తెనాలి రామకృష్ణుని యిందుధరోపాఖ్యానములోనిదని,

మ. ఒకనాఁ డిందుధరుండుఁ బార్వతియు లీలోద్యానకేళీసరి
న్నికటానేకవనప్రదేశముల దైత్రేయేంద్రకన్యాప్సరో
నికురుంబంబులు పారిజాతకుసుమానీకంబు పైఁ జల్ల ద
ర్పకబాణంబుల కెల్ల నెల్లయగుసౌభాగ్యంబు శోభిల్లఁగన్.

అనెడి యీపద్యము రంగరాట్ఛందమునం దుదాహరింపఁబడి యున్నది. అప్పకవి యీపద్యమునే యాదిపురాణములోనిదని యుదాహరించి యున్నాఁడు. ఆదిపురాణమును, ఇందుధరోపాఖ్యానమును వేఱువేఱు గ్రంథములో, ఒక్క గ్రంథమునకె రెండును వేఱువేఱు పేరులో, మా కాగ్రంథములు లభింపకపోవుటచేత మే మిప్పుడు చెప్పఁజాలము. ఈపద్యము సోముని హరివంశములోనున్నది. కాఁబట్టి యిది పై రెండు గ్రంథములలోను దేనిలోనిదియుఁ గానట్టు తోఁచుచున్నది. ఈకవి యొక్క పాండురంగమాహాత్మ్యములోని కొన్నిపద్యముల నుదాహరించి యీతని చరిత్రము నింకటితో ముగించుచున్నాము :—

మ. బొమలెక్కించిన విల్లువంచు నునుఁజూపు ల్పంచలాచంచల
క్రమరేఖ న్నిగిడింప శాతవిశిఖౌఘంబుల్ మెయిన్నించు నె
య్యమునన్ బల్కఁగ నల్కమీఱి చటులజ్యాఘోషముంజేయు న
య్యుమప్రాపొంది రతీశ్వరుండు హరు బిట్టోడింప నుట్టాడుచున్. ఆ-౧

చ. హరిహయదేశికాభుఁ డగునమ్మహిదైవతమాళియందు బం
గరువునకున్ మృగీమదసుగంధము సంధిలుభాతి నంబుజో
దరచరణారవిందనతతస్మృతిలోలుప మైనబుద్ధియున్
బరిణతి గాంచెసంపదలపై మఱియుం జనియించు సంపదల్. ఆ-౨

శా. ప్రారంభించినవేదపాఠమునకుం బ్రత్యూహమౌనంచునో
యేరా తమ్ముఁడ నన్నుఁ జూడఁ జనుదే వెన్నాళ్ళనోయుండి చ
క్షూరాజీవయుగంబు వాచె నినుఁ గన్గోకున్కి మీబావయున్
నీరాక న్మదిఁ గోరుఁ జంద్రుపొడుపున్ నీరాకరంబుంబలెన్. ఆ-3

మ. వలనా యేటికి నాశ్రయించి మనఁగా నాసీరమున్ నీరమున్
దలవెట్ట్రే పచరింపనేటికి సమిద్దానంబు దానంబున
చ్చలమా యేటికి చెత్తిఁ గట్టుకొనఁగా సన్యాసము న్న్యాసమున్
గలిఁ దేఁజాలు మదీయభక్తిరుచి భక్తశ్రేణి కశ్రాంతమున్. ఆ-4

సీ. నిలువున నొలిపించె విలువంగడము నెల్లశరములయాయంబుఁ
బొరయు టుడిపెఁ
దగశబ్దమాత్రపాత్రముచేసె గుణలత్రమాఁకునఁ గట్టించెమాలబలముఁ
గంచుకివశము గావించెసేనానాథుఁ గట్టించె సహచరుఁ గటికియెండఁ
బ్రతిపక్షభావసంగతుఁడనిహితుఁజూచె వర కేతసముక్తిరిభరముక్షులిపె
ధర్మనిర్మలబుద్ధి సుశర్మఁ గదిసి
గెలువఁగా లేక చని కోపగించి మదనుఁ
డురక తనవార లతనికి నోడు మనిరె ?
పతికిఁ గీడాట బంట్లపాపంబు గాదె ?

# 30. తిమ్మరాజు

ఈకవి రాజవంశజుఁడు; ఓబలరాజు కొడుకు; అనంతరాజు మను మఁడు. మంగళగిరి శ్రీనృసింహస్వామి కంకితము చేసి పరమయోగి విలాస మనెడి యైదాశ్వాసముల పద్యకావ్యమును రచించెను. ఈపద్య కావ్యము నితఁడు వెంగళనాథుఁడుచేసిన ద్విపదకావ్యమును జూచియైనను జేసియుండవచ్చును; లేదా స్వతంత్రముగా నైనను జేసియుండవచ్చును. ఇరువురుకవులును నించుమించుగా సమకాలీను లయినందున, ఎవ్వరే గ్రంథమును ముందుగాఁ జేసిరో నిర్ధారణము చేయుటకు శక్యము కాదు.

శా. శ్రీరంజిల్లఁగఁ బానకం బనిశమున్ సేవింపఁగాఁ దద్గుణం
బారూఢిం బొలుపొందెనో యనఁగ యోగానందమాధుర్యల
క్ష్మీరమ్యాకృతి నొప్పుమంగళగిరి శ్రీమన్నృసింహుండు స
త్కారుణ్యామృతవృష్టిచేఁ దనుపు నిత్యంబుం బ్రపన్నావళిన్.

ఇది పరమయోగివిలాసములోని ప్రథమపద్యము. ఈకవిత్వము సర్వవిధములచేతను ద్విపదకావ్యమునకంటె శ్రేష్ఠతరముగా నున్నది. ఈకవి కృష్ణదేవరాయనియల్లుఁ డైనయళియరామరాజునకు దోడఁబుట్టిన పడుచైనకోనమాంబకు కుమారుఁ డైనందున, వసుచరిత్రము కృతి నందిన తిరుమలదేవరాయనికిని మేనల్లుఁడే. ఆకాలమునం దితఁడు కృష్ణా మండలములోని కొండవీటిసీమకు పరిపాలకుఁడుగా నుండెను. కవి తాను రామరాజాదులకు మేనల్లుఁ డయినట్లును, కొండవీటికి ప్రభు వయి నట్లును, పరమయోగివిలాసములోని యీక్రిందిపద్యములోఁ జెప్పు కొన్నాఁడు—

సీ. ఏరాజుముత్తాత భూరిసామ్రాజ్యలక్ష్మీధురీణభుజుండు సిద్ధనృపతి
యేనరాధిపుతాత నానార్థిసంతానసంతానశాఖి యనంతశౌరి

యోగుణాఢ్యునితండ్రిభోగవైభవనూత్నసుత్రాముఁ డోబలక్షోణిభర్త
యేవిభుం డళిరామభూవిభు తిరుమలప్రభువేంకటేంద్రుల భాగినేయుఁ
డట్టితిమ్మభూవరుఁ డాజిహతతురుష్క
రక్తశోణనదీకృతప్రబలసలిల
వితతకృష్ణానదీకుఁ డూర్జితుఁడు కోన
మాంబసుతుఁడు శ్రీరంగరాజానుజుండు.

మ. సకలశ్రీయుతకొండవీటినగరీసామ్రాజ్యధౌరేయతా
ధికతన్ మీఱుచు నొక్కనాఁ డచలభక్తిస్ఫూర్తి శ్రీవైష్ణవ
ప్రకరంబు న్భజియింపుచున్ హరికథాప్రస్తావనన్ దివ్యయో
గికథల్ వించుఁ దదర్థకావ్యరచనాకేళీసమాసక్తుఁడై.

ఉ. ఉన్నతి మీఱఁగాఁ బరమయోగివిలాసముపేరికావ్యము
ద్యన్నవభావబంధురరసాన్వయసన్నుతశబ్దశుద్ధిసం
పన్నత నిట్లు సిద్ధనరపాలునియోబళతిమ్మభూవరుం
డెన్నికఁ జేయఁ బూని మది నెంతయు సంతస మొందు ధన్యతన్.

పయిపద్యములనుబట్టి యీకవి కావ్యాలంకారసంగ్రహాదులకృతిభర్తలగునరసభూపాలాదులతోను, కృతికర్తలగు రామరాజభూషణాదులతోను, సమకాలికుఁ డగుట స్పష్ట మగుచున్నది. కాఁబట్టి యీ తిమ్మరాజు ౧౫౭౦వ సంవత్సరము మొదలుకొని ౧౬౦౦వ సంవత్సరప్రాంతములవఱకును ప్రసిద్ధుఁ డయియుండవచ్చును. ఈకవి కవిత్వమునందసమాన మయినప్రజ్ఞఁగలవాఁడు; ఇతఁడు రచియించిన పరమయోగివిలాసమును నద్భుతములైన చరిత్రములను కలిగియున్నది. పరమయోగివిలాసములోని యీక్రిందిపద్యములవలన కవిత్వప్రౌఢిమ కొంత తేటపడవచ్చును—

ఉ. రెండవమౌనిపుంగవుఁడు బ్రేమసమాహ్వయుఁ డైనప్రమ్మిదన్
నిండఁగఁ భక్తియన్ చమురు నించి హృదబ్జము వత్తిగాఁగ ను

ద్ధంకతరప్రబోధసముదంచితదీపము సర్వలోకనా
థుం డగుచక్రికిం బ్రియముత్తోశ సమర్పణ చేసె నయ్యెడన్. అ. ౧.

ఉ. ఇంతులఁగూడి చిట్టకము లిట్లొనరింపఁగ నించు కేసియున్
వింత తెఱంగు లేక ధరణీధరముంబలె నున్నయాదృఢ
స్వాంతునిఁ జూచి తాపతిమచక్కిలిగింతలువోలెఁ గంటికే
యెంతయు రిత్తవోయె మనయిందఱిచేష్టలు నంచు నవ్వుచున్. ఆ. ౨

ఉ. దేవుఁడొ మానియో యని మదిం దలఁపోఁతలు నాకె కాని నిన్
వేవురు వేయిచందముల నిందయొనర్చెద రిప్డు మూఁగయున్
పావులనోరు నీయెడమపాదతలంబునఁ దన్నినట్లుగా.
నీవొక యింతయూవ్వరని యేడ్వఁగదన్న కుమారరత్నమా. ఆ. ౨.

---

# 31. తాళ్ళపాక తిరువెంగళనాధుఁడు

ఇతఁడు నందవరీకబ్రాహ్మణుఁడు; ఆశ్వలాయనసూత్రుఁడు; భరద్వాజగోత్రుఁడు. ఈకవి పరమయోగివిలాస మనుపేర నాళ్వారుల చరిత్రమును ద్విపదకావ్యముగా నెనిమిదాశ్వాసములగ్రంథమును రచించెను. ఈగ్రంథరచనబట్టియే యితఁడు విష్ణుభక్తుఁడని స్పష్టమగుచున్నది. ఇతఁడు తాళ్లపాక యన్నయార్యుని మనుమఁడును, తిరుమలార్యునిపుత్రుఁడును అయినట్టు గ్రంథారంభమునందలి యీక్రిందివాక్యములవలనఁ దెలియవచ్చుచున్నది—

ద్వి. హరిసేవ కాశ్వలాయనసూత్ర నంద
వరవంశభవ భరద్వాజగోత్ర
పావనశ్రీతాళ్ళ పాకాన్నయార్య

ధీవిశారదసూను తిరుమలాచార్య
వినుతనందనుఁ దిరువేంగళనాథు.

ఈకవితాత యైనయన్నయార్యుఁడు కృష్ణదేవరాయనికాలములో నుండి కొన్నియగ్రహారముల నందెను. కవి తనకు వేంకటాద్రిరాయలు కుండలములు వేసినట్లు తనగ్రంథములోని యెనిమిదవయాశ్వాసాంతము నం దీవాక్యములచేఁ జెప్పుకొన్నాఁడు—

ద్వి. అతిలోకమతికి శేషాచలరాజ
పతికిఁ బరాముఖ్య భక్తసంతతికి
సంకీర్తనంబుగను శ్రీహరిభక్తనికర
పంకజార్యమ తాళ్ళపాకాన్నయార్య
తనయ తిమ్మార్య నందన రత్నకుంభ
దనపమ శ్రీవేంకటాద్రీశ దత్త
మకరకుండలయుగ్మ మండితకర్ణ—

ఈకవికి మకరకుండలములువేసిన వేంకటాద్రివసుచరిత్రము కృతి నందిన తిరుమలదేవరాయని తమ్ముఁడని తోఁచుచున్నది. అట్లే యైనపక్షమునఁ కవి ౧౫౭౦ వ సంవత్సరప్రాంతములయం దుండెను. అట్లు గాక యతఁడు తిరుమలదేవరాయని కొడుకైన వేంకటాద్రి యైనపక్షమున, అతఁడు ౧౫౮౫ వ సంవత్సరము మొదలుకొని ౧౬౧౪ వ సంవత్సరమువఱకును రాజ్యముచేసినందున కవియు నాకాలమువాఁడే యయి యుండవలెను. కవియొక్క కవిత్వరీతి తెలియుటకయి ద్వితీయాశ్వాసమునుండి కొంచెముభాగ ముదాహరించుచున్నాను—

ద్వి. భానుకోటిస్ఫూర్తిఁ బ్రకాశించుచున్న
మాసినందనుఁ గాంచి మది సంతసించి
పిల్లిగా దోరి జాబిల్లి గాఁబోలుఁ
జల్లనివెన్నెలఁ జల్లుచున్నాఁడు;

అనుచు సభ్యాలు చెప్పార్ప కెంతయును
గనుఁగొని వేడుకకడలి నోలాడి
యానందబాష్పంబు లాననాబ్జంబు
మైనుండి దిగఁవార మై గరుపారఁ
జెన్నిధిఁ గన్నట్టిపేదచందమున
నున్నతోన్నతుఁ డైన యోగినందనునిఁ
దనయులు లేని యాదరమున నెత్తి
కొని కూర్మితోడ నక్కునఁ జేర్చి వేడ్కఁ
గొనకొని యావేత్రకుంజంబు వెడలి
తనవార లెల్ల నెంతయుఁ జోద్యపడఁగ
మునిపుత్రుఁగొని పురంబున కేగుదెంచి
తనయాలిచేతి కెంతయుఁ బ్రేమ నొసఁగె.

---

# 32. రాయసము వేంకటపతి

ఇతఁ డాఱువేల నియోగి; అక్కయామాత్యుని కుమారుఁడు. ఈకవి తన వంశమువారిని వర్ణించుచు తమది వసిష్ఠగోత్ర మయినట్లీ క్రిందిపద్యమునందుఁజెప్పెను—

శా. శ్రీల న్మించి సమస్తధీకలనచేఁ జెన్నొందు నార్వేలవం
శాలంకారకరుల్ వసిష్ఠమునిగోత్రాంకుల్ బుధు ల్దీనర
క్షాలీలం బొగ డొంది రందు వెలసెన్ సన్మౌని భానప్ప ది
గ్జాలోద్వేలవిశాలకీర్తుల సుధీసందోహమందారమై.

ఇతఁడు లక్ష్మీవిలాసమనెడి యైదాశ్వాసముల ప్రబంధమును రచించెను. "రసికజనహృదయంగము సంగీతసాహిత్యకళాధౌరంధర్య" అని గద్యములోఁ జెప్పుకొన్నదానినిబట్టి యీకవి సాహిత్యమునందు మాత్రమేకాక సంగీతమునందును సమర్థుఁ డైనట్టు కనఁబడుచున్నాఁడు.

ఇతఁడు శ్రీరంగరాయని యాస్థానమునందుండి యాతనివలన నగ్రహార రత్నాభరణాదులను బొందినట్టు లక్ష్మీవిలాసములోని యీక్రిందిపద్య ములవలన విదితమగుచున్నది.—

మ. అలఘుప్రాభవభవ్యుఁ డాకుతపశాహామేయసైన్యంబు న
గల్గిక న్బాహులచేత గెల్చి బిరుదుల్ గైకొన్న శ్రీరంగరా
యలచిత్తం బిగురింప రాయసము వ్రాయం జాలి తౌనా సుధీ
తిలకా యక్కయమంత్రి వేంకటపతీ దీవ్యత్కళావాక్పతీ.

ఉ. వ్రాయుచు రాజ్యవైభవధురంధరభూతి దలిర్పఁ గీర్తిధా
రేయసిరంగరాయమహిభృన్మణిరాయస మగ్రహారహై
మాయతరత్నభూషలు నృపార్హ్యలు వర్తనలియ్య నుబ్బుచున్
వేయననేమి రాయసము వేంకటమంత్రియనన్ యశస్వివై.

ఈశ్రీరంగరాయలు వసుచరిత్రను కృతిగొందిన తిరుమలదేవరాయని కుమారుఁడు. ఇతఁడు ౧౫౭౪వ సంవత్సరము మొదలుకొని ౧౫౮౫వ సంవత్సరము వఱకును రాజ్యముచేసినందున, కవియు నాకాలమునందే యుండినవాఁడు. లక్ష్మీవిలాసము సలక్షణమై మృదుమధురరచనను గలిగి యున్నది. కవితాశైలిఁ జూపుటకయి గ్రంథమునుండి రెండు పద్యముల నుదాహరించుచున్నాను.—

చ. తనదువిలాసహాసములఁ దాలిమి దూలఁగ రాగసాగరం
బునఁ బలువాఱు మారుదెస మున్గుచుఁ దేలుచు నిచ్చ మెచ్చఁగా
మునుకొని వారిత్రో భువనమోహిని యాకువానావియచ్చరాం
గన పలికెం బికస్వరపికస్వరసుస్వరభాస్వరంబుగన్. ఆ. ౨.

మ. హరికిం బట్టపురాణి వీవ యని కళ్యాణైకవాక్యస్తుతుల్
పరఁగం బుణ్యనదీనదోదకములం బట్టాభిషేకంబు చే
సిరినా నుజ్జ్వలహేమకుంభములచేఁ జేత న్సుగంధాంబువుల్
హరిమధ్య ల్తగ నించి నించి జలకం బాడించి రబ్జాలయన్. ఆ. ౫.

## 33. తరిగొప్పుల మల్లన

ఈకవి చంద్రభానుచరిత్రమనెడి యైదాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; దత్తాత్రేయయోగీంద్రుని శిష్యుఁడు; దత్తనామాత్యుని తమ్ముఁడు. ఈతఁడు లాక్షణిక కవి; కవిత్వము రసవంతముగా నుండును. ఈకవి వసుచరిత్రమును కృతినందిన తిరుమలదేవరాయని పుత్రుఁడగు వేంకటపతిరాయల కాలములో నుండినట్లు చంద్రభానుచరిత్రములోని యీక్రిందియెత్తుగీతములోఁ జెప్పినాఁడు—

సీ. ... ... ... ... ....

అనుచు బుధులెన్నవలయు రాజాధిరాజ
రాజపరమేశ సకలకర్ణాటకాంధ్ర
రాజ్యధౌరేయ తిరుమలరాజతనయ
చంద్రగిరి గఁగు వేంకటపతిక్షితీంద్రమణికి.

ఈ వేంకటపతిరాయలు ౧౫౮౫వ సంవత్సరము మొదలుకొని ౧౬౧౪ వ వఱకును రాజ్యముచేసినవాఁ డయినందున, కవియు నాకాలమునం దుండినవాఁడే. తాలికోట యుద్ధమయినతరువాత తండ్రియైన తిరుమలదేవరాయఁడు తనరాజధానిని విజయనగరమునుండి పెనుగొండకు మార్చుకొన్నట్లే కొమారుఁడైన యీవేంకటపతిరాయఁడును తనరాజధానిని పెనుగొండనుండి చంద్రగిరికి మార్చుకొనెను. ఈకవి కవితారచనను సూచించెడుపద్యములను రెంటిమూటి నిందుఁ బొందుపఱుచుచున్నాను—

ఉ. అంత దిగంతదంతురలతాంతనిశాంతనితాంతకాంతవ
స్యంతికతాంతపాంధజనతాంతరసంతతకృంతనప్రథా

త్యంతసమంతవిస్ఫురదుదంత పరంతపకాంతిసంగతి
క్రాంతదురంతకుంతరతికాంతము పొల్చె వసంత మెంతయున్. ఆ. 3.

ఉ. తత్తఱపాటుతోడఁ గనుఁదమ్ములడాలు దిగంతరంబులన్
జిత్తరు నింప లేఁబయిఁటచేల కుచంబులపొంత జాఱ నా
బిత్తరి ప్రేమానుపాటొదవఁ బిమ్మటితో నొకకొంతఁ గొంకి లోఁ
జిత్తము మట్టుపెట్టుకొని చేరి సహోదరుదండ నిల్వఁగన్. ఆ. ౪.

ఉ. ధరణితలేంద్రనందనవిధంబునఁ గనుంగొనఁ గోరి మున్న కి
న్నరవరుఁ డిచ్చినట్టి భువనస్తుతమైనయదృశ్యవిద్య న
య్యురువురు గుప్తమూర్తు లయి యింకుసహోదరమందిరంబునన్
దరలకయుండి రట్టియెడఁ దన్వియుఁ జేరఁగ వచ్చి యచ్చటన్.
ఆ. ౫.

---

# 34. చరిగొండ ధర్మన్న

ఈకవి నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కౌండిన్య గోత్రుఁడు; తిమ్మయపుత్రుఁడు. ఇతఁడు చిత్రభారత మనెడియెనిమి దాశ్వాసములగ్రంథమును జేసి దాని నిమ్మలపల్లి పెద్దనామాత్యున కంకి తముచేసెను. చిత్రభారతమునందు కవి తన్నుఁగూర్చి యిట్లు చెప్పు కొన్నాఁడు—

సీ. కౌండిన్యగోత్రదుగ్ధసముద్రచంద్రు నాపస్తంబసూత్రశోభనగరిష్ఠు
సర్వవిద్యాభిజ్ఞుఁ జరికొండతిమ్మనామాత్యాగ్రణికిమాదమకును గూర్మి
నందను నతిశాంతు నారాయణధ్యానతత్వజ్ఞు శ్రీరంగధామసదృశ
భట్టపరాశరప్రభురంగగురుపాదసీరేజబంభరు నిర్మలాత్ము

ధర్మనాహ్వాయు సత్కవితాధురీణు
దాంతు శతలేఖినీసురత్రాణబిరుద
కలితు నను వేడ్కఁ బిలిపించి కరుణమీఱఁ
దేనియలుగుల్క నిట్లని యానతిచ్చె.

మ. శతలేఖిన్యవధానపద్యరచనాసంధానసురత్రాణచి
హ్నితనామా చరిగొండధర్మసుకవీ నీవాగ్విలాసంబు లా
శితికంఠోజ్జ్వలజూటకోటరకుటీశీతాంశురేఖాసుధా
న్వితగంగాకనకాబ్జనిర్భరరసావిర్భూతమాధుర్యముల్.

గీ. కావున విచిత్రగతి నలంకారసరణి
మీఱ రసములు చిప్పిల మెప్పు లొసఁగఁ
దెనుఁగు గావింపు నాపేర ననఘసుకవి
ధీరు లరుదందఁగాఁ జిత్రభారతంబు.

పై పద్యములనుబట్టి వైష్ణవభక్తుఁడనియు, శతలేఖినీసురత్రాణబిరుదము గలవాఁడై శతలేఖిన్యవధానపద్యరచనయందు సమర్థుఁడనియు, తెలియవచ్చుచున్నది. కృతిపతియైన పెద్దనమంత్రి మాదనకుమారుఁడు; నియోగిబ్రాహ్మణుఁడు; కాశ్యపగోత్రుఁడు. అతఁడు మానభూనాథుని మంత్రియైన ట్లీక్రిందిపద్యములలోఁ జెప్పబడియున్నది—

సీ. అనువత్సరంబుబ్రాహ్మణులకు గోసహస్రము లిచ్చు నృగనరేశ్వరునిరీతి
కంథులనెనయుపాకాలచెర్వాదిగాఁదగు చెఱువులు నిల్పు సగరుకరణి
దీవ్యత్ప్రతాపుఁడై దిగ్విజయంబు గావించు మాంధాతృభూవిభునిలీల
దేవభూదేవతార్థిశ్రేణి కగ్రహారము లిచ్చుభార్గవరాముపగిది
నిందుశేఖరపాదారవిందయుగళ
భావనాపరుఁ డంగనాపంచబాణుఁ
డతులధైర్యాభిభూతహిమాచలుండు
మానభూనాథ చిత్తాబ్జభానుఁ డతఁడు.

శా. ఆరాజేంద్రశిఖావతంసనిజబాహాయుక్తవిశ్వంభరా
ధౌరేయుండు విరోధిమంత్రిముఖముద్రాదక్షుఁ డుద్యద్దయా
పారీణుండు పటీరతారకసుధాపాణింధమశ్రీయశో
హారుం డిమ్మలపల్లిమాదవిభు పెద్దామాత్యుఁ డుల్లాసిల్లెన్.

ఈమానభూనాథుఁ డెవ్వరో గ్రంథమువలన స్పష్టపడకపోయినను మొదటియాశ్వాసాదియందలి యీక్రింది కృతిపతిసంబోధనపద్యము వలన నతఁడు శ్రీరంగరాయని రాజ్యకాలములోని యొక మండలేశ్వరుఁ డని యూహింపఁదగియున్నది—

క. శ్రీరంగరాజసేవా। పారంగతహృదయ! కమలభవ వంశపయః
పారావార సుధాకర! మారసమానావతార! మాదయపెద్దా!

మొదటి శ్రీరంగరాజు విజయనగరసంస్థానమును ౧౫౭౪వ సంవత్సరము మొదలుకొని ౧౫౮౫వ సంవత్సరము వఱకును పాలించెను. రెండవ శ్రీరంగరాజు ౧౬౧౪ వ సంవత్సరమునకు తరువాత రాజ్యమునకు వచ్చెను. ఈకవి యీ యిరువురు రాజులలో నొకరికాలమునం దుండినందున, పదునాఱవశతాబ్దముయొక్క యంతమునందో పదునేడవ శతాబ్దముయొక్క యాదియందో యుండియుండుటకు సందేహము లేదు. ఇదిగాక కవియొక్క కాలమును నిర్ణయించుటకు గ్రంథమునందే యింకొక యాధారము కనఁబడుచున్నది. కృతినాయకునివంశమును వర్ణించుచు కందాళ అప్పలాచార్యులు కృతిపతియొక్క తండ్రికిని పెదతండ్రికిని గురువైన ట్లీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు—

శా. వందారువ్రజదోషమేఘపవనున్ వారాశిగంభీరు నా
నందాత్మున్ హరిపాదభక్తు నిఖిలామ్నాయజ్ఞు విశ్వంభరా
మందారక్షితిజాతమున్ నిగమసన్మార్గప్రతిష్ఠాపరున్
గందాళప్పగురున్ వివేకనిధి లోకఖ్యాతు వర్ణించుచున్.

క. ఆదేశికపదకమలము
లాదరమున హృదయవీధి ననవరతంబున్
మోదమున నిలిపి శ్రీలల
నాథవునిఁ గొలుతురు నారనయు మాదనయున్.

ఈపద్యములనుబట్టి యీచిత్రభారతకృతిపతియు పాండురంగ మాహాత్మ్య కృతిపతి కాలములోనివాఁ డయిన ఛ్లోకగురుశిష్యత్వము వలనఁ దేలపడుచున్నందున, ఈధర్మకవి యించుమించుగా తెనాలిరామ కృష్ణునికాలపువాఁడే. కందాళ అప్పలాచార్యులుగారు చిత్రభారత కృతిపతితండ్రికి గురువై నందున, ధర్మకవి రామకృష్ణకవికిఁ గొన్నిసంవత్స రములుతరువాత నుండిన నుండవచ్చును. చిత్రభారతకవిత్వ మనర్గళ మయిన ధారకలదయి సలక్షణముగా నున్నది. ఈకవియొక్క చరిత్ర మునుగూర్చి యిప్పుడు చెప్పినదానికంటె నధిక మేమియుఁ దెలియ రానందున, చిత్రభారతమునుండి కొన్నిపద్యముల నుదాహరించుటతోనే తృప్తినొందవలసి యున్నది.

చ. అనిమిషనాథుఁ డమ్మునితపోనలకీలల నబ్ధి యింకినన్
దనకు విపక్షుఁడై యచట దాఁగినయాహిమవన్నగాత్మజున్
గినిసి విపక్షుఁ జేయ గమకించి ప్రచేతనునింట నిర్గమం
బని చెడువిల్లనంగ నపరాశ సురేశ్వరచాప మొప్పెడున్. ఆ. ౨.

సీ. ప్రవహించుశృంగారరసపూర మమ్ముని మేనికి జలకంబుగా నొనర్చి
తళతళత్కాంతిచేఁ దనరెడుదరహాసచంద్రికావితతి వస్త్రముగ నొసఁగి
మువ్వంపుదేనియల్ చివ్వన నిడువాక్యములు ప్రసూనములుగాఁ బూజచేసి
చొక్కంపునిడువాలుఁజూపుమెఱుంగులుపొసఁగనీరాజనంబులుగఁ జేసి
యమృతరసములు చిప్పిలునధరబింబ
మదన నైవేద్యముగను నియ్యఁగఁ దలంచి

యడుగుఁదమ్ముల కెరఁగి నెయ్యంబుతోడ
రంభ యిట్లను సంభ్రమారంభ యగుచు— ఆ. ౩.

ఉ. హారము భారమై మణిగణాకరబంధురసౌధరంగసం
చారము దూరమై తనువుసంగతి నొప్పెడుచందనాదిశృం
గారము క్రూరమై చెలియకై వడి నెమ్మియొనర్చివట్టిరా
కీరము వైరమై నిగిడెఁ గేసరిమధ్యకు నొక్క-పెట్టునన్. ఆ. ౫.

శా. ఏమేమీ-హరి శూరుఁడంటి నిజమానే యాజరాసంధుఁ డు
ద్దామప్రక్రియఁ జుట్టుకొన్నఁ బురమున్ దర్పంబు డించెగ సమి
త్సీమం దా యవనుండు ద్రోల గుహఁ జొచ్చెం జూడఁగా నిన్నఁగా
దా ముంజేతులకంకణంబులకు నద్దం బేల యగ్రూరకా. ఆ. ౬.

మ. హరితో నీధరణీవరాగ్రణికినై యాయోధనక్రీడకున్
బురికొంటి న్వడి నేఁడు మేనులు తృణంబుల్గా విచారించి వీ
రరసోద్రిక్తమనస్కులై మెఱయువార ల్నిల్వఁ డాత్మన్ శరీ
రరతిం జెందినభూవరుల్ చనుఁడు పుత్రభ్రాతృసంయుక్తులై. ఆ. ౭.

---

## 35. సారంగు తమ్మయ్య

ఈప్రాంతములయందు సారంగువారు సాధారణముగా మాధ్వులుగా నున్నారు. ఈకవి తనవంశమును వర్ణించుచు,

ఉ. తమ్మనయంబుఁ బ్రోచుటకు ధారుణిబంధులు బంధుపారిజా
తమ్మన రామభక్తిఁ గలతార్కి-కు లెల్లను పీనిదార చి
త్తమ్మన జూపులం దనిసి ధార్మికు లీతని దెంతమంచివృ
త్తమ్మన నాగిరిప్రభునితమ్మన మించె నుడంచితస్థితిన్.

గీ. తమ్మమంత్రి గాంచెఁ దిమ్మాయియందు నం
దనుల శౌర్యసింహు నారసింహుఁ
జతురబుద్ధిచంద్రు సత్కళాగుణచంద్రు
గిరిచమూవరేంద్రుఁ గీర్తిసాంద్రు.

తనతాతను రామభక్తునిగాఁ జెప్పుటచేతను, ఆతనిభార్యను తిమ్మాయియని చెప్పుటచేతను కూడ నితఁడు మాధ్వవంశజుఁ డేమో యని యూహింపఁ దగియున్నను,

క. సారమతి యానృసింహుఁడు
వారాశిగభీరుఁ డతులవైభవమున గౌ
రీరమణి నీశుఁడుంబలె
నారూఢాన్వయ వరించె నక్కమసాధ్విన్.

అని తనతల్లిదండ్రులను పార్వతీపరమేశ్వరులతోఁ బోల్చుట చేతను తనపూర్వుల కమాత్యాదిపదములను జేర్చుచు వచ్చుటచేతను కవి నియోగిబ్రాహ్మణుఁడని తోఁచుచున్నది. ఇతఁ డాపస్తంబ సూత్రుఁడు; భారద్వాజగోత్రుఁడు; నరసింహమంత్రిపుత్త్రుఁడు; సారంగు తమ్మయామాత్యపౌత్త్రుఁడు. ఈకవి వైజయంతీవిలాస మనునాలుగా శ్వాసముల పద్యకావ్యమును రచించెను. ఇందు విప్రనారాయణుఁ డనెడి యాళ్వారుచరిత్రము వర్ణింపఁబడినందున, దీనికి విప్రనారాయణ చరిత్రమనియు నామాంతరము గలదు. ఈవిప్రనారాయణునికే తొండర డిప్పొడియాళ్వా రని యఱవపేరు. ఈపుస్తకమునందలి కవిత్వము మనో హరముగానే యుండునుగాని యందందు కవిత్రయమువారి ప్రయోగ ములకు విరుద్ధములయిన ప్రయోగములు కానఁబడుచున్నవి. కథయు మిక్కిలి యింపుగా నుండును. విప్రనారాయణుఁడను వైష్ణవబ్రహ్మ చారి కావేరీతీరమునందు శ్రీరంగక్షేత్రమునందు వసించుచు మాధుకర

వృత్తిచే జీవించుచు భక్తితో శ్రీరంగనాయకునకు తులసిమాలల నర్పించుచు కాలము గడపుచుండెను.

శా. స్వాధ్యాయంబుఁ బఠించు సాంగకముగా సంధ్యాద్యనుష్ఠానముల్.
విధ్యుక్తక్రియ నాచరించుఁ దఱితో వ్రేల్చుం బ్రభూతాత్ముఁడై
మధ్యేరంగశయానమూర్తి కిడు సమ్యద్భక్తిఁ దోమాలికల్
మధ్యాహ్నంబునఁ గుక్షి భిక్షఁ దనుపు న్మాధూకరప్రక్రియన్.

ఇట్లుండఁగా మధురవాణియు, దేవదేవియు నను వేశ్య లక్కచెలియండ్రిద్ద ఱాతనిని దేవాలయములోఁ జూచి యాతనినిష్ఠ కద్భుతపడి భక్తితో మ్రొక్కఁగా నతఁడు వారిమ్రొక్కు గైకొనకపోయెను. అప్పుడు దేవదేవి యలిగి యప్పతో,

ఉ. మ్రొక్కిన నెవ్వరే మనఁడు; మోమటువెట్టుక చక్కఁబోయె; నీ
దిక్కును జూడఁడాయెఁ; నొకదీవనమాటయు నాడఁడాయె; వీఁ
డెక్కడి వైష్ణవుండు? మన మేటికి మ్రొక్కితిమమ్మ? యక్కటా!
నెక్కొని వెఱ్ఱిబుద్ధి యయి సిద్ధురపోయినవానికాళ్ళకున్.

అని యతని నిరాకరించి పలికెను. మధురవాణి చెల్లెలి నూరార్చుచు,

ఉ. చూచిన నేమి? నీవలను చూడకయుండిన నేమి? పూజ్యులం
జూచిన భక్తి మ్రొక్కుటయె శోభన; మీతఁడు బ్రాహ్మణుండు; ధా
త్రీచరులందు బ్రాహ్మణుఁడు దేవుఁడు; దేవుఁడు నీవు మ్రొక్కినన్
జూచునొ? పల్కునో? యటుల సుమ్మితఁడున్ సరసీరుహాననా!

అని శాంతచిత్తను జేసి యతనివైరాగ్యమును గొంత ప్రశంసించెను. అప్పు డప్పమాట లంగీకరింపక,

చ. ప్రకటజితేంద్రియుల్ ధరఁ బరాశరకౌశికులంతవారు స్త్రీ
లకు వశు, లంతకంటె మిగులన్ దృఢమానమగచ్చు బిగ్గఁ గ
ట్టుకొనఁగ నీతఁ డెంత? శుకుఁడో? హనుమంతుఁడో? భీష్ముఁడో? వినా
యకుఁడో? తలంచుకో సరసిజాయతలోచన నెమ్మనంబునన్.

క. ఈనిష్ఠ లింతతారస । మైనందాఁకా నెసూ! సదాచారి యటం
టే, నచ్చినదాఁకనె యగు,।పూనిజనవిడంబనములు మన మెఱుఁగనివే?

క. ఇటువంటయ్యాలె కారా
చిటుకు మనకయుండ సందెచీఁకటివేళన్
ఘుటచేటీవిటులై యీ
కటకంబునఁ దిరుగువారు? కంజదళాక్షీ!

* * * * *

గీ. నిర్జితేంద్రియుండు నిష్ఠాపరుం డంచు
నప్ప సారెసారెఁ జెప్పెదీవు;
వీనిఁ బ్రతినచెఱిచి విటుఁజేసి తెచ్చినఁ
గలదె పందె మనినఁ గాంతపలికె.

* * * * *

క. నీ వీవైష్ణవు విటునిం । గావించిన, లంజెతనపుగడ నే విడుతున్;
గావింప లేకయుండిన । నీవు న్విడిచెద వెయనిన నెలఁతుక యొప్పెన్.

చెల్లెలావీరవైష్ణవుని విటునిఁ జేయవచ్చు ననియు, అప్ప యతని నట్లు చేసినయెడల తాను వేశ్యావృత్తిని విడిచెద ననియు వివాదపడిన మీఁదట దేవదేవి తా నా వైష్ణవబ్రహ్మచారిని విటునిజేసి యిఁటికిఁ దేలేకపోయినపక్షమునఁ దాను వేశ్యావృత్తిని విడిచెదనని పంతము పలికి తనరత్నాభరణములను, కస్తూరీతిలకమునుదీసి తులసిపూసలపేరులును తిరుమణినామములును వేసి సానివేషముఁ బాసి దాసరిసాని యయి తిన్నఁగా విప్రనారాయణుఁ డున్న యారామమునకుఁ బోయి యాతనికి నమస్కారము చేసి, హేయభాజనమయిన వేశ్యావృత్తిపై విరక్తి పొడమినట్టు నటించి,

గీ. * * హేయభాజన మెన్నిట నెన్నిచూడ
వేశ్యజన్మంబు జన్మమే విప్రవర్య

* * * *

ఉ. ఒక్కనిఁ బిల్వనంపి, మఱియొక్కనిచేతఁ బసిండిపట్టి, వే
ఱొక్కనియింటి కేగుచు, మఱొక్కని నానదుచక్కి నొక్కచోఁ
బొక్కికలంచి చూడ భ్రమఁబొంది విటుల్ తెలియంగ లేరుగా
కెక్కడిసత్య మేడవల పెక్కడినేమము వారకాంతకున్?

గీ. అనఘ వేశ్యావిడంబవర్తనము లెన్న
నిసుకపాతఱ యీజోలి యేల త్రవ్వ?
నప్పడుపుఁగూటిపై నసహ్యత జనించి
నామనసు రోసినట్టిచందంబు వినుము.

* * * *

గీ. వారసతులైన యూసీమవారివలెనె
మోడిమూనిసినైన నేగోడు నెఱుఁగ;
జిహ్వ నాల్గచ్చరాలు నేర్చినకతానఁ
బడుపుఁగూటికి మనసు గొల్పక నిలైతి.

అని వేశ్యావృత్తిని నిందించుచు తియ్యనిమాటలుచెప్పి యాతని చెంతఁ జేరి పరిచర్యచేయుచు దాస్యమిషమున మెల్లమెల్లఁగా నాతని యుల్లము కలంపఁ జొచ్చెను. ఇట్లు కొంతకాలము దాసురాలిపొత్తు గలుగునప్పటికి,

శా. ఆవిప్రోత్తమువజ్రపంజరనిభంబై నిశ్చలంబైన స
ద్భావం బంగనసాహచర్యగుణసంపర్కంబునన్ లోహమై,
గ్రావంబై, దృఢధారువై, తరుణవృక్షంబై ఫలప్రాయమై,
పూవై, తన్మకరందమై, కరఁగె బోఁబో నీళ్ళకుం బల్చనై.

విప్రనారాయణుని వజ్రకఠినమైన హృదయము దినదినక్రమమునఁ గరఁగి నీటికంటెను బలుచనై దేవదేవిమనస్సులో నైక్యమయ్యెను. అంతట గురువే దాసురాలికి దాసుఁడయి పరిచర్యచేయ నపేక్షించి వేఁడుకొనఁగా మొట్టమొదట నాటక్కరివారాంగన,

గీ. నిడుదపట్టె తిరుమణియె వైష్ణవముగాని
మీఁర లాడుమాటతీరు చూడ
ననఘు నొసలు బత్తుఁడును నోరుత్తోడేల
టన్నరీతి తోఁచుచున్న దిపుడు.

అని నీతులు చెప్పియు,

క. ఓసతి భగవత్సేవకు । వాసి గణింపంగ భాగవతసేవయ; త
ద్దాసులకైంకర్యముఁ గృపఁ । జేసిన రంగేశ్వరునకుఁ జేయుటెసుమ్మీ.

అని యాతనిచేత బతిమాలించుకొని భాగవత కైంకర్యము నంగీకరించి, తుద కాతని నింటిబంటునుజేసి తనయింటికే గొనివచ్చి పందెము గెలిచెను. ఇట్లా వైష్ణవవటుని విటునిజేసి తెచ్చి యిల్లు చేర్చిన తరువాత వేశ్యమాత తగులుకొని

క. నవమదనునైన మెచ్చవు; । తవిలితి వీయటువ; బోడితలకు వలచితో?
ధవళాక్షి। వీని వ్రేలుం । జెవులకు వలచితివో? పిల్లసిగకు వలచితో?

అని కూఁతునకు బుద్ధిచెప్ప మొదలుపెట్టెను. తాను పట్టినప్రతిజ్ఞ నెఱవేఱినందున,

క. పెదయప్పయు నేనును బ
న్నిదమాడినపసికి నీతనిం దెచ్చితి నా
కొదవ యిఁటదీఱె నిఁక నీ
కొదవయె యున్నదనఁ దల్లి కూఁతునకనియెన్.

కూఁతురును తల్లిమాటలకు సంతోషించి క్రొత్తయల్లుని నిల్లు వెడలింపఁ దల్లిం బురికొల్పెను. ఆసన్నగైకొని వేశ్యమాత నూతన జామాతను జేరి,

సీ. నీపట్టెతిరుమణి నీతిరుచూర్ణంబు గణికకు వెండిబంగారులౌనె?
నీపుట్టగోచియు నీకావివేష్టముల్ వారకాంతకుఁ బట్టుచీరలౌనె?

నీముష్టిగూడయు నీతులసిసరులు వేశ్యకుఁ బండుగవేఁట లౌనె?
నీవేదశాస్త్రముల్ నీజపసంధ్యలు లంజెసానికిఁ బాఁజులగము లౌనె?
పెట్టనోపితివా యెప్పటట్టె యుండు
పెట్టలేకున్న విచ్చేయు పెందలకడ
మొదల రోయింతులకు నొక్కముడుపె కాక
నీసదాచార మేలయ్య! దాసరయ్య!

అని కసరి సాగనంపఁగా నాభాగవతోత్తముఁడు వేశ్యాగృహము విడిచి తనకుటీరముచేరి తనహృదయేశ్వరిని తలఁచి చింతిల్లుచు,

గీ. అతివ వైష్ణవమతరహస్యములఁ జాలఁ
బరిచయము గన్నయట్టిప్రసన్నురాలు
శూద్రసంపర్కమున కేల చొచ్చుమరల?
నిచ్చటికి నెంతప్రొద్దైన వచ్చుఁగాక.

అని ప్రియురాలి గుణసంపత్తిని బ్రశంసించి యడియాసపడుచు,

గీ. తనకు నేమిత్రవ్వి తలకెత్తిరమరు లీ
యుర్విమనుజు లేమి యొసఁగరైరి?
సింగివారసతుల నిర్మాత్మకలఁ జేసి
పుడమి మాతృభూతముల సృజించె.

అని భూలోకమున వేశ్యలకు తల్లులను సృష్టించినందునకు బ్రహ్మదేవుని నిందించుచు పరితపింపఁజొచ్చెను. వేశ్యాసంపర్కరమువలన నెట్టి దృఢమనస్కులకును ననర్థములు వచ్చునని చూపుటకయి యింతవఱకుఁ గల్పింపఁబడినకథ నీతిబోధకముగానే యున్నదికాని తరువాతి కథ మాత్రము నీతిబాహ్యముగా నున్నది. భక్తుఁ డట్లు పరితపించుట చూచి భక్తజనార్తిహరుఁ డగు రంగేశుఁడు శిష్యరూపము ధరించి

క. సారమణిఖచిత మగు బం
గారపుఁదనగిన్నె వారకామిని కొసఁగన్

శ్రీరంగదివ్యధామవి
హారుఁడు స్వాయమర్థచోరుఁడై కొనిపోయెన్.

తనగుడిలోని బంగారపుగిన్నెను గొనిపోయి తనగురు వగు విప్రనారాయణుఁడు పంపినట్లుగా వేశ్యమాతకు సమర్పించి తనభక్తునకు మరల వేశ్యతోడిపొత్తు సమకూర్చెనఁట!

చ. సతతము బ్రహ్మరుద్రసురసంయమిముఖ్యుల నాత్మమాయ మో
హితులుగఁ జేయుసామి వెలయింతిని మోహితఁ జేయలేక ప్రా
కృతజనునట్లు తాను దనగిన్నెనొసంగెను బంటుకోసమై
మతకరివేశ్యమాతవెకమాయ లజేయులు విష్ణుమాయకున్.

వేశ్యమాయలు విష్ణుమాయనుసహితము మించినవఁట! దేవాలయములోని స్వర్ణపాత్రము మాయమగుటకన్నుఁగొని జియ్యరు రాజభటుల కెఱిఁగించి, వారు వేశ్యయింట గిన్నెపట్టుకొని విప్రనారాయణుని చోరునిగా దండితుఁ జేయుటకయి కొనివచ్చినప్పు డాతసి గుడివెడల నడవఁ బోవుచుండఁగా, శ్రీరంగేశుఁడు సాక్షాత్కరించి భక్తప్రమోద సంధానముకొఱకు తానే గిన్నెను వేశ్య కిచ్చితినని చెప్పి రాజభటులు పట్టుకొన్న స్వర్ణపాత్రమును మరల వేశ్యకిప్పించి భక్తునకు బ్రహ్మరథము పట్టించి జీవన్ముక్తి యొసంగెనఁట!

గీ. బ్రహ్మసభయెల్ల భక్తి నప్పరమవైష్ణ
వోత్తముని బ్రహ్మరథమున నునిచి పట్ట
ణమున నేగించి రధికసంభ్రమమువిూఱ
జియ్య ముందఱికొమ్మునఁజేరి మోవ.

ఆహా! ఏమి యీబ్రాహ్మణోత్తముని భాగ్యము!

ఉ. చోరుఁ డనంగ రా దొరులసొమ్ములు ముచ్చిలినం బ్రపన్ననిన్
జారుఁ డనంగ రాదు పెలుచం బరకాంతలఁ గూడినన్, దురా

చారుఁ డనంగ రాద యనిశంబును వేశ్యలతో రమించినన్,
బోరున మీఁర లాతనికిఁ బూనుఁడు బ్రహ్మరథంబు వైష్ణవుల్.

ఇటువంటి సిద్ధాంతములే మన దేశములో నీతికిని మతమునకును గూడ నమిత మైన చెఱుపును గలుగఁజేయుచున్నవి. నీతిని విడిచినమత మెప్పుడును దేవునికి ప్రీతికరము కానేరదు. వైజయంతీ విలాసములోని,

చ. ఇనసమతేజులౌనృపులనెల్ల మహమ్మదుశాహియేలు నీ
యెనుబదినాల్గుదుర్గముల నేలినయేలిక గోలకొండఁ ద
ద్ఘననగరస్థలిం గరణికం బొనరించుచుఁ దమ్మమంత్రి యా
జనపతి రమ్మి పొమ్మనఁ బ్రజ ల్జయవెట్ట గృహస్థు లౌననన్

అను పద్యమునుబట్టి యీతిమ్మకవి మహమ్మదుశాహి గోల కొండ నవాబుగా నుండిన ౧౫౮౧ వ సంవత్సరమునకును ౧౬౧౧ వ సంవత్సరమునకును మధ్యకాలములో వైజయంతీవిలాసమును రచి యించిన ట్లీవఱకే తెనాలి రామకృష్ణకవి చరిత్రమునందుఁ దెలుపఁబడి నది. పయిపద్యములవలననే కవియొక్క కవిత్వరీతి తేటపడునుగనుక వేఱుగఁ బద్యముల నుదాహరింపవలసిన యావశ్యకము లేదు.

---

## 36. తురగా రామకవి

ఈకవి యాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. ఇతఁడు నూఱు నూటయేఁబది సంవత్సరముల క్రిందట నుండినట్టును, అడిదము సూరకవి తోడి సమకాలికుఁ డయినట్టును ఎల్లవారును వాడుచున్నారు. వేముల వాడ భీమకవికిఁ దరువాతఁ దిట్టుకవిత్వమునం దీతనితో సమానుఁడు మఱియొకఁడు లేఁడు. భీమకవివలెనే యితఁ డాడినమాట యెల్ల నగుచు వచ్చెననియు, అందుచే నెల్లవారు నీతనికి జడియుచు వచ్చిరనియు,

చూపుట కనేక కథలు కల్పింపఁబడినవి. అందుఁ గొన్నిటి నిం దుదాహ రించుచున్నాను—

౧. ఈకవి లేటవరపు పోతురాజను క్షత్రియుని యింటికిఁ బోఁగా నతఁడు కవి కేమయిన నియ్యవలసివచ్చునని యింటనుండియు లేఁడని పించెనఁట అప్పుడు రామకవి,

క. కూటికిఁ గాకులు వెడలెడు। నేటావల మూఁకచేరి యేడువఁదొడఁగెన్
గాటికిఁ గట్టెలు చేరెను। లేటవరపు పోతరాజు లేఁడా లేఁడా?

అని ప్రశ్న వేయునప్పటికిఁ బోతురాజు మృతుఁడయ్యెనఁట! దహన నిమిత్తమయి బంధువు లింటినుండి శవమును గొనిపోవనున్నప్పు డాతనిభార్యవచ్చి కవికాళ్లమీఁదఁ బడి పతిభిక్ష పెట్టుమని వేఁడు కోఁగాఁ గరుణించి,

క. మేటి రఘురామునమ్ముఁడు। పాటిగ సంజీవిచేత బ్రతికినరీతిన్
గాటికిఁ బో నీ కేటికి। లేటవరపు పోతురాజ లెమ్మా రమ్మా.

అని కవి పిలువఁగానే మరల బ్రతికిలేచి పోతురాజు కట్టుకు మీఁదనుండి దిగివచ్చెనఁట!

౨. ఈకవి బావయైన తల్లాప్రగడ సూర్యప్రకాశరావు ఉంగు టూరను స్వగ్రామమునం దొక పెద్దయిల్లు కట్టించి, దానిని జూపుట కయి కవిని లోపలికిఁ దీసికొనిపోయి యొకగదిలో విడిచి బావమఱఁది పరిహాసకమున కయి తాను మఱియొకచోట దాఁగియుండెనఁట. కవి యాయింటఁ దిరిగి తిరిగి దారి కనుఁగొనలేక విసిగి,

గీ. అంగణము లెన్ని కేళీగృహంబు లెన్ని
యోడుబిళ్లలయిండ్లెన్ని మేడ లెన్ని
కట్టఁ గాకేమి సూర్యప్రకాశరాయఁ
డుంగుటూ రిండ్ల రాకాసు లుండవచ్చు.

అనఁగానే కావుకావని యఱచుచు నింట నేమూలఁజూచినను దామే యయి పట్టపగలు పిశాచములు సంచరింపఁ జొచ్చెనఁట.

3. పెద్దాపురపు సంస్థానాధీశ్వరులయిన శ్రీవత్సవాయి తిమ్మగజపతిమహారాజుగారి దర్శనార్థము పోయినప్పుడు రాజు కవికి దర్శనమియ్యకపోఁగాఁ గోపించి,

క. అద్దిర శ్రీభూనీళలు । ముద్దియ లాహరికిఁ గలరు ముపురందులలోఁ

బెద్దమ్మ నాట్య మాడును । దిద్దిమ్మని వత్సవాయితిమ్మనియింటన్.

అని శపింపఁగానే రాజు రాజ్యమును బోఁగొట్టుకొని దరిద్రుఁడయ్యెనఁట !

4. రామకవి యిల్లు కట్టించుకొనునప్పుడు దారిని బోవువారి నందఱిని బిలిచి తనకొకడకిటుక లందింపని నియమించుచుండెనఁట! ఒకనాఁ డాదారిని అడిదము సూరకవి పోవుచున్నప్పు డాతనిని బిలిచి తక్కినవారి నడిగినట్లే యతనిని గొన్ని యిటుక లందిచ్చి పొమ్మని యడుగఁగా నతఁడు కోపించి రామకవి యని యెఱుఁగక,

"సూరకవితిట్టు కంసాలిసుత్తెపెట్టు"

అని పలికి పోఁ బోయెనఁట! రామకవి యామాట విని కన్నులెఱ్ఱచేసి బిగ్గఱగా,

"రామకవిబొబ్బ పెద్దపిరంగిదెబ్బ"

అని కేకవేసెనఁట. అంతట సూరకవి యతఁడు రామకవి యని తెలిసికొని కొన్నియిటుక లందిచ్చి మఱి వెడలిపోయెనఁట!

ఇవి యన్నియుఁ గేవల కల్పితకథ లయి యుండవచ్చును. ఇటువంటి మహామహిమగలవాఁ డన్న వేములవాడభీమకవి కోమటిపేరఁ గృతిచేసి స్తుతించినట్లే యీరామకవియుఁ గంసాలిపేరఁ గృతిచేసి స్తుతులు చేసెను. ఈతఁడును నయ్యంకి బాలసరస్వతి యను మఱియొక కవియు గలిసి రచియించిన నాగరఖండమనెడి మైదాశ్వాసముల గ్రంథమొకటి

కానఁబడుచున్నది. ఈయిద్దఱుకవులును దమగ్రంథముయొక్క యాశ్వాసాంతగద్యము నీక్రప్రకారముగా వ్రాసికొనియున్నారు—

"ఇది శ్రీమద్దుర్గాదక్షిణామూర్తివరప్రసాదాసాదితసారస్వత తురగా రామకవి వరాయ్యంకి బాలసరస్వతినామధేయ ప్రణీతంబైన శ్రీ స్కాందంబను మహాపురాణమునందు సనత్కుమారసంహితను నాగరఖండము"

ఈనాగరఖండము ధవళేశ్వరపు మార్కండేయుఁడను స్వర్ణకారకులజుని కంకితము చేయఁబడినది. ఈవిశ్వకర్మవంశజుఁడు బెజవాడకుఁ బ్రభువుగా నుండిన ట్లీక్రిందిపద్యమువల్లఁ దెల్లమగుచున్నది—

మ. రజతాగం బొకరాజమౌళికి వినిర్మాణంబు గావించి యి
చ్చె జగం బెన్నఁగ విశ్వకర్మ మును దాఁ జిత్రంబు గా దిప్పు డీ
బెజవాడప్రభుఁ డియ్యెనెంతయును గల్పించున్ ధరిత్రిన్ మహా
రజతస్వర్ణగృహంబు లెప్పుడు బుధవ్రాతంబు మోదింపఁగన్.

ఈధవళేశ్వరపుమార్కండుఁడు మహమ్మదు కుతుపషాహీ కాలములో నుండినట్టు నాగరఖండముయొక్క యవతారికలో నీక్రిందిపద్యమునఁ జెప్పఁబడిది—

క. అతఁడు ప్రసిద్ధి వహించెన్
క్షితినగరజపతుల గెల్చి చెల్వఁగి జయశ్రీ
సతిఁ జేకొనిన మహమ్మదు
కుతుపశహాచంద్రునకును గుడిభుజమనఁగన్.

దీనినిబట్టి చూడఁగాఁ గవి పదునాఱవశతాబ్దాంతమునందో పదునేడవశతాబ్దారంభమునందో యుండినట్టును, కవినిగూర్చి చెప్పెడికథలన్నియు నబద్ధము లయినట్టును కనఁబడుచున్నది. మహమ్మదుకుతుబుషాహి క్రీస్తుశకము ౧౫౮౧వ సంవత్సరము మొదలుకొని ౧౬౧౧ వ సంవత్సరమువఱకును గోలకొండనవాబుగానుండి రాజ్యము చేసెను.

కుతుబ్ షాహీ వంశము ౧౬౮౭వ సంవత్సరముతోనే నశించినది. నాగర ఖండమునందుఁ గొన్ని వ్యాకరణవిరుద్ధములగు ప్రయోగము లున్నను మొత్తముమీఁదఁ గవిత్వము హృద్యముగానే యున్నది. నాగరఖండము నుండి కొన్నిపద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి —

ఉ. ప్రీతియొనర్ప నగ్గిరి నిరీక్షయొనర్ప దరీసరత్ప్రివం
తీతటజాతరూపధరణీరమణీయమణీసమగ్రమై
స్ఫీతసుధాంబుపూరసరసీరుహశీకరశీతలానిలా
స్వీతవిహారదేవతరుణీహరిణీకరిణీసమూహమై. ఆ. ౧.

ఉ. ఆదికి నాదికారణ మహార్బుతికోటిసమానతేజుఁడు
త్పాదితసర్వలోకుఁడును బ్రహ్మమునై తగు విశ్వకర్మ నా
నాదివిజాళిలోన భువనంబుల నెల్లను హేతుకార్యక
ర్త్రాదులు తానమై తగు యథార్థమునుమ్ము మయూరవాహనా.
ఆ. ౨.

ఉ. ఇచ్చిన నైదుసాధనము లింపుగ నైదుగురుఁన్ ధరించి యు
ద్యచ్చరిత ప్రశస్తయజనాదిరతుల్ శివతత్త్వబోధులై
యచ్చెరు వందఁ జేసిరి సమస్తజగంబులఁ దత్క్షణంబునన్
హెచ్చినయాత్మవర్తనల నెన్నికగాఁగ సరోజబాంధవా. ఆ. 3.

చ. కమలజుకంటె మున్ను శశిఖండశిఖామణికంటెమున్ను శ్రీ
రమణునికంటెమున్నుగ విరాజిలు బోధకుఁడై నయట్టిబ్ర
హ్మముగ మహానుభావుఁడని యాత్మవివేకముచే నెఱుంగుమా
యమితపువిశ్వకర్మను మహాత్ముని లోకకృతిప్రవీణునిన్. ఆ. ౪.

చ. కడఁకఁ గనుంగొనంగఁ దొలుకారుమెఱుంగులు గ్రుమ్మరింపఁగా
నడుగిడ గల్లుగల్లు మను హంసకనాదము హంసరావమున్
దడఁబడఁ బద్మరాగసముదాయముదాపున నేపు చూపి యె
ల్లెడలఁ బద్మాగరాగరుచు లీనఁగ వచ్చెను గౌరి వేడుకన్. ఆ. ౫.

# 37. చెన్నమరాజు చెన్నమరాజు

ఈకవి చారుచంద్రోదయ మనెడి మైదాశ్వాసముల ప్రబంధమును జేసెను. ఇతఁడు నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు; ఆత్రేయగోత్రుఁడు; శేషయామాత్యపుత్రుఁడు. ఈకవి తాను పెమ్మసాని తిమ్మరాజునకాశ్రితుఁడయినట్టు చెప్పి తిమ్మరాజు శ్రీరంగనాయనికిని వేంకటపతిరాయనికిని మంత్రియైన ట్లొకపద్యములో నీక్రిందివాక్యముతోఁ జెప్పియున్నాఁడు—

సీ. శ్రీరంగరాయ ధాత్రీతలాధ్యక్షు దక్షిణభుజాదండమై చెలఁగినాఁడు.

*   *   *   *

రమణ వేంకటపతిరాయేంద్రుఁడు నుతింపఁ బటుకార్యదక్షుఁడై
ప్రబలినాఁడు

ఈకవి తనముత్తాతయైనలక్ష్మీపతి శ్రీనాథకవికి శిష్యుఁడై నట్లీక్రింది పద్యములలోఁ దెలిపియున్నాఁడు—

క. సన్నుత కవిత్వవిద్యా। భ్యున్నతి శ్రీనాథసుకవిపుంగవుకరుణన్
జెన్నమరున్ లక్ష్మీపతి। చెన్నమరాజప్రధానశేఖరుఁ డెలమిన్.

కవి శ్రీరంగరాయ వేంకటపతిరాయల కాలములోనున్నవాఁ డగుటచేత క్రీస్తుశకము ౧౫౭౪-౧౬౧౪ సంవత్సరములమధ్యను ప్రబలియున్నవాఁడు. కవియొక్క కవిత్వరీతి తెలియుటకై చారుచంద్రోదయములోనిపద్యముల రెంటిని నిం నుదాహరించుచున్నాను.

ఉ. ఎల్లి యవశ్యమున్ వనికి నేగి మహోగ్రతపం బొనర్చి సం
పల్లలనామనోహరుకృపన్ వరలాభము గాంచివత్తు నీ
యుల్లమునం బ్రమోదము సముల్లసితంబుగ నిందు నిల్వు మో
పల్లవపాణి యంచుఁ బ్రియభాషల భూవిభుఁ డాదరించినన్.

శా. తావు ల్గులొక్కెడు మేనుతీవకుఁ బరీతాపంబు గావించునీ
జీవంజీవమనోజ్ఞమూర్తి యకటా శీతాంశువా కాదు శో
భావైరూప్యమునన్ జనభ్రమదమా భస్మాన్వృతానంగతే
జోవైశ్వానరవిస్ఫులింగమును మీ చూడన్ దిశానాయకా.

---

# 38. తెనాలి అన్నయ్య

ఈకవి సుదక్షిణాపరిణయమనెడి మూఁడాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఇతఁడు తెనాలిపురనివాసుఁడు; శైవాచార సంపన్నుఁడు; రామపండితపుత్రుఁడు.

శా. శ్రీలీలాహరినీలపీఠరుచిరశ్రీవత్ససంపన్నవ
క్షోలాలిత్యుఁడు వేంకటేశుఁడు కృపం గోనేటిరామక్షమా
పాలస్వామిసమస్తరాజ్యభరణోపాయాధికున్ హృద్యవి
ద్యాలోలున్ బులిజాలరామవిభుసోమామాత్యునిం బ్రోచుతన్.

సుదక్షిణాపరిణయములోని యీప్రథమపద్యమునుబట్టియే యీ కావ్యము కోనేటి రామరాజు మంత్రియైన పులిజాల సోమామాత్యున కంకితము చేయఁబడినట్టు తెలిసికోవచ్చును. ఆసోమామాత్యుఁ డొకనాఁడు సభాసీనుఁడయి తన్ను రావించి కృతిఁ వేఁడిన ట్లీక్రిందిపద్యములోఁ గవి చెప్పుకొనియున్నాఁడు—

మ. కవులున్ గాణలు జాణలార్యులు హితుల్ కాంతాసమూహంబు లు
త్సవలీలం దనుఁ గొల్వ నిండుకొలువై సత్కావ్యగోష్ఠీవిశే
షవినోదైకపరాయణత్వమున రాజ్యశ్రీవిహారంబుఁ బ్రా
జ్యవివేకంబుఁ దనర్ప రామవిభుసోమామాత్యుఁడత్యున్నతిన్.

గీ. నవ్యసుగుణాభిరామ తెనాలిరామ
పండితాగ్రణిసత్పుత్రు భవ్యమిత్రు
హరపదాంభోజసాముఖ్యు నన్నపాఖ్యు
నన్నుఁ బిలిపించి యాదరోన్నతి వహించి.

చ. పలుకులకల్కి కప్పురపుఁబల్కులు చల్లినరీతిఁ బండువె
న్నెలతళుకుల్ విభుండు హవణించినమించున శంబరారి చెం
గలువలతూపుకోపుల ముఖాముఖిఁ జూపినయేపునం గృతుల్
పలుకఁగ నేర్తు పూర్వకవిపద్ధతి రామయయన్న సత్కవీ.

గీ. సరససాహిత్యసాహిత్యపరత నీవు
పరిఢవించుసుదక్షిణాపరిణయంబు
కీర్తి విలసిల్ల మాకు నంకితము సేయు
తేట యగువాగ్విలాసంబు కోటిసేయ.

ఇఁక దీనినిబట్టి కృతికర్తయొక్క కాలనిర్ణయము చేయవలసి యున్నది. కృతిపతియొక్క కాలము తెలియునేని, కవియొక్క కాలమునుఁ దెలియును. కృతినాథుని ప్రభువైన రామరాజుయొక్క వంశము గ్రంథమునం దీవిధమునఁ జెప్పఁబడినది—

గీ. చంద్రవంశాబ్ధిపూర్ణిమాచంద్రుఁ డారు
వీటి బుక్కయరామభూవిభునిసుతుఁడు
తిమ్మరాజేంద్రుఁ డన్వయదీపకుండు
కనియెఁ బినకొండభూపాలు ననఘశీలు.

చ. కులనిధి యానృపాలకుఁడు కోనమదేవి వరించి కాంచెఁ జే
కొలఁది నరాతులం దునుముకోనటితిమ్మనరేంద్రు భూమిభృ
త్తిలకముఁ జిన్నతిమ్మవిభు ధీరసుధానిధి నప్పరాజు ని
ర్దళితవిరోధిభూవరకురంగుని రంగనృపావతంసమున్.

ఇట్లా ర్వీటి బుక్కరాజుకొడుకు రామరా జయినట్టును, రామరాజుకొడుకు తిమ్మరా జయినట్టును, తిమ్మరాజుకొడుకు చినకొండరా జయినట్టును, చినకొండరాజుకొడుకు కోనేటి తిమ్మరా జయినట్టును, చెప్పఁబడెను. ఈకోనేటి తిమ్మరాజు కొడుకయిన రామరాజువద్దనే కృతిపతియైన సోమామాత్యుఁడు మంత్రిగానుండెను. పయిని జెప్పిన వంశావళినిబట్టి విచారింపఁగాఁ గృష్ణదేవరాయని యల్లుఁ డయిన రామరాజున కీరామరాజు పెదతండ్రికొడుకునకు మనుమఁ డయినట్టు స్పష్టమగుచున్నది. అళియ రామరాజు ౧౫౬౫ వ సంవత్సరమువఱకును జీవించి యాకాలముననే మనుమల నెత్తినవాఁ డగుటచేత నాతని పెదతండ్రికొడుకును నప్పటికే యెదిగినమనుమలు గలవాఁ డయి యుండవచ్చును. కాఁబట్టి విమర్శించిచూడఁగా సుదక్షిణాపరిణయకృతీశ్వరుని ప్రభువు పదిసంవత్సరము లీవలావలగా ౧౫౭౦ వ సంవత్సరప్రాంతములయం దుండెనని తేలుచున్నది. ఇదియే కవికాలము. ఈకవికిఁ గందాళ శ్రీరంగాచార్యులు గురు వయిన ట్లీక్రిందిపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది—

క. కందాళ భావనార్యుల । నందను శ్రీరంగగురుని నతబుధరక్షా
  మందారంబు నుతింతును । మందారమరందబిందుమధురారభటిన్.

సుదక్షిణాపరిణయకవిత్వము సలక్షణమయి కర్ణరసాయనముగా నున్నది! కవిత్వమాధుర్యము తేటపడుటకయి కొన్నిపద్యము లిందుదాహరింపఁబడుచున్నవి—

చ. పలుకఁగ నేర్చుచిత్రములు పాడఁగ నేర్చినపుష్పవల్లికల్
  మెలఁగఁగ నేర్చురత్నములు మెల్లన నడ్వఁగ నేర్చుచంచలల్
  నిలుకడ నేర్చువెన్నెలలు నెయ్యముతియ్యము నేర్చుపైఁడిక్రొం
  దళుకు లనం జెలంగుదురు తామరసేక్షణ లప్పురంబునన్. ఆ. ౧.

చ. ఏనొకవింతయే రఘుకులేశ్వర యాదిమవిష్ణుమూర్తివై
యీనిఖిలావనీతలము నేలెడు నిన్ గనుఁగొంటి నేఁడుగా
నానియమంబు నాజపము నాతపమున్ ఫలియించె భక్తిస
న్మానధురంధరత్వమున నా జననాయక యిట్లుపల్కుటల్. ఆ. ౧.

ఉ. విప్రకులావతంస వినవే యనుమానము మాని పుత్రకుం
డప్రతిమప్రభావనిధి యన్వయదీపకుఁ డుద్భవిల్లు న
వ్యప్రచురాంగకాంతిభరయౌ వనలక్ష్మియు నిన్నుఁ జెందు ని
త్యప్రమదంబు చేకుఱుమహాపధ మొక్కటి నీకు నిచ్చెదన్. ఆ.౨.

చ. నృపవర నిన్ను మీఁ దెఱుఁగనేరక వేఁడితిఁగాక చంచలా
చపలము లైనరాజ్యసుఖసంపదలన్ మదినమ్మి కీర్తియుం
గృపయు వివేకమున్ నయముఁ గేవలధర్మపరత్వమున్ సదా
కపటమతిం దొఱంగుమహీకాంతుల కేడ పరోపకారముల్. ఆ-౨

మ. జలకంబుం దగఁగూర్చి నెన్నుదుట రక్షాకాంక్షఁ బాదాంగుళీ
స్థలమృత్స్నాతిలకంబు దీర్చి రుచులం దట్టాడువజ్రంపుటు
య్యాలపైఁ బొత్తుల నుంచి యోకుధరకన్యాధీశదివ్యాంశపే
శలమూర్తీ నిదురింపవే యను సుతుం జంద్రాస్య జోకొట్టుచున్. ఆ.౨

ఉ. వాడినమోముతోడఁ గయివాలినచూపులతోడ దీనతం
గూడినపల్కుతోడ నెఱిగూడనిగందపుఁబూఁతతోడఁ గీ
లూడినయందెతోడ బిగియూడినతాలిమితోడ వచ్చెఁ గ
గ్గాడియుఁబోలెఁ గామగవిగాడిగలయ్య నృపాలువీటికిన్. ఆ. 3.

ఉ. విన్నఁదనం బిదేమి నెఱివీడినచిత్త మిదేమి వేయిఁగా
ల్గన్నులవాఁ డిదేమి శరఘాతల నెత్తు రిదేమి వెంబడిం
గిన్నరసిద్ధకింపురుషఖేచరవీరులురా రిదేమి మీ
యున్నవిధం బిదేమి నిఖిలోన్నతశాసన పాకశాసనా. ఆ. 3.

ఉ. భానుమతీకుమారకుఁడు పల్కు మహేంద్రునిఁ దేవ యె
వ్వానికి గెల్పు నోటమియు వచ్చు నొకానొక వేళ దీనికై
దీనత యింతయేటికి మదీయభుజాగ్ర ధనుర్విముక్తనా
నాసిశితాస్త్రపాతముల నాకుల నేనవలీలఁ గాచెదన్. ఆ. 3.

ఉ. మేలు బళీ చతుర్ముఖుఁడు మిక్కిలిశర్వరి యెట్టులన్న నీ
బాలిక మాదిలీపనరపాలకుదేవిగ నిశ్చయించె ల
క్ష్మీలలనేశునాభిసరసీరుహమందిరవర్తి యైనవాఁ
డేల యొనర్చు వేదజడుఁ డేనియు నీడుకురానిచేఁతలన్. ఆ. ౪.

చ. కుడిచెవిఁ జేరి మంచుమలకూరిమియల్లుఁడు తారకంబు మున్
నొడువునఁ గూర్చి పల్కుచు వినోదము సల్పఁగ నేదదేటి చె
ట్టుడిఁచినఁ జేటెఁడన్నినిటలాంబకమూర్తులు కానవచ్చు నా
మడ పరుగెత్త నేల యఘమర్దనసిద్ధయ మైనకాళికన్. ఆ. ౪.

శా. ఏణాంకోపలసౌధవీధికలపై నింపొంది చిత్రంబులో
వీణ ల్కేల ధరించి రాగలహరీతస్ఫూర్తిమైఁ జొక్కుచున్
జాణల్ సాధ్యకుమారు లాగమవిధానస్నిగ్ధగానంబులన్
ప్రాణ ల్మేలుఁగ నాలపించెదరు చిత్తప్రీతిమై వింటిరే. ఆ. ౫.

మ. కమలామందమరందబిందుకణికాకల్లోలడోలావిలో
లమరాళీగరుదంచలత్పవనబాలక్రీడనప్రోల్లస
త్కుముదామోదిపరాగవాసితదిశాకుంభీంద్రగండస్థలీ
సముదాయం బలరున్ నృపాల యొకకాసారంబు దూరంబునన్. ఆ-౫

# 39. సవరము చిననారాయణనాయకుఁడు

ఈకవి కువలయాశ్వచరిత్ర మనెడి యైదాశ్వాసముల ప్రబంధమును రచియించి, తిమ్మనరపాలపుత్రుఁడయిన నారాయణభూపాలుని కంకితము చేసెను. ఈకవి తాను క్షత్రియుఁడ ననియు, రాయభూపాలుని పుత్రుఁడ ననియు చెప్పికొనియున్నాఁడు. ఈతఁడు రాయభూపాలునకు దిరుమలాంబవలన గలిగిన ట్లీక్రిందిపద్యమువలన దెలియవచ్చుచున్నది.—

మ. అతఁ డాతిమ్మమయందు వేంకటనృపాధ్యక్షున్ రిపుచ్ఛేదనో
ద్ధతు రంగాధిపుఁ దిర్మలాంబవలనన్ ధర్మాత్ము గోపాలు ను
న్నతకీర్తిం జినారనాఖ్యుఁ డగు నన్నున్ గస్తురీంద్రున్ సమం
చితకీర్తిన్ రఘునాథుఁ దిమ్మవిభుఁ గాంచెన్ సజ్జనాధారులన్.

కృతిపతి యైన నారాయణభూపాలుఁడు శ్రీరంగరాజ వేంకటపతి రాయలకు సహాయుఁ డయియుండినట్లు చెప్పఁబడినందున గవి ౧౫౮౦ వ సంవత్సరప్రాంతములయం దుండినట్లు కానవచ్చుచున్నాఁడు. మఱియు గృతినాయకుఁడైన నారనరనాథుఁడు మల్ల యనంతభూపాలునికాలములో నుండిన ట్లీక్రింది పద్యమునందుఁ జెప్పబడినందునను, కవి పదునాఱవశతాబ్దాంతమునం దుండినట్లు నిర్ధారణము చేయవచ్చును.—

సీ. తనమాట చెంజికా తంజాపురీ మధురాధినాథులకు నెయ్యంబు నెఱపఁ
దనసిరి గోలకొండనరేంద్రముఖధరాధవపద్మబంధు లౌదల వహింపఁ
దనకీర్తి మల్లనంతనృపాలముఖ్యగోత్రామరేంద్రులు కొనియాడికొనఁగఁ
దనదానగుణము గోదావరీతీరభూనిర్జరేశ్వరులు వర్ణించుకొనఁగ
వెల్లయు వేదండగండనిర్గళదవర్గ
ళమదధారాధునీనాథకుముదబంధు
కార్యకృడ్డిండిమారావధుర్యసైన్యుఁ
డతఁడు ప్రభుమాత్రుఁడే నారనాధి నేత.

ఈకవి కాశ్యపగోత్రుఁడు; శఠగోపతాపసేంద్ర శిష్యుఁడు. ఈతని కవిత్వము సలక్షణమయి వినసొంపుగా నుండును. ఈతని కువలయాశ్వ చరిత్రములోని కొన్నిపద్యముల నిం దుదాహరించుచున్నాను—

చ. మిటిమిటి యెండవేఁడి బలిమిం దెలిదమ్ముల తేకుసందులం
జిటుకుమనంగఁ గూడి నివసించి తదగ్రమరంద మప్పట
ప్పటికిని మూతిముట్టి పయిపై నది చల్లఁబడంగ బ్రొద్దుగ్రుం
కుట గని యంతటం బొదలుఁ గోడెమిటారపుఁదేఁటు లత్తఱిన్. ఆ-౧

చ. మునివనితల్ శచీముఖతమోనిభ వేణులకుం బతివ్రతా
జనతతిఁ దెల్పుచోఁ బరవిచారముగాఁగను వేల్పుటొజ్జజ
వ్వని మొగ మవ్వలం జూనుప వారలు నవ్వుదు రామె సిగ్గుపెం
పునఁ దలవంచుఁ జందురుఁడు పొంగఁగ నయ్యయిపూగ వేళలన్. ఆ-౨

చ. తలఁపున నెంత మోహపరితాపముగల్గిన దాఁచుకొందురో
యలయిక లేక నీకరణి నంగడిఁబెట్టుదురో వధూటికల్
పలుకవు నిన్నువంటికులభామలఁ గానమె వారి కాత్మనా
థులపయి బాళిలేదొ తమిదొట్టినపట్టున మట్టుపెట్టరో. ఆ. ౩.

మ. అతఁ డచ్చోఁ దురగంబు నెక్కి హృదయాజ్ఞాపూర్ణ మోదార్ణవాం
చితుఁడై వారల వెన్క నుంచుకొని యక్షీణైక్యమాణిక్యదీ
ధితిజాతామృతరుగ్వితాన మగుదై తేయాధినాథాయత
యతనం బల్లన నిర్గమించి పురబాహ్యక్షోణి కేతెంచుచున్. ఆ. ౪.

చ. వెలుపలిరచ్చ నొక్కయెడ వేలుపుసానికి వన్నెకానికిన్
గలహము కల్గెనేని గుఱికానితనంబున వచ్చి రోసపుం
బలుకుల వాదు రేఁచి సిగపట్లకు డగ్గఱఁజేసి క్రొవ్వునం
గలకల నవ్వువాఁడు చవుకట్లసియాడ రుమాలువీడఁగన్. ఆ. ౫.

# 40. దామెర వేంకటపతి

ఈకవి పద్మనాయకకులజుఁడైన శూద్రుఁడు; ఈపద్మనాయక కులమువారి నీదేశమునందు వెలమలని వాడుదురు. ఈకవితాత సంస్థానాధిపతియై వేంకటగిరిసంస్థానాధిపతులైన వెలుగోటివారితో సంబంధబాంధవ్యములను జేసినవాఁడు. ఈకవి తన మేనత్తయైన వేంకటాంబను వెలుగోటి యాచమనాయనికుమారుఁ డయిన కస్తురిరంగనాయని కిచ్చినట్టును ఆదంపతులకు యాచమనాయఁడు పుత్రుడైనట్టును చెప్పి యాతనిని తనబహుళాశ్వచరిత్రమునం దిట్లు వర్ణించినాఁడు.-

సీ. ఉత్తరమల్లూరియొద్ద దావలుపాపవిభుని గొట్టిననాఁటివిజయకలన
చెంగలుపట్టు వీక్షించి లగ్గలువట్టి యాక్రమించిననాఁటివిక్రమంబు
పాళెముకోటవెల్పల నాజి యతిరాజు జరగజేసిననాఁటిశౌర్యపటిమ
తిరుమలఁజేరి ధాత్రినిమన్నెరాజులఁ బాఱఁదోలిననాఁటిబాహుబలము
మున్నెతోపూర జగ్గరాణ్ముఖుల నొంచి
మధురదొరఁ జెంజిమన్నీని మద మడంచి
తిరుచనాపల్లిదొరఁ దోలుతేజము గల
మేటి వెలుగోటియాచని సాటిగలరె!

కవియొక్క మేనత్తభర్తయైన కస్తురి రంగనాయఁడు గోలకొండ మహామ్మదీయులను కొండవీడు వినుకొండ ప్రభువులను గెలిచి, ౧౫౭౯వ సంవత్సరమునందు చంద్రగిరియందున్న విజయనగరపు రాజులపక్షమున యుద్ధముచేసి వారిశత్రుల నోడించెను. కవియొక్క మేనత్తకొడుకయిన యాచనాయఁడు చెంగల్పట్టుమండలములోని మధురాంతకముగో వాసముచేసి విజయనగరాధిపతియైన వేంకటపతిరాయలవలన పెరమాడిసీమను బహుమానమందెను; అంతేకాక యితఁడు ౧౬౦౧వ సంవత్సరమునందు శత్రువులతో యుద్ధముచేసి వారి నోడించెను; ఆవల కొను పరులపాలైన వేంకటగిరిని మరల స్వాధీనము చేసికొనెను. కవియు

నీతనికాలములోనివాఁడే యయినందున నతఁడు పదునాఱవశతాబ్దాంతమునందును పదునేడవశతాబ్దాదియందును నుండినవాఁడు. ఈకవి తాను బహుళాశ్వచరిత్రమును జేయకమునుపు కృష్ణకథ నొకదానిని జేసి దానిని రామభద్రున కంకితము చేసినట్లు బహుళాశ్వచరిత్రములో రామభద్రుఁడు త న్నుద్దేశించినట్లీ క్రిందిపద్యములోఁ జెప్పుకొన్నాఁను.

ఉ. దామెరవేంకటప్రభువతంసుని వేంకటభూప మాపయిన్
శ్రీమెఱయంగఁ గృష్ణకథ చెప్పితి విప్పుడు నీదుతండ్రియున్
మామకభక్తుఁ డాతనికి మాకును భేదము లేదుగాన నీ
వామహిమాధ్యుపేర బహుళాశ్వచరిత్రము చెప్పు మొప్పుగన్.

ఈబహుళాశ్వచరిత్ర మయిదాశ్వాసములు కలదయి రసవంతమయి సలక్షణమయినదిగా నున్నది. అందుండి రెండుపద్యముల నిం దుదాహరించుచున్నాను—

చ. తటములఁ జుట్టుకొన్న బిగిదన్నినక్రొన్ననపొన్నగున్నలన్
జిటపొటమంచు మంచుజడి చిల్కెడిగొజ్జఁగికిన్ రసాలపున్
జిటిపొటిత్రేనెవానలకుఁ జేసినకాల్వలతేటనీటిప
ల్లటముల నిక్కు నక్కొలఁకులచ్చికి మెచ్చిరి వచ్చినెచ్చెలుల్.

ఆ. ౨.

ఉ. రామునిఁ జూచి కామునిశరంబుల గాసిలి చేష్టదక్కి కాం
తామణి యుండెనో రుషి రఘునందనపాదరజంబుచేత మున్
గోమలిరేఖ జాతి కొడఁగూడెనో లేదో యటంచు నెంచి లీ
లామహి తాంగ మొందఁగ శిలామయరూపము దాల్చెనో యనన్.

ఆ. ౪.

# 41. చిత్రకవి పెద్దన్న

ఇత డాఱువేలనియోగి; భారద్వాజగోత్రుఁడు. ఇతఁడు పను నాటివశతాబ్దాంతమునం దుండినవాఁడు. ఇతని కొడుకైన యనంతకవి యింకుమతీపరిణయమును, మనుమఁడైన రమణకవి సాంబవిలాసమును రచించిరి. ఇతఁడు సర్వలక్షణసారసంగ్రహమను నామాంతరముగల లక్షణసారసంగ్రహమును రచించినట్లు,

సీ. * * * లక్షణసారసంగ్ర
హం బొనరించి యుద్యత్కీర్తిఁ బ్రఖ్యాతుఁడగు చిత్రకవి పెద్దనార్య
సుతుఁడ"

అని యీతనికుమారుఁడైన యనంతకవియు,

సీ. "సర్వలక్షణసారసంగ్రహం బొనరించి తనరె మాతాత పెద్దనకవీంద్రుఁ"

డని యీతని పౌత్రుఁడైన రమణకవియు చెప్పియున్నారు. ఈలక్షణసారసంగ్రహము నాకు లభింపకపోయినను, యప్పకవీయమున గ్రహింపఁబడిన రెండుపద్యముల నిచ్చట ఉదాహరించుచున్నాను—

గీ. మహిమ నెక్కటివఖులన మరవఱలలు
రహిని దమతమ కయి యేఁకు రమ్యచరిత
వనధిగంభీర సద్గుణవాసయనఁగ
భంజితాసురసముదాయ యాంజనేయ.

చ. ఎఱుఁగవుగాక భోగముల కెల్లను నెచ్చెలి జవ్వనంబ యి
త్తఱి నుడివోవకుండ నుచితంబుగ జక్కవదోయిఁ బోలి క్రి
క్కిఱిసినచిన్నిచన్నుఁగవ యింపెసలారఁగ నాదుచిత్త మన్
వఱలుసరోవరంబున నవారణఁ గేళి యొనర్చు కోమలీ.

# 42. యాదవామాత్యకవి

ఇతఁడు చంద్రహాసవిలాస మను కావ్యమును పూర్వోత్తరభాగములుగా రచియించెను. ఈతనికాల మెప్పుడో తెలియలేదుగాని లక్షణశిరోమణి యనునామాంతరము గలయాదవామాత్యఛందములోని,

సీ. రగణము శంఖమనఁగనొప్పమూడవజామునఁబవడపుఁజాయపసజుఁడు
   గ్రహముగావేల్పు హిరణ్యరేతుఁడుగాఁగఁ దార కృత్తికగాఁగఁ
                                                      దగరురాశి
   గా మేషయోనిగా గణమాసురంబుగా శృంగారరసముగా స్థిరఫలంబు
   భయముగా గౌశికభద్రగోత్రమున నెట్టసిమేన నృపకులమున జనించె
   బంధుజనగేయ సత్కవిభాగధేయ
   రమ్యచారిత్ర వేంకటరాజపౌత్ర
   వర్ణితోదార బాపన్నవరకుమార
   మదనసౌందర్య యాదవామాత్యవర్య.

ఇత్యాదిపద్యములనేకములు సులక్షణసారములో నుదాహరింపఁబడి యుండుటచేత నీయాదవామాత్యకవి ౧౬౨౦ వ సంవత్సరమునకుఁ బూర్వపువాఁడనిమాత్రము నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఇష్టదైవము తన్నుద్దేశించి పలికినట్లుగాఁ గవి చంద్రహాసవిలాసములో నిట్లు వ్రాసికొనియున్నాఁడు—

సీ. ఇట్లనిపల్కె మహీసురాన్వయమున వాసి కెక్కినభరద్వాజమౌని
   గోత్రసంభవులందుఁగొమరొప్పభానప్పవంశంబునకుఁజాలవన్నె తెచ్చి
   నట్టి తిమ్మకవీంద్రు నన్వయంబునఁబుట్టి మహి మించు నారపమంత్రి
                                                      పుత్రుఁ
   డగు వేంకటాద్రి కిల్లాలైన కొండాంబతనయుఁ డాబాపన్నతమ్ములైన

ఘనులు కృష్ణయ వీరనల్ కవియోఁ జెన్న
మాంబ యనుసాధ్వియందు ని న్నాదరమునఁ
దలఁప రామన్న నీపినతండ్రికొడుకు
మదనసౌందర్య యాదవామాత్యవర్య.

ఈకవియొక్క వినయశౌశీల్యాదులు కవిస్తుతి మొదలైన యీ కృత్యాదిపద్యములవలనఁ దేటపడుచున్నవి—

సీ. వాల్మీకి ముఖ్యగీర్వాణకవీంద్రులకును నన్నపార్యాది తెలుఁగుకవుల
కును శుభంబు లొసంగు మని భద్రగిరిరామభద్రునిఁ గడుభక్తిఁ
బ్రస్తుతించి
కవివరు ల్నామీఁదఁ గలదయచేతను గబ్బంబు చెప్పఁగాఁగలనటంచు
భావించి నే నీప్రబంధంబు గల్పింపఁదలఁచినాఁడను సతతంబు నియతి
శారదాదేవిఁ బ్రార్థించి గారవమున
వరముఁ గైకొని మీ రంప వచ్చి వాణి
నాదుజిహ్వాంచలంబునఁ బాదుకొనిన
ధైర్యమునఁ బల్కెదను గవివర్యులార।

గీ. పెంపుమీఱ వేల్పుఁ బెద్దలు పూజింప। బాలుఁడట్లు చేయుభంగిగాను
మీరు కవితఁ జెప్పినారని నే నిట్టి। చర్య కొనరితిఁ గవివర్యులార!

క. కదళీపాకముగాఁ బెం। పొదవఁగ నీ ప్రబంధ మొగి రచియింతున్
గొదవలు మిక్కిలి గల్గిన। సదయతఁ దగ దిద్దవలయు సత్కవివర్యుల్.

గీ. లేకయుండినఁ జదు వేమిలేనివాని
కిట్టి సద్బుద్ధి జనియించు టెందుఁ గలదు
నిచ్చనిచ్చలు మీ రంప వచ్చి వాణి
పొసఁగ నన్నిట్లు పలికింపఁ బూనెఁ గాక.

గీ. నన్నుఁ బోలినకవి గల్గకున్న ధాత్రి
వరకవీంద్రులన్ పే రెట్లు వచ్చు మీకుఁ

బిన్న లుండుటచేఁగాదె పెద్ద లనుచుఁ
దెలియఁగలుగుట యార్యులు తెలిసికొనుట.

ఉ. నేరిచి యాదుపుత్రులును నేరక పల్కినఁ నందనుండునుస్
గూరిమితల్లి కొక్కటియగుం దలపోయఁగ వాగ్వధూటికిన్
మీరలు నేను నొక్కటియె మీరువచించినకావ్యమండలిం
జేరి మదీయవాక్యములఁ జేరకపోవునె యంచు నెంచుచున్.

పై పద్యములలో భద్రాద్రిరామునిఁ బేర్కొని యుండుటవలనఁ గవి గోదావరీమండలములోనివాఁడని తేటపడుచున్నది. ఈకవి యాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; భారద్వాజగోత్రుఁడు; వేంకటరాజ పౌత్రుఁడు; బాపనార్యపుత్రుఁడు. ఇతఁడు కృతు లందుట మొదలైన వానినిబట్టి చూడఁగా నితఁ డున్నతపదమునం దుండినట్లు తోఁచు చున్నది. ఇతఁడు గ్రంథాదిని కేవలాంధ్రపద్యము చెప్పక నన్నయాదుల వలె సంస్కృతభాషతో నీక్రిందిపద్యమును వేసియున్నాఁడు—

చ. శ్రితజనరక్షణాయ సరసీరుహపత్రవిలోచనాయ వి
శ్రుతశుభకీర్తనాయ రవిసూనుసఖాయ మఖావనాయ సం
తతసుగుణాకరాయ వసుధాతనయాపరితోషణాయ నే
వితపవనాత్మజాయ రఘువీరవరాయ నమోనమోనమః.

ఈతనికవిత్వము కవి తాను జెప్పుకొనినట్లు కదళీపాకముతోఁ దేనె లొలుకుముద్దుపలుకుల్తో వినువారి చెవులకుఁ జవులు గొలుపుచు హృదయంగమముగానున్నది. కవనభంగిని జూపుటకయి చంద్రహాసవిలాసములోని నాలుగుపద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. బంగరుమేడలం జలువపందిరులన్ నెలరాతితిన్నెలన్
రంగగుమేలిమిద్దియల రచ్చలవంతుల నాట్యశాలలన్
సింగపుమోము లొక్కయెడఁ జెక్కినచక్కనిగోపురంబులన్
బొంగుచు నప్పురీవరము పొల్పు వహించు ధరాతలంబునన్. పూర్వభా.

ఉ. తప్పక చూచు నుగ్గనుచు దాదులు పల్కినఁ గేరినవ్వు మా
యప్పగొ నిద్ర పొమ్మనిన నల్లన బారలు చాఁచుఁ జేతులం
జప్పటిచేయఁ జేరి విను సారెకు నత్తయటంచుఁ బల్కు నా
యొప్పులబాలుఁ డంత ముద మొందుచుఁ దల్లియుఁ దండ్రి కన్గొనన్.
పూర్వ.

చ. కమలదళాక్షి నీవు ననుఁగానక తక్కిన నిప్పు డిందిరా
రమణికి విన్నవింతు ననురాగము తండ్రికిఁ గల్గకున్నచోఁ
దమి నిజపుత్రులందు దయ తల్లికిఁ గల్గక పోవ దంతటం
గమల మదర్థమై కినుక గాంచును నీపయిఁ జాటిచెప్పితిన్—పూర్వ.

ఉ. లేమలమీఁది ప్రేమ లవలేశము వీడవు దానధర్మముల్
నేమముతో నొనర్పఁగను లెక్క యొనర్పవు శ్రీరమాధవున్
బ్రేమముతోఁ దలంపఁగను రేయిఁబగళ్ళను బూన వూరకే
పామర మొందు చీ వితరపద్ధతి గోరెదవేమి కామమా—ఉత్తరభా.

---

# 43. కంసాలి రుద్రయ్య

కృష్ణదేవరాయనికాలములోఁ గంసాలిభద్రయ్యయని యొకస్వర్ణకారకవి యుండెననియు, అతఁడు రాయలయాస్థానమునందుండిన యష్టదిగ్గజములలో నొకఁడనియు కొందఱు వ్రాసియున్నారు. అతఁడు సరసమనోరంజనమను ప్రబంధము రచియించెనని కొందఱు చెప్పుదురుగాని యాగ్రంథ మిప్పు డెక్కడను గానరాకున్నది. సరసజనమనోరంజనములోనిదని బ్రౌన్‌దొరవారి ఛందస్సునం దీక్రిందిపద్య ముదాహరింపఁబడి యున్నది—

ఉ. ఎన్నఁడు నేరిచెన్ బెళుకు లీచెలికన్నులు, కారుకమ్ము ల
న్నన్న కురుల్, పిఱుందు బటువై పటువై ఖరి గై కొనెంగదే,

మొన్నఁగదమ్మ పిన్నమొనమొల్కలు నేఁ డివె ముద్దులాడిలేఁ
జన్నులు గొప్పలై పయింటసందున దాఁగుడుమూఁత లాడెడున్.

ఈపద్యమును రాయలవారియాస్థానములోఁ జదివినప్పుడు రామకృష్ణకవి మొల్కయని ప్రయోగించినందుకు కాక్షేపించెననియు, అందు మీఁద నొకరు దానికి సమాధానముగా నీక్రిందిపద్యమును జెప్పిరనియు, బ్రౌన్ దొరవారు సంపాదించి చెన్నపురిరాజధానిలోని ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున కిచ్చిన చాటుపద్యమంజరిలో వ్రాయఁబడి యున్నది—

చ. వెలగకు వెల్గ యంచు సరవిఁ జలికొండ నృసింహుఁ డాడఁగా,
మొలకకు మొల్క యంచుఁ గవిముఖ్యుఁడు భద్రయపల్కదోసమా?
బళిబళి! మంచిమాటయె ప్రబంధమునా జలరాశి దానిలో
పల నెరసు ల్గణింతురె యపారములౌ మణు లెల్ల నుండఁగన్?

చలికొండనృసింహుఁడు వెలగకు వెల్గ యనియు, అగసాలె రుద్రయ యనునాతఁడు మొలకకు మొల్క యనియు, అపప్రయోగములు చేసిరని యప్పకవి చెప్పి యీపయిపద్యము వినకొండలో గుంటుపల్లెభాస్కరునివద్దఁ గందుకూరి రుద్రయ్యగారు చెప్పినట్లీక్రిందిపద్యములలో వ్రాసియున్నాఁడు—

చ. కొలఁదిగ మున్ను చెప్పెఁ జలికొండ నృసింహుఁడు వెల్గయంచు నీ
వల నగసాల రుద్రపనువాఁడును మొల్క లటంచుఁ గూరిచెం
డెలియక కొంద ఱిట్లు వికృతిం బదమధ్యమునన్ లకార రే
ఫలతలపై యకారమును బాపుదు రార్యులు నవ్వునట్లుగన్.

వ. ఇందులకు వినకొండలో గుంటుపల్లె భాస్కరయ్యగారి సమ్ముఖమందుఁ గందుకూరి రుద్రయ్యగారు చెప్పినపద్యము.

చ. వెలగకు వెల్గ యంచు సరవిం జలికొండ నృసింహుఁ డాడఁగా
మొలకకు మొల్క యంచుఁ గవిముఖ్యుఁ డురుద్రయ పల్క దోసమే?

బళిబళి మంచిమాటయె ప్రబంధమునా జలరాశి యందులో
పల నెరసు ల్గ్రహింతురె యపారములౌ మణు లెల్ల నుండఁగన్.

అప్పకవీయము. పంచమాశ్వాసము.

దీనినిబట్టి చూడఁగా సరసమనోరంజనములోని దన్న పయి పద్యము భద్రయ చెప్పినదిగాక రుద్రయ చెప్పినదనియు, అతఁడు కృష్ణదేవరాయలకాలములోఁగాక గుంటుపల్లె భాస్కరునికాలములో నుండె ననియు స్పష్టబడుచున్నది. కాఁబట్టి కృష్ణదేవరాయనికాలములో భద్రయ్య యనుకవి యున్నాఁడో లేఁడో యనికూడ సంశయింపవలసి యున్నది. పయినిజెప్పిన లిఖితపుస్తకభాండాగారములోని చాటుపద్యములలోనే సరసమనోరంజనములోని దయినట్లుగా నీక్రిందిపద్యముకూడ వ్రాయఁబడియున్నది.—

సీ. కొప్పునఁ జుట్టినగొజ్జంగివిరిదండ నటనతో వీఁపున నాట్యమాడ,
బటువైనముత్యాలపాపట విరజాజితీరుగాఁ జెంపల దిమురుగట్ట,
ధగధగద్ధగలచేఁ దనరుకెంపునతాళి సరులతోఁ బెనఁగొని చౌకళింప,
గబ్బిగుబ్బలమీఁది కస్తూరిచెమటల గరఁగివాసనలచేఁ గ్రమ్ముకొనఁగ.
వింతమాటలతేటల విభునిఁ గూడి
కాంత రతికేళి మిక్కిలి గారవింప
దప్పి తీఱంగ నధరామృతము లొసంగి
చంద్రబింబాస్య మగలాగు సలిపె నపుడు.

ఇతఁడు నిరంకుశోపాఖ్యాన మను నాలుగాశ్వాసముల ప్రబంధము ను సుగ్రీవవిజయమనుయక్షగానమును రచియించెను. ఈగ్రంథమును బట్టి చూడఁగాఁ గృష్ణదేవరాయనికాలములో భద్రయ్య యనుకవి లేఁడనియు భద్రయ్య యనఁబడినకవి యప్పకవి చెప్పినట్లుగా గుంటుపల్లి భాస్కరునికాలములోనుండిన రుద్రయ్యయేయనియు స్పష్టపడుచున్నది. ఈగుంటుపల్లి భాస్కరుఁడు పదునేడవశతాబ్దారంభమునం దుండిన

వాఁడు. సునందాపరిణయమునందు గుంటుపల్లి భాస్కరుఁ డిట్లు వర్ణింపఁబడి యున్నాఁడు.

సీ. స్థిరతరప్రజ్ఞావిశేషాతినిష్ఠాతిరస్కృతనిర్జరరాజ్గురుండు
అసదృశమంత్రయోగాతివశీకృతసన్మంత్రదేవతాసముదయుండు
నిరుపమశ్రుతిశూర్తకనిర్ణీతసన్మార్గవర్ణోచితాచారవర్తనుండు
ఘనతరపాణినీగ్రంథార్థశోధనసందర్భసన్మనీషాన్వితుండు
సత్యభాషాహరిశ్చంద్రజనవిభుండు
సలలితౌదార్యనిర్జితజలధరుండు
ఎల్లమాంబాసతీప్రాణవల్లభుండు
గుంటుపల్లి భాస్కరుఁడు సత్కులవరుండు.

దీనినిబట్టి కంసాలిరుద్రయకవి కృష్ణదేవరాయనికాలములో లేక, ౧౬౨౦వ సంవత్సరప్రాంతములయం దుండినట్లు తేలుచున్నది. నిరంకుశోపాఖ్యానములోని,

శా. శ్రీభాషారమణావిమృష్టపదరాజీవోత్తమాంగాగ్రుఁ డా
ర్యాభామాపరిణీత సర్వజగదారాధ్యుండు మూర్తిత్రయీ
శోభాకందము కందుకూరినగరీసోమేశ్వరస్వామి లో
కాభీష్టంబు లొసంగుఁగాతఁ గరుణాయత్తైకచిత్తంబునన్.

ఈమొదటిపద్యమునుబట్టి కవి తనగ్రంథమును కందుకూరి సోమేశ్వరస్వామి కంకితముచేసినట్లు తెలిసికోవచ్చును. ఈకావ్యమును శివుని కంకితము చేసెదనని కవి యీక్రిందిపద్యములో మనోహరముగాఁ జెప్పి యున్నాఁడు—

ఉ. కోమలవర్ణధామయును గోవిదసంస్తవనీయలక్షణ
స్తోమపదాభిరామయును శుంభదలంకరణప్రసాధన
స్థేమయు సప్రతర్క్యగుణసీమయు నైనమదీయకావ్యక
న్యామణి నిచ్చి మంచుమలయల్లుని నల్లునిగా నొనర్చెదన్.

కవి కంసాలియగుటచే ననేకు లాక్షేపించుచువచ్చుటచేతఁ గాఁబోలు రుద్రయ్య తనకృతిలో నీపద్యమును వేసియున్నాఁడు—

ఉ. శుష్కవచశ్శిలాతతుల సూటిగఁ జూచి మహాకవిశ్రవ
శ్శష్కుళికావిదారణము సల్పఁగ నేర్చినజాణలార మీ
ముష్కరతానమున్నతికి మ్రొక్కెద నాయెడఁ జూపరాకుఁడీ
దుష్కవులార సాధుజనదూషణభాషణభూషితాత్ములై.

ఈకవి స్వర్ణకారుఁడు; పెదలింగన్న పుత్రుఁడు. ఈకవిత్వము మృదుమధురపదభూయిష్ఠమయి సలక్షణమయి వినువారివీనులకు విందు చేయునదిగా నున్నది. ఈతని కవిత్వరచనాకౌశలమును జూపుటకయి నిరంకుశోపాఖ్యానములోని కొన్నిపద్యముల నిందుఁ బొందుపఱచుచున్నాను—

ఉ. అడిగిన నేమి దోషమె సమస్తధరాతలనాథ కోరికల్
నుడువుల నున్న వే మనసులోపలఁగాక రతిప్రసంగముల్
తడవనియంతమాత్రనె విదారితమోహుఁడె యీవిచారముల్
విడువుము వాగ్విశేషమును విశ్రుతవేషము మోక్షహేతువే. ఆ. ౧.

ఉ. ఏమిజపంబు చేసి రొకొ యేమితపం బొనరించి రొక్కొ యే
మేమిసపర్య లార్యతతి కిచ్చిరొకో జగదేకపూజ్యులై
తాముఁ దనూజరత్నములుఁ దామరతంపరలై చెలంగువా
రీమహిఁ దొల్లి యంచు నుతియించి మహీసురుఁ డాత్మలోపలన్.
ఆ. ౧.

ఉ. అత్తవు సర్వలక్షణసమగ్రగుణాఢ్యవు నన్నుఁ దిట్టనున్
మొత్తనెకాని నీకొడుకుమూఢత మానుప వేల వాఁడు గో
త్రోత్తులమారియై గృహముత్రొక్కక యొక్కొకదానిఁ బూనికన్
గుత్తకు నంచు నుంచుకొని కోకలు రూకలు జోక నియ్యఁగన్.
ఆ. ౨.

# 44. ఎలకూచి బాలసరస్వతి

ఈకవి పదునేడవశతాబ్దారంభమునం దుండి మహామహోపాధ్యాయబిరుదము నందినవాఁడయి పాండిత్యముచేత మిక్కిలి ప్రసిద్ధి కెక్కినవాఁడు.

క. ఆలోకనుతుఁడు మున్నటి
కీలకసమ నామతంగగిరికడ నొసఁగెన్
బాలసరస్వతులకు నతఁ
డోలిఁ దెనుఁగుటీక వాని కొప్పుగఁ జేసెన్.

అని యప్పకవి చెప్పుటనుబట్టి యితఁ డాంధ్రశబ్దచింతామణికి తెనుఁగుటీకను ౧౬౦౭వ సంవత్సరమునందు చేసినట్లు కనఁబడుచున్నది. ఈకవి కట్టకడపట రచించిన రాఘవయాదవపాండవీయమునందు తాను చేసినగ్రంథములనుగూర్చియు తన్నుఁగూర్చియు నిట్లు చెప్పుకొను చున్నాఁడు.

సీ. కవిసమీహితరంగకౌముదీనామనాటకవిధానప్రతిష్ఠాఘనుండ
సారసారస్యసచ్చంద్రికాపరిణయప్రముఖశతాగ్రప్రబంధకర్త
నంధ్రచింతామణివ్యాఖ్యానభాషావివరణాదిబహుతంత్రకరణచణుఁడ
వేదశాస్త్రపురాణవివిధసంగీతసాహిత్యాదివిద్యోపబృంహణుండ
ననఘకౌండిన్యగోత్రుఁడ హరిపదాబ్జ
భక్తిశీలుఁడ నెలకూచి భైరవార్య
కృష్ణదేవతనూజుఁడ నేవిచిత్ర
కావ్య మొక్కటి నిర్మింపఁగాఁ దొడంగి.

శా. మెండైనట్టి విచిత్రవైఖరులచే మీఁదౌమహాకావ్యముల్
దండిం దొల్లియె చేసి రాదిములు తత్కావ్యాధికశ్లాఘమై

నుంచ రాఘవకృష్ణపాండవకథాయుక్తప్రబంధంబు వా
క్పాండిత్యం బలరార శ్లేషరచనైకప్రౌఢి నేఁ జేసెదన్.

ఇతఁడు రచియించిన యీరాఘవయాదవపాండవీయము మూడర్థములు గలది. ఇట్లు త్ర్యర్థికావ్యములను రచియించినవారిలో నితఁడే మొదటివాఁడు. పూర్వోదాహృతమయినసీసపద్యమువలన నితఁడు రంగకౌముదియనునాటకమును, చంద్రికాపరిణయమును ప్రబంధమును, ఆంధ్రశబ్దచింతామణివ్యాఖ్యానము, భాషావివరణము నను లక్షణగ్రంథములను రాఘవయాదవపాండవీయ మనుత్ర్యర్థికావ్యమును రచియించినట్టు కనఁబడుచున్నది. ఇతఁ డాంధ్రశబ్దచింతామణికి వ్యాఖ్యానముమాత్రమే చేసినట్టు పయిపద్యమునఁ జెప్పబడినను మూలగ్రంథమునుగూడ నితఁడే చేసి గౌరవముకలుగుటకయి దానికర్తృత్వమును నన్నయభట్టున కారోపణచేసినట్లనేక హేతువులచేత నిశ్చయింపఁ దగియున్నది. ఈవిషయమునుగూర్చి నన్నయభట్టారకునిచరిత్రమునందుఁ గొంత వివరముగా వ్రాసియున్నాను. నన్నయభట్టునకు శబ్దశాసనుఁ డన్నబిరుదు దీశబ్దశాస్త్రనిర్మాణముచేతఁ గలిగినదని కొందఱు భ్రమపడుచున్నారుగాని యది సరి కాదు. నన్నయభట్టారకుఁడు మొట్టమొదట లక్షణప్రాయమైన సత్కావ్యమును రచియించి యితరకవులకు కావ్యరచనకు దారిచూపుటచేత నాతనికి వాగనుశాసనుఁ డన్నబిరుదము వచ్చినదేకాని వ్యాకరణనిర్మాణముచేత రాలేదు.

"భట్టార బాలసరస్వతికవి మహోపాధ్యాయుఁడు" తానురచియించిన చంద్రికాపరిణయమును పత్తియాల జమీన్‌దారుఁడగు జూపల్లి వేంకటాద్రి కంకితముచేసెను. ఈపత్తియాల బెజవాడకు రెండామడల దూరమున నిజామురాష్ట్రములో నున్నది. ఈకవిని కాకునూర్యప్పకవి చూచియుండవచ్చును. చంద్రికాపరిణయము కృతినాయకునితండ్రి.

జూపల్లి లింగన్న. ఈలింగన్నను రంగరాజు లింగన్నగూఢముగాఁ దిట్టిన యీక్రిందిచాటుపద్యము నప్పకవి యుదాహరించియున్నాఁడు—

క. రవికోటిధామమయమై
  నవకాంచనయుతము నగుచు నానాఁటి కొగిన్
  భువిని శివాన్విత మగు నీ
  భవనము జూపల్లి లింగ భవగుణసంగా.

చంద్రికాపరిణయమునందు కాశిరాజకుమార్తెయైన చంద్రికను భీముఁడు వివాహమాడినకథ వర్ణింపఁబడినది. ఇతఁడు పదునేడవశతాబ్దారంభమునుండి ౧౬౩౦-౪౦ సంవత్సరములవఱకును పండితకవిగా పేరుపడియుండవచ్చును. ఈతని రెండు తెలుఁగుకావ్యములనుండియు రెండేసిపద్యముల నిం దుదాహరించుచున్నాను.

చంద్రికాపరిణయము

ఉ. జంగమరోహణాద్రిసదృశంబులు తత్పురిఁ గల్గుభద్రపా
  రంగవరేణ్యము ల్వయికి హస్తము లించుకసాఁచి యవ్వియ
  ద్గాంగరఘురంబు పీల్చి మరి తద్వమధుప్రకరంబు నప్పివా
  యంగ నొసంగు రంగుగ నిజాఖ్యవహించినచాతకాలికిన్.

ఉ. అంతట రుక్మబాహువసుధాధిపనందన యొక్కనాఁడు శు
  ద్ధాంతగృహంబు వెల్వడి విహారగతిం జనుదెంచె నెచ్చెలుల్
  చెంతలఁ గొల్వఁ జంచదళిశింజితరంజితకుంజమంజుల
  ప్రాంతగిళత్ఫలానవరతాంగజఘోటికిఁ బుష్పవాటికిన్.

రాఘవ యాదవ పాండవీయము

ఉ. జోరన సద్దునంగడచి ఘో నెడయీక చరించుమంచు న
  వ్వారిధిగాఁ దలంచి పురివాడలకుం దిగఁబోలు గేహసం
  స్కారకధూపధూమముమిషంబున మబ్బు దివాంతవేళల
  న్వారవధూటు లందుఁ గలవాలు మెఱుంగులువో గణింపఁగన్.

ఉ. పాయక భ్రాతృయుక్తుఁడయి భవ్యసుఖంబులు గాంచుచు న్జగ
ద్గేయయశుం డతండు పరఁగె న్మహిదైవతపూజలం బితృ
వ్యాయతతర్పణక్రియల నంచితధర్మము విస్తరిల్లఁగాఁ
జేయుచు భూరినిష్ఠ మహిషీయుతుఁడై మమఖాళి సల్పుచున్.

## 45. ముద్దరాజు రామన్న

ఇతఁడు కవిసంజీవని యనులక్షణగ్రంథమును రచించెను; మఱియు నితఁడు రాఘవపాండవీయమునకు వ్యాఖ్యానమునుగూడఁ జేసెను. ఇతఁడు నందవరీకనియోగిబ్రాహ్మణుఁడు; గణపయామాత్యుని కుమారుఁడు. ఇతఁడు పదునాఱవశతాబ్దాంతమునం దున్నట్లు తెలియవచ్చుచున్నది. ఈకవి "శ్రీమన్మదనగోపాలకృపాకటాక్ష సంప్రాప్తసారసారస్వత సంపదానంద" యని గద్యమునందు వ్రాసికొన్నను లక్షణగ్రంథమును బట్టి కవిత్వపటుత్వనిర్ణయము చేయబూనుట యుచితముకాదు. ఇతఁ డించుమించుగా లింగమగుంట తిమ్మకవితోడి సమకాలికుఁ డగుటచే నీకవిలోకసంజీవనినుండి యతఁడు తనసులక్షణసారములో నేమియుఁ గైకొనలేదు.

## 46. చిత్రకవి అనంతకవి

ఇతఁ డాఱువేలనియోగి. రామరాజభూషణుఁ డొనర్చిన హరిశ్చంద్రనలోపాఖ్యానమునకు వ్యాఖ్యానము చేయుటయేకాక యీకవి యిందుమతీపరిణయ మనుప్రబంధమును రచించెను. ఇతఁడు ౧౬౨౦వ సంవత్సరప్రాంతములందు కవిగాఁ బ్రసిద్ధికెక్కినాఁడు. ఇతఁడు చిత్రకవి పెద్దనార్యునిపుత్రుఁడు; భారద్వాజగోత్రుఁడు. ఈకవి తన్నుగూర్చి తన హరిశ్చంద్రనలోపాఖ్యానములో నిట్లు చెప్పుకొన్నాఁడు.

సీ. శ్రీహనుమద్వర శ్రీలబ్ధసుకవిత్వచతురుండ లక్షణసారసంగ్ర
హం బొనరించి యుద్యత్కీర్తిఁ బ్రఖ్యాతిఁ డగుచిత్రకవి పెద్దనార్య
సుతుఁడ
విష్ణుచిత్తీయాదివివిధకావ్యార్థముల్ తెలిసి వక్కాణించుధీరసుతుఁడ
గండికోటాఖ్యదుర్గస్థలాధ్యక్షుఁడై పృథివి వంతుకు నెక్కు పెమ్మసాని
చిన్నతిమ్మక్షమాపాలశేఖరుండు
గారవింపఁగ బహుమానగౌరవముగ
మనినధన్యుండ సభ్యసమ్మతగుణైక
గరిమ వెలయు ననంతాఖ్య కవివరుండ.

ఈవ్యాఖ్యానమును చేయునప్పటికిఁ గవి యిందుమతీపరిణయమును జేయలేదు. ఇతఁడు చేసిన యిందుమతీపరిణయము నాకు లభించినది కాదు. కవికాశ్రయుఁడైన పెమ్మసాని చినతిమ్మరాజుయొక్కయన్న పెదతిమ్మరాజు ౧౬౧౪వ సంవత్సరమువఱకును రాజ్యముచేసిన వేంకటపతిరాయనికి మంత్రిగా నుండెను.

# 47. లింగముగుంట రామకవి

ఈకవి చతుర్వాటికామాహాత్మ్య మను నైదాశ్వాసములస్థల పురాణమును రచియించెను. ఇతఁడు మత్స్యపురాణము వామనపురాణము మొదలయిన గ్రంథములను రచియించిన ట్లీతని తమ్ముఁడైన లింగముగుంట తిమ్మకవి తనసులక్షణసారమందు వ్రాసెను గాని యాగ్రంథములు నాకు లభింపలేదు. ఈకవి తెనాలిరామకృష్ణునితోడి సమకాలికుఁడు. రామకృష్ణుని గురు వైన భట్టరు చిక్కాచార్యులు తనకు గురు వైనట్లు కవి యీపద్యమున వ్రాసికొని యున్నాఁడు—

క. గురురాయభట్టభద్రుని
నరిహారు శ్రీరంగనాయకాంశభవున్ భ
ట్టరు చిక్కాచార్యుని మ
ద్గురుఁ దలఁచుచు నడుగులకు నతు ల్గావింతున్.

ఇతఁడు ౧౬౨౦ - ౩౦ సంవత్సరప్రాంతములయం దుండినవాఁడు. ఈరామకవి తన చతుర్వాటికా మహాత్మ్యములో,

సీ. శ్రీవల్లభోపేంద్రదేవేంద్రజనకకశ్యపఋషిగోత్రాబ్ధిచంద్రుఁ డగుచు
వృద్ధకుండికపాంత వెలయులింగముగుంట నేకభోగముగాఁగ నేలినట్టి
చెన్నయామాత్యుని శ్రీరామమంత్రినందనుఁ డన్నపకును దద్ధర్మపత్ని
కమ్మలమ్మకు సుతుఁడనుసంభవుండుతిమ్మనకుగాదనకుఁగస్వనకుఁ జెద్ద
భవ్యభాగీరథీసతీప్రాణవిభుఁడు
ఘనులు బస్వన రామ లక్ష్మణులతండ్రి
మహితవిద్యుండు మత్పితామహుఁడు నైన
సర్వకవిసార్వభౌముని సన్నుతింతు.

తనపితామహుఁడును గవి యైనట్లు స్తుతించి యున్నాఁడు. ఇతఁడు యాజ్ఞవల్క్య నియోగిబ్రాహ్మణుఁడు; కాశ్యపగోత్రుఁడు; లక్ష్మయామాత్యపుత్రుఁడు. ఈతని కవిత్వము నిర్దుష్టమయి రసవంత ముగా నున్నది. చతుర్వాటికామాహాత్మ్యములోని కొన్ని పద్యము లిందుఁ బొందుపఱుపఁబడుచున్నవి—

ఉ. చీటికిమాటికిన్ సకలసీమలఁ గ్రుమ్మరుచున్ శ్రమంబునన్
బాటిల నేల దర్శనవిపాటితకల్మషకోటికిం జతు
ర్వాటికి నేగి రాముని కవశ్యము మ్రొక్కుచు ముక్తికామినిన్
జేటికఁజేయగా వలదె సిద్ధమనోరథుఁడై నరుం డిలన్. ఆ. ౧.

మ. తలఁపం బూర్వభవంబునం దెచట నేదానంబు లీఁగంటినో
విలసద్భావులు దానపాత్రులు మహావిద్యానిధుల్ మీరు ముం

గలి కేతెంచితి రీప్సితార్థములు వీఁక నీ్మకు నర్పించి మీ
వలనన్ దీవన లందినన్ భువనము ల్వర్ణింపవే కావునన్. ఆ. ౨.

శా. ఉద్వేలప్రళయాబ్ధులో యనఁగ నత్యుద్రేకమానంబులై
విద్విడ్వర్యులఁ గుంభసంభవు మహావిర్భావధైర్యున్ మనం
బుద్విగ్నంబుగఁ బట్టి కట్టుటకు నిట్లొక్కుమ్మడిన్ డాయ భా
స్వద్విఖ్యాతుల నాత్మసైన్యముల హస్తం బెత్తి మాన్పె నవ్వడిన్. ఆ. 3

చ. ఇవి రేఁగొలంకు లాపగలు నింకుచుఁ గాల్నడ లయ్యె వేండ్రమై
పవనము వీచె భూజములపత్రము లన్నియు నూడె జీవజం
తువులు తపించె లోకులకుఁ దోఁచె విదాహము లక్క డక్కడన్
దవము జనించె శైలములఁ దాసె తనంతట మందు వేసవిన్. ఆ. ర.

చ. వరద శరణ్య నీవు వనవాసము చేయుచు నేఁగుదెంచి నా
చరణము లంటి మ్రొక్కినఁ బ్రసన్నతఁ గైకొని ధన్య నిన్ను భూ
వరుఁ డని యుంటిఁ గాని పరవస్తు వటంచు నెఱుంగనైతి నా
యెఱుఁగమి సైఁపవే తెలియ నెవ్వఁడ నీఘనమాయ నచ్యుతా. ఆ. ౫.

---

# 48. లింగమగుంట తిమ్మన్న

ఈకవి సులక్షణసార మనుగ్రంథమును రచియించెను. ఇతఁడు యాజ్ఞవల్క్యబ్రాహ్మణుఁడు; కాశ్యపగోత్రుఁడు; లక్ష్మయ్యకును తిమ్మాంబకును పుత్రుఁడు. ఈకవి యించుమించుగా తెనాలిరామకృష్ణ కవితో సమకాలికుఁడు. ఇతఁడు తనకు భట్టరు చిక్కాచార్యుఁడు గురు వైన ట్లీక్రిందిపద్యమున వ్రాసికొని యున్నాఁడు—

సీ. శ్రీవైష్ణవహితుండఁ జిక్కయభట్టరుశిష్యుఁడఁ గవితావిశేషశేష
తులితసర్వార్యపౌత్రుఁడ లక్ష్మణయకుఁ దిమ్మాంబకుఁ సుతుఁడఁ
బెద్దనకు మార

నకు రామకవివరునకు ననుజన్ముఁడ నారామకవి చెప్పినట్టిమహిత
మత్స్యపురాణ వామనపురాణాది సత్కవితలకెల్ల లేఖకుఁడ వృద్ధ
కుండికాతీరలింగమకుంటనామ
పట్టణస్థితికుఁడ సౌభాగ్యయుతుఁడ
నాదిశాఖాప్రవర్తన నమరువాఁడఁ
గార్శ్యపసగోత్రుఁడను దిమ్మకవిని నేను.

ఇందుఁ జెప్పఁబడిన భట్టరు చిక్కాచార్యులే తనకు గురువైనట్లు తెనాలి రామకృష్ణకవియు పాండురంగమహాత్మ్యమున నీక్రిందిపద్యమునఁ జెప్పికొని యున్నాఁడు—

క. వాక్కాంతాశ్రయభట్టరు । చిక్కాచార్యులమహాత్ముశ్రీగురుమూర్తిన్
నిక్కపుభక్తి భజించెద । సక్కావ్యకళాకలాప మాడేటుటకున్.

రామకృష్ణునితోడి సమకాలీనుఁ డగుటచేత లింగమగుంట తిమ్మకవి ౧౫౭౦ వ సంవత్సర ప్రాంతములం దున్నవాఁడు. ఇతఁడు వృద్ధదశలో కాకునూరి యప్పకవికాలములో సహిత ముండియుండవచ్చును. ఇతఁడు బహులక్ష్యలక్షణగ్రంథములను శోధించినవాఁడు. అప్పకవి యుదాహరించిన పెక్కు పద్యములు లీసులక్షణసారమునందును గానఁబడు చున్నవి. "గడియలోపల మూడుకంద్రిక్కలై త్రొడు ధరఁ గూలఁదిట్టె మేధావిభట్టు" ఇత్యాదిసీసపద్యములను దానిక్రింద నప్పకవీయములో నుదాహరింపఁబడిన "సాళువ పెదతిమ్మమహీపాలుఁ" డిత్యాది సమస్త పద్యములును సులక్షణసారమునందుఁ గానవచ్చుటయేకాక శరభాంకుఁడు పద్యము మొదల చకారమును, ౬వ చోట హకారమును, ౧౧వ చోట కకారమునుంచి ఢిల్లీపట్టణమును దిట్టిన చాటుధారయని యీక్రిందిపద్య మొకటి యధికముగా నుదాహరింపఁబడి యున్నది—

ఉ. చాపముగా నహార్యమును జక్రిని బాణముగాఁగ నారిగాఁ
బాపదొరం బొనర్చి తలఁపం ద్రిపురంబులఁ గాల్పవే మహా

ద్దీపితతీవ్రకోపమున దేవత లెల్ల నుతింప నాఁటివిల్
పాపపుఢిల్లి మీఁదఁ దెగఁ బాపఁగ జే శరభాంకలింగమా.

తిమ్మకవి సులక్షణసారమునఁ దన్నుఁ గూర్చియుఁ దనప్రజ్ఞాదికమునుగూర్చియు నిట్లు చెప్పుచున్నాఁడు—

క. లక్షణశాస్త్రము లెల్లఁ బరీక్షించుటఁ గొంతకొంత యెఱిఁగినవాఁడన్
లాక్షణికానుగ్రహత సు । లక్షణసారం బొనర్తు లక్ష్యము లమరన్.

గీ. కొంద ఱెంచులక్షణమును గొంద ఱెంచ
రందఱుచు నెంచినవి కొన్ని యవియు నవియు
దొరయఁగాఁ గూర్చి కవిసమ్మతులను వ్రాయు
దొకటి కొకటికి సంస్కృతాంధ్రోక్తు లెనయ.

గీ. గ్రంథసామగ్రి గలుగుటఁ బ్రతిపదమున
కన్నిలక్షణములువ్రాయు దనిన నంకు
గ్రంథవిస్తార మగుఁగానఁ గవితసూత్ర
మెన్నిటను దేలిపడు నన్ని విన్నవింతు.

ఈకవియన్నయయిన రామకవిచేసిన మత్స్యవామనపురాణములు నాకు లభింపలేదు. ఈకవిచే నుదాహరింపఁబడిన శూద్రకరాజచరిత్రము, అనిరుద్ధచరిత్రము, ఆదినారాయణచరిత్రము మొదలయిన తెలుఁగుకావ్యములుసహిత మిప్పుడు కాన్నిగానరావు. ఇప్పుడు ముద్రితమై యున్న సులక్షణసారమునకును నాయొద్దనున్న యముద్రితపుస్తకమునకును మిక్కిలి వ్యత్యాసము కనఁబడుచున్నది. కవిసర్పగారుడము, శ్రీధరఛందస్సు, కవిగజాంకుశము, వాదాంగదచూడామణి, ఆంధ్రశబ్దచింతామణి, సర్వలక్షణశిరోమణి, సర్వలక్షణసారసంగ్రహము, గోకర్ణఛందస్సు, ఉత్తమగండఛందస్సు, భీమనఛందస్సు, అథర్వణఛందస్సు, అనంతఛందస్సు, కావ్యచింతామణి, కావ్యాలంకారచూడామణి, ఛందోదర్పణము, ఆంధ్రభాషాభూషణము అను తెనుఁగులక్షణగ్రంథములనుండి యీసుల

క్షణసారమునం దనేకలక్షణములు చేకొనఁబడినవి. కవిత్వరీతిని జూపుట కయి లక్షణగ్రంథములనుండి పద్యములను జేకొనుట న్యాయము కాక పోయినను సులక్షణసారమునుండి రెండుపద్యముల నిం దుదాహరించు చున్నాను—

మ. వినుమీరీతియటంచుఁ గావ్యకరుఁడై వెల్లంకి తాతప్ప చె
ప్పినసూత్రంబులు కల్లగాఁ గనఁబడెఁ వీక్షింప నెట్లన్నచో
మునుదీర్ఘంబులపై అకారములకే పూర్ణస్థితప్రజ్ఞ గా
దనియెఁ లింగమగుంట తిమ్మకవి నేఁ దర్కింతు నిప్పట్టునన్.

చ. అనుచు నదేమొకో మును రయంబున లక్షణసారసంగ్రహం
బెనయ వచించెఁ జిత్రకవిపెద్దన లెస్సవుపోధు పోత్ర శ
బ్దనయతగానరో వినరొ దద్ఘను లెంతయు ధన్యు లయ్యు మే
ల్గన భ్రమ గాంతు రాత్మల నొకానొకచోటఁ బరాకు గ్రమ్మఁగన్

---

# 49. వెలగపూడి వెంగనార్యుఁడు

(ఇతఁడు శ్రీలీలాశుకయోగివిరచితమైన కృష్ణకర్ణామృతమును మూఁడాశ్వాసముల గ్రంథముగాఁ దెనిఁగించెను. ఈకవి యాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; పెద్దనామాత్యునిపుత్రుఁడు. ఇతఁడేకాలమునం దుండినవాఁడో నిశ్చయముగాఁ దెలియదుగాని యాతని కృష్ణకర్ణామృతములోని పద్యమొకటి సులక్షణసారమునం దుదాహరింపఁబడి యుండుటచేత నితఁడు ౧౬౩౦వ సంవత్సరమునకుఁ బూర్వమునం దుండెనని మాత్రము తెలియును.) ఈతనికవిత్వము నిర్దుష్టమయి శ్రావ్యముగా నున్నది. కృష్ణకర్ణామృతములోని పద్యముల మూఁటి నిందుఁ జూపుచున్నాను—

శా. బాలు న్మంజులతాలవాలచపలాపాంగోల్లసల్లీలునిం
గాళిందీపులినాంగణప్రణయశృంగారైకఖేలున్ శుభ
శ్రీలోలుం గరుణావలోకనసుధాశీలున్ వినీలప్రభా
జాలుం గొల్చెద రామణీయకరసస్వారాజ్యపాలు న్మదిన్. ఆ. ౧.

చ. ఉదరము నింపఁగోరి ఖలు లుండెడితావులు చేరి వారికి
న్నెదురుగ బంటునై పతితుడై చరియించిన పాతకంబులన్
సదయత నోర్వఁగావలెఁ బ్రసన్నమతిన్ ననుఁగన్నతల్లి శా
రద యదువంశనాయకుని ప్రస్తుతి నిష్కృతి నే నొనర్చెదన్. ఆ. ౨

ఉ. చల్లనివాని నవ్వు వెదజల్లెడువాని దయారసంబు జొ
బ్బిల్లెడువానిఁ గెంపుజిగిపెంపు చెలంగెడుమోవివానిఁ సం
ఫుల్లసరోజనేత్రములఁ బొల్చినవానిఁ బయోధివీచికా
వేల్లితనీలనీరదనవీనతనుద్యుతివానిఁ గాంచెదన్.—ఆ. ౩.

---

# 50. రెంటూరి రంగరాజు

ఇతఁడు భానుమతీపరిణయమను నాలుగాశ్వాసముల ప్రబంధమును రచియించి వేంకటగిరిప్రభువగు వెలుగోటి రామభూపాలున కంకితము చేసెను. ఈకవి యాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; శ్రీవత్సగోత్రుఁడు; చినగంగనామాత్యపుత్రుఁడు. కృతిపతి తన్నుఁగూర్చి పలికినట్టుగా కవి తనశక్తిసామర్థ్యాదులను భానుమతీపరిణయమునం దిట్లు తెలుపుకొని యున్నాఁడు—

సీ. వ్యస్తాక్షరీధుర్యవిస్తీర్ణభావంబు క్రముకసంఖ్యాఖ్యానకౌశలంబు
నారోహణావరోహణలేఖనప్రౌఢి యగ్రపద్యగ్రహణాభిరక్తి
యనవలోకితశారికాభిఖేలనరీతి వరసమస్యాపూర్తివైభవంబు
సముద్రగవీక్షితచతురంగబలకేళికావిలాసము నేకకాలమునను

యలరఁ బ్రకటింపనేర్తు వస్తావధాన। కలితశతలేఖినీపద్యగద్యశక్తి
సాటిమీఱఁజాలి యాంధ్రకర్ణాటచోళ। రాజసభలను వెంటూరి రంగనార్యా.

గోలకొండ మహమ్మదీయులను, కొండవీడు వినుకొండప్రభువులను జయించి ౧౫౭౯వ సంవత్సరమునందు విజయనగరరాజులపక్షమునఁ బోరాడి విపక్షరాజబృందము నోడించిన కస్తురి రంగనాయనికిఁ గృతిపతి యైనరాయభూపతి పెదతండ్రిమనుమఁడు. భానుమతీపరిణయము కృతి నందునప్పటికి రాయన్నపాలునికి యుక్తవయస్సువచ్చిన కొం డఱు లుండుటచేత గ్రంథరచనచేసినకాలము ౧౬౨౦వ సంవత్సరప్రాంతమని చెప్పవచ్చును.

చ. అనుపమభద్రలీల వెలమాన్వయవార్ధిఁ బ్రతాపలక్ష్మితో
నెనసినరాయశౌరి జగదేకవదాన్యశిఖావతంస మా
ననుచు నుతించుచేమియరు దావిభుఁ డిచ్చినభూరిసంపదన్
ధనదులు రాజులున్ ఘనులుఁ దా రగుచు న్నిఖిలార్థు లుండఁగన్.

ఇత్యాదిపద్యములతోఁ గవి కృతిపతిని బహువిధముల వర్ణించి యున్నాఁడు. ఈతని కవనము ద్రాక్షాపాకమయి మనోహరముగా నున్నది. శైలిని జూపుటకయి భానుమతీపరిణయములోని కొన్నిపద్యముల నిందుఁ జూపుచున్నాను.

ఉ. తీరినజాతినీలములతిన్నెలపైఁ బ్రతిబింబితంబులౌ
తారకసౌధమౌక్తికవితానము లొప్పఁగఁ జూచి బాలికల్
చారుమృగీమదం బలఁది చక్కనికప్రపుమ్రుగ్గు లిప్పు డి
చ్చో రచియించినారనుచు సూటిగ నాత్మఁ దలంతు రప్పురిన్. ఆ.౧

చ. సుమముల వ్రాలివ్రాలి పరిశుద్ధవసంతకళాప్తమత్తరం
గములను దేలితేలి యతికాంతసుధామధురోల్లసన్మరం
దము చవి గ్రోలిగ్రోలి నవదక్షిణగంధవహానుకూలసం
భ్రమమున సోలిసోలి మదబంభరము ల్విహరించు నామనిన్. ఆ.౨

ఉ. అలరెఁ జకోరముల్ ప్రియసమాగతరాజముఖీమణిదృక్చకోరముల్
కలఁగె సరోజముల్ మదనకంపితపాంథమనస్సరోజముల్
సోలఁగెను ఛీచిఁ జక్రములు ధూర్తగుణోజ్జ్వలజారచక్రముల్
నలినవిరోధినూత్నకిరణంబులు కొన్ని దిశం దలిర్పఁగన్. ఆ. ౩.

చ. అతిమున నొప్పె ధర్మతనయాదులు చూచిరి కేకికోకిల
ప్రతతివతంసహంసమదబంభరడింభరథాంగనాదమం
డితబహుగంధబంధురపటీరతటీగమమాణగోపికా
కృతమణిదీపికానికరతేజము రైవతకాద్రిరాజమున్. ఆ. ౪.

---

# 51. సింహాద్రి వేంకటాచార్యుఁడు

ఈకవి లక్షణావివాహమనునామాంతరముగల చమత్కారమంజరిని రచించెను. చమత్కారమంజరి మూఁడాశ్వాసములప్రబంధము. ఈకవి శ్రీవైష్ణవుఁడు; చెన్నకేశవాచార్యులపౌత్రుఁడు; తిరుమలాచార్యులపుత్రుఁడు; గౌతమగోత్రుఁడు. "భద్రాచలస్వామి రామచంద్రుఁడొనర నాడెందమున నిండియుండుఁగాత" అని భద్రాచలరామస్వామి నిష్టదైవతముగా స్తుతియించి యుండుటచేత కవి గోదావరిమండలములోని వాఁడని తోఁచుచున్నది. ఇతఁడు తనగ్రంథమును వైష్ణవమతోద్ధారకుఁడైన రామానుజాచార్యున కంకితము చేసెను. అప్పకవికిఁ బూర్వికులయిన లాక్షణికు లెవ్వరు నీతనిగ్రంథమును పేర్కొనకపోవుట నితఁడు ౧౭౩౦-౪౦ వ సంవత్సరప్రాంతములయందుండెనని యూహింపఁదగియున్నది. అక్కడక్కడఁ గొన్ని వ్యాకరణదోషము లున్నను, ఈతని కవిత్వము మొత్తముమీఁద ప్రౌఢముగానే యున్నది. చమత్కారమంజరినుండి రెండు మూఁడు పద్యముల నిం దుదాహరించుచున్నాను.—

గీ. అరుణపల్లవములఁ బోలు నాపదంబు
లాపదంబులఁ బోలును నలకజాత
మలకజాతముఁ బోలు నిత్యముఖలీల
నిత్యముఖలీలఁ బోలు నన్నెలఁత నడుము.

మ. నిను వుంగుబ్బలు గాంచి మాను నలజంబీరంబు బీరంబు క్రొం
జిగిమోము ల్గని సిగ్గున న్వడలు రాజీవంబు జీవంబు నిం
తగ భ్రూరేఖలుచూచి భీతి నిడుఁ గోదండంబు దండంబు త
జ్జగతీమోహనప్రౌఢల నున్న చెలులం జర్చింపఁగా శక్యమే. ఆ. ౨.

శా. జోక స్వేడ్కొని చుక్కరేఁగెను జుమీ శుభ్రాంశుబింబప్రభో
త్సేకంబు ల్తఱిఁగెం జుమీ కడకువచ్చెం జుమ్మీ యీరేయి చిం
తాకాలుష్యము లేల బాల మదిలో ధైర్యం బవార్యంబుగాఁ
గోకోయన్గతిఁ గుక్కుటంబు లఱచెం గోకోవిరావార్భటిన్. ఆ. 3.

---

# 52. చేమకూర వేంకటకవి

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. లక్ష్మణామాత్యుని తనూభవుఁడు. ఈకవి సారంగధరచరిత్రము, విజయవిలాసము అను పద్యకావ్యములను జేసి తంజాపురీవల్లభుఁడైన రఘునాథరాజున కంకితము చేసెను. విజయవిలాసమునకు సుభద్రాపరిణయమని నామాంతరము గలదు. కృష్ణదేవరాయ లించుమించుగా దక్షిణహిందూదేశమునంతను జయించిన కథ నీవఱకే మాచదువరులు తెలిసికొని యున్నారు. ఆరాయల యనంతరమున తంజావూరు, మధుర, మొదలయిన ద్రావిడరాజ్యములు పాలించుటకయి తెలుఁగునాయకులు నియమింపఁబడిరి. తంజాపురిరాజ్యమునకు చెవ్వరాజు పాలకుఁడుగా నియమింపఁబడెను.

గీ. తీవి నచ్యుతరాయలదేవియైన
తిరుమలాంబకుఁ జెలియలై తేజరిల్లు

మూర్తిమాంబను బెండ్లియై కీర్తి వెలసెఁ
జెవ్వవిభుఁడు మహోన్నతశ్రీ చెలంగ.

అను విజయవిలాసములోని పద్యమునుబట్టి యీచెవ్వరాజు విజయనగరాధీశ్వరుఁడైన యచ్యుతదేవరాయనికిఁ దోడియల్లుఁ డయినట్టు కనఁబడుచున్నాఁడు. అయినను వేంకటకవి చెవ్వరాజు మనుమఁడైనకృతిపతి యగు రఘునాథరాజు నాశీర్వదించుచు,

మ. ప్రకటశ్రీహరియంఘ్రిఁ బుట్టి, హరుమూర్ధం బెక్కి యింపార మ
 స్తకముం జేర్కొన నెక్కుడేవి సహజోపంచత్కులోత్పన్న నా
 యకరత్నం బని యచ్యుతేంద్రరఘునాథాధీశ్వరస్వామికిన్
 సకలైశ్వర్యములు న్నిజేశువలనం దాఁ గల్గఁగాఁ జేయుతన్.

శూద్రునిగా వర్ణించినందున శూద్రకులసంజాతుఁ డగు చెవ్వరాజునకును క్షత్రియవంశ జాతుఁ డగు నచ్యుతదేవరాయనికిని బంధుత్వ ముండునా యని సందేహము తోఁచుచున్నది. మొట్టమొదట కృష్ణదేవరాయలే యుత్తమక్షత్రియుఁడు గాక దాసీపుత్రుఁ డయినట్టు వాడిక గలిగియున్నదిగదా! క్షత్రియుఁడైన నరసింహరాజునకు దాసియు శూద్రయు నగు నాగాంబకుబుట్టిన కృష్ణదేవరాయనికి మొట్టమొదట క్షత్రియులెవ్వరును గన్య నియ్యనందున, అతఁడు శూద్రజాతి స్త్రీని గాంధర్వవిధిచే వివాహమాడి యచ్యుతదేవరాయని పుత్రునిగాఁ బడసి యుండవచ్చును. అందుచేత నాయచ్యుతదేవరాయఁడు శూద్రకన్యనే పెండ్లిచేసికొనియు నుండవచ్చును. పెక్కు శాసనములలో నచ్యుతదేవరాయఁడు కృష్ణదేవరాయనికి కుమారుఁడైనట్టు చెప్పఁబడినను, శాలివాహనశకము ౧౪౫౯ హేవిళంబి సంవత్సరమున నచ్యుతదేవరాయలొక బ్రాహ్మణునకు నారాయణపురము నగ్రహారముగా నిచ్చిన దానశాసనములో,

శ్లో. తిప్పాజీ నాగలాదేవ్యోః కౌసల్యాశ్రీసుమిత్రయోః

జాతౌ వీరనృసింహేంద్ర కృష్ణరాయ మహీపతీ
అస్మాదోబాంబికాదేవ్యా మచ్యుతేంద్రోపి భూపతిః.

అను శ్లోకములయందు నరసింహరాజునకు తిప్పాంబయందు వీర నృసింహరాయఁడును, నాగలాంబయందు కృష్ణదేవరాయఁడును, ఓబాంబయం దచ్యుతదేవరాయఁడును కలిగినట్లు చెప్పఁబడి కృష్ణదేవరాయని కతఁడు తమ్ముఁ డయినట్టు చెప్పఁబడియున్నది. ఈబంధుత్వ మింకను విచారణీయము. ఒకవేళఁ బయిశ్లోకములలోఁ జెప్పఁబడినదే నిజమయినను, నాగమ్మవలెనే యోబమ్మయు శూద్రజాతయైన భోగభార్యయై యుండవచ్చును. ఈవిచారము నటుండనిచ్చి యిఁకఁ గథాంశమునకు వత్తము.

క. ఆమూర్త్యాంబకు నఖిల మ
హీమండలవినుతుఁ డచ్యుతేంద్రుఁడు సుగణో
ద్దాముఁడు జనియించెను ద
ద్భూమీపతి రంగధాముపూజన్మించెన్.

* * * *

క. ఆపుణ్యఫలంబున నె ద । యాపాథోరాశియైన యారాయచ్యుతభూ
మీపతికిన్ రఘునాథ । క్ష్మాపాలకుఁ డుదయమయ్యెఁ జైవాతృకుఁడై.

చెవ్వరాజున కచ్యుతరాజును, అచ్యుతరాజునకుఁ గృతినాయకుఁ డయినరఘునాథరాజును బుట్టి తంజాపురరాజ్యము పాలించిరి. విజయవిలాసములోని యీక్రిందిపద్యములవలన రఘునాథరాజు రసికజనాగ్రగణ్యుఁ డయినట్లును, విద్యలయం దసమానుఁ డయినట్టును తెలియవచ్చుచున్నది—

గీ. నన్ను నడిపినయధికసన్మాన మెంచి
యఖిలవిద్యావిశారదుఁ డగుటగాంచి

యువని నింతటిరా జెప్పఁ జని నుతించి
కృతి యొసఁగఁ గీర్తికలదని మతిఁదలంచి.

సీ. కలిగెంగా తఁ సమ్ముఖంబనియు సత్కారంబుతాఁజేయ నా
దల నెంతే శిరసావహింతురనియుం బాఁగాక వేఱెందు సా
ధులకున్ దిక్కనియుక్ దయన్ననుపురీతుల్గాక శక్యంబె వి
ద్యల మెప్పింపఁగ నచ్యుతేంద్ర రఘునాథస్వామి నెవ్వారికిన్?

రసికావతంసుఁడయిన కృతిపతి తన కంకితము చేయఁబడిన సారంగధరచరిత్రమునంతయు విని యందు శోకరస మత్యద్భుతముగా వర్ణింపఁబడుటచూచి యది నిజముగా నేడిచినట్లే యున్నదని పలికె ననియు, ఆపయిఁ గవి తనశక్తినంతయు జూపి ప్రతిపద్య రసాస్పదముగా విజయవిలాసమును జేసి తీసికొనివచ్చి వినిపింపఁగా నతని యింటిపేరును బట్టి శ్లేషించి చేమకూర మంచిపాకమునఁ బడెనని మెచ్చుకొనెననియు చెప్పుదురు. అచ్చతెలుఁగుపదములను పొందికగాఁ గూర్చి కవనము చెప్పనేర్పీకవికిఁ గుదిరినట్లు మఱియొకకవికిఁ గుదిరినదని చెప్ప వలను పడదు. అందుచేతనే కృతిపతి,

క. ప్రతిపద్యమునందుఁ జమ | త్కృతి గలుగఁగఁ జెప్పనేర్తు వెల్లయెడలనై
కృతపాఠము బాధముగా | క్షితిలో నీమార్గ మెవరికిని రాదుసుమీ.

అని కవిని శ్లాఘించి యున్నాఁడు. పింగళి సూరనార్యుని ప్రభావతీప్రద్యుమ్నమునకుఁ దరువాత విజయవిలాసమే సర్వవిధములచేతను తెలుఁగులో శ్లాఘ్యకావ్యముగా నున్నది. జాతీయాదిచమత్కృతినిబట్టి విజయవిలాసమే శ్లాఘ్యతర మయినదనియు ననేకు లభిప్రాయపడు చున్నారు.

ఉ. శారసవృత్తిమై ప్రతిపదంబును జాతియు వార్తయుం జమ
త్కారము నర్థగౌరవముఁగల్గ ననేకకృతుల్ ప్రసన్నగం

ధీరగతి న్వహించి మహి నేలించినచో నిఁక శక్తు లెవ్వర
య్యా రఘునాథభూపరసికాగ్రణికిం జెవిసోఁకఁ జెప్పఁగన్ ?

అని కవియే తన్నుఁగూర్చి తనకవిత్వమునందువలె జాతియుఁ జమత్కారము నర్థగౌరవముఁ గలుగునట్లుగా నింకొక్కఁడు చెప్పలేఁడని చెప్పికొనియున్నాఁడు. ఈకవి తనగ్రంథములయందు రేఫ శకటరేఫము లకు యతిప్రాసమైత్రి కూర్చుటయేగాక. ఇకారసంధులు, క్త్వార్థక సంధులు, మొదలయిన పూర్వలాక్షణికసమ్మతములుకాని ప్రయోగము లనేకములు చేసియున్నాఁడు.

ఉ. కోపమొకింత లేదు బుధకోటికిఁ గొంగుపసిండి సత్యమా
రూపము తారతమ్యము లెఱుంగు స్వతంత్రుఁడు నూతనప్రియా
టోపము లేని నిశ్చలుఁ డిటుల్ కృతలక్షణుఁడై చెలంగఁగా
ద్వాపరలక్షణుం డనఁగవచ్చునొకో యలధర్మనందనున్. విజయవిలాసము.

ఈపద్యమునందలి రెండవచరణములో రాకును బండిఱాకును యతికూర్చినాఁడు.

గీ. అరుగఁ గొంకెడు కన్నియ తెఱఁగుఁ గాంచి, విజయవిలాసము.

మ. ఖరభానుప్రియసూనుఁ డెప్పుడు నినుంగారించునేకా విభుం
డఱచేలోపలి నిమ్మపంటివలె నత్యాసక్తి మన్నింప సౌ
ఖ్యరసైకస్థితినుండి కావరమునం గన్గాన కాపత్పరం
పర రాఁ గ్రుళ్ళెదవేల యావిధిఁ దరింప న్నీతరంబే మహిన్. సారంగధ.

ఇత్యాది స్థలములయందు రేఫఱకారములకుఁ బ్రాసమైత్రి కూర్చినాఁడు.

క. సైకము నడుము విలాసర
సైకము నెమ్మోము దీనిమృదుమధురోక్తుల్
పైకముఁ దెగడు న్నవలా
పైకములో నెల్ల మేలుబంతిది బళిరా. విజయవిలాసము.

చ. వడి నరపాలుభోగసతివారలు నాకుఁబనేమి యంట వం
గడమునకెల్ల ఖ్యాతినిఁ గా దటు నేనలపిన్ననాఁటి యే
ర్పడితిపట్టిన్న బోవునె స్వభావము తల్లివినాకు నేక్రియం
బడఁతుక నీవు వానిచెడ మందు మహింగలదమ్మయొందునున్.

సారంగధరచరిత్ర.

ఇందు మొదటిపద్యములో (మేలుబంతి + ఇది=) మేలుబంతిది యనియు, రెండవపద్యములో (పని + ఏమి=) పనేమనియు, ఇకారసంధులను గూర్చినాఁడు.

చ. అనవిని పాపపూపజవరా లెదలోపలఁ బాపలేక యా
తని తెలివిముఖ్యానె మొగముఁ దప్పక తేటమిటారికల్కిచూ
పునఁ బనివారఁజూచి నృపపుంగవ యన్నిటజాణ పూరకే
యనవలసంటిగా కెఱుఁగవా యొకమాటనె మర్మకర్మముల్.

విజయవిలాసము.

ఉ. కానకుఁ గొంచుబోయిపుడు కాళ్ళను జేతులుఁ గోయుఁడంచు లో
నూనినకిన్క రాజు ముదుటుంగర మిచ్చెను మాకు బుద్ధి యే
మానతియిండు మీరనిన నట్టులెచేయుఁడు కొంకనేల రా
జాన నతిక్రమింపఁ దగునా యసి యాదృఢచిత్తుఁ డాడినన్. సారంగధ.

ఇత్యాది స్థలములయందు (వలసి + అంటి=) వలసంటియనియు, (పోయి + ఇపుడు=) పోయిపు డనియు, క్త్వార్థమునకు సంధి కలిపినాఁడు.

చ. చందనగంధి నెన్నుదురు చందురులో సగపాలు బాలము
ద్దుం దెలిచూపు లంగజునితూపులలోపల మేల్తరంబు లిం
దిందిరవేణిమోవి యలతేనియలో నికరంబుతేట యే
మందము మందయానముఖమందము మీఱు నవారవిందమున్.

విజయవిలాసము.

ముఖమందమని యీపద్యమునందును, రాజానయని పయిపద్యమునందును షష్ఠీతత్పురుషమునం దుత్తున కచ్చు పరంబగునప్పుడు నుగా

గమువచ్చి 'ముఖమునందము' 'రాజునాన' యని యుండవలసినదానికి మాఱుగా నుగాగమము పోఁగొట్టి ప్రయోగించినాఁడు.

మ. అని బాహాపరిరంభసంభ్రమరసాయత్తైకచిత్తంబునం
దను వీక్షింప నెఱింగి యందియలమ్రోఁతం గేకినున్ రా సఖీ
జను తేతెంచి రటంచు వే మొఱఁగి హా స్తంబు న్విడంజేసె నే
ర్పునఁ దప్పించుకపోవ భూవరుఁ డనుం బూబోఁడికిం గ్రమ్మఱన్—
విజయవి.

సీ. నిలుచుండి చంకఁజేతులపెట్టుక కిరీటములు గలరాజులు కొలువుచేయ—
సారం.

ఇందు 'తప్పించుకొని' 'పెట్టుకొని' యని యుండవలసినచోట్ల కొనునకు మాఱుగా కవర్ణకము ప్రయోగించినాఁడు.

సీ. చెంతఁగూర్చుండుని చేఁజూపఁ గూరుచుం
డెదవుగా కూరకుండెదవు సుమ్ము. విజయవి.

అచ్చు పరమగునపుడు ప్రార్థనార్థక మధ్యమపురుష మువర్ణకమునకు లోపము రాఁగూడకపోయినను 'గూర్చుండు' అని మువర్ణలోపము కలిగించి ప్రయోగించినాఁడు.

ఉ. ఓనృప నాకుఁ జూడ నటయుగ్మలి నీసుతునిక్ష మనోహరా
మానవిలాసుఁ జూచి నిలు పోపక పట్టిన లోనుగాము వెం
త్తే నెగు లూని వానిఁ బొలియింపఁగ మాయలు పన్ని నిట్లు కొం
డేనకు ధర్మరా జలుగు నిక్కముగా మిముఁ జెప్పనేటికిన్—సారంగధ.

తెలుఁగులందుఁ గొన్నియెడల ఉలనలు పరమగునపుడు మువర్ణము లోపించి పూర్వమందున్న యకారమునకు మాత్రమే దీర్ఘము రావలసియుండఁగా నిచటఁ గొండెమునకని యుండవలసినదానికి మాఱుగా నెకారమునకు దీర్ఘముపెట్టి కొండేనకని ప్రయోగించినాఁడు.

ఇట్లు లఘ్వలఘు రేఫములకు యతిప్రాసములయందు మైత్రి

కల్పించినను, పూర్వ కవిప్రయోగములకు విరుద్ధములయిన ప్రయోగగములు చేసినను, లింగముగుంట తిమ్మన్న, అప్పకవి, కూచిమంచి తిమ్మన్న మొదలయిన లక్షణవేత్తలీ వేంకటకవిని లాక్షణికకవినిగా నంగీకరించి తమ లక్షణ గ్రంథములయందీతని గ్రంథములనుండి పద్యముల నుదాహరించియున్నారు. ఇప్పటివారు కవిత్వసారస్యమును విచారింపక గ్రంథములయందు రేఫద్వయప్రాస విశ్రమమైత్రియో యేదో వ్యాకరణదోషమో యున్నదన్న హేతువుచేత రసవంతములైన యుత్తమ గ్రంథములను సహిత మగ్రాహ్యములని నిరాకరించుచున్నందున, అట్లు చేయుట యుక్తముకాదనియు ఛందోవ్యాకరణదోషములు లేని రస హీనములగు గ్రంథములకంటె ఛందోవ్యాకరణదోషములను గలవయినను రసవంతములయిన గ్రంథములే యధికాదరణీయము లనియు జూపుటకయి యీ కవివిషయమున నింతదూరము వ్రాసినాఁడను. కవిత్వమునం దక్కడక్కడఁ గొన్ని నెరసులున్నను జాతీయములతోను సామెతలతోను నిండియుండి యర్థగౌరవము కలదయి రసవంతమయి యున్నందున చేమకూర వేంకటకవి కవిత్వము సర్వజనాదరణీయమయినదని తలఁచుచున్నాను. ఈ కవి యించుమించుగా పదునేడవ శతాబ్దముయొక్క మధ్యభాగమునందున్నట్లు తెలియవచ్చుచున్నది. కృతిపతియైన రఘునాథ రాజుయొక్క కుమారుఁడగు విజయరాఘవరాజు ౧౬౭౪ వ సంవత్సరమునందు మధురాపురము రాజధానిగాఁగల పాండ్యదేశపురాజగు చొక్కలింగనాయకునితో యుద్ధముచేసి నిహతుఁడయ్యెను. అతనితోఁ గృతిపతివంశ మంతరించినది. దీనినిబట్టి విజయవిలాసమును సారంగధర చరిత్రమును ౧౬౩౦-౪౦ సంవత్సర ప్రాంతములయందు రచియింపఁబడినట్లు కనఁబడుచున్నవి. మూఁడేసి యాశ్వాసములుగా రచియింపఁబడిన యీ పుస్తకద్వయము నుండియుఁ గొన్ని పద్యముల నుదాహరించుచు నీ కవిచరిత్రము నింతటితోఁ బరిసమాప్తి నొందించుచున్నాను.—

విజయవిలాసము.

చ. క్షితిపయి నక్షత్రమాఁకులు చిగిర్చి వసంతుఁడు తా రసోపగుం
భితపరవాసనల్ నెఱప మెచ్చక చంద్రుఁడు మిన్నునం బ్రస
న్నతయును సౌకుమార్యముఁ గనంబడ దాల్గరఁగఁగఁజేసె నే
గతిరచియించి రేని సమకాలమువారల కెంచ్చరేకదా—ఆ. ౧.

ఉ. కోమలి యీగతి న్మది తగుల్పడఁ బల్కిన నవ్వి సర్జర
గ్రామణిసూను మీ రెచటఁ గంటిరొ యంటివి కన్నమాత్రమే
యేమని చెప్పవచ్చు నొకయించుక భేదము లేక యాయనే
మేమయియున్నవారము సుమీ వికచాంబుజపత్రలోచనా—ఆ. ౨

చ. శివుఁ డిటు రమ్మటంచు దయచేసినచోఁ దల కెక్కె తుగ్రవై
భవమునఁ జూచుచో నడుగుఁబట్టితి వేమనవచ్చు నీగుణం
బవునవు నందినన్ సిగయు నందకయున్నను గాళ్ళుఁ బట్టుకొం
దువు హరిణాంక శేఖరా వేళకొలఁదుల్గద నీనడకల్ తలంపఁగన్.—ఆ. 3

సారంగధర చరిత్రము.

ఉ. చక్కిలిగింతపెట్టినను సారెఁ గికాగిక నవ్వుచున్ బయిం
బక్కఁబడంగఁ జక్కనికుమారుని మక్కువమీఱ నెప్పురాఁ
జెక్కిలిమీఁటి యెత్తి యెదఁ జేరిచి ముచ్చట దీరనట్లుగా
నక్కట ముద్దులాడవలదా వలదా యిటువంటిభాగ్యముల్— ఆ. ౧

ఉ. ఆతరలాక్షి డెందమున నారట మొందుచు నేమిచేయుదున్
రాత్రికిఁ దోడుపోయినది రాసుతుడెందము మెత్తగాదు దా
దాతికి వచ్చియుండ నిఁకఁ దాలిమి చెల్లునె మాఱుఁ డంటిమా
ఘాతుకుఁ దోడ్వ రాదు సముఖంబున నేటికి రాయబారముల్—ఆ. ౨

ఉ. కందుఁ గదయ్య నీమురువు కన్నులపండువుగాఁగ నంటినం
గందుఁ గదయ్య నీతనువు కౌతుక మొప్పఁగ నీదుప్రాపు నేఁ
గందుఁ గదయ్య యంచు నినుఁగన్న సపత్ని సహింప దందుఁ బో
కందుఁ గదయ్య యేల వినవైతివి నావచనంబు పుత్రకా—ఆ. 3

# 53. రాజలింగకవి

ఈ కవి కూర్మపురాణ మనెడి యాఱాశ్వాసముల గ్రంథమును తన కాప్తుఁడైన చెఱుకు లక్ష్మణామాత్యుని ప్రేరణముచేత రచియించెను. ఈ లక్ష్మణామాత్యుఁ డెవ్వరిమంత్రియో చెప్పఁబడలేదు గాని ఘురకప్రభువుల కొలువులో నున్నట్లీక్రింది పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

సీ. సకలనృపకార్యరతావిచక్షణత్వ
మధిగమించి యమీరుల ననుసరించి
సప్తసంతానములఁ బ్రశస్తముగనిలిపెఁ
నతనికతఁడెఁ సమానుఁడీక్షితలమున.

కొరవుట్ల గ్రామనివాసుఁ డగు చెఱుకు లక్ష్మణామాత్య [illegible] తన్నుఁ గూర్చి యీవిధముగాఁ బలికినట్లు కవి వ్రాసికొనియున్నాఁడు,-

ఉ. శ్రీగిరినాథపాదసరసీరుహచింతను వీరశైవశా
స్త్రాగమమార్గనిర్ణయరిరంసు నిరంతరధీజనౌఘసం
యోగమనస్కు నుత్తమగుణోచితసంగ్రహధర్మవర్తనా
భోగుని రాజలింగకవిపుంగవు మంజులభాషు నన్నొగిన్.

క. వినయంబున రావించియుఁ । గనకవిభూషణము లంశుకంబులువీడ్యం
బనురక్తినొసఁగి నాతో । ననియె న్మధురోక్తి లక్ష్మణామాత్యుఁడొగిన్.

క. నీ వతిధన్యుఁడ వాగమ
శైవపురాణార్థసారసంగ్రహుఁడ వటుల్
గావునఁ గూర్మపురాణము
భూవిదితముగాఁగ నాంధ్రమునఁ జెప్పఁదగున్.

ఈలక్ష్మణామాత్యుఁడు తనకు సఖుఁడైనట్లు కవి నే గ్రంథమునం దిట్లు చెప్పికొని యున్నాఁడు—

చ. అతనికి మేలువాఁడనయి యాప్తుఁడనై సచివుండనై మహా

హితమతినై సఖుండనయి యెల్లపుడుం బెడఁబాయకుండి సం
తతము మృదూక్తులన్ శివకథాకథనంబులఁ బ్రొద్దుపుచ్చుచున్
గుతుకముతో వసించెదనకుంఠితవృత్తిఁ గవు లుతింపఁగన్.

ఈపద్యములవలననే కవి వీరశైవుఁడగుట స్పష్టమగుచున్నది. ఇతఁడు వసిష్ఠగోత్రుఁడు; ఆశ్వలాయనసూత్రుఁడు; సర్వేశ్వరారాధ్య పుత్రుఁడు. ఈకవి తనగ్రంథమునందు "రంగనాథుని రామలింగకవిని సూరపరాజును గౌరనాహ్వయు" నని రామకృష్ణుని స్తుతించుటచేత రామకృష్ణకవికిఁ దరువాతను కూర్మపురాణమునుండి యప్పకవి పద్యము నొకదాని నుదాహరించి యుండుటచేత నప్పకవికిఁ బూర్వమునందును, ఉన్నట్టు తేటపడుచున్నది. అందుచేతఁ గవి హూణశకము ౧౬౩౦ వ సంవత్సరప్రాంతములయం దున్నట్టు నిశ్చయింపవలసి యున్నది. ఈతనిది మిక్కిలి సరసమైన కవిత్వమని కూర్మపురాణములోని యీక్రింది పద్యములవలననే తెలియవచ్చును —

ఉ. భంబుగదే నఖావళి సభంబుగదే నడుము న్మదద్విరే
భంబుగదే కచంబు దిగిభంబుగదే నడతీరు హేమకుం
భంబుగదే కుచంబు కరభంబుగదే తొడ పూర్ణచంద్రికా
భంబుగదే స్మితం బురుశుభంబుగదే వచనంబు బోటికిన్. ఆ. ౩.

చ. దురితవినాశనం బమరదుర్లభ మవ్యయ ముత్తమంబునై
వఱలెడుయోగసంగతి నవశ్యము జ్ఞానముచేసుఁడు న్మహే
శ్వరుఁడు కనంబడున్ బరమశాంతి యనూదినమాధియుత్తమా
వరశివయోగమార్గమున వర్తిల మోక్షము కల్గుఁ గావునన్. ఆ. ౫.

ఉ. శాంతులు నీతిపారగులు సభ్యు లహింసకు లప్రమత్తు లా
గంతుకు లాహితాగ్ను లుపకారులు కోవిదు లప్రతిగ్రహుల్
దాంతులు పావనుల్ పరమధార్మికు లాశ్రితు లీశ్వరార్చన
స్వాంతులు సత్యవాదు లనవద్యులు పంక్తికి యోగ్యులారయన్.

# 54. చిత్రకవి రమణకవి

ఈకవి సాంబవిలాసమను ప్రబంధమును రచియించి వేంకటేశ్వరుని కంకితముచేసెను. ఇతఁడు ౧౬౩౦ వ సంవత్సర ప్రాంతములం దున్నట్లు తెలియవచ్చుచున్నది. ఇతని తండ్రియైన యనంతకవి రామరాజభూషణకృతమైన హరిశ్చంద్రనలోపాఖ్యానమునకు వ్యాఖ్య చేసినందున, అతఁడు పదునేడవశతాబ్దారంభమునం దుండుట స్పష్టము. సాంబవిలాసములోని పద్యముల నప్పకవి లక్ష్యములనుగాఁ జేకొని యుండుటచేత రమణకవి తప్పక తనసాంబవిలాసమును ౧౬౫౦ వ సంవత్సరమునకుఁ గొంతకాలము పూర్వమే చేసియుండవలెను. కవి తన్నుద్దేశించి యీక్రింది వాక్యములను తనపుస్తకములోఁ జెప్పుకొన్నాఁడు—

ఉ. శ్రీరమణాఖ్య సత్కవికులోత్తమ ! మామకమంజులాహ్వయ
శ్రీరమణీయ! నీవిపుడు చేయఁగఁ బూనినసాంబలక్షణా
సారసదృగ్వివాహకథ సన్మతి మాకిపు డంకితంబుగాఁ
గూరుపు నీకుఁ గల్గు జయగుర్వచలాయురభీష్టవస్తువుల్.

సీ. సర్వలక్షణసారసంగ్రహం బొనరించి
తనరె మాతాత పెద్దనకవీంద్రుఁ
డలహరిశ్చంద్రనలాఖ్యసత్కథా
శ్లేషసత్కృతికిఁ బ్రసిద్ధిగాఁగఁ
గవిహితుండౌచు వ్యాఖ్యానంబు నొనరించి
మరియు నిందుమతీసుపరిణయంబు
మొదలైనసత్కావ్యములు చేసి రహిఁగాంచె
నరయ మాతండ్రి యనంతసుకవి
చిత్రకవిమంజులాన్వయక్షీరవార్ధి
చంద్రమూర్తివి సద్బుద్ధిశాలి వీవు

రమణసత్కవి నీవానర్పంగఁబూను
కృతివతంసంబు నతని కంకిత మొనర్పు.

సాంబవిలాసమునందు దుర్యోధనపుత్రియైన లక్ష్మణాకన్యను కృష్ణుని కొడుకైన సాంబునికిచ్చి వివాహము చేసినకథ చెప్పఁబడినది. ఇది సలక్షణమైన గ్రంథము. ఇందుండి రెండుమూఁడు పద్యముల నిం దుదాహరించుచున్నాను.

చ. కొడవలిచేత బొడ్డు తగఁగోసి గడానిఁబసిండిచేటలో
నిడి నులివెచ్చనీట నొడ లెంతయు నారిచి మేలిచల్వపా
వడఁ దడియొత్తి ఫాలమున బొల్పగ నున్ననికాపుదృష్టిబొ
ట్టిడి రహి దీవన ల్నలిపి హెచ్చుగ నారతు లిచ్చి క్రచ్చుఱన్. ఆ-౧

ఉ. జాంబవతీతనూజుఁ డలసాంబుఁడు బాల్యమునందు మందహా
సం బనుభవ్యచంద్రిక నజస్రము మాతృమనోంబుజాతహా
ర్దాంబుధిఁ బొంగఁజేయుచు నుదంచితనైజకుమారచంద్రభా
వంబు యథార్థమై తనర వర్తిలు సత్కళలం జెలంగుచున్. ఆ. ౧.

మ. ఒక భిల్లాగ్రణి వెంబడించి తనపై నుత్సాహ మొప్పంగ వ
చ్చు కఠోరాధికగర్వధూర్వహతరక్షుశ్రేష్ఠమున్ సాంబభూ
పకరీంద్రంబు నుతింప మేలితళుకుం బల్వాడియాఁదంపునం
జికటారింబడఁగూల్చి యార్భటు లొనర్చెంబేర్చి శౌర్యంబునన్. ఆ. ౧

ఈకవి భారద్వాజగోత్రుఁడు; కాత్యాయనసూత్రుఁడు; ఓబళాంబాపుత్రుఁడు. ఇతనిచే రచింపఁబడిన రామాయణమొకటిగూడఁ గానఁబడుచున్నది. దాని కితఁడు "విద్వత్కవికర్ణరసాయనసకలవర్ణనాపూర్ణరామాయణము" అని పేరు పెట్టెను. ఈరామాయణములోని గద్యమునుబట్టి కవి యభిమన్యువిలాసము, కుమారగురువిలాసములోనగు గ్రంథములనుగూడ రచించినట్లు తెలియవచ్చుచున్నది. ఈరామా

యణములోనివి ప్రతికాండమునుండియు రెండేసి పద్యముల నిం దుదాహరించుచున్నాను—

చ. బిరుసులజల్లులున్ బుఱుఁగుఁబిల్లులపిల్లలు నల్లసద్గతిం
బరఁగెడు మేలిమూలికలవల్లులు పీటణపర్వకారిబం
ధురమృగరాణ్మతల్లులు వినూత్నతరంబులు గొల్లలై తగన్
సరవిని గాన్కలిచ్చి మహిజానికి నిట్లని రంభయుం దగన్.

బాలకాండము.

శా. దేహం బస్థిర మెల్లవారలకు ధాత్రీభాగమం దేల యి
ట్లూహాపోహలు చేయ నీకరికి ను న్నుత్సాహినై యిత్తునం
చాహాపల్కితి వి క్షుబడములు పెక్కాడంగ యుక్తంబులో
నా హేమాంగము దీని నమ్మి యిటు లేలా దబ్బఱ ల్పల్కఁగన్.

బాలకాండము.

మ. భరతుం డెవ్వఁడు కైక యెవ్వతె ధరాపాలుండు తా నేమి త
ద్వరయుగ్మం బన నేది నాఁకిటితీవ్రస్ఫారఖడ్గంబుచే
భరతుం ద్రుంచి ధరాస్థలంబునకు నిన్ బట్టంబు నేఁ గట్టెదన్
ధరణీమండలి నెల్లమానవులు మోదం బూని కీర్తింపఁగన్.

అయోధ్యాకాండము.

మ. నిను మన్నించి మదాత్మజున్ రఘువరున్ నేనిట్లు కోల్పోయితిన్
నినుఁ బెండ్లాడి సమస్తభూమిజనము ల్నిచాత్ముఁ డీతం డనం
గ నవేలంబగుసంద వర్తిలితిఁ గైకా సూర్యవంశంబు నీ
దునిమిత్తంబున నెన్నిభంగులఁ జెడెన్ దోషంబు నిన్ జూడఁగన్.

అయోధ్యాకాండము.

ఉ. ఉత్తములైన రాజవరు లుద్ధురబాణకృపాణచాపముల్
హత్తి ధరించు టెల్ల సభయాత్మకులై శరణన్నవారి ను
ద్వృత్తరలీలఁ గావఁగ రణాంగణమం దెదిరించినట్టియు
న్మత్తరిపుప్రకాండముల మర్దనచేయఁగఁ గాదె యెన్నఁగన్.

ఆరణ్యకాండము.

ఉ. ఆచెలువంపుజొక్కపుటొయారము లాజిగిప్రాయ మాఘన
శ్రీచణరూప మాతళుకుఁ జెక్కులచక్కఁదనంబు లామహా
ధీచతురత్వ మాపలుకుఁ దేనియ లాగమనంబు లావిభా
ప్రాచురి యెక్కడం గనుట పల్కుట వింటయు లేదు రావణా.

ఆరణ్యకాండము.

శా. నీకున్ శత్రుఁడఁ గాను భవద్రిపులతో నే సఖ్యముం జేయ నే
జోక న్నీకపకారిగా నకట యిచ్చోఁ జాలనిర్హేతుకం
బై కన్నట్టిరుప న్ననున్ని శితతీవ్రామోఘబాణంబుచే
వే కూల్పంగ నిమిత్త మేమి యిది దోర్వీర్యంబె శ్రీరాఘవా.

కిష్కింధాకాండము.

ఉ. అంగదుఁ గాంచి యోతనయ యాత్మ వగం దురపిల్లఁ బోకు ని
న్నుం గడు నాదుమాఱుగఁ గనుంగొను నీరవిపుత్రుఁ డిమ్మహో
త్తుంగభుజప్రతాపనిధితో నెడఁబాయక యుండినన్ జయా
భంగురభోగభాగ్యములఁ బ్రస్తుతి కెక్కి రహింతు వన్నిటన్.

కిష్కింధాకాండము.

ఉ. బంగరుమేలినిగ్గు గలపర్వతమో యన నైజగాత్ర ము
త్తుంగముగాఁగఁ బెంచి మత్త్రోడనె పాశము లెల్ల నూడ్చి సా
రంగపరంపరం గడుము రాజితసాహససింహమో యనన్
బొంగుచు వెంటవచ్చుదితిపుత్రులఁ బోవఁగఁదోలి రోషియై.

సుందరకాండము.

ఉ. రామకరాగ్రముద్రిక ధరాసుతచేతి కొసంగి రాఘవ
క్షేమము తెల్పి యాజనని కేవలశోకము మాన్పి లంక వా
లామితహవ్యభుక్శిఖల నంతయు దగ్ధము చేసి సీతచూ
డామణిఁ గొంచువచ్చితిఁ దటాలున నివ్వ డటంచుఁ బల్కినన్.

సుందరకాండము.

శా. కామాదుల్ గడు నీమదిం బెనగొనంగా నాదు నీతీరిత
శ్రీమద్వాక్యము నీకుఁ బథ్య మగునే శ్రీరామభీమాగ్నికీ
లామేయాంబకరాజి నీతలలు నుగ్గాడంగ నావేళలన్
నామాటల్ మది నీకుఁ బథ్య మగు నన్నన్ రావణుం డుగ్రుఁడై.

యుద్ధకాండము.

ఉ. సర్వసురౌఘముల్ నను భుజాబలము ల్విడనాడి కొల్చు టా
సర్వవికుంఠు విష్ణుఁడు నిజంబుగ నాతఁ డెఱుంగఁడే మహా
గర్వితవిష్ణుఁ డొక్కరుఁడె కాఁ డల బ్రహ్మ యెదిర్చ్చె నేని నే
నొర్వక యుగ్రబాణముల కొక్కట నాహుతి చేసి వ్రేల్చెదన్.

యుద్ధకాండము.

---

## ౫౫. అందుగుల వెంకయ్య

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; అందుగుల సూరన్నకొమారుఁడు. ఈకవి కృష్ణదేవరాయల యల్లుఁ డయిన రామరాజుతమ్ముఁడగు తిరుమలదేవరాయని మనుమని మనుమఁ డగు కోదండరామరాజు కాలములోనుండి యాతనిపేర రామరాజీయ మను నామాంతరముగల నరపతివిజయమను గ్రంథమును జేసెను. ఈగ్రంథమునందు రామరాజు పూర్వులయిన నరపతులచరిత్రమును విశేషముగా రామరాజుయొక్క చరిత్రమును జెప్పఁబడియున్నది. రామరాజు ౧౫౬౫ వ సంవత్సరమున తాళికోట యుద్ధములో మహమ్మదీయులచేతఁ జంపఁబడెను. తదనంతరము మూఁడుతరములు గడచిన తరువాత నీగ్రంథము రచియింపఁబడిన దగుటచేత, ఇది ౧౬౫౦ వ సంవత్సరప్రాంతమున రచియింపఁబడినట్టు చెప్పవచ్చును. రామరాజు గుత్తి, పెనుగొండ, గండికోట, కందనూలు,

ఆదవేని మొదలయిన ప్రదేశములు గెలిచిన ట్లీక్రిందిపద్యమునఁ జెప్పఁబడినది—

గీ. సకలవిభు తిమ్మరాజుసేనలను ద్రుంచి
గుత్తి పెనుగొండ మఱిగండికోట కంద
నూలుపుర మాదవే నవలీల గెలిచి
తొలుఁదొలుత రామనృపతి దోర్బలము మెఱసి.

ఈపుస్తకమునం దీరామరాజు నిజామువలన నహమదాబాదు గొనుట మొదలయిన మహమ్మదీయులతోడి యుద్ధములు కొన్ని వర్ణింపఁబడినవి. ఈరామరాజు పేరునకు సదాశివదేవరాయని మంత్రి యని వ్యవహరింపఁబడినను, సింహాసనమునకు వచ్చినప్పుడు సదాశివ రాయలు బాలుఁ డగుటచేతను కర్ణాటకరాజ్యము నచ్యుతదేవరాయల యనంతరమున నాక్రమించుకొన్న సకలము తిమ్మరాజును బాఱఁదోలి సదాశివదేవరాయల రాజ్యమును స్థాపించినవాఁ డగుటచేతను క్రీస్తుశకము ౧౫౪౨ వ సంవత్సరము మొదలుకొని ౧౫౬౪ వ సంవత్సరము వఱకును నితఁడే రాజ్యపరిపాలనము చేసెను. ఇతఁడు సకలము తిమ్మయను గెలిచిన కథను సూచించు నితనిప్రతాపము నరపతివిజయమునం దీక్రిందిరీతిని వర్ణింపఁబడినది—

చ. ఎలమిని రామరాజవసుధేశుప్రతాప మవార్యమై మహిన్
జెలువుగ నిండఁబర్వి శశిశేఖరదివ్యమహాశితాశుగ
జ్వాలనశిఖాసముత్కరముచందము నందమునొందె నెంతయున్
సకలయ తిమ్మయప్రముఖశత్రుపురంబుల నెల్ల నారయున్.

ఈరామరాజుతండ్రియైన శ్రీరంగరాజు కృష్ణదేవరాయల తండ్రియైన నృసింహరాజునకు కర్ణాటకరాజ్యమును నిలుపుటలో సహాయుఁడుగా నుండినట్లు కానఁబడుచున్నది. ఈశ్రీరంగరాజుయొక్క శౌర్యము నరపతివిజయములో నీక్రింది పద్యమున వర్ణింపఁబడినది—

సీ. కమవిజాపురవరకామినీ గర్భముల్ భేదించు నెవ్వానిభేరిరవము
దామిడిఁ బోయి నిజాముపట్టణముల ధూళిగాఁజేయు నేదొరబలంబు
గోలకొండవజీర్ల కోటలకాయముల్ చించు నేరాజేంద్రుచేతికత్తి
సకలభూపాలకాస్థానసన్నుతిఁ గాంచి వెలయు నేశూరునివిజయలక్ష్మి
యతఁడు కేవలనృపతియే యఘవిదూర
చర్యుఁ డాశ్రితరక్షావిచక్షణుండు
జీర్ణకర్ణాటభూపునర్జీవనుఁడు
రమ్యగుణశాలి శ్రీరంగరాయమౌళి.

ఈనరపతివిజయము కవిత్వముకంటెఁ జరిత్రమును జెప్పుటయం దెక్కువ ప్రసిద్ధమైనదైనను, కవిత్వముకూడ రసహీన మయినదికాదు. కవిత్వరీతిని దెలుపుట కయి రామరాజీయములోని రెండు పద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. ఇమ్మహిసోమదేవమనుజేంద్రుప్రతాపము నిండి దిక్కులం
బమ్మినఁ జూతపోతనవపల్లవబింబఫలారుణాంబుజా
తమ్ము లటంచుఁ గోకిలకదంబము కీరచయంబు చంచరీ
కమ్ములు క్రమ్ముచుండు నొడికంబుగ భ్రాంతివహించి పల్మఱున్.

చ. అతివిభవంబునన్ దితిసుతాహితరాజు మహాపరాక్రమో
న్నతి మృగరాజు సోయగమున న్నలరాజు సమస్తధర్మప
ద్ధతి నలధర్మరాజు పటుధైర్యమునన్ గిరిరాజు వాక్ప్రశ
స్తత ఫణిరాజు నిర్దళితశాత్రవరా జగుబుక్కరాజులన్.

# 56. కాకునూరి అప్పకవి

ఇతఁడు వైదికబ్రాహ్మణుఁడు, పదునేడవ శతాబ్దమధ్యమునం దుండిన లక్షణవేత్త. ఈకవి యాంధ్రశబ్దచింతామణి యనుపేరితో సాధారణముగా నప్పకవీయ మని వాడఁబడెడు లక్షణగ్రంథమును పద్యకావ్యమునుగా రచించెను. ఇతఁ డెనిమిదాశ్వాసముల గ్రంథమును జేయునట్లు ప్రతిజ్ఞ చేసినను, అయిదాశ్వాసములు మాత్రమే యెల్లయెడలఁ గానఁబడుచున్నవి. తక్కిన యాశ్వాసములు చేయకమునుపే యితఁడు మృతినొంది యుండవచ్చును. ఈయప్పకవీయమునందు ఛందోవిషయము సమగ్రముగా నున్నను, వ్యాకరణవిషయ మత్యల్పముగా నున్నది. ఇప్పు డున్నభాగములో సంజ్ఞా సంధి పరిచ్ఛేదములు మాత్రమే తెనిఁగింపఁబడినవి. ఇతఁడు బహుగ్రంథములు శోధించినవాఁడే యయినను, పూర్వగ్రంథములనుండి యితఁ డుదాహరించిన పద్యములన్నియు దాదాపుగా లింగమగుంట తిమ్మన్న మొదలయినవారీతనికి ముందు చేసినలక్షణగ్రంథములలోఁ గానఁబడుచున్నవి. ఇతఁడు తనకాలపువారయినకవుల గ్రంథములనుండి విశేషముగాఁ బద్యములను జేకొని యున్నాఁడు. ప్రక్రియాకౌముదియు నాంధ్రశబ్దచింతామణియు నని నామాంతరములు గలనన్నయభట్టీయము బాలసరస్వతికాలమువఱకు నెవ్వరు నెఱుఁగరు. అది నన్నయభట్టారకవిరచితమనియు, వేములవాడ భీమకవి దానిని గోదావరిలోఁ గలుపఁగా నేనూఱు సంవత్సరములయిన తరువాత సారంగధరుఁడు దానిని దెచ్చి బాలసరస్వతి కిచ్చెననియు అప్పకవి కలగనెనఁట! అటు తరువాత నొక బ్రాహ్మణుఁడు దానిని తనకుఁ దెచ్చి యీఁగా తెనిఁగింప నారంభించెనఁట! ఈగ్రంథారంభమునకుఁ బూర్వమునం దప్పకవి యేదో తెలుఁగున ఘనకావ్యము చేయ సంకల్పముపూనిన ట్లీక్రింది పద్యములవలన దెలియవచ్చుచున్నది—

క. అని యిష్టదేవతాస్తుతి
యును సకలకవీంద్రులనుతియును గురునతియుఁ గా
వినయమున సలిపి తెలుఁగున
ఘనకావ్యం బొకటి సేయఁగాఁ దలఁచుతఱిన్.

సీ. ధాత రెండవపరార్థమున నాదిదినంబుపగట వరాహకల్పంబునందు
మహితవైవస్వతమనువేళ దేశంబు లర్థింపనైన మహాయుగమునఁ
గలిసమయంబున దొలిచరణంబున మాఁసితంబగుచాంద్రమాసమునను
శాలివాహనశకమున గజ శైల శర సుధాకిరణులసంఖ్యనడవ
నంగజాబ్దంబునను దక్షిణాయనమున | జలధిరర్తువు మొదటిమాసంబునందు
బహుళమున దేవకికిఁ జక్రపాణిపుట్టి | నట్టియష్టమి చనుదేరనధికభక్తి.

* * * * *

క. కల్పోక్తమార్గమున నం | కల్పము గావించి గోపికావిభుపూజల్
సల్పిమది నతనిపదములు | నిల్పి పురాణార్థగోష్ఠి నిశ గడపు నెడన్.

గీ. నుదుటఁ గస్తూరి తిలకంబు పొదలువాఁడు
తలఁచిచూచిన నాకులదైవ మగుచుఁ
బొలుచు నాకులదైవంబుఁ బోలువాఁడు
నిలిచె నొకరుఁడు నాదుముంగలను గలను.

ఇష్టదేవతావందనాదులును గురుదేవతాస్తుతియుఁ జేసి తెనుఁగున ఘనకావ్యమొకటి చేయ నుద్యమించి శాలివాహనశకము ౧౫౭౮ వ దగు మన్మథనామసంవత్సర శ్రావణ బహుళాష్టమినాఁడు సంకల్పముచేసి కామెపల్లెదేవాలయములో రాత్రి పురాణగోష్ఠిని గడపుచుండఁగా శ్రీకృష్ణుఁడు కలలోవచ్చి యాంధ్రశబ్దచింతామణి నశించిన కథ చెప్పి—

చ. రమణను సత్కవీంద్రులు పురాణచయం బితిహాసపంక్తి కా
వ్యములును దొల్లియైన నిపుడైనను ముంగలనైన దీని సూ

త్రములను దక్క వేఱొకవిధంబున నాంధ్రముఁ జేయఁజాలమిన్
షమఁ దెనిఁగింపు దీన నవి సర్వముఁ జేయుఫలంబు నీ కగున్.

దానిని తెనిఁగింప నానతిచ్చెనఁట! శ్రీకృష్ణుఁడు స్వప్నదర్శన మిచ్చుటకుఁ బూర్వమే గ్రంథమును జేయ సంకల్పించెనో చెప్పలేము. ప్రక్రియా కౌముది యనఁబడెడి యీ యాంధ్రశబ్దచింతామణి బాలసరస్వతి కృతమనియు దానికి గౌరవము కలుగుటకయి యీ కథ కల్పింపఁబడినదనియు నే నీవఱకే చూపియున్నాను. పయి పద్యములనుబట్టి యీ పుస్తకము శాలివాహనశకము ౧౫౭౮వ సంవత్సరమునందనఁగా క్రీస్తుశకము ౧౬౫౬వ సంవత్సరము నందారంభింపఁబడి ౧౬౬౦వ సంవత్సరప్రాంతమున కింతవఱకుఁ జేయఁబడియుండును. అప్పటికప్పకవి కవసానకాలము తటస్థించినందున గ్రంథము సమాప్తినొంది యుండక పోవచ్చును.

సీ. జగతి నాపస్తంబశాఖోక్తషట్కర్మపద్ధతిఖండనిబంధనంబు
కాలబాలార్కవాఖ్యాజ్యోతిషగ్రంథసంహితానుశ్లోకసంగ్రహంబు
శ్రీమదనంత ప్రసిద్ధమహావ్రతకల్పకథాంధ్రోక్తి కావ్యరచన
శ్రీనగాధీశసుశ్లేషనిందాస్తుతి భావగర్భితసీసపద్యశతము
లలితకవిల్పకాఖ్యానలక్షణంబు। మహితసాధ్వీజనౌఘధర్మద్విపదము
నంబికావాదనాయకయక్షగాన। కృతియుఁజేసితి నాకునూరికులయప్ప.

అను పద్యమువలన నప్పకవి యీ గ్రంథమును రచించుటకుఁ బూర్వము కొన్ని సంస్కృతాంధ్ర గ్రంథములను రచించినట్టు తెలియవచ్చుచున్నది గాని యిప్పుడా గ్రంథములు లభించుట యరుదు. ఈతని కవిత్వము సుగమమైన మృదుమధురపాకము గలదిగానున్నది. అప్పకవికిఁ బూర్వమునందు రకార ఱకారములకు యతిప్రాసమైత్రి కలదు లేదను నభిప్రాయభేద మున్నను, "నాన్యేషాంవై ధర్మ్యం లఘ్వలఘూనాం

రయోస్తు నిత్యం స్యాత్" అన్నది బాలసరస్వతి సూత్రమనుకోక వాగను శాసనసూత్రమని భ్రమపడి

గీ. చెల్లునని మున్నుభీమన చెప్పెననుచుఁ
గలుపుదురు రేఫములునుఱకారములును
దుష్టకవు లవి యొకటైనఁ దొంటిపెద్ద
లందఱును నేల విభజింతు రని తెలియరు.

అని రేఫఱకారములకు యతిప్రాసమైత్రిఁగూర్చువారు దుష్టకవు లని యప్పకవి దూషించి యున్నాఁడు. రకారద్వయమైత్రిని నిషేధించిన బాలసరస్వతియే తద్భేదము గ్రహింపలేక చంద్రికాపరిణయములోని యీక్రింది పద్యమునందు రేఫఱకారములకు విశ్రమము కూర్చినాఁడని కూచిమంచి తిమ్మకవి వ్రాసియున్నాఁడు—

ఉ. అక్కఱ మీఱ లేక్షణ నన్వినయంబుగఁ గాంచుము నానుమాటుగా
మ్రొక్కెద నేమమా భువనమోహిని నీకనిపల్కు మారిచేఁ
జిక్కితి వేగఁబ్రోవుమని చెప్పుము పొమ్మికఁ దేఁటిరాయ నీ
యక్కఱమాటున న్నను భరించి లభింపుము కీర్తిపుణ్యముల్—
చంద్రికాప.

రేఫరకారమైత్రికి సమ్మతింపనివారవి రెండును నేకాక్షరమే యందురా? భిన్నాక్షరము లందురా? ఏకాక్షరమేయయి లఘ్వలఘు రూపములుమాత్రమే యయినయెడల, యలవల లఘ్వలఘు రూపము లకువలెనే వీనికిఁ గూడ మైత్రి యేల యుండరాదు? భిన్నాక్షరము లనెడు పక్షమున, రయోస్తు నిత్యం స్యాత్తనుచోటనేకశేషవృత్తి యెట్లు కుదురును? అవి యొకటైనఁ దొంటిపెద్దలేల విభజింతురని యప్పకవి యడిగిన ప్రశ్నమునకు యలవల నేల విభజించిరో యాహేతువుచేతనే యని చెప్పుటయే తగిన యుత్తరమగును.

---

# చరిత్రము తెలియని యితరకవుల గ్రంథములు

అప్పకవీయాది లక్షణగ్రంథములలో నుదాహరింపఁబడిన గ్రంథము లిప్పుడనేకములు గానరాకున్నవి; కొన్ని గ్రంథములపేరులు తెలిసినను గ్రంథకర్తలపేరులు సహితము తెలియరాకున్నవి. (అమరేశ్వరుని గొప్ప కవినిగా పూర్వకవులనేకులు స్తుతించియున్నారు. ఈతఁడు చేసిన గ్రంథము లేవియో తెలియరావుగాని కూచిమంచి తిమ్మకవి తన సర్వ లక్షణసార సంగ్రహమునందుఁ జిమ్మపూడి యమరేశ్వరుని విక్రమసేనము లోనిదని యీ క్రిందిపద్యము నుదాహరించియున్నాఁడు!—

సీ. నీర నగ్గియునికి యారయ విస్మయం
బనుచు బాడబాగ్నికడలి యప్పు
రంబుఁజొచ్చెనొక్కొ రత్నాకరముమఁబు
లనఁగ జెలువ మమరునాపణములు.

ఈ ప్రకారముగానే హూణశకము ౧౬౫౦ వ సంవత్సరమునకుఁ బూర్వమునందున్నట్టు నిశ్చయముగా తెలిసిన కొందఱుకవుల గ్రంథనామములు తెలిసినను, నా కాగ్రంథము లిప్పుడు లభింపనందున గ్రంథకర్తల చరిత్రమును గూర్చికాని వా రుండినకాలమును గూర్చికాని నేనిప్పు డేమియు వ్రాయుటకు శక్తుఁడను గాకున్నాను. గ్రంథకర్తల నామములు సహిత మనేకములు తెలియరాలేదు. తెలిసినవారు నా కావిషయమును తెలుపుదురన్న యపేక్షతోను, ఇతరు లట్టి గ్రంథసంపాదనమునకయి కృషిచేయుదురన్న విశ్వాసముతోను, \ఆ గ్రంథముల పేరులనుమాత్ర మిందుఁజెప్పి వానిలోనుండి దొరికిన పద్యముల నుదాహరించుచున్నాను—

౧. కవులషష్ఠము—ఇది యెవ్వరు చేసినదో తెలియలేదు. పుస్తకముయొక్క పేరునుబట్టి యిది యనేక కవులుచేరి చేసినట్లూహింపఁ దగియున్నది. "తృతీయవర్గసరళమునకు రాచమల్లువారి షష్ఠస్కంధ

ములోఁ బ్రయోగ"మని యప్పకవి వ్రాసియుండుటచే (నిది రాచమల్లు వారను నింటిపేరుగల కవులచే రచియింపఁబడినట్లు స్పష్టమగుచున్నది. ఆకవు లన్నదమ్ములయి యుండవచ్చును.)

శా. శ్రీరామామణి సీత నాథునియురస్సీమ న్నిజచ్ఛాయఁ గ
న్నారం గన్గొని యాత్మ నన్యవనితాశ్లేష భ్రమం బూనఁ దత్కంధరన్
హారం బున్చుచు నింకఁ జూడుమనఁ గా నాటం బ్రహసంబొందఁ జే
ల్వారున్ రాముఁడు ప్రోచుఁగాత మిఁకఁ జమ్మామధీశుతిమ్మాధిపున్.

శా. చండాంశుప్రభ చిక్కతిమ్మయతనూజా తిమ్మ విధ్వస్తపా
షండం బైనత్రిలింగ భాగవతషష్ఠస్కంధ కావ్యంబు నీ
కుం డక్కెం జతురాననత్వగుణయుక్తు ల్మీఱ వాణీమనో
భాండారోద్ధత చూరకారబిరుదప్రఖ్యాతి సార్థంబుగన్.

అని కవిసంశయవిచ్ఛేదములోను, సర్వలక్షణసారసంగ్రహము లోను గవులషష్ఠమునుండి యుదాహరింపఁబడిన పద్యములనుబట్టి యీగ్రంథము తిమ్మయపుత్రుఁడయిన తిమ్మయ కంకితము చేయఁబడి నట్లు తెలియుచున్నది. ఈతిమ్మయ యచ్యుతదేవరాయని మంత్రులలో నొకఁ డయిన ట్లొకానొకరు వ్రాసియున్నారు. అదియే నిజమైనపక్ష మున బమ్మెరపోతరాజకృతభాగవతము శిథిలముకాఁగా పోయినభాగము లలో నొకటియైన యీషష్ఠస్కంధమును ౧౫౩౦ - ౪౦ సంవత్సరముల మధ్యను రాచమల్లువారు చేసియుందురు. దీనియందు శృంగారరస మధి కముగా వర్ణింపఁబడినందున దీనికే శృంగారషష్ఠమని నామాంతరము కలిగియున్నట్టు కనఁబడుచున్నది. అప్పకవ్యాదులుదాహరించిన శృంగార షష్ఠములోని కొన్నిపద్యముల నిందుఁ బొందుపఱుచుచున్నాను —

గీ. తల్లియును దండ్రి దైవంబు తలఁప గురుఁడ
కాఁడె? యిట్టిఁ డేమిచేసినఁ గనలఁ దగునె?

నాస్తికాధమ యోరి యన్యాయవృత్తి
నాస్తికత్వం గురోః పరమ్మనఁగ వినవె. (అప్పకవి)

మ. పదము ల్ద్రొట్రిలఁ గానుఁదీఁగ చలియింపం గేశము ల్ద్రాలఁ జ
ద్యెద వక్షోరుహపాళిఁ జేరఁ గనుదోయిన్ బాష్పము ల్గ్రిమ్మ గ
ద్గదకంఠమ్మున వాక్యము ల్తడఁబడన్ దద్దేహముం జొచ్చి యా
సుదతీరత్నము గాంచె బాలుని మనశ్శోకానలజ్వాలునిన్. (తిమ్మన్న)

చ. వయసునఁ బిన్నవాఁడ నభివంద్యుఁడ నౌదునె మీకునంచు సం
శయ మొనరించె దేని మునిసత్తమ కార్యములందునాగమా
ధ్యయనములందు మంత్రములయందుఁ గనిష్ఠుఁడ యేని పెద్ద ని
శ్చయ మిది వానియం దఖిలసన్నుత మైనవిద్య గల్గినన్.
(అ. సూరన్న)

౨. శ్రీరంగమహాత్మ్యము - ఇది భైరవకవిప్రణీతము. కవిగజాంకుశమును రచియించిన భైరవకవి యితఁడేయయి యుండవచ్చును!—

చ. పరిచరుఁగాఁగ నేలె నిరపాయచరిత్రునిఁ బావకానన
స్ఫురదురుపీతిహోత్రుని సముజ్జ్వలమేరుసమానగాత్రునిన్
బరమపవిత్రునిన్ మునిసుపర్వవరస్తుతిపాత్రునిన్ మనో
హరఫలశేముషీకబళితాంబుజమిత్రుని వాయుపుత్రునిన్.
(అప్పకవి)

ఉ. గందపుఁగొండనెత్తములకందున నేలకితీవయిండ్లలోఁ
గెందలిరాకుపాన్పున సుఖించి నితాంతరతిశ్రమంబునం
జెందినచెంచుగుబ్బెతలచెక్కులఁ జిమ్ము జవాదివాసనల్
విందులుచేయుచు న్మెలఁగు వేఁకువఁ గోమలగంధవాహముల్.
(లిం. తిమ్మన్న)

ఉ. ఆకులవృత్తి రాఘవుశరాగ్రమునందుఁ దృణాగ్రలగ్ననీ
రాకృతి వార్ధి నిల్చుట దశాననుఁ డీల్గుట మిథ్యగాదె వా

లోకులు చెప్పుకున్నఁ గృతిలేనినరేశ్వరవర్తనంబు ర
త్నాకరవేష్టితావని వినంబడఁ దాతఁడు మేరు వెత్తినన్.

(కూ. తిమ్మన్న)

౩. త్రైశంకోపాఖ్యానము—దీనిని సింగరన్న రచియించినట్లప్పకవి చెప్పుచున్నాఁడు. ఇందు హరిశ్చంద్రునికథ చెప్పఁబడి యుండవలెను—

క. ధూమకేతుద్విషునకుఁ గి
ల్బిషపర్వతవృషునకు కమృతవిషనిధిజామా
త్రిషునకు ఋషిపూజితునకు
విషమాక్షున కింద్రముఖదివిజపక్షునకున్.

క. ఢుంఢిరభైరవుని సితి
కంఠు విశాలాక్షి దండకరు జాహ్నవి నై
కుంఠపతి గుహాస్య లోలా
ర్కుం జేవలుమీఱ భూవరుఁడు పొడగనియెన్.

౪. శ్యమంతకమణి చరిత్రము—ఇది వణుకూరి గుర్వారాజుచేఁ జేయఁబడినదని యప్పకవి వ్రాయుచున్నాఁడు—

ఉ. కాయవచోమనస్థ్సలనకల్పితదోషము లెల్లఁ బాయఁగా
నాయెదలోన నిత్యము సనాతనధర్మముఁ బూని యర్మిలిం
బాయకకొల్తు రామనరపాలనిరంతరసౌఖ్యదాయి సీ
తాయి సమస్తశోభనవిధాయి మహాఫలసిద్ధిదాయి గన్.

౫. శశిబిందు చరిత్రము—

క. నాకౌకసులైనను నీ
ఛాకకు నిల్చెదరె కటకటా మముబోంట్లన్
జేకొని సంరక్షింపక
నీకిటు లుచితంబె యురవణింప నరేంద్రా.

క. నూవుంబూవును సంపెగ
పూవుగెలిచి బిరుదుముత్తెపుంజల్లి దగం
దా వైచె నవంగ ముంగర
త్రో వనరుహనేత్రనాస తుల లే కొప్పన్.

౬. ✓చారుధేష్ణచరిత్రము—

గీ. అచ్చరలు నందనంబునఁ దెచ్చుకొనుసు
రాగసుమములు హర్మ్యవాతాయనముల
చెంతఁ గా లూఁది తత్పురస్త్రీల కొసఁగి
వేఁడికొనిపోవుదురు కల్పవిడియములు.

క. ఈలలన వేలుపుంజవ | రాలో యచ్చరయొ కిన్నరవధూమణియో
వ్యాళాంగనయో కాక | భూలోకస్త్రీల కిట్టిపొంకము కలదే?

౭. ✓భేతాళపంచవింశతి—

ఉ. చోరగ్రాహగజాంకుశంబు నళినీశుంభన్మదేభంబు ది
జ్నారీమూర్తికదర్పణంబు రజనీకాంతామనోహారి వి
స్ఫారాంభోధితరంగకారి గిరిజాప్రాణేశభాస్వజ్జటా
శ్రీరమ్యాభరణంబు చంద్రుఁ డుదయించెన్ సుప్రభాభాసియై.

ఉ. ఆవిధవారశిరోమణి రయంబునఁ బోయి రహస్యవేశ్మఁ బ
ద్మావతిఁ గాంచి రాజసుతుఁ డాడినమాటలు విన్నవింప ల
జ్జావతి దానిఁ జూచి ఘనసారకరంబుల గంధపాళికల్
వావిరి వ్రేసినన్ జరఠవారిజలోచన వచ్చె ఖిన్నతన్.

౮. ✓చమత్కారరామాయణము—

క. ఓశశిముఖి లోపాము
ద్రేశుఁడు కలశభవుఁ డుండు నిట నతఁడు తపో
రాశి మహాత్ముఁడు మును పా
పోశనముగఁ గొనియె సాగరాంబువు లెల్లన్.

క. నిన్నుం జెఱఁగొన్న హైహయు
కన్నన్ దోర్వీర్యమెక్కుడగుభార్గవు లీ
ల న్నిర్జించినరాముని
కన్నను శూరుండు ముజ్జగంబులఁ గలఁడే?

౯. శేషధర్మములు—

క. పెట్టఁడు నారకమార్గం
బెట్టి మహాక్రూరకర్మఁ జేసియుఁ దుద ని
ట్టట్టనక నెమ్మనంబున
నెట్టన హరిఁ దలఁచఁ గలిగెనేని మహాత్మా.

౧౦. విజయసేనము—

ఉ. వల్లభుఁ డేగు దుర్లభుఁడు వానిదెసందగు లూఁది యిమ్మెయిన్
దల్లడ మందెదేల యుచితస్థితికిన్నను బాపఁజూచినన్
దల్లియు బంధులోకమును దండ్రియు నేమనువారెఱింగరే
మల్లమ యిట్లుచేయఁ దగునో తగదో పరికించిచూడుమా.

౧౧. దేవీవిజయము—

గీ. వాక్త్రినేత్రాంగనాశచీశక్తు లధిక
సంభ్రమంబునఁ గుంభనికుంభదైత్య
హంత్రిఁ బూజింపుదురు త్రయీమంత్రములను
స్తోత్రములుచేసి మంగళారాత్రికలిడి.

౧౨. మధుసేనము—

క. ఘోనుద్యోగము చేసిన । ప్రాణంబా యింకనీకుఁ బాధేయం బీ
మానినిమందస్మితమధు । రాననచంద్రికలు గ్రోల నరుగుము పిదపన్.

౧౩. అనిరుద్ధచరిత్రము — కనపర్తి యబ్బయామాత్యప్రణీత మయిన యీపేరుగల యాధునిక ప్రబంధ మొకటి కలదుగాని యీక్రింది పద్యము పూర్వగ్రంథములోనిది—

చ. నెలవుల నుప్పతిల్లి నరినిక్కి మొనల్తల లెత్తి క్రొవ్వి లో
బలిసి సమంబులై బిగిసి వట్రువలై మెఱుఁ గెక్కి చక్కనై
కెలఁకులఁ బిక్కటిల్లి చెలికిం గడునొప్పెఁ గుచంబు లొప్పుకు
ప్పలుగను మన్మథుండు సరి వ్రాలఁగఁ ద్రాసునఁ దూఁచెనో యనన్.

౧౪. శూద్రకరాజచరిత్రము—

మ. సమదేభారి మసంగిపై నుఱికినన్ శంకించి భూపాలుఁ డో
లము గన్నం గని దాని శూద్రకుఁడు లీలం ద్రుంచె నే నప్పు డ
త్యమలోద్యత్ప్రసవార్థినై కుసుమగంధఘ్రాణలుబ్ధభ్రమ
ద్భ్రమరభ్రాజితపాటలీవిటపమధ్యస్థుండనై చూచితిన్.

౧౫. ఆదినారాయణచరిత్రము—

ఉ. శ్రీయుతలోచనోజ్జ్వలమరీచులు భానుమరీచివిస్ఫుర
త్తోయజకాంతితోడఁ దులఁదూఁగెడుపచ్చనిపట్టు గట్టి య
త్యాయతశంఖచక్రరుచిరాసిగదాధరుఁ డేఁగుదెంచె నా
రాయణుఁ డార్తరక్షణపరాయణుఁ డాకరిరాజుపాలికిన్.

౧౬. పంచబాణవిలాసము—

క. చిత్తంబుల రంజిల్లుచు
ముత్తైదువ లపుడు గదిసి పూవిల్తునకున్
బిత్తరికెఁ బలుదెఱంగుల
నత్తిరి హారతులు పౌరులెల్లఁ జెలంగన్.

౧౭. ప్రద్యుమ్నోపాఖ్యానము—

క. పంచశరుం డపు డని చా
లించి మహాప్రధనభూమి నీక్షించి మదో
దంచితుఁడై శంఖము పూ
రించెం గులగిరులు దిక్కరివ్రజ మదరన్.

# ఆంధ్రకవుల చరిత్రము.

## తృతీయ భాగము

## ఆధునిక కవులు

By

**K. VEERESALINGAM**

వెల రు. **3-8-0**

# విషయసూచిక.

# ఆంధ్రకవుల చరిత్రము

## ఆధునిక కవులు

## 1. హరిభట్టు

ఈకవి మత్స్యపురాణమును వరాహపురాణమును తెనిఁగించెను. ఇతని నివాసస్థానము కంబముమెట్టు; ఇది బెజవాడ కాల్వామడలదూరములో నున్నది. ఇతఁడు తన వరాహపురాణమునందు కంబముమెట్టు గ్రామము నీప్రకారముగా వర్ణించియున్నాఁడు—

సీ. వరుణదిగ్వీధి నేపురమునఁ బ్రవహించెఁ బావనసలిలసంపన్న మున్న
దీపించె నేపురి గోపికామానసాస్పదవర్తి చెన్నగోపాలమూర్తి
భాసిల్లె నేవీటఁ బ్రహ్లాదభక్తివిశ్రాణి కొండనృసింహశార్ఙ్గపాణి
యేపట్టణంబునఁ జూపట్టె హితపద్మహేళి వీరేశబాలేందుమౌళి
చతురచతురంగబలరత్నసాధయూధ। సాలగోపురతోరణసకలవర్ణ
పౌరవారాంగనాజనప్రముఖవస్తు। మేదురం బట్టికంబముమెట్టపురము.

కవి వైదికబ్రాహ్మణుఁడు; భారద్వాజసగోత్రుఁడు; రామపండితుని పుత్రుఁడు. ఇతఁడు మొదట వరాహపురాణము గొలిపాక యెఱ్ఱనామాత్యుని కంకితము జేసెను.

మ. సన తెంతుం గొలిపాక యెఱ్ఱనికిఁ దేజశ్శౌర్యగాంభీర్య స
త్వవిభుత్వోక్తి ధనుర్జయోన్నతి యశస్త్యాగక్రియాశాంతులన్
సవితర్క సాత్యకి సింధు సీరి సురశాస్త్ర సూతు సేనాని సైం
ధవనిర్భేదను సోము సౌమ్యరుచి సంతానంబు సప్యాధిపున్.

ఇత్యాది పద్యములచేత గుణితక్రమమునఁ గవి కృతినాయకుని నెంతగా నభివర్ణించినను,

క. శ్రీమహిత స్తంభాచల । నామసముద్దామపట్టణస్థలగణక
గ్రామణికి బంధుహితర । త్నామణికిఁ గవీంద్రపంకజనభోమణికిన్.

అను షష్ఠ్యంతపద్యమువలన నతఁ డాయూరికి కరణమయినట్టు స్పష్టపడుచున్నది. ఇట్టి నాయకగ్రామణి తన్నుఁ బిలిపించి—

మ. అమృతప్రాయవచోవిశేషరచనాహంభావపుంభావనా
గ్రమణీమూర్తివి వేదశాస్త్రవివిధగ్రంథార్థనిర్ణీతి నే
కముఖబ్రహ్మవు యాజుషప్రకటశాఖాధర్మధుర్యుండ వ
ర్యమతేజుండవు రామనార్యహరిభట్టా సత్యవిగ్రామణీ.

గీ. అష్టఘంటావధానవిశిష్టబిరుద
నీవు రచియింపఁ దలఁచిన నిరుపమార్థ
రమ్య మగు నీవరాహపురాణకావ్య
మంకితముచేయు నాపేర నభిమతముగ.

అని పలికినట్లు కవి వ్రాసికొనియున్నాఁడు. పయిపద్యమునందే గాక యాశ్వాసాంత గద్యమునందును "అష్టఘంటావధానపరమేశ్వర బిరుదవిఖ్యాత" యని కవి వ్రాసికొనెను గాని యీబిరుద మెవ్వరిచే నియ్యఁబడినదో తెలియఁబడదు. అయినను కవిత్వము మాత్రము పయి పద్యమునందుఁ జెప్పఁబడిన రీతిగా నమృతప్రాయముగానే యున్నది. ఇతఁడు తానాప స్తంబసూత్రుఁ డయినట్టును తిమ్మాంబ పుత్రుఁ డయి నట్టును మత్స్యపురాణములో నీక్రింది పద్యమునఁ జెప్పుకొన్నాఁడు—

శా. భారద్వాజసగోత్రసంభవుఁడ నాప స్తంబుఁడన్ దిమ్మకాం
బారాజద్వరగర్భసంభవుఁడ రామక్ష్మాసురానేకజ
న్మారూఢాధిక పుణ్యలబ్ధహరి నామాంశా ప్రసంస్తుత్యుఁడన్
శ్రీరామావరపాదపద్మయుగళీ చింతాసమాయుక్తుఁడన్.

ఇతఁడు మొదట రచించిన వరాహపురాణమును నరాంకితముచేసి యట్లు చేయుట పాపకార్యమని తలచి తత్పాపపరిహారార్థముగా మత్స్య

పురాణమును శ్రీరంగాంకితముచేసి యం దీక్రిందిపద్యమును బొందు పఱిచెను—

సీ. ఆయురారోగ్యనిత్యైశ్వర్యములు గల్గి
విభవంబుతో ధాత్రి వెలయుకొఱకు
ధనమునకై నరాధముల సన్నుతిచేయఁ
బొడమినపాపము ల్చెడుటకొఱకు
హృదయంబు లక్ష్మీశపదపంకజములందు
నిశ్చలవృత్తిఁ గో నిలచుకొఱకు
రౌరవాదులఁ బాసి రయమున వైకుంఠ
సదనంబునకు వేడ్కఁ జనెడుకొఱకుఁ
బరమవైష్ణవజను లెల్లఁ బ్రస్తుతింప
మత్కృతం బయి హరికథామాహ్య మగుచు
నుత్తమం బగువిష్ణుధర్మోత్తరంబు
రంగనాథున కర్పింతు రమణ మెఱసి.

కవికాలమును నిర్ణయించుట కీ పుస్తకములు రెంటిలోను నాకాధారము లేవియు గానరాలేదు. అక్కడక్కడఁ గొన్ని యల్పదోషములున్నను మొత్తముమీఁద నిర్దుష్టమని చెప్పఁదగిన గ్రంథరచనను బట్టియు శైలినిబట్టియు చూడఁగా నీపుస్తకములు చిరకాలము క్రిందటనే రచియింపఁబడిన వయినట్టు తోఁచుచున్నది. "అష్టఘంటావధాన" యని రెండు పుస్తకములయందును గనఁబడుచున్నది. గంటమను తెలుఁగుశబ్దమునకుఁ బ్రకృతియయి లేఖినియని యర్థమిచ్చెడు "ఘంట" శబ్దము సంస్కృతమున నున్నదేమో! అప్పకవి యీగ్రంథములనుండి లక్ష్యములను జేకొనకపోవుటచేత నీకవి యతనికిఁ దరువాత నున్నాఁడేమో యని యూహ కలుగుచున్నది. కాఁబట్టి తగిన యాధారములు దొరకువఱకును మన మిప్పటి కీ కవికాలము క్రీస్తుశకము ౧౬౭౦

సంవత్సర ప్రాంతమని భావింతము. తెలియనివిషయముల నూహించి పెంచి వ్రాయుటకంటె కవికృతగ్రంథములనుండి కొన్నిపద్యముల నుదాహరించి యింతటితో విరమించుట యుక్తమని యెంచి యట్లు చేయుచున్నాను.

## వరాహపురాణము.

ఉ. మిక్కిలి శీతలాంబువులు మేనికిఁ గీడు మహోష్ణవారిచేఁ
బొక్కు శరీర మీ యుభయముం దొరలించిన నింపొనర్చు ని
ట్లొక్కనయంబ యొండె భయ మొండె నొనర్పక తద్ద్వయంబుఁ దా
నిక్కువెఱింగి చూపు మనుజేంద్రునకున్ వశులౌదు రందఱున్. -ఆ ౧

మ. సమరాజేంద్రునిఁ గూర్చి సామము భుజాశౌర్యాధికుం గూర్చి దా
నము దీనం గలయంగనేరని మహీనాథాగ్రణిం గూర్చి భే
దము శక్తిత్రయహీనుఁ గూర్చి కడిమిం దండంబుఁ గావింప యు
క్తము భూపాలున కాత్మరాజ్యపరిరక్షాకార్యనిస్తంద్రతన్ —ఆ.౨

శా. వేదార్థంబులు వేఱుగాఁ దెలిసి దుర్విజ్ఞాను లాత్మేశ్వరా
భేదధ్యానసమేతులై తుది భవత్ప్రీత్యర్థమై కర్మముల్
మోదం బొప్పఁగఁ జేయనేరక మహామోహాంధులై యుందు రం
తాదివ్యాప్తివిహీనసంసృతిసముద్రాంతర్నిమగ్నాత్ములై —ఆ. 3

ఉ. దేహవినాశమూల మగు తీవ్రవిషావృతమైనయట్టి యా
బాహువుఁ ద్రెంచి మేను నిలుపందగు నందురుగాన సోదరీ
స్నేహము చేయు టొప్ప దని చెల్లెలిముండల వట్టి యాజగ
ద్ద్రోహి గళంబుఁ ద్రెంచుటకు దొరసి యెత్తినఁ జూచి యత్తఱిన్ -ఆ౪

చ. ఘనతరకష్టలోభిఁ దనుకంబునఁ జంపెదనంతయల్క నె
మ్మనమునఁ బుట్టె నేని విషమారణకర్మకృపాణముఖ్యసా
ధనములు గూర్ప నేల ప్రమదంబున డగ్గఱి కాసు వీస మి
మ్మనుటయె చాలు వారి నిమిషార్థమున న్మృతి నొందఁ జేయఁగన్ -ఆ౫

## మత్స్యపురాణము.

చ. చదివితి వేదశాస్త్రములు సాంగపదస్వరవర్ణరూఢి నం
దొదవిన మార్గముల్ వివిధయోజ్యములై విలసిల్లు వానిలో
నెదిరిన కర్మకాండమున హింసము జ్ఞానమునందుఁ గర్మమున్
వదలక పల్కుచుండును బ్రవాహముల న్విపరీతవృత్తులై. — ఆ. ౧

చ. తిరిగితిఁ గాననంబు లతితృష్ణఁ జలింపక తద్వనంబులన్
దొరకవు కందమూలములు తోయజనాభుపయాజ్ఞఁగాక యి
ప్పురమున నన్నపూర్ణ పరిపూరితయై విహరింపుచుండఁగాఁ
గలవగునే తదన్నము లకాలమున న్మనమందిరంబునన్ — ఆ. ౨

చ. విప్పగు నీచకర్మపదవిం జనువారికి మంత్రతంత్రముల్
తప్పినఁ బ్రత్యవాయములు తార్కొనివచ్చుటెకాని దానతే
దప్పరమేశుఁ జొందెడుప్రయత్నము నే నిటనీకు వేడుకం
జెప్పెద గుప్తమార్గమునఁ జేయుము తత్క్రియ భూసురోత్తమా. - ఆ ౩

మ. రమణీబంధుజనాప్తుల న్విడిచి తద్రాజ్యంబు వర్జించి దు
ర్దమకామాదులఁ జెందనీక హృదయస్థైర్యంబున న్మించి నీ
వమితోద్యద్గుణకీర్తనామృతముచే నాహ్లాదముక్తుండవై
విమలాంతఃకరణుండ వై ననిను నే వీక్షించితిం బుత్రకా — ఆ. ౪

మ. హరి సంగీతవినోదలోలుఁ డగుచో నత్యంతశీఘ్రంబునన్
వరగానంబుల నాత్మసద్గుణకథావర్ణంబు లై నట్టిగీ
తరసంబుల్ రసనం జవిం గొనెడుమర్త్యశ్రేణి కిష్టార్థముల్
పరిపూర్ణంబులుగా నొసంగును దయాపారీణుఁడై. వేడుకన్ — ఆ. ౫

## 2. ఒడ్డెపూడి పెద్దయ్య

ఈకవి వాయుపురాణమును తెనిఁగించి, పురుషోత్తమపట్టణ నివాసుఁడయిన దాసరి చిన్నగంగయ్య యను కమ్మచౌదరి కంకితము చేసెను. పురుషోత్తమపట్టణము కొండపల్లెకుఁ బ్రాగ్భాగమున నున్నట్టును, దానిని వీరపురుషోత్తమ గజపతి తనపేరఁ గట్టించినట్టును గవి చెప్పియున్నాఁడు. వీరపురుషోత్తమగజపతి కొండవీటి కధిపతిగా నుండి క్రీస్తుశకము ౧౪౭౦ వ సంవత్సరము మొదలుకొని ౧౪౯౬ వ సంవత్సరము వఱకును రాజ్యపాలనము చేసెను. ఈతని తరువాత రాజ్యమునకు వచ్చిన యితని మనుమఁడైన వీరభద్రగజపతిని ౧౫౧౫ వ సంవత్సరము నందు కృష్ణదేవరాయలు జయించి కొండవీటిని స్వాధీనము చేసికొనెను. దీనినిబట్టి వాయుపురాణము కృష్ణదేవరాయని కాలమున కనంతరముననే రచియింపఁబడినట్టు తెలిసినదికాని యెప్పుడు చేయఁబడినదో తెలియదు. అప్పకవి యీ పురాణమునుండి పద్యముల నుదాహరించియుండక పోపుట మొదలయిన కొన్ని హేతువులనుబట్టి హరిభట్టకవికాలమువలెనే యీ కవికాలమును ౧౬౭౦ వ సంవత్సరప్రాంతమని యూహింపఁ దగియున్నది. ఈ యిద్దఱుకవులును కవిత్రయమని ప్రసిద్ధిగన్న నన్నయ తిక్కన శంబువాసులనుదక్క నితరాంధ్రకవులను దమ గ్రంథముల యందుఁ జేర్కొనియుండలేదు. కవికృతినాయకుఁడయిన చినగంగయ్య కొలువునఁ గూర్చుండి తన్నుఁగూర్చియు సభికులనుగూర్చియుఁ బలికిన వాక్యముల నిట్లు చెప్పియున్నాఁడు—

సీ. అతులితశాస్త్రేతిహాసంబు లొకవంక నొకవంక దండనాయకగణంబు
తతచతుర్విధవేదతత్వజ్ఞు లొకవంక నొకవంక నిపుణశాబ్దికచయంబు
ప్రకటితప్రౌఢతార్కికబృంద మొకవంకనొకవంకఁజతురవాక్సుకవినికర
మకళంకపౌరాణికకదంబ మొకవంక నొకవంక జ్యోతిషప్రకరవేత్త

లోకచో బంధునిచయంబు లోకయెడ స
మగ్రసామంతవిసరంబు మహిమఁ గొలువఁ
గొలువుకూటంబు నందుండి కలితవచన
గౌరవమునీఱ సభికులఁ గాంచి పలికె.

*　　*　　*　　*

చ. వినతసమస్తభూభుజుని వేంకటమంత్రికిఁ బేరమాంబకున్
దనయునిఁ బుణ్యవర్తనుని దానగుణాన్వితు నారసింహహృ
ద్వనరుహచంచరీకు ననివార్యవచోరచనావిశారదున్
నను బినయొడ్డెపూడి పురనాథునిఁ బెద్దకవీంద్రచంద్రునిన్.

తోటకము—వినయంబునఁ గన్గొని వేడుక ని
ట్లనియెన్ సుకవీంద్ర మురారికథల్
వినినంత నభీష్టనవీనఫలం
బనయంబును గల్గు జనావళికిన్.

*　　*　　*　　*

ఉ. పంకజగర్భదారకటిభాగవిభాసితభర్మమేఖలా
కింకిణికావిరావములఁ గేరి తదీయకరాగ్రపిస్ఫుర
త్కంకణనిష్కళంకనినదంబు నగున్ బినయొడ్డెపూడిమా
వేంకటమంత్రిపెద్దన నవీనవిలాసవచోనిగుంభనల్.

ఈ కవి నియోగిబ్రాహ్మణుఁడు; కాశ్యపగోత్రుఁడు; వేంకటమంత్రి పుత్రుఁడు; ఒడ్డెపూడి గ్రామమునకు కరణము. ఇతఁడు వాయుపురాణము లోనికొంతభాగమును మాత్రమే తెనిగించినట్టు కనబడుచున్నది. ఈతని కవిత్వమునం దక్కడక్కడఁ గొన్ని దోషములున్నను మొత్తముమీఁద కవిత్వము రసవంతముగానేయున్నది. వాయుపురాణమునుండి కొన్ని పద్యముల నిందుదాహరించుచున్నాను—

మ. కరకోచ్చాటితమై ఘనాఘనబృహద్గర్జారవోపేతమై
వరవిద్యుల్లతికాతతిప్రబలమై వాస్తోప్పతీష్వాసబం
ధురమై సర్వదిశాభిభాగములు నస్తోకాంబుపూర్ణంబుగాఁ
గురిసె న్వర్షము నీరజవ్రజము సంక్షోభింప భీమంబుగన్—ఆ. ౧

ఉ. పొంగినవేడ్కచే నతఁ డపూర్వముగా విహరించుచుండి యా
చెంగటఁ గాంచె దివ్యసరసీరుహశోభితమ త్తభృంగ ను
త్తుంగతరంగఁ దోయపరిత్రోషనికీర్ణ జలాకచక్రచ
క్రాంగ నభంగగంగ నికటాగతసంయమిసంగ నెంతయున్—ఆ. ౨

మ. కసుదూరంబున నుండి మేను వడఁకంగాఁ బాదముల్ తొట్రిలన్
వడచేఁ జిక్కి నూరీ యటంచును గృహద్వారంబుఁ జేరంగ నే
నిడఁగాఁ బంచితి నీరసాన్న మతఁడున్ హేయంబుగాఁ జూడకే
కుడిచెం దత్కలుషంబు చేయుకతనన్ ఘోరాటవీభూములన్—ఆ. 3

మ. మునిసంఘంబులు మ్రొక్కఁ దామరలు సమ్మోదంబున న్నిక్కఁ గో
కనికాయంబుల కింపు లెక్కఁ గుముదౌఘంబుల్ రుచు ల్దక్క నో
ర్వనిగర్వంబులు మూలి జాలిఁబడి జీవంజీవముల్ స్రుక్కఁ దూ
ర్పున మార్తాండుఁడు గానిపించె భువనంబుల్ రంజిలం జేయుచున్-ఆ౪

ఉ. ఇంద్రుఁడ నీవు దుఃఖపడ నేటికిఁ గౌశికమౌని చేయుని
స్తంద్రతపంబు మాన్పుటకు శక్యము గాదననేల ధీరతన్
రుంద్రమతి న్సుఖింపుము నిరూఢిగ నే నిదె చక్కఁ జేసెదన్
జంద్రముఖీవిలోకనసుసంగతిఁ జొక్కరె యెట్టివారలున్—ఆ. ౫

# 3. కాకమాని మూర్తి

ఈ కవి కాకమానికులజుఁడైన బ్రాహ్మణుఁడు; కౌండిన్యస గోత్రుఁడు; రామలింగ భట్టుపుత్రుఁడు. ఇతఁడు పాంచాలీపరిణయము, రాజవాహనవిజయము అను రెండు ప్రబంధములను రచియించెను. రాజవాహనవిజయములోని యీ క్రింది పద్యమునుబట్టి యీ కవి యింటి పేరు పెన్నావారని తెలియవచ్చుచున్నది—

సీ. గుణధన్యుఁ గౌండిన్యగోత్రు నాపస్తంబసూత్రుని వెలనాటిశుభచరిత్రుఁ
గాకమానీమహాగ్రామాబ్జమిత్రుఁ బెన్నాకలశాబ్ధితారాకళత్రు
సరసవిద్వత్కవిసార్వభౌముని రామబుధనంభవునకుఁ బ్రబోధసుధికిఁ
బౌత్రుని బినరామభట్టాగ్రజన్ముఁడై తనరు శ్రీరామలింగనకుఁ దిమ్మ
మాంబికకుఁ బుత్రుఁ సూర్యనారాయణద్వ
యైకసహజన్ము నుభయభాషాకవిత్వ
తత్వనిధి నన్ను మూర్తివిద్వత్కవీంద్రు
హర్షమునఁ జూచి యిట్లని యానతిచ్చె.

ఇతఁడు తనగ్రంథములను నరాంకితములఁ జేయక రాజవాహనవిజయమును శ్రీవేంకటేశ్వరులకును, పాంచాలీపరిణయమును శ్రీరంగపతికిని, అర్పించినందునఁ గృతిపతులను బట్టి కవికాలమును నిర్ణయించుట కాధారములేదు. ఇఁకఁ గవిస్తుతిలోనైనను పాంచాలీపరిణయమునం దితఁ డితరాంధ్రకవులను బేర్కొనక తనముత్తాతయు తాతయునైన గామపండితుని ప్రబోధపండితుని మాత్ర మీపద్యమునందు పేరులు పెట్టి నుతించియున్నాఁడు—

చ. ప్రబలమతి న్నుతింతుఁ బ్రతిభాకృతిభాషితభారతీశులన్
గబళితసర్వదర్శనులఁ గావ్యచమత్కృతికాళిదాసులన్
నిబిడతపోవిలాసులఁ దృణీకృతవాదులఁ గాకమాని రా
మబుధవిధున్ బ్రబోధసుధి మత్ప్రపితామహునిన్ బితామహున్.

రాజవాహనవిజయమునందు వీరినిగాక యీపద్యమునందుఁ గవిత్రయమునగూడఁ జేర్కొని యున్నాఁడు—

ఉ. శ్రీరఘురామకావ్యకృతశిష్టవిధిజ్ఞుఁ బరాశరాత్మజున్
భారవిఁ గాళిదాసు శివభద్రు మురారి మయూరు బిల్హణున్
జోరుని మల్హణాదిసురసూక్తి కవీంద్రులఁ గొల్చి యెంచెదన్
భారతకర్తృతాచణుల నన్నయఁ దిక్కన నెఱ్ఱనార్యునిన్.

ఇతఁ డన్యకవుల నెవ్వరిని గొనియాడకపోయినను వసుచరిత్రకర్తయైన భట్టుమూర్తికిఁ దరువాతివాఁ డయినందుకు సందేహములేదు. వసుచరిత్రకర్త మూర్తి యన్నమాట వినఁబడఁగానే మూర్తి నరసభూపాలీయకర్తగాని వసుచరిత్రకర్త కాఁ డనియు, ఉభయగ్రంథకర్తలు భట్టువంశజులయి యేకకాలవారగుటచేఁ బూర్వకాలమునుండియుఁ బండితపామర సాధారణముగా వసుచరిత్రకారుఁడు భట్టుమూర్తి యన్న భ్రమ యంధ పరంపరగా వచ్చుచున్నదనియు, కొందఱు చెప్పవత్తురు. ఒక్కకాలమునం దిద్దఱు కవులుండి వారిలో నొక్కఁడు సుప్రసిద్ధుఁడును రెండవవాఁ డప్రసిద్ధుఁడును నయినప్పుడు సుప్రసిద్ధునిపే రడఁగిపోయి యప్రసిద్ధునిపేరు పైకివచ్చుట యెన్నఁడును సంభవింపనేరదుగాన, అధిక ప్రసిద్ధుఁ డయిన రామరాజభూషణునిపే రడుగంటి యాతని గ్రంథకర్తృత్వము భట్టుమూర్తిమీఁదఁ బడెననుట యుక్తియుక్తముకాదు. ఒకవేళ భ్రమకలిగెను పక్షమున, నరసభూపాలీయకర్త రామరాజభూషణుఁడని కలుగవలెను. అప్రస్తుతమైన యీయంశము నటుండనిచ్చి కార్యాంశమునకు వత్తము. అనేకు లీకవిని భట్టుమూర్తినిగా భ్రమించి యితని పాంచాలీపరిణయములోని యీక్రిందిపద్యమును—

గీ. అల్లసానివానియల్లిక బిగిసొంపు । ముక్కుతిమ్మనార్యు ముద్దుఁబలుకుఁ
బాండురంగసుకవి పద్యంబుహరువును । గాకమానిరాయ నీకె కలదు.

బట్టుమూర్తినిగూర్చి రామకృష్ణకవి పలికినట్లు చెప్పుచున్నారు. ఇది నామసామ్యమునుబట్టి కలిగిన భ్రమగాని వేఱుకాదు. మఱియు నీపద్యమునుబట్టి యీకవి తెనాలి రామకృష్ణునికాలమునకుఁ దరువాతి వాఁడనుట స్పష్టమగుచున్నది. పయిపద్యములో శ్రీరంగేశుఁడు తన కవిత్వమునుగూర్చి యట్లు పలికినట్లు చెప్పుకొనుటయే కాక రాజవాహన విజయములో సరస్వతిని బ్రార్థించునప్పుడుకూడ నిట్లు చెప్పియున్నాఁడు.

ఉ. చోరు నలంక్రియావిహృతిసొంపు మయూరునిసౌకుమార్యమున్
భారవికాంతిసంపదయు బాణుగుణాఢ్యతర ప్రయోగ మా
దారి మురారికోమలపదంబుప్రసాదముఁ గల్గునట్లుగా
భారతి యిచ్చుఁగాతఁ బ్రతిభారతి మత్కృతికిం జమత్కృతిన్.

ఈతని కవిత్వమునం దీకవి పొగడుకొన్నంత యాధిక్యము లేక పోయినను, రసవంతమయి సలక్షణమయి యమకాది శబ్దార్థాలంకార యుక్తమయి కవితారచన యనర్గళధారగా ప్రవహించుచున్నది. గ్రంథములం దన్యదేశ్యపదములును పూర్వలాక్షణిక సమ్మతములుకాని ప్రయోగములును గొన్నియందందుఁ గానఁబడుచున్నవి. కవి ౧౬౨౦ వ సంవత్సరప్రాంతములయందుండి యుండియుండును. కాకమానిమూర్తి బహుళాశ్వచరిత్రములోనివని కొన్నిపద్యములు రంగరాట్ఛందమునందును సర్వలక్షణ సారసంగ్రహమునందును ఉదాహరింపఁబడియున్నవి కాని యితఁడు రచియించిన బహుళాశ్వచరిత్రము నాకు లభింపలేదు. ఈమూర్తికవి రాజవాహనవిజయములో చంద్రగిరి హనుమంతుని స్తుతించి యుండుటచేత నీతని వాసస్థానమైన కాకమానిగ్రామము చంద్రగిరి సమీపమున నుండియుండును. కవిత్వరీతిని దెలుపుట కీతని గ్రంథముల నుండి కొన్నిపద్యముల నుదాహరించుచున్నాను—.

## రాజవాహన విజయము.

శా. ధాటీఘోటఖురాగ్రనిర్దళితగోత్రాధూళికాగంధచూ
ర్ణాటోపాతిపరిస్ఫురత్కఠినసర్వాశావధూటీకుచా
ఘూటచ్ఛాయదరాగశాటికసమాఖ్యావిక్రమప్రక్రమా
త్యాటీకాహితరాజహంసుఁ డగు నాహా రాజహంసుం డిలన్.-ఆ. ౧.

ఉ. మీసపుమొక్కనిక్కునకు మిక్కిలి క్రొల్కరివాన కుంతలా
ళీసురపాలనీలమణిలీలకుఁ గ్రొన్ననుసాన విభ్రమ
శ్రీ సరసీరుహంబు మదసింధురసప్రసవంబు సూనబా
ణాసతపఃఫలం బపుడు యౌవన మబ్బెఁ గుమారమాళికిన్—ఆ. ౨

శా. పూవుందోఁట యొయారి చేరి బలితంపుంజందురాతిన్నెలం
బూవుందేనియ సోనవాన చొత్తుకు లొప్పైవె చు గొజ్జగిపూ
పై వాటు ల్గలదాసనంపుఁగనిమల్ పన్నీటిమున్నీటి బల్
త్రోవం గట్టినపచ్చమెట్టికలపైఁ దోడ్తోడఁ గ్రీడింపఁగన్—ఆ. 3.

ఉ. తాలిమిదూలి తూలి చెలి దర్పకుఁ డప్పుడె వంచుతమ్మిపూ
వాలికతూపు క్రొంజెమటవానకుఁ గారణ మైననిద్దపుం
గోలమెఱుంగొ యాననచకోరహితాగతరశ్మిమోరయో
లోలమృగాక్షి నాపయిఁ దళుక్కనఁ జూచినచూపు బాపురే. ఆ-౪

మ. కటకంబు ల్గలయుత్కటద్విపఘటల్ ఘంటాపథప్రస్ఫుట
త్కటకంబు ల్మొరయంగఁ జక్కఁజన వాద్యధ్వానశక్తిన్ మహా
కటకంబుల్ ప్రతివాద మీన విభవోత్కంఠన్ దిశాభూమిభృ
త్కటకంబు ల్గన రాజు చేరఁ జనియెం దన్మందిరాళిందమున్. ఆ. ౫.

## పాంచాలీపరిణయము.

ఉ. వేయుఁ గఠోరమార్గణము లివ్వలి కవ్వలి కద్రి దూయఁగా
గ్రైవేయుధరాస్థలిన్ సబిడివెంటనె గాంగరుఘరంబు లేవఁగాఁ

జేయును నుగ్గునూఁచములు చెట్టునుజట్టును గొట్టి బిట్టుగా
నాయనలాయనప్రభవుఁ డాయన యౌవనగర్వసంపదన్. ఆ. ౧.

ఉ. ఎంతటివన్నెఁ దెచ్చె గుఱిచేసి యితండు ద్విజన్మజాతికిన్
వింత యటంచు రాజుల గణింపక తిట్టుచు గేలి గొట్టుచున్
గంతులు వైచుచుం దలకుఁ గట్టినచెంగగవైచి పట్టుచున్
గొంతులురాయఁగోయనుచుఁ గూఁతలుపెట్టిరి గ్రామ్యభూసురుల్. ఆ. ౨

ఉ. ముందటఁ గాంచె దిగ్రమణముఖ్యుఁడు వారుణవేషభాషణున్
మంధరకంధరాకనకమందిరమధ్యవితర్ద్యమండపా
రందరనీలకందరధురంధరసింధురవైరిపీఠవా
సేందుకళాకలాపు హృదయేశ్వరితోడుత నెత్తమాడఁగన్. ఆ. ౩.

శా. నీకేవచ్చు సువాలయున్ ధవళ మింతీ యల్లో నేరేళ్లు గా
రీకళ్యాణము లంచు నింటికడ నేరీతి స్వజృంభింతువే
వాకీ విచ్చుట నంచు సిద్ధఱుసతు ల్వాక్యోపవాక్యంబులన్
గాకై ముందలపల్లకుం దొడఁగి రాకల్యాణవేదిస్థలిన్. ఆ. ౪.

శా. ఆఁడుంగాన్పుచు గంటకన్న సతి గొడ్రాలౌటయే మేలు నూ
త్రేఁడు ల్పెంచినఁ గూఁతు రేమి సతమా యీవియ్యము లోఁడలిన్
గాఁడంబల్కినఁ దాళఁగావలసెఁగా కాఁగానితిట్లాడికల్
నేఁ డీతండ్రియుఁ దల్లివంగడముకానీ పంచుకోనాయెఁగా. ఆ. ౫.

# 4. కామేశ్వరకవి

ఇతఁడు సత్యభామాసాంత్వనమను నాలుగాశ్వాసముల శృంగారప్రబంధమును రచియించి, మధురనాయకుఁడైన ముద్దలగిరి నృపాలున కంకితముచేసెను. ఈమధుర శ్రీకృష్ణుని జన్మస్థల మయిన మధురాపురముగాక పాండ్యమండలమునకు రాజధానియైన దక్షిణ మధుర యైన ట్లీక్రిందిపద్యమువలనఁ దెలిసికొనవచ్చును—

క. లక్షణలక్షితకమలా। వీక్షణపుంఖానుపుంఖవిభవోన్మేషా
నుక్షణతతవిశ్రుతియై। దక్షిణమధురాపురంబు తనరు ధరిత్రిన్.

కృష్ణదేవరాయని యనంతరముఁ దెలుఁగు నాయకులు పాండ్య మండలమును జిరకాలము పాలించిరి. ఈకవి యాకాలమునందు మధురాపురమును బాలించుచున్న ముద్దళగిరిరాజు సభలోఁ గూరుచుండి తన్నుఁ గూర్చి యిట్లు పలికిన ట్లీపద్యములలోఁ జెప్పినాఁడు—

శా. ఆరీతిన్ సభ ముద్దులళ్గిరిధరాధ్యక్షుండు కొల్వుండి తా
హేరాళంబుగ నయ్యెడ న్నడుచుసాహిత్యప్రసంగంబు గం
భీరప్రౌఢిమ వించు న న్బిలిచి నెమ్మిం బల్కె వీణాకన
న్నారీపాణిసువర్ణకంకణ ఝణత్కారానుకారోక్తులన్.

చ. అనువుగ రుక్మిణీపరిణయంబును ముందె హావణించి యార్యులా
ననఁదనియించినావు మము నప్రతిమంబుగ నవ్యకావ్య మిం,
పున రచియింపుమీ సొగసుపోఁడిమి మీఱఁగ సత్యభామసాం
త్వనమును గప్పురంపుఁజలువం గెలువం దిరుకామసత్కవీ.

క. కాకులవలె నింటింటను। గాకవు లున్నారు హంసకైవడి భువిలో
శ్రీకామ నీకె తగురా। యేకడ నుడిపాలు నీరు నేర్పఱుపంగన్.

క. ఏ భాషనైనఁ గృతిపతి। శోభనములు చెందు నీదుసూక్తులవలనన్
నీ భాగ్య మసదృశము గా। రీభవకరుణానివేశ శ్రీకామేశా.

ఈ ముద్దళగరి తన సవతియన్నగారయిన చొక్కనాథుఁడు స్త్రీలోలుఁడయి రాజ్యభారమును తమ్మునిమీఁదఁ బెట్టి తంజావూరిలో నున్న కాలములో యువరాజుగా రాజ్యముచేసెను. చొక్కనాథుఁడు క్రీస్తుశకము ౧౬౬౦ వ సంవత్సరము మొదలుకొని ౧౬౮౨ వ సంవత్సరము వఱకును రాజ్యము చేసెను. కవి యీ ముద్దళగరినే రాజునుగా వర్ణించినను, అతని వర్ణనలోఁగల యీ క్రింది పద్యమునుబట్టి యన్న యుండగానే యతఁడు రాజ్యభారము వహించినట్లు స్పష్టమగుచున్నది—

ఉ. అన్నయు దమ్ము లీకరణి నందఱు నొద్దికయై యశోరమల్
చెన్ను వహింప రాముకృపచేఁ దనుఁ జెందినరాజ్యసంపద
భ్యున్నతభోగభాగ్యుఁడయి యుర్విని సర్వనృపాలకోటిలో
నెన్నిక కెక్కె ముద్దళగరీంద్రుఁడు తాను మహోన్నతస్థితిన్.

ఈ ముద్దళగరి ౧౬౭౬ వ సంవత్సరప్రాంతమునఁ దానే రాజ్యము నాక్రమించుకొని సంవత్సరకాలము స్వతంత్రముగాఁ దనపేరనే పాలనము చేసెను గాని యింతలో చొక్కనాథుఁడు వచ్చి దేశము మరల స్వాధీనము చేసికొనెను. చొక్కనాథుఁడును, ముద్దళగరియు, మఱిముగ్గురును ౧౬౨౩ వ సంవత్సరము మొదలుకొని ౧౬౫౯ వ సంవత్సరమువఱకును రాజ్యముచేసి ప్రసిద్ధికెక్కిన తిరుమలనాయకుని కొమాళ్ళు. ఇందుఁ దెలుపఁబడిన చరిత్రమునుబట్టి కవి యీ గ్రంథమును ౧౬౭౫ వ సంవత్సర ప్రాంతమునందు రచియించినట్లు తెలియవచ్చుచున్నది. ఇతఁడు రుక్మిణీపరిణయమును గూడ రచియించినట్లు చెప్పఁబడినదిగాని యాపుస్తకము నాకు లభింపలేదు. "దక్షిణసింహాసనాధ్యక్ష తిరుమలక్ష్మాకాంత కరుణాకటాక్షలక్షిత స్వచ్ఛముక్తాగుళుచ్ఛసితచ్ఛత్ర చామరకళాచికా కనకాందోళికా విరాజోపచార" యని యాశ్వాసాంత గద్యమునఁ జెప్పుకొని యుండుటచేతఁ గవి తిరుమలనాయకుని కాలమునందు సహితముండి ౧౬౫౦ వ సంవత్సరప్రాంతములనుండి కవిత్వమునందుఁ బ్రసిద్ధి

నొందియుండును. ఈ గద్యమునందే యితఁడు "శ్రీకాళహస్తీశ్వర చరణారవింద మిళిందాయమాన జ్ఞానప్రసూనాంబికా కృపాలంబ విజృంభమాణ సారసారస్వత సుధాతరంగ" యని చెప్పుకొనుటచే నితఁడు కాళహస్తినివాసుఁడయి మధురనాయకుల యాదరమువలన మధురసంస్థానమును జేరినట్టు కనఁబడుచున్నది. విజయవిలాసమువలెనే యిదియు శుద్ధ ద్రవిడదేశమునందుఁ జేయఁబడిన ప్రబంధము. ఇవిగాక యఱవదేశమునందుఁ జేయఁబడిన తెనుఁగుకావ్యము లింకను బెక్కులు గలవు. "వల్లకీవాదన ధురీణ వర్ణగీతాది గాంధర్వస్వరసమీనకల్పనాప్రవీణ" యనియు గద్యమునందు కవి వ్రాసికొన్నాఁడు. అందుచేత నితఁడు సాహిత్యమునందు మాత్రమే కాక సంగీతమునందును బ్రవీణుఁడని విశదమగుచున్నది. ఈ కవి యింటిపేరు లింగనమఖివారు; తండ్రిపేరు నాగనామాత్యుఁడు; తల్లిపేరు కామాత్యంబ. ఈతని కవిత్వము ప్రౌఢమయినది. సత్యభామాసాంత్వనమునుండి కొన్ని పద్యముల నిందుదాహరించుచున్నాను.—

ఉ. ఆపురమందుఁ గెంపుఁజిగియందపుఁగోట వయోధికన్యకుల్
బ్రాపయి తిమ్మిపోలికను భాసిలెఁ గొమ్మలు జేసు లట్లు చా
లై పరఁగెం దటాంతరగళన్నవమౌక్తికలీల నబ్ధిపై
చీపృథుశీకరమ్ము లెగసెన్ సారి సేసలు చల్లు కైవడిన్.

ఉ. తావులవెంబడిం గదలి తాళ్ళకుఁ దేఁటులు ప్లేటిజేక్కులం
బోవక నాకెఁ బుప్పొడియుఁ బుప్పొడిత్రోఁ దగెఁ బూవుసోన యా
పూవులసోనత్రో మిగులఁ బొల్చెను గల్పతరుప్రసూనమా
ధ్వీవిసరంబు నావెనుక వీచెను బల్లసి కమ్మతెమ్మెరల్—ఆ. ౨

ఉ. చూడక చూచినట్లు తమిఁ పోలుచు సొక్కుచు మోహ ముంచి మా
టాడక యాడినట్లు కలయం గమకించి మదిం గణించి యా
చేడియతోడిలోక మయి చింతిలి కార్యము నెంచ కుండుటల్
పాడియె తెల్పుమా యవితపాండవ కాళియమౌళితాండవా—ఆ. ౩

శా. భాసిల్లె న్నిజసోదరేందుశుభగంభావక్రియావీక్షణో
ల్లాసోద్గారముకుందదారకృతలీలాస్యసారస్యభృ
గ్గీసంగీతతరంగితాబ్జరుచిభంగీజాతరంగోల్ల స
త్కాసారాబ్ధితరంగజాలము శరత్కాలం బవేలంబుగన్ — ఆ. ౪

## ౫. వెణుతురుబల్లి విశ్వనాధకవి

ఇతఁడు శేషధర్మములను బద్యకావ్యమునుగా రచియించి వెఙ్కా పురసంస్థానాధీశ్వరుఁడయిన వత్సవాయతిమ్మనృపాలుని కంకితము చేసెను. ఇతఁ డారువేలనియోగి బ్రాహ్మణుఁడు. ఈతని తండ్రిపేరు వేంకటామాత్యుఁడు. ఇతఁడు ౧౬౦౦ వ సంవత్సరప్రాంతముల యం దుండినవాఁడు. ఈకృతిపతినిగూర్చియు కృతికర్తనుగూర్చియు నేనుఁగు లక్ష్మణకవి చరిత్రమునందుఁ గొంత తెలుపఁబడి యున్నది. ఇతనిది సలక్షణమయిన మంచికవిత్వము. ఈతని శేషధర్మములనుండి రెండు పద్యము లిందుఁ గైకొనఁబడుచున్నవి—

శా. మాయావిప్రుల కాద్విజుండు కడిగెన్ బాదాంబుజద్వంద్వముల్
చేయారం గుసుమాక్షతాదులను బూజించెం గాత్రము లైవ్వచె న
ట్లాయాపాత్రములందు నన్నము లిడెన్ నారంభుఁ జ్ఞానంతలో
నాయింద్రుండు గృహస్థుఁజూచిపలికెన్ సాపేక్షపూర్వంబుగన్. ఆ. ౧

ఉ. కాలినయిన్నుగుండ్ల ముఖగహ్వరభాగములందుఁ గ్రుక్కుచున్
సోలుపు లేర్పడ న్మొఱుఁగుసూదులఁ గ్రుచ్చుచుం దలల్
నేలకుఁ జేర్చి పాదములు నింగికి నెత్తుచుఁ బెక్కుజాడలన్
గాలభటుల్వ్రతఘ్నులకుఁ గాఁ బడియుందురు రంతిమీఁదటన్. ఆ. 3,

# 6. నూతనకవి సూరన్న

ఈకవి సకలజనాభిరామ మను నామాంతరముగల ధనాభిరామ మను మూఁడాశ్వాసముల పద్యకావ్యమును రచించెను. ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కాశ్యపగోత్రుఁడు; తిప్పయామాత్యపుత్రుఁడు. కవి తన్నుఁగూర్చి యిట్లు చెప్పుకొనుచున్నాఁడు—

సీ. వి స్తీర్ణవైభ వాపస్తంబసూత్రుండఁ గాశ్యపగోత్ర విఖ్యాతయశుఁడ
ఘనతననంతసేనుని మల్లనామాత్యపౌత్రుఁడఁ దిప్పయప్రభుసుతుండఁ
బార్వతీశుభగర్భపాథోనిధానసంధానశశిత్తుండ మానధనుడ
సత్కావ్యపారీణ పారస్యసంలబ్ధవిస్తారమతి గలవిమలయశుఁడ
భద్రవైభవశ్రీవీరభద్రలబ్ధ। జనితచాతుర్య కావ్యలక్షణవిచిత్ర
విపులవాచాసమగ్రసంవిద్ధమతిని।సూరనామాత్య నామకసుకవివరుఁడ.

కవి తనగ్రంథమున వ్రాసికొన్న యీక్రింది పద్యమునుబట్టి తాను దిక్కన సోమయాజి సంతతివాఁడనని చెప్పుకోఁదలఁచినట్టు కనుపట్టుచున్నది—

చ. అనువుగ భారతాంబుధి యవ్వలికిం దెగనెట్టి యందులో
ఘనకవితామృతంబు చవి గాంచిన తిక్కన సోమయాజిపా
వనతర మైనయట్టికులవర్ధనుఁడై మహిఁ పేరుగల్గు నూ
తనకవి సూరనార్యుఁడను ధర్మగుణాంచితపాలనీయుఁడన్.

ఈకవి తన కావ్యమును దాక్షారామభీమేశ్వరుని కంకితము చేయుటచేత నితఁడు గోదావరీ మండలములోనివాఁడయినట్టు కనఁబడుచున్నాఁడు. ఈతఁడేకాలపువాఁడో తెలియరాలేదుగాని పూర్వకవులను మధ్యకవులను మాత్రము స్తుతించి చిమ్మపూడి యమరేశ్వరుని—

చ. అలఘుని శబ్దశాసనపదాంకితుఁ దిక్కనసోమయాజి ని
శ్చలమతి శంభుదాసు బుధసన్నుతు నాచనసోమనార్యుఁ జె

న్నలరిన చిమ్మపూడి యమరాధిపు భాస్కరు రంగనాథునిం
దలఁతు నపూర్వదివ్యకవితామహనీయసమగ్రచిత్తులన్.

అని కవిస్తుతిలోఁ జేర్కొనియుండుటచేతను, ఇంతమంది పూర్వకవులను జెప్పి మధ్యకవులలో నొక్కనిని జెప్పకపోవుటచేతను, ఇతఁడు మధ్యకవులలోఁ జేరినవాఁడేమో యని సందేహము కలుగుచున్నది. అయినను స్వతంత్రములైన యితరాధారములు లేక మధ్యకవులను బేర్కొనక పోయినంతమాత్రమున నితఁడు మధ్యకవి యని నిశ్చయించుటకు వలనుపడదు. కాని యితఁ డిన్నూఱుసంవత్సరముల క్రిందటివాఁడని యైనను జెప్పవచ్చునని తోఁచుచున్నది. ఈతఁడు రచియించిన ధనాభిరామము కథ కొంతవఱకు మనోహరముగా నున్నది. ఇంద్రసభామందిరమునందు మన్మథునికిని కుబేరునికిని రూప మెక్కువ యనియు ధన మెక్కువ యనియు వివాదము సంభవించి వారితగవు మాటలతో తెగనందున—

చ. తరమిడి యిన్నిమాటలు వృథాపనిలేక సమస్తవైభవో
త్కర మగుదాక్షవాటిపురి గల్గు ధరాస్థలిలోనఁ బోయి నీ
నిరుపమరూపసంపదయు నేరుపుఁ జూపుము నేను వచ్చి యా
పురవరసీమఁ జూపెదను భూరిధనంబున నామహత్త్వమున్.

అని కుబేరుఁడు మన్మథునిజూచి, 'మాటలతోఁ బ్రయోజనము లేదు. మన మిద్దఱము భూమిమీఁద దాక్షారామములోఁ బుట్టుదము. అక్కడ నీవు మొట్టమొదట నీసౌందర్యమును నేర్పునుజూపుము. తరువాత నేను వచ్చి నాధనమహిమను జూపెదను. అప్పుడు మనయిద్దఱిలో నెవ్వరు బలవత్తరులో తేటపడి రూపమహిమ యెక్కువయినదియు ధనమహిమ యెక్కువైనదియు వెల్లడియగును' అని పలుకఁగా మన్మథుఁ డాతని యాహ్వాన మంగీకరించి పూర్వకాలమునుండియు నేర్వులచేఁ బ్రసిద్ధమయిన నదాక్షవాటికకుఁ బోయి యందుఁ దన రూపవిశేష

మును జూపఁగా నాట్యమునకయి భీమేశ్వరస్వామి యాలయమునకుఁ బోయిన సుగుణావతి యను పణ్యాయువతి యాతనిని గాంచి కామించి యింటికిఁబోయి యాతనిం దనయింటికిఁ దోడితెమ్మని తన చెలికత్తెను వేఁడుకోఁగా నావయస్య-

ఉ. అక్కట వాసివన్నె గలయట్టికులంబునఁ బుట్టి రూపుచే
నెక్కుడు భాగ్యసంపదల నెన్నిక కెక్కినదాన వింతలో
నెక్కడివానికి న్వలచి తెయ్యదొ వానికులంబు విన్న వా
రొక్కట నవ్వరే విషవు ముత్పలలోచన నీకు మ్రొక్కెదన్.

ఉ. నిచ్చలు నిండి వల్లభులు నీకడ గానఁగలేక కానుకల్
తెచ్చి తమంతఁ గ్రందుకొని తేమఁవ మోసలఁ గాచుచుండఁగాఁ
జెచ్చెరవారలన్ ఘనము చేయక డాయక యూరకున్నచో
నొచ్చెముకాదె నీకును బయోరుహలోచన యిప్పురంబునన్.

చ. కలికితనంబుమీఱఁగ వికారముతోడ మనోజకేళి ని
చ్చలుఁ దమకంబుపుట్టి విటసంఘము తెచ్చియొసంగునీమహో
జ్జ్వలమణిభూషణాదిఘనవస్తువు లొందుట కీర్తిగాక తా
వలచుట వంతమూ ధరణి వారవధూమణికిం దలోదరీ.

అని యపారధనము నిచ్చెడు విటు లనేకు లుండఁగా ధనమియ్య జాలని క్రొత్తవానిని కేవలరూపసంపదను జూచి వలచుట వారకాంతకు ధర్మముకాదని బుద్ధి చెప్పియుఁ గార్యము గానక తుదకు మన్మథుని దానియింటికిఁ దెచ్చి యప్పగించెను. సుగుణావతియు మన్మథుఁడును గొంతకాల మీప్రకారముగా సుఖ మనుభవించుచుండఁగా, కుబేరుఁడు యోగివేషమునవచ్చి భీమేశ్వరస్వామి యాలయమునఁ జేరి యచ్చటికి వచ్చెడు వేశ్యలకెల్లను ధనమును చీరలును కొల్లఁగా నొసఁగసాఁగెను. అంత సుగుణావతి తల్లియు నొకనాఁ డచ్చటికిఁ బోయి యాతఁ డిచ్చిన ధనకనకాంబరములను దెచ్చి కూఁతునకుఁ జూపి బోధించి మతివిఱిచి

రూపవంతుఁ డయిన మారుని విడనాడి విత్తవంతుఁడైన కుబేరునిఁ గూడున ట్లాగుణవతి నొడఁబఱిచెను. అంతట మన్మథుఁ డోడి పోయి దేవాలయముచేరి భీమేశ్వరస్వామిని బ్రార్థింపఁగా నతఁడు సాక్షాత్కరించి, యొకప్పుడు ధనమును మఱొకప్పుడు రూపమును విజయము నొందినను మొత్తముమీఁద ధనసౌందర్యములు రెండును సమానములే యని తెలియఁబలికి వారిరువురిని సమాధానపఱిచి వారి స్థానములకు వారిని బంపివేసెను. ఈపుస్తకము చిన్నదే యయినను, కవిత్వము హృద్యముగానే యున్నది. తెలిసి జూపుటకై ధనాభిరామమునుండి రెండు పద్యముల నిం దుదాహరించుచున్నాను.

చ. మదనునిగాఁ దలంతు రిల మానిను లెల్లను, సత్కవీశ్వరుల్
పదపడి కర్ణుఁ డీతఁడని ప్రస్తుతిచేయుదు రాత్మఁగోపలన్
మదవదరాతివర్గములు మానుగఁ గవ్వడి యండ్రు, భూజనుల్
మది దిననాథుఁ డందురు,సమస్తము ద్రవ్యముఖంబు చూచినన్. ఆ. ౧

మ. కమనీయంబుగ నాడఁ బాడఁ జదువంగా నేర్చు వీణాది వా
ద్యములన్నైపుణి సొంపుమీఱఁగఁ గళాస్థానాంగతంత్రంబులన్
సుమనస్స్ఫూర్తిమనోజకేళి విటులం జొక్కింపఁగా నేర్చు వి
భ్రమసౌందర్యముల న్వహించు సరిచెప్పన్ లేరు నాపుత్త్రికిన్. ఆ.3.

# 7. సముఖ వేంకటకృష్ణప్పనాయకుఁడు

ఈకవి యహల్యాసంక్రందన మను మూడాశ్వాసముల ప్రబంధమును రచించెను. ఇతఁడు శూద్రకులజుఁడు; సముఖ మీనాక్షినాయకుని తనుజుఁడు. "శ్రీమత్పాండ్య మండలాధీశ్వర విజయరంగచొక్కనాథ మహీనాథ కరుణాకటాక్ష సంపాదిత గజతురంగమాందోళికా ఛ్ఛత్ర చామరవిజయ దోహాళకాహాళభూరిభేరీ బిరుదధ్వజప్రముఖ సకలసంపత్పారంపరీసమేత" అని యాశ్వాసాంత గద్యమునందుఁ జెప్పుకొనుట చేత కవి మధురాధినాథుఁ డయినవిజయరంగ చొక్కనాథునికాలములో నున్నవాఁ డనుట స్పష్టము. ఈవిజయరంగ చొక్కనాథుఁడు క్రీస్తుశకము ౧౭౦౪ వ సంవత్సరము మొదలుకొని ౧౭౩౧ వ సంవత్సరము వఱకును పాండ్యమండలాధీశ్వరుఁడుగా నుండెను. కాఁబట్టి కవియు ౧౭౦౦ సంవత్సరప్రాంతములనుండి యున్నవాఁడే. ఇతఁడు జైమినిభారతమును వచనకావ్యమునుగా రచించినట్లహల్యాసంక్రందనములోని యీక్రింది పద్యమువలన తెలియవచ్చుచున్నది—

గీ. సముఖమీనాక్షినృపగర్భవిమలజలధి
చంద్ర వేంకటకృష్ణేంద్ర శౌర్యసాంద్ర
మునుపు జైమినిభారత మనఘ వచన
కావ్య మొనరించినట్టి సత్కవివి కావె.

ఈ కాలమునందే మంచికవులచేత తెలుఁగున వచనకావ్యము లారంభింపఁబడినట్లు వినఁబడుచున్నవి కాని యావచనకావ్యము లిప్పుడు కానరావు. తారాశశాంకము రచించిన శేషము వేంకటపతి యీకవి కాలమునం దుండినవాఁడు. కవి తాను "పురోహితభృత్యామాత్య సామాజిక బంధువర్గంబులు కొలువం గూరుచుండి యుభయభాషాకవితా

విశేషుండై శేషము వేంకటపతికవీంద్రుం డాప్తసఖుంను గాఁ బిలి పించి” నపు డతఁ డీక్రిందిపద్యమును జెప్పెనఁట—

చ. నల నాసత్య వసంతులం గెలుచుసౌందర్యంబు ధైర్యంబు దో
ర్బలముఁ స్వామిహితానువృత్తినయముఁ బ్రాభవ్యము న్విద్యయున్
వెలయఁ బాల్యమునందె నీవు మధురోర్వీనాథు మెప్పింపవా
బళిరా వేంకటకృష్ణభూవరమణీ బాహాహణీగ్రామణీ.

అహల్యాసంక్రందనములోని రెండుపద్యముల నిం నుదాహరించు చున్నాను—

ఉ. బంటుతనంబు లాడుకొని పాఱగు రావణుచేతిపెట్టునన్
గంటికి నీరు గ్రమ్మఁ గలఁకంబడి పాఱెను నీకుతండ్రి నీ
యింటను లేదు పౌరుష మొకింతయు బీరములేల చేతివా
లంటకు కోడెకాఁడ చుఱు కంటఁగ వెంటనె చెంపఁగొట్టెదన్. ఆ. ౧

ఉ. ఆతతి నాలతాంగిని మహాగ్రహదృష్టిని జూచియోసి నీ
చేతిజలంబు లంట సెకఁ జెల్లునె యెంతటిజాతనే బలా
రాతినిగూడి తీ విపుడు రాతిరిజామునఁ గావ్రునన్ బలా
రాతిశరీర మందు మని రాజముఖిన్ మునిఖ్ శపింపఁగన్. ఆ. 3.

# 8. రోసనూరి వేంకటపతి

ఈకవి విష్ణుమాయావిలాస మను మూడాశ్వాసముల పద్య కావ్యమును రచియించి దానిని వేంకటగిరిసంస్థానప్రభువయిన శ్రీవెలు గోటి బంగరు యాచమనాయని కంకితము చేసెను. ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; లింగనామాత్యుని పౌత్రుఁడు; గంగనమంత్రి పుత్రుఁడు; కాశ్యపగోత్రుఁడు. కృతిపతి తండ్రియైన కుమారయాచ భూపాలుఁడు తనకు “త్రిక్కయజ్వ” యను బిరుదము నిచ్చినట్లు కవి యీపద్యమునఁ జెప్పుకొన్నాఁడు—

మ. నను శ్రీభూపతిలింగపాదభజనానందున్ గుమారేచ భూ
జనపాలాగ్రణి తిక్కయజ్వ యనుచుం జాలంగఁ బేరిచ్చి ప్రో
చినఁ బెంపొందినరోసనూరికులుసిన్ శ్రీవేంకటాఖ్యుం గృపా
ఘనగంభీరశుభైకదృష్టి వెలయంగాఁ జూచి పల్కెం దగన్.

కృతినాయకుఁడైన బంగరుయాచమనాయఁడు ఔరంగజేబు ఢిల్లీచక్రవర్తిగానున్న కాలములో ౧౬౭౪ వ సంవత్సరమునందు వెల్లూరినబాబగు జుల్ఫగారుచేఁ జంపఁబడినందున ఈపుస్తకము ౧౬౭౦ వ సంవత్సరప్రాంతములయందు రచియింపఁబడిన దని చెప్పవచ్చును. (వేంకటగిరిసంస్థానప్రభువు లనేకులు తెలుఁగుభాషయం దభిమానము గలవారయి కవులను బ్రోత్సాహపరిచి తా మనేక ప్రబంధములకుఁ గృతిపతులయిరి. వీరు పద్మనాయకవంశజు లయినవెలమలు. ఈసంస్థానమును స్థాపించిన మూలపురుషుఁడు బేతాళనాయఁ డనుబిరుదనామము గల చెవిరెడ్డి. ఇతఁడు చేయూరి పోలిరెడ్డికుమారుఁడు. ఇతఁడు తన నివాసస్థల మైన యనుమగల్లు గ్రామమున రేచర్ల యాచఁడు (పెచఁడు) అను మాలవానిచేత దనపొలమును దున్నించుచుండఁగా నాగటికఱ్ఱున కొకరాగిశాసనము తగిలెను. దానిని జదివిచూడఁగా నందు "నాగభైరవపొలము" అనెడి యాచోట తొమ్మిదిలక్షలధనము భూస్థాపితమయి యున్నదనియు, నరబలి యిచ్చినపక్షమున బలియిచ్చినవానికా ధనము దక్కుననియు, వ్రాయఁబడియుండెను. అతఁ డప్పు డేమి చేయుటకును తోఁచనివాఁ డయి యేచనితో నాలోచింపఁగా, వాఁడా స్థలమునందుఁ దనయింటిపేర నొక గ్రామము కట్టించి తనయింటిపేరును గోత్రముగా బెట్టుకొని వంశమునందుఁ బుట్టినపురుషుల కెల్లను దనపేరు పెట్టుచు వివాహము చేయవలసి వచ్చినప్పుడెల్ల ముందుగా దనకులజులలో నొక్కనికి వివాహముచేయుచు వచ్చుట కంగీకరించినపక్షమునఁ దాను బలియగుట కొప్పుకొనెద నని రెడ్డితోఁ జెప్పెను. చెవిరెడ్డియు

వాఁడు కోరిన నియమముల కన్నిటికి నొప్పుకొని యప్పుడే వాని నాపొలమునకు బలిపెట్టి గ్రామవిక్షేపమును స్వాధీనము చేసికొనెను. తరువాత నతఁ డాక్షేత్రమున రేచర్ల యను గ్రామమును గట్టించి, తనగోత్రమును రేచర్లవారని మార్చుకొని, ఆయూరు విడిచి పిల్లలమఱ్ఱి యను గ్రామముచేరి యాచోటు నివాసముగా జేసికొనెను. ఈగ్రామమునం దితఁ డొకనాఁడు రాత్రి చీఁకటి పడువఱకును పొలములో బనిచేసి యింటికి వచ్చుచుండఁగా దారిలో నురుములతోను మెఱుపులతోను గొప్పవాన వచ్చెను. ఆవానలో నతఁ డొక మఱ్ఱిచెట్టుక్రిందికిఁ బోయి నిలువఁబడియుండఁగా, చెట్టుమీఁదినుండి యొకభూతము దిగివచ్చిన ట్లాతనిదృష్టికిఁ గనఁబడెనఁట! అతఁ డెంతమాత్రమును జడియక చేత ఖడ్గము ధరించి యెదురుగా నడువఁగా, అతని ధైర్యసాహసములకు మెచ్చి యాబేతాళుఁడు చెవిరెడ్డియు నాతని సంతతివారును శౌర్యసామ్రాజ్యైశ్వర్యవంతు లగుదురనియు శత్రువులతోడి యుద్ధములలో నెల్ల దాను దోడ్పడి వారికి జయము కలిగింతుననియుఁ బలికిన ట్లాతని చెవులకు వినఁబడెనఁట! బేతాళుఁ డాతనికి బ్రత్యక్షమయి వరములిచ్చెనన్న వార్త దేశమునం దంతటను వ్యాపించి యచిరకాలములోనే కాకతీయ ప్రభువయిన గణపతిరాజు చెవినోఁకఁగా, అతఁ డాచెవిరెడ్డిని తనరాజధాని యైన యోరుగల్లు నగరమునకు రప్పించి లక్షరూపాయలు నచ్చు గ్రామములిచ్చి తనవద్ద సేనాపతినిగా నియమించి "పిల్లలమఱ్ఱి బేతాళ నాయఁడు" అన్న బిరుదుపే రిచ్చి గౌరవించెను. ఇది ౧౨౧౦ వ సంవత్సరప్రాంతమయి యుండును.

ఈతఁడు చేసిన నియమముల ననుసరించి యాతనివంశమువారు నేటివఱకును యాచనామమునుగూడ దమపుత్రుల నామమునకుఁ జేర్చుచు, తమయింట వివాహము జరపుటకు ముందుగా నొక మాలవానికి బెండ్లిచేయుచు, పూర్వమర్యాదను జెల్లించుచున్నారు. చెవిరెడ్డి

యొక్క ద్వితీయపుత్రుఁ డయిన ప్రసాదాదిత్యనాయఁడు గణపతిరాజు యొక్క మరణానంతరమునం దాతనిభార్యకును బుత్రికకును సహాయుఁ డయి యుండి రాజ్య మన్యాక్రాంతము కాకుండఁ గాపాడి కాకతిరాయ రాజ్యప్రతిష్ఠాపనాచార్యుఁడని బిరుదందెను. చెవిరెడ్డి యింటిపేరు రావు వారు. ఈరావువారు మొదట నోరుగల్లురాజ్యముననేయుండి పేరొంది నను, తరువాత దమపౌరుషమువలన నన్యభూము లాక్రమించుకొని సంస్థానప్రభువులయిరి.) ఈవంశమువారిలో నొకఁ డగు తిరుమలనాయఁడు కృష్ణదేవరాయల రాజ్యకాలములో వెలుగోటిరాజ్యమును సంపాదించి వెలుగోడుపట్టణము తనకు రాజధానిగాఁ జేసికొన్నందున, ఆతనివంశము నా రప్పటినుండియు వెలుగోటివా రనఁబడుచున్నారు. విష్ణుమాయా విలాసకృతిపతియొక్క తాతయైన పెద్దయాచమనాయఁ డావల కన్యా క్రాంతమయిన వేంకటగిరిపురమును మరల స్వాధీనపఱచుకొని దానిని స్వరాజధానిని జేసికొనఁగా నాటినుండియుఁ దత్సంతతివారి కదియే రాజ ధానిగా నున్నది. చెవిరెడ్డి వంశజులలోనొక్కఁడగు సర్వజ్ఞ సింగమ నాయఁడు బమ్మెర పోతనామాత్యునివలన నుద్దండభోగినీదండకమును శ్రీనాథునివలన గొన్నికృతులను బొందుటయేగాక తాను పండితుఁడయి సింగభూపాలీయ మను నలంకారశాస్త్రము మొదలగు సంస్కృతగ్రంథ ములను సహితము రచించెను. ఆతని వంశజులలో నొకఁ డగు రాయప నాయఁడు ౧౬౨౦ వ సంవత్సరప్రాంతములయందు భానుమతీపరిణ యము కృతినందెను. ఈవెలుగోటివా రిప్పటికిని తెనుఁగుకవుల నాద రించుచున్నారు. కవిత్వరీతి తేటపడుటకయి విష్ణుమాయావిలాసములోని రెండు పద్యములఁ జూపుచున్నాను—

చ. ఇటువలెనేమి యీపయన మిప్పుడు మీ రఖిలేశ మాయలన్
బటువగు విష్ణుఁడం చనెడుపల్కులు సిద్ధము సుందరీ కిదా

కుటిలక్రోధయైన హరి గొబ్బునఁ జూచితి నేని మాకు నొ
క్కటఁ జపలత్వ మైనతటి గౌరవ మెట్లగునో తలంపుఁడీ. ఆ. ౧.

చ. వనయువతీవసంతులవివాహమహోత్సవ వేళ నెమ్మదిం
దనరు కుతూహలంబున లతాలలనల్కరపల్లవంబులన్
ఘనముగ సేసవెట్టుటకుఁగా ధరియించిన మౌక్తికంబులో
యన విలసిల్లె నెల్లెడ మహాసుకుమారకకోరకావళుల్. ఆ. ౩.

---

# 9. పైఁడిపట్టి వేంకటపతి

ఈకవి చంద్రాంగదచరిత్ర మనెడి యాఱాశ్వాసముల ప్రబంధమును రచించి యున్నాఁడు. ఈతని కవిత్వము మిక్కిలి ప్రౌఢ మయి రసవంతమయి పూర్వకవుల రచనవలెనె హృదయాహ్లాదకర మయినదిగా నున్నది. ఇతఁడు తన గ్రంథమును శ్రీరామాంకితము చేసియుంటచే కృతిపతినిబట్టి యీతని కాలనిర్ణయము చేయుట కాధారము కనఁబడ లేదు. ఉన్నయాధారమంతయు కృతికర్త తనవంశవర్ణనము చేసికొన్న యీక్రింది పద్య మయియున్నది—

సీ. సకలసత్కవిపూజ్యసుకవిత్వసామ్రాజ్యనిర్వాహకుఁడు పెద్ద పర్వతన్న
వివిధభాషావార్యవిరచనాచాతుర్యసర్వంకషుఁడు బోడిపర్వతన్న
వరపద్యదాకార వాచాచమత్కారనిరుపమమతిశాలి తిరుమలన్న
యవధానకృతిగర్భ కవితాచ్ఛసందర్భ కీర్తితప్రజ్ఞుండు కేశవన్న
దనకు నన్నలుగాఁగను దనరుకృష్ణ
రాయభూషణకులరామరాజతనయ
కేశవాత్మజ పర్వతాధీశు వేంక
టాద్రి నిదె కావ్య మేనిత్తు నంకితముగ.

ఇందలి పేరులనుబట్టియు కవికాల మిదియని నిశ్చయించుట కాధారము దొరకలేదు. ఇందు 'కృష్ణరాయభూషణ' యను పదముండు టనుబట్టి కర్నల్ మెకంజీవారగారు సంపాదించిన లిఖితపుస్తకముల పట్టికలో కవి కృష్ణదేవరాయని కాలములోనివాఁ డని చెప్పఁబడి యున్నది. ఇటీవల బ్రౌన్ దొరగారు తమ నిఘంటువునం దీకవి యాధునికుఁడని వ్రాసి యున్నారు. పయి పద్యములో నున్న కృష్ణరాయభూషణశబ్ద మీకవికి కృష్ణదేవరాయని యాస్థానమున కలంకారముగా నుండుటచేత నే వచ్చినను ఈకవి కృష్ణరాయభూషణుని వంశజుఁ డగురామరాజుకొడుకైన కేశవార్యుని పుత్రుఁడగు పర్వతాఖ్యునిసుతుఁడగు వేంకటపతి యగుటచే గృష్ణదేవరాయని యనంతరమున నెక్కుడుతరములు గడచిన తరువాత నున్నవాఁడగుట స్పష్టము. అప్పకవి యీచంద్రాంగదచరిత్రములోని పద్యముల నుదాహరించి యుండకపోవుటచేత నీకవి ౧౭౨౦ వ సంవత్సరమునకు దరువాతివాఁ డనియు నూహింపఁ దగియున్నాఁడు. అందుచేత కవి ౧౭౭౦ వ సంవత్సరప్రాంతములయం దున్నవాఁడని తోఁచుచున్నది. చంద్రాంగదచరిత్రమునుండి కొన్ని పద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. అప్పచు లాడుచుఁ జగవు లాడుచు బారలు సాఁచిసాఁచి మా
యప్పలు వచ్చి రంచు సకియ ల్గనుదమ్ములు మోడ్చి పిల్వఁగా
నుప్పునఁ దప్పుతప్పు టడుగుల్ నడలం గొమరుండు పైఁబడుం
దప్పక చూచుతల్లికిని దండ్రికి ముచ్చట తీఱునట్లుగన్—ఆ. ౨

మ. హరిబ్రహ్మాలం గడుపోటుబంట నయి గర్వాలాపము ల్మున్ను స
త్వరతం బల్కితిఁ గొన్ని నోరికాలఁదుల్ తథ్యంబు నేఁ డన్నియుక్
బరఁగం బందకుఁ జెప్పునాధనగతిన్ బాటిల్లె వ్యర్థంబులై
సురలోకంబున కేను రిట్లు సవయన్ను ల్పన్నల న్నవ్వఁగన్—ఆ.3

సీ. భుజగలోకాధీశ భోగతల్పశయాన హరిరూపధరమహాపురుష యనుచు
సత్తులార్థమకుటవర్ణితపాదరాజీవ రామార్చనీయ శ్రీరంగ యనుచు
మారీచమదభంగ మహితవాయవ్యాస్త్ర శరదనిద్రితనేత్ర శౌరి యనుచు
సముద్రగవర్షావసర యోగనిద్రాణ కరిరాజవరద శ్రీకాంత యనుచుఁ
దలఁతు నుబుకును నలుతు శ్రగ్గిలుచుఁబలుకు
సఖులనయనస్వరశిరోజచరణకలన
పవనకందర్పఘనహంసజవనతురగ
భటనటప్రియసముదాయఘటిను వోఁప—ఆ. ౪

ఉ. ఓరిమృగాంక నాజడకు నోడినరాహువు కీన్కు నంకమున్
పేర విసంబు నీయొడలఁ జేరఁగఁ గోరలకొద్ది నొక్కి దు
ర్వారపజత్వదీయకరవారవిషంబుల నొంచసాఁగఁ బె
న్వారముఁ బూని యిప్పు డిది నీదగుచేతఁగఁ జూడ కెమ్మొయిక్. ఆ-౫

---

# 10. వెలగపూడి కృష్ణయ్య

ఈ కవి భానుమద్విజయమనెడి యైదాశ్వాసముల ప్రబంధము రచియించెను. మఱియు నితఁడు మాలతీమాధవీయము, గాళికాశాస్త్రము, చతుర్విధకందశతకము అను పద్యకావ్యములను, వేదాంతసారసంగ్రహ మను వచనకావ్యమును, రచించినట్లు భానుమద్విజయములోని యీ క్రింది పద్యములోఁ గవి చెప్పుకొనియున్నాఁడు—

సీ. మహిలోన మాలతీమాధవీయ మనంగ శృంగారకావ్య మొనంగఁజేసి
గాళికాశాస్త్రంబు కడులోకహితముగా నెనయ నేకాశ్వాసమున రచించి
పరిఢవిల్లఁగఁ గందపద్యపుశతకంబు నాల్గుయోగంబుల ననువుపఱిచి
సన్నుతవేదాంతసారసంగ్రహశాస్త్ర మమరంగ వచనకావ్యంబొనర్చి

చాటుకృతులను మఱికొన్ని సంఘటించి
యామకాంకిత మొనరించి మంచిపుణ్య
శాలియగు గిరిగౌరీసహస్థ సహస్రనామ
మధురవాక్సాంద్రకృష్ణయామాత్యచంద్ర.

పూర్వ మీతని వంశపువారు గాంగేయోపాఖ్యానము, సుమంతో దయము, ఆంధ్రకర్ణామృతము, వజ్రభకోపాఖ్యానము, సేతుమాహాత్మ్యము, దత్తాత్రేయచరిత్రము, మర్యాద రామసచివచరిత్రము, మొదలగు గ్రంథములను రచియించి యుండినట్టును గవి యీ క్రింది పద్యములతోఁ జెప్పియున్నాఁడు—

క. భూనుత గాంగేయోపా। ఖ్యానసుమంతోదయాంధ్రకర్ణామృతముల్
మానిత వజ్రభకోపా। ఖ్యానము శుభహేతు సేతుమాహాత్మ్యంబున్.

క. దత్తాత్రేయచరిత్రన్। సత్తగు మర్యాదరామసచివచరిత్రన్
బెత్తరపుఁ గృతులు చేసిన। యుత్తమకవు లెల్లమీకులోద్భవులగుటన్.

ఈ కవి యాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు; లోహితసగోత్రుఁడు; వెల్లపూడి నారసింహార్యపౌత్రుఁడు; నరహరిమంత్రి పుత్రుఁడు. ఈ కవి పాండ్యమండలాధీశ్వరుఁడైన విజయరంగ చొక్కభూపాలుని దండనాధుఁడగు సాంబయామాత్యుని పుత్రుఁడగు గోవిందయామాత్యునికి మేనమఱఁదియైనట్లీక్రింది పద్యమునఁ జెప్పుకొన్నాఁడు—

సీ. పాండ్యభూమండలాఖండలుండైన విజయరంగ చొక్కభూజాని కాప్త
మండనుండగు సాంబదండనాథాగ్రణితనయులలో మేటిదండి యగుచు
సంగీతసాహిత్యసంస్కృతాంధ్రకవిత్వపరసజ్ఞుఁడై మేనమఱఁదియగుచుఁ
గొమరొప్పుచుండెడుగోవిందయామాత్యుఁడనుపమవిద్యాధికాగ్య

సభను

నింకుకొలు వుండె నప్పుడు నేదంటఁ జేరి
సారసల్లాపముల మీాఱి చతురమతిని
దక్షిణామూర్తికృపను బ్రత్యక్షమగుచుఁ
గృతిపతిత్వంబుఁ గోరుసంగతిని దెలుప.

ఇందుఁ బేర్కొనఁబడిన విజయరంగ చొక్కభూపాలుండు దక్షిణ మధురాపురము రాజధానిగా పాండ్యమండలమును క్రీస్తుశకము ౧౭౦౬వ సంవత్సరము మొదలుకొని ౧౭౩౧ వ సంవత్సరమువఱకును పాలించిన శ్రీవఱకే చెప్పఁబడెనుగదా? అందుచేత నీకృష్ణకవియు నాకాలపువాఁడే యని వేఱుగఁ జెప్పనక్కఱలేకయే తెలిసికోవచ్చును. కవి సాంబదండ నాథుని వర్ణించుచు—

సీ. సరిజేటిమూర్కాటిసాదులాఖానుతో ఘటియించె నివ్వాఁడు ఘనత మీాఱఁ

బేర్మిదంజావూరిపేషువాయానందరావును నెవ్వాఁడు రహిఁ నడంచె
మయిసూరినంజరాజయగారిప్రియవాక్యసంధికి నెవ్వాఁడు శక్తిదాల్చె
* * * నగుపరాగి శ్రీపళ్లపన సాంబశౌరి.

అని యతఁడార్కాటినవాబగు సాదతల్లాఖాను మొదలగువారి నోర్చినట్లు చెప్పియున్నాఁడు. ఈసదతల్లాఖాను ౧౭౦౦ వ సంవత్సరము మొదలుకొని ౧౭౩౨ వ సంవత్సరమువఱకును నవాబుగానుండి యార్కాటురాజ్యము చేసెను. కాఁబట్టి కవి ౧౭౨౦ వ సంవత్సర ప్రాంతమునందు మధురాపురములో భానుమద్విజయమును రచియించి యుండును. ఈతనికవిత్వము రసవంతమైనది. కవితాధోరణి తెలియుటకై భానుమద్విజయములోని రెండు పద్యముల నిందుదాహరించుచున్నాను-

ఉ. ఏమియు లేనివానులె యహీనమతిభ్రమ లందుచుండఁగా
భూమిపతిత్వ మొందినప్రభుల్ వ్యసనంబులఁ గాంచుటబ్రమే?

మేమయిన న్నుమేరుధృతి నేర్పడఁబూని సమస్తకార్యముల్
తాము వహించిచూడమిని ధాత్రి యరాజక మౌను భూవరా. ఆ-౨

మ. గిరులం బాఱడిమేఘులట్లుగ వడిం గీల్కొన్నకన్నీరు లా
గురువక్షోరుహతారహారములతోఁ గూడం బ్రకాశింప నా
ధరణీశాంగన దుస్సహాత్మగతసంతాపంబుచే నెచ్చి భా
స్వరవాసంతపికీస్వరాకలితవాచామాధురీనై ఖరిన్. ఆ. ౪.

---

# 11. శేషము వేంకటపతి

ఇతఁడు శశాంకవిజయ మనెడి యైదాశ్వాసముల శృంగారప్రబంధమునుజేసి వంగలసీనయార్యున కంకితము చేసెను. శశాంకవిజయము నకు తారాశశాంకమని నామాంతరము గలదు. ఇందుఁ జంద్రుఁడు బృహస్పతివద్ద విద్యాభ్యాసమునకయి చేరి గురుపత్నియగు తార నింటి నుండి లేవఁదీసినకథ మిక్కిలి పచ్చిగా వర్ణింపఁబడినది. ఈ శేషము వేంకటపతి నియోగి బ్రాహ్మణుఁడని తోఁచుచున్నది. ఇతఁడు కందాళ రామానుజాచార్యుని శిష్యుడు; కృష్ణయార్యుని కుమారుఁడు. కృతి నాయకుఁడు తన్నుఁ బిలిపించి పలికినట్లు చెప్పఁబడిన యీక్రింది పద్యము లలో కృతిపరంపరలు చేసినట్లు కవి చెప్పుకొనుటయేకాని యొక్కగ్రంథమునైనను జేకొనియుండలేదు.—

క. ఘను రంగేశ్వరపదయుగ । ఘనతరభజనానిరూఢకవితాసామ్రా
జ్యుని శేషముకృష్ణసుధీ । తనయునిఁ బిలిపించి పలికె దయదైవారన్.

చ. అసదృశభక్తి సద్గురుకటాక్షముఁగాంచి సమంచితాత్మశక్
బిసరుహమాకరందరసపేశలకౌశలవక్త్రసూక్తులన్
రసికుల కింపుగాఁ గృతిపరంపరలన్ రచియించి కీర్తిచే
నెసఁగితివయ్య వేంకటపతీ బళి శేషమువంశసత్కృతీ.

ఈకవి పాండ్యమండలాధీశ్వరుఁడైన విజయరంగ చొక్కనాథుల కాలములో నున్నట్లీవరకే సముఖ కృష్ణప్పనాయకునిగూర్చి వ్రాయున ప్పుడే చెప్పఁబడెనుగదా! కవియు తారాశశాంక కృతినాయకుఁడైన వంగల సీనయార్యుని వర్ణించుచు, అఖండమండిత మహీమండలమండనా యమానపాండ్యమధురాధరాఖండల శ్రీవిజయరంగచొక్కనాథ మహీ నాథ కృపాకటాక్ష వీక్షణానుక్షణ వర్ధమాన......నిఖిల సంపత్పరం పరాకంపితనిలింపనాయకుండని యతనికొక విశేషణమును బ్రయోగించి యున్నాఁడు. మఱియు ద్వితీయాశ్వాసారంభమున

క. శ్రీవిజయరంగచొక్క। క్ష్మావిజయ గురుప్రసాదసంపన్నిత్యా
శ్రీవరదాచార్యమణీ। శ్రీవరదా సైన్యకకృత్య సీనామాత్యా.

అని కృతిపతిని సంబోధించియున్నాఁడు. దీనినిబట్టి కవి విజయ రంగచొక్కనాథుని కాలములో మధురలో నుండుట నిశ్చయమగుట చేతను, ఆరాజు ౧౭౦౪ వ సంవత్సరము మొదలుకొని ౧౭౩౦ వ సంవ త్సరమువరకును రాజ్యముచేసినవాఁడగుటచేతను, శేషము వేంకటపతి యాకాలమునందున్నట్లు స్పష్టమగుచున్నది. అక్కడక్కడ వ్యర్థకసంధి మొదలయిన కొన్ని లక్షణదోషము లున్నను, కవిత్వము మొత్తము మీఁద ద్రాక్షాపాకమయి మిగుల రసవంతమయియున్నది. చక్కెరమెత్తిన విషమువలె నీతిమాలిన యీ కథ మనోహరములయిన తేటమాటలతో నింపుగా చెప్పఁబడినందున, అనేకులయిన యౌవనపురుషుల నాకర్షించి పాడుచేయుచున్నది. దుర్నీతిని వర్ణించునప్పు డీకవి తన యసమ్మతిని దెలుపు వాక్యముల నెక్కడను బ్రయోగింపక, "లోకములోనఁ గొంద అబలుల్........తాటాకులలోన వ్రాసిరి పరాంగనఁగూడినఁ బాప మంచు" "ఎన్నిపువ్వులఁ ద్రావలను తేఁటి యట్లుమగవాఁడనువానికి దోస మున్న దే?" యిత్యాది వాక్యరత్నములచేత వలపుగలచోటఁ గలయు టయే పరమార్థమన్నట్టు తెలిపి పామరులను భ్రమింపఁజేసి యున్నాఁడు.

రంభను మంచిదని సాధించుటకు సహితము మనవారికి పురాణముల నుండి దృష్టాంతములు తండోపతండములుగా దొరకుననుట క్రిందిపద్యమును నిదర్శనముగాఁ జూపవచ్చును:—

సీ. కన్నకూఁతు రటంచు నెన్నక భారతీతరుణిఁ గూడఁడె నీపితామహుండు
మేనత్త యనుమేరమీఱి రాధికతోడ నెనయఁడే నిన్ననీయనుఁగుబావ
వదినెయంచు నొకింత వావి లేకయె జ్యేష్ఠునెలఁతతోఁ బొందఁడే
నీగురుండు
మునిపత్నియనక యహల్యనుబట్టఁడే నీదుపక్షపాతి యగుపాకశాసనుండు
యిట్టిమీవారినడతలు కట్టిపెట్టి
యమ్మనేచెల్ల న్యాయంబు లాడెదౌర!
కడకు నీఱంకు నీవెఱుంగనివిధాన
దూఱెదవు నన్నుఁ జలపోరి దోసకారి!

"మున్నలదారుకావనస్త్రీలు గిరీశునిం గలియరే? వ్రజభామలు శౌరిఁగూడరే? మాలలనాశిరోమణుల కందును సందును నేమిచెప్పుమా" యఁట! ఆహా! ఏమి యీదేవత్వలక్షణము! దేవత్వమున కెప్పుడును శుద్ధచరిత్రమే లక్షణముగా నుండవలయును గదా? నీతిమాలి యన్యకాంతలఁ గలయుటకంటె నాసురకృత్యము మఱియేముండును?

ఉ. ఎంచఁగరానిమోహమున నే నిటు పిన్నటనాఁటనుండియున్
బెంచితిఁ బెద్దఁజేసితిని బేర్మిగఁ బ్రాయము వచ్చినంతనే
యెంచక మాటలాడెదిపు డిన్నిప్రియోక్తుల కిమ్ముపుట్టెఁగా?
మంచిది నిన్నుఁ గూడుటకు మాకు స్వతంత్రత లేకపోయెనే?

గురుపత్ని శిష్యునిఁ జిన్ననాఁటనుండియుఁ బెంచి పెద్దవానిని జేసెనఁట! అందుచేత నామె కాతనిఁగూడుటకు స్వాతంత్ర్యము గలదఁట! ఏమి యీదుర్నీతి! దుర్నీతి యింతకంటెను దూరముపోవుట సంభవింపనేర్చునా? కృతయుగమునం దైనను కలియుగమునం దైనను

జారత్వ మెప్పుడును మొదలంట నశింపదు. కృతయుగపు తారలును చంద్రులును మన యీకలియుగమందును గలరు. అయినను మన యీపాడు కలియుగమునందుమాత్ర మిల్లువిడిచి లేచిపోయినదానిని మగని కిప్పించుటకయి పెద్దమనుష్యులుపోయి జారుని బతిమాలుటయు, మగని కిప్పించిన యీఅంకుటాలికి సంతానము కలిగినప్పుడు జారపురుషుఁడువచ్చి పుట్టినబిడ్డ కయి యింటిమగనితో తగవులాడుటయు లేవు. ఇవి కృతయుగధర్మములు కాఁబోలును! దూరపుకొండలు నునుపయినట్లు వెనుకటివారి యకృత్యములు కంటికి మెఱుఁగుకాఁగా మనవారు పూర్వకాలమును పొగడుచుందురు. బ్రహ్మదేవుని యంతటివాఁడువచ్చి భార్యను గోలుపోయి దుఃఖించుచున్న బృహస్పతికి తారను మరల నిమ్మని చంద్రుని బ్రార్థించెనఁట!

చ. అని పరమేష్ఠి పల్కుటయు నట్లనకా కని చంద్రుఁ డయ్యెడన్
ఘనతరగర్భభార నఖకాంతివిసర్జితతారఁ దారఁ దా
ననునయనోక్తులం బెలిపి యంపినతోడనె దివ్యతూర్యని
స్వనములు మ్రోసె మింట విరివానలు పర్వెను జంట జంటగన్.

బ్రహ్మదేవుని ప్రార్థన నంగీకరించి చంద్రుఁడు గర్భవతియైయున్న గురుని భార్యను గురుని కియ్యఁగానే, తమగురునిల్లు కూలఁద్రోచి యింతటి ఘనకార్యము జేసినందున కాతనిమీఁద సిగ్గులేక సురలు విరులవాన గురిసిరఁట!

చ. అమరులతోడ నప్పు డని రబ్జభవుండు భవుండు నగ్గురుం
బ్రమదము మీఱఁగాఁ బిలిచి మాటవచనంబునఁ దారఁ జెందుమీ
రమణి కశుద్ధిలే దమృతరశ్మిని బొందుటచేత దాన నీ
కొమ పరిశుద్ధిఁ గాంచెఁ గయికొమ్మనఁ గొమ్మ గురుండు చేకొనెన్.

దేవతలును బ్రహ్మరుద్రులును గురునిఁ బిలిచి వ్యభిచారదోషము లేకపోవుటయేకాక యమృతరశ్మిని బొందుటచేతఁ దార పరిశుద్ధురాలయ్యెనని చెప్పి యొప్పగించిరఁట.

ఉ. తత్సమయంబునన్ శశి ముదంబున నచ్చటి కేగుదెంచి పు
త్రోత్సవ మాచరింప విని యుద్ధతితో గురుఁ డందువచ్చి య
స్మత్సుతుఁ డీబుధుం డిట నిశాకర రాఁ గత మేమి నీకన
న్మత్సరబుద్ధి వానికిఁ బునఃకలహంబు జనించె నయ్యెడన్.

ఆపతివ్రతాతిలకమునకు పుత్రుఁడు పుట్టఁగానేవచ్చి చంద్రుఁడు పుత్రోత్సవ మాచరించి నప్పుడు గురు శిష్యులకు పునఃకలహము జనించెనఁట!

క. నావిని యజుఁ డోహోహో
మీవాదము చాలుఁ గుముదమిత్రునిపుత్రుం
డీవత్స మితనిఁ జంద్రుని
కీ విమ్మా వలదు విరస మిఁక నాంగిరసా.

అని బ్రహ్మదేవుఁ డింటిమగనికి బుద్ధిచెప్పి శిశువును తేరమగనికిప్పించి వివాదము తీర్చెనఁట! ఈవిషయమునే చెప్పుచుఁ గాశీఖండములో

గీ. చదివె గురునొద్ద ధర్మశాస్త్రంబుఁ దొలుతఁ
బరమవిశ్వాసతాత్పర్యభక్తిగరిమఁ
జదివెఁ జంద్రుఁడు కామశాస్త్రంబుపిదపఁ
దలిరుపాన్పున ననురక్తిఁ దారయొద్ద.

సీ. భువనైకధన్విచేఁబుష్పాయుధునిచేతఁబ్రసవాస్త్రమున నేటుపడనివాఁడు
నతిగాఢమైన క్రోధాంధకారంబునఁ గన్నుల నంధుండు గానివాఁడు
సర్పిబంధనలోభనిద్రాభరంబుఁ బారవశ్యంబుచేఁ బడనివాఁడు
లక్ష్మీకటాక్షవిలాసదుర్మదమున మనములోపల నన్నుకొననివాఁడు

లేఁడు భూపతి గలిగెనే న్వాఁడు నృపుఁడె
విశ్వధాత్రీజనులపాలివేల్పు గాక
బాహ్యశత్రులఁ బరిహరింపంగవచ్చు
నంతరరులను వర్జింప నలవికాదు.

ఈవిధముగా శ్రీనాథుఁడు చెప్పినరీతి ప్రౌఢవాక్యములుగాని, పురూరవశ్చరిత్రములో—

క. పాపపరాఙ్ముఖతాపతి । దీపాంకుర మానెలంతదీర్ఘశ్వసితా
టోపమరుద్ధతి నకఁగినఁ । బ్రాపితమోహాంధకారబంధురుఁ డయ్యెన్.

సీ. లలనానితంబమండలముపై నుత్పల
దళములు రచియింపఁ దలఁచుఁగాని
తరుణి కెమ్మోవిమీఁదఁ బ్రవాళమణిసొంపు
గులుకఁగా ఘటియింపఁదలఁచుఁగాని
జలజాక్షికుచకుంభములమీఁద శశికప్ప
తంబుఁ దా నొనరింపఁదలఁచుగాని
మృగరాజమధ్య నెమ్మేను లతావేష్టి
తంబునఁ బెనఁగొనఁ దలఁచుగాని
తలఁపఁ డెప్పుడు గురువనితా సమాగ
మాగతాత్యుష్ణదురితదవానలంబు
దుస్సహంబని కటకటా తొగలఁడేఁడు
కలుగదుగదా వివేకంబు కాముకులకు ?

సీ. సకియకౌనుఁ దలంచి సన్మార్గ మనుఁగాని
యింతిదుర్మార్గత నెంచఁడయ్యెఁ
జెలువచన్గవఁ దలంచి సువృత్త మనుఁగాని
తరుణికువృత్తంబుఁ దలఁపఁడయ్యె
నతివమోముఁదలంచి యకళంక మనుఁగాని

తెల్లవికళంకంబుఁ దెలియఁడయ్యె
సుదతినవ్వుఁ దలంచి శుచి యనఁగాని య
వ్వోలఁదుకయశుచి భావింపఁడయ్యె
గురువువంటిమహాత్ముఁ డిక్కరణిఁ దరుణి
చక్కఁదనమేగుణంబుగ సంస్మరించుఁ
గాని వ్యభిచారదోషంబుఁ గాంచఁడయ్యె
నజ్ఞుఁడనఁ బ్రాజ్ఞుఁడన నెవ్వఁడవనినింక ?

ఈవిధముగా నబ్బయామాత్యుఁడు చెప్పినరీతి నీతిబోధకవాక్యములుగాని, తారాశశాంకమున లేవు. కవియొక్క రచనను దెల్పుపద్యములు కొన్ని యుదాహరించుచున్నాను—

చ. హతబహుకిల్బిషంబగుప్రయాగము యాగముదావహంబు సాం
ప్రతముగ నందు నిందిరకుఁ బట్టనఁ బట్టణమున్ సృజింపుమా
యతులితశిల్పశక్తిగొని యంచసి యంచ నిరూఢి నెక్కి యం
చితగతి ధాత యేగె జపసిద్ధులు సిద్ధులు త న్భజింపఁగన్.—ఆ ౧.

చ. అలసలినారి పొల్చె నిజయౌవనవేళస్వకీయబింబలీ
లలు తననెమ్మొగంబునఁ గళంకరుచు ల్నుమీసకట్టునన్
వలదు దయారుణద్యుతులు వాతెఱ వెన్నెలడాలు లేఁతన
వ్వులనమృతంబుపల్కులనుబూనెనునాఁగమనోహరాంగుఁడై ..అ.౨

ఉ. చందురుఁడుం బురంధరనిశాతశరాహతిఁ గంది నివ్వెఱం
జెందఁగ నింద్రుఁ డిట్లను శశీ వినురా వినరానిపాతకం
బందినవాని కార్తి యరుదా గురుదార కృతాపరాధమే
ధం దిగఁద్రోచి చేసితి వృథా విబుధావళితో విరోధమున్.—ఆ.౫.

# 12. కూచిమంచి తిమ్మకవి

ఈకవి యనర్గళమయిన కవితాధార గలవాఁడు; బహుగ్రంథము లను రచియించినవాఁడు; ఇన్నిగ్రంథములను సలక్షణమయిన మృదుమధురపాకమున రచించినకవి యాధునికులలో మరియెవ్వఁడును లేఁడు. ఈకవి యాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; కౌండిన్యగోత్రుడు; బయ్యనామాత్యుని ప్రపౌత్రుఁడు; తిమ్మయామాత్యుని పౌత్రుఁడు; గంగనామాత్యుని పుత్రుఁడు. ఈయనకు లచ్చమాంబతల్లి; జగ్గన్న, సింగన్న, నరసన్న, పితృవ్యులు; వీరమ్మ, పాపమ్మ, మేనత్తలు; సింగన, జగ్గన, సూరన, తమ్ములు; గొబ్బెముక్కల రామయామాత్యుని కూఁతురైన బుచ్చమ్మ భార్య. ఈవిషయములను రుక్మిణీపరిణయములోని యీ క్రిందిపద్యము తెలుపుడు చేయుచున్నది—

సీ. గురుతరకౌండిన్యగోత్రవిఖ్యాతుండు బయ్యనమాత్యుఁ డేభవ్యుతాత
నిరతాన్న దానవర్ణితయశస్సాంద్రుండు తిమ్మనసచివుఁ డేధీరుతండ్రి
ఘనులుజగ్గనయుసింగనమంత్రియునరసన్నయు నేమంత్రియనుఁగుదమ్ము
లలరఁ దిమ్మకవి సింగన్న జగ్గనయును సూరన యేధన్యుసుతవరేణ్యు
లొనర వీరమ్మ పాప మేఘనునిసహజ
లతిపతివ్రత లక్ష్మమ్మ యేచతురురాణి
యట్టి శ్రీకూచిమంచి వంశాబ్ధిచంద్రు
మజ్జనకు నలగంగనామాత్యుఁ దలఁతు.

ఈమధ్యను ముద్రింపఁబడిన రుక్మిణీపరిణయములో నీపద్యములోని నాలవపాదమున సింగన్న యనుటకు మారుగా రాజన్నయని యున్నది కాని యది యచ్చుతప్పని తలఁచెదను. తిమ్మకవికి సింగన్నయు జగ్గనయు సూరనయునే కాని రాజన్నయను తమ్ముఁడు లేనట్టతఁడు రచించిన పుస్తకము లన్నింటివలనను తెలియవచ్చుచున్నది. అందు సింహాచలమాహా

త్న్యములోఁ గవి తనవంశవర్ణనము చేయుచుఁ జెద్దతమ్ముఁడగు సింగ
నను గూర్చి చెప్పిన పద్యముల నీఁదుదాహరించుచున్నాను—

క. నాతమ్ములు సింగనయును
ఖ్యాతయశుఁడు జగ్గనయును ఘనతరసుగుణ
వ్రాతాంకుఁడు సూరనయును
భీతారిసమూహు లగుచు వెలసిరి సిరులన్.

సీ. వక్రించుచందంబు వదలక మూఢత నలరెడు సురమంత్రి నపహసించి
సానులంగూడి యింపూని బుధేంద్రుని గననోడు నచలపుంగవుని నెంచి
శుక్రిదూరుఁడై చరించుచు రెండునాలుకల్ గలిగియుండెడి
భోగికులునిఁ దెగడి
భంగంబు నొందె యేపట్టున నపలెడు రత్నాధివాసుఁ దిరస్కరించి
ప్రజ్ఞచే గౌరవమున వాక్పాటవమున
భూరిగాంభీర్యమున జనుల్ పొగడ నెగడెఁ
గూచి మంచ్యన్వయాంభోధికుముదహితుఁడు
శిష్టహితతంత్రిగంగయసింగమంత్రి.

కవియొక్క జన్మసంవత్సర మేదో తెలియదుగాని యితఁడు రచి
యించిన గ్రంథములలో నెల్లను మొదటిదగు రుక్మిణీపరిణయము—

ఉ. ఆరయ శాలివాహనశకాబ్దము లద్రిగుణాంగచంద్రులం
జేరగుమన్మథాబ్దమునఁ బ్రేమఁ బ్రబంధ మొనర్చి మీకటుల్
చేరికతో సమర్పణము చేసితి మీకృతి యాతమిత్రసహ్యా
త్రైకరవమిత్రతారకముగా భువిఁ జెల్వగుఁగాత శంకరా.

అను పద్యముబట్టి శాలివాహనశకము ౧౬౩౭ వ సంవత్సరము
మన్మథాబ్దమునకు సరియైన హూణశకము ౧౭౧౫ వ సంవత్సరమునందు
జేయఁబడిన దగుట నిశ్చయమయినందున, కవి యప్పటి కిరువదియైదు
సంవత్సరముల ప్రాయమువాఁ డయినపక్షమున ౧౬౯౦ వ సంవత్సర

ప్రాంతమునఁ బుట్టినవాఁడై యుండవచ్చును. అచ్చతెలుఁగు రామాయణములోని—

గీ. మునుపు మాకీవె భళ్ళాణుఁ డనెడిజేని
కతయురుక్మిణి పెండ్లికతయుబొబ్బ
లెకపుగుబ్బలికతయు మేల్మిలీల
పెండ్లికతయును గబ్బముల్ పేర్మిఁగూర్చి-

అను పద్యమునుబట్టి భళ్ళాణరాజచరిత్రము రుక్మిణీపరిణయము కంటె ముందుగా రచియింపఁబడినట్టు భ్రమ కలుగునుగాని నిజ మారయఁగా రుక్మిణీపరిణయమును రచించిన తరువాతనే కవి రాజశేఖర విలాసమను నామాంతరముగల భళ్ళాణచరిత్రమును రచించి నట్లు పెక్కు నిదర్శనములవలన స్పష్టమగుచున్నది. రుక్మిణీపరిణయమునందుఁ గవి తా నావఱకు గ్రంథము లేవియుఁ జేసియున్నట్టు చెప్పుకొనలేదు. కవిచేత రచియింపఁబడిన మూఁడవగ్రంథమగు సింహాచలమాహాత్మ్యము నందు,—

గీ. ప్రతిభ మీఱంగ రుక్మిణీపరిణయంబుఁ
గలుషహరమగు రాజశేఖరవిలాస
మును మఱియుఁ జాలదండకములును శతక
ములును రచియించి కృతులు శంభునకు నిడితి.

అని కవి రుక్మిణీపరిణయమునే మొదటఁ జెప్పియున్నాఁడు. లక్షణసారసంగ్రహము, రసికజన మనోభిరామము మొదలయిన గ్రంథము లన్నిటిలోనుగూడ కవి మొట్టమొదట రుక్మిణీపరిణయమునే పేర్కొని యున్నాడు. కవి యేహేతువుచేతనో రుక్మిణీపరిణయము చేసినతరువాత జేసిన యచ్చతెలుఁగురామాయణము నీలాసుందరీపరిణయము లోనుగా గలపుస్తకములలోఁ దా నాపుస్తకములను జేసి ముగించినకాలమును వేసికొనలేదు.

తిమ్మకవి గోదావరీమండలములోని పిఠాపురసంస్థానములోని దైన కందరాడ గ్రామమునకు కరణము. ఇతఁడు కందరాడగ్రామవాసుఁడయినట్లు లక్షణసారసంగ్రహములోని యీక్రిందిపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది—

సీ. కౌండిన్యగోత్రవిఖ్యాతుఁడ సూరిమంత్ర్యన్వయాంభోధినీహారకరుఁడ
గంగనమంత్రిశేఖరునకుఁ బరమపావనియగులచ్చమాంబకును సుతుఁడ
వెరవొప్ప రుక్మిణీపరిణయంబును సింహశైలమాహాత్మ్యంబునీల పెండ్లి
కథయును రాజశేఖరవిలాసమునచ్చ తెనుఁగురామాయణంబును
మొదలగు
కృతులు రచియించి పార్వతీపతికి భక్తి
తోడ నర్పణ మొసఁగినవాఁడఁ గంద
రాడపురసంస్థితుఁడఁ గద్రుబోడ నేను
దిమ్మకవిచంద్రుఁడను జగద్విదితయశుఁడ.

ఈయన గ్రంథములుచేయ నారంభించిన కాలమునందు పీఠికాపురసంస్థానమునకు రావు మాధవరాయనృపతి ప్రభువుగా నుండెను. ఈవిషయము రుక్మిణీపరిణయములోని యీపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది—

సీ. చక్రవాళాహార్యజలధితుల్యోన్నతప్రాకారపరిఖావిరాజితంబు
సాంద్రముక్తాసౌధచంద్రశాలానేకభర్మనిర్మితహర్మ్యశర్మదంబు
కరిసైంధవాందోళికాధేనుధనధాన్యవనదేవగృహసరోవర్ణితంబు
విమలచాతుర్వర్ణ్యవిద్వత్కవిశ్రేష్ఠ భటనటామాత్యవిస్ఫారితంబు
రాజమహేంద్రవరమద్గరాజ్యభూరి
భారసంభరణాక్రాంతభాసమాన
రావు మాధవనృపపరిరక్షితంబు
భోగనికరంబు పీఠికాపురవరంబు.

ఈరావు మాధవనృపతియే కొన్నిగ్రంథములు రచించిన యనంతరమునఁ గవికిఁ గవిసార్వభౌమబిరుదము నిచ్చినట్లు రసికజనమనోభిరామములోని యీక్రింది పద్యమువలనఁ గనఁబడుచున్నది—

సీ. నిఖిలవిద్యాభ్యాసనిపుణుఁడు మత్సహోదరుఁ డగుజగ్గనసత్కవితనయులు
ఘనులుతిమ్మనయుసింగనయును లేఖకపాఠకులై కృతుల్ప్రబలఁజేయఁ
బేర్మిఁగాంచినవాఁడఁ బీఠపురప్రాజ్యరాజ్యాధిపత్యవిరాజమాన
భూరివైభవుఁడు నద్భుతపరాక్రముఁడును దానకళాధురంధరుఁడునైన
రావు నీలాద్రిమాధవరాయనృపతి
చేతఁ గవిసార్వభౌమ విఖ్యాతబిరుద
మందినఘనుండఁ దిమ్మయాహ్వయుఁడ నేను
విమలతరభక్తి మదిలోనవిస్తరిల్ల.

కవి పీఠికాపురసంస్థానములో నుండినవాఁడయినను తనగ్రంథములు వేనిని నరాంకితము చేయక యిష్టదేవతయైన కుక్కుటేశ్వరస్వామికే యంకితము చేసియున్నాఁడు. ఇతఁడు రుక్మిణీపరిణయమును రాజశేఖరవిలాసమును జేసినతరువాత రాజు తనకొక గ్రంథము నంకితముచేయ నడిగినట్లును కవి యట్లుచేయ నిష్టములేనివాఁ డయినట్లును సింహాచలమాహాత్మ్యములోని యీపద్యమువలన నూహింపఁదగియున్నది—

క. నృపులకుఁ గావ్యం బొసఁగిన
నపవర్గం బిడఁగఁగలరొ యటుగాకున్నన్
ద్విపతురగభూషణాంబర
తపనీయాదికముచేతఁ దనుపంగలరో.

సీ. ద్విజపుంగవులకుఁ బ్రవేశింపఁగారాని
పృథుగృహాంతరములఁ బ్రేమనుండి
కృతియంతధర్మపద్ధతు లెవ్వి యెఱుఁగక
ధరణిపై నడువఁ బాదములు లేక

దుష్క్రియల్ చేయుమంత్రులు చెప్పినటులె మీఁ
అకనటింపుచుద్విజిహ్వకలుగలిగి
వితతంబుగా వక్రగతులచేఁ బాదలుచుఁ
బూని యేప్రొద్దును బుస్సు రనుచు
గాఢరోషవిషానలోద్గారిఘోర
వక్త్రములుగల్గి దుర్మదవర్తు లగుచుఁ
జెలఁగుచుండెడు భోగిరాజులభజనపఁ
గుటిలతరబుద్ధి నెవ్వాఁడు కోరఁగలఁడు ?

* * * *

క. పనిపూని తుచ్ఛభోగం । బునకై కొఱగానిజనులఁ బొగడుటయెల్లన్
గనుఁగొన విహపరదూరం।బని తలచిఁ వినిర్చలాంతరంగుఁడ నగుచున్.

ఈయన శివభక్తుఁడయి తాను జేసిన గ్రంథముల నన్నిటిని పిఠాపురమునందలి కుక్కుటేశ్వరస్వామి కే యంకితము చేసినను, ఒక్క సర్పపురమాహాత్మ్యమును మాత్రము రాజానుగ్రహము నపేక్షించి కాఁబోలును కవిసార్వభౌమబిరుద మందినతరువాత సర్పవరమందలి భావనారాయణస్వామి కంకితముచేసెను. ఈ సర్పవరము పిఠాపురపు రాజుల గురువులగు వైష్ణవస్వాములకు నివాసస్థలమయి పీఠికాపురము నకు సమీపమున నున్నది. కవిమాత్రము సర్పపురమాహాత్మ్యములో భావనారాయణస్వామి తనకు స్వప్నమున సాక్షాత్కరించి యిట్లానతిచ్చి నట్లు చెప్పికొనియున్నాఁడు—

సీ. ప్రౌఢిమై రుక్మిణీపరిణయంబును సింహశైలమాహాత్మ్యంబు నీలపెండ్లి
కథయును రాజశేఖరవిలాసంబును నచ్చతెనుంగురామాయణంబు
సారంగధరనరేశ్వరచరితంబు సప్తార్ణవసంగమాహాత్మ్యకంబు
రసికజనమనోభిరామంబు లక్షణసారసంగ్రహము నింపారఁ గూర్చి

కృతులు శంభుని కిడినసుకృతివినీవు
ప్రతిభ మెఱయంగనొక్కసత్కృతియొనర్చి
మాకు నర్పణచేయు నెమ్మదిదలిర్పఁ
తిమ్మకవిచంద్ర ముదితసుధీకులేంద్ర.

తనకు మాహేశ్వరాచారవృత్తి నుపదేశించిన శైవుఁడగు వెందులూరి లింగనారాధ్యుని

క. చిరభక్తిం బొగడెద మ । ద్గురునాథుం వెందులూరికులపావనునిన్
గరుణానిధి నపరాంతక । హరమూర్తిని ఘనుని లింగనారాధ్యమణిన్.

ఇత్యాది బహుపద్యములతో బహుగ్రంథములయందు స్తుతించి శివభక్తుఁ డయినను, కవి తాను కేవల శివమతస్థుఁడుగాక శివకేశవులకు భేదము లేదని భావించెడి యద్వైతమతస్థుఁడయియుండెను. కవి తాను కట్టకడపట రచియించిన శివలీలావిలాసములో నిందు క్రిందఁ బొందుపఱిచిన పద్యమునందుఁ దాను జేసినపుస్తకముల నన్నిటిని జెప్పికొని యున్నాఁడు—

సీ. ప్రతిభమైరుక్మిణీపరిణయంబును సింహశైలమాహాత్మ్యంబు నీలపెండ్లి
కతయును రాజశేఖరవిలాసంబును నచ్చతెనుంగురామాయణంబు
సారంగధరనృపచరితంబు సాగరసంగమాహాత్మ్యంబు రంగుమీఱ
రసికజనమనోభిరామంబు లక్షణసారసంగ్రహమును సర్వపురస
మంచితక్షేత్రకథనంబు మఱియుఁబెక్కు
శతకదండకసత్కృతుల్ ప్రతిభఁగూర్చి
యుల్లమలరారఁ బార్వతీవల్లభునకు
భక్తి నర్పణ చేసినభవ్యమతిని.

ఈ గ్రంథములలో సారంగధర చరిత్రమును సాగరసంగమాహాత్మ్యమును నాకు లభింపలేదు. అవి చిన్న గ్రంథములని కవివంశములోని వారొకరు నాతోడఁ జెప్పియున్నారు. ఈ కవి కవిత్వములో నచ్చతెనుఁగు

పదము లధికముగా నుండును. కష్టపడి మొట్టమొదట యౌవనకాలము నందు శృంగార ప్రధానముగా రచియించిన దగుటచే రుక్మిణీపరిణయము నందే కవి యెక్కువ ప్రౌఢిమను జూపియున్నాఁడు. కవికృతములయిన బహుగ్రంథములు పురాణపాకమున రచియింపఁబడినవి. శ్లేషములును శబ్దాలంకారములును విశేషముగా నుండినను, కవిత్వమునందద్భుత కల్పన లంతేగాఁ గానఁబడవు. మొట్టమొదట రచియింపఁబడిన గ్రంథము లలో నదంత స్త్రీవాచక పదసంఘులు లోనుగాఁగల కొన్ని దోషములు కనఁబడుచున్నవి. అటుపిమ్మటఁ జేసిన గ్రంథములు నిర్దుష్టములుగా నున్నవి. కవి యితరగ్రంథములను రచియించిన కాలపరిమితినిబట్టి విచారింపఁగా, ౧౭౧౫ వ సంవత్సరమునందు ముగింపఁబడిన రుక్మిణీపరిణయము ౧౭౧౦ వ సంవత్సరమునందారంభింపఁబడి సంవత్సరమున కొక్కొక్క యాశ్వాసము చొప్పున నయిదాశ్వాసములు నయిదు సంవత్సరములలో రచియింపఁబడెనని చెప్పుట సత్యమున కంతదూరముగా నుండదు. కవన మారంభించి యొకటిరెండు శతకములను జేసి గ్రంథ రచనకుఁ బూనునప్పటికిఁ గవికిరువది సంవత్సరముల ప్రాయముండుననుటయు నంతగా తప్పు కానేరదు. కవి తరువాత రచియించిన రెండవ గ్రంథము రాజశేఖర విలాసము మూడాశ్వాసములును మూడు సంవత్సరములలోఁ జేసినపక్షమున, ఆ పుస్తకమును ౧౭౧౮ వ సంవత్సరమున ముగించియుండవచ్చును. మూడవగ్రంథము సింహాచల మహాత్మ్యమయిదాశ్వాసములు నయిదు సంవత్సరములలోఁ జేసినయెడల, ఆ స్థల పురాణము ౧౭౨౩ వ సంవత్సరమునందు ముగింపఁబడియుండును. కవిచే రచింపఁబడిన గ్రంథములలో నాలవదియు నచ్చతెలుఁగు కావ్యములలో మొదటిదియునైన నీలాసుందరీ పరిణయము మూడాశ్వాసములును మూడు సంవత్సరములలో రచియింపఁబడినచో, అది ౧౭౨౬ వ సంవత్సరమునందు ముగింపఁబడియుండును. అయిదవగ్రంథము నచ్చతెనుఁగు

రామాయణ మాఱుకాండములు నాలుసంవత్సరములలోఁ జూర్పఁ బడిన పక్షమున, అది ౧౭౩౨ వ సంవత్సరమునందు సమాప్తి నొంది యుండును. ఈ యచ్చ తెనుఁగుఁ కావ్యముల రచనచేతఁ గవి కభినవ వాగనుశాసనబిరుదము వచ్చెనని చెప్పుదురు. ఆఱవ గ్రంథము సారంగ ధర చరిత్రమును రెండుసంవత్సరములలోఁ జేసెనేని, అది ౧౭౩౪ వ సంవ త్సరములో పూర్తియయియుండును. ఏడవది యగు సాగరసంగమమాహా త్మ్యము రెండుసంవత్సరములలోఁ జేయఁబడినయెడల, ౧౭౩౬ వ సంవ త్సరమున సంపూర్ణమయి యుండును. ఎనిమిదవగ్రంథము లక్షణసార సంగ్రహము

గీ. శాలివాహనశక వర్షసంఖ్యకెరర
సాంగ శశిసంజ్ఞలకు రౌద్ర్యబ్దమునను
భాద్రపదశుక్లపంచమివఱకుఁ బూర్ణ
మయ్యె నీకృతి నీపేర నగసుతేశ.

అని శాలివాహనశకము ౧౬౬౮ వ సంవత్సరమునకు సరియైన క్రీస్తుశకము ౧౭౪౦ వ సంవత్సరమునందు ముగింపఁబడినదని కవియే చెప్పియున్నాఁడు. మూఁడాశ్వాసములుగల యీలక్షణగ్రంథమును రచి యించుటకుఁ గవికి ౧౭౩౬ వ సంవత్సరము మొదలుకొని నాలుగు సంవత్సరములు పట్టియుండును. చంద్రపాలెములోనున్న యీకవివంశ మువారి యింటఁ గలపుస్తకములను వెదకించఁగా నందు భారతాదులును లక్షణవిషయకగ్రంథములునుదక్క విశేషగ్రంథము లేవియుఁ గానఁబడ నందునను, లక్షణసారసంగ్రహములో లక్ష్యములుగాఁ జూపఁబడిన ప్రబంధాదులలోని పద్యములు చాలవఱకితరపూర్వలక్షణగ్రంథము లలో నున్నవే యగుటచేతను, కవి యీగ్రంథరచనమునందు భారత రామాయణములను మఱికొన్ని ప్రబంధములను మాత్రమే శోధించు

నట్లు తోఁచుచున్నది. అందుచేత గ్రంథపరిసమాప్తికి నాలుగు సంవత్సరములు చాలును.

గీ. తెలుఁగుకు మున్ను లక్షణంబులు మహాక
వీశ్వరుల్ పెక్కు రచియించి యిడి రిఁకేల
కూర్పవలెనన్నఁ బ్రౌఢిమకౌఁ జనునాకుఁ
దెలిసిన తెఱంగుఁ దగఁగొంత తెలియఁబఱుతు.

అని కవి లక్షణసారసంగ్రహమునఁ బూర్వలక్షణగ్రంథములలో లేని నూతనవిషయములను గొన్నిటిని జేర్చినట్లు చెప్పియున్నాడు. కొన్ని విషయములను కవి క్రొత్తగా శోధించి చేర్చెననుటకు సందేహములేదు. తొమ్మిదవగ్రంథమగు రసికజనమనోభిరామ మనెడి యాఱాశ్వాసముల ప్రబంధమును రచించుటకు కవికి ౧౭౪౦ వ సంవత్సరము మొదలుకొని ౧౭౫౦ వ సంవత్సరమువఱకును పదిసంవత్సరములు పట్టినది.

సీ. * * రసికజనమనోభిరామం బనెడుపేరఁ దెనుఁగున శాలివా
హనశకాబ్దములఁ గరగిరిరసభూసంఖ్యఁ దద్దయువఱలు
ప్రమోదూతవత్సరమున నీ ప్రబంధంబు రచియించి
నీకొసఁగితి.

అని కవి రసికజనమనోభిరామమును దాను శాలివాహనశకము ౧౬౭౨ వ సంవత్సరమునకు సరియైన ౧౭౫౦ వ సంవత్సరమున రచియించినట్లు చెప్పెను. ఈ కవి యీ గ్రంథమును బహుపుస్తకములు శ్రమచేసి తన ప్రౌఢిమ నంతయు జూపి వసుచరిత్రమువలె నుండవలెనని దాని ననుసరించి చేసెను. అందుచేతనే కవి యీ గ్రంథాదియందు—

సీ. బహుపురాణములుఁ బ్రబంధములు లక్షణశాస్త్రములు వివిధకోశములు నాట
కము లలంకారశాస్త్రములును శోధించి ప్రౌఢిమై నేతత్ప్రబంధ మేనో
నర్చెద * * * * * *

అని వ్రాసికొనియున్నాఁడు. అయినను వసుచరిత్రమునందుఁగల ప్రౌఢిమలోను సారస్యములోను శతాంశమైనను రసికజనమనోభిరామము నను రాలేదు. అన్యోన్య తారతమ్యము తేటపడుటకయి యుభయ గ్రంథములనుండియు సమానవిషయములను దెలుపు పద్యములను గొన్నిటి నిందుఁ జూపెదను. వసుచరిత్రములో గిరికాదేవిని కూర్చుట కయి రాజుచేతఁ బంపబడిన దూత పోయి సఖీజనమధ్యమున నున్న కన్నియను జూచి సమయోచితసరసాలాపములతో ముచ్చటించి యామె చెలికత్తెల చేతనే—

ఉ. ఇన్నగరాజుఁ జూడ వసుధేశ్వరుఁ డెన్నఁడు వచ్చు వచ్చి యీ
క్రొన్ననతీవజొంపములలోనను నెన్నఁడు డిగ్గు డిగ్గి యీ
కన్నియఁ గన్నులారఁ గుతుకంబున నెన్నఁడు గాంచుఁ గాంచి తా
నెన్నఁడు గారవించుఁ జెలు లెన్నఁడు కాంతు రభీష్టసంపదల్.

రాజు నిమిత్తమయి ప్రార్థించునట్లుచేసి నేర్పుతో కార్యసంఘట నము చేయుఁగా, రసికజనమనోభిరామములో బ్రియురాలి నిమిత్తమయి రాజుచేఁ బంపబడినదూత యామె కడకుఁబోయి—

చ. పలుకులు వేయు నేటికిఁక భావభవప్రతిమానుఁ డైనయా
చెలువునిత్రోడుతం జెలిమి చేకుఱ కున్న నయారె నీమెయిం
గల యెలజవ్వనం బడవిగాచిన వెన్నెలసుమ్ము ముద్దులేఁ
జిలుకలకొల్కి నాపలుకు చిత్తమునం దలపోసిచూడుమా.

అని చెప్పి యామెచేత,

చ. అవునవు మంచిప్రోడవె బళా యళు కించుక లేక మాసినీ
నివహసభాగ్రభాగమున నిల్చి వినం గొత్తగానివాక్యముల్
తవిలి వచింపఁ జాగితివి తాళుదుమే మఱియొక్కఁడైన దూ
తవు నిను నేమియుం బలుక ధర్మమ్ము కాదని యుంటి మిత్తఱిన్.

అని చీవాట్లుతిని తనప్రభువువద్దకు మరలి వచ్చెను.

చ. కటకట యమ్మ నొక్కత్రుటికాలముఁ బాయనిదాన నొంటిమై
నెటువలె వచ్చి తమ్మ చెలి యిచ్చటికి వేకువఁ దేనెవాక లీ
వెటువలె నీఁది తమ్మ తెరువెల్లను బుప్పొడి నీపదాంబుజం
బెటువలె నోర్చె నమ్మ తరుణీ తగు నమ్మకడిందిచైదముల్ — వసుచ.

ఉ. కొమ్మరొ ముమ్మరంపువెతఁ గుందుచు నిల్లెడఁబాసి యిమ్మెయిన్
మమ్మలఁజేసి యొంటిగ వనంబున కేటికి వచ్చితమ్మ నె
త్తమ్ములఁగేరునీమృదుపదంబులు కందెఁ గదమ్మ మేలు మే
లమ్మకచెల్ల నీబలుఁగయాళితనమ్ములు చెప్పఁ జిత్రముల్ — రసికజ.

ఈ పుస్తకమునందు స్త్రీవర్ణనములు మొదలయినవి వెట్టిగాఁ జేయఁబడినవి. ఈ శృంగార ప్రబంధమును రచియించిన కొంతకాలము నకుఁ గవి వీధినిబడి పోవుచుండఁగా నొక వేశ్య చూచి రసికజనమనోభిరామమును జదివియున్న దగుటచే నందలి రసికముద్ర కానందించి వలచి వచ్చి పైఁబడి కవిని కౌఁగిలించుకొనఁగా నతఁడు పెడమొగము పెట్టె ననియు, అందుపయి నా సరసురాలు

చ. చతురులలోన నెంతయును జాణ వటంచును నేను కౌఁగిలిం
చితి నిటు మాఱుమో మిడఁగఁ జెల్లునె యోరసికాగ్రగణ్య

అని యాశుకవిత్వము చేసి యడుగఁగా,

అద్భుతమగునట్టి బంగరపుబొంగరపుంగవఁబోలునీకుచ
ద్వితయము ఱొమ్ము నాటియలవీఁపునదూసెనటంచుఁజూచితిన్.

అని కవి పద్యముపూరించి యుత్తరమిచ్చెననియు, చెప్పు వాడుక యొకటి కొంతకాలమునుండి కలదుగాని యిదియు రసికత్వమన నెల్లను జారత్వమే ముఖ్యమని భావించెడి యపూర్వ పండితులచే నితర కవుల యందారోపింపఁబడినరీతి యసత్యకల్పనమే యనుటకు సందేహములేదు. రుక్మిణీపరిణయమును ముగించునాటికిఁ గవి కిరువదియైదు సంవత్సరము

లున్నచో నిప్పటి కాతని కిరువది సంవత్సరములు దాటియుండవలెను. కులవృత్తిదోషముచే నెంత సిగ్గువిడిచినదయినను పట్టపగలు నట్టనడివీథిలో నడుచుచున్న ముసలి రసికుని బయిటబడి పడుచు పడుపుపడతి యెల్లరుఁ జూచుచుండఁ గౌఁగిలించుకొన్నదనుటకంటెఁ బరిహాసాస్పదమయిన విరుద్ధపు మాట మఱియొకటి యుండదు. పదనదియగు మూడాశ్వాసములు గల సర్వపురమాహాత్మ్యము తరువాత నాలుగు సంవత్సరములలో ౧౭౫౪ వ సంవత్సరమునందు ముగింపఁబడినది.

పదునొకండవదియు కట్టకడపటిదియు నగు శివలీలావిలాసమను రెండాశ్వాసముల గ్రంథము మఱి రెండేండ్లకు

గీ. శాలివాహ శకవర్ష సంఖ్య వసున
గాంగశశిసంజ్ఞ నలరుధాతాబ్దమునను
దగరచించిన యీకృతి ధరణియందు
నాసుధాకరతారార్క మగుచునుండు.

శాలివాహనశకము ౧౬౮౦ వ సంవత్సరమునకు సరియైన ౧౭౫౮ వ సంవత్సరమున రచియింపఁబడినది. అటుతరువాతఁ గవిచే రచియింపఁబడిన గ్రంథము లేవియుఁ గానరావు. ఆరంభదశలో రచియింపఁబడిన కుక్కుటేశ్వరశతకము మొదలయిన కొన్ని శతకములను దండకములును గలవు. శివలీలావిలాసము ముగిసిన యల్పకాలములోనే కవి పరలోకగతుఁడయ్యెను. కాఁబట్టి యతఁడు ౧౭౬౭ వ సంవత్సరము నందు మృతినొందెనని యించుమించుగా నిశ్చయముగానే చెప్పవచ్చును. అందుచేతఁ గవి దాదాపుగా డెబ్బది సంవత్సరములు జీవించి సుమారు నలువదియైదు సంవత్సరములు గ్రంథరచనయందుఁ గడిపినట్టు స్పష్టమగుచున్నది. ఈ కవికి సంతతిలేదఁట. ఈ కవియొక్క కడపటికాలములో నింగ్లీషువారికిని ఫ్రెంచివారికిని యుద్ధములు జరగినందున కందరాడ మీఁదుగా రాకపోకలు చేయుచువచ్చిన సేనలదాడికి వెఱచి

యా గ్రామము విడిచి చంద్రమపాలెము నివాసముగా నేర్పఱచుకొనెను. ఈ కవివంశమువారిప్పటికిని చంద్రమపాలెములోనే యున్నారు. ఆంధ్ర నామసంగ్రహముచేసిన పైడిపాటి లక్ష్మణకవి, కన్నప్పచరిత్రము చేసిన కంచిరాజు సూరయ్య, శివజ్ఞానదీపికనుజేసిన కవిలోకబ్రహ్మ, ఇందుమతీ కళ్యాణముచేసిన యంగర బసవయ్య, ద్వాదశరాజచరిత్రచేసిన కట్టవరపు చిట్టమరాజు, ద్విపద రుక్మాంగదచరిత్రముచేసిన రామయ భాస్కరుఁడు మొదలగు కవు లీకవికిఁ బూర్వమునందుండినట్లు లక్షణసారసంగ్రహములో నియ్యఁబడిన లక్ష్యములవలనఁ దెలియవచ్చుచున్నది. కవి యొక్క శైలిని జూపెడు పద్యములఁ గొన్నిటి నిందుదాహరించుచున్నాను—

## రుక్మిణీ పరిణయము.

ఉ. సారము ముద్దుఁబల్కు ఘనసారము నిద్దపుమేనితావి కా
సారము నాభిరంధ్రము విసారము తేటమిటారిచూపు శ్రీ
కారము కర్ణయుగ్మము చొకారము నవ్వుమొగంబు పట్టుదా
కారము కొప్పు సన్మధువికారము మోవి వధూలలామకున్. ఆ. ౨.

ఉ. కౌను చలింప నిద్దపుమొగంబునఁ జెమ్మటముంప గంకణ
ధ్వానము లింపునింపఁ గరతాళగతు ల్పచరింప హారముల్
పూనినటింప నూర్పుసాలవు న్వలితెమ్మెర లంకురింపఁగాఁ
జానయొకర్తు రుక్మిణికి సంపఁగినూనెఁ దలంటు నేర్పునన్. ఆ. ౫.

## రాజశేఖరవిలాసము.

శా. ఏరాభూవర మాకుఁ గాంచనతురంగేభాంబరాందోళికా
భూరిస్యందనమందిరోపవనసద్భూషామణి శ్రేణులున్
బేరెన్నందగుపల్లెలుం బదుపులుం లెక్కింప కర్థంబులున్
ఈరా కోరికలీడ మీరాడ కీక నీవెంతేనియుం ధీరతన్. ఆ. ౧.

ఉ. అయ్యెడఁ జెల్లమాంబ విభునానతి గైకొని వాఁడిచూపు లో
య్యొయ్యన మీఱ లేనగవు లొప్పఁగఁ జెక్కులఁ బొఱ సిగ్గుమైఁ
బయ్యెదజాఱ ముద్దునునుబల్కులు చెల్వలరార నవ్విటుం
జయ్యనఁ జేరి మ్రొక్కి నెఱజాణగు బెల్లు నెఱింగి రంగుగన్. ఆ-3

## సింహశైల మాహాత్మ్యము.

మ. వలపుం గొజ్జఁగినీటిశీతలహరీవార్బిందువు ల్చిమ్ముచున్
గలయం గప్పురపుందుమారము మెయిన్ గాటంబుగాఁ గప్పుచున్
బలవద్దర్పకబాణపంక్తులక్రియన్ బైపై విరుల్ గుప్పుచున్
జెలఁగె న్మందసమీరణుండు దితిజశ్రేష్ఠాగ్రభాగంబునన్. ఆ. ౨.

ఉ. అక్కట! దైత్యనాయకుఁ డహర్నిశయుం దనయాత్మ నెంతయున్
మక్కువమీఱ ని న్మనుచుమాట దలంపక తద్విపక్షునిన్
బెక్కుఁదెఱంగులం గడఁగి పేర్కొనఁ జూచెదు చిన్నవాఁడ వీ
వెక్కడ? తత్త్వ మెక్కడ? సహింపఁడుసుమ్ము నిశాచరార్భకా. ఆ-3

## నీలాసుందరీ పరిణయము.

ఉ. మినుకుఁగడానిబంగరపుమేడల తోరణగంబ్ల వెంట రే
ల్చనియెడి రిక్కమొత్తమును జక్కఁగఁ జూచి మెఱుంగుబోండ్లు ని
చ్చలు పిడికిళ్ళఁబట్టి యవి జాఱిచనం దమగోళ్ళు చుక్కలం
చును నడనిల్చి చేవదలి చూచుచు నబ్బురపోదురందులన్. ఆ. ౧.

ఉ. కన్నులవింటివాఁడ తిగకన్నులదేవరతోడఁ బోరి మున్
బన్నము నొంది మేఁదొఱఁగుపట్టున నెక్కడ డాఁగిపోయె నీ
మన్నఱికెంబు? నేఁడు కొఱమాలినకోయిలచిల్కమూఁకలన్
బన్నుగఁ గూడి చేడియల బాములఁ బెట్టెదు పోటుబంటవై. ఆ.3.

## అచ్చతెలుఁగు రామాయణము.

ఉ. కాయను మేటితప్పు కొడుకాయను నిద్దపుఁబూఁతమావిమో
కాయనుఁ బంజరంపుఁజిలుకాయను నబ్బపుసోయగంపుఁబ్రో

కాయనుఁ బల్కవేమి యలుకాయనుఁ బంతముతీఱెనోటు కై
కాయను నేర యిట్లు దుడుకాయనుఁ మాయఁగఁ గోరికాయనన్.

అయోధ్యా.

చ. జగములతల్లియై పుడమి జవ్వనిగాదిలిపట్టియైనయి
మ్ముగుదలమిన్నఁ దెచ్చితివి మోస మెఱుంగక నీకు నెవ్వరుం
దగ దిదియంచుఁ జెల్వఁ గలదంటలు గల్గమిఁజేసి యిట్టికి
డగపడె నింకనైన విడనాడక రాముని బ్రాపుఁ జేరుమీ. సుందర.

## లక్షణసారసంగ్రహము.

చ. కరములు దోయిలించి కుతుకంబున నిచ్చలుఁ బ్రస్తుతింతు భా
స్వరగుణవంతునిన్ సకలసత్కవిజాలవనీవసంతునిన్
జరకరుణానిశాంతుని విశిష్టజనావనతావిశాంతునిన్
సురతరుమంజరీనిభయకోహరిదంతుని నేకదంతునిన్. ఆ. ౧.

మ. ఘనకారుణ్యకటాక్ష రాక్షసచమూగంధేభహర్యక్ష స
జ్జనసంరక్షణదీక్ష పాలితసరోజాతాక్ష శక్రాంబుజా
సనముఖ్యామరపక్ష దక్షసవనాంచత్క్రోధతామ్రాక్ష యా
చనకప్రాంగణకల్పవృక్ష రిపుశిక్షాదక్ష మోక్షప్రదా. ఆ. ౨.

## రసికజనమనోభిరామము.

మ. తరుమూలంబులపొంతఁ బొంచి సచివోత్తంసంబు వీక్షించె భా
స్వరకార్తస్వరవిగ్రహన్ సమదచంచచ్చంచరీకాలకన్
శరదిందుప్రతిమానచారువదనన్ జక్రస్తని న్విస్ఫుర
త్సరసీజాతదళాయతాక్షి నొకకాంతాలోకచూడామణిన్. ఆ. ౨.

మ. సవనాదిక్రియల న్సుధాంధులను మెచ్చంజేసి ధన్యాత్ములై
నవిశేషజ్ఞుల కబ్బుఁగాక యకటా నా కేటికింగల్గు ని
ఖ్భువనాతీతవిలాసవిభ్రమకళాభారిప్రభాంచన్మరు
ద్ధవళాక్షీమధురాధరాధరసుధాధారాసరిద్ధోరణుల్. ఆ. ౫.

## సర్పపుర మాహాత్మ్యము.

మ. సరసీనిర్మలనీరబిందుకణముల్ సమ్యగ్గ్రహింబూని వి
స్ఫురదారామలతాంతసౌరభరజఃపుంజంబుఁ గైకొంచు ని
ర్భరమందానిలశాబకప్రకరముల్ పల్మాఱు సక్కోణనల్గోఁ
దిరుగుం బాంథజనశ్రమాపహరణోద్వృత్తిం బ్రకాశింపుచున్. ఆ. ౩

ఉ. నీకరుణావిలోకమున నిల్చినచోఁ గులహీనుఁడున్ హయా
నేకపహేమచామరమణీరమణీయవిభూషణాదికా
స్తోకవిభూతిఁ జెంది పరిశుద్ధకులుం డన మించు లేఁచో
నాకనివాసుఁడున్ వెతల నందుఁగదమ్మ జగత్కుటుంబినీ. ఆ. ౩.

## శివలీలావిలాసము.

ఉ. అంగదముద్రికావలయహారలలాటిక లెమ్మె నెమ్మెయిన్
రంగులు గుల్కఁ గ్రొందగటునాఁ జెవుఁబావడ సొంపునింప మే
ల్బంగరుగిల్కుటందియలు బాళిగ నంఘ్రులఘల్లుఘల్లనన్
గంగ యనుంగులం గలసి కౌతుకలీలలఁ గ్రీడ సేయుచున్. ఆ. ౧.

ఉ. కన్నులుమూయుఁ ద్రుళ్ళిపడి గ్రక్కునదిక్కులురోయు నూరకే
సన్నలుచేయుఁ బై వలువ చయ్యననవ్వలఁద్రోయు మింటిపై
వెన్నెలగాయుచందురుని వేఁడికిఁ దాఁ బెడఁబాయు నద్దిరా
చిన్నెలజంగమప్రభునిచిత్తవికారము లెన్నఁజిత్రముల్. ఆ. ౨.

# 13. వక్కలంక వీరభద్రకవి

ఈకవి కూచిమంచి తిమ్మకవి జగ్గకవుల కాలములోనే పిఠాపురమునందుండి మిక్కిలి ప్రసిద్ధిగన్నవాఁడు. కూచిమంచి తిమ్మకవివలెనే యితఁడును దెందులూరి లింగనారాధ్యుని శిష్యుఁడయి తన వాసవదత్తాపరిణయమునం దాతని నిట్లు స్తుతించి యున్నాఁడు—

సీ. అంభోధివలయితకుంభినీజననుతదంభశాంభవకళాజృంభితములు
నందివాహపదారవిందవిశ్వాసమరందసంపాదనేందిందిరములు
స్వేక్షణాదరవరాధ్యక్షలక్ష్మీప్రదానక్షమసామ్రాజ్యదక్షిణములు
ఊహాపదాత్మబోధాహతస్వాంతసందేహాలీలాపశ్యతోహరములు
ధీరతాగుణమణిహారి దెందులూరి
లింగగురువరసత్కృపాపాంగవీక్ష
ణములు సతతంబు శుభనిదానంబులౌచు
శిష్టజనముల దయను రక్షించుఁగాత!

ఈకవి గౌరీకళ్యాణ మను నామముతోఁ గాళిదాసకృతమయిన కుమారసంభవమును వెలిగించుటయేకాక సుబంధకవి విరచితమయిన వాసవదత్తను వాసవదత్తాపరిణయమను పేరితో నాంధ్రీకరించి దానిని పీఠికాపురాధీశ్వరుఁడయిన రావు మాధవరాయనింగారి కంకితము చేసెను. పద్మనాయకకులసంభవుఁడైన శ్రీరామచంద్ర మాధవరాయనృపాలుఁడు తన్ను బిలిపించి వాసవదత్తను వెలిఁగింపనడిగిన కథను కవి వాసవదత్తాపరిణయమునం దిట్లు చెప్పికొనియున్నాడు—

శా. శ్రీమచ్చంద్రకళాకిరీటపదరాజీవద్వయీభావనా
సామర్థ్యోదితవాక్ప్రపంచఘటనాచాతుర్యవిద్వజ్జన
స్తోమానందదశేముషీనిజవిలాసు న్వక్కలంకాన్వయున్
ప్రేమా ద్యాప్తను వీరభద్రుని ననుం బిల్పించి యుప్పొంగుచున్.

క. తాతలతరమునుండియు। నీతనిజనకుండు మనకు హితుఁడు కవీంద్రుం
డీతనిచేతం గృతి వి। ఖ్యాతిగఁ గైకొందు ననుచు హర్షం బొదవన్.

గీ. సవినయంబున సముచితాసనమునందు
నంతికంబునఁ గూర్చుండ నాజ్ఞయొసఁగి
మందహాసాంచితముఖారవిందుఁ డగుచు
నతిదయాస్ఫూర్తి నిట్లని యానతిచ్చె.

క. శ్రీవెలయ నుభయభాషల। నీవలెఁగృతిఁజేయఁగలరె నేఁటికవీంద్రుల్
భూవిశ్రుతకవితావి। ర్భావయశస్సాంద్ర వీరభద్రకవీంద్రా.

సీ. మీతాత లోకవిఖ్యాతభాషాఖిలశేషాహి యాచంద్రశేఖరుండు
మీతండ్రి చాటువాగాతతచిత్రప్రబంధకల్పనశాలి భాస్కరుండు
మీతల్లితండ్రి పురాతనసత్కవినాథుల కెన విశ్వనాథసుకవి
మీ మేనమామ సుత్రాముఁడై భవుఁడుసద్యఃకృతిమతి వేంకటాద్రిసుకవి
చదువకయె శ్రీసతీశప్రసాదగరిమ
బాల్యముననను గుమారసంభవము తెనుఁగు
చేసి కవు లెంచఁ బ్రఖ్యాతిఁ జెంది తీవు
కలరె నీసము లాధునికులు కవీంద్ర.

ఉ. అత్యలఘుక్రియానిపుణుఁడై ధరణీతల మేలు విక్రమా
దిత్యసభాంతరంబునఁ బ్రతిష్ఠితుఁడై ఘనధీసమగ్రతన్
సత్యవతీతనూభవునిజాడఁ బ్రసిద్ధికి నెక్కి నవ్యసా
హిత్యమునన్ సుబంధుసుకవీంద్రుఁడు ప్రస్తుతిఁగన్నవాఁడిలన్.

గీ. ఘనతరమనీష నమ్మహాకవివరుండు
ప్రతిపదశ్లేషగద్యప్రబంధ మత్యు
దారతను జెప్పె వాసవదత్తయనఁగ
నార్యులాకథ కడుచోద్య మనిరి సభను.

మ. స్తవనీయంబగు తత్కథాక్రమము భాషాయోషిదంఘ్రిస్ఫుర
న్నవమంజీరనినాదమేదురనితాంత ప్రౌఢవాగ్గుంభనన్
భవదీయోక్తుల నాంధ్రకావ్యముగ వైదర్భీగతిం గూర్పు త
త్కవినవ్యోక్తులు కొన్ని నీకవితకుం గై దండ గావింపఁగన్.

క. వరమతి వాసవదత్తా । పరిణయమును జెప్పి యీప్రబంధము విద్వ
త్పరిగణ్యంబుగ మాకుం । ధిరముగ సంకితముచేయు ధీరవిచారా.

భర్తృహరియొక్క సుభాషితరత్నావళిని దెనిఁగించిన యేనుఁగు లక్ష్మణకవి మొదలైన వారీకవితో సమకాలికులు. సమకాలమునం దున్న కవులు కూచిమంచి తిమ్మకవిని బొగడక యీతనిని బొగడుటచే దిమ్మకవి కవిత్వముకంటె నీతనికవిత్వమునం దప్పటివారి కధికాదరమున్నట్లు స్పష్టమగుచున్నది. ఏనుఁగు లక్ష్మణకవి తనరామవిలాసమునందుఁ బూర్వకవులను స్తుతిచేసిన పిమ్మట—

గీ. దిట్టకవి విశ్వనాథుఁ బ్రార్థించికొలుతు
నతనినందనుఁ డగువేంకటాద్రికవికి
వాక్యపూజలు గావింతు వక్కలంక
వీరభద్రుని భావింతు గౌరవమున.

అని యీవీరభద్రకవిని బేర్కొని యున్నాఁడు. ఆకాలమునం దుండిన యాదరవల్లి భవాని శంకరకవియుఁ దాను దెనిఁగించిన ధర్మ ఖండములో—

మ. హరితుల్యుం డగురావుమాధవ నృపాలాగ్రేసరున్ గావ్యచా
తురి మెప్పించి తదీయసత్కృప సిరుల్ తోరంబుగాఁ బొంది బం
ధురతేజుండగు వక్కలంకకులపాథోరాశిరాకాసుధా
కిరణుండై తగు వీరభద్రసుకవిం గీర్తింతు నా నెచ్చెలిన్.

అని వీరభద్రకవిని బ్రశంసించి యున్నాఁడు. సమానకాలమువా రిట్లు మెచ్చుటచేతనే యీకవి యసమానకవిత్వప్రౌఢిమ గలవాఁడని తేట

పడుచున్నది. ఈవీరభద్రకవి యాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; భారద్వాజగోత్రుఁడు; భాస్కరకవి పుత్రుఁడు; చంద్రశేఖరకవి పౌత్రుఁడు; దిట్టకవి విశ్వనాథకవి దౌహిత్రుఁడు. ఈతనితల్లి జగ్గాంబ; మేనమామ దిట్టకవి వేంకటాద్రికవి. ఈకవి తండ్రితాతలనుండియుఁ బిఠాపురసంస్థానమునం దుండినవాఁడు. తండ్రి తరమువారును తల్లి తరమువారునుగూడ సత్కవీశ్వరులు. ఈకవి మాతామహుఁడైన విశ్వనాథకవి పెద్దాపురసంస్థానస్థాపకుఁడయిన శ్రీవత్సవాయ ముసలి తిమ్మరాజుగారికిఁ దాను రచించిన శేషధర్మప్రబంధము నంకితము చేసెను. శేషధర్మరత్నాకరమనుపేరితో నీగ్రంథమునే రాజమహేంద్ర నివాసుఁడగు కొండయ కొడుకగు శ్రీనివాసకవియు రచియించెను. వీరభద్రకవి ౧౭౫౦ వ సంవత్సరప్రాంతమువఱకును జీవించియుండవచ్చును. ఇతఁడు తనవార్ధకదశలో పిఠాపురమును విడిచి వృద్ధగౌతమీతీరమునందున్న ముమ్మిడివరము ప్రవేశించి సన్యాసాశ్రమమును స్వీకరించి యక్కడనే సిద్ధిపొందెనఁట. ఈకవి విరచితగ్రంథములనుండి కొన్నిపద్యముల నిం దుదాహరించుచున్నాను—

## వాసవదత్తాపరిణయము.

శా. భల్లూకంబులఁ జూచితే తిమిరసంపల్లాలితాంగప్రభో
ద్వల్లీలన్ ఘననీలనీలఘనసఖ్యం బెప్పుడుం జేయఁగా
వల్లీవేల్లితవామలూరువులక్రేవం గొంటుజంటీఁ గలం
దెల్లం గుయ్యిడఁ దేనియ ల్గొనెడు భూమీశా విచిత్రంబుగన్. ఆ-౬

శా. ప్రచ్ఛాయస్థలపల్లవాస్తరణనిద్రాయోగ్యముల్ పాటలీ
గుచ్ఛాకల్పమరు న్మనోజ్ఞతరముల్ కూలంకషాభ్యంతర
స్వచ్ఛాంభఃపరిషేచనార్హములు పశ్చాద్భాగసౌభాగ్యముల్
స్వచ్ఛందస్థితి గ్రీష్మవాసరము లెంచం జాల మించెం ధరన్. ఆ. ౩.

## కుమారసంభవము.

చ. హరుఁ డఖిలేశుఁ డవ్వనరుహాక్షితపఃప్రతిఘాతిహేతువై
పరఁగినతత్సపర్యలకు భావమునం గడుమెచ్చి యొప్పెఁ దా
నరయ వికారకారణము లంటిన నిశ్చలతం దనర్చు నె
వ్వరిహృదయారవిందములు వారలె ధీవరు లెంచిచూడఁగన్. ఆ-౧

చ. మలయవసుంధరాధరసమాగతబంధురగంధవాహరా
జుల నెదిరించుచున్ వివిధనూనగుళుచ్ఛరజఃపరంపరల్
కలయఁగఁ జూపు లడ్డుకొనఁగాఁ గను గానక దర్ప మేర్పడన్
జెలఁగి మృగంబు లవ్విపినసీమ నటించె మధూదయోన్నతిన్. ఆ-౨

ఉ. అన్న తలంచు రూపము హితాళి తలంచుఁ గులంబు తల్లి దా
నెన్న సువస్తువుల్ వరుల నేర్పుతతిన్ బురవైరి నెంచినన్
గన్నులు మూడు పుట్టుటయె కానఁగరాదు దిగంబరుండునుం
జిన్నముసొమ్ములేదు తెలిసెం దగఁ డాతఁడు నీకు మానినీ. ఆ. 3.

ఉ. క్రొత్తలుచేసి గేహములు గోవజవాజిని బచ్చికస్తురిన్
మెత్తిరి గోడ లందుపయి నిద్దపుఁజాయలపాలసున్నముల్
చిత్తరువుల్ లిఖించిరి విచిత్రగతి న్నయనోత్సవంబుగా
నత్తఱి నుత్తముల్ ప్రతిగృహంబున శోభనశోభ సందిలన్. ఆ. ౪.

# 14. కూచిమంచి జగ్గకవి

ఇతఁడు సుప్రసిద్ధుఁ డయిన తిమ్మకవి సార్వభౌముని రెండవ తమ్ముఁడు. ఈతని జన్మసంవత్సర మేదో తెలియదుగాని తిమ్మకవికంటె నాలుగయిదుసంవత్సరములు చిన్నవాఁడయి యుండవలసినందున, ఇతఁడు ౧౭౦౦ వ సంవత్సర ప్రాంతమునందు పుట్టిన ట్టూహింపఁదగియున్నది. ఈజగ్గకవి యిరువది సంవత్సరముల ప్రాయము వచ్చువఱకును చదువెఱుఁగక యల్లరిమూఁకతో దిరుగుచు కాలము గడపెననియు అప్పుడు వివాహితుఁడయి యత్తవారియింటికి మనుగుడుపునకు బోయి మామగారు తనకుఁ బరమశుంఠ యైనయల్లుఁడు దొరకినందున కనుతాపపడఁగా రోషముచేత దేశాంతరమునకు లేచిపోయి పండ్రెండు సంవత్సరములు విద్యాభ్యాసముచేసి పండితుఁ డయి కవిత్వము చెప్ప నారంభించెననియు, పుక్కిటపురాణ మొకటి కలదుగాని యిది కేవల కల్పితకథయని తోఁచుచున్నది. ఈకథనుబట్టి యీకవికి కవిత్వము చెప్పనారంభించు కాలమునాఁటికి ముప్పదిమూఁడు సంవత్సరముల ప్రాయ మయి యుండవలెను. కూచిమంచి తిమ్మకవి తాను ముప్పదిసంవత్సరముల ప్రాయమునఁ జేయ నారంభించిన సింహశైలమాహాత్మ్యమునందు దనపెద్దతమ్ముఁడైనసింగన్నను వర్ణించినతరువాత రెండవతమ్ముఁడైన యీజగ్గకవిని గూర్చి యిట్లు వ్రాసియున్నాఁడు—

క. అతని యనుజన్ముఁ డతులిత
మతియుతుఁడు సమస్త రాజమాన్యుఁడు సుగుణా
న్వితుఁడు సముంచితకవితా
చతురుఁడు జగ్గప్రధానచంద్రుఁడు తనరున్.

క. భోటకలాటకిరాటవ
రాటమరాటాంగవంగరాజనఁనబా

ర్ఝూంటనిరాఘాటనటు
చ్చాటుకవిత్వాంకుఁ డరయ జగ్గన ధరణిన్.

సీ. నిరతంబునుడివోనిసిరినిరవొందియుఁ దవుటెనిప్పటిమెక్కుఁ దలఁపఁడేని
సదమలాచారప్రశస్తిగాంచియువర్ణములు సంకరంబుగాఁ గలఁపఁడేని
ఖలజనసంశితుఁ గావింపుచుండియుఁ బతితుల నెపుడుఁ జేపట్టఁడేని
యురుపుణ్యావర్తియయ్యును బాడబాశ్రయసీమ నిల్లుగను వసింపఁడేని
యలజగన్నాయకుఁడు పాటియనఁగఁబోలు
భోగమున నిర్మలాచారమున విశిష్ట
రక్షణంబునఁ బుణ్యామార్గమున నరయ
గంగనామాత్యు జగ్గయఘనునితోడ.

ఈపయిపద్యములు రచియింపఁబడిన కాలమునను జగ్గకవి యించుమించుగా నిరువదియైదు సంవత్సరముల యీడుగలవాఁడయి యుండును. ఇరువదియైదేండ్ల ప్రాయమునాఁటి కన్నిదేశములు తిరిగి రాజసభలలోఁ బ్రసిద్ధిగాంచఁ గలుగుటకు కవి యిరువదియేండ్ల వయస్సునకు లోపలనే పండితుఁ డయి కవనచాతురి గలవాఁ డయియుండవలెను. అందుచేత జగ్గకవి యిరువది సంవత్సరముల ప్రాయము వచ్చువఱకును నక్షర జ్ఞానము లేనివాఁడని చెప్పెడికథ నమ్మఁదగినదికాదు. ఈకవి తనవివాహానంతరమున ధనార్జనము నిమిత్తమును పాండిత్యప్రకాశనము నిమిత్తమును బహుదేశాటనముచేసి రాజాస్థానములలో మెప్పొంది సత్కారమును బొందుట వాస్తమే యైనను, "భోటకలాటకిరాటవరాటమరాటాంగవంగ" యని ప్రాసనిమిత్తమయి వేయఁబడిన దేశసంచారము కొంత యతిశయోక్తియై యుండవచ్చును. ఇతఁడు దేశాటనముచేసి వచ్చిన తరువాతను దత్తూర్వామునను, జానకీపరిణయమును, ద్విపద రాధాకృష్ణచరిత్రమును, చాటుప్రబంధములును, సుభద్రాపరిణయమును, చంద్రరేఖావిలాపమును, సోమదేవరాజీయమును రచియించెను. చంద్ర

రేఖావిలాపములోని యీక్రింది పద్యమున వర్ణింపఁబడిన వరుసనుబట్టి విచారింపఁగా నితఁడు దేశసంచారముచేసి రాజాస్థానములయందు రాజులమీఁద చాటుప్రబంధములు చేయుటకుముందే జానకీపరిణయమును రాధాకృష్ణచరిత్రమును రచించినట్లు తోఁచుచున్నది—

సీ. రచియించితివి మున్ను రసికులౌనని మెచ్చ సురుచిరజానకీపరిణయంబు
వచియించితివి కవివ్రాతము ల్పొగడంగ ద్విపదరాధాకృష్ణదివ్యచరిత
ముచ్చరించితివి విద్వచ్చయంబు నుతింపఁ జాటుప్రబంధముల్ శతకములును
వర్ణించితివి యిరువదిరెండువర్ణనల్ రాణించఁగా సుభద్రావివాహ
మాంధ్రలక్షణలక్ష్యంబు లరసినావు
భూరిరాజన్యసంసత్పూజితుఁడవు
బళిర నీభాగ్యమహిమ చెప్పంగఁదరమె
జగ్గకవిరాజచంద్ర వాచాఫణీంద్ర.

ఇతఁడీచంద్రరేఖావిలాపమును విజయనగరసంస్థానాధిపతులగు శ్రీ పూసపాటి విజయరామరాజుగారి చెల్లెలి పెనిమిటియగు చింతలపాటి నీలాద్రిరాజుమీఁది కోపముచేతఁ జేసెను. ఇది బూతుపుస్తకమగుటచే నిందలిపద్యము లుదాహరింపఁ దగియుండలేదు. "అర్ణవవేష్టితాఖిల మహామహీమండలిలోని బూతులం। బూర్ణుఁడ" నని కవియే చెప్పుకొనుటచే నీతఁడు తిట్టుకవిత్వమునం దసమానపాండిత్యముకలవాఁ డయినట్టు స్పష్టమగుచున్నది. జగ్గకవి ధనసంపాదనము నిమిత్తమయి విజయనగరమునకుఁ బోయి రాజు బావయైన నీలాద్రిరాజు నాశ్రయింపఁగా నతఁడు తానుంచుకొన్న వేశ్యను నాయికఁగా జేసి తనమీఁద ప్రబంధము చేయుమని కోరెనఁట! ధనాశచేత నట్టిప్రబంధరచన కొప్పుకొని కవి చంద్రరేఖావిలాసమను శృంగారకావ్యమును జేసెనఁట! అటు తరువాతఁ దాను సంస్కృతకావ్యమును రచించి యిచ్చెదనని చెప్పి

రాజుమతి మరలించిన యాడిమల్ల వేంకటశాస్త్రి ప్రోత్సాహముచేత నీలాద్రిరాజు జగ్గకవికి తగినబహుమానముచేసి సత్కరింపక తిరస్కార మును జూపెనఁట! అందుపైని మున్కోపియైన యీగ్రామార్థకవితాను రచియించిన చంద్రరేఖావిలాసమును చింపివేసి చంద్రరేఖావిలాపమను పేరిట నిప్పటి బూతుగ్రంథమును జేసెనఁట! ఇందలి కవివర్ణనలో సహి తము సాధుకవులను విడిచి యిట్లు తిట్టుకవిత్వము చెప్పినకవులనే పేర్కొని యున్నాఁడు—

క. భీమకవి రామలింగని । శ్రీమంతుండైన వెలుంగు శ్రీనాథకవిన్
రామకవిముఖ్యులను బ్రో । ద్దామగతిం జిత్తవీథిఁ దలఁచి కడంగన్.

ఈపుస్తకములోని మొదటిపద్య మిట్లున్నది—

శా. శ్రీకంఠుండు భుజంగభూషణుఁడు భస్మీభూతపంచాస్త్రుఁ డ
స్తోకాటోపబలప్రతాపపురరక్షోదక్షసంశిక్షుణుం
డాకాశోజ్జ్వలకేశపాశుఁడు త్రిశూలాంకుండు రుద్రుండు దా
వీకం డింతలపాటనీలనృపతి న్వీక్షించు నేత్రత్రయిన్.

ఈపుస్తకమునుజేసి జగ్గకవి నిజాంరాజ్యమునకుఁబోయి హైదరా బాదునగరమునందుఁ గల తురకదొరల నాశ్రయించి వారిమీద పద్య ములుచెప్పి తన్మూలమున నవాబుయొక్క దయను సంపాదించి, నిజాము ప్రభుత్వమునకు లోఁబడిన సామంతరాజ్యమైన విజయనగరమునకు ప్రభువగు శ్రీవిజయరామరాజుగారివద్దకుఁ దనగ్రంథమును నీలాద్రిరాజు సమ్ముఖమున సభలోఁ జదివించి వినునట్లు నవాబువద్దనుండి యుత్తరువు తెచ్చి యట్లు చదివెనని చెప్పుదురు. ఇతఁడు గ్రంథమునందు నీలాద్రి రాజు నెంత దూషించినను, తత్పత్నియగు నరసమాంబను దూషింపక యాపతివ్రత నిట్లు భూషించెను—

క. ఖలుఁడైన నీలనృపుఁ డీ । యిలపై నిన్నాళ్ళు బ్రతుకునే నరసాంబా
గళకలితకనకమయ మం । గళసూత్రోత్కృష్టమహిమఁగాక కుమారా.

ఈజగ్గకవియు నించుమించుగా నన్న జీవించినంతకాలము జీవించి నట్లు కనఁబడుచున్నది. అందుచేత నితఁడు ౧౭౦౦ వ సంవత్సర ప్రాంతము మొదలుకొని ౧౭౬౦ వ సంవత్సరప్రాంతమువఱకును జీవించి యుండినవాఁడని జెప్పవచ్చును. ఈతఁడు రచియించిన గ్రంథములలో నాలుగాశ్వాసములు గల సుభద్రాపరిణయము మనోహరముగా గనఁబడు చున్నది. ఆపుస్తకమునందు జగన్నాయకస్వామినిగూర్చి వ్రాయఁబడిన మొదటిపద్య మిట్లున్నది.

ఉ. శ్రీయలరంగ సుభద్రయును సీరియుఁ బార్శ్వముల న్మెలంగ న
త్యాయతలీల నీలకుధరాగ్రమునందు వసించి నిచ్చలుం
బాయక భక్తకోటి కనపాయశుభంబు లొసంగు శ్రీజగ
న్నాయకదేవదేవుఁ డభినంద్యకృపామతి మమ్ముఁ బ్రోవుతన్.—ఆ. ౧.

సుభద్రాపరిణయమునం దితఁడు

గీ. నన్నపార్యుని తిక్కన నాచిరాజు
సోము నమరేశు శ్రీనాథు భీమకవిని
రంగనాథునిఁ బోతనఁ బ్రాజ్ఞవరుని
శంభుదాసుని భాస్కరు సంస్తుతింతు.

అని కవిస్తుతిచేసి తనయన్నయగు తిమ్మకవి నిట్లు పొగడి యున్నాఁడు—

సీ. కౌండిన్యగోత్రవిఖ్యాతునిఁ గూచిమంచ్యన్వయాంభోధినీహారకరుని
గంగనమంత్రిశేఖరునకు నంగనామణి యగులచ్చమాంబకును సుతుని
బహుకావ్యనిర్మాణబంధురప్రతిభునిఁ గుక్కుటేశ్వరకృపాంకూరలబ్ధ
సత్కవితామహాసామ్రాజ్యభారధౌరేయుని బుధజనప్రియచరితుని
వెందులూరి లింగనారాధ్య దేశికేంద్ర
దత్తమాహేశ్వరాచారవృత్తిరతునిఁ
గందరాడఘనగ్రామమందిరుని మ
దగ్రజునిఁ దిమ్మకవిరాజు నభినుతింతు.

ఇతఁడు తనగ్రంథములను జగన్నాథస్వామి కంకితము చేసెను. ఈకవిచేరచియింపఁబడిన జానకీపరిణయము మొదలయినగ్రంథములునాకు లభించినవి కావు. ఇతఁడు కాకతిప్రతాపరుద్రవంశజుఁ డయిన మందపాటి నారాయణరాజుయొక్క ప్రేరణముచేతఁ బ్రతాపరుద్రవంశమును వర్ణించుచు సోమదేవరాజీయమను మూఁడాశ్వాసముల గ్రంథమొకటి రచియించెను. కవియొక్క కవితానైపుణిని జూపుటకై కొన్నిపద్యముల నిందుదాహరించుచున్నాను—

## సుభద్రాపరిణయము.

చ. సురుచిరలీలఁ గన్గొనియె శోభనదివ్యసరోజమాలికా
పరిమళలాభలోభమదబంభరడింభరవామమంగ దు
ర్భరదురితౌఘభంగ నతిభాస్వరగాఢతరంగ రంగదీ
శ్వరమకుటాగ్రరంగ శుభసంగను గంగఁ దగంగఁ జెంగటన్. ఆ. ౨.

ఉ. ఆరమణీలలామము లుదంచితలీలలఁ గాంచి రొక్క కా
సారము సారసౌరభవిశంకటసారసపుండరీకక
ల్హారమరందపానపరిలంపటమాద్యదళీంద్రసాంద్రఝం
కారము కోకహంస బకకచ్ఛపమీనఝులీకుళీరముల్. ఆ. 3.

శా. కారంబయ్యె నితంబినీమణి కలంకారంబుఁ రోలంబఝుం
కారంబుల్ సమదోగ్రకోకిలకుహూకారంబుఁ జంద్రోద్ధతా
కారంబుల్ గుసుమాస్త్రచాపగుణటంకారంబు రాయంచక్రేం
కారంబుల్ శుకశారికానికరహుంకారంబు ఘోరంబుగన్. ఆ.౫.

చ. తళుకుఁబిసాళివాలుఁగనుదమ్ముల లోకించుక విప్పి కన్యకా
తిలకము కాంచె నీలమణిదీధితిజాలమనోజ్ఞ గాత్రునిన్
బలవదరాతిజైత్రునిఁ గృపాపరిపూరిత నేత్రునిన్ సమూ
కలితవిలాసచైత్రుని జగన్నుతిపాత్రునిఁ బాండుపుత్రునిన్. ఆ. ౬.

సోమదేవరాజీయము.

శా. అన్నా యెక్కడనుంటి వొక్కడవు రే యాహా మహైశ్వర్య వి
వెన్నన్ బాలుఁడ విట్టు లుంట నిహితంబే రేయి నట్టాములన్
నిన్నుం గానక కుందుచుంటిమిగదా నిక్కంబు మా ప్రాణముల్
కన్నారన్ని నుఁ జూడకున్న నిలువంగా నేర్చునే లేశముల్. ఆ. ౧.

ఉ. వింటిరె మీర లిప్పు డొకవింత కువాళపుబండివాండ్రు మొ
న్నంటనిశార్ధభాగమున నాచి మహేశగృహంబు చొచ్చి రా
బంటులె నిన్న రేయి మనపట్టణభూసురవర్యుఁ గొట్టి వా
రింటిపదార్థ మెల్ల హరియించి రనాయక మయ్యె రాజ్యముల్. ఆ. ౨

---

# 15. కొవలె గోపరాజు

ఈకవి యాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; హారితసగోత్రుఁడు; గోపరాజు పౌత్రుఁడు; కసవరాజునకును కామాంబికకును పుత్రుఁడు. ఇతఁడు సింహాసనద్వాత్రింశతిక యనుపేరవిక్రమార్కునికథలను పండ్రెండాశ్వాసముల పద్యకావ్యముగా రచియించెను. ఈద్వాత్రింశత్సాలభంజికల కథలను రచించుటనుగూర్చి కవి యిట్లు వ్రాయుచున్నాఁడు—

క. అప్పరమేశ్వరుకరుణన్। గుప్పలుగొనువిక్రమార్కు గుణములకొలఁకై
చెప్పెద రసభావంబులు।మెప్పిరిగొనునట్లు కథలు ముప్పదిరెండున్.

ఈకవివంశమునకు మూలపురుషుఁడైన పెన్నయామాత్యుఁడు

సీ. కలుషమండలికభేకఫణీంద్రుఁడన రాయగజగంధవారణఖ్యాతి మెఱసి

* * * *

నెగడె నందవోలు నెలవుగా భూసుర।వంశసాగరామృతాంశుమూర్తి
చక్రవర్తి మాన్యసౌజన్యధుర్యుండు।విక్రమార్కుని ఘనుఁడు పెన్నవిభుఁడు.

ఈపద్యమునుబట్టి నందవోలురాజులయొద్ద మంత్రిగానుండి బిరుదముల నందినట్టు కనుపట్టుచున్నాఁడు. ఇతఁడు పదునాలవ శతాబ్దమధ్యమునందుండి యుండవచ్చును. కాఁబట్టి యీపెన్నయామాత్యునకేడవపురుషుఁడైన కవి తరువాత నూటయేఁబది సంవత్సరముల కనఁగా పదునేడవశతాబ్దాంతమునం దుండి యుండును. కవితండ్రియైన కసవరాజు వేముగల్లు పురాధీశ్వరుఁ డయిన మల్లరాజు మంత్రియైనట్టు,

శా. రాణ్కా మల్లనకీర్తిచంద్రికలు సర్వం బొంగి మధ్యాశ్రిత
క్షోణీభృద్ఘనదుర్గమై గుణమణిస్తోమంబుల న్నిండి యీ
క్షోణిన్ శ్రీపురుషోత్తమాశ్రయము నై శోభిల్లి దానామృత
శ్రేణిన్ ద్యాగసముద్రనామము వహించెన్ వేముగల్లిమ్మహిన్.

ఇత్యాది పద్యములవలనఁ దెలియవచ్చుచున్నది. కాని యీమల్లనృపాలుఁ డెవ్వఁడో యేకాలమునందుండినవాఁడో యింకను విచారింపవలసియున్నది. ఎట్లయినను గవి యించుమించుగా నిన్నూఱుసంవత్సరములక్రిందటివాఁ డగుటకు సందేహము లేదు. ఈ విక్రమార్కచరిత్రములోని గద్యమునందు

"ఇది రాయగజగంధవారణ వైరిమండలీకఫణీంద్ర వీరఘోట్ట విభాళాదిబిరుద ప్రకటచారిత్ర కొవలె పెన్నయామాత్యపౌత్ర హరితసగోత్ర పవిత్ర సకలసుకవిమిత్ర కసవరాజతనూజ గోపరాజ విరచితంబైన......"

అని పెన్నయామాత్యుఁడు తనకు తాతయైనట్లు చెప్పుకొనెనుగాని వంశవర్ణనమువలన కవి కేడవపురుషుఁడైనట్టు స్పష్టమగుచున్నది. ఈద్వాత్రింశత్సాలభంజికాకథల కవిత్వము విక్రమార్కచరిత్రమును రచించిన జక్కనకవిత్వమునకుఁ జాలకపోయినను మొత్తముమీఁదఁ జక్కనిదిగానే యున్నది. ఈపుస్తకములోని రెండుపద్యము లిందుఁ బొందుపఱుపఁబడుచున్నవి___

ఉ. అన్నలొ రమ్ములో చెలులొ యాత్మజులో చనువారు పేరికై
మిన్నక చావనేల యిదిమేలె భువిం బలిభోజికయ్యు నా
యున్నెడ పిశ్వసింప నొరునొద్దకుఁ జేరఁ బ్రమాద మౌనుఁ గ
న్నన్న నెఱింగి యొండెడకు, జాఁగుఁడు ప్రాణము తీపి చూచితే. ఆ.౪

ఉ. దేవసమాన నిన్ను వినుతించుట వాంఛితసిద్ధి భూమిలో
నేవసుధేశు నీయెదుట నెన్నఁగవచ్చు మదీయజిహ్వల
జ్జావశమై చలింప దిఁక సద్గుణముం దగ సద్గుణాఢ్య ప్ర
స్తావన చేయ నేరనియతం డతిమూర్ఖుఁడుగానఁ జెప్పెదన్. ఆ.౧౧

---

# 16. కొడిచెర్ల శ్రీనివాసకవి

ఇతఁడు శైవధర్మరత్నాకర మనియెడి యేఁడాశ్వాసముల పద్య కావ్యమును రచియించెను. ఈగ్రంథము శైవధర్మములనియు వాడుదురు. ఈకవి యాత్రేయగోత్రుఁడు. కొండయభవానిపుత్రుఁడు. రాజమహేంద్ర పుర నివాసుఁడు. ఇతఁ డిన్నూఱుసంవత్సరములకు ముందుండినవాఁడు. ఇతఁ డొకవేళఁ బదునేడవశతాబ్దమధ్యమునందుండి మధ్యకవులలోఁ జేర వలసినవాఁ డేమొ ! పుస్తకములోని

'ఇది నవరసానుబంధ బంధురప్రబంధ నిబంధనా చాతురీ ధురీణ సకలకళాప్రవీణాత్రేయగోత్రపవిత్ర కొడిచెర్ల కొండయభవాని పుత్ర ఐవరగండ బిరుదప్రచండ మంత్రిమార్తాండ సమస్త సద్గుణా వాస శ్రీనివాసప్రణీతంబైన హరివంశముఁనందలి శైవధర్మసారం బను మహాప్రబంధంబునందు.'

అను గద్యమునుబట్టి చూడఁగా నితఁడు మంత్రిశిఖామణియై బిరుదముల నందినట్లును, అత్యంతాధునికుఁడు కానట్లును, కనఁబడుచున్నాఁడు. ఈతని

కవిత్వము ప్రౌఢమయి రసికజనహృదయంగమముగా నున్నది. ఈతని శేషధర్మములనుండి కొన్ని పద్యముల నిం దుదాహరించుచున్నాను—

చ. నెలకొని సంగమంబున జనించును గామము కామవృద్ధిచేఁ
దలకొనుఁ గ్రోధ మట్టిదెడిదంబగుక్రోధమునం దనర్చు మో
హాలతిక మోహవృత్తి నుదయం బగు విస్మృతి విస్మృతిం జనుఁ
దలఁపఁగ బుద్ధి బుద్ధి చనినన్ మఱితాఁ జెడు మానవుం డిలన్. ఆ. ౧.

ఉ. మేఁడియు సీరముం భుజముమీఁద భరించుచుఁ బోతు నెద్దుతోఁ
గూడఁగఁ గాఁడిఁబూన్చి ములికోల కరంబునఁ బట్టి పగ్గపుం
ద్రాడును మోకువారెనయుఁ దాలిచి ముందట వెన్కఁ జుంగు వ్రే
లాడఁగఁ గాసె కట్టుకొని యకుటిలాత్మకుఁ డేఁగెఁ జేనికిన్. ఆ. ౩.

ఉ. రామ కృపాభిరామ రిపురాక్షస వీరవిరామ సాహసో
ద్దామ లసద్గుణప్రకరధామ సమస్తనృపాలలోకసు
త్రామ విభాకరాన్వయసుధాసరిదీశ్వరసోమ సద్గుణా
రామ నిను న్నుతింప నల రాజకళాధరుఁడైన నోపునే. ఆ. ౫.

---

# 17. పట్టమట్ట సోమనాధకవి

ఇతఁడు స్కాందపురాణములోని నూతనసంహితను నేడాశ్వాసముల గ్రంథముగాఁ దెనిఁగించెను. ఈకవి యారువేల నియోగిబ్రాహ్మణుఁడు. హారితసగోత్రుఁడు; వేంకటామాత్యపుత్రుఁడు. ఇతఁడు తనగ్రంథమును బిక్కనవోలి కామారెడ్డి కంకితముచేసెను. ఈగ్రంథము రచియింపఁబడినకాల మిప్పటికి నిన్నూఱుసంవత్సరములకంటె నెక్కువయి నట్టు తోఁచుచున్నది. కృతిపతియైన కామినేని కామారెడ్డి యెప్పుడుండిన

వాఁడో తెలిసినదికాదు. కృతికర్త గోదావరిమండలములోనివాఁడు. సూతసంహిత కవిత్వము సలక్షణమయినదిగానున్నది. కవిత్వాకారణేని తెలుపుటకయి సూతసంహితలోని పద్యములు కొన్ని యిందుదాహరింపఁబడుచున్నవి—

ఉ. మున్ను పురాణపూరుషుఁడు ముఖ్యుఁడు విష్ణుఁడు శంభుమాయ పైఁ
కొన్న విమోహితుండయి యకుంఠితగర్వ మెలర్ప నేన యీ
యన్నిజగంబులుం బొదివి యాసినకర్తను బేరుకొన్న నా
కన్న ఘనుండు నాసముఁడు గన్గొన నెవ్వఁడు శాశ్వతంబుగన్. ఆ.౧

ఉ. పాపము లట్లు కొన్ని యెడఁబాసిన రోగము లెల్ల మాని యు
ద్దీపితసత్త్వుఁడై దృఢమతిన్ శశిపర్ణుఁడు తన్మనై కర
తాపరతంత్రవృత్తిఁ దృణకాష్ఠఫలోదకశాకమూలనా
నాపరిచర్యలన్ దినదినంబు గురుల్ భజియించు నెంతయున్. ఆ. 3.

చ. సరవి నబోధమూలమగు సంస్కృతివృక్షము మూలనాశనం
బురుగతిఁజేయ మంత్రరచితోదక పుష్పముఖార్చనంబు లే
సరణిని జాల వాత్మరతి జ్ఞానమె ముఖ్యశివార్చ యాబహి
ర్విరచితపూజనంబు లవివేకులు స్థూలము లందు రజ్ఞతన్. ఆ. ౫.

ఉ. అట్టిమహేశ్వరుం దెలిపి యవ్యయధామము నొందవచ్చు నే
పట్టునఁ గర్మకోటి నది ప్రాప్తముకాదు సమస్తయజ్ఞముల్
నెట్టన భూరిసంసరణనీరధి దాఁటఁగ మంటియోడ లౌ
నెట్టును మృత్యువున్ జరయు నేచును గేవలకర్మతంత్రులన్. ఆ. ౭.

# 18. దివి రమణకవి

ఇతఁడు వాసిరెడ్డి రామలింగప్రభుని ప్రేరణముచేత శృంగారధామము అను రెండాశ్వాసముల ప్రబంధమునుజేసి నృసింహస్వామి కంకితము చేసెను. కవి తన్నుఁ గృతిచేయఁ బ్రేరేపించిన రామలింగప్రభునిఁ దన ప్రబంధమునం దిట్లు వర్ణించియున్నాఁడు—

సీ. ఏధన్యువంశేశుఁ డెలమి సమానాథువరమున నభివృద్ధివంతుఁ డయ్యె
నేమేటికూటస్థుఁ డెసఁగ వేమనృపాలుప్రీతిచే భువి వాసిరెడ్డి యయ్యె
నేమహాత్మునితండ్రి యెంచెఁ గుతుబుశానృపాలుచే గజాందోళికంబు
లేయయ్యయగ్రజుఁ డెలమి శాత్రవవీరగజదాజసింహతఁ గలన నమరె
నతనివంశజుఁ డతనికూటస్థజాతుఁ
డతనిసత్పుత్రుఁ డాతనితమ్ముఁ డగుచు
నమరె బహుగుణరత్నరత్నాకరుండు
కదనవిజయుండు రామలింగప్రభుండు.

ఈపయిపద్యమునుబట్టియే యీకవి నిర్దుష్టముగాఁ గవిత్వము చెప్పలేనివాఁడగుట స్పష్టమగుచున్నది. అభివృద్ధిమంతుఁడనుట కభివృద్ధి వంతుఁడనియు, అందుననుట కెం దెననియుఁ బ్రయోగించినను మొత్తము మీఁద గవిత్వము రసహీనమైనదికాదు. కృష్ణామండలములోని యమరావతీ సంస్థానప్రభువుల ప్రేరణమునుబట్టి పుస్తకమును రచించుటయు మంగళగిరి నృసింహుని కంకితముచేయుటయు విచారింపఁగా నీకవికృష్ణామండలములోనివాఁడనుట తేలుచున్నది. కుతుబుశాను పేర్కొని యుండుటచేతఁ గవి పదునేడవశతాబ్దమధ్యమునం దుండిన ట్లూహింపఁ దగియున్నది. శృంగారధామమునుండి రెండుపద్యము లిం దుదాహరింపఁ బడుచున్నవి—

చ. అలికులవేణికిం బ్రియుఁ డసంగనృపాలుఁడు దాడిచేసి యీ
 వలనికి నేఁట రేపటనె వాసిగ రాఁగలఁడంచు బాల్యముక్
 గళవళమంది చింతిలఁగఁ గన్పడెఁ దన్ముఖరాజబిమ్మముల్
 కలికి వయఃప్రకాశగుణకాంతియు బాల్యవయస్సుసంధిగన్. ఆ. ౧.
మ. సరి నీ వాయెదిరింటి కేఁగఁ గని యేఁ జాలించి యున్నంతలో
 నరయం దత్ఫల మేమి మున్పటిమదీయార్థంబు మాకిచ్చి యే
 సరణింబోయినఁ బొమ్మటంచు వడిఁ జంచచ్చిత్తయై వేశ్య త
 త్కరయుగ్మాంచితకంకణంబు లొగిఁ దాఁ గాంక్షించి తీసె న్వెసన్. ఆ-౨

---

## 19. కోడూరి వేంకటాచలకవి

ఈకవి స్కాందపురాణములోని శివరహస్యఖండమును తెనిఁగించెను. (ఈతనికి బాలసరస్వతియను బిరుదాంకముగలదు.) ఈతఁడాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కాశ్యపగోత్రుఁడు; ఎల్లనామాత్యపౌత్రుఁడు; శంకరామాత్య పుత్రుఁడు. ఈశివరహస్యఖండము శ్రీ ముసురు ముళువాగళుప్రభుని కంకితము చేయఁబడినది. ఇతఁడు బళ్లారిప్రాంతములయందుండిన లింగబలిప్రభువని తోఁచుచున్నది. కృతిపతియొక్క పూర్వులలో నొకనిని వర్ణించుచు—

క. ధరణిస్థలి నాపరశివ। చరణోద్భవులందు సకలసామ్రాజ్యరమా
 భరణుఁడు వీరనృపాలుఁడు। వరభింగకగోత్రుఁ డగుచు వర్ధిల్లెఁగడున్.

అని కవి యతనిని శివపాదోద్భవకులజునిఁగాఁ జెప్పినందునఁ దద్వంశము శైవశూద్రవర్ణమని చెప్పవచ్చును. (కృతిపతియొక్క పితామహుని మాతామహుఁడైన చిక్కరాజను నామాంతరముగల ముళువాగళునృపాలు నీక్రిందిబద్యములలో మధురాపురీశ్వరుని జయించినట్టును శ్రీవేంకటపతిరాయలకాలములో నుండినట్టును కవి వర్ణించియున్నాఁడు-)

మ. ప్రకటారాతివిదారితార్గళభుజాప్రాపీణ్య మింపార వా
రక యెంతే మధురాపురీవిభుని దర్పం బెల్ల వారించి భూ
రికృపాణోద్ధతిచేత వేంకటపతిశ్రీరాయసన్మాన్యుఁడై
చికరాజాఖ్య వహించె భాసురజయశ్రీధుర్యుఁడై వేడుకన్.

క. ఆముళువాగళునృపతి ధ। రామండలిఁ గీర్తి గాంచె రాజత్కాఠోర్యో
ద్దామబలావార్యజయ। స్తోమమహైశ్వర్యధుర్య శూలాన్వితుఁడై.

సీ. ఏధన్యునిర్మలబోధాంతరంగంబు రంగంబు పార్వతీరమణిపతికి
నేనరేశ్వరుకరాస్వితచంద్రహాసంబు హాసంబుఁ జేయు వజ్రాయుధంబు
నేరసజ్ఞునికీర్తి శారదామోదంబుమోదంబుహరిదంతములకుఁ గూర్చు
నేసుధీపతుభాషాసుధాసారంబు సారంబు బుధజనశ్రవణములకు
నతఁడు చెలువొందు హాటకాహార్యధై ర్య
సహితుఁ డనివార్యశౌర్యమాంసలభుజుండు
దానగాంభీర్యసౌందర్యమాననీయ
సుప్రభావుండు మళువాగళుప్రభుండు.

ఈపద్యములవలనఁ గృతిపతిపూర్వులు విజయనగర సంస్థానాధీశ్వరుల సేనాపతులయియుండి ప్రభుత్వము సంపాదించిరని మాత్రమే కాక కవికాలమును సహితము నిర్ణయింపవచ్చును. వేంకటపతిరాయలు ౧౫౮౬ వ సంవత్సరము మొదలుకొని ౧౬౧౪ వ సంవత్సరమువఱకును రాజ్యము చేసినవాఁడగుటచేత నాతనికి నాలుగుతరముల తరువాత నున్నకృతిపతియుఁ గృతికర్తయు ౧౭౦౦ వ సంవత్సరప్రాంతములయందున్నట్టు నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఇంతేకాక యాంధ్రకవిస్తుతిలోని యీక్రిందిపద్యములో బింగళి సూరన్నను బూర్వకవినిగా నభివర్ణించుటనుబట్టికూడ గవి యాధునికుఁ డని చెప్పవచ్చును—

సీ. చతురాస్యుఁడనఁగనుజగతివాగనుశాసనప్రౌఢిఁ జెలువందునన్నపార్యుఁ
గుండలీంద్రుఁ డన నఖండమేధాస్ఫూర్తి నలరారు తిక్కనయజ్వమణిని

నచ్యుతైకసమాఖ్య నంచితవరధార ప్రకటించు శ్రీనాధసుకవివరుని
సన్మార్గు లన సుప్రసాదతేజంబులఁ బరిఢవిల్లెడు సోమభాస్కరులను
భూరిసత్కళాద్విజరాజుఁ బోతరాజు
శుభమనోరథుఁ బింగళి సూరవిభుని
మఱియు నాంధ్రోక్తి విశ్వనిర్మాణపటిమ
ఘటితకమలోదయులను మహాకవుల నెంతు.

ఈక్రింది పద్యములలోఁ గవి కృతిపతియొక్క తాతయగు పోట్రి లింగభూపాలునిని తండ్రి యగు లింగభూపాలునిని బహువిధముల వర్ణించి యున్నాఁడు—

సీ. ఘనమార్గవర్తనుల్ గానివిరోధుల ఘనమార్గవర్తను ల్గాఁగఁజేసె
గరిదానమహిమంబు గాంచనిమతుల కరిదానమహిమంబుగాంచఁజేసె
మిత్రపద్ధతిదప్పి మెలఁగెడువైరుల మిత్రపద్ధతిఁ జెంది మెఱయఁజేసె
నెలమిఁ బాదములాశ్రయింపనిరిపులను నెలమి బాదములాశ్రయింపఁజేసె
ననుచు మెచ్చుచు జయరమావనజనయన
యోజి నెవ్వానిభుజపీఠి నాశ్రయించె
నతని నుతియింపఁదరమె నహార్యధైర్య
ధైర్యకుని పోట్రిలింగభూపాలవర్యు.

* * * *

సీ. ధరణి రాజులుగాని ధరణిరాజులుగారు దీటుదారక్షమాదివ్యరుచుల
నిన కేసరులుగాని యిన కేసరులుగారు ప్రతిప్రభావాటోపపటుబలముల
నల నరేంద్రులుగాని నలనరేంద్రులుగారు పురుడు భాసురవచోభోగములను
గోత్రేశ్వరులుగానిగోత్రేశ్వరులుగారు సరిధైర్యబంధురైశ్వర్యములను
నతని కనియెన్న ధారుణీపతులు దిశల
వెలసె నెవ్వాఁడు ప్రఖ్యాతి విస్తరిల్ల

నతఁడు చెలువొందె రాయవేశ్యాభుజంగ
జయబిరుదశాలి లింగభూజానిమౌళి.

ఉ. లింగనృపాలపుత్త్రుఁ డగులింగనృపాలుని శుభ్రకీర్తిశా
లింగని శారదాభ్రపటలింగని నాకధునీతరంగపా
ళింగని నీలచేలునిహాలింగని మానసవిస్ఫురన్మరా
ళింగని పద్మగర్భునిచెలింగని సారె హసించు నెంతయున్

ఈవఱ కుదాహరింపఁబడిన పద్యములచేతనే యితఁడు ప్రౌఢకవి యనియు నిరర్గళకవితాధార గలవాఁడనియుఁ దెలియ నయి యున్నను శివరహస్యఖండములోని కొన్ని పద్యములఁగూడ నిం దుదాహరించు చున్నాను—

సంభవకాండము.

ఉ. తేనియవాఁక యిచ్చుటను దిన్నఁగ రాఁగదవే మృగీమదం
బీనెలతాలబోదె లిఱు నిచ్చటజాఱెదుసుమ్ము కోకిలో
ద్గానము లిందు వింటె కలకంఠి యటంచు సఖీజనావళుల్
మానుగ హెచ్చరింప నసమానమహామహిమాభిరామయై. ఆ. ౧.

మ. పలితస్వచ్ఛశిరోజము ల్దనరఁగా బల్జీర్ణమౌ మేనునన్
వళులున్ వ్రేలఁగఁ గంపమంద శిరమున్ వక్త్రంబు నిర్దంతమై
వెలయన్ భూరిజరాతిభారమున గర్వీభూతుఁడై సారె ప్ర
స్ఖలదంఘ్రిద్వయ మొప్ప గద్దదిక మించన్ వృద్ధవిప్రాకృతిన్. ఆ. ౨.

ఉ. పోయెద నుండెదన్ సమరము న్రచియించెద నాయథేచ్ఛ నే
లా యిటు లాడఁ దావకబలంబుఁ జలంబును లావుఁ జేవయున్
వేయివిధంబులం బలుక వేమఱు నాకు జనించు హాస మో
హో యిదిచాలుఁ జాలు వినుమోరి వచించెద దానవాధమా. ఆ-౫

# 20. ఏనుఁగు లక్ష్మణకవి

ఈకవి బహుగ్రంథములుచేసి ప్రసిద్ధి కెక్కినవాఁడు. ఈతఁడు చేసినగ్రంథములలో రామవిలాసప్రబంధము కడపటిదిగాఁ గనఁబడు చున్నది. ఈప్రబంధము పెద్దాపురసంస్థానము దుండిన శ్రీవత్సవాయ గోపరాజున కంకితము చేయఁబడినది. ఈ గోపరాజు తన్నుఁగూర్చి పలికి నట్లు కవి తన రామవిలాసములో నీపద్యములఁ జెప్పుకొన్నాఁడు—

సీ. సురుచిరాపస్తంబసూత్రు వాధూలసగోత్రు సద్వినయాదిగుణసమేతు
నేనుఁగు లక్ష్మకవీంద్రునిపౌత్రుని శ్రీమాచిరాజు నృసింహమంత్రి
దౌహిత్రుభూవరాస్థానపూజ్యుఁడుతిమ్మమంత్రికిఁ బేరమాంబకుసుపుత్రు
ధన్యు ననంతాభిధానానుజుని వీరభద్రున కగ్రజు భాగ్యవంతు
లలితకవితాకళాధుర్యు లక్ష్మణార్యు
నన్ను బిలిపించి యుచితాసనమున నుంచి
చాలఁ గరుణించి తనముఖాబ్జమున మంద
హాస మమరంగ నిట్లని యానతిచ్చె.

సీ. సృజియించినాఁడవు సేతురామేశ్వరమహిమంబు పాండిత్యమహిమ మెఱయఁ
గల్పించినాఁడవుఘనులెన్నజాహ్నవీమాహాత్మ్యకృతిసుధామధురఫణితి
నిర్మించినాఁడవు నిర్జరభాషచే శతకంబు భాస్కరస్వామి కెలమి
రచియించినాఁడవు రుచిరంబుగా సుభాషితరత్నమాలిక శివునిపేర
రమ్యవిశ్వేశ్వరోదాహరణ నృసింహ
దండకాదిస్తుతిప్రబంధములు గూర్చి
సములలో నుత్తమఖ్యాతి నమరినావు
లలితగుణధుర్య యేనుఁగు లక్ష్మణార్య.

గీ. వారిజాసననారీముఖారవింద
సారసౌరభఘన ఘనసారసాంద్ర
వీటికాబంధురసుగంధవిభవమధుర
లలితవాగ్ధుర్య యేనుఁగు లక్ష్మణార్య.

గీ. ధీరులు నుతింప నీవ్వుడు మీరు సేయు
భాసురం బగురామవిలాసకావ్య
మంకితము చేయు మాపేర నచలధీర
ధరణి నాచంద్రతారకస్థిరముగాఁగ.

పై పద్యములవలన నితఁడు రామేశ్వరమాహాత్మ్యము, గంగామాహాత్మ్యము, గీర్వాణసూర్యశతకము, సుభాషితరత్నావళి, విశ్వేశ్వరోదాహరణనృసింహదండకాదిస్తుతులు, రామవిలాసము చేసినట్టు తెలియవచ్చుచున్నది. మఱియు నితఁడు విశ్వామిత్రచరిత్రమను మఱియొక గ్రంథమునుగూడ రచించినట్లు సుభాషితరత్నావళి యవతారికలోని యీక్రింది పద్యమువలనఁ గానవచ్చుచున్నది—

క. రామేశ్వరమహిమము వి। శ్వామిత్రచరిత్ర సూర్యశతకంబును గం
గామాహాత్మ్యము మొదలగు।శ్రీమత్కృతిరత్నములు రచించితి మఱియున్

ఆఱువేల నియోగియైన యీకవి యాపస్తంబసూత్రుఁడు; వాధూలసగోత్రుఁడు; తిమ్మకవి పుత్రుఁడు; లక్ష్మణకవిపౌత్రుఁడు; మాచిరాజు నృసింహుని దౌహిత్రుఁడు. ఈతని తల్లిపేరు పేరమాంబ; అన్నయనంతకవి; తమ్ముఁడు వీరభద్రుఁడు. ఈకవి వంశమునకు మూలపురుషుఁడు పైడిపాటి సింగన్న. ఈకవి పూర్వులయింటిపేరు పైఁడిపాటివారఁ రయినను సింగన్నవంశజులలో నొకఁడగు జలపాలామాత్యుఁడు పెద్దాపుర సంస్థానాధీశ్వరుఁ డగు గజపతిరాజుచే నేనుఁగును బహుమానమందుటచే నప్పటి నుండియు నేనుఁగువారని మాఱినది. ఈయంశమే సుభాషితరత్నావళ్యవతారికలో నిట్లు చెప్పఁబడినది—

సీ. పరమేష్ఠితుల్యప్రభావుండు వాధూలుఁ డనుఋషిచంద్రుం డొప్పు ననఘమూ ర్తి
యమ్మునినాథువంశమ్మున క్షీరాంబునిధి సుధాకరుఁడు జన్మించినట్లు
ప్రభవించి శ్రీపైఁడిపాటి సింగనమంత్రి వంశాగ్రగణ్యుఁడై వఱలు నతని
మహిమ సంతానక్రమమున నుజలపాలసచివుఁ డొప్పె జలారిసచివసముఁడు
గజపతిక్షితిభర్త చే గజముతోడ
నగ్రహారము లతఁడు పరిగ్రహించె
నెలమి నేనుఁగువారన్న యింటిపేరు
గలిగె నతనికి గజలాభగరిమవలన.

గీ. ఈడ్యగజపతిదత్తసోమేశ్వరాగ్ర
హారశాసనుఁడై మహోదారభాగ్య
మహిమ గలిగినజలపాలమంత్రిమణికి
గరికిరాజు జనించె విఖ్యాతయశుఁడు.

ఈకవియొక్క పూర్వికులు చిరకాలమునుండి పెద్దాపురసంస్థానమున నుద్యోగములలో నుండుచు వచ్చిరి. వారిలో గొందఱు కవులు సహిత ముండిరి. పయి పద్యమునఁ బేర్కొనఁబడిన గరికిరాజునకు మనుమఁడును కవికి బితామహుఁడును పెద్దాడగ్రామమునకు కరణము నయిన యేనుఁగు లక్ష్మణకవి పెద్దాపురసంస్థానమునం దుండి వత్సవాయవంశజు లయిన యచ్చుటిరాజుల కనేకకృతు లంకితము చేసెను. ముందుగాఁ గవి తనతాతనుగూర్చి సుభాషితరత్నావళిలో చెప్పినపద్యములనుమాత్ర ముదాహరించి యతఁడు రచించిన గ్రంథనామములను కృతిపతులనామములను రామవిలాస కృతిపతిని గూర్చి చెప్పనప్పుడు ముందు వివరించెదను—

ఉ. సారదయారసద్రుహిణసారథికిన్ గరురాజమంత్రికిన్
బేరమయందు నందనుఁడు పేర్మిజనించె విలాససంపదన్

మారుఁడు విక్రమంబునఁ గుమారుఁడు లక్ష్మణశౌరి భూరిశో
భారవి సాహితీవిజితభారవి ధీరవిచారవిశ్రుతిన్.

ఉ. దండి మనోజ్ఞ శబ్దకవితాస్ఫురిచే నుపమాసమృద్ధిచే
రెండవకాళిదాసు, రసరీతితరంగితసూ.క్తిఁ గుండలీం
ద్రుం డని ధీరులెంచఁగఁ గృతుల్ రచియించిన ధన్యునిన్ మహా
పండితమాన్యు నెన్నఁదగు భాజితసూర్యుని లక్ష్మణార్యునిన్.

గీ. కృతు లొసఁగి వత్సవయతిమ్మనృపతిచేతఁ
దురగమణిభూషణాంబరాందోళికాది
పూజఁ గైకొని పెద్దాడపురవరాను
శాసనుం డయి లక్ష్మణశౌరి తనరె.

కవియొక్క యన్నయైన యనంతార్యుఁడు గౌరీపరిణయకావ్యము రచించినట్లు సుభాషితరత్నావళిలోనే యీక్రింది పద్యమునఁ జెప్పబడినది—

క. గౌరీపరిణయకావ్యము। సూరీంద్రులు మెచ్చఁజెప్పి శుంభత్కవితా
పారీణబిరుద మందిన। భూరియశోఘనుఁ డనంతబుధవరుఁ డలరున్.

లక్ష్మణకవి రచియించిన రామవిలాసమునుబట్టి యితనికాలమును దెలిసికొనవచ్చును. ఇతఁడు కూచిమంచితిమ్మకవికి బంధువయినను కాక పోయినను అతనితో సమకాలికుఁడయినందుకు సందేహము లేదు.

క. హాటకగర్భవలీ। లాటనచలితాంఘ్రినూపురారావశ్రీ
పాటచ్చరములు తేనియ। తేటలు మాకూచిమంచి తిమ్మయమాటల్.

అను కూచిమంచి తిమ్మకవినిగూర్చిన పద్యమీతఁడు చెప్పినదైన నయియుండవచ్చును. రామవిలాసము వత్సవాయ గోపరాజున కంకితము చేయఁబడినది. కవి కృతినాయకుని

సీ. తనమహౌదార్యంబుతనమహాధైర్యంబుకరణిజీమూతలాఘవ మొనర్పఁ
దనవినిర్మలకీర్తి తనవిక్రమస్ఫూర్తి పగిదిఁ బద్మాహితోపమ వహింపఁ

దనువిద్యాభూతి తనరూపవిఖ్యాతిగతిఁ గనుల్లోద్భవగరిమ మీఱఁ
దనకార్ముకప్రౌఢి తనప్రతాపనిరూఢిభాతి ధనంజయప్రథిమఁ బూన
ధరణి నుతికెక్కె నిజభుజాదండమండ
లాగ్రదర్శనచకితమత్తారినృపుఁడు
వత్సవాయసింహాద్రిభూవరసుతుండు
ప్రణుతగుణశాలి గోపభూపాలమౌళి.

సీ. శారదనీరదనారదపారదహారదస్ఫూర్తి నవఘళించి
శరదిందుకరకుంద శరబృందవరచందనహరిచందనకాంతిలహరి మీఱి
హరికాంతహరికుంతహరిదంతకరిదంతవిధుకాంతపృథుకాంతవిభవ మీసించి
పురవైరిధరసీరిగిరిదారిహరిశౌరిచరణనిర్ఝరవారిసురుచి గేరి
పాండురాఖండనిజకీర్తిమండలంబు
పుండరీకభవాండంబు నిండి మెఱయఁ
బ్రాభవము గాంచె సింహాద్రిరాజసుతుఁడు
ప్రణుతగుణశాలి గోపభూపాలమౌళి.

ఇత్యాది పద్యములతో నెంతవర్ణించినను, ఈగోపరాజు పెద్దాపురసంస్థానాధీశ్వరుఁడుగాక తత్సంస్థానాధిపతియగు తిమ్మజగపతిమహారాజుగారి కాప్తబంధు వయి గౌరవము నొందినవాఁడుగా నుండెను. అప్పుడు ప్రభువుగా నుండిన జగపతిమహారాజుల పుత్రుఁడగు తిమ్మజగపతిమహారాజుగారు ౧౭౫౯ వ సంవత్సరము మొదలుకొని ౧౭౯౭ వ సంవత్సరమువఱకును రాజ్యపాలనముచేసిరి. ఈయన సింహాసనమునకు వచ్చినది ప్రమాదిసంవత్సర పుష్యశుద్ధదశమి. గతదినమునం దీయన తండ్రిగారగు రాయజగపతిరాజుగారు శ్రీపూసపాటి యానందగజపతిరాజుగారితో ఉుడూరువద్ద జరిగిన యుద్ధములో హతులైరి. ఆంగీరస సం॥ కార్తికశుద్ధ ప్రథమదినమున జనన మొందినందున, జనకుని మరణము నాఁటి కీయనకు వయస్సెనిమిదిసంవత్సరములు. ఈయన నలువదిరెండు

సంవత్సరములు జీవించి పింగళ సంవత్స రాశ్వయుజబహుళ పంచమి నాఁడు పరలోకగతులైనారు. ఈయనకాలమునందుండి యీయనను బహుపద్యములతో స్తుతించిన వారగుటచే నేనుఁగు లక్ష్మణకవిగారు ౧౭౭౦-వ సంవత్సరములవఱకును జీవించి యున్నట్టు కనఁబడుచున్నది. అందుచేత నీకవి కూచిమంచి తిమ్మకవి మరణానంతరమున నిరువది యేండ్లు జీవించి యుండవచ్చును. పెద్దాపురపురాజులగు వత్సవాయ వారు తాము మొదటినుండియు విద్వాంసు లయి విద్వత్కవుల నాదరించు చుండినట్లు వారివంశచరిత్రమువలన విస్పష్టమగుచున్నది. ఈవంశపువారి మూలపురుషుఁడు సూర్యవంశ్యుఁడయి కృష్ణామండలములోని గుడిమెట్ట రాజధానిగాఁ గల చాగి పోత రాజైనట్టు రామవిలాసములోని యీ క్రింది పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది—

గీ. సహ్యజాతీరమునకు భూషణ మనంగ
సిరుల కిరవగు గుడిమెట్టపురము తనకు
రాజధానిగ సత్కళాభోజరాజు
చాగిపోతక్షమాభర్త జగతి నేలె.

ఈసాగిపోతరాజుయొక్క శాసనములు గుడిమెట్టలోను బెజవాడ లోను ౧౨౩౦ వ సంవత్సరమువఱకును గానఁబడుచున్నవి. ఈతని యింటిపేరు సాగివారే యైనను, ఈతని వంశమువారిలో నొకఁడగు రామనృపాలుఁడు—

"తగవత్సవాయాఖ్యనగరంబు నిజనివాసముచేసి నదికారణముగసాగి వంశమునకువత్సవాయనామములోకసుప్రసిద్ధముగుచుసొంపుగాంచె"

తననివాసమును వత్సవాయనగరమునకు మార్చినందున గృహ నామము వత్సవాయవా రయినది. వీరి వంశజులలో నొక రగు (పేర రాజనుతు లయిన) ముసలి తిమ్మరాజుగారు ౧౫౫౫ వ సంవత్సరము నకు సరియైన యానందసంవత్సర భాద్రపద బహుళసప్తమినాఁడు పెద్దా

పురసంస్థానమును సంపాదించి ౧౭౨౬ వ సంవత్సరమునకు సరియైనపరాభవసంవత్సర మార్గశిరబహుళ ద్వితీయవఱకు నేఁబదిరెండు సంవత్సరముల రెండుమాసముల యిరువదియైదుదినములు రాజ్యముచేసి లోకాంతరగతు లయిరి. దిట్టకవి విశ్వనాథకవి విరచిత మైన శేషధర్మములను గృతినందిన దీయనయని రామవిలాసములోని యీపద్యము తెలుపుచున్నది—

సీ. బిరుదాంక పురిని సుస్థిరముగా నిర్మించెఁ బాలమున్నీటినిబోలుచెఱువు
తిరుపతివల్మీకగిరిఁ బూలపల్లెను ఫలవృక్షవనములు సిరిపెంజాల
నృహరిగేహతటాకనిక్షేపవనములు కొమరుగాఁ బెద్దాపురమునను నిచె
విశ్వనాథకవీంద్రవిరచితశేషధర్మప్రబంధము సాదరముగ నందె
విప్రవంశప్రతిష్ఠలు వెలయఁజేసెఁ
బుత్రులను గాంచె నీతిని బుడమి యేలె
వత్సవాయాన్వయమునకు వన్నెఁదెచ్చె
హెచ్చి పేరయతిమ్మధాత్రీశ్వరుఁడు.

ఈతిమ్మరాజుగారు డెబ్బదియాఱు సంవత్సరములు బ్రతికి కాలధర్మము నొందఁగా, శ్రీముఖసంవత్సర కార్తికశుద్ధ పంచమినాడు జననమొందిన యీయనపుత్రుఁడు రాయపరాజుగారు ౧౭౨౬ వ సంవత్సరమునందు తండ్రి పోఁగానే రాజ్యపరిపాలన మారంభించి నలువదిరెండు సంవత్సరములు రాజ్యముచేసి ౬౫ ఏండ్లు బ్రతికి ౧౭౬౮ వ సంవత్సరమునకు సరియైన సర్వధారి సంవత్సర మాఘశుద్ధ సప్తమినాఁడు పరమపదప్రాప్తి నొందిరి. ఈయన హరిభక్తిసుధోదయ మనుకృతినందిన ట్లీక్రింది పద్యము చెప్పుచున్నది—

సీ. శ్రీరామునకుఁ గట్టమూరనుగట్టించె గుళ్లు మంటపములు గోపురములు
గంభీరజలతటాకంబు త్రవ్వించె గృహస్థపురంబున సుస్థిరముగఁ

బొలుపుగా వాల్మీకిపురికాంద్రకోటను ఫలభూజవాటిక ల్పదిలపఱిచెఁ
బ్రక్తివ్యమగుహరిభక్తిసుధోదయంబనుమహాకృతిరత్నమందుకొనియెఁ
పేరుగలుగు మహాత్మ్యముచేగు నదిమి
మెచ్చుఁగాఁ దగినఫమీలు తెచ్చుకొనియెఁ
బగతు రగువారినుండియ ల్దిగులుకొనఁగఁ
దిమ్మనృపరాయపఱమాధీశ్వరుండు.

ఈయన యనంతరమందు పింగళసంవత్స రాశ్వయుజ శుద్ధసప్తమి నాఁడు జన్మించిన యీయనపుత్రుఁడు సార్వభౌమ తిమ్మరాజుగారు సింహాసనమునకు వచ్చి ముప్పదితొమ్మిది సంవత్సరములు ప్రజాపరిపాలనముచేసి డెబ్బదవయేట ౧౭౪౮ వ సంవత్సరమునకు సరియైన విభవ సంవత్సర ఫాల్గుణబహుళ త్రయోదశినాఁడు దేహవియోగమునొందిరి. మన కవి తాతయైన యేనుఁగు లక్ష్మణకవిగా రీయనకాలమునందే యుండి యీమహారాజునకుఁ దాను రచించిన ద్రౌపదీపరిణయము నంకితము చేసినట్లీక్రింది పద్యములవలనఁ దెల్లమగుచున్నది—

సీ. రాజులుమెచ్చఁ బర్లాకోట సాధించి నరహరదేవు దుర్ణయ మడంచెఁ
గుదురైనభావిణికోట లగ్గలుపట్టి యొండుకో టంతయు నుర్విఁగలపె
దుగరాజు మొదలైనదొరలనుభంగించివిశ్వంభరునియుద్ధనిహతుఁజేసెఁ
దగఁబూసపాటి సీతారామభూపాలుఁడభినుతింపఁగ విజయంబుగాంచె
సరిసమతుయవనాధీశు సురగపతిని
గయ్యమున గెల్చె లోకవిఖ్యాతి చెందె
వత్సవాయాన్వయమునకు వన్నె తెచ్చె
రాయపనృపాలు శ్రీతిమ్మరాజమౌళి.

చ. హరిహరపద్మజాంశభవుఁడై తగు నేనుఁగు లక్ష్మణార్యుచే
సురుచిరశబ్దభావరసశుంభదలంకృతిమాధురీమనో

హారమగు ద్రౌపదీపరిణయం బను నుత్తమకావ్య మంచె సు
స్థిర మగుకీర్తి సొం పెసఁగఁ దిమ్మనృపాలుఁడు ధర్మపద్ధతిన్.

ఈయేనుఁగు లక్ష్మణకవియే ధ్రువచరిత్రమును వేంకటరాజపుత్రుఁ
డగు జగ్గరాజునకును, తులామహాత్మ్యమును కస్తురిరంగరాజపుత్రుఁడగు
జగన్నాథరాజునకును, వత్సవాయకులజు లయిన రాజబంధువుల కంకి
తము చేసిన ట్లీక్రింది పద్యములవలనఁ దెలియవచ్చుచున్నవి—

చ. కవికులసార్వభౌముఁ డనఁగాఁదగు లక్ష్మణార్యుచే
ధ్రువచరితప్రబంధము బుధు ల్వినుతింపఁగ నంది యాగను
గ్భవనమహాసుఖానుభవకారణ మైనయశంబు గాంచె వా
సవనిభవుండు వత్సవయ జగ్గనృపాలుఁడు సద్గుణోన్నతిన్.

ఉ. హేమనగేంద్రధీరుఁడగు నేనుఁగు లక్ష్మణసత్కవీంద్రుఁ డు
ద్దామసుధామయోక్తి వితతం బగునట్లు రచించినట్టి తు
ల్యామహిమప్రబంధము గుణాఢ్యులు మెచ్చఁ బరిగ్రహించెఁ బ్ర
జ్ఞామహితుండు జగ్గనృపచంద్రుఁడు శాశ్వతకీర్తి నందిలన్.

ఈతిమ్మరాజుగారి యనంతరమునం దాయన తమ్ములైన బలభద్ర
రాజుగారి కుమారులు రాయపరాజుగారు ౧౬౮౭ వ సంవత్సరమునందు
రాజ్యమునకువచ్చి యిరువదియారు సంవత్సరములు భూపరిపాలనము
చేసి నలువదేండ్ల ప్రాయమున ౧౭౧౩ సంవత్సరమునకు సరియైన మన్మథ
సంవత్సర జ్యేష్ఠశుద్ధ చతుర్థినాఁడు పరమపదమునొందిరి. ఈయన తండ్రి
యగు బలభద్రరాజుగారు తాము కవులయి రామశతకమును జెప్పుటయే
కాక కిరాతార్జునీయకృతినందిన ట్లీపద్యము తెలుపుదు చేయుచున్నది—

చ. అమితఖ్యాతికి మూలమైనకృతిఁ దా నందెన్ గిరాతార్జునీ
యము శ్రీరాములపేరఁ బద్యశతకం బారూఢి నిర్మించె భో
జమహీజానిగతిన్ బ్రసిద్ధిగఁ గవి స్సాహిత్యపారజ్ఞుఁడై
రమణన్ శ్రీబలభద్రరాజు ప్రజలన్ రక్షించె ధర్మస్థితిన్.

తరువాత రాయపరాజుగారి కుమారుఁడు తిమ్మరాజుగారు రాజ్యమునకు వచ్చి దాదాపుగా నిరువది సంవత్సరములు పాలనముచేసి ముప్పది సంవత్సరముల ప్రాయముననే ౧౭౩౮ వ సంవత్సరమునకు సరి యైన రాక్షససంవత్సర చైత్రశుద్ధ ద్వాదశినాఁడు పరమపదమునొందిరి. తదనంతర మాయన పుత్రుఁడు శ్రీరాయజగపతిరాజుగారు రాజుగాఁ జేయఁబడి యిరువది సంవత్సరముల యెనిమిదినెలలు రాజ్యపాలనముచేసి యుండూరువద్ద శ్రీపూసపాటి యానందగజపతిరాజుగారితో జరిగిన యుద్ధములో నిరువదియైదు సంవత్సరముల యీడుననే ౧౭౫౯ వ సంవ త్సరమునకు సరియైన ప్రమాదిసంవత్సర పుష్యశుద్ధ నవమినాఁడు రణ నిహతులయిరి. ఈయన పిమ్మటనే యేనుఁగు లక్ష్మణకవిగారి కాశ్రయుఁ డయి యుండిన (రాయ జగపతిరాజుగారి పుత్రుఁడయిన) తిమ్మజగపతి గారు రాజ్యమునకు వచ్చి ౧౭౯౭ వ సంవత్సరమువఱకును ప్రభుత్వము చేసి స్వర్గస్థులయిరి. పయిని వివరించిన చరిత్రమునుబట్టి పెద్దాపురసంస్థా నాధిపతు లందఱు నించుమించుగాఁ దాము కవులయ్యును కవుల నాద రించి కృతులందినవారయ్యును ఉండిరని తెలియవచ్చుచున్నది. ఏనుఁగు లక్ష్మణకవి తిమ్మజగపతిరాజు తండ్రియగు రాయజగపతి మహారాజుగారి కాలములో సహిత ముండినట్లు తద్రచితమైన యీచాటుపద్యము పలుకు చున్నది.

ఉ. ఆయతవత్సవాయకులాంబుధిపూర్ణ నిశాపతీ జగ
ద్గేయశుభాకృతీ! విదితకీర్తిసతీ కమనీయయౌవన
ప్రాయనలాకృతీ సతతవైభవనిర్జితపూర్వదిక్పతీ
ధీయుతవాక్పతీ జగపతీ నృపతీ సుకృతీ మహోన్నతీ.

ఈజగపతిరాజుగారు కవిత్వమునందు నిపుణులయి పెక్కుపద ములు శతకములు దండకములు మొదలగునవి భద్రాద్రిరామునిమీఁదఁ జెప్పినట్లు రామవిలాసములోని యీపద్య ముద్ఘోషించుచున్నది.—

చ. పదములు కీర్తనల్ రుచిరపద్యశతంబులు రాగమాలికల్
మృదుపదదండకంబులు సమిద్ధగతిన్ రచియించి కామిత
ప్రదునకు భద్రశైలరఘుభర్తకుఁ గానుకగా నొసంగె నా
త్రిదశులు మెచ్చఁగా జగపతిప్రభుచంద్రుఁడు భక్తి పెంపునన్.

ఏనుఁగు లక్ష్మణకవికృతములయిన గ్రంథములలో సుభాషితరత్నావళియు రామవిలాసమును మాత్రము నాకు లభించినవి. ఇందు మొదటి పుస్తకము భర్తృహరియొక్క సంస్కృతగ్రంథమునుండి తెనిఁగింపఁబడినను, కొంచెమయినను విరసముగా నుండక మూలానుసారముగాను నిర్దుష్టముగాను, రసవంతముగాను, హృదయరంజకముగాను ఉన్నది. స్వస్థల మయిన పెద్దాడ గ్రామమునందలి సోమశంకరస్వామి తనహృదయమున సాక్షాత్కరించి సుభాషితరత్నావళిని దెలిఁగింపు మన్నట్లు కవి యీపద్యమునఁ జెప్పుకొన్నాఁడు—

సీ. కలధౌతగిరియును గలధౌతగిరియును విల్లుగాఁ బొందైనయిల్లుగాఁగఁ
గమలాహితుండును గమలాహితుండును శరముగా లలితశేఖరముగాఁగఁ
బద్మోద్భవుండును బద్మాక్షభవుండును సాదిగా మెయిఁదాల్పుబూదిగాఁగఁ
బవనప్రియుండును బవనప్రియుండును సొమ్ముగా ఫాలనేత్రమ్ముగాఁగఁ
గ్రాలుపెనువేల్పు ముమ్మొనవాలుదాల్పు
జగములకుఁ దేఁడు ధనదునిసంగడీఁడు
హరుఁడు పెద్దాడ సోమశంకరుఁడు హృదయ
సరసిజంబున నాకు సాక్షాత్కరించె.

రామవిలాసములోని యవతారికనుండి యన్నిపద్యముల నుదాహరించిన తరువాతఁ గవిత్వము నిర్దుష్టముగాను మృదుమధురవాగ్గుంభనలు కలదిగాను ఉండునని వేఱుగఁ జెప్పనక్కరలేదు. పూర్వోక్తము

లయిన గ్రంథద్వయమునుండియుఁ గొన్నిపద్యముల నుదాహరించి కవి చరిత్రము నింతటితో ముగించుచున్నాను —

## సుభాషిత రత్నావళి.

చ. నతులగుచు న్మహోన్నతిఁ దనర్చుచు నన్యగుణోక్తిచే గుణో
న్నతిఁ బ్రకటించుచుఁ బరజనప్రియకార్యసమర్థతం సమం
చితనిజకార్యసంగ్రహము చేయుచు నిష్ఠురవాదులం క్షమా
ధృతి నిరసించుచున్ బరఁగుధీరులు పూజ్యులుగారె యేరికిన్.

నీతిశతకము.

చ. అతివలఁజూచి వీ రబలలంచు వచించుమహాకవీంద్రు లు
ద్ధతవిపరీతవాదు లిది దబ్బఱగాను విలాసినీసమం
చితతరళాక్షిపాతములచే గెలువంబడి రింద్రముఖ్యులుం
ధృతి నటువంటివా రబల లేగతి నైరి తలంచిచూడఁగన్.

శృంగారశతకము.

చ. కడువెఱపించుచు న్ముదిమి గద్దఱిబెబ్బులిమాడ్కి నున్న దె
క్కడుపగదాయలంబలెఁ దెగుళ్లుశరీరము నొందుచున్న వె
వ్వడొ చను భిన్నకుంభజలముంబలె నాయువు నిట్టులయ్యుఁ దా
రుడుగక మానవు ల్దురితమోలి నొనర్చుచు నున్నవా రహో.

వైరాగ్యశతకము.

## రామవిలాసము.

ఉ. వాసవనీలనీలము లవారితవిభ్రమశీలముల్ మరం
దాసవలోలముల్ యువభయానకసూనకదంబపుంద్రకాం
డాసనముక్తలోహాగుళికాళికరాళము లంజనప్రభా
భాసురభృంగజాలములు బంధురవృత్తిఁ జరించెఁ గానలం. ఆ-౧

శా. రామా రాజలలామ యోగిహృదయారామా మహాభోజసు
త్రామా నాకొక ముద్దుపెట్టుదువు రారాయంచుఁ గౌసల్య సు

ప్రేమం బిల్చిన మువ్వ లందియలు గంభీరంబుగా మ్రోయఁగా
శ్రీమంతుం డట రావిరేక మెఱయం జేరంగవచ్చుం గృష్ణ. ఆ-౨

చ. కటుభట ఘోషగర్జితము ఖాడ్గికపాణినటత్కృపాణరు
క్తటిమదయంబు చిత్రఘటితధ్వజపంక్తిసురేంద్రచాప ము
ద్భటదివిషత్ప్రితాపరవిబాధక ముగ్రనిశాటవాహినీ
పటుఘనబృంద మయ్యెడ నభంబునఁ బర్వె నసృక్ప్రవర్షియై. ఆ-3

ఉ. చంపకపుష్పవాసనలసార మెఱింగినషట్పదంబు లీ
సొంపగుకన్నెపెన్నెరులు చూచితిరే చెలులార యంచు భా
షింపుచుఁ గింకిణీవలయశింజిత మొప్పఁ దలంటె వేడుకన్
సంపఁగినూనెచేత నొకశారదచంద్రనిభాస్య సీతకున్. ఆ-౪

ఉ. ఇందుమెలంగుభృంగములు నిచ్చటికీరమయూరిశారికా
బృందము లిందుగట్టు సురభిప్రసవంబులు సాధనంబులై
ముందులభించినన్ హరునిఁ బూనిజయింపఁడె మారుఁ డంచు నె
న్నందగి రాముకేళిభవనప్రమదావనవాటి వాటిలున్. ఆ-౫

---

# 21. నెల్లూరి వీరరాఘవకవి

ఇతఁడు యాదవరాఘవపాండవీయమను నాలుగాశ్వాసముల త్ర్యర్థికావ్యమును రచియించెను. ఇందు శ్రీకృష్ణునియొక్కయు శ్రీరామునియొక్కయు పాండవులయొక్కయు కథలు ప్రతిపద్యమునకును మూఁడర్థములు వచ్చునట్లుగాఁ జెప్పఁబడినవి. వర్ణనాంశముల యందు మాత్రము కొన్ని యేకార్థపద్యము లుండును. ఈకవి యాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. ఈతని పూర్వుల యింటిపేరు మొదట దేశరాజు వారయినను నెల్లూరియందు వాసము చేయుచుండుటచే నెల్లూరివారని మాఱినది. ఈతఁడు శాండిల్యగోత్రుఁ; ఆపస్తంబసూత్రుఁడు; వేంకటపతి

పుత్రుఁడు. ఈతఁడు తనతాతతాతయైన కొండనమంత్రిని దనగ్రంథమునం దిట్లు వర్ణించియున్నాఁడు—

సీ. ఎవ్వనితండ్రిపే రిల దేశరాజువారన నింటిపేరు మున్నమరఁ దెచ్చె
నెవ్వనిసద్విద్య హెచ్చుగా వీణవా రన నింటిపేరు మున్నమరఁగూర్చె
నెవ్వనికొమరుఁ డీయిలఁబెద్దవేంకటపతిరాయలకు దళవాయియయ్యె
నెవ్వఁడు గీతసాహిత్యవిద్యలనేర్చి దిగ్విజయంబునఁ దేజరిల్లె
నెవ్వఁడు ఘవిణమలహారియు ధవళశంఖ
మాదిగా బిరుదులనెల్ల నంది మించెఁ
బ్రౌఢరాజులచే నిమ్మపండనంగ
నతఁడు నుతికెక్కెఁ గొండలాహ్వయుఁడుజగతి.

తిరుమలదేవరాయనిపుత్రుఁ డయిన యీపెదవేంకటపతిరాయలు ౧౫౮౬ వ సంవత్సరమువఱకును రాజ్యముచేసెను. కవియొక్క ప్రపితామహుఁ డాతనికాలములో నున్నందున, నాలుగుతరముల తరువాతివాఁ డయినకవి ౧౭౧౫ వ సంవత్సరప్రాంతములయందుండి యుండవలెను. కవి తనశక్తి సామర్థ్యాదులనుగూర్చి యాదవరాఘవపాండవీయావతారికయం దిట్లు వ్రాసికొనియున్నాఁడు—

సీ. సకలమంత్రరహస్యశాస్త్రసర్వంకషప్రజ్ఞాధికస్ఫూర్తిఁ బరిఢవిల్లి
నిఖిలయోగరహస్యనిరుపమత్రివిధోరురాజయోగాభ్యాస రక్తిమీఱి
యాగమాంతరహస్యభాగోపనిషదర్థసర్వస్వవిజ్ఞానసార మెఱిఁగి
నాటకాలంకారనానావిధవిశేషరసభావభేదము ల్పొసఁగఁ దెలిసి
శబ్దముఖ్యశాస్త్రసదసద్వివేకత । స్మృతిపురాణవాస్తురతిరహస్య
గణితతురగరత్నగజపరిజ్ఞానత । నమరు వీరరాఘవాఖ్యకవిని.

క. నానావిధావధానము । లానృపనీతియును భరతమాహాత్మ్యాదుల్
మానుగనిచ్ఛాలిపియుఁ ।మానితముగఁ గల్గుఁ గోపంబునుమఱియున్.

క. ప్రాకృతముఖషడ్భాషల।వ్యాకరణంబులును దెలుఁగువ్యాకరణంబుల్
ప్రాకటసాముద్రికమును । వీఁకన్ జ్యోతిషముఁ జాపవిద్యావిధమున్.

క. సాంగముగఁ దెలిసి మును యో । గాంగీకారమతినిశ్చలానుభవాప్తిన్
బొంగియు నియోగవృత్తిఁ బొ । సంగి చెలంగితిని సారసాహిత్యనిధిన్.

సీ. శతలేఖినీపద్యసంధానచాతురి ఘటికాశతగ్రంథకరణపటిమ
ఆశుప్రబంధబంధాదిక్రియారూఢి సంకరోష్ఠ్యనిరోష్ఠ్యచాటుకలన
విస్తరణమాధుర్యవివిధచిత్రస్ఫూర్తి పాదమాత్రప్రతిపాదఘటన
వ్యస్తాక్షరవిమిశ్రబహుపద్యగుంభన మచలజిహ్వాదికప్రచురరచన
బహుజనమనోంతరస్థిరబహువిధార్థ
బహుసమస్యాప్రపూర్తియు బహువిభేద
సకలవిషమసమస్యాదిసంవిధాన
మమరఁగూర్తును నెఱిరాఘవాఖ్యకవిని.

క. పంచాశచ్చాటుకథా । చంచత్కృతులను రచించి సత్కవిపూజా
సంచితకీర్తిని దగు సా । ధ్వంచితుఁడను వీరరాఘవాఖ్యనియోగిన్.

చ. అవునవఁ గావ్యపంక్తి పదియర్థములన్ రచియింపనేర్తు స
త్కవులదయన్ శిరీషకవితామృదుతామహితార్యవైఖరిన్
భువి నటులైన సత్కథల మూటినొనర్తును బాలబోధకై
తివిరి బహుత్వమందు నల్పత్రిత్వము పర్యవసాన మాటచేన్.

కవి తాను జెప్పుకొన్నట్లు స్వసామర్థ్యము నంతను జూపి పది యర్థముల గ్రంథమును రచియింపక మూడర్థములదానినే రచియించినను, ఇట్టి గ్రంథములయందు నిఘంటువులు వెదకి పదములనేర్చి కూర్చినశిల్ప ప్రౌఢిమయేకాని యర్థచమత్కారము కాని భావగౌరవముకాని రస పుష్టికాని పుట్టదు. యాదవరాఘవపాండవీయములోని కొన్నిపద్యము లిందు క్రిందఁ జూపఁబడుచున్నవి—

శా. వారిం దెచ్చిన వంశహానియును దుర్వ్యాపారబాధాగతుల్
చేరన్ రా విటుసేయుమూవిధి యిదే సేవింతు వీక్షింపు మా

త్స్మరూఢవ్యథఁ బాపు నాహృదయశల్యం బౌయ్యనం బాపవే
స్వారాజ్యస్థితి నిల్పఁజేయఁగల భవ్యస్వీకృతిం బోయెదన్. ఆ.౧

మ. అసురారాతిభవాతిభీతికలకంసారంభతన్ బాలకా
ర్యసుహృద్వృత్తి మెలంగఁ దెల్పఁగను విశ్వామిత్రమౌనీశుమా
నస మువ్పొంగ నఘాదులేగ యజనానందక్రియల్ పెంప మా
నిసమాజంబులు నిండ్లలో నిలువఁ బూనెం గామచారోన్నతుల్. ఆ.౨

ఉ. కౌతుకమాత్మ నేర్పడఁ దగన్ జనకీశమహాబలాప్తివి
ఖ్యాతచరిత్రు సింహబలుఁ గన్గొని యీవిధ మెల్లఁ దెల్పి సం
ప్రీతిగ రాము నీకడకు వేగమె తెత్తునటంచుఁ దత్సమా
హూతి సుదృక్శిరోమణిఁ దమక్తిని గైకొనిపోయి యచ్చటన్. ఆ.3

చ. హరివిభుఁ డంతకీర్తి మతసాంబసమాఖ్యుఁడు వైరికర్ణభీ
కరనిజనాముఁ డాబలముఁ గావఁగఁ బూని తదగ్రయాయియై
మరిదమి వేగ నచ్చటి కమందధృతిన్ జని యాగలంకలోఁ
జొరఁబడి కాల్ప సైన్యములఁ జూర్ణముచేసెను దాఁ దదున్నతిన్. ఆ.౪

---

## 22. నంజరాజు

(ఈకవి హాలాస్యమాహాత్మ్య మను డెబ్బదిరెండధ్యాయముల వచనకావ్యమును రచియించెను.) ఈగ్రంథమున నధ్యాయాద్యంతముల యందుఁ బద్యములుగలవు. కవి వంశవర్ణనమును బద్యములతోనే చేయఁబడినది. (ఈకవి మహీశూరరాజగు దొడ్డమహీపాలుని పౌత్రుఁడు; వీరరాజభూపాలుని పుత్రుఁడు. ఈదొడ్డభూపాలుఁడు ౧౬౭౦ వ సం॥ర ప్రాంతములయందుండినవాఁడు. కవి తానును దనయన్నయు మహీశూర రాజ్య సేనాధిపతులయినట్టు చెప్పుకొనియున్నాఁడు. కవి యన్నయగు దేవభూవిభుఁ డిట్లు వర్ణింపఁబడెను.—

శా. దీనత్రాణపరాయణుం డగుచు నెంతేవిశ్రుతుం డైనయా
సేనాధీశ్వర దేవభూవిభుఁడు కాశీంఖానమాద్యున్మలా
ఖానాద్యుద్భటయావనాధిపుల సంగ్రామంబునం గూల్చి ఢి
ల్లీనాథాదుల కెల్ల నచ్చెరువు గొల్పెం ధారుణీమండలిన్.

౧౭౩౧ వ సంవత్సరమునందు మైసూరురాజగు చామరాజును సింహాసనవిహీనునిజేసి చెఱసాలయందుఁ బెట్టించినవాఁడు దళవాయి యైన యీ దేవభూవిభుఁడే. కవి ౧౭౩౦ వ సంవత్సర ప్రాంతములయం దుండినవాఁడు. ఇతఁడు క్షత్రియవంశజుఁడు; భారద్వాజగోత్రుఁడు; ఋక్శాఖవాఁడు. ఈహాలాస్యమాహాత్మ్యము దక్షిణమధురాపురీమాహా త్మ్యమును దెలిపెడి శైవగ్రంథము. ఇందలికథ స్కాందపురాణమునుండి గైకొనఁబడినది. పదునెనిమిదవ శతాబ్దారంభమున మధురలోను, మైసూరులోను దెనుఁగునఁ గొన్నివచనకావ్యములు చేయఁబడినవి. ఈ హాలాస్యమహాత్మ్యముయొక్క రచన సలక్షణమయి నాతికఠినముగా నున్నది. ఆకాలపు వచనరచనయొక్కరీతిని జూపుటకయి హాలాస్య మాహాత్మ్యములోని కొన్ని పంక్తుల నిందుఁ బ్రదర్శించుచున్నాను.

"వ. రూపలావణ్యభాగ్యమువల్లనో యనువైనగోత్రంబు గలవాఁడనియో విద్యంజూచియో సుందరేశ్వరుం డనుబుద్ధిచేతనో లేక భ్రాంతి చేతనో నేనునేను బిడ్డనిచ్చుట యనుచుం బలికి యాబ్రహ్మచారిం గులగోత్రంబు లడుగ నతండు తనగోత్రంబును సూత్రంబును నక్షత్రం బును నూర్ధ్వపుండ్రంబును గ్రమంబుగా విస్మితుండై యొతింగించు టయు నబ్బాంధవులు కులగోత్రవ్యత్యాసంబులు లేకుండుటకు సంత సించి యూర్ధ్వపుండ్రధారణంబున కొక్కింతఖేదంబుఁ జెంది యనే కమ్ములగు గుణమ్ములయం దొకదోషంబు గలిగియుండినంగాని యడంగునని నిశ్చయించినవారై వివాహంబు లొనరింప నవ్వివాహ పాటుండై శ్వర్యయుక్తుం డగుటంజేసి పుత్రిక కధికంబుగా ద్రవ్యం

బాసంగ నయ్యుర్వీసురనందనుండు సంతుష్టుండై యాధనం బంత యుం గైకొని పత్నీసమేతంబుగాఁ బెక్కండ్రు బంధువులతోడఁ గూడుకొనియున్న తల్లిదండ్రుల సమీపంబునకుం జనుదేర దేశాంతరంబున కరిగి వివాహంబు చేసికొని భార్యతోడం జనుదెంచిన కుమారుం గాంచి తండ్రియుం దదీయబాంధవులు నత్యంతసంతోషం బెనసిరి ఈc."

౨ఀ అధ్యాయము.

---

## 23. కోటి వెంకనార్యుడు

(ఇతఁడు "ఆంధ్రభాషార్ణవము" అను పేరు గల మంచి యచ్చ తెలుఁగు నిఘంటువును పద్యములుగాఁ జేసెను. దీనితో సమానమైన యచ్చ తెనుఁగు నిఘంటువు మఱియొకటి లేదు. ఈకవి యీపుస్తకమును శ్రీవిజయరఘునాథునిపుత్రుఁడైన రఘునాథరాజు ప్రేరణముచేతఁ జేసి యాతని కంకితముచేసెను.) ఈరఘునాథరాజు రామనాథసేతుపతి యయిన విజయ రఘునాథరాజు కుమారుఁడని తోఁచుచున్నది. అట్లయిన పక్షమున రఘునాథరాజు ౧౭౩౪ వ సంవత్సరము మొదలు ౧౭౪౭ వ సంవత్సరమువఱకును రాజ్యము చేసినందునఁ గవియు నాకాలమునం దుండి యుండవలెను. కవి గద్యమునందుఁ దనబిరుదావళి నీప్రకారముగా వ్రాసి కొనియున్నాడు___

"ఇది శ్రీమత్పరమేశ్వరకరుణాకటాక్షసంప్రాప్త సర్వజ్ఞత్వాది కతిపయగుణస్వసామ్యతదితరసకలగుణనిరూప మ్యాసేతు హిమాచలఖ్యాత మహోద్దండకవిబిరుదప్రశస్త సీతారామార్యవర్య తనూజాత శౌర్యధైర్యస్థైర్యాది సకలగుణచిరత్నరత్నాకర కోటి సమాఖ్యవంశసుధాపయోధిరాకాశశాంక ఘంటికాతురంగ నీలాత

పత్ర హనుమద్ధ్వజ మకరకేతన దివాదీప సవవిధభేరికాది నిఖిల బిరుదాంక బృహదంబికా కటాక్షసంజాతసామ్రాజ్యధురంధర విమలయశోబంధుర కర్ణాటపాండ్యచోళమహీపాలాదిసంస్తూయమాన శ్రీరాయరఘునాథమహీనాథసభాంకణ బిరుదాయమానార్యనుతచర్య వెంకనార్యప్రణీతం బైన &c."

కవితాధోరణిని జూపుటకయి నిఘంటువునుండి పద్యముల నుదాహరించుట యుచితము కాదుకావునఁ గృతిపతిని వర్ణించిన పద్యము నొకదాని నిం దుదాహరించుచున్నాను.—

ఉ. శ్రీరఘునాథరాయ నృపశేఖర నీదుకరాసి భీమకా
ళోరగతుల్య మౌటను రణోర్విని దుర్మదమత్తచిత్తులౌ
వీరులప్రాణవాయువులఁ బీల్చుట యుక్తమి దెంతవింత యు
య్యారె సముద్రమయ్యు నిసుమంతయు భంగము గాంచ దెప్పుడున్.

---

# 24. అడిదము సూరకవి

ఈకవి నియోగిబ్రాహ్మణుఁడు; అడిదము బాలభాస్కరుని పుత్రుఁడు. ఈయడిదము బాలభాస్కరుఁడు శుద్ధాంధ్రరామాయణమును రచించినట్లు కవిజనరంజనములో సూరకవి వేసికొన్న—

"శుద్ధాంధ్రరామాయణ ఘటనవైదుష్యధురంధ రాడిదము
బాలభాస్కరతనూభవ"

అను గద్యమువలనను, కవి సంశయవిచ్ఛేదములో బాలభాస్కరుని శుద్ధాంధ్రరామాయణములోని దని యుదాహరించిన

"నిగిడిరువైపుల న్వెడల నేటయినీటగుపీటికోట"

అను చంపకమాలికాపాదమువలనను దెలియవచ్చుచున్నదిగాని యీశుద్ధాంధ్రరామాయణ మిప్పు డెచ్చటను గానరాదు. ఈసూరకవి

తాను జేసినగ్రంథముల నన్నిటిని రామచంద్రపుర రామలింగేశ్వరుని కంకి తము చేసెను. ఇతఁడు చేసినగ్రంథములలో నెల్లఁ జంద్రమతీపరిణయ మనునామాంతరముగల కవిజనరంజనము మిక్కిలి మనోహరమైనది. ఇది మూఁడాశ్వాసములు గల చిన్నప్రబంధమైనను, దీనియందలి గుణ సంపదనుబట్టి పండితులు దీనిని పిల్ల వసుచరిత్ర మని వాడుచున్నారు. ఇతఁడు చేసిన యితరగ్రంథములు రామలింగేశ్వరశతకము, కవి సంశయ విచ్ఛేదము, ఆంధ్రచంద్రాలోకము, ఆంధ్రనామశేషము, అనునవి. కవి సంశయవిచ్ఛేద మనునది మూఁడాశ్వాసముల చిన్నలక్షణ గ్రంథము. ఆంధ్రనామశేషము పైడిపాటి లక్ష్మణకవికృతమైన యాంధ్రనామసం గ్రహములో లేని యచ్చతెలుఁగుపదముల నేర్చి కూర్చినపద్యరూప మగు చిన్న నిఘంటువు. కవి తనగ్రంథముల నన్నిటిని దేవాంకితము చేయుట చేత వానినిబట్టి కవికాలమును నిర్ణయించుట శక్యముకాదు. ఇతనిచే రచియింపఁబడిన గ్రంథములనుబట్టి కవి గోదావరి మండలములో నివాసుఁ డయినట్టు కనఁబడుచున్నాఁడుగాని యితఁడు విజయనగరసంస్థానములో శ్రీ పూసపాటి విజయరామరాజుగారి కాలములో నుండినట్టు తద్రచితము లయిన చాటుపద్యములు మొదలయినవానివలనఁ దెలియవచ్చుచున్నది. విజయనగరసంస్థానప్రభువులలో విజయరామరాజు లిద్దఱున్నందున నితఁ డేవిజయరామరాజు కాలములో నుండినవాఁడో నిశ్చయింప శక్యము కాకున్నది. పెద్దాపురములో వత్సవాయ తిమ్మజగపతి మహారాజుగారు రాజ్యముచేయుచున్న కాలములో నీకవి తనప్రభువువెంట పెద్దాపురసంస్థా నకు వచ్చి రాజు లందఱును సభచేసి కూరుచుండియుండగా—

ఉ. రాజు కళంకమూర్తి రతిరాజు శరీరవిహీనుఁ డంబికా
రాజు దిగంబరుండు మృగరాజు గుహాంతరసీమవర్తి వి
భ్రాజితపూసపాడ్విజయరామనృపాలుఁడె రాజుగాక యీ
రాజులు రాజులే పెనుతరాజులు గాక ధరాతలంబునన్.

అను పద్యమును సభలో నాసీనులయియున్న రాజులవంకఁ జూచుచు లేచి చదివెననియు, అందుమీఁద నిందలి కపటవాక్యము తమ్ముద్దేశించి పలికినట్లు భావించి రాజులందఱును కవిని గోపదృష్టితోఁ జూచుచు లేవఁబోఁగా నతఁడు జంకక పద్యార్థమును జెప్పి "యీరాజులనఁగాఁ" పై చరణములయందుఁ జెప్పఁబడినరాజు మొదలయినవారని స్పష్టపరిచి రోషముడిపి వారిని శాంతచిత్తులను జేసెననియు చెప్పుచున్నారు. ఏనుఁగు లక్ష్మణకవిగారి నాదరించిన యీవత్సవాయతిమ్మజగపతిమహారాజుగారు ౧౭౫౯ వ సంవత్సరము మొదలుకొని ౧౭౯౭ వ సంవత్సరమువఱకును రాజ్యముచేసిరి. ఈయనకాలములో నుండినవారు రెండవ విజయరామరాజుగారే. ఈయన విజయనగరరాజ్యమునకు వచ్చినదియు తిమ్మజగపతి మహారాజుగారు పెద్దాపురరాజ్యమునకు వచ్చిన సంవత్సరములోనే. ఈవిజయరామరాజుగారు ౧౭౫౯ వ సంవత్సరము మొదలుకొని ౧౭౯౪ వ సంవత్సరమువఱకును రాజ్యపాలనము చేసిరి. ఈ రాజులిద్దఱును సింహాసన మెక్కునప్పటికి యుక్తవయస్సురాని బాలురు. వీరిలో తిమ్మజగపతి మహారాజులుగా రప్పటి కేడుసంవత్సరముల ప్రాయమువారు; విజయరామరాజుగారు పండ్రెండు సంవత్సరముల ప్రాయమువారు. నిజాము ౧౭౬౦ వ సంవత్సరమున రాజమహేంద్రవరము వచ్చినప్పుడు వీరిరువురిని గొనిపోయి దర్శనముచేయింపఁగా నతఁడు వీరిద్దఱిని వారివారి సంస్థానములకు రాజులనుగా నంగీకరించెను. మొదటి విజయరామరాజుగారు బొబ్బిలియుద్ధమున ౧౭౫౭ వ సంవత్సరముననే మృతులయినందున, తిమ్మజగపతి మహారాజుగారి కాలములో నుండినయతఁ డతఁడయి యుండఁడు. సింహాసనమునకు వచ్చునప్పటికి వీరిద్దఱును బాలురయినందున వీరు తమ యాస్థానకవులతోఁ గలిసి పెద్దాపురమున సమావేశమగుట తరువాత నిరువది సంవత్సరముల కనఁగా ౧౭౭౭ వ సంవత్సర ప్రాంతమందయియుండును. అందుచేత

సూరకవి ౧౭౮౦ వ సంవత్సరమువఱకైనను జీవించియుండవచ్చును. ఇతఁడు పెద్దవిజయరామరాజుగారి కాలములోఁగూడ బాల్యావస్థలో నుండి యుండును. కవి కాశ్రయుఁడైన విజయరామరాజుగారిని గూర్చియు వారి సంస్థానమునుగూర్చియు నిందుఁ గొంత వివరించుట యనుచితము కానేరదు.

(ఓరుగంటియందుండిన కాకతీయరాజులు చెప్పుకొనునట్టుగానే యీ పూసపాటివారును తాము సూర్యవంశజుఁడైన మాధవవర్మ సంతతి వారమని చెప్పుకొందురు. కొండపల్లి సర్కారులోని పూసపాడను గ్రామనివాసముచేత వీరికి పూసపాటివారని యింటిపేరు గలిగినది.) ఓరుగంటిసంస్థానము ప్రతాపరుద్రునితోఁ నశించినవెనుక వత్సవాయవారు పూసపాటివారు మొదలయినవారు మహమ్మదీయులకు లోఁబడిరి. రఘునాథరాజను మాఱుపేరుగల పూసపాటి తిమ్మరాజుగారు గోలకొండలో సరదారుగానుండి శ్రీకాకుళమునకువచ్చి, శ్రీకాకుళమునకు ఫౌఁజుదారుగా నుండిన షేర్ మహమ్మదుఖాన్ వలన ౧౬౫౨ వ సంవత్సరమున కూలిమి భోగాపురపుతాలూకాలను గుత్తకు పుచ్చుకొని పాలనముచేయ నారంభించెను. ఈయనపుత్రుఁడయిన సీతారామచంద్రరాజుగారు మఱికొన్ని తాలూకాలనుకూడ కవులునకు పుచ్చుకొని, పర్లాకిమిడి సంస్థానాధిపతియైన గజపతిదేవునితో మైత్రిసంపాదించి, ౧౭౧౨ గుఱ్ఱపు రౌతులతోను ౫౦౦ కాల్బలముతోను పొట్నూరు జయించి కలింగరాజని పేరువడసి యాయూరు నివాస మేర్పఱచుకొని ప్రబలుఁడయియుండెను. ఈయన యనంతరమున నానందరాజుగారు పరిపాలనమునకు వచ్చిరి. ఈయన పుత్రులు విజయరామరాజుగారు బహుప్రసిద్ధపురుషులు. ఈయన మన్నెదొరలను గెలిచి వారి దేశము లాక్రమించుకొని మన్నెసుల్తానను బిరుదంది, పొట్నూరునుండి తనపేరట విజయనగరమను పేరఁబరఁగిన యూరికి రాజధానిని మార్చుకొని, ౧౭౧౨ వ సంవత్సరమునకు సరియైన

విజయసంవత్సర విజయదశమీ జయవారమునాఁడు కోటకట్టుటకు శంకు స్థాపనము చేసెను. ౧౭౫౩ వ సంవత్సరమున నిజాము కొండపల్లి యేలూరు రాజమహేంద్రవరము శ్రీకాకుళము సర్కారులను ఫ్రెంచి వారికిచ్చెను. అప్పుడు విజయరామరాజుగారు శ్రీకాకుళమునకు నాయి బయిన జాఫరల్లీతోఁ జేరి దేశము ఫ్రెంచివారికి స్వాధీనము కాకుండు నట్లు చేయుటకయి ప్రయత్నించెను గాని, వారు రాజమహేంద్రవరము శ్రీకాకుళపు సర్కారులను తక్కువశిస్తుకు కవులున కిచ్చెదమన్నందున జాఫరల్లీని విడిచి ఫ్రెంచివారితోఁ జేరెను. తరువాత సర్కారులలోని రాజులందఱును ఫ్రెంచివారికి లోఁబడక తిరుగఁబడినప్పుడు సహిత మీయన వారియెడల విశ్వాసముగలవాఁడయి యుండి ౧౭౫౫ వ సంవత్సరమున ఫ్రెంచి సేనానాయకుఁడయిన బుస్సీకి కావలసిన ధనమును రహస్యముగాఁ బంపెను. తరువాత బుస్సీ సేనలతో దేశమును స్వాధీనము చేసికొనుటకు కళింగదేశమునకు వచ్చినప్పుడీయన బొబ్బిలివారి తోఁటి తన పూర్వవైరమును సాధించుకొనుటకయి బుస్సీని పురికొల్పి యుద్ధము చేయునట్లుచేసి తానుగూడ సేనలతోఁబోయి ౧౭౫౭ వ వత్సరము జనేవరు నెల ౨౪ వ తేదిని తాండ్ర పాపయ్యచే పొడువఁబడి పరమపదము నొందెను. తరువాత విజయరామరాజుగారి పితృవ్యపుత్రుఁడయిన యానంద గజపతిరాజుగారు సింహాసనమునకు వచ్చి, బుస్సీ విజయరామరాజుగారి యెడలఁ జూపిన యాదరమును తనయెడలఁ జూపక పోవుటచేత మనసులో ద్వేషము పెట్టుకొని బుస్సీ విశాఖపట్టణము మొదలయిన స్థానముల నన్నిటిని స్వాధీనముచేసికొని పై యధికారుల యుత్తరవు ననుసరించి యీ దేశమును విడిచి కర్ణాటకమునకు వెడలి పోఁగానే సేనలను గూర్చుకొనిపోయి విశాఖపట్టణమును పట్టుకొని దాని నింగ్లీషువారికి వశపఱిచెదనని యుత్తరములువ్రాసి ౧౭౫౮ వ సంవత్సరమున వారితో స్నేహము చేసికొనెను. తరువాత నతఁడు ఫ్రెంచివారి

ను త్తరపుసర్కారులనుండి తఱిమివేయు ప్రయత్నములో నింగ్లీషువారితోఁ జేరి, దొరికినకొల్లలోఁ దనకు భాగమిచ్చునట్లును జయించిన దేశములో నదీ సముద్రతీరపట్టణములును వాని చుట్టుపట్లఁగల దేశమును దక్క మిగిలిన భాగమును దన పాలనములో నుంచునట్లును యుద్ధవ్యయముల క్రింద తాను నెల కేఁబదివేలరూపాయల చొప్పున నిచ్చునట్లును ఏర్ప ఱుచుకొని, కర్నల్ ఫోర్డుగారిచే నడుపఁబడుచుండిన యింగ్లీషుసేనతోఁ దనసేనను జేర్చి దండయాత్ర వెడలెను. అవలకే ఫ్రెంచిసేనానాయకుఁ డయిన కన్ఫ్లాన్సుగా రానందగజపతిరాజుగారిని శిక్షించుటకయి దండ యాత్రవెడలి యింగ్లీషుసేన యాయనతోఁ జేరినదని విని రాజమహేంద్ర వరమున నిలిచిపోయెను. కర్నల్ ఫోర్డుగా రానందరాజుగారు వెంట రాఁగా రాజమహేంద్రవరమునకు వచ్చి ఫ్రెంచిసేనాధిపతియైన కన్ఫ్లాన్సు గారి నక్కడనుండి పాఱఁద్రోలి, మచిలీబందరునకుఁ బోయి దానిని స్వాధీనపఱుచుకొనెను. దండువెడలియున్న యింగ్లీషువారిని జయించు టకై నిజాము సలాబత్ జంగు మచిలీబందరుకు ౧౫ మైళ్ళ దూరము వఱకును వచ్చి వారిని జయించుట సాధ్యముకాదని తెలిసికొని ౧౭౫౯ వ సంవత్సరము మెయినెల ౧౪ వ తేదిని సంధిచేసికొని మచిలీ బందరు సర్కారును కొండవీడు నైజాముపట్టణము సర్కారులును ఇగ్లీషువారి కిచ్చివేసి, ఆనందగజపతిరాజుగారు ఫ్రెంచివారి కియ్యఁబడిన దేశమునుండి గ్రహించిన సొమ్ము విషయమయి తగవుపెట్టక విడిచిపెట్టి వారితండ్రి తాతలనుండి వారనుభవించుచుండిన దేశమును వారనుభ వించుట కంగీకరించెను. ఈ యొడంబడిక యయినతరువాత స్వదేశము నకు వచ్చుచు త్రోవలో రాజమహేంద్రవరమున నానందగజపతిరాజు గారు స్ఫోటకముచేత కాలధర్మమునొందిరి. అప్పుడాయన భార్య లిద్ద ఱును సహగమనము చేసిరఁట! తర్వాత బొబ్బిలిలో మృతులయిన విజయరామరాజుగారిభార్య చంద్రమ్మగారు సన్నిహితజ్ఞాతియైన పూస

పాటి రామభద్రరాజుగారి ద్వితీయభార్య పుత్రుఁడయిన పండ్రెండు సంవత్సరముల ప్రాయముగల వేంకటపతిరాజను చిన్నవానిని పెంచు కొని, ఆచిన్నవాని పేరు విజయరామరాజుగా మార్చి యాయనను పట్టాభిషిక్తుని జేసెను. ఈవిజయరామరాజు బాలుఁడయినందున రాజ్యాధికారము నంతను సవతియన్నగారగు సీతారామరాజుగారు వహించి, తమ్మునకు యుక్తవయస్సు వచ్చినతరువాతసహిత మధికార మునంతను తానే చెల్లించుచువచ్చెను. ఈవిజయరామరాజుగారి కాల ములోనే మనకవి యుండినది. ఆకాలమునందు విజయనగరమువారు నిజామునకు కట్టుపన్ను రెండులక్షల తొంబదివేల యేఁబదితొమ్మిదిరూపా యలు. అయినను దేశ మస్వస్థస్థితిలో నున్నందున నిజాము తనకు రావలసిన కప్పమును తిన్నఁగాఁ గైకొన శక్తుఁడుగాక పెక్కేండ్లూర కుండుచు వచ్చెను. ఈహేతువుచేతను, సీతారామరాజుగారు బలవంతు లయి తమసేనలతో చిల్లరసంస్థానాధిపతుల నదిమి కప్పములు గొను చుండుటచేతను, విజయనగరరాజ్య మాకాలమునం దించుమించుగా స్వతంత్రరాష్ట్రమువలెనే యుండెను. ఈసీతారామరాజుగారు బొబ్బిలి రాజయిన చిన్నరంగారావుగారిని పట్టుకొని విజయనగరములో చెర సాలయం దుంచెను; పర్లాకిమిడి రాజగు నారాయణదేవు జగన్నాథ యాత్ర పోవుట సందుచేసికొని యతని రాజ్యముమీఁద దండెత్తి యాత్రనుండి తిరిగి వచ్చిన యాతని నరసన్నపేటవద్ద నోడించి యిప్పటి గంజాముమండలములో విశేషభాగమును విజయనగరరాజ్యములోఁ జేర్చెను. తన తమ్ముని వెంటఁగొని దండయాత్రవెడలి సీతారామరాజు గారు మొగలితుర్రు వఱకును వచ్చి స్థానికపాలకుఁడైన నబాబు బక్షీఅబ్జ మాఖానును జయించి కొంతకాలము రాజమహేంద్రవరము సర్కారును సహిత మాక్రమించినట్లు చెప్పుదురు. ఇట్లింకను పెక్కు విజయములను బొంది మహోన్నతదశయం దుండిన యాకాలములోనే యింగ్లీషువారు

నిజామువలనఁ బొందిన సనదుప్రకారముగా నుత్తరపుసర్కారులలోఁ దమ యధికారమును జెల్లించుట కారంభించిరి. ఇంగ్లీషుకంపెనీవారితోఁ జేసి కొన్న యొడంబడికనుబట్టి సంవత్సరమునకు మూఁడులక్షల రూపాయలు పేష్కష్ చెల్లించుటకును పర్లాకిమిడి రాజయిన నారాయణదేవువలనఁ గై కొన్న రాజ్యమును విడిచిపెట్టుటకును విజయనగరము వా రొప్పు కొనిరి. ఇట్లు కొంతకాలము జరిగిన తరువాత విజయనగర సంస్థానము నకు లోఁబడియున్న కొండ జమీందారు లందఱును విజయనగరము వారిమీఁద తిరుగఁబడి స్వతంత్రులగుటకుఁ బ్రయత్నించిరి. కాని సీతా రామరాజుగా రన్నిటికిని దగినవాఁ డయినందున నింగ్లీషుసేనలను సహాయపఱుచుకొని యాకొండ సంస్థానాధిపతుల నొక్కొక్కరినే జయించి కొందరిదేశములను తమరాజ్యములోఁ గలుపుకొనియు కొంద ఱిని విజయనగరమునఁ జెఱసాలలోఁ బెట్టియు నందఱిని సాధించెను. ఈకలహములో ఆంద్ర, పాలకొండ జమీన్‌దారులు మాత్రము చేర లేదు. సీతారామరాజుగారిట్లు పరరాజులను జయించుటయేకాక తురకదొరలు మసీదుల కిచ్చిన భూములను పూర్వరాజులు బ్రాహ్మణుల కిచ్చిన మాన్యములనుగూడ లాగుకొని ప్రజలను సహితము క్షోభపెట్ట నారం భించెను. ఈయనపెట్టుబాధలే సూరకవిని రామలింగేశశతకము చెప్పు నట్లు చేసినవి. ఆకాలపు ప్రభువులయందు కవి కెట్టియభిప్రాయముండి నదో కొంతవఱకు క్రిందిరీతి పద్యములు వెల్లడిచేయవచ్చును—

సీ. పదునారు కోఁతివెంబడి సంచరింపరే వాహకుల్ లేరె శవంబులకును
గంగిరెద్దుకు లేవె ఘనతూర్యరావముల్ కల్గి గల్గదె వారకామినులకుఁ
బులిగోవుఁజంపినక్కలనుబోషింపదే స్థూలకాయము లేదెమున్నలకును
బుప్పిపంటికి లేదె పుట్టంబుఁ జుట్టుట వేణుధరుం డెద్దువెంట రాఁడె
న్యాయపద్ధతినడువనియవనిపతికి
నెన్నిచిన్నెలు గలిగిన నెందుకొఱకు

నంత్యమునఁజూడవలయునాయయ్యసుఖము
రామలింగేశ రామచంద్రపురవాస.

సీ. కడువింత యగుస్థూలకాయంబు గల్గుట
చిత్రభూషాంబరస్థితిని గనుట
తూర్యరావంబులతోఁ జనుదెంచుట
వాలవీజనసమావాప్తి గనుట
శృంగవేత్రోద్ధతిఁ జేరరాకుండుట
చూపఱు పదఃగురు చుట్టుకొనుట
స్వనియంతవాక్యంబు విని తలయూఁచుట
మౌనముద్ర వహించి మతము గనుట
గంగిరెద్దుకు మూర్ఖభూకాంతునకును
భేదమించుకయును గనిపించ దట్టి
ప్రభువు వేఁడిన సత్కవిపటిమ చెడదె
రామలింగేశ రామచంద్రపురవాస.

సీ. మాన్యంబు లియ్య సమర్థుఁడొక్కఁడు లేఁడు
మాన్యము ల్చెఱుప సామంతులంద
ఱెండినయూళ్ళగో డెఱిఁగింపఁ డెవ్వఁడుఁ
బండినయూళ్ళెన్నఁ బ్రభువులంద
ఱితఁడు పేద యటంచు నెఱిఁగింపఁడెవ్వఁడుఁ
గలవారిసిరి యెన్నగలరు దొరలు
తనయాలిచీఁకటితప్పెన్న డెవ్వఁడు
పరకాంతఱంకెన్నఁ బెద్ద లంద
ఱిట్టిదుష్టుల కధికార మిచ్చినట్టి
రాజు ననవలెఁగాక దుర్జయుల ననఁగ
నేమిపనియున్న దిఁక సత్కవీంద్రులకును
రామలింగేశ రామచంద్రపురనివాస.

ఇట్లుండఁగా సంస్థానమునం దుండినరాచవారందఱు నొకటిగాఁజేరి ౧౭౭౫ వ సంవత్సరమునందు మంత్రిత్వమునుమాని రాజకార్యసంబంధము వదలుకొనునట్లు సీతారామరాజుగారిని నిర్బంధపఱిచిరి. తనపుత్రుఁడయిన నరసింహగజపతిరాజును స్వీకారముచేసికొని విజయరామరాజుగారు మరణానంతరమున సింహాసన మాతని కిచ్చునట్లు తమ్ముని నొడఁబఱిచి యాయన తాను మంత్రిత్వమును విడుచుట కంగీకరించెను.

విజయనగరమువారు చెల్లింపవలసిన మొత్తమును నిర్ణయించుటకయి కంపెనీవారి చెన్నపురిపరిపాలకుఁడు విజయరామరాజుగారిని చెన్నపురి రమ్మనికోరెను. కోరినప్రకారముగా విజయరామరాజుగారు చెన్నపురికిఁబోక ప్రయాణవ్యయములకు తనచేత సొమ్ములేదనియు, తన యన్నయైన సీతారామరాజుగారు తన్ను నాశనముచేయుటకయి తంత్రములు పన్నుచుండిన యాకాలములోఁ దాను రాజధానినివిడిచి దూరముగాఁ బోవుట యుచితము కాదనియు, విశాఖపట్టణములోని యధికారుల సమక్షమునఁ దాను వారు విధించెడు న్యాయమైనకప్పమున కంగీకరించెదననియు, చెప్పి తప్పించుకొనెను. అంతట చెన్నపురిపరిపాలకుఁడు సీతారామరాజుగారిని చెన్నపురికి రమ్మనికోరఁగానే యతఁడు తత్క్షణమేపోయి యక్కడివారిని వశపఱచుకొని రాజకార్యములు చక్కఁబఱుచుకొని, విజయనగరసంస్థానమునకు తన్ను దివానుగా నేర్పాటుచేయించుకొని తన పుత్రుని స్వీకారమును స్థిరపఱిపించుకొని, మరలవచ్చెను. ఈయేర్పాటుల వలన విజయరామరాజుగారు పేరునకురాజుగానుండినను నిజమయిన యధికారమంతయు సీతారామరాజుగారి చేతిలోనే చిక్కెను. ఈవిషయమయి విజయరామరాజుగారు కంపెనీవారికి మొరబెట్టుకోఁగా పెట్టుకోఁగా తుదకు వారాయనను దివానుపనినుండి తొలఁగించి విజయనగరము విడుచునట్లుత్తరువు చేసిరి. అందుపైని సీతారామరాజుగారు విజయనగరము విడిచి సింహాచలము నివాసముగా నేర్పఱుచుకొని యక్కడ కొంత

కాలముండి, తరువాత మరల తమ్మునిమంచిమాటలాడి ౧౭౯౦ వ సంవత్సరమునం దొకసారియు ౧౭౯౨ వ సంవత్సరమునం దొకసారియు మరల సంస్థానములో దివానుగాఁ బ్రవేశించి, కడపటిసారి కంపెనీవారిచే చెన్నపురికిఁ బోవునట్లుత్తరువుచేయఁబడి నెలకయిదువేలరూపాయల యుపకారవేతనముమీఁద ౧౭౯౩ వ సంవత్సరమునం దక్కడఁబోయి చేరెను. సీతారామరాజుగారి దుష్పరిపాలనము మొదలైన కారణములచేత విజయరామరాజుగారు ఋణములపాలగుటయేకాక కంపెనీవారికి కట్టవలసిన కప్పమును సరిగా కట్టలేక యారులక్షల యిరువదియైదువేల రూపాయలవరకు బాకీపడిరి. అందుచేత కంపెనీవారు సంస్థానమును తమపాలనమునకుఁ దీసికొని, విజయరామరాజుగారిని స్వరాజ్యమువిడిచి మచిలీబందరులో వాసము చేయునట్లుత్తరువుచేసి, ఆయనకు ముప్పదివేలరూపాయ లొక్కసారిగా రొక్కమిచ్చెదమనియు నెలకు రు ౧౨౦౦ లు వ్యయముల కిచ్చెదమనియుఁ జెప్పిరి. ఆయన స్వదేశమును విడుచుట కిష్టములేనివారయి బందరుపురమునకుఁ బోవుమార్గమున బైలుదేరి యయిదారుక్రోసుల దూరముపోయి యక్కడనుండి పనివారలతో వెనుకఁదిరిగి పద్మనాభమునకుఁ బోయి యక్కడనుండి తాను ప్రయాణము చేయలేకపోవుటకు సాకులు వ్రాయనారంభించెను. విజయరామరాజుగా రక్కడనున్నకాలములో రాచవారును నాలుగువేల సైనికులునుబోయి యాయనను జేరిరి. కంపెనీవారి కీసంగతి తెలియఁగానే యిరువదినాలుగుగంటలకాలము గడువిచ్చి యాలోపల నతఁడు బందరుమార్గమున బైలుదేరనిపక్షమున, బలాత్కారముగాఁ బంపవలసిందని విశాఖపట్టణములోనున్న సేనానాయకునకుత్తరువుచేసిరి. పయివారి యుత్తరువును దెలియఁబఱిచి యింగ్లీషు సేనాధిపతియైన ప్రెండర్గాస్టుగారు కొంతసేన (౭౫౦ భటుల)తో పద్మనాభమునకుఁ బోయిరి. ౧౭౯౪ వ సంవత్సరము జూలయినెల ౧౦ వ తేదీ యుదయమున నింగ్లీషుసేనాధిపతి పద్మనాభముకొండను జేరునప్పటికి, విజయ

రామరాజుగారును బంధువులయిన రాచవారును ఖడ్గపాణులయి లోఁబడక యుద్ధముచేసి వీరమరణమునొందుటకు నిశ్చయించుకొని యందరును పద్మనాభస్వామి ప్రసాదమునుస్వీకరించి యుద్ధోన్ముఖులయి నిలిచియుండిరి. నాఁడు సూర్యోదయకాలమున నింగ్లీషుసేనలకును రాజుగారి సేనలకును ముప్పావుగంటసేపు ఘోరయుద్ధము జరగినది. అంతట రాజుగారి సేనలన్నియు చెల్లాచెదరయి పారిపోయినవి. రణరంగమునకుఁబోయి చూడఁగా రణనిహతులయి వీరశయనము నొందినవారిశరీరము లక్కడ మున్నూటతొమ్మిది కనఁబడినవి. రణభూమినలంకరించిన మున్నూటతొమ్మిదింటిలో నిన్నూటయెనుబది రాచవారిదేహములు. రణరంగమధ్యమునఁ బడియుండిన విజయరామరాజుగారి శవముచుట్టును కోటకట్టినట్లుగా సంస్థానములో నున్నతస్థితిలో నుండిన యుత్తమక్షత్రియుల శవములు నలువది గుండుదెబ్బలతోఁ బడియుండెను. ఇట్లు మరణమునొందినవారుగాక పారిపోయినవారిలో నెందరికిగాయములుతగిలినవో తెలియలేదు. ఇంగ్లీషుసైనికులలో మృతులయినవారు పదుముగ్గురు; గాయపడినవారరువదియొక్కరు. ముప్పదియేడేండ్లక్రిందట బొబ్బిలికోటముందు పెద్ద విజయరామరాజుగారు హతులయినట్లే మనకవీంద్రునికాలములో నుండిన యీ చిన్నవిజయరామరాజుగారు పద్మనాభపుకొండయందు నిహతులయిరి. మనకవికాలముతో సంబంధించినచరిత్రమింతే. తండ్రిమరణమును విని యప్పటి కెనిమిదిసంవత్సరముల ప్రాయమువాఁడయిన నారాయణబాబుగారు తల్లితోడఁగూడ కొండదేశమునకుపారిపోయిరి. కాని,కంపెనీవారాయనను పిలిపించి దొరతనమిచ్చిరి. ఆయన పంద్రెడులక్షలవరకును ఋణముచేసి ౧౮౦౭ వ సంవత్సరమునందు తనకు సంవత్సరమున కెనుబదివేలరూపాయలిచ్చు పద్ధతిమీఁద రాజ్యపాలనము నింగ్లీషువారి కప్పగింపఁగా వారు ౧౮౨౨ వ సంవత్సరమునాఁటి కప్పులన్నియుఁ దీర్చి రాజ్యము నాయనకు మరలనిచ్చిరి. నారాయణబాబుగారు మరల నేడు

లక్షలరూపాయలప్పుచేసి తనకు సంవత్సరమునకు లక్షరూపాయలిచ్చు పద్ధతిమీఁద ౧౮౨౭ వ సంవత్సరములో రాజ్యమును మరల నింగ్లీషు వారియధీనముచేసి కాశీయాత్రపోయి యక్కడనే వాసముచేసి ౧౮౪౫వ సంవత్సరమున దేహము చాలించిరి. మరణకాలమున కాయన యప్పు ౧౧ లక్షలకుఁ బెరిగినది. పండ్రెండు సంవత్సరముల ప్రాయముగల నారాయణబాబుగారి కుమారుఁడగు విజయరామ గజపతిరాజుగారికి రాజ్యమిచ్చి ఆయన కాశీనగరమును విడిచివచ్చుట కిష్టము లేనివారుగా నుండినను ౧౮౪౮ వ సంవత్సరమునం దాయనను విజయనగరమునకు రప్పించిరి. ఋణముల నన్నిటిని దీర్చి ౧౮౫౨ వ సంవత్సరములో రు ౨౧,౨౭,౨౪౮ ల రొక్కముతో నింగ్లీషువారాయనకు రాజ్యమొప్పగించిరి. ఈ విజయరామగజపతిరాజుగా రాంగ్లేయోపాధ్యాయుల శిక్షచేఁ బ్రవీణులయి సత్పరిపాలన చేయుచు బాలికాపాఠశాలలు మొదలయిన జనోపయుక్తములగు ధర్మకార్యములకొఱకు ధనమును సద్వినియోగ పఱచుచు వచ్చిరి. విశాఖపట్టణములోని వైద్యశాలకు ముప్పదివేల రూపాయల నిచ్చినందున, దొరతనమువారాయనకు ౧౮౬౪ వ సంవత్సరములో "మహారాజా" యన్న బిరుదిచ్చిరి. ఈయన ౧౮౭౮ వ సం॥ రమున స్వర్గస్థులుకాఁగా ౧౮౫౦ వ సంవత్సరమునందు జనించిన యీయనపుత్రు లానందగజపతిరాజుగా రప్పటినుండి విజయనగరపరిపాలకులుగా నున్నారు. దొరతనమువా రీయనకును ౧౮౭౬ వ సంవత్సరమున "మహారాజా" యన్నబిరుదము నిచ్చిరి.

సూరకవికి రేవయను గ్రామమున చెరువుగట్టుక్రింద నొకమాన్యముండెననియు, ఆగ్రామమును గుత్తచేసిన దంతులూరి యన్నమరాజు కవిమాన్యమునకు చెరువునీరు పెట్టుకోనీకపోఁగా, అతఁడు ప్రభువునకు మొఱపెట్టుకొనియు కార్యముగానక తుదకు చెఱువులో నిలుచుండి

యీక్రింది నాలుగు సీసపద్యములును జెప్పఁగానే చెఱువు నాలుగు వైపులను గండితెగి నీరాతని పొలముమీఁద పాఱెననియుఁ జెప్పెదరు-

సీ. బ్రహ్మాండభాండసంపత్తి కుక్షినిగల్గు పద్మనాభునిపదాబ్జమునఁ బుట్టి
సకలరత్నాకరస్థానమై యుప్పొంగునంబుధీశునిచరణంబు ద్రొక్కి
పరమతత్త్వజ్ఞుఁడై పరఁగుశంతనుమహీరమణువామాంకభాగమునఁ జేరి
యఖిలలోకాధ్యక్షుఁడై మించివిహరించుశివుజటాజూటాగ్రసీమనిలిచి
తనరు నీవంటిధన్య కుత్తమముగాదు
పూసపాటి మహాస్థానభూమియందుఁ
గాలుద్రొక్కంగ నోడుఁ జండాలుఁడైన
గదలు మిటమాని దివిజగంగాభవాని.

సీ. ఆదిభిక్షుం డీతఁడనిరోసి విడియాకుగొనివచ్చి యిటనిల్వఁగోరితొక్కొ
జగడాలచీలివై సవతితోఁ బోరాడి వీఁగివచ్చి యిచట డాఁగితొక్కొ
నిర్జరాంగనలెల్ల నీఱంకువెలిపుచ్చ దూబవై యిచ్చోటదూఱితొక్కొ
బీదబాపలఁగష్టపెట్టుటకై మిన్నుదొలఁగి యిచ్చోటను నిలిచితొక్కొ
వలదు ద్విజభూమిఁ గాల్నిల్ప వరుసగాదు
రవ్వ నీకేల తగ దంబురాశికరుగు
నాతియతఁడేకాఁడటె పిన్ననాఁటి మగఁడు
కదలుమిటమాని దివిజగంగాభవాని.

సీ. భావింప నిలువెల్ల భంగంబులేకాని
భంగము ల్తొలఁగు టెప్పటికి లేదు
తిరుగుచో వంకరతిరుగు డింతియకాని
తిన్నగాఁదిరుగుట యెన్న డెఱుఁగ
మునసిరేయిపగల్లు మొరయుచుండుటెకాని
మొరయకూరకయుంట యెఱుఁగ వెపుడు
పాలకల్మినిరోసి పల్చనగుటేకాని
పలుచనిగతి మాని మెలఁగు టెఱుఁగ

మనుచు నీలోన నీవైన యవగుణంబు
లరసి లజ్జించి దివి నుండ కరుగుదెంచి
నిలువునీరైన నీవింక నిలిచి పోక
కదలు మిటమాని దివిజ గంగాభవాని.

సీ. కృతకాద్రు లాయెనా కీలోగ్రఫణిఫణానేకఫూత్కారవల్మీకదంబము
విరిదోఁట లాయెనా కఱకుకంటకకంటకాంకురవిస్ఫురితాగచయము
పువుఁబాన్పు లాయెనా నవమంజులశ్వేతలవణాలవాలమౌ చవుటినేల
బొమ్మరిండ్లాయెనా భూరిభేకాండజాధారమై తనరు కేదారచయము
నీకు విహరింప వసతులై నివ్వటిలెనె
చిన్నపొలములు బ్రాహ్మణక్షేత్రమునకు
ఘాతుకత్వంబు చేయుముష్కరులు గలరె
కదలుమిటమాని దివిజగంగాభవాని.

ఈసూరకవి విషయమున నిఁకఁ దెలిసినసంగతు లతఁడు సమకాలికులగు కవులతోఁ బెట్టుకొన్న వివాదములును, కవు లొండొరులను దిట్టుకొన్న పద్యములును దక్క మఱి యేమియుఁ గానరావు. కాఁబట్టి యాకథలను విడిచి కవికృతగ్రంథములనుండి కొన్ని పద్యములనుమాత్ర మిం దుదాహరించుచున్నాను.—

## కవిజనరంజనము.

మ. అమరద్వీపవతీపయోవిహరణప్రాంచత్సురస్త్రీల వ
జ్రమయాభ్రంకషమంటపాగ్రముల నిచ్చల్ క్రీడఁగావించుత
ద్రమణీవారము వేఱ నేరుపఱుపన్ రా దంచుఁగా దివ్యరా
జముఖీపాళికిఁ దమ్మిచూలి యనిమేషత్వంబు గావించుటల్. ఆ-౧

శా. శయ్యాదంభమున న్స్మరాంతకుఁడు భూషాకైతవస్ఫూర్తి వే
నయ్యార్యారమణుండు దాల్చిరి భుజంగాధీశులన్ నీయసా
హాయ్యప్రస్ఫుటధాటి కోర్వ కనుచో నబ్జాస్యలా యోర్చుచా
రయ్యా గంధసమీరప్రోవఁగదవయ్యా యీకురంగేక్షణన్. ఆ-౨

మ. అలమన్ మైఁ బులకాంకురాళి దరహాసాంకూరము ల్కన్నవం
దొలఁకన్ ముత్యపుటొంట్లు గండయుగళిం దూఁగన్ గనత్కంకణం
బులు మ్రోయన్ భుజమధ్యసీమ రతనంపుందాలి తార్మాఱుగాఁ
దలఁబ్రాల్వోసెలతాంగియాదలఁపయిన్ ధాత్రీశుఁ డత్యాదృతిన్. ఆ. 3

ఆంధ్రచంద్రాలోకము.

గీ. అక్రమాతిశయోక్తి ప్రఖ్యాతికెక్క
హేతుకార్యంబులకు సహవృత్తిగలుగ-
జ్యాపరీరంభణై కదకుత వహించె
నీశరంబులు నీశత్రునృపులతోడ.

క. ఏపారుఁ గృతులఁ బ్రతివ
స్తూపమ వాక్యములురెంటి కొగి సమత తగన్-
తాపమున నలరు సూరుఁడు
చాపంబున శూరుఁ డొనరు జగతినసుక్రియన్.

రామలింగేశశతకమునందలి పద్యము లీవఱకే కొన్ని యుదాహరింపఁబడినవి. లక్షణగ్రంథము లగుటచే నాంధ్రనామశేష కవిసంశయవిచ్ఛేదములనుండి కవితాధోరణిని జూపుటకుఁ బద్యముల నుదాహరించుట యుచితము కాకపోయినను, అందుండియు నొక్కొక్క చిన్న పద్యమును గైకొనుచున్నాను—

క. వెన్ననఁగ బీజమంజరి । వెన్నన, జరమాంగమునకు వెలయునుబేర్లై
కన్ను లనం బర్వంబులు । కన్నులనన్ లోచనములు కంతేకాలా.

ఆంధ్రనామశేష.

గీ. ఎఱుకగలవారె యనుచోట నెఱుకగలరె
యిట్టివారెయనెడిచోట నిట్టిరెయగుఁ
జేయఁగలవారెయనుచోట జేయఁగలరె
యనుచు లోకప్రసిద్ధోక్తి యగునుశర్వ.

కవిసంశయవిచ్ఛేదము.

# 25. మంగళగిరి ఆనందకవి

ఈకవి వేదాంతరసాయనమనెడు నాలుగాశ్వాసముల పద్యకావ్యమును రచియించి దానిని నిడిమామిళ్ల దాసయామాత్యుని కంకితము చేసెను. కవి క్రైస్తవమత మవలంబించిన నియోగిబ్రాహ్మణుఁడు. ఈతఁడు తిమ్మయామాత్యుని పుత్రుఁడు; ఆత్రేయగోత్రుఁడు; కవి కృతిపతి తన్నుఁగూర్చి పలికినవిధము నిట్లు చెప్పుకొన్నాఁడు—

సీ. ఒకవంక నిగమాగమోజ్జ్వలాతిశయార్థవిధివాదకౌశలద్విజనికాయ
మొకచాయ న్యాయశాస్త్రోదాత్తవాక్యప్రసంగకృద్విద్వత్ప్రజావితాన
మొకకేవ సంస్కృతప్రకటాంధ్రభాషాకవిత్వప్రవీణకవిప్రకాండ
మొకచెంత సప్తస్వరోద్గీతగీతికావైచిత్రివిస్ఫురద్వైణికౌఘ
ముల్లసిల వజ్రకౌక్షేయకోపమాన
వైభవస్ఫూర్తి నొక శుభవాసరమున
మహితగుణపాళి దాసయామాత్యమౌళి
ప్రమదముప్పొంగఁ బేరోలగముననుండి.

మ. నను సర్వేశపదాంబుజద్వయనితాంతధ్యానపారీణు భూ
రినయోపేతచరిత్రు మంగళగిరి శ్రీవంశవారాశిపూ
ర్ణనిశానాథు సుధీజనాభిహితు నానందాఖ్యు సద్గ్రంథక
ల్పను సాహిత్యకళావిశారదుని బిల్వం బంచి పల్కెం గృపన్.

చ. తరుముఖసప్తసంతతు లుదారత నెచ్చట నిల్వ నచ్చటన్
బరఁగు సమస్తదిక్కులకుఁ బ్రాఁక గుభావరసానుకూలవా
గ్గరిమఁ దనర్చు సత్కృతిముఖంబున వానికిఁ దారకేందు
భాస్కరులు గలంతకాల మనిశంబుఁ గరంబుఁ బ్రసిద్ధి చెల్వగున్.

ఇతఁడు లాక్షణికాగ్రగణ్యుఁ డయిన ప్రబంధకవి. పేరునుబట్టి తోఁచున ట్లిది వేదాంతగ్రంథముగాక మతస్థాపకుఁడయిన యేసుక్రీస్తు

యొక్క చరిత్రముగా నున్నది. ఈపుస్తకము నిర్దుష్టమయి మృదుమధుర మైన ప్రబంధపాకమునఁ జేయఁబడియున్నది. ఇందలి వర్ణన లేవిషయము నను బూర్వప్రబంధములలోని వర్ణనలకుఁ దీసిపోవు. బ్రౌన్‌దొరగారీకావ్యము ౧౭౦౦ వ సంవత్సరప్రాంతమున రచియింపఁబడినట్టు చెప్పిరి. కాని, కవి కృతిపతి యయిన దాసామాత్యునిసోదరుఁడగు రాజప్పను వర్ణించుచో—

మ. మదిరాక్షీమదనుండు రాజపమహామంత్రీంద్రుఁ డుద్యన్మహా
మ్మదలీఖాను కృపానులబ్ధమదవన్మాతంగమాణిక్యహా
రదుకూలాదికసత్కృతిం ద్రిదశవర్యస్ఫారసామ్రాజ్యల
క్ష్మిఁ దనర్చె న్బుధకోటి పేర్కొనఁగఁ బుణ్యైర్వృష్టణాధ్యాసియై.

అనుపద్యములో నతఁడు కర్ణాటకపు నబాబగు మహమ్మదల్లీ చేత సత్కారమును బొందినట్లు చెప్పియుండుటచేతను, ఈమహమ్మదల్లీ ౧౭౪౯ వ సంవత్సరమునఁగాని సింహాసనమునకు వచ్చి యుండకపోవుట చేతను, వేదాంతరసాయనము ౧౭౫౦ వ సంవత్సరమునకు తరువాతనే రచియింపఁబడినదని నిశ్చయింపవలయును. ఈకవి కూచిమంచి తిమ్మకవి మొదలయినవారి కాలములోనే కృష్ణామండలమున నుండినవాఁడు. కృతి నాయకుఁడు బందరుపురములో నధికారము చేసిన ట్లీ క్రిందిపద్యము వలనఁ దెలియవచ్చుచున్నది.

మ. ప్రకటారాతిచమూభయానకఘనప్రాకారధేయంబులన్
సుకరశ్రీఁ దగుబందరాఖ్యనగరిన్ సొంపొందుదీవార్థిక
ల్పకభూజం బన దాసమంత్రి రుచిశుంభద్రత్నజాంబూనదా
దికవస్తుప్రకరాన్వితాయతనుఁడై ధీరుల్ ప్రశంసింపఁగన్.

వేదాంతరసాయనకృతికర్తయు కృతిభర్తయు నిరువురును క్రైస్తవ మతప్రవిష్టులైన నియోగి బ్రాహ్మణులు. వేదాంతరసాయనముయొక్క

యొక్కొక్క యాశ్వాసమునుండి యొక్కొక్క పద్యము నిం దుదాహ
రించుచున్నాను—

చ. జగదుపకారకారకవిశాలసమస్తపదార్థకల్పకుం
డగునతని౯ పరాత్పరు మహామహు సర్వశుభస్వభావు బ్రమొ
క్కఁగఁ దగుఁగాక యాతఁడిలఁ గల్గఁగఁ జేసినవానిపూజ స
ల్పఁగ దురితంబు లంటునని పల్కుట యొప్పు నసంశయంబుగన్. ఆ-౧

చ. ఘనతరపాపపుణ్యముఖకార్యసమాచరణస్వతంత్రతన్
గొనినమనంబు మానవునకుం బొసఁగం దగు లేనిచో జగం
బున సుకృతాఘము ల్నరక మోక్షపదంబులు గల్గవం చనం
జను నుచితజ్ఞ సంతతి నసంశయవాక్యవిజృంభణంబునన్. ఆ-౨

చ. చని సెలయేటి మొత్తములఁ జందనశైలమరుద్విలోలకాం
చనకురువిందచందనరసాలముఖద్రుమసమీపగోస్తనీ
ఘనతరఛాయమానములఁ గప్రపుఁదిన్నియలన్ లతానికే
తనముల సంచరింపుచు నతండు పరాత్పరచింతనంబునన్. ఆ-3

ఉ. వారలవార్యకౌతుకనివాసమనోంబుజులై జగజ్జనా
ధారు నయప్రచారు సముదారుని నమ్మరియాకుమారునిన్
భారపుస్లీవప్రమానున విపద్దశలం బొరయించినట్టిని
ష్కారణవైరులన్ సరకుగాఁ గొన కించుక యెల్లదిక్కులన్. ఆ-౪

# 26. కనుపర్తి అబ్బయామాత్యుఁడు

ఈకవి యాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; రాయన మంత్రి పుత్రుఁడు; కౌండిన్యగోత్రుఁడు. ఈతనితల్లి నరసమాంబ; అన్న యోగానందము. ఈకవి యనిరుద్ధచరిత్రము, కవిరాజమనోరంజనము అను రెండు ప్రబంధములను రచియించెను. ఇందు మొదట రచియింపఁబడిన యనిరుద్ధచరిత్రములో—

ఉ. నిండుమనంబు సత్యమును నీతియు శాంతియుఁ గల్గి కీర్తిమం
తుం డయి భోగభాగ్యములతోఁ జెలువొందుచుఁ గొండవీటిభూ
మండలనాయకుల్మిగుల మన్ననచేయఁగఁ బెంపుమీఱె స
త్పండితుఁ డబ్బమంత్రి కనుపర్తి పురాన్వయవార్ధి పూర్ణచం
ద్రుం డని లోకు లందఱు నెఱుంగుటకు న్నుతిచేయ నేటికిన్.

అని కవి తనతాతయైన యబ్బయ్య కొండవీటిరాజుల మన్నన నొందినట్లు వ్రాసికొనెను గాని యాతని కాలమునాటికిఁ గొండవీటి రాజ్యము తురుష్కులయధీన మయినది. ఈహేతువుచేతఁ గాబోలును కవి కవిరాజమనోరంజనములో—

చ. సుగుణకదంబ మెల్ల నొకచోటనె కాపుర మున్నయట్లుగా
నగునని వేయినోళ్లఁ గొనియాడుచు భూజను లెంచ ధన్యుఁడై
తగు కనుపర్తియబ్బనకుఁ దత్ప్రియసాధ్వికి లచ్చమాంబకున్
బొగడిక కెక్కి రిద్దఱుసుపుత్రులు రాయన నిమ్మనాహ్వయుల్.

ఉ. వేయనవచ్చుఁగాక సుఖివే యనపాయవదాన్యుఁడై భవం
బాయనవవ్యబుద్ధి తగు నాయనకే యనఁ గీర్తిచంద్రికల్
గాయ నయస్వగీతికలు గాయనశీలురుపాడ నొప్పు మా
రాయనమంత్రి మేలు బళిరాయన సూరిజనాభివంద్యుఁడై.

అను పద్యములయందుఁ దనతండ్రి తాతలు కొండవీటిరాజుల

యొద్ద నున్నట్లు చెప్పకే తనతాతకు ముత్తాతయైన బసవామాత్యుఁడు మాత్రమే కొండవీటిరాజులమంత్రియైన ట్లీక్రింది పద్యమునఁ జెప్పెను-

శా. శ్రీపేర్మిన్ శశివోలె బ్రహ్మకులవార్థిం బుట్టి కౌండిన్యగో
త్రాపస్తంబపవిత్రసూత్రకలితుండై రామసింహాసనా
ధ్యాపేతస్ఫుట కొండవీటిపురరాజ్యోర్వీశ్వరు ల్మంత్రిగాఁ
జేపట్టన్ బసవప్రధానుఁ డిల మించెన్ భాగ్యసంపన్నుఁడై.

కవియొక్క తండ్రి తాతలు కొండవీటిసీమలోని కనుపర్తిగ్రామమునకు కరణములని తోఁచుచున్నది. కవికి మంగళగిరిలోనున్న పానశాలరాయఁ డిష్టదైవతము. మంగళగిరి కృష్ణామండలములో గుంటూరునకు సమీపమున నున్నది. అబ్బయామాత్యుఁడు పదునెనిమిదవ శతాబ్ద మధ్యమున నుండినవాఁడు. ఇతఁడు ౧౭౮౦ వ సంవత్సరప్రాంతమువఱకును జీవించి యుండవచ్చును. ఇతఁ డాశతాబ్దమునం దుండిన ప్రబంధకవీశ్వరు లందఱిలోను మిక్కిలి ప్రౌఢుఁడు. వసుచరిత్రమునకుఁ దరువాత నీతని కవిరాజమనోరంజనముతో సరితూఁగఁదగిన ప్రబంధము లొకటి రెంటికంటె నెక్కువగా లేవు. కవిరాజమనోరంజనములోని యీక్రింది పద్యమువలనఁ గవి సాహిత్యమునందు మాత్రమే కాక సంగీతమునందును బ్రవీణుఁ డయినట్లు కనఁబడుచున్నాడు-

క. శ్రీమంగళగిరి నరసిం । హామే యకృపావిజృంభితాద్భుతకవితా
శ్రీమంతుఁడఁ గానకళా । ధీమంతుఁడ దేవతాస్తుతివ్రతపరుఁడన్.

కవిరాజమనోరంజనమునకుఁ బురూరవశ్చరిత్రమని నామాంతరముగలదు. బాల్యమునందు రచియింపఁబడినదగుటచే ననిరుద్ధచరిత్రము పురూరవశ్చరిత్ర మంత ప్రౌఢముగా లేదు. ఈరెండు పుస్తకములనుండియు గొన్నిపద్యముల నుదాహరించుటకన్నఁ గవి విషయమున వ్రాయఁదగిన విశేషాంశము లేవియుఁ గానబడవు.

## అనిరుద్ధచరిత్రము.

చ. విచికిలగంధియున్ విభుఁడు వేడుకతోఁ దెర రెండువైపులన్
రుచిరకటాక్షపంక్తులమెఱుంగులు నిండఁగ నిల్చి రయ్యెడన్
బ్రచురతరానురాగరసబంధురతం దెరచీర దూరి పా
ఱుచు హృదయాబ్జముల్ మొగమెఱుంగని చుట్టఱికంబు సేయఁగన్. ఆ.౧

ఉ. కన్నులఱెప్ప లాఁగనివికాసపుఁజూపును మౌనముద్రతో
నున్న మొగంబు నిశ్చలత నొప్పుశరీరముఁగాఁ బటంబుపై
నున్నతలీల వ్రాసినప్రియుం గని సొక్కునఁ దాను నట్లయై
చిన్నెలు దక్కియుండె సఖి చేసినజంత్రపుబొమ్మకైవడిన్. ఆ.౨

ఉ. మీసముతీరుఁజూచి, జిగిమేని పటుత్వముఁజూచి మోములో
హాసముఁజూచి చేతులయొయారముఁజూచి మనోజ్ఞ రూపరే
ఖాసమలీలఁజూచి యహహా యనుచుం దలయూఁచి ముందు తా
వ్రాసినభావ మెంచి తల వంచుకొనెం జలజాక్షి సిగ్గునన్. ఆ.3

చ. అనవుడు మందహాసముఖుఁడై హరి నీభుజశక్తి నీవె నె
మ్మనమున లజ్జలేక పలుమాఱును మెచ్చుకొనంగ నీతియే
యని మొన నిల్చినప్పుడు నిరర్థక మీవెడమాట లేల నాఁ
కొని భుజియింపఁబోవుచును గూరలమే లడుగంగ నేటికిన్. ఆ.౪

ఉ. భూసురవేదనాదములఁ బుణ్యసతీజనమంజులోక్తులన్
భాసురనృత్తగీతరసబంధురరావములం బురీవనీ
వాసశుకానులాపముల వారణబృంహితవాజిహేషలన్
శ్రీసముదంచితం బగుచుఁ జెల్వు వహించెఁ బురంబు నవ్యమై. ఆ.౫

## కవిరాజమనోరంజనము.

చ. కొడుకులు గల్గుదాఁక నొక కొన్నిదినంబులు చింత నందనుల్
పొడమిన నాయువు న్బలము బుద్ధియుఁ జాలఁగల్గఁగా
నుడుగనిచింత కల్గి తను నోలభజింపనిచింత తండ్రి కె
ప్పుడుఁ గడుచింత సేయుదురు పుత్రులు శత్రులుగాక మిత్రులే. ఆ.౧

సీ. ధర నల్పులకుఁ బ్రభుత్వంబు వచ్చిన మనుష్యుల వికారపుఁజాడ్పుఁ జూచినట్లు
పల్లవు లుద్ది లేమిఁబడి యింటిచాయరామోగిలం జెతల్లులు మూల్గినట్లు
పరదేశియతిలోభపరునియింటికిఁ బోవఁ జెగిక్రోఁతివలెను గద్దించినట్లు
వంతువాసికి హీనవైశ్యులు తమలోన నేకంబుగాఁ గలహించినట్లు
తెరలి యొండొకటిని రూక్షదృష్టిఁ జూచు
గోఁజగోఱను మూల్గు గద్దించుఁ దఱిమి తఱిమి
కవిసి కలహించి భౌకృతి కలకలముగ
జాగిలమ్ములు రోషభీషణము లగుచు. ఆ. ౨

చ. కర మనురక్తిఁ గొమ్మ కరకంజమునం దిడి మీకుఁ బాలుఁ జ
క్కెరలును బెట్టి పెంచి పలికింపుచు మాటలు నేర్పినందుకా
విరసపుఁగూఁతల న్నిగుల వేదన గొల్పెద రింతి కియ్యెడన్
గురువుకు బొమ్మవెట్టితిరి క్రూరవిచారమ కీరవారమా. ఆ. 3.

ఉ. నిప్పులురాలు గ్రీష్మమున నిక్కినగాడ్పులు వార్షికంబునన్
జప్పుడుసేయుకే మరలసాఁగెఁ బ్రతీచికిఁ బ్రాచినుండి తా
రప్పటిపొంగుచేఁ బ్రజల నాపదఁ బెట్టి నిజాధికారముల్
దప్పినఁ జిన్నబోయి మరలం జనుచుందురుగాదె దుష్ప్రభుల్.

చ. మలయజగంధి తాళపరిమాణమనోహరరాగగీతికా
కలనినదంబు జంత్రమున గాత్రమునన్ జెలఁగింపు నింపుచే
శిలలు ద్రవించెఁ జిత్రములు జీవకళల్ ధరియించె చారువుల్
పొలుపుగ నంచరించె మృగముల్మదిఁ జొక్కు వహించె నెంతయున్-ఆ. ౪

మ. తగునే రాజకుమార మన్మథ మనస్తాపంబుచే నింత నె
వ్వగలం బొందఁగ ధైర్యశాలివిగదా వారాంగనా స్నేహమో
హగుణంబుల్ చపలాయతాయతము లెంతైన న్నతం బేలగున్
నగరే లోకులు నీమనం బిటులు మగ్నంబైన రాగాంబుధిన్ — ఆ. ౫.

# 27. కొఠాద పెద్దనసోమయాజి

ఈ కవి నిజాముదాజ్యములోని గద్వాలసంస్థానాధిపతియైన ముష్టి పల్లి సోమభూపాలుని ప్రేరణముచేత ముకుందవిలాసమును, అధ్యాత్మ రామాయణమును రచియించెను. ఇతఁడు నందవరీక నియోగిబ్రాహ్మ ణుఁడు; ఆశ్వలాయనసూత్రుఁడు; ఆత్రేయ గోత్రుఁడు; తిమ్మనార్య పుత్రుఁడు. సోమభూపాలుఁడు తన్నుఁగూర్చి పలికినట్లు కవి చెప్పుకొన్న ముకుందవిలాసములోని యీ క్రిందిపద్యములలో "శేషశైలేశలీల" అను నామముతో అపంచవర్గీయ చిత్రకృతి మొదలయినవానినిగూడఁ దాను రచించినట్లు చెప్పెను గాని యవి యిప్పుడు కానరావు.—

సీ. నను నందవరపురాన్వయపయోనిధిచంద్రుఁ గాఁణాదవంశవిఖ్యాతిసాంద్రు
నాశ్వలాయనసూత్రు నాత్రేయమునిగోత్రు సకలవిద్వత్కృతవిప్రవరమిత్రు
ప్రౌఢలక్ష్మీపతిపండితసోదర్యు బాహటగ్రంథానుభావధుర్యు
వేదశాస్త్రపురాణవివిధమర్మధురీణు వరచతుర్విధకవిత్వప్రవీణు
భోజచంపూప్రబంధార్థబోధనాను
బంధగీర్వాణటీకానిబంధనాది
పేశలవచోరచనచర్యుఁ బెద్దనార్యుఁ
గాంచి దయమించి పలికె సగౌరవముగ.

గీ. కాదివర్ణంబు లిరువదియైదువిడిచి । చేసితి వపంచవర్గీయచిత్రకృతిని
శేషశైలేశ లీలాఖ్యచే నెసంగ । యాదిమితవర్ణనియతి శక్యంబుజగతి?

ఉ. శ్రీరమణీ యతః సురపురీనగరీనగరీ యదేశభూ
భారధురీణుఁ డాబహిరిపామనృపాలు సభాంతరంబునన్.
మారమణాంకితంబులుగను మత్స్యపురాణ మొనర్పఁ బూనవే
సారసుధాప్రసారవిలసత్కృతి నాంధ్రవచశ్చమత్కృతిః

ఈ కవి సంస్కృతాంధ్రములయందు బహుసమర్థుఁడు. ఈతని గ్రంథములలో నున్నన్ని శబ్దాలంకారములును చిత్రబంధకవిత్వ పద్యము లును మఱి యేకవిగ్రంథములోను లేవు. ఈతనికవనము రసవంతమయి కవిజన హృదయరంజకముగా నుండును. తన కవిత్వమును గూర్చి వెన్నెల కంటి వేంకటపతి యీ క్రిందిపద్యమును జెప్పినట్లు కవి తన యధ్యాత్మ రామాయణమునందు వ్రాసికొనియున్నాఁడు—

ఉ. ఇద్దఱుకోడు నన్నకవి యెఱ్ఱన, తిక్కన సోమయాజి దా
నుద్దగు వారికిన్, ముగురి కొక్కఁడె దీటగు నల్లసానిమా
పెద్దన, వారితోడుతను బేరువహించిన శ్రీకణాదముం
బెద్దనసోమయాజి విను పెద్దనఁ బోల్పఁ గవిత్వసంపదన్.

ఇట్లితరులు పొగడనట్లు చెప్పుటయేకాక కవి తానును తన ముకుందవిలాసము నిట్లు పొగడుకొన్నాఁడు—

గీ. ఇంకు సకలహితము సిచ్చు మున్విష్ణుచి
త్తీయతుల్యమౌ మదీయకవిత
యుదుటఁజేవఁ దొలువనులిబోలు నళిమోము
మృదువుగాదె విరులమీఁద వ్రాలి?

క. కుందవిలాసముతావి ము
కుందవిలాసము సదాముకుందవిలాసం
బిందువిలాసమును సుధా
బిందువిలాసము హసించుఁ బేశలఫణితిన్.

ఈకవి కాలముగాని కృతిపతి యనఁదగు పెదసోమనృపాలుని కాలముగాని నిశ్చయముగాఁ దెలియలేదు. అయినను

ఉ. నన్నయభట్టు భీమన ననంతు నధర్వణుఁ దిక్కయజ్వ నె
ఱ్ఱన్నను సోము భాస్కరుని నయ్యలు నైషధకావ్యకర్తఁ బో

తన్నను బిన్నపేరుని, జినన్నను సూరప రామభద్రుఁ బె
ద్దన్నను దిమ్మనాఖ్య గరుడాంకుని మూర్తి సుకీర్తి నెంచెదన్.

అని బట్టుమూర్తివఱకును గలకవుల నీకవి పొగడి యుండుటచేత నీతఁడు పదునాఱవ శతాబ్దాంతమునకును పదునేడవ శతాబ్దాదికిని దరువాత నుండినవాఁ డయినట్టు స్పష్టమగుచున్నది. ముష్టిపల్లి సోమనృపాలుని తాత మొదలయినవారు మహమ్మదీయులతో యుద్ధముచేసి వారిఁ పజయించుట మొదలయిన సంగతులు చెప్పఁబడి యుండుటచేత నితఁడు పదుఁనేడవ శతాబ్దాంతమునందో పదునెనిమిదవ శతాబ్దారంభమునందో యున్నట్లూహింపఁ దగియున్నది. గద్వాలసంస్థానమునందున్న మామిత్రులకొకరికిఁ గవికాలవిషయమునుగూర్చి వ్రాయఁగా ౧౭౫౦ సంవత్సర ప్రాంతములయం దుండినట్లు తెలిపి యున్నారు. ఇందలి కవిస్తుతిలోఁ జేర్పఁబడిన యయ్యలు రెట్టమతమును జేసినతఁడే యయినపక్షమునఁ గవి ౧౭౭౦ వ సంవత్సరమునకుఁ దరువాతఁగూడ నున్నట్టు చెప్పవలసి యుండును. ముకుందవిలాసమునకు భద్రాపరిణయ మని నామాంతరము గలదు. కవికృతములయిన రెండు గ్రంథములనుండియుఁ గొన్నిపద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి—

ముకుందవిలాసము.

ఉ. ఆటలు పాటలుం గలుగునందపుగందపుఁగూటవాటముల్
కోటలు పేటలుం బసిఁడిగోడలు మేడలుఁ గల్గువిందురా
చోటులు నీటులుం గులుకుచుక్కను జుక్కను నిండుఁజెల్వపుం
బోటులమేటులం దగినపొన్నలచెన్నులు గల్గువీటిలోన్. ఆ-౧

ఉ. చేరలఁగొల్వవచ్చు దయచిప్పిలు గొప్పకుగొప్పకన్నులున్
మూరలఁగొల్వవచ్చుఁ గడుముచ్చట లిచ్చువెడదందవక్షమున్
బారలఁగొల్వవచ్చుఁ గచపాళి బళీ హరికి న్నవీనాపపున్
మేరలఁగొల్వవచ్చు నిఁక మే లిత, డీగతిఁ బ్రీతిఁ జేసినన్. ఆ-౨

ఉ. క్రౌనునకౌనభంబుసరి కావిజగావిలసిల్లుమైవికిం
పానఁగఁ బొసకంబు సమ మానన మానసవిల్లు మేనమా
మే సనమేనసం గసకమేనన మీనసఁగన్గవందగున్
వేనలివేనలిన్విరుల వేయుఁజువే యువతీమతల్లికిన్. ఆ-౩

మ. తనరన్ వ్యాకరణజ్ఞుఁ దండ్రియనుచుం దర్కజ్ఞునిన్ భ్రాతయం
చును మీమాంసకునిన్ నపుంసకుఁ డటంచు న్వీడి దూరంబునం
గని యస్పృశ్యుసిఁబోలె ఛాందసుని వేడ్కం గావ్యలీలారస
జ్ఞు నిజేచ్ఛం గవితావధూమణి వరించున్ భావగర్భంబునన్. ఆ-౪

అధ్యాత్మరామాయణము.

సీ. సంసారదావాగ్నిసంతప్తులకు సుధాస్తోమవర్ష నియుక్తి రామభక్తి
తాపత్రయామయతాపపీడితులకు రమ్యభేషజయుక్తి రామభక్తి
పంచమహాపాపపటలసర్పములకు రచితగారుడశక్తి రామభక్తి
భవవిపద్వారాశిపాతభీతులకును బ్రబలతరీయుక్తి రామభక్తి
ప్రేమబోధితగురుసూక్తి రామభక్తి। కామితాత్మజనాసక్తి రామభక్తి
శ్రీమదురుసంపదనురక్తి రామభక్తి।సామరస్యోదితవిముక్తి రామభక్తి.
వాల.

చ. సొరిదిఁ గళత్రపుత్రపితృసోదరబాంధవముఖ్యసంగమం
బరయ నదీప్రవాహపతితాగతకాష్ఠములట్ల కూడుచున్
బరిపరివీడు నైజము ప్రపాగతజంతులఁబోలి మోహముం
బొరయకయుండఁగావలయుఁ బోవుచునున్నెడవచ్చుచున్నెడన్.
అయోధ్యా.

ఉ. అంతట దైత్యకాంతుఁడు సురాదివిరోధి సరోధిదాటి య
త్యంతవిభాకలంకను శుభాంకను లంక నశోకకాననా
భ్యంతరసీమలో నిలిపె నాసురకాంతలు కాచియుండఁగా
సంతతపూత సాధుగుణజాతను నాక్షితజాత నెంతయున్. అరణ్య.

ఉ. అంచలుపాఱెఁ గేకులకు నాటలుగేరె ఘనంబు లూరెఁ గ్రొ
మ్మించులుకూరె శీతలసమీరమువారె మరుండు చేరి ము
న్మించుగ జాతిబాణతతి మాఱె నటం బధికాళిధైర్యముల్
గ్రించుకజాఱె మాఱె నలగ్రీష్మము మీఱె జలాగమం బిలన్.

కిష్కింధా.

చ. కమలవిరోధి, కామజయకారి కిరద్యుతికీర్తనీయుఁడున్
కుముదహితుండు కూటమృగగోత్రకృతాంకుఁడు క్లప్తసత్కళా
క్రముఁడును కేశవేక్షణము కై రవిణీశుఁడు కోకభేదనా
గమనుఁడు కౌముదీకరుఁడు కంధిభవుం డుదయించెఁ దూర్పునన్.

సుందర.

ఉ. దానవనాశనార్థముగఁ దత్సతిఁ దెచ్చితి వీవును న్మహా
మీనము నామిషం బనుతమి న్విషపిండము గ్రోలిసోలు నె
ట్లానెఱి నామహీసుతసమాహరణం బొనఁగూడె మీఁదటన్
గా నగునట్టికార్య మదికానగుచున్నది దానవాగ్రణీ. యుద్ధకాండ.

మ. శ్రవణానందకరంబు సుందరముగా షడ్జాదిసప్తస్వరా
జ్జవమున్ జాతిగతుల్ త్రికాలకలితస్థానత్రయీపూర్ణ మా
ర్గవిధుల్ తోఁపఁగ వల్లకీచతురతన్ రంజిల్ల గాంధర్వసా
రవిదుల్గానమొనర్చి రాకుశలవుల్ రామాయణం బాసభన్. ఉత్తర.

# 28. కుందుర్తి వేంకటాచలకవి

ఈ కవి మిత్రవిందాపరిణయమనెడి మూడాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఇతఁడారువేల నియోగి బ్రాహ్మణుఁడు, అపస్తంబసూత్రుఁడు; శాండిల్యగోత్రుఁడు; రామయామాత్యపుత్త్రుఁడు. ఇతని తాతయైన గోవిందామాత్యుఁడు ౧౬౧౦ వ సంవత్సర ప్రాంతముల యందు రాజ్యముచేసిన వీరవేంకటపతిరాయలవద్ద నుండి, భారతీపరిణయము అను కావ్యమునుజేసి యాతనిని మెప్పించినట్లు కవి యీక్రింది పద్యమునఁ జెప్పియున్నాఁడు—

ఉ. పటుతరగోస్తనీమధురపాకసమంచితమై రసోర్మిప
ర్యటమగుభారతీపరిణయం బనుకావ్య మొసంగి వీరవేం
కటపతిరాయలం దనిపి కాంచె మణీకనకాభిషేక ము
త్కటగతి నమ్మహామతి సుఖస్థితిశోభి యశోభిరాముఁడై.

ఈ కవికాలమునాఁటికి విజయనగర సంస్థానప్రభువులు మిక్కిలి హీనదశకు వచ్చినందునఁ గవి ఈ రాజ్యమునువిడిచి పాండ్యమండలమును జేరి మధురలో నుండినట్లు తెలియవచ్చుచున్నది. గ్రంథావతారికలోఁ దాను పాండ్యమండలాధీశ్వరుఁడయిన విజయరంగ చొక్కనాథునిఁ గవిత్వము చెప్పి మెప్పించినట్లు కవియే యీ క్రింది పద్యములలో వ్రాసికొని యున్నాఁడు—

సీ. చదివినావే మేమి చదువయోగ్యంబులో
యవియెల్ల నిస్సంశయంబుగాఁగ
వచనకావ్యములుగా రచియించినావు భా
రతభాగవతములు రామకథయు
ఘటియించినావు ద్రాక్షాపాకముగ బహు
నాటకంబులు నమున్నతిఁ జెలంగఁ

జాటించినావు దిక్కోటరంబుల. బుధ
కోటిమెచ్చ నపారచాటుకృతులు
నర్థగుంభసముజ్జృంభితాశుమధుర
చిత్రవిస్తరకవితా ప్రసిద్ధి నీకు
సహజమేకద పాండ్యభూజానిసభఁ గ
ఘాశుకవియనఁగీర్తిఁ జెన్నలరినావు.

చ. కవిజనకల్పకం బఖిలకావ్యరసజ్ఞుఁ డఖండపాండ్యభూ
ధవుఁడు మహానుభావుఁ డతిధార్మికుఁ డర్యగవప్రధారి యై
న విజయరంగచొక్కనరనాథుఁడు నీ కవితాసమగ్రవై
భవములు మెచ్చి నీ కొసఁగె భర్మ మణీశిబికాదిసంపదల్.

పయిపద్యములనుబట్టి యితఁడు కొన్ని నాటకములను మాత్రమే కాక భారత భాగవత రామాయణములను వచనకావ్యములుగాఁ గూడ రచియించినట్టు విశదమగుచున్నది. ఇతఁడు మాత్రమేకాక యితని కాలమునందుండిన యితరకవులనేకులు కూడఁ దాము వచనకావ్యములను రచియించినట్టు తమ ప్రబంధములలో వ్రాసికొనియున్నారు. ఈ వచనకావ్యము లన్నియు మాకు దొరకకపోయినను, ఈ కాలములో రచియింపఁబడిన వచనకావ్య మొకటిమాత్రము మాకు లభించినది. ఆ వచనకావ్యమునుగూర్చియుఁ దత్కర్తనుగూర్చియు నింతకుముందే కొంత వ్రాయఁబడెను. పయి నుదహరింపఁబడిన వానిలోని కడపటిపద్యమునుబట్టి కవికాలము సహితము స్పష్టమగుచున్నది. విజయరంగ చొక్కనాథుఁడు ౧౭౦౪ వ సంవత్సరము మొదలుకొని ౧౭౩౧ వ సంవత్సరమువఱకును రాజ్యముచేసి విద్వాంసుఁడై యాంధ్రకావ్యరచనను బ్రోత్సాహము చేసినవాఁడగుటచేతను, అతని కాలములోనే కవి యనేక గ్రంథములనుజేసి తర్వాత మిత్రవిందాపరిణయమును జేసియుండుటచేతను, ఇతఁడు హూణశకము ౧౭౪౦ వ సంవత్సర ప్రాంతమువఱకును జీవించి

యున్నట్లు తెల్లమగుచున్నది. కొంతకాలమునుండి యీతని పూర్వికపు లాచరించుచు వచ్చిన యీయాచారమును మానక యీకవియు రంగనాథుఁడు తనకు స్వప్నమున సాక్షాత్కరించినట్లీ క్రింది పద్యమున వ్రాసికొనియున్నాఁడు—

సీ. నీలమేఘముడాలు చాలునించఁగఁజాలు
మేనువాఁడు జగంబు లీనువాఁడు
వేల్పురాతాతల్పు విప్పుటందమదల్పు
బొమ్మవాఁడు కళాభరమ్మువాఁడు
వెలలేనిబంగారు వేవన్నెరంగారు
చేలవాఁడు మనోజ్ఞలీలవాఁడు
కడకంట సొంపారుకరుణారసముమీఱు
చూపువాఁడు భవంబుఁబాపువాఁడు
హీరకటకకిరీటకేయూరతార
హారమంజీరచాకచక్యములవాఁడు
కలనొకానొకపురుషుఁ డుత్కలికదొలుకఁ
బ్రేమ నాప్రోల వేకువజామువేళ.

గ్రంథమునం దక్కడక్కడ లక్షణవిరుద్ధములైన ప్రయోగములనేకము లుండుటచేత నీతఁడు లాక్షణికకవి కాకపోయినను, మొత్తము మీఁద నీతనికవిత్వము రసవంతముగానే యున్నది. మిత్రవిందాపరిణయములోని రెండుమూడు పద్యముల నిందుదాహరించుచున్నాము—

చ. అని వనితోక్తియుక్తిగతి నవ్వని జవ్వనిగుంపు సొంపుఁ జే
కొని తనివార సౌరభము గ్రోలుచు సోలుచు మిన్నగన్న క్రొ
న్ననల నవద్యహృద్య కల నన్గని కన్గొని తావిమాని పెం
పొనరిన మేరఁ గీరరుతు లూకొని తూకొనినంత వింతగన్. ఆ—

ఉ. సారస మా మొగంబు జితసారస. మాగమనంబు నాభికా
సారసమాభ మాకచమసారసమాజము మేఘ మాసుధా
సారసమావృతంబు నుడి సారసమానము తన్నుతంబ మా
సారసమాననీయసువిసారసమాయత మాదృగబ్జముల్. ఆ. ర.

చ. కనియె నుదారుఁ జారుతరకౌస్తుభహారు సుమేరుధీరు జీ
వనదశరీరు దుగ్ధమయవార్థిగభీరు దురాపసారులో
చనసుఖదావతారు ఖలశైలశతారు నఘౌఘదూరు స
ద్వినుతయశోవిహారు వసుదేవకుమారు నతాబ్జసూరునిన్. ఆ. ఒ.

---

## 29. ఈదురుపల్లి భవానిశంకరుఁడు

ఈ కవి ధర్మఖండమును దెనిఁగించెను. ఇతఁడు కూచిమంచి తిమ్మ కవితోను వక్కలంక వీరభద్రకవితోను సమకాలికుఁడయినందున, ఇతఁడును పదునెనిమిదవ శతాబ్దారంభమునుండి ౧౭౫౦ వ సంవత్సర ప్రాంతములవఱకును జీవించియుండును. ఈ కవి తన ధర్మఖండమున వక్కలంక వీరభద్రకవినిగూర్చి వ్రాసిన "హరిశౌర్యోండగు" నను పద్య మీ వఱకే యుదాహరింపఁబడియున్నది. దిట్టకవి వేంకటరాయకవి తన విద్యాగురువైనట్లు కవి ధర్మఖండమున నీ క్రింది పద్యముచేఁ జెప్పుకొని యున్నాఁడు—

ఉ. శ్రీమయవాగ్విలాసుఁడు నశేషలిపిప్రవణుండు భూరిశో
భామహనీయమూర్తియుఁ ప్రబంధనిబంధనబంధురక్రియా
భామహితోరుసూత్రుఁడు నృపాలకపూజ్యుఁడు నంచుఁ ద న్బుధుల్
వేమఱు నెంచ దిట్టకవి వేంకటరాయకవీంద్రుఁ డొప్పగున్.

ఈ కవి యారువేల నియోగిబ్రాహ్మణుఁడు; భారద్వాజ గోత్రుఁడు, శంకరామాత్య పుత్రుఁడు. కవి తాను శృంగారమంజరి యను

కావ్యమును గూడ ' రచించెఁ గ్రింది పద్యమునఁ జెప్పఁబోయెను గాని యా గ్రంథము లభింపలేదు—

సీ. ధాత్రి భారద్వాజగోత్రపవిత్రుఁడై సురుచిరాపస్తంబసూత్రుఁ డగుచు
నిరతాన్నదానాభిరతుఁడౌ నీఁకుఱుపలి నరసమాత్యుపౌత్రవరుని
సంతతపూజితశంకరుం డగుశంకరామాత్యవరాళికి నాత్మభవుఁడ
ప్రాజ్ఞుని నచ్చమాంబాగర్భశుక్తి ముక్తామణి నీశ్వరధ్యాననిరతు
భవ్యశృంగారమంజరీకావ్యరత్న
మంధ్రభాష నొనర్చినయనఘచరితు
శంభునిభుఁడై నయిపటూరి శంభుశిష్యు
నను భవానీశనాముఁ గన్గొనుచుఁ బలికె.

ఈ కవి రచియించిన గ్రంథము సమగ్రముగా దొరకలేదు గాని దొరకినంతవఱకుఁ గవనము రసవంతమయి మధురమయి నిర్దుష్టముగా నున్నది. ధర్మఖండమునుండి రెండుమూఁడు పద్యముల నిందుదాహరించు చున్నాను—

చ. అనవిని వానిఁజూచి మునులారయఁ బుత్రకళత్రరక్షకై
యనయముఁ గ్రూరవృత్తిమెయి నర్థము నీవు గడించె దేని నీ
ఘనతరమైనకిల్బిషనికాయము భాగమువారు కొందఱో
కొనరొ యెఱుంగఁ జెల్పు మవికుంటితలీల నటంచుఁ బల్కినన్.

చ. హరి భజియింపనైతి లలనావయవామితవర్ణనాప్తిన
స్థిరమతి నర్థిలోభరతిఁ జేయఁగనైతిఁ బరోపకార మి
ద్ధర శతదాదయాకలితతాగుణము ల్సహజంబు లయ్యె నె
ట్లరయుదు నీయపారకలుషాబ్ధికిఁ దారణయానపాత్రమున్.

చ. ఫలితతరుల్ ద్విజాతులకు భక్తి నొసంగుటయున్ గతోదక
స్థలములఁ బ్రాణిలోకము హితంబునకై సరసీతటాకముల్
నిలుపుటయున్ మహాత్ములకు నెంజిలి దీర్చుటయున్ దలంప నీ
యలఘుసుకర్మపంక్తులు తదవ్యయమార్గసుఖైకహేతువుల్.

# 30. ధూర్జటి వేంకటరాయకవి

ఇతఁడు రత్నావళీపరిణయ మనెడు నాలుగాశ్వాసముల ప్రబంధమును రచించి చేకూరి రామస్వామిమంత్రి కంకితము చేసెను. ఈకవి కాళహస్తిమహాత్మ్యమును రచియించి కృష్ణదేవరాయల కాలములో నుండిన ధూర్జటికవి వంశమువాఁడు; ఇతఁడు తన గ్రంథమునందు ధూర్జటి నిట్లు స్తుతించి యున్నాఁడు—

మ. పటుగంగాలహరీతరంగసమశుంభత్ప్రౌఢతాంచత్కళా
ఘటనన్ బొదవినమ్రకృష్ణవరరాడ్గంభీరకోటీరవి
స్ఫుటరత్నద్యుతిపాటలీకృతపదాంభోజాతు సర్వజ్ఞు ధూ
ర్జటినిం గొల్చెద నస్మదీయకులకర్తన్ భక్తి రంజిల్లఁగన్.

ఈధూర్జటిపౌత్రుఁ డయినవేంకటపతి కృష్ణరాజవిజయమును జేసెను. ఈవేంకటపతి కుమారుఁడును కవితండ్రియు నైన లింగరాజు కాళహస్తిరాజుల ప్రేరణముచేత మఱియొక పెద్దకాళహస్తి మహాత్మ్యమును రచియించెను. రత్నావళీపరిణయమునఁ గవి తన తండ్రినిగూర్చి యిట్లు వ్రాసియున్నాఁడు—

మ. ఘనగౌరీశకటాక్షలబ్ధకవితాగాంభీర్యసంతుష్టభూ
జనరాడ్దత్తసువర్ణచేలమణిభూషాగ్రామపల్యంకికా
ఘనదంతావళఘోటకాదిబహుసత్కారప్రతిష్ఠాత్ము మ
జ్జనకున్ ధూర్జటి లింగరాజకవిరాజశ్రేష్ఠుఁ గీర్తించెదన్.

ఈకవి పాకనాఁటి యార్వేలనియోగి బ్రాహ్మణుఁడు; భారద్వాజగోత్రుఁడు. ఇతఁడు తన్నుఁగూర్చి చెప్పుకొనుచుఁ దానింతకుమున్ను నామలింగశాసన మనఁబడెడి యమరమునంతను బద్యకావ్యముగా రచించిన ట్లీక్రింది పద్యములలోఁ దెలిపియున్నాఁడు—

చ. స్థిరముగఁ గాళహస్తిగిరిజేశవరాగతసంస్కృతాంధ్రసుం
దరకవనంబు వ్యాకరణనాటక కావ్యవిచక్షణత్వముఙ్
గరిమవహింప భూవరశిఖామణు లెన్నఁ జెలంగి తౌర బం
ధురతనుకాంతిబాలరవి ధూర్జటి వేంకటరాయసత్కవీ.

మ. అమరం బంతయుఁ బద్యకావ్యముగ భవ్యంబై నయయ్యాంధ్రభా
ష మహాపండితసత్కవివ్రజము మెచ్చన్ సాహితీకౌశల
క్రమ మొప్పన్ దృఢభక్తితో డుతను శ్రీరామాంకితంబై తగన్
రమణీయంబుగఁ జేసినాఁడవు జళీ ప్రఖ్యాతివాటిల్లఁగన్.

ఈకవి కాలనిర్ణయమునుగూర్చి కొంచెము విచారింపవలసి యున్నది. ఈతనితండ్రియైన లింగకవి తానురచియించిన పంద్రెండాశ్వాసముల కాళహస్తిమహాత్మ్యమును కాళహస్తి రాజయిన దామెర్ల యక్కప్పనాయని పుత్రుఁడగు వేంకటపతిరాయని కంకితముచేసి యున్నాఁడు. అక్కప్పనాయని పుత్రుఁడయిన వేంకటపతినాయఁడు పదునేనిమిదవ శతాబ్దారంభమున నుండినవాఁడు. దీనినిబట్టి చూడఁగా కవి ౧౭౨౦ వ సంవత్సరప్రాంతమునం దుండినట్టు నిశ్చయింపవలసి యున్నది. అయినను మన మిప్పుడు నిర్ధారణముచేసిన యీకాలమున కొకబాధకము కనఁబడుచున్నవి. కవితండ్రియైన లింగకవి తన కాళహస్తి మహాత్మ్యమునందు—

సీ. శ్రీకాళహస్తీశసేవనాన్వితచిత్త చిత్తజాకర లక్ష్మీవిహార
రమణీయశీల భారద్వాజగోత్రపవిత్ర యాపస్తంబసూత్రమహిత
ధూర్జటివంశవాఘోధిచంద్ర కుమారధూర్జటినామ విస్ఫూర్జితాంక
స్తుతమతి వేంకటపతితనూభవ లింగరాజకులేంద్ర ధైర్యాచలేంద్ర.

అను సీసపద్యములోఁ దాను కృష్ణవిజయము నొనర్చిన కుమారధూర్జటికిఁ బుత్రుఁ డయినట్టు వ్రాసికొనియున్నాఁడు. ఈకుమారధూర్జటి తాను కృష్ణదేవరాయలకాలములోనుండి కాళహస్తిమాహాత్మ్యమును

రచించిన ధూర్జటికవికి మనుమఁడైనట్టు తనకృష్ణరాజవిజయమున వ్రాసికొని యున్నాఁడు. ౧౫౨౦ వ సంవత్సరప్రాంతమునందుఁ గృష్ణదేవరాయలకాలములో నుండిన ధూర్జటికవి మనుమని కొడుకగు లింగకవి ౧౭౩౦ వ సంవత్సరప్రాంతమునం దక్కరాజు వేంకటపతి కాలములో నసఁగా నిన్నూఱుసంవత్సరములకుఁ దరువాత నుండుట పొసఁగనేరదు. కాఁబట్టి కుమారధూర్జటికి ధూర్జటి సరిగా తాతగాక తాతవరుసవాఁడయియుండవచ్చును. అందుచేతనే కాఁబోలుఁ గుమారధూర్జటియే యొకచోట ధూర్జటిని దనపెదతాతనుగాఁ జెప్పుకొన్నాఁడు. ఈలింగకవియుఁ దనతండ్రిని ధూర్జటి మనుమనిగాఁ జెప్పక 'ధూర్జటివంశపాథోధిచంద్ర' యని తద్వంశజునిగా మాత్రము చెప్పినాఁడు. కుమారధూర్జటి చినవేంకటాద్రీశ్వరుని యాజ్ఞాప్రకారముగాఁ దాను కృష్ణరాజవిజయము చేసితినని చెప్పుకొన్న చినవేంకటాద్రి నరపతి కృష్ణరాజవిజయకృతిపతి యగు కోదండరామరాజుయొక్క రెండవకుమారుఁడగు చినవేంకటాద్రియైనచో నీకాలనిర్ణయ మించుమించుగా సరిపోవును. రత్నావళీ పరిణయకర్తయగు వేంకటపతి కవిత్వము ప్రౌఢ మయి హృద్యముగా నున్నది. కవిత్వరీతిని జూపుటకయి కొన్ని పద్యము లిందు క్రిందఁ బొందుపఱుపఁ బడుచున్నవి.

మ. మెఱుఁగుంబోఁడులు పీటసౌధచరలై మిన్నేటిబంగారుతా
మరపువ్వుల్ గ్రహియింపఁబోవ మదశుంభద్భంభరశ్రేణి త
త్తరుణీవక్త్రవితానముం గదియభీతస్వాంతలై కాంతలం
త రయప్రౌఢిఁ గవాటము ల్మొగుతు రుద్యన్ముగ్ధభావంబునన్. ఆ-౧

ఉ. ధన్యుఁడ వీవు సమ్మని ముదమ్మునఁబల్కి సమస్తదేవమూ
ర్ధన్యుఁ డదృశ్యుఁడైన మది రంజిలఁగా వసుభూతి యంత సౌ
జన్యసమేతయైననిజజాయయుఁ దాను సమస్తభోగస
న్మాన్యము నైజమందిర మమందగతిం జని చేరెఁ సూరిమిన్. ఆ-౨

చ. ఘనతరలక్షణప్రతిభగాంచిన రాజసటంచుఁ బద్మినీ
జనములఁ గుంపఁజేసి యనిశంబు ద్విజప్రతతిం గలంపఁగాఁ
దనరు మహాప్రతాపమహితస్థితిఁ గాంచుచు వచ్చునట్టి న
య్యినకరమండలాగ్రహతి నెంతయు వెల్వొలనై తొలంగవే. ఆ.౩

మ. చెలి రత్నేశ్వరు నొక్కనాఁ డిటువలెన్ సేవించి మోహాంబుజో
త్పలలు ల్మగ్గురు వెంటనంట నిజలీలామందిరాంచద్దిశా
స్థలిఁబోవన్ గ్రహియించె రక్కసుఁడు దోస్సారంబు మించంగ బె
బ్బులిచేఁ జిక్కుకురంగుల ట్లతివ లింపు ల్దక్క భీతిల్లగన్. ఆ.౪

---

# 31. అయ్యల రాజు - అయ్యల భాస్కరకవులు

అయ్యలరాజవంశసంభవు లయిన యయ్యలకవియు భాస్కర కవియుఁ జేరి కాలస్వరూపాదులను దెలిపెడి రెట్టమత మనుగ్రంథమును కన్నడభాషనుండి యైదాశ్వాసముల పద్యకావ్యమునుగా దెనిఁగించిరి. ఈకవు లిరువురును క్రీస్తుశకము ౧౭౭౦ వ సంవత్సరమునం దీపుస్తకమును దెలిఁగించినట్లుగా గ్రంథాంతమునందలి యీక్రింది పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది—

సీ. కలియుగప్రథమభాగమునాల్గువేలయెన్మదినూర్ల పై నిడెబ్బదియునొకటి
శాలివాహనశక సమ లిల వేయునాఱ్నూటతొంబదిరెండు రూఢిగాఁగఁ
బ్రభవాదిగతములు పరఁగ సిర్వాదిమూఁడు నేండ్లయ్యె నెంతయు
నెన్న బుధులు
అట్టికాలంబున నయ్యలభాస్కర కవివర్యు లలరాజకమలహితుని
యాజ్ఞఁ బూరోక్త రెట్టమతాఖ్యకావ్య
మును నొనర్చిరి యాచంద్రముగను గీర్తి

వక్తృశ్రోతలకునుగల్గ వసుధమీఁద
నల యహోబలనృహరికి నర్పణముగ.

కవు లీగ్రంథమును కొండ్రాజు పెదతిమ్మరాజునకుఁ బుత్రుఁడును మంగయ గుర్వరాజునకు దౌహిత్రుఁడును నయినవేంకటరాజున కంకితముచేసిరి. ఈవేంకటరాజు కర్నూలుమండలములోని యెఱ్ఱపాలెము నకుఁ బాలకుఁడును అహోబలక్షేత్ర ధర్మకర్తయు నయినట్టును, అతఁడు కవులను బిలిపించి రెట్టమతమును దెనిఁగింపఁ బ్రార్థించినట్టును ఈపద్యములలోఁ జెప్పఁబడి యున్నది—

సీ. శ్రీమదహోబిలస్వామి మహారాజ్యరక్షకుం డగుచు నేరాజువెలయు
నభిరామకామందకాఖ్యసత్కావ్యరత్నమునకు నేరాజు నాథుఁడయ్యె
జానకీనాయకచరణసంసేవనప్రౌఢిచే నేరాజు ప్రబలు సిరుల
నెరయూరిపురవరాధీశాదిబహుబిరుదాంకుఁడై యేరాజుయశముగాంచె
నతఁడు కొండ్రాజు తిమ్మభూపతివరేణ్య
తనయ పెదతిమ్మరాయవతంసగర్భ
వార్థిచంద్రుండు సత్కులవర్ధనుండు
సతతవిభవుండు వేంకటస్వామివిభుండు.

క. ఒకనాఁడు నిఖలకోవిద । సుకవిహితామాత్యబంధుసుతవీరభట
ప్రకరముకొలువఁగఁ గొలువుండి కథాప్రస్తావ మాత్మనివ్వటిలంగన్.

గీ. రాయకవియైన యయ్యలరాజవంశ్యు
ననఘుఁబినయక్కవిభుపుత్రునయ్యలాఖ్యు
నాగఘనుసూను భాస్కరనామధేయుఁ
గరుణ దళుకొత్త రావించి గారవించి.

వ. తత్కాలోచితప్రసంగంబున నిట్లనియె.

గీ. ఘనతనుజ్ఞాననిధి రెట్టఘనుఁడు మున్ను
చెలఁగఁ గన్నడభాషను జెప్పినట్టి

శాస్త్రమంతయు నేను నీజనులుఁ బాగడఁ
దెనుఁగుభాష నొనర్చంగ దివురుఁడీరు.

ఈపుస్తకమునుబట్టి యీకవుల కాలమును నిర్ణయించుటకు మాత్రమే కాక తెనాలి రామకృష్ణుని కాలమును కనుఁగొనుటకు సహితము కొంతయాధారము కానవచ్చుచున్నది.

రెట్టమతమును దెనిఁగించిన యీకవుల యింటిపే రయ్యలరాజు వారు. వీరిలో నొకఁడు పినయక్కయామాత్యపుత్త్రుఁ డయిన యయ్యల కవి; రెండవయతఁడు నాగయామాత్యపుత్త్రుఁ డయిన భాస్కరకవి. ఈకవుల కిద్దఱికి నెట్టిబంధుత్వమున్నదో తెలియరాదుగాని వీరన్నదమ్ముల బిడ్డలని తోఁచుచున్నది. వీరి పూర్వులలో నొకఁడైన తిప్పనార్యుఁ డొంటిమెట్ట రఘువీరశతక నిర్మాణ కర్మఠుఁడయి రాయల యాస్థాన కవిగా నుండెను; అతని మునుమనుమఁ డయిన రామభద్రకవి రామాభ్యుదయమును రచియించెను. ఈకవుల కవిత్వము నిర్దుష్ట మయినది కాదు. ఈపుస్తకముగాక కామందకమునుగూడఁ గృతిపతి గృతినందె నఁట. కవనరీతిని దెలుపుటకయి రెట్టమతమునుండి కొన్నిపద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. పూవులు నక్షతంబులును బొందుగ దోయిటఁదాల్చి వానకై
భావములోన మానవుఁడు ప్రశ్నయొనర్పఁగఁ బక్షి యయ్యెడన్
వావిరి జేసెఁ గాఁ బలుక వారితవృష్టియుఁ గల్గునంచ్రు గో
త్రావలయంబునందుఁ గవిరాజి నుతింపఁగ వేంకటాధిపా. ఆ-౧

ఉ. పాఱెడు బండ్లమ్రోఁతగతి బందులు చెల్వుగరొప్పుకేకి వే
సారక గార్దభం బఱచుజాడను ఘంటలనాదుకై వడిన్
వారక త్రోముకుండలరవంబుగతిన్ స్తనితంబు పర్వినన్
ధారుణి వాన లే దనియె ధన్యుఁడు రెట్టఁడు ప్రాజ్ఞులెన్నఁగన్. ఆ-౨

చ. అమరగురుండు లగ్నమునయందు వసింపఁగ విత్తుటల్ చతు
ర్థమున మెలంగఁ బైరు తజితష్పకయుండుట సప్తమంబునం
దమరఁగ వేగ నాపయిరు లాయతపెట్టుట మంచి దెంతయున్
విమలగుణాఢ్య తిమ్మపృథివీపతి వేంకటరాజశేఖరా. అ-౩

చ. రవితనయుండు రోహిణికిరంబున నుండిన చైత్రకంబునన్
దవనము హెచ్చు మర్త్యులకుఁ దద్దయు నుబ్బసఁగుం బెపుళ్లు సం
భవిలును గౌతమీనదిని బంటలు రాజిలు నన్యభూములన్
ధ్రువముగ వాన లే దనియెఁ బోజత్తనంబున రెట్టఁ డిమ్మహిన్. అ-౪

మ. బుధుఁ డబ్దాధిపుఁ డైన వానకురియున్ భూమండలిన్ రక్తధా
న్యధరల్ శ్రీలు ఘటిల్లు రాజుల ప్రజ ల్మన్నింతు రెందున్ సమ
స్తధరామర్త్యులకున్ శుభం బొదవుఁ గాంతాశ్రేణిపైఁ గూర్మి య
త్యధికం బాయువకోటికి న్వినుము ధన్యా వేంకటక్ష్మాధిపా. అ-౫

## 32. అజ్జరపు పేరయలింగము

ఒడయనంబివిలాస మనెడి స్థలపురాణగాథను దెనుఁగున నాశ్వాసముల గ్రంథముగా రచియించిన యీకవి శైవుఁడైన యాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. ఇతఁడు పదునెనిమిదవ శతాబ్దమధ్యమునందనఁగా నిప్పటికి నూటయేఁబది సంవత్సరములక్రిందట నుండినట్టు కనుపట్టుచున్నాఁడు. ఒడయనంబివిలాసముయొక్క యవతారికయందున్న—

ఉ. బమ్మెరవంశమందునను ప్రౌఢసరస్వతి పద్దగాంచి తా
నెమ్మొ దలిర్పఁ గేసనకపీశ్వరు లప్పమనామసాధ్వియం
దిమ్మహిఁ గూర్మిఁ గన్నసుత యెల్లమయందును బేరయాఖ్యుఁడ
న్నమ్మతిఁ గంటి పేరనరసమ్మను గంగనమంత్రి యుగ్మమున్.

అను పద్యమునుజూచి భ్రమించి యొక శ్రీకవీశ్వరునకు బమ్మెర పోతరాజుగారి బావమఱఁదియని వ్రాసియున్నారుగాని యాయంశ మంతవిశ్వాసార్హమయినదిగాఁ దోఁచదు. పయిపద్యము నాయొద్దనున్న వ్రాఁతపుస్తకమునం దిట్లున్నను ముద్రితప్రతిలోఁ దప్పులఁ గుప్పఁగా నచ్చొత్తింపఁబడి యున్నది. ఇందుఁ జెప్పఁబడిన కేసనకవీంద్రుఁడు బమ్మెర పోతనామాత్యుని తండ్రియైన కేసన కాఁడు. తనతండ్రి కవీశ్వరుఁ డయినట్టు పోతన భాగవతమునఁ జెప్పుకొనియుండలేదు; తనకన్న యొకఁ డుండినట్టు చెప్పుకొననేకాని తోఁబుట్టినవాఁడున్నట్టును జెప్పుకొని యుండలేదు. అంతేకాక, "తనకు లక్కమాంబ ధర్మగేహినిగాఁగ" అని పోతన తనతల్లి లక్కమ యైనట్టు చెప్పుకొన్నాఁడు. ఈకేసన్న భార్య లక్కమాంబగాక యప్పమయైనట్టు కవియే వ్రాసియున్నాఁడు. అయినను గవి మామగారు పోతనామాత్యుని తండ్రియైన కేసన యని సమర్థించుటకయి యొకరు పద్యములోని "కేసన కవీశ్వరు లప్పమనాము సాధ్వి" యన్న భాగమును "కేసనకవీంద్రుఁడు లక్కమసాధ్వి"నని దిద్దుటకయి సహితము ప్రయత్నము చేసినారు. ఈకవికి బమ్మెర పోతనామాత్యునివంటి కవిశ్రేష్ఠుఁడే బావయయి యుండినపక్షమున, అతఁ డాబంధుత్వమును దెలుపుకొనక యుండఁడు. కవి యీగ్రంథమును వ్రాయునప్పటి కీతని మనుమఁడుకూడ పెద్దవాఁ డయియున్నందున, ఆ కాలమునకుఁ బోతన కవిత్వ మారంభింపని చిన్నవయసువాఁ డగుటచే నాతని జెప్పుకొన లేదని చెప్పుటకును సహిత మవకాశము లేదు. ఈకవి తనవంశమూల పురుషుఁ డైనకొండన గజపతియైన వీరనృపాలునిచే గోదావరిమండలములోని యజ్జరపుగ్రామము నగ్రహారమునుగాఁ బడసిన ట్లీక్రిందిపద్యమునఁ జెప్పియున్నాఁడు.

శా. శ్రీరంజిల్లఁ జెలంగుచున్న గజరాట్సింహాసనాధ్యక్షుసన్
ధారాళంబుగ వేదశాస్త్రబహువిద్యాసాధి మెప్పించి యా

వీరాగ్రేసరుఁ డియ్యఁ గొండన మహావిఖ్యాతిగా గౌతమీ
తీరక్షోణిని నజ్జరంబనఁగఁ దాఁ దెచ్చెన్మహాగ్రామమున్.

ఇందుఁ జెప్పఁబడిన వీరాగ్రేసరుఁడు—

మ. ధర కెంధూళులు కృష్ణరాయలచమూధాటీగతి న్వింధ్యగ
హ్వరము ల్దూఱఁగఁ జూచి తా రచటఁ గాపై యుండుటం జాల న
చ్చెరువై యెత్తని వింతచీఁకటులు వచ్చెం జూడరేయంచు వే
సారిదిం జూచురు వీరరుద్రగజరాట్సుద్ధాంతముగ్ధాంగనల్.

అని మనుచరిత్రమునందుఁ గృష్ణరాయనిచే నోడింపఁబడినట్టు చెప్పఁబడిన వీరరుద్రగజపతియేమో యని యూహపుట్టుచున్నది. ఆయూహయే నిజమయినచోఁ గవివంశమునకు మూలపురుషుఁడయిన కొండన పదునాఱవశతాబ్దాదియం దుండియుండవలెను. కవి కొండన కేడవపురుషుఁ డయినందున నొక్కొక్కపురుషునికి ముప్పదేసి సంవత్సరముల చొప్పునఁ జూచినచో నీపేరయకవి ౧౭౩౦ వ సంవత్సరప్రాంతములయం దుండియుండును. పలివెల మొదలయిన గ్రామములయం దిటీవలఁ జేరినవేశ్యలను వర్ణించి యుండుటచేతను, పదునేడవశతాబ్దమునందలి కవుల గ్రంథములలోని పద్యములను జూచి యటువంటిపద్యములను జేసియుండుటచేతను, మఱికొన్ని కారణములచేతను పేరయకవి పదునెనిమిదవ శతాబ్దమువాఁడని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

చ. మొదలను బద్మసూతి నవమోహినులౌ తెఱగంటికొమ్మలన్
ముదమునఁ దా సృజించి సుమనోహరమూర్తుల దక్షవాటికా
సుదతులఁ దానొనర్చి యట సొంపునఁ బల్వెల వారకాంతలన్
గదలక తా సృజించెఁ గరకౌశల ముప్పుచునుండ మానినీ.

అని పలివెల వారకాంతలు వర్ణింపఁబడిరి. పదునేడవ శతాబ్దారంభమున సారంగు తిమ్మన వైజయంతీవిలాసమున—

ఉ. ఒక్కనిఁ బిల్వనంపి, మఱియొక్కనిచేతఁ బసిండిపట్టి, వే
ఱొక్కటియింటి కేగుచు, మఱొక్కని నానడుచక్కి నొక్కచోఁ
బొక్కికలంచి చూడ భ్రమఁ బొంది విటుల్తెలియంగలేరుగా
కెక్కడిసత్య మేడవల పెక్కడినేమము వారకాంతకున్ ?

అని వ్రాసిన పద్యము ననుసరించి యీపేరయకవి,

ఉ. ఒక్కని డాయరమ్మని మఱొక్కనిఁ గన్గొని ముచ్చటించి వే
ఱొక్కనిఁ బొంది రొక్కము మఱొక్కనిచేఁ గొని వేఱ్కవారికిన్
ఎక్కుడుప్రేమ లుండ వలపించుట ధర్మముగాక య య్యయో
యొక్కనియందె తా వలచియుండుట న్యాయమె వారకాంతకున్.

అని వ్రాసియున్నాఁడు. ఈయొడయనంబివిలాస మనుస్థలపురాణము విప్రనారాయణ చరిత్రమునుజూచి దానిని మించునట్లుగా కల్పింపఁబడిన కథయే యయినను, ఇందలికథ వైజయంతీవిలాసములోని కథ కంటెను నెక్కువ నీతిబాహ్యమైనదిగా నున్నది. కవిత్వమునం దంతలి సారస్యమును నిందుఁ గానరాదు. ఇందుఁ దండ్రియే యొడయనంబికి వలసినంత ధనమిచ్చి యది వేశ్యపాలుచేసి దానినెప్పుడును విడువవలదని కొడుకునకు బుద్ధిచెప్పెను—

చ. నగవుదలిర్చుమోమున ఘనం బగువేడుక నివ్వటిల్లఁగా
నగపతిధైర్యు నయ్యొడయనంబిని గాంచి బుధేంద్రుఁ డిట్లనున్
బగలును రేయి నిమ్మగువఁ బాయకయుండు మటంచు నీకు నిం
పుగ నిరతవ్యయంబునకుఁ బొందుగ నిచ్చెదనూఱునిష్కముల్.

ఇందుఁ బాతివ్రత్యముకంటె వేశ్యావృత్తియే మేలయినదని ఈశ్వరుఁడే బోధచేసెను—

సీ. సర్వస్థలంబుల సరస మాడఁగరాదు వలసినప్పుడు రతిఁ గలియరాదు

* * * *

ధాత్రిపై దంపతులకెల్లఁ దలిరుబోఁడి

* * * *

సీ. మగనిచే బాధలు మామచేఁ బీకలు నత్తచే నాడిక లరయ లేవు
మఱఁదులచేఁ గొట్లు మఱఁదండ్రచేఁదిట్లు వదినెల నరిపోట్లు బావపోట్లు
బంధుల కగపడు బాధ లింతయు లేవు
* * * *
కావునను వేశ్యతనువొంద * *
నిహముఁ బరమును దగఁ గల్గు నిందువదన. *

ఇందు వేశ్యవాటికలో ఱంకని పలికినవారి నందఱినిబట్టి యముఁడు దండించునని చెప్పఁబడినది—

ఉ. పంకజపత్రనేత్ర విను పల్వెలలోపల వేశ్యవాటిలో
ఱంకని యెవ్వఁడేఁబలుకు రంగుగ వానినిబట్టి మీఁద ని
శ్శంకను సౌరిదూత లురుచంద్రక తారకితోరుశూలబా
ణాంకవిశాలతోమరమహత్తరహేతులఁ గ్రుంతు రెంతయున్.

ఇఁక జగత్తున దుర్నీతి యింతకంటెను బయికిఁబోవుట సాధ్యమగునా? ఈపుస్తకమునందు దుర్నీతి పారమును కడముట్టినదని చెప్పవచ్చును. భక్తుల మహిమలను జూపెడి యిటువంటిపుస్తకములే లోకమున కనంతమయిన చెఱుపును గలిగించుచున్నవి. ఈస్థలపురాణమునం దీశ్వరుఁడు భోగముదాని చంటిలోనే ప్రత్యక్షమయినట్టు చెప్పఁబడినది.

ఈపేరయకవి భారద్వాజసగోత్రుఁడు; కొండనకును బాపమాంబకును బుత్రుఁడు. అక్కడక్కడ వ్యాకరణదుష్టములైన ప్రయోగములనేకములు కానఁబడుచున్నను మొత్తముమీఁద నీతని కవనచాతురి శ్లాఘ్యమైనదిగానే యున్నది. ఒడయనంబివిలాసమునుండి మఱి మూఁడు పద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. ఎక్కి మహేశుఁ డప్పురము నెక్కువమీఱినఫాలదృష్టిచే
నొక్కటిగాఁగఁ జూచుచు మహోజ్జ్వలసూతుఁ బసిండికొండఁ దా.

నెక్కఁగఁబెట్టి దేవత లహీనగుణుండని సన్నుతింపఁగాఁ
దక్కరిదైత్యులం దునుము తత్సమయంబున శంభుకన్నులన్. ఆ-౨

చ. ప్రియతనయామణీ! చదువు ప్రీతిని జెప్పిన బాపనయ్యనున్
నయముగ నాటపాటల ఘనంబుగ నేర్పినగాయకోత్తమున్
జయముగ సత్కవిత్వమును జక్కఁగ నేర్పిన సత్కవీంద్రునిన్
నయమునఁ బారితోషికమునం దనియించితి వ్యర్థ మయ్యెఁగా. ఆ-౭

ఉ. కమ్మనిగోఘృతమ్ము తెలిగంటికి నర్పితమైన యన్నమున్
దిమ్మనము ప్రసాదభక్ష్యములుఁ దేనెతొనల్ బహుశాకపాకముల్
కమ్మనిపిండివంటలును గాంచనవర్ణము గల్గునుప్పు మో
దమ్ముగ వారలుం గుడిచి తద్దయు సన్నుతిచేసి రందఱున్. ఆ-౮

---

# 33. మరింగంటి సింగరాచార్యులు

ఈకవి దశరథరాజనందనచరిత్ర యనెడు నిరోష్ఠ్యరామాయణమును రచియించెను. ఇతఁడు శ్రీవైష్ణవబ్రాహ్మణుఁడు; మౌద్గల్య గోత్రుఁడు; తిరుమలాచార్యపౌత్రుఁడు; వేంకటాచార్యపుత్రుఁడు. ఈకవి తా నేకైకదినప్రబంధరచనాధురీణుఁడననియు, ఆంధ్రభాషా నిరోష్ఠ్యాది వింశతిప్రబంధనిర్మాణుఁడ ననియు, వ్రాసికొనెను గాని యితఁడు రచియించిన యితరగ్రంథము లేవియు నిప్పుడు గానరావు. ఇతఁడు నూటయేఁబదిసంవత్సరముల క్రిందటనుండిన ట్లీతని వంశమువారు చెప్పుచున్నారు. ఈకవి వాసస్థలము దేవరకొండసీమ. ఈతని కవిత్వము సలక్షణమై హృదయంగమముగా నున్నది. దశరథరాజనందనచరిత్రములోని కొన్ని పద్యముల నిం దుదాహరించుచున్నాను—

చ. కరిఘటలేల చిత్రగణికాచ్ఛటలేల హిరణ్యశాటికా
హారిధనధాన్యరత్నఘటితాచ్ఛదలంక్రియలేల నల్దిశల్
స్థిరగతి నేలఁగాఁ దగినతే జది యేల యనేకచర్యలన్
సిరిగలయట్టిసంతతిని జెందిన యారామెడ లెస్స లన్నిటన్. ఆ-౧

చ. అనఘచరిత్ర నిన్నని జయక్రియఁ జెందితిఁగాన దాఁచకే
కనకకిరీటహారకరకంకణచిత్రకరత్నచేలచం
దనచేటికారజతదంతిశతాంగహయాదికాంతు లె
ల్ల నడిగినంతనే తనియు లాలన నిచ్చెదఁ గీర్తి హెచ్చఁగన్. ఆ-౨

చ. అని తృణలీలగాఁ దెలియనాడి తదాజ్ఞ ధరించి తాటకా
తనయనిశాచరాగ్రణి సదాగతి ధిక్కరణాచ్ఛశీఘ్రమున
ర్తన ఘటియిల్లఁగాఁగదలి దండకకాననధాత్రి చేరఁగాఁ
జని ఖరహంతఁగాంచి దృఢసాహసహర్షరసాతిశాలియై. ఆ-3

మ. అగజాజాని ననేకకంధరలచే నర్చించి జన్యస్థలిన్
దిగధీశాదితినందనచ్ఛటల నర్థిన్ గెల్చి శంకించకే
తెగి కైలాసగిరిం దృణాకృతిగ నెత్తెంగాన నీతం డహా
జగదారాధ్యత హెచ్చనేరఁడే సదాచారక్రియం జెందినన్. ఆ-౪

మ. గద కేలన్ ధరియించి చండతరనిర్ఘాతాట్టహాసక్రియల్
చదలంటం జరణాగ్రఘట్టనల నాశ ల్తల్లడిల్లంగఁ దీ
క్ష్ణదశన్ దీర్ఘదృగంచలాగ్నికణసంక్రాంతిం జలించంగ నా
త్రిదశాలిం గని కీశసేన యధికార్తిన్ డాఁగె నాయారామెడన్. ఆ-౫

# 34. అనంతరాజు జన్నయకవి

ఇతఁడు రామకథాభిరామమను పదియాశ్వాసముల మహాకావ్యమును రచియించెను. ఈకవి నియోగిబ్రాహ్మణుఁడు; జన్నపమంత్రి పౌత్రుఁడు; అమ్మయామాత్యపుత్రుఁడు. ఇతఁ డేకాలమునందుండిన వాఁడో తెలియరాలేదు గాని నూటయేఁబదియేండ్ల క్రిందటివాఁడయి యుండవచ్చును. ఈపుస్తకమునందలికథ శ్రీరామచరిత్రమగుట దీనినామముచేతనే తెల్లమగుచున్నది. ఈతనికవిత్వము నాతికఠినమయి మృదుపదగుంభితమయి కర్ణరసాయనముగా నున్నది. రామకథాభిరామము లోని రెండుమూఁడు పద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి—

చ. శ్రుతులకు భూషణంబు లగుచుం బరమానుభవంబు గల్గు నీ
శ్రుతులకు నెల్లలోకములఁ జూచిన సామ్యము లేదు మాధురీ
గతుల సుధారసంబుచిలుకన్ ఘనమోహనసుస్వరైక సం
గతుల మహాద్భుతంబు గులుకన్ విలసిల్లెఁ బ్రయోగపాళముల్. ఆ-౧

మ. వికచాంభోరుహచారులోచనకుఁ బర్వెం గాంతిమీఱన్ లలా
టికముక్తాఫలభాసురంబగుచు సూటిం దన్ముఖేందూపచా
రకలాపాచరణంబుపొంకెు నునుపారం జేరునక్షత్రమా
లికచందంబున నందమై కచతమోలీలా ప్తతారాకృతిన్. ఆ-3

చ. దరము హరించి యాశ్రితవితానముఁ గాచునభేద్యవజ్రపం
జరము విపన్నదీనజనసంఘముఁ బ్రోచుసమీపమేరుభూ
ధరము మహార్తలోకపరితాపమడంచుసుధావిధానసా
గరము కరంబు రామవిభుకారుణికత్వమహత్త్వ మెన్నఁడున్. ఆ-౯

# 35. ముద్దుపళని

ముద్దుపళని పద్యకావ్యములు చేసిన స్త్రీలలో నొకతె. మొల్ల రచించిన రామాయణమునుగూర్చి రెండవభాగమునందే తెలుపఁబడినది. మోహనాంగి యను నామె మారీచిపరిణయమును రచియించినట్లు చెప్పుటయేకాని పుస్తకము లభింపలేదు. మొదటఁ బద్యకావ్యములను రచించినవా రిరువురును కులాంగనలు; ఈముద్దుపళని వేశ్యాంగన. ఇది రాధికాసాంత్వనమను నాలుగాశ్వాసముల శృంగారప్రబంధమును రచించెను. దీని తల్లిపేరు ముత్యాలు. అది తంజావూరుసంస్థాన ప్రభువయిన ప్రతాపసింహుని యుంపుడుకత్తె యయినట్టు "చోళసింహాసనాధ్యక్ష ప్రతాపసింహ మహారాజ బహూకృతానేకచామీకరాంబరాభరణ ముత్యాలుగర్భశుక్తి ముక్తాయమాన" యని రాధికాసాంత్వనముయొక్క గద్యములో వ్రాయఁబడిన దానినిబట్టి యూహింపఁదగి యున్నది. ఈరాధికాసాంత్వనమునకే యిళాదేవీయమని నామాంతరముగలదు. ప్రతాపసింహుఁడనెడి ఈమహారాష్ట్రప్రభువు ౧౭౬౫ వ సంవత్సరము నందు మృతినొందెను. కాఁబట్టి యీముద్దుపళని ౧౭౬౦ వ సంవత్సర ప్రాంతమునందు తంజావూరులో నుండెను. ఇది సంగీతసాహిత్యభరత శాస్త్రములలోఁ బ్రవీణురాలయినట్టు తానే చెప్పుకొన్నది. దీనికవిత్వము నాతికఠినమయి మృదువుగా నుండినందునకు సందేహములేదు; దీనికి మంచి సంస్కృతాంధ్రసాహిత్యమును గలదు. అందందు తప్పులున్నవి కాని యట్టితప్పులు పురుషకవిత్వమునందు సహిత మనేకగ్రంథములలోఁ గానఁబడుచున్నవి. అయినను గ్రంథములోనిభాగము లనేకములు స్త్రీలు వినఁదగినవియు స్త్రీనోటినుండి రాఁదగినవియుఁగాక దూష్యములయి యున్నవి. ఇది జారత్వమే కులవృత్తిగాఁగల వేశ్యయగుటచేత స్త్రీజన స్వాభావికమయిన సిగ్గును విడిచి శృంగారరస మనుపేర సంభోగాదివర్ణ

సములను పుస్తకమునిండ మిక్కిలి పచ్చిగాఁ జేసినది. అయినను స్త్రీ కవిత్వమని తెలిపెదు,

గీ. తనదుమ మ్రొత తా నెంత తానె యింత
చేయఁజూచిన నే నెంత చేయరాదు
వేలువాచిన రోలంతవిరివియైన
రోలువాచిన నది యెంతమేలు గనునో.

గీ. కుట్టఁ దేలు కట్టకున్నఁ గుమ్మరబూచి
తోసిరాజటంచుఁ దోఁచెఁ జెలియ
దానివేలుదీసి దానికన్నుపొడిచి
నటులు చేయకున్న నగునె చిలుక.

గీ. తగరు కొండమీఁద దాఁకఁ గోరినదారి
నెదిరిఁ దన్నుఁ జెలియ కింతపలికె
నెంతమీనువచ్చి యెంతమీనును మ్రింగెఁ
గానఁ ద్రుల్లి నెద్దె గంతమోచు.

గీ. కాని పదరకు మీఁకమీఁద దాని మొగము
కనఁగవలదని శౌరికిఁ గట్టుపెట్టి
బింకములు కూల నఱకాలఁబెట్టి నేల
రాయ కున్నను నాపేరు రాధగాదు.

గీ. లేనిపట్టింపు లెల్లను బూని చాన
నేనె యెదురై నఁగాని యింతైనఁ జూడ
దల్పునకుఁ గల్మివచ్చిన నర్ధరాత్రి
గొడుగు తెమ్మన్నకతగాను గోమలాంగి.

ఇత్యాది లోకోక్తులును జాతీయములును గలపద్యము లంటంను లేకపోలేదు. రాధికాసాంత్వనమునుండి మఱికొన్ని పద్యముల నిం దుదాహరించుచున్నాను—

మ. యమునాతీరవిహార హారసదృశోద్యత్కీర్తిసంభార భా
రమణీయాకృతిమార మారసికతాప్రావీణ్యసంసార సా
రమరందోక్తివిచార చారణమదప్రఖ్యాతవిస్తార తా
రమహీభృత్సమధీర ధీరమునివారాధార రాధారతా. ఆ ౧.

ఉ. ఈయెడఁ గాయము న్విడిచి యేగెద నంచు విచార మొందలే
దా యదుసార్వభౌమునికి నాముఱవైరికిఁ గాని కాయమై
పోయినఁ బోవ కున్ననిలఁ బుణ్యమొ పాపమొ గుడ్డికన్నుదా
పూయకయున్ననేమి మఱి మూసిననేమి తలంచిచూడఁగన్. ఆ. ౩.

చ. మెలఁకువమాటలం గలుగుమేలము లచ్చట గచ్చు లిచ్చటన్
దలఁపులు దాఁపిపైని బలుతప్పులు నాపయి నేస్తమాడఁబే
రలుక మఱీఁడ గూర్మివగ లక్కడ నిక్కడ టక్కు లద్దిరా
తెలియఁగవచ్చె నీనడత తెల్లము వింటిమి ప్రాణనాయకా. ఆ. ౪.

---

## 36. కంకంటి పాపరాజు

ఈకవి యాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు. ఇతఁడు తనయుత్తర రామాయణమునం దాఱువేలవారి నిట్లు వర్ణించుచున్నాఁడు—

సీ. అఖిలరాజాధిరాజాస్థానజనహృద్యవిద్యావిహారు లార్వేలవారు
కల్పకబలికర్ణకలశార్ణవోదీర్ణవితరణోదారు లార్వేలవారు
సజ్జనస్తవనీయసతతనిర్వ్యాజపరోపకారు లార్వేలవారు
ఘనదుర్ఘటస్వామికార్యనిర్వహణప్రవీణతాధారు లార్వేలవారు
విమతగర్వాపహారు లార్వేలవార
లట్టియార్వేలవారిలో నలఘుకీర్తి
వెలయు శ్రీవత్సగోత్రారవిందహేళి
మహితగుణశాలి వల్లభామాత్యమాళి.

కవి శ్రీవత్సగోత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; అప్పయామాత్య పుత్రుఁడు. ఈతని తల్లి నరసాంబ; తమ్ముఁడు నరసింహుఁడు. ఈతని వాసస్థానము నెల్లూరు మండలము. అక్కడక్కడఁ గొన్ని వ్యాకరణ దోషము లున్నను మొత్తముమీఁద నీతని కవిత్వము మిక్కిలి రసవంత మయినది. ఇతఁ డుత్తరరామాయణమును బురాణశైలినిమాని ప్రబంధ పాకమునఁ జెప్పినవాఁడు. పూర్వ ముత్తరరామాయణము తిక్కనసోమ యాజిచేఁ దెలిఁగింపఁబడినను దాను క్రొత్తఁగా మరలఁ దెలిఁగించుటకు రామకథ యగుటయే కారణమని కవి యీక్రిందిపద్యమునఁ జెప్పెను—

మ. వరుసం దిక్కనయజ్వనిర్వచనకావ్యంబై తగంజేసె ను
 త్తరరామాయణ మందున న్మఱి ప్రబంధం బూని నిర్మించుటే
 సరసత్వం బని ప్రాజ్ఞులార నిరసించ బోకుఁడీ రాఘవే
 శ్వరుచారిత్రము లెంద ఱెన్నిగతుల న్వర్ణించినం గ్రాలవే?

కవి యుత్తరరామాయణమును రచించుటకుముందు విష్ణుమాయావిలాసమను యక్షగానమును రచించినట్లు తన్నుఁగూర్చి యిష్టదైవము పలికినరీతిగా నీక్రింది పద్యమునఁ జెప్పుకొన్నాఁడు—

గీ. శ్రీవెలయ మున్ను విష్ణుమాయావిలాస
 యక్షగానంబు మాకె సమర్పణముగఁ
 జేసి తదియాదిగామేము నీసుధాను
 సారివాక్కులఁ జొక్కియున్నార మనఘ.

ఉత్తరరామాయణము కంకంటి పాపరాజు చెప్పినట్లున్నను నిజముగాఁ బుష్పగిరి తిమ్మన్న రచియించి యాతనిపేరు పెట్టెనని వాడుక గలదు. ఈతని కవిత్వమునకును, బుష్పగిరి తిమ్మనకవిత్వమునకును భేద మున్నందున, ఈలోకప్రవాదము సరియైనదిగా నుండదు. పుష్పగిరి తిమ్మన్న గొప్పకవి యగుటచేతను, పాపరాజునకు మిత్రుఁడును సహాధ్యాయుఁడును నయియుండుటచేతను, కావ్యరచనయందుఁ గొంత తోడ్పడి

యుండుటచేతను ఇట్టిప్రవాదము కలిగి యుండవచ్చును. పుస్తకరచన యందుఁ బుష్పగిరి తిమ్మన్న తనకు తోడ్పడినట్లు కవియే యీక్రింది పద్యములలోఁ జెప్పియున్నాడు—

మ. హనుమద్దివ్యపదారవిందమకరందానందనేందిందిరా
త్మ ననేకాంధ్రకృతిప్రకల్పనసమర్థుం బుష్పగిర్యప్పనా
ర్యునిసత్పుత్రునిఁ దిమ్మనాఖ్యకవిచంద్రు న్మత్సహశ్రోతఁ బ్రొ
ద్దున నే పిల్వఁగఁ బంచి కన్నకల సంతోషంబునం జెప్పినన్.

మ. అతఁ డానందముఁ జెంది నన్నుఁ గని యన్నా జాళువాపైఁ డికిన్
గృతవర్ణాంచితరత్న మబ్బినటు లయ్యె న్నీవు వాక్ప్రౌఢిమం
గృతి సేయంగఁ దొడంగు రామకథకుం గృష్ణుండు రా జౌటఁ బ్ర
స్తుతి గావింపఁగ నాకు శక్యమె భవత్పుణ్యప్రభావోన్నతుల్.

గీ. అని కిరీటికి శౌరి తోడైనయట్టు
లమ్మహాకవిసాహాయ్య మాచరింపఁ
గృతి నొనర్పఁగఁజూచినవాఁను మొదట
నెంతు మద్వంశవిధమది యెట్టు లనిన.

కంకంటి పాపరాజు ప్రళయకావేరిపట్టణములో నమీనుగా లౌక్యాధికారమునం దుండినవాఁడు. ఆకాలమునందే యీయనవద్దఁ బుష్పగిరి తిమ్మన్న కొంతబుణముచేసి యీయప్పు తీర్పలేక యీపుస్తకమును దానిక్రిందఁ జేసి యియ్యఁగా, ౧౭౭౦ వ సంవత్సరప్రాంతమున నుత్తరరామాయణమును పాపరాజు తనపేరిట్లోఁ బ్రచురించెనని చెప్పుచున్నారు. కవి యిప్పటికి నూఱుసంవత్సరములక్రిందట నుండినవాఁడు. కవిత్వశైలి తెలియుటకయి యుత్తరరామాయణమునుండి కొన్నిపద్యముల నిం దుదాహరించుచున్నాను—

మ. పలుమాఱుం దనువేఁడురామవిభుసేన బాటింప నుత్తుంగభం
గలసత్తోయభుజంగసంఘఫణభంగప్రౌఢరంగత్తిమిం

గిలవాలప్రహతప్రవాళశకలాకీర్ణారుణార్ణఃప్రభా
కలనం దేజము చూపె వార్ధి జడధుల్ గైకొందురే ధీరులన్. ఆ. ౧.

ఉ. ఓయినిశాచరప్రవర యొప్పుగ నిప్పుడు పల్కు నీరణ
న్యాయము లెందుఁబోయె సురనాథులఁదోలెదు వేళఁ జాలుఁ జా
ల్న్యాయముచేతఁగాదె జయ మందుట మీరు జగం బెఱుంగదే
న్యాయము మేము దప్ప మొకనాఁటి కదెట్లనవిన్ము తెల్పెదన్. ఆ-౨

ఉ. తమ్ముఁడ వంచు నీకొకహితం బెఱిఁగింపఁగ దూతఁబంచినన్
వ మ్మొనరించి నాపలుకు వానినిజంపి ననున్ జయింపరే
ద్రిమ్మరిగుంపుతోడ నడదెంచితి నిన్ననసేల నీకు డెం
దమ్మున మేలుగాఁదలచునన్న యనందగుఁగాక దుర్మతీ! ఆ. ౩.

మ. పలుతావు ల్వెదచల్లు తెమ్మెరలుపై పైడాయ రేరాజువె
న్నెలగాయన్ మధుపాళిమ్రోయఁ గలకంఠీపాళికూయన్ మరు
ల్లలనగ్లానముచేయ నొంటి నిశివేళం దోఁటలో నైందవో
పలవేది న్వసియించుపాంథుని స్మరాపస్మారము ల్చేరవే? ఆ. ౪.

చ. కిలకిలనవ్వి యచ్చెలి సఖీమణులంగని యమ్మలార విం
తలు కనుఁగొంటిరే యిదిగొ తానఁట యిక్కడ నున్నవారితోఁ
కలహ మొనర్ప వచ్చెనఁట కాదనిపట్టిన పీఁడు చేతిలో
పలికిని లేఁడు నేఁడు బహుభంగులఁ బ్రేలెడు నంచుఁ జూపినన్. ఆ-౫

ఉ. మాటలఁ దాటకాంతకుఁడు మాటికిఁ దేనియ లొల్క వేఁడినన్
బోటులగంధిసిగ్గు ప్రతిభాషితచాతురి నడ్డగింపఁగా
గాటపుఁగాంక్ష యన్ తరువుకత్తె మదిం ద్వరసేయ నల్లనన్
మీటినమ్రోయువీణవలె మించు నెలుంగున భర్తతో ననున్. ఆ.౬.

ఉ. ఈవెడబుద్ధి నీకెవ్వనియించెనో యేజడుఁడైనఁ దెల్పెనో
హా విధిద్రోహ నీకు వశమా లవణాసురుబారిఁబడ్డవా

రీవఱ కెవ్వారైన మనిరే యిఁక సూర్యుఁబ్రహ్మ లాఁగినన్
జావక పోదువోటు కొనసాగునె నీవిలువిద్య లిచ్చుటన్. ఆ. ౭.

చ. వలసినభోజనాభరణవస్త్రధనాదులఁ జెంది తృప్తులై
పలుమఱుఁ జాలుఁజాలు నని పల్కెడువారలె కాని మాకుఁ గా
వలయు నొసంగుమం చనెడువారల మందున కైనఁ గాన మా
స్థలమున జానకీవిభునిజన్నమువైభవ మెన్న శక్యమే. ఆ. ౮.

---

# 37. పుష్పగిరి తిమ్మన్న

ఈకవి సమీరకుమారవిజయ మనెడి యేడాశ్వాసముల కావ్యమును రచియించి, భర్తృహరి నీతిశతకమును తెనిఁగించెను. ఇతఁ డుత్తరరామాయణమును రచియించిన కంకంటి పాపరాజుతో సమకాలికుఁడు. ఇతఁడు రచియించిన సమీరకుమారవిజయ ముత్తరరామాయణ మంత మధురముగా లేదు. భర్తృహరినీతిశతకము సహిత మేనుఁగు లక్ష్మణకవి తెనిఁగించినదానికి చాలదు. కవి సంస్కృతాంధ్రములయం దసమానపాండిత్యము కలవాఁడే యయినను, కవనమం దక్కడక్కడ లక్షణవిరుద్ధములయిన ప్రయోగములు కానఁబడుచున్నవి. ఈకవి నివాసస్థలము నెల్లూరిమండలములోని మోడేగుంట యయినట్లు నెల్లూరిమండలచరిత్ర సంగ్రహమునందు వ్రాయఁబడియున్నది. ఇతఁ డాశ్వలాయనసూత్రుఁడు; విశ్వామిత్రగోత్రుఁడు; అప్పనార్యునిపుత్రుఁడు. ఇతఁడు సమీరకుమారవిజయమునందు తన్నుఁగూర్చి యిట్లు చెప్పుకొన్నాఁడు—

సీ. శ్రీహనూమత్పాదసేవాగతాధ్యాత్మ తత్త్వకవిత్వమహత్త్వవిదుఁడ
నాశ్వలాయనసూత్రహారివిశ్వామిత్రగోత్రాబ్ధిచంద్రుఁడఁ గుశలమతిని
అలపుష్పగిరియప్పనార్యున కౌబళాంబకును సుపుత్రుండ బ్రహ్మవేత్త
యైన వేంకటకృష్ణమాగ్రణికిని వేంకటాఖ్యకవీంద్రున కవరజుండ

సరసగుణయుతుండ వరకవిఁ దిమ్మనా
హ్వాయుఁడ నేను జననమంది మనుట
కెల్ల ఫలముగల్గఁ గృతి యొక్కటిరచింప
నూహ సేయుచున్న నొక్కనాఁడు.

కవి పదునెనిమిదవ శతాబ్దమధ్యము మొదలుకొని ౧౭౯౦ వ సంవత్సరమువఱకును కవిత్వరచన చేసియుండవచ్చును. ఉత్తరరామాయణముయొక్క కర్తృత్వము నారోపించి నట్లే దశకుమారచరిత్రము యొక్క కర్తృత్వముగూడఁ గొందఱ్ శ్రీకవి కారోపింతురు గాని యా యారోపణము కేవల నిరాధారముగా గనఁబడుచున్నది. ఈతని పుస్తకములనుండి కొన్నిపద్యము లుదాహరింపఁబడుచున్నవి—

భర్తృహరి నీతిశతకము.

చ. మతిఁగలజాడ్యము ల్చెఱుచు, మాటల సత్యము గూర్చు మాన ము
న్నతి నెనయించుఁ బాపములు నాశ మొనర్చు, మనంబునం బ్రస
న్నత గదియించు, దిక్కులఘనంబుగఁ గీర్తులు నించు, సాధుసం
గతి యిఁక నేవిశేషములు గల్గఁగఁజేయదు మర్త్యకోటికిన్.

ఉ. నీతు లెఱుంగువారు తమ నింద ఘటించిన నెంచినన్, మహా
భూతులు పాయకున్న నవిపోయినఁ, జా వపుడైనఁ గల్పసం
ఘాతవిరామకాలములఁ గల్గిన గల్గఁగా కొకప్పుడున్
నీతిపథంబునం జెదర నేరరు ధైర్యరమాధురంధరుల్.

సమీరకుమారవిజయము.

ఉ. ఆరజనీచరాగ్రణిలయావసరాసితనీరదాకృతిన్
దారుణ రాఁ గనుంగొని యథాయథలై సుర లద్రిరాడ్గుహల్
దూఱెడువారు నిచ్చ విధి దూఱెడువారుఁ గవీంద్రు వెన్కకున్
జేరెడువారుఁ గావుమని చీరెడువారునునై తలంకఁగన్. ఆ-౧

ఉ. ఎమ్మెయు జవ్వనంబుఁ గలయింతి పతిం బెడఁబాసి యొంటిగాఁ
ద్రిమ్మరుచోట గర్భము ధరించినదన్నను గన్నవిన్నవా
రెమ్మెయిఁ గల్ల లేమిగణియింతురొ యెంతురొ బంధుకోటిలో
నమ్మకచెల్ల నానియమ మాగడ మాయె నికేమిచేయుదున్. ఆ. ౨.

చ. రమణుఁ డొసంగె నుంగరము రామ కనుంగొను మన్నమాత్ర మే
ను మఱచి సాక్షి యొక్కటిఁ గనుంగొనుచుండితిఁగాని తత్ప్రమో
దమునకు నాదికారణ మితం డని సన్నన నైతి నెచ్చటన్
బ్రమద లెఱుంగ నేర్తురె కృపాళు గొనర్చిన మేలు మారుతీ. ఆ. 3.

ఉ. ఇాతవిచార మయ్యెఁగద యేనును నీ వనుభేదయుక్తి నీ
స్వాంతమునందు వర్తిలుట నన్యుఁడు నేనను చింత యెంతప
ర్యంతము జంతుసంతతిహృదంతమునందు వసించు నంతప
ర్యంతము జన్మమృత్యువుల కంతములేదు సమీరనందనా. ఆ. ౪.

ఉ. రావణుగీవణుఁ సమరరంగమునం గుదియించినట్లు నా
లావున కోహటింపక నిలం గలవే రఘురామ వేత్తవే
యీవెడఁక్రోఁతి నెక్కొని యేటికివచ్చితి వింతదూర మ
య్యోవిజయంబుచెందఁగలఁడోటుశతాస్యఁగడంగి రుద్రుఁడున్. ఆ.౫

ఉ. హీనాధిక్యము లెంచి పంచితివొ నన్నే మాడ్కిఁ బొమ్మంటి వా
హీనాత్మ్మం గపిమాత్రుఁ బిల్చుటకుఁ బోనీ యొక్కవేగంబునం
దైనన్ నాకు సమానుఁడే పలుకులేలా నీవె యిట్లాడఁగా
నేనా కా దనువాఁడ నం చపలుపక్షీంద్రు న్నిరీక్షించుచున్. ఆ. ౬.

శా. అన్నా నే ముదివాఁడ లేవ వడిలే దం దెందొ నీవేగఁగా
సన్నాహంబున వచ్చినాఁడవుగదా జాగేల నీకేల నీ
సన్నంబైన మదీయపుచ్ఛ మొకపార్శ్వంబందుఁ బొందించి పో
వన్నన్నఁ దన్మహిమం బెఱుంగ కుదితాహంకారపంకాత్ముఁడై. ఆ.౭

# 38. ధరణిదేవుల రామమంత్రి

ఈకవీంద్రుఁడు నూఱుసంవత్సరములక్రిందట దశావతారచరిత్ర మను పదియాశ్వాసముల గ్రంథమును రచియించెను. ఇతఁడు బ్రాహ్మణుఁడు; తిమ్మయామాత్యుని పౌత్రుఁడు; ధరణిదేవుల నాగయామాత్యునకును పణియమ్మకును పుత్రుఁడు. అందందుఁ గొన్నివ్యాకరణదోషము లున్నను, ఈతని కవిత్వము రసవంతమయి హృదయరంజకముగా నుండును. కవియే తన్ను సంస్కృతాంధ్రభాషా ప్రవీణునిగాను దినైక ప్రబంధవిరచనదక్షునిగాను,

క. నను సంస్కృతాంధ్రభాషా
వినుతు దినైకప్రబంధవిరచనదక్షుఁ
గనుఁగొని యిట్లనిపలికెన్
వినయంబు నయంబు హెచ్చ విబుధులు మెచ్చన్.

అను పద్యములోఁ జెప్పుకొని, తన్నష్టభాషాకవిత్వ తత్త్వసంవేదినిగా కృతిపతి పొగడిన ట్లీక్రింది పద్యములోఁ జెప్పుకొన్నాఁడు—

సీ. శ్రీరామకరుణారసారూఢ సంస్కృతప్రాకృతాద్యష్ట భాషాకవిత్వ
తత్త్వసంవేదివి ధరణిదేవుల తిమ్మయామాత్యపౌత్రుండ వన్నదాన
ముఖ్యనానాదానముదితభూసురచంద్ర నాగప్రధానేంద్ర నందనుఁడవు
పణియమాంబాగర్భపాథోధిచంద్రుడ వాత్మమిత్రఘునాయకాద్యనుజుడ
వాప్తుఁడవుగాన వేడెద నందముగను
గృష్ణునిదశావతారముల్ గృతి యొనర్చి
యంకితమునేయు నాకుఁ బ్రఖ్యాతి నీకు
మహితగుణసాంద్ర రామయామాత్యచంద్ర.

కవి తన దశావతారచరిత్రము నాఱువేలనియోగి యగు మంగదల కృష్ణమంత్రిం దున కంకితముచేసి యాతఁడు విద్యానిధి యైనట్లు,

ఉ. నారదమౌని! యేమి? సురనాథ! విశేషములేమి? వింటిరో
సారసగర్భుచెంగటను శారద లేదఁట! యెందు నిల్చెనో?
యారసిచూడుఁ డామగదలాన్వయదుగ్ధపయోధిచంద్రమం
దారము కృష్ణమంత్రి రసనాస్థలినిల్చెను, యుక్తమే కదా!

ఇత్యాది పద్యములలో నభివర్ణించి యున్నాఁడు. కృతిపతియైన కృష్ణమంత్రి గతశతాబ్దాంతమునందు నెల్లూరిమండలములోని ప్రళయ కావేరిపట్టణమునం దొలాందావారి ద్విభాషిగా నుండెను. కంకంటివారి యుత్తరరామాయణమువలెనే యీదశావతారచరిత్రమును పుష్పగిరి తిమ్మన్నచే రచియింపఁబడినదని కొందఱు చెప్పుచున్నారు గాని కవు లిద్దఱు నేకకాలమునం దొక్కదేశములో నుండుటదక్క వారిమాట కాధారలేశమును గానరాదు. దశావతారచరిత్రకవిత్వము పుష్పగిరి తిమ్మన్నదైన సమీరకుమారవిజయకవిత్వమునకంటె మృదుతరముగాను మధురతరముగాను కనఁబడుచుండుటచే దశావతారచరిత్రరచనలోఁ బుష్పగిరి తిమ్మన్న కేమియు సంబంధములేదని నిశ్చయముగాఁ జెప్ప వచ్చును. దశావతారచరిత్రములోని పద్యములఁ గొన్నిటి నిం దుదాహ రించుచున్నాను—

శా. ఆవార్తన్విని పింప దైత్యపతి రోషావేశ ముప్పొంగ నా
హా వేదంబుల యాగభాగము లమర్త్యశ్రేణికే కాని మా
కేవంకం బనిలేకయుండునటుగా నేర్పాటు గావించెఁ గా
నీ వేగంబ హరించి తచ్ఛ్రుతుల భగ్నీభూతము ల్చేసెదన్. ఆ. ౧.

ఉ. కన్నులు బ్రహ్మకెందొ సఁగఁ గానఁగ లేవని గౌతముండు తాఁ
గన్నులు వే యొసంగె నధికంబుగ నష్ట మదాంధకార సం
ఛన్నము లౌటచేఁ దెలియఁజాలవు తన్మదకారణంబు నిం
క న్నినుఁగూడనీయ కుపకారము చేసెదఁ జూడు వాసవా. ఆ-౨

ఉ. వీరుఁడ వంచు నిన్నుఁ బదివేలవిధంబులఁ బ్రస్తుతించుచున్
వారిధిభర్త తెల్పవిని వచ్చితి మెచ్చెద నేఁడుచూపు నీ
వీరతఁ గాండిశీకపదవీరతవృత్తిని మోరతోపునన్
జారెదనన్నఁ బో విడఁతు స్వర్ణవిలోచనుఁడంచు నుగ్రుఁడై. ఆ. ౩.

చ. గెలిచితి సర్వదేవతలఁ గేశవుఁ డొక్కఁడె తక్కె నాతనిన్
గెలిచినఁగాని యీగెలుపు గెల్పుటకాదది యెట్టు లంటిరేఁ
దొలుత వరాహమై యనుజుఁ ద్రుంచు టెఱుంగదె సూడుదీర్పఁగాఁ
గలుగనిగెల్పదేల బరగౌరవ మేటికి శౌర్య మేటికిన్. ఆ-౪

ఉ. ముక్కున గవ్వ కట్టినిను ముందుగ నీడిచి తెమ్మటంచు మా
రక్కసిఱేఁడు పంచె వినురా దివిజర్షభ యింక నట్టిటున్
దిక్కులుచూచిన న్విడువ దేవర వైనను నీకువెక్క నే
మ్రొక్కెదఁగాని రమ్మనుచు ముందలఁ బట్టఁగడంగ నుద్ధతిన్. ఆ-౫

శా. ఔరా విప్రుఁడనంచు నన్ జులకసేయ న్వచ్చితే మంచిదే
రారమ్మా ధను వూని నీదయిఁతౌత్రం బేను వీక్షించెదన్
శూరత్వంబులు మీకెయంచు నజుఁ డెవ్వో ముద్ర గావించెనే
లేరా బ్రాహ్మణశూరు లింకిటను గల్పింతు న్ననుం జూడుమా. ఆ-౬

శా. ఔనా నే వెలయాలనా యిటులు నీ వాడన్ బళా చాలుఁ బో
పో నవ్వే రెవరైన విన్న నిట నేర్పు ల్మానఁగా వచ్చితో
నానాథుం డిదివిన్నయంతఁ దనకు న్నాకు న్మహాహాని రా
దా నావంటికులాంగనామణికి న్యాయం బౌనె యీమార్గముల్. ఆ-౭

మ. ఎలనాగా! తలయెత్తి చూడఁగదె వీ రెవ్వారు వీ రేమికా
వలెనే యంచని యమ్మలక్క లట త్రోవన్ వేఁడ నీపైఁడిచా
యలచే మించునతండు నామఱఁదియౌ నం చంటతన్ సిగ్గుచేఁ
దలవంచు న్మహిళన్న వార లదె యాతం డెవ్వరంచు న్నగన్. ఆ.౮

ఉ. ఓయిగురాకుబోఁడి ! కనవో వినవో యిదియేమిచెల్ల నీ
ప్రాయపుఁదోయజాక్షులెడబాయ రొకప్పుడు ప్రాణనాథులం
బ్రాయము రిత్తఁబుత్తురకొ పల్కవె నీమది నున్న యట్టియా
నాయకుఁ దెల్పవే త్రిదశనాయకుఁ గోరినఁ దెచ్చికూర్చెదన్. ఆ-౯

శా. రంభాభోగముఁగోరి యాగముల కర్థం బెల్ల వెచ్చించు టా
యంభోదమ్ములఁజూచి చెర్వ్వజల మాద్యంతంబు చల్లించుటల్
సంభోగేచ్ఛ జనించెనేని మఱి వేశ్యారత్నము ల్లేరొకో
సంభోగింపఁగరాదె కానరు జనుల్ జ్ఞానంబు సామాన్యమే. ఆ-౧౦

---

## 39. దిట్టకవి నారాయణకవి

ఇతఁడాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; కాశ్యపగోత్రుఁడు; పాపరాజకవిపుత్రుఁడు. ఇతఁడు రంగరాయచరిత్రమును ప్రబంధమునుజేసి దానిని కృష్ణామండలములోని నర్సారావుపేట జమీందారగు మల్రాజు రామారాయనింగారి కంకితముచేసెను. ఈగ్రంథము ౧౭౯౦ వ సంవత్సర ప్రాంతములయందు రచియింపఁబడినట్టు తెలియవచ్చుచున్నది. ఈపుస్తకము ౧౭౫౭ వ సంవత్సరమున బొబ్బిలికోటవద్ద శ్రీరావు రంగారాయఁడుగారికిని ఫ్రెంచిసేనానాయకుఁడగు బుస్సీగారితో నచ్చుటికేగిన పూసపాటి విజయరామరాజుగారికిని జరిగినయుద్ధము భారతయుద్ధమువలె వర్ణింపఁబడినది. బొబ్బిలికోటవద్ద జరిగిన యుద్ధక్రమములు బొబ్బిలి సంస్థాన చరిత్రమును కథా సందర్భమున నిందు కొంత వివరించుచున్నాను.

బొబ్బిలిసంస్థాన స్థాపకుఁడయిన పెద్దారాయనింగారును విజయనగర రాజ్యసంస్థాపకుఁడయిన పూసపాటి తమ్మిరాజుగారివరినే ౧౬౫౨వ సంవత్సరమునందు శ్రీకాకుళపు సర్కారు ఫౌఁజుదారగు షెర్ మహామదుఖాన్ యొక్క ప్రాపుచేత నక్కడకు వచ్చెను. పెద్దారాయనింగారు

మహాశూరుఁడయి రంగవాఁక యనుచోట జరిగినయుద్ధములో శత్రువుల సంహారించి షెర్ మహమ్మదుఖాన్ యొక్క పుత్రుని ప్రాణములు రక్షించినందున, షెర్ మహమ్మదాయనకు రాజాముహాలుండా కవులున కిచ్చి రంగరావని బిరుదునిచ్చెను. రంగరావను బిరుదనామము నొందిన యీ పెద్దారాయనింగారు పద్మనాయకవంశజులయిన వెలమదొరలలోని వాఁడు. ఈయనయు వేంకటగిరి సంస్థానప్రభువులును పిఠాపుర సంస్థాన ప్రభువులును ఏకవంశములోనివారే. రాజామును కౌలునకుఁ బుచ్చు కొన్నతరువాత పెద్దారాయనింగారు క్రొత్తగా నొకపేటను కోటను గట్టి దానికి తన యుపకర్తపేరిట బెబ్బులియని నామకరణము చేసెను. షెర్ మహమ్మదులోని "షెర్" అను పదమునకు బెబ్బులియని యర్థము. బెబ్బులి యనునదే కొంతకాలమునకు బొబ్బిలిగా మాఱినదఁట! అప్పటి నుండియు క్షత్రియులయిన విజయనగరము వారికిని వెలమవారయిన బొబ్బిలివారికిని వైర మారంభమయ్యెనని చెప్పుదురు.

మన ప్రస్తుతచరిత్రారంభకాలమున ౧౭౫౬ వ సంవత్సరమునం దుత్తరసర్కారులు ఫ్రెంచివారి కియ్యఁబడఁగానే ఫ్రెంచిసేనాధ్యక్షుఁడగు బుస్సీదొరగారు రాజమహేంద్ర శ్రీకాకుళ సర్కారులను విజయనగర సంస్థానాధిపతులగు విజయరామరాజుగారికి కౌలునకిచ్చుట కంగీకరించెను; అట్లు జరిగెడుపక్షమునఁ దనస్థితికి భంగము కలుగునని దూరాలోచన చేతఁ దెలిసికొన్నవాఁడయి యప్పటి బొబ్బిలి ప్రభువుగారగు రంగారావు గారు రాజ్యము ఫ్రెంచివారియధీనము కాకుండఁజేయుటకయి యితర సంస్థానాధిపతులతోఁ జేరి కృషిచేసెను. ఈ కృషికి శ్రీకాకుళపు నవాబగు జాఫరల్లీఖాన్ యొక్క ప్రోత్సాహముసహితము విశేషిముగా నుండెను. తిరుగఁబడిన జమీన్దారుల నదిమి కప్పములు గొనుటకయి బుస్సీగారు ౧౭౫౬ వ సంవత్సరము నవంబరు నెల ౧౬ తేదిని ౫౦౦ యూరపియను లతోను ౪౦౦౦ సిపాయులతోను హైదరాబాదునుండి బైలుదేఱి

డిశంబరు ౧౯ వ తేదికి రాజమహేంద్రవరము వచ్చి చేరెను. విజయ రామరాజుగారు పదివేల స్వసేనతోను, ఇతరరాజులతోను వచ్చి యచట బుస్సీని చేరెను. తనదేశములోనుండి విజయనగర రాజ్యములోనికిఁ బాఱెడు కొండకాలువలను మళ్లించి బొబ్బిలి రంగారావుగారి కాపులు తమ భూములకుఁ బెట్టుకొన్నందునను, దేశస్వభావమునుబట్టి బొబ్బిలి వారిని సాధించుట సుసాధ్యము కాకపోయినందునను, విజయరామరాజు గారు మనస్సులో బొబ్బిలిరంగారావుగారిపై ద్వేషము వహించి యాయనను శిక్షించుటకయి బుస్సీని తన యావచ్ఛక్తిని వినియోగించి బహువిధముల ప్రోత్సాహపఱిచి పురికొల్పెను. అందుమీఁద బుస్సీగారు బొబ్బిలిరాజ్యమును విడువవలసినదనియు, దానికి బదులుగా నధిక వైశా ల్యమును మూల్యమునుగల దేశ మియ్యఁబడుననియు రంగారావుగారికి వ్రాసిరి. రంగారావుగారు పితృపితామహాగత మయిన బొబ్బిలిరాజ్య మును విడుచుట కంగీకరింపక పోవుటయేకాక తక్కిన సంస్థానాధిపతుల తోడిపాటుగా రాజమహేంద్రవరమునకు వచ్చి యాతనిని సందర్శింపక పోయెను. రాజమహేంద్రవరమున బుస్సీని దర్శించుటకయి విజయరామ రాజుగారు మొదలగు సమస్త రాజులును వచ్చినప్పుడు రంగరావుగారు రాకుండుట లోనుగాఁగల కథను గవి యిట్లు చెప్పినాఁడు.

ఉ. రాజమహేంద్రపట్టణవిరాజదదూరతలంబున న్సము
త్తేజితమైన గౌతమనదీతటసీమను గోటిలింగవి
భ్రాజితమైన యొక్కనవపాదపమంజులనిష్కుటస్థలిం
రాజితలీలఁజేరి శిబిరంబు వడి న్విడియించె వేడుకన్.

* * * *

ఉ. కారుణికత్వ మేర్పడ సికాకుల పున్సరకారులో. జమీ
దారుల రామరాజవసుధావలయేశ్వరముఖ్యుల న్ముదం

చారఁగఁ బిల్వఁబంపుమని హైదరుజంగున కానతీయఁ ద
చ్చారువచఃక్రమంబునను సత్వరుఁడై నిలిపించె వారలన్.

ఉ. పాయనివేడ్క విద్విషదపాయకరాయతబాహుశౌర్యు లా
పాయకరాయఁడుం గిరిడిపట్టణపుంబ్రభుపెద్దొరుండు నా
రాయణదేవుఁడున్ నరసరాజు మఱిం గొలుగొండ మన్నెపున్
రాయఁడు నాదిగాఁగలధరావరు లంపఁగ వచ్చి రత్తఱిన్.

గీ. ఉద్ధతులమ్ముల్క సందర్శనోత్సుకత్వ
మాత్మఁ జిట్టాడ నాడాడ నలరుమన్నె
దొరలువచ్చిరి మానుషద్రోహప్రసంగ
కలితుఁడగురంగరాయఁడొక్కరుఁడుదక్క.

సీ. నిజభుజాదండ నిర్జిత్రకోదండంబు గాండీవకార్ముకక్రమముఁ జూపఁ
జరమభాగస్ఫురచ్చటులతూణీరముల్ కవచానసొంపు సంఘటిలఁ జేయ
నాసీరముఖరనానాశంఖికధ్వనుల్ దేవదత్తరవోద్వృత్తిఁ దెలుప
సూరెలఁ బరతెంచుజులుమతీ తేజీలు ధవళాశ్వములమస్తు ద్రస్తరింపఁ
గలియుగార్జునుఁడౌర యీ ఘనుఁడటంచుఁ
దను జగజ్జన మెన్న నుద్ధతులముల్క
వీక్షణాపేక్ష నేతెంచె విజయరామ
రాజరాజన్యలోకమార్తాండమూర్తి.

* * * *

చ. నలువదివేలకాల్బలము నాలుగువేలతురంగమంబులున్
నలువదియేఁబదేనుఁగు లనంతములై నశితఘ్ని శాచయం
బులు నొకవేయిలొట్టియ లపూర్వవిభావిభవంబు దెల్పుచున్
గొలువ పరాసుతేనిఁ గనుఁగొఁ జనుదెంచెను రా జతిత్వరన్.

ఇట్లీ కావ్యమునందు విజయరామరాజుగారు నలువదివేల కాల్బల
ముతో వచ్చినట్లు చెప్పఁబడినను, ఆయనవెంట నిజముగా వచ్చినసేన

పదివేలని చరిత్రకారుఁడైన యార్మ్సుదొరగారు వ్రాసియున్నారు. ఇట్లుండఁగా రంగారావుగారి యనుమతిమీఁదనే బుస్సీదొరగారు కొందఱు సిపాయిలను బొబ్బిలిరాజ్యముమీఁదుగా మఱియొకచోటికిఁ బోవుటకుఁ బంపిరి. విజయరామరాజుగారి తంత్రమువలననో రంగారావుగారి బుద్ధిపూర్వకమయిన యేర్పాటువలననో పంపఁబడిన సిపాయీలు త్రోవలో బొబ్బిలి భటులచే నెదిరింపఁడి ముప్పదిప్రాణములను గోలుపోయి మరలి రావలసినవారైరి. ఈయవమానము విజయరామరాజుగారి ప్రోత్సాహమునకు తోడుపడఁగా, బుస్సీగారు రంగారావుగారిని శిక్షించి వారిని కుటుంబసహితముగా బొబ్బిలినుండి వెడలఁదోలుటకు నిశ్చయించుకొనెను. ఇన్నూఁటయేఁబండ్రెండు గుఱ్ఱపు రౌతులును నాలుగు ఫిరంగులును గల ౭౫౦ యూరపియనులతోను, విజయరామరాజుగారి భటులును సిపాయీలును గలిసిన ౧౧౦౦౦ స్వదేశీయపదాతిబలము తోను బుస్సీగారు బొబ్బిలికోటమీఁదికి దండువెడలిరి. బొబ్బిలికోట యిన్నూరుగజముల వైశాల్యముగలిగి నలుచదరముగా నుండెను. నాలుగు మూలలను నాలుగు గుండ్రని బురుజులుండెను. వెలుపలిగోడల యెత్తు ఇరువదిరెండడుగు లయినను, లోపలిబురుజులయెత్తు పండ్రెండడుగు లే యుండెను. పయిని గోడల వెడల్పును పండ్రెండడుగులుండెను. ఇట్టి మట్టికోటయొద్దకుఁబోయి బుస్సీగారు తన సేనలను నాలుగుభాగములు చేసి యొక్కొక్కభాగమున కొక్కొక్క ఫిరంగినిచ్చి నాలుగుభాగములను నాలుగు బురుజులను సాధింప నియమించెను. ౧౭౫౭ వ సంవత్సరము జనేవరు నెల ౨౪ వ తేదీని ప్రాతఃకాలముననే యుద్ధమారంభమయినది. శత్రువులు కోట బురుజులమీఁద ఫిరంగులు కాల్పనారంభింపఁగానే, కోట లోపలివా రగ్నిభయముచేత బురుజులమీఁది కప్పుతీసి వేసిరి. ఉదయమున జాము ప్రొద్దెక్కువఱకు బురుజుల గోడలలో విశేషభాగము కంతలుపడినవి. అప్పుడు శత్రువులయొక్క నాలుగుభాగములు

నొక్కసారిగా నిచ్చెనలు గైకొని లగ్గలు పట్టుటకయి కోటగోడను సమీపించి గంటవఱకును బ్రయత్నించిరికాని కోటను రక్షించుచున్న భటులయొక్క శౌర్యమువలన నొక్కరయినను కోటగోడమీఁది కెక్క లేకపోయిరి. కోటలోపలివారు స్త్రీలుకూడ వేయింటికి లోపుగానె యుండిరఁట. కోటగోడల కెగఁబ్రాఁక బ్రయత్నించినవా రనేకులు గాయములతో క్రిందఁబడిరి. ఈయంశమును కవి యిట్లు వర్ణించు చున్నాఁడు—

ఉ. తగ్గపరాసుమండల ముదగ్రతమై బిరుదు ల్వచించుచున్
లగ్గల కెక్కరా బురుజులం దగుమన్నకుమారసైన్యముల్
వెగ్గలమైన కోపమున వెన్కొనుచు న్నురుమాఁకువీఁకచే
నగ్గలికం దుపాకులఁ గిలార్చుచు నేయుచు రోయుచు న్వడిన్.

సీ. పొంగులురాఁగాఁగిపొరలునూనియముంచిగరగలవంచియక్క అగఁబ్లల్లి
జిగురుటంబలివేఁడి దిగుపాఅజాఅఁగా గుండలకోలఁదిగాఁ గ్రుమ్మరించి
వసియూర్చుదారుయంత్రసముత్కరంబులు మేనులుచ్చుచనంగమీఁటివైచి
యొండొంటిఁదోఁడుగాగుండియలౌదలల్గుటిచేసిత్రుంపఁగాఁగుండ్లుదొలపి
బిరుసుల దెరల్చిక్రొంబాఁగల్గురియనినుప
గొట్టములదాల్చి మొద్దిటెగములఁగ్రుచ్చి
చిచ్చుబుడ్లవగల్చి నిస్త్రింశతతులఁ
బొడిచి పడఁద్రోచిరానేనఁ గడిమితోఁడఁగ.

లగ్గలెక్కి కోటపట్టుటకు శక్యముకాకపోఁగా నంతట నాప్రయత్న మునుమాని శత్రువులు వెనుకకు మరలి మరల కోటమీఁద ఫిరంగులను గాల్వనారంభించిరి. అట్లు ప్రయోగింపఁబడిన ఫిరంగిగుండ్ల నొకచోటఁ గవి యీవిధముగా వర్ణించెను—

సీ. తట్టికోటయగల్చిదారుణోష్మలుగ్రమ్మ వంతదారుడాసి వ్రాలునవియు
నినుపతల్పుల ఘణిల్లునఁదాఁకి పిటిఁదికి రవళిమైవచ్చిబిట్టవియునవియు

ద్వారబంధపుఁగమ్మిదూఱి యవ్వలికంట దుస్సిపాఱఁగ నోడి
డొల్లునవియు
గుఱితప్పిపఱతెంచికోటముంగలిహస్తినఖపుదుమ్ములరేఁచినక్కునవియు
నగుచునొండొండ నెడయీఁక యంటిత్రూఁగి
బంతులాడినపగిది గుభాలుగ్భాలు
వినదభయదార్భటులశతఘ్నిప్రయుక్త
తాళఫలసన్నిభాయస గోళతతులు.

ఈఫిరంగివ్రేట్లచేత కోటగోడ మఱింత పడిపోయి శత్రువుల కెక్కువ యనుకూల్యమును కలిగించినది. అయినను కోటగోడలు పగులుటచేత కోట కావలివారి ధైర్యకంచుకము పగులక వారినిమఱింత తెంపరులనుగాఁ జేసినది. కోటకావలిభటులు తమప్రాణముల కాశపడక తమగుహలను కాపాడుకొను బెబ్బులులవలెఁ బోరాడిరి. ఫిరంగిగుండ్లు చిత్తజల్లులుగాఁ గురియుచున్నను వెనుతీయక వీరభటులు శత్రువులు కోటగోడల కెగఁ బ్రాఁకఁగానే యీఁటెలతోఁ గ్రుమ్మి క్రిందఁబడఁ ద్రోయవలెనన్న నిశ్చయముతో నిశ్చలులై కాలుగదల్పగ బురుజుల మీఁద నిలువఁబడిరి. ఆగ్నేయాస్త్రముల నపహసించెడు శతఘ్నికా ప్రయోగములముందఱ కేవల భుజవీర్య మేమి పనికివచ్చును? క్రింద నున్న సైనికులు గుఱిచూచి తుపాకులు కాల్చి బురుజులమీఁద నున్న వారి ననేకులను రూపుమాపిరి. స్వదేశ సైనికులయం దీవఱ కెన్నఁడు నేయుద్ధమునను గనియుండని యిటువంటి యసమాన ధైర్యసాహస ముల కద్భుతపడి శత్రువులు సహితము పలుమాఱు వారి కభయప్రదా నము చేసిరిగాని యావీరభటులు శత్రువుల వాక్యములను తిరస్కార పూర్వకముగా నిరాకరించి తమదేహములలోఁ బ్రాణము లుండఁగాఁ దమ తావు విడువమని యక్కడనే సుస్థిరులై పర్వతమువలె నిలువఁ బడిరి. అప్పటికి మధ్యాహ్నము రెండుగంట లయినను శత్రువులలో

నొక్కరును కోటగోడ నెక్కలేకపోయిరి. అందుచేత శత్రువులు కొంత సేపు యుద్ధము నిలుపవలసినవారైరి. అప్పుడు రంగారావుగారు శత్రువులతోఁ బోరాడి గెలువఁగలనన్నయాశ వదలుకొని తనవారిని బిలిచి యాలోచించి యంతఃపురస్త్రీలు శత్రువులచేతులఁబడి మానముగోలుపోకుండ కాపాడవలెనని నిశ్చయించి శిశుసహితముగా వారినందఱిని సంహారించుటకయి కొందఱిని నియమించెను. వారప్పుడే చేతులలో బాకులతోను బల్లెములతోను గదలిపోయి యంతఃపురము వాకిట గడ్డి నించి గృహముల కగ్నితగిలించి యాసంఘాత మరణమునుండి తప్పించుకొని ప్రాణములఁ దక్కించుకొనఁ బాఱుతెంచిన శిశువులను సహితము పుత్రులనక దయాపాత్రులనక క్రూరులై పొడిచి చంపిరి. ఈదారుణ కృత్యమును గవి యిట్లు చెప్పియున్నాఁడు—

క. చెలికాని వంశసంభవు । నలఘుతరస్థైర్యు ననిచె నవరోధవధూ
కులకంఠనాళకృంతన । కలనాదారుణవిధానకతనత నెత్రపణ్.

తే. అతఁడు నభిమానరతుఁ గార్హ్యప్రచార
దారుణాకార సాహసాదత్యమమర
నంతిపురి కేగ మొఱసె దిగంతరములు
ధరణి వడవడవడఁకె భూతలముబెగడె.

తే. రామమణిరాణి తనకుమారాగ్రయాయి
నపుడ కొండొకదాదికి నప్పగించెఁ
గోటవెడలించి బ్రతికించుకొమ్మటంచు
నట్లు కావించెనాదాయియడలువోడమ.

* * * *

క. ఘననిశితఖడ్గధారన్ । మొనకొని చెలికానివంశమూర్ధన్యుఁడు పెం
పున వడివడి నంతఃపుర । వనితాజనతాతిచిత్రవధవిధి నడిపెన్.

తే. తక్కఁగల యట్టియభిమానధనులువెలమ
లోక్కనూటిండ్లవా రనలోగ్రశస్త్ర
నిహతులై రంగనాశిశుసహితు లగుచుఁ
దద్విదారణమెంతని తలఁప వచ్చు.

మరభిమానజనితమైన వధూశిశుసంహారక్రూరకార్యము ముగియఁగానే ప్రాణములకు తెగించి వారందఱును మరల యుద్ధోత్సాహముతో వచ్చి తమస్థానముల నిలిచిరి. నాలుగు భాగములలో నొకభాగమునకు నాయకుఁడైన లాదొరగారు దూరమునుండి యగ్నిదాహమునుజూచి లోపలి కావలిసేనలు పలుచనసుట కనిపెట్టి యీలోపల లగ్గలు పట్టుటకయి మరలవచ్చెను. నిచ్చెనలతో పయికెక్కఁ బ్రయత్నించినవా రనేకులు నిహతులయి క్రిందఁగూలుచు వచ్చినను గొందఱు శూరు లొక్క బురుజుపై నెక్కి నిలువగలిగిరి. వారి వెంబడినె మఱి కొందఱును కోటగోడల కెగఁబ్రాకి బురుజు చేరిరి. రంగారావుగారు శత్రువులను బాఱఁద్రోలి యీబురుజు రక్షింపవలెనన్న యాశతో హతశేషులైన భటులతో వచ్చుచు నొకగుండుదెబ్బతో నేలఁగూలి వీరశయనము నొందెను. ఆయనపాటువలనఁ గలిగిన సక్రోధశోకోద్రేకముతో లోపలనున్న వీరభటబంధువర్గమంతయు పగదీర్చుకోవలెనన్న దృఢనిశ్చయముతో తక్కిన బురుజులను విడిచి యక్కడకు వచ్చిచేరెను. అంతట తక్కిన శత్రుసేనాభాగములు మూడును వరుసగ నాయాబురుజులనుజేరి యరక్షితము లయియున్న యామూడు బురుజుల ననాయాసముగా సాధించి లోపలఁ బ్రవేశించెను. ఇట్లు లెక్కకు మిక్కిలిగా శత్రుసేనలు నానాముఖముల వచ్చి చుట్టు ముట్టినను లోపలనుండి కోటను సంరక్షించుచున్న వీరభటులలో నొక్కఁడైనను బాఱిపోవుటకుఁగాని శత్రువులకు లోఁబడి శరణు చొచ్చుటకుఁ గాని ప్రయత్నింపలేదు. ప్రతిభటుఁడును వీరరసము మూర్తీభవించినట్లాయుధపాణియై శత్రున కభిముఖముగా

నడచి శత్రువును పొడిచి తాను పడిపోవుచు వచ్చెను; గాయపడి భూమి మీఁద నొరిగినతరువాత సహితము ప్రాణములు బొందిలోనుండి వెడలు వఱకును దనచేతిలోని ఖడ్గముతో దాపునకు వచ్చిన శత్రువును నఱకవలెనన్న ప్రయత్నము మానలేదు. ఇది కావ్యమునందుఁ గవి చేసిన వర్ణనముగాక యింగ్లీషు చరిత్రకారుఁడు వ్రాసిన సత్యాంశమగుట చేత బొబ్బిలికోటలోని రణశూరులు చూపిన విచిత్రపౌరుష మత్యంత శ్లాఘాపాత్ర మయిన దనుటకు సందేహములేదు. ఇట్టి వీరవధ కొంత సేపటి కెల్లను సంపూర్ణ మయిపోయెను. కోటలో జరిగిన ప్రాణనాశన మునకుఁ గరఁగినహృదయులయిన శత్రువులు సహితము జాలిపడుచు విచా రించుచున్న యీసమయమునందు గుంపులోనుండి వృద్ధుఁ డొకఁ డొక బాలునిఁ జంకఁ బెట్టుకొని తిన్నగా లాదొర యున్నచోటికి వచ్చి "ఈశిశువు రంగారావు కుమారుఁడు. తండ్రి యభీష్టమునకు విరుద్ధ ముగా నేనీబాలకుని ప్రాణములను గాపాడితిని" అని పలుకుచు, ఆసేనా నాయకునకు బాలు నొప్పగించెను. లాదొర యప్పుడే యాబాలకుని బుస్సీదొర యొద్దకుఁ బంపఁగా, అతఁ డాశిశువును వృద్ధుని తనసేనాని వేశమునం దుంచి యాదరించి యాశిశువుయొక్క సంరక్షణభారమును తాను వహించి శత్రుభయమువలన శిశువును గాపాడుటకయి తగిన కావలివారిని నియమించి యప్పుడే యాశిశువును బొబ్బిలిరాజ్యమున కభిషిక్తునిఁ జేయుచు లేఖ్యములు వ్రాయించెను.

నాఁటి రాత్రియు మరునటిదినములు రెండును గాయములు తగి లిన భటులయొక్క చికిత్సలు మొదలయిన పనులతోఁ గడచెను. మూఁడవనాఁ డర్ధరాత్రమునందు విజయరామరాజుగారుండిన పటమందిర ములో గొప్ప సంక్షోభ మొకటి పుట్టెను. రంగారావుగారు విహతు లయిన దినమునం దాయన నమ్మిన వీరభటులు నలుగురు కోటలో నేమూలనో దాఁగియుండి చీకటి పడినతరువాత కోటదాటిపోయి

విజయరామరాజుగారి శిబిరముల వెనుకనున్న యడవిఁ జొచ్చి చేరువ పొదలలో దాఁగియుండిరి. సమయము నిరీక్షించుచు వా రక్కడ రెండు దినము లుండి మూఁడవనాఁటి రాత్రి స్కంధావారము సద్దడఁగిన తరువాత నిశీథసమయమునందు వారిలో నిద్దఱు పొదలలోనుండి వెడలివచ్చి కావలివాండ్రను మోసపుచ్చి గూఢముగా విజయరామరాజుగారు నిద్రించుచుండిన పటకుటీరములో వెనుకవైపునుండి ప్రవేశించి యిద్దఱు నొక్కసారిగా తమ బాకులతో పొడిచి విజయరామరాజుగారి వక్షస్థ్సల మును గంతలు చేసిరి. మొదటి పోటుతో మేలుకొని విజయరామరాజు గారు మూల్గఁగానే వెలుపలినుండి కావలిభటుఁడు వచ్చి తుపాకితో కాల్చెనుగాని గుఱితప్పిపోయెను. ఇంతలో నితరభటులును వచ్చి వెంటనే యాహంతకులను జంపి ముక్కముక్కలుగా నఱికివేసిరిగాని యీలోప లనే వారు విజయరామరాజుగారిని ముప్పదిరెండుచోట్లఁ బొడిచిరి. ఇట్లు విజయరామరాజుగారిని జంపినతఁడు తాండ్రపాపయ్య యని కవి యిట్లు చెప్పియున్నాఁడు—

గీ. కదిసి పైఁబడి యొకకేల నదిమిపట్టి
వాఁడివాలున వక్షఃకవాటపాట
నంబుఁ గావించె నతనియానాభికుహర
విదళితాంత్రవ్రజంబులు వెలికినుఱక.

* * * *

మ. అపు డాతాండ్రకులాభిమాననిధి యాహా రాజదేవేంద్ర నీ
విపులప్రాభవశక్తి నీనిఖలపృథ్వీభారధౌరేయతా
నిపుణత్వంబును భాగ్యముల్ వృథ చనన్ నీచేయుధుశ్చేష్ట ని
ట్లుపభోగింపఁగనయ్యె నిట్టివెతయం చుద్వృత్తి వర్తిల్లఁగన్.

గీ. తాండ్రపాపయ్యసలుపు ధౌర్త్యంబువలన
క్షత్రవర్యుండుపులివాతికండయయ్యె

ననెడు రౌద్రపుఁబట్టె నంత నయ్యవనినాథు
బలము లాత్తరవంబునఁగలయ జర్వె.

సీ. తనచావు సర్వసిద్ధంబుగా మదిఁగోరి
సాహసకృత్యకునై చన్నవానిఁ
దని నేలికవిరోధిదర్పంబుమాపుట
పరమార్థమని నేఁటుకఱు మనవానిఁ
దనపడినట్టిబన్నముల కిక్కార్యంబు
ఫలరూపమని యాత్మఁ దలఁచువానిఁ
దన కులస్వాములందఱు మెచ్చుకొన నోర్చి
పగదీర్చుకొన్న సంభ్రమమువానిఁ
దాంధ్రకులజుని బొదివిరి దారుణముగ
ఘోరయుద్ధంబుసలిపి యవ్వీరవర్యుఁ
జదిమియై చిరి కతెననిస్త్రీఁశితతుల
నతనిసహచరయుగళసంగతముగాఁగ.

ఇట్లు మొదటవచ్చిన యిద్దఱు దమ ప్రాన్కని సాధింపలేక పోయిన పక్షమున, పొదలలో దాఁగియుండిన తక్కిన యిద్దఱునువచ్చి విజయరామరాజుగారి ప్రాణములుగొని తమ స్వామిఋణము తీర్చుకొనుటకు శపథము చేసికొనిరఁట! విజయరామరాజుగారు భృత్యులకై దండ గొనక నడువలేనంత స్థూలకాయులని చరిత్రకారుఁడు వ్రాయుచున్నాఁడు. యుద్ధములోఁ బ్రాణము దక్కించుకొన్న రంగారావుగారి తమ్ముఁడు వెంగళ్రావుగారు భద్రాచలమునకు పాఱిపోయి, ఆనందరాజుగారు బందరు వెళ్ళి యున్నప్పుడు ౧౭౫౮ వ సంవత్సరమున మరలివచ్చి తనకుటుంబము నెడల విశ్వాసముగల ఒొంటిసేనను గూర్చుకొని రాజాముకోటను స్వాధీనము చేసికొనెను. వెంగళ్రావుగారు మూడుసంవత్సరములు ప్రభుత్వముచేసి మృతినొందఁగ, ఇంతకుముందొక వృద్ధునిచే ప్రాణరక్షణము

చేయఁబడినట్లు చెప్పఁబడిన గోపాలవేంకటరావుగారను చిన్న రంగారావుగారు రాజ్యమునకువచ్చి నాలుగుసంవత్సరములు పాలనము చేసిన తరువాత ౧౭౯౯ వ సంవత్సరమున సీతారామరాజుగారాయనను చెఱసాలలోఁ బెట్టించిరి. ఆయన ౧౭౯౦ వ సం॥రమునందందుండి తప్పించుకొని నిజాము రాజ్యమునకు పాఱిపోఁగా, ౧౭౯౪ వ సంవత్సరమునం దింగ్లీషువా రాయనను బిలిపించి పూర్వుల బొబ్బిలిరాజ్యమంతయు మరల నిచ్చిరి.

ఈ నారాయణకవియొక్క కవిత్వమునందు లక్షణదోషములు కొన్ని యందందుఁ గానఁబడుచున్నను కవనము రసవంతమయినది. ఈ ప్రబంధమునందు వీరరస మించుమించుగా భారతమునఁ దిక్కన సోమయాజిచే వర్ణింపఁబడినట్లు వర్ణింపఁబడినది.

---

# 40. అత్తలూరి పాపకవి

ఈ కవి చెన్నబసవపురాణమను నయిదాశ్వాసముల పద్యకావ్యమును రచియించి మా పూర్వులలో నొకరయిన కందుకూరి యమృతలింగముగారి కంకితము చేసెను. మా పూర్వులు మహమ్మదీయ ప్రభుత్వములో "దేశపాండ్యా" లయి ఘనతను బొంది పెక్కు కావ్యములను కృతులనంది కవుల నాదరించియున్నారు. పూర్వము కృతిపతులయిన వారిని గూర్చిన కొన్ని పద్యముల నీపుస్తకమునుండి యిందుదాహరించుచున్నాను.

ఉ. ఆతతకీర్తికై కువలయాశ్వచరిత్రకృతిన్ గ్రహించిప్ర
స్ఫీతము లైన కొత్తపలి యేలెటిపా డనునగ్రహారముల్
ఖ్యాతిగఁజేసి బంధులకు గ్రామసమృద్ధు లొసంగి శాంభవ
వ్రాతము గోర్కు లిచ్చి విభవంబున మల్లనమంత్రి వర్ధిలెన్.

కందుకూరి మల్లికార్జునమంత్రి కువలయాశ్వచరిత్రము కృతినందిన తరువాత,

సీ. మహితపంచాక్షరీమాహాత్మ్యమును గృతి
యంది త్రైలోక్యవిఖ్యాతిఁ గాంచె
నతిభక్తి శ్రీశైలమందు మహానులు మెచ్చ
సంవత్సరము నివాసంబు చేసె
నిష్ఠాగరిష్ఠుఁడై నేఁడునాఁడనక య
సంఖ్యమాహేశ్వరార్చన మొనర్చె
హితుల రక్షించి యహితుల శిక్షించి భూ
పతుల వశ్యులఁజేసి చతురుఁడయ్యె
నితని కెనయైనమంత్రులిక్షితితలమునఁ
గలరెయని సర్వజనములుఁ బలుక నెగడె
గండుకహార్ మల్లికార్జుననందనుండు
సంగరగుహుండు వీరేశలింగవిభుఁడు.

వీరేశలింగమంత్రి పంచాక్షరీమహాత్మ్యము కృతినందెను. అటు తరువాత

సీ. నారదప్రభ మించి నారదప్రభ నెంచి యమరినకీర్తిదానములవాఁడు
చిత్రభానునిమీఱి చిత్రభానునిగేరి పరఁగుశుచిప్రతాపములఁవాఁడు
భీముపేర్మినిగెల్చి భీముపేర్మినగల్చి వఱలినభూతిసత్వములవాఁడు
ధర్మగర్మముఁద్రోచిధర్మగర్వముఁబాచి తగుశివభక్తిసత్యములవాఁడు
జగతిఁ జెలువొందె నుదయాస్తశైలసేతు
శీతనగమధ్యరాట్సభాసీనవిబుధ
వినుతసుగుణుఁడుమల్లికార్జునసుతుండు
మహితధృతిశాలిబసవరాణ్మంత్రిమాళి.

క. ఘనముగ నైతముపూడియు
మినుమించిలిపాడు సిరులు మించంగ నొసం

గెను గురుచరవరులకు బస
వని తో నెనయైనమ్మంత్రి వసుధఁగలఁడే.

క. తన మేనయల్లుఁ డావృతి। వినయుం డగుబుద్ధిరాజు వీరనచేతన్
గొనె సత్యవతీపరిణయ। మనుకృతి శ్రీబసవమంత్రి యతిసంప్రీతిన్.

కందుకూరి బసవరాజుగారు సత్యవతీపరిణయమును గృతినందిరి. అటుపిమ్మటఁ గందుకూరి యమృతలింగముగారి చెన్నబసవపురాణమును గృతినందిరి. కృతిపతియొక్క పెదతండ్రియైన సాళువపతి

గీ. సుగుణు లగుమల్లికార్జునసుతులలోన
నాలుగవనందనుండగుసాళువపతి
సంతతాత్మీయహృదయపద్మాంతరాళ
సంచరత్సాళువపతి ప్రశస్తిగాంచె.

శా. ఢిల్లీనాయకుచేత దంతిహయశాటీముఖ్యవస్తువ్రజం
బెల్లం గైకొని కాశికాప్రముఖగౌరీశావను ల్గాంచి ని
త్యోల్లాసంబున శంకరార్చనలు దివ్యస్ఫూర్తిఁ గావించి సం
ఫుల్లాంభోరుహలోచనామదనుఁడై పూర్వప్రభ న్వర్ధిలెన్.

అని ఢిల్లీనాయకునిచేత బహుమానము లందినట్లు చెప్పఁబడి యుండుటచేతను, ఢిల్లీరాజ్యము నశించి నూఱుసంవత్సరములకంటె నధికకాలమగుటచేతను, కృతిపతియు కృతికర్తయు నుండినకాలము నూఱుసంవత్సరములకుఁ బూర్వమని చెప్పవచ్చును. ఈగ్రంథమునకుఁ గథానాయకుఁడయిన చెన్నబసవన్న వీరశైవమతమును స్థాపించి కళ్యాణ నగరమునందు బిజ్జలరాజునకు మంత్రియైయుండి యాతనివధించిన బస వేశ్వరునకు మేనల్లుఁడు. బసవేశ్వరుఁడు తన యధికారబలముచేత శైవ మతమును వ్యాపింపఁ జేసినను చెన్నబసవన్నయే యధికమతాభినివేశము కలవాఁడయి మతవ్యాపనమునకు ముఖ్యకారకుఁడయి యుండినవాఁడు. బసవేశ్వరుఁడు శ్రీశైలమునకు సమీపముననున్న యొక గ్రామములో

బ్రాహ్మణదంపతులకుఁ బుట్టి యుపనయన సంస్కారము చేసికొనక శివ భక్తుఁడయి లింగమును కట్టుకొనెడి యాచారమును మొదట నేర్పఱిచెను. ఈ చెన్నబసవపురాణములో నక్కడక్కడ లక్షణవిరుద్ధము లయిన ప్రయోగములు కానఁబడుచున్నను, కవి చిక్కలి ప్రౌఢుఁడయి హృద్యముగా పద్యరచనను జేసియున్నాఁడు. కవితాత యక్కరాజు; తండ్రి శ్రీగిరిమంత్రి. ఈతనిది కౌశికగోత్రము. చెన్నబసవపురాణములోని కొన్ని పద్యము లిందుదాహరింపఁబడుచున్నవి—

చ. కనుఁగవఁ గెంపునింప నలుకన్ బసవేశుఁడుఁజూచి బిజ్జలుం
డనియెఁ బ్రధానశేఖరుఁడవై నుతిగాంచుట వన్నె కెక్కె యి
ట్లనుచితవృత్తికిం దగిలి యగ్రజ చీఁకటితప్పు సైపఁ గూ
డునె కులశీలమానములు డొంకిచనన్ ధరణీతలంబునన్. ఆ-౧

ఉ. ఎక్కడనుండివచ్చెనొకొ యీ ముదిజంగము వానిపూయలోఁ
జిక్కె తరాలనుండి యొకచీమకుఁ బోవఁగనీక దాఁచు నా
చక్కనిపిండి నద్దిమి సర్వముఁ బెట్టెఁగఁబంచె నింక నే
నెక్కరణి న్వసింతు మరు లెత్తి వ్యయం బొనరించు నీనితోన్. ఆ-౨

మ. ఇతఁడా శ్రీగిరిమల్లికార్జునుఁడు సామీ లెస్సబాగాయె నీ
మతిలో నేమితలంచి దైవ మని సంభావించి కాన్పింపఁ జూ
చితి నే వెఱ్ఱినిగాను వేలు పని దర్శింపంగ నాత్మోడనా
చతురత్వంబులు చాలు దేవు నిఁక దాఁచంబోక కాన్పింపవే. ఆ-౩

చ. అతులనదీప్రవాహమున నాడది యీడది రెండుకాష్ఠముల్
జతపడి కొంతదవ్వరిగి లంక తటాలున నడ్డమైన నా
జత విడి యొక్క టొగు నటుసాగక యొక్కటి నిల్చెఁ గావునన్
వెత కుడువంగ నేల నను వీడె నతండని నెమ్మనంబునన్. ఆ-౪

ఉ. నిద్దురలేచి యాఘనుఁడు నీలగళున్ స్మరియించు వేళ నా
పెద్దయ సంచరించుపడిసీనుల సోఁకిన నావుదూడయో

మొద్దొ యటంచుఁ దాసియని యేడ్తెఱ ముమ్మఱుఁబల్క నాతఁడీ
ప్రొద్దుటి కబ్బె నాకు గురుబోధితమంత్ర మటంచు నాత్మలోన్. ఆ-౫

---

## 41. కస్తూరి-రంగకవి

ఈకవి లక్షణచూడామణియను నామాంతరముగల రంగరాట్ఛందస్సును రచియించుటయేకాక సాంబనిఘంటువును, కృష్ణార్జునసంవాదమ నెడి యైదాశ్వాసముల కావ్యమునుగూడ రచియించెను. ఇతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు; ఈతనితండ్రి వేంకటకృష్ణయామాత్యుఁడు; తల్లి కామాక్షమ్మ. ఇతఁడు ౧౭౫౦ వ సంవత్సరప్రాంతములయందు తంజావూరి సంస్థానమం దుండినవాఁడు. శంకరవిజయమును రచియించిన యాంధ్ర కాళిదాసు తా నీకవికి శిష్యుఁడయినట్టు తన గ్రంథమునందు వ్రాసికొనియున్నాఁడు. కస్తూరిరంగకవి విరచితమైన రంగరాట్ఛందములో ననేకాపూర్వగ్రంథములనుండి పెక్కు పద్యములు లక్ష్యములుగాఁజూపఁబడియున్నవి. ఆయాకవులకు కర్తృత్వమారోపింపఁబడిన యాగ్రంథములు కొన్ని యెంతవఱకు సత్యమైనవో యింకను విచారింపవలసి యున్నది. ఇతఁడు మంచికవి. ఈతని కవిత్వనైపుణి దెలుపుటకయి కృష్ణార్జున సంవాదములో నొక్కొక్క యాశ్వాసమునుండి యొక్కొక్క పద్యము నిందుదాహరించుచున్నాను.

ఉ. తమ్ములవ్రాలి పువ్వురసధారలుగ్రోలి సుగంధగంధవా
హమ్ములఁ గ్రాలి తేనియలయందపువాఁకలఁదేలి పువ్వుజొం
పమ్ములసోలి కింశుకసుమమ్ములవ్రేలి ప్రియాళినేలి ఝం
ఝుమ్మని క్రమ్మి తుమ్మెదలు చొప్పడుచున్నవి కాననంబునన్. ఆ-౧

ఉ. హా విధి యెంతచేసె నహహా యిపు డెంతటిమాట వింటి నా
హా విపరీతదుర్దశల నందితి హా యిఁకమీఁదఁ నన్ను సం

భావనచేసి ప్రోవఁగలవా రెవరం చని యూఁగయుండు నెం
తే వెతఁ జెంది కన్నుఁగవ నీ రొలుకం బలవించి వెంకియున్. ఆ-౨

మ. అతివ లోకాండజము లద్దఁజేరి యిదియేమమ్మా మహారాజుగా
సుతుఁ డం దుండఁగ సారెసారెకు నిట్టుల్ శోకింపఁట ల్మీకు సం
గతి కాదమ్మ సహించవమ్మ గయునిం గాంతేయు లెల్ల న్నయో
న్నతి రక్షించిరి నమ్మవమ్మ యని నానాకీతులం బల్కుచున్. ఆ-౩

శా. యుష్మత్సాంద్రచమూసమూహభుజగర్వోగ్రాంధ కారంబునన్
గ్రీష్మద్యత్సమయప్రచండకరసంకీర్ణార్కసంకాశమ
ద్భీష్మాస్త్రంబుల నేసి మాన్చి తుది నీబీరంబు వారించెదన్
భీష్మాచార్య యొకింత నిల్వుమని గంభీరాట్టహాసోగ్రుఁడై. ఆ-౪

చ. తరణి సుధాకరుల్ గతులు తప్పఁ గులాచలము ల్వడంక ది
క్కరులు చలింప సర్వసురకాండము లంబరవీధి భీతిచే
నొరగఁ బయోధు లింకఁగ మహోద్ధతి మంటలు గ్రక్కుకొంచుఁదీ
వరముగఁ గ్రీడిపైని ఘనవైష్ణవసాయక మేగుదెంచినన్. ఆ-౫

---

## 42. ఆలూరి కుప్పనకవి

ఈకవి యానందగిరికృతమైన శంకరవిజయము నాఱాశ్వాసముల పద్యకావ్యమునుగా రచియించెను. ఇతఁడు వైదికబ్రాహ్మణుఁడు; వేంకటగిరిపౌత్రుఁడు; వేంకటేశ్వరార్యునకును నరసమాంబకును పుత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కాశ్యపగోత్రుఁడు.

క. ఘనుఁ డగుతుళజేంద్రుఁడు దయ। తనరఁగ నీ కాంధ్రకాళిదాసాభిధ మ
న్ననగా నొసంగెనఁట నీ। యనుపమసాహిత్యమున కహో యెన గలదే?

అని కవి తనకు తంజావూరుమహారాజగు తుళజేంద్రుఁ డాంధ్రకాళిదాసను బిరుదిచ్చినట్లు చెప్పుకొనియున్నాఁడు. ఈతుళజేంద్రమహారాజు

ప్రతాపసింహమహారాజు పుత్రుఁడు. క్రీస్తుశకము ౧౭౪౦ వ సంవత్సరము మొదలుకొని ౧౭౬౫ వ సంవత్సరము వరకును తండ్రి రాజ్యమునుచేసి మృతినొందఁగా, తుళజేంద్రు డీకడపటి సంవత్సరమున సింహాసనమెక్కి ౧౭౮౭ వ సంవత్సరమునందు మృతినొందెను. ఈమహారాష్ట్ర ప్రభువుచేత నాంధ్రకాళిదాస బిరుదాభిదాన మందిన మనకవి నూరు నూటయిరువది సంవత్సరములక్రిందట నుండినవాఁడు. ఇతఁడు చెన్నపట్టణములో నుండిన నియోగుల ప్రార్థనమీఁద దానీశంకరవిజయమును తెనిఁగించినట్లుకవి యిట్లువ్రాయుచున్నాఁడు.

సీ. శ్రీపార్వతీశలక్ష్మీశసేవాసముపార్జితమహనీయభాగ్యయుతులు
ఘటనాఘటనసముత్కటమనీషాతిచమత్క్రియాధోరణీమంజుమతులు
నతులితసామదానాద్యుపాయైకవిచక్షణాక్షీణశాశ్వతచరితులు
హితపురోహితనిజాశ్రితబాంధవావనామాననిస్తులితాన్నదానరతులు
కలితయజనాదిమహితషట్కర్మనిరతు
లగణితజగన్నుతాద్భుతసుగుణతతులు
సారలౌకిక వైదికాచారభృతులు
చతురచెన్నపురీచరత్సచివతతులు.

* * * *

క. నను శ్రీనృసింహపాదా । ర్చనజనితలసత్కవిత్వచాతుర్యగుణా
ధ్యుని నాంధ్రకాళిదాసా । ఖ్యునిఁబిల్వఁగఁబంచిపల్కిరున్నతకరుణన్.

సీ. లీలఁ బంచనదీస్థలీపురాణము తెలిఁగించితి వాహూఢకీర్తిమెఱయఁ
బరఁగు రామాయణభాగవతంబులు యక్షగానముచేసి తద్భుతముగఁ
గర మొప్ప పరమభాగవతచరిత్రయన్ కృతియొనరించితున్నతిఁదలిర్పఁ
జెలువొందు నిందుమతీపరిణయ నామకృతి రచియించితి నతులగరిమ
గురుతరోజ్జ్వలసరణితో సురకథాసు
ధారసాభిధకావ్యముదారఫణితి

గా రచించితి వెనలేని గద్యపద్య
తతుల లెక్కింపఁదరమె తత్కృతులుజగతి.

*　　*　　*　　*

వ. కావున జగద్గురుండై విశేషించి మనకు గురుండైన యాచార్యునివిజయంబు......నొనరించి మాకింపెఱికి సత్సారం బొనఁగూర్పు మని యాశీర్వచన రూపంబుగా నిర్దేశించి పలికి యనేకరీతుల సత్కరించిన............

సీ. కార్యఖడ్గకవిత్వకరణికచాతురి యిలఁ బరికింప మీ యింటిబిరుదు
సలలితయజనాదిషట్కర్మనిరతులు ఖ్యాతిరంజిల్లు మీ జాతిబిరుదు
ధైర్యదాతృత్వోచితజ్ఞతాదిగుణైకసరణి మీసాంగత్యసహజబిరుద
మనుగతంబగుపాలనానూనచాతుర్యమమరుమీభవ్యగోత్రములబిరుద
మట్టిమీరలు నాపట్ల నతులకృపను
గురువిజయమిట్లు తెలిఁగింపఁగోరుకొనుటఁ
గలిగె నిలమీఁద యోగంబునిలువరముగ
సారెకునియోగ మెంతని సన్నుతింతు ?

పయిపద్యములలోఁ జెప్పఁబడినదానినిబట్టి కవి యాశంకరవిజయమునుగాక యాంధ్రకృతులను మఱియుఁ బెక్కింటిని రచించినట్లు కనుపట్టుచున్నది. రంగరాట్ఛందస్సును రచించిన కస్తూరి రంగకవి తనకు విద్యాగురు వయినట్లు చెప్పి కవి గ్రంథాదియందాతని నిట్లు స్తుతించియున్నాఁడు—

సీ. భారతి కేవిప్రవర్యునిజిహ్వ నిత్యముగ వసించునాస్థానవాటి
వాణీవధూటి కెవ్వానివాక్పలుకులు ధరియించినట్టిముత్యములచాలు
శారద కేసుధీస్వామిచేతోవీథి యమరినరత్నసింహాసనంబు
పలుకులవెలఁది కేభాగ్యునిగృహంబు నెట్టుగా వసియించు పుట్టినిల్లు

నలువచెలువకు నెవ్వఁ డెన్నఁదగుపుత్రుఁ
డట్టికస్తూరిరంగార్యు నచలధైర్యు
నార్యనుతచర్యు మద్గురువర్యు నెంచి
ప్రణుతిగావింతుఁబలుమాఱుఁబన్నుతింతు.

మొత్తముమీఁద నీ యాంధ్రకాళిదాసునికవనము సరసమైనదని చెప్పవచ్చును. శంకర విజయములోని కొన్ని పద్యముల నిందుదాహరించు చున్నాను—

శా. ప్రాచుర్యం బగుతావకీనకథితప్రఖ్యాతసంశుద్ధ వే
దాచారంబులు మాని తత్ప్రతనులై యాయాకుచిహ్నంబులన్
వైచిత్ర్యంబుగఁ దాల్చి విప్రముఖులౌ వారెల్ల నత్యంతమి
థ్యాచారంబున సంచరించెదరు దర్పారూఢులై యీశ్వరా. ఆ-౧

చ. అనయము నైజధర్మములయందుఁ జలింపక మిత్రశత్రుభా
వనల స్వపక్షమంచుఁ బరపక్షమటంచుఁ దలంప కెంతయున్
ఘనసమబుద్ధిమీఱఁ గలఁకంగొన కెవ్వరి నొవ్వనీయకే
పనుపడి స్వస్థచిత్తుఁ డగువాఁడుసుమీ హరిభక్తుఁడెంతయున్. ఆ-౩

మ. నను నీభక్తుఁ డటంచు నెంచ కిల విన్నాణంబుగా నిట్లొన
ర్చినయజ్ఞానుల నేమిపల్క నిఁక నీచిత్తంబు నా భాగ్య మో
యనుకంపానిధి నిన్ను నమ్మితిని నెయ్యంబొప్ప నీవేళ నీ
యనలార్తిం దొలఁగించి ప్రోవుము నృసింహా దీనకల్పద్రుమా. ఆ-౬

# 43. పింగళి ఎల్లనార్యుఁడు

ఈ కవి సర్వేశ్వరమాహాత్మ్యమను నామాంతరముగల తోభ్య చరిత్రమును రచియించెను. తోభ్యచరిత్రము నాలుగాశ్వాసములుగల క్రైస్తవగ్రంథము. "ఇది శ్రీమదివ్వటూరి శరభనారాధ్య సద్గురుప్రసాదలబ్ధాష్టవిధకవిత్వప్రవీణ" అని గద్యమునందు వ్రాసికొనుటచేతను,

సీ. భక్తిమై రేణుకప్రముఖోత్తము నుతించి
మాయదేవాహ్వయుమహిమ పొగడి
చెలఁగి యథావాక్యముల నన్నమయగారి
భజియించి మ్రొక్కెడి పాలకురికి
సోమన్నగారిఁ బ్రస్తుతిచేసి ప్రియమంది
శివదేవముఖనవకవుల నెంచి
గణపతిదేవుని ఘనతసన్నుతిచేసి
వేమనఁ గీర్తించి విమలమతిని
వ్యాసవాల్మీకికాళిదాసాదిఘనుల
నన్నపార్యునిఁ దిక్కనయజ్వ నెఱ్ఱ
ప్రెగడ ధూర్జటిఁ బోతన భీమకవిని
జెలఁగి శ్రీనాథముఖకవిశ్రేణిఁ దలఁచి.

అని శివభక్తులను ముఖ్యముగా నుతించి యుండుటచేతను, ఈ కవి శైవుఁడయిన నియోగి బ్రాహ్మణుఁడని యూహింపఁదగి యున్నాఁడు. ఇతఁడు క్రైస్తవుఁడుగాక శైవబ్రాహ్మణుఁడే యైనపక్షమున, క్రైస్తవమతగ్రంథ మేల చేసెనో తెలియకున్నది. ఇతఁడు క్రైస్తవ మతావలంబనముచేతఁగాని, ధనాపేక్షచేతఁగాని యీ గ్రంథమును రచించి యుండును. కవి భారద్వాజగోత్రుఁడు; పింగళి నాగయామాత్యపుత్రుఁడు. ఇతఁడు కృష్ణామండలములోని కొండవీటిసీమయందుండిన నియోగి

బ్రాహ్మణుఁడు. ఈ కవి తుమ్మరాయపరెడ్డి ప్రేరణముచేత నీ గ్రంథమును రచియించెను. ఈ సందర్భమునఁ గవికృత్యాదిని వ్రాసిన పద్యములఁ గొన్నిటి నిందుదాహరించుచున్నాను—

చ. తనర విదర్భసీమ కవతంస మనందగుకొండవీటి కిం
ద్రునిదెస రాజ్యలక్ష్మికి నిరూఢనివాస మనంగ భక్తవా
డనుపుర మొప్పు నుర్వరకు హారమణిస్థితిఁ బొల్చి సజ్జనుల్
ధనకనకాంబరామలసదావిభవోన్నతిఁ జెంది వర్ధిలన్.

వ. ఆ పట్టణంబున కధీశ్వరుండు.

సీ. తనకీర్తికామినుల్ దశదిశాభాగరంగస్థలంబుల నాట్యగతులు నెఱపఁ
దనశౌర్యవహ్ని దుర్దమభయంకరశత్రుధరణీశ్వరాటవుల్ దరికొనంగఁ
దనదానధారానితంబినీరత్నము లబ్ధినాయకులతో ననఁగి పెనఁగఁ
దనకరుణారసఘనతరౌషధ మఖిలార్థిదారిద్ర్యామయంబు లడఁప
ఘనతఁ జెన్నొందుజగనొబ్బగండబిరుద
భూషణుఁడుతుమ్మవంశాబ్ధిపూర్ణచంద్రుఁ
డలఘుచరితుఁ డనంతాధిపాత్మజుండు
రమ్యరుచిహేళి రాయపరెడ్డిమౌళి.

వ. ఒక్కనాఁ డమాత్యపురోహిత విద్వత్కవీంద్రతార్కిక మీమాంసిక వందిమాగధ సుహృద్బంధు సేనాధీశ్వరసహితంబుగా నాస్థానమంటపంబున గీతవాద్యనృత్య వినోదలీలాకౌతూహలమానసుండై యుచితాసనంబున సుఖాసీనుండై

గీ. అనుఁగుఁదమ్ముఁడు పాపన్న వినయగరిమ
నాత్మధర్మప్రవర్తన ననుకరింపఁ
బరఁగ ధరమంత్రిపోత్తురిపాపనార్యుఁ
డెలమివిద్యాప్రసంగముల్సలుపుచుండ.

మ. ఘను శ్రీసద్గురుచిత్కళేక్షణమహాసంధానుసంధానపా
వన కారుణ్యకటాక్షలబ్ధవరగీర్వాణాంధ్రభాషాకవి
త్వనిరోష్ఠ్యక్రమచిత్రలక్షణచమత్కారప్రబంధాళిక
ల్పనునిన్ బింగళి యెల్ల నార్యమణిఁ బిల్వంబంచి పల్కెం గృపన్.

చ. ప్రణుతయశోవిశాలుఁడవు భాసురశబ్దనిగుంభ నాదిల
క్షణములఁ జిత్రవైఖరుల సర్వనృపాలసభాంతరంబులన్
గణుతికి నెక్కినీకవితఁ గర్ణరసాయన మౌచు నిప్పరీ
క్షకవితానమందు నతిగౌరవ మందితి వెంచిచూడఁగన్.

* * * *

శా. కొండారెడ్డిఘనుండు శౌర్యకటిమన్ గొట్టె న్మరాట్కీల ను
ద్దండుం డన్న యతండు మాకు సుకవీంద్రశ్రేణిఁ బ్రోచున్ సిరుల్
నిండన్ దామెర వేంకటాధిపుఁడు మన్నించంగఁ బామూరిలో
నుండు న్నిన్ను బహూకరింపఁగలఁ డేయుద్యత్కృతిశ్రేష్ఠతన్.

వ. ......మున్ను మజ్జనకాగ్రజుండును గొండారెడ్డికి జనకుండును నగు నోబళరెడ్డి భూకాంతునకుం దదీయాచార్యుండగు సంజీవనాథస్వామి పరాపరవిజ్ఞానమార్గోపదేశ ప్రసంగవశంబున నిత్యం బైనసత్యాధ్యయనవిధానప్రవర్తకుం డైనతోభ్యుండను నొక్కమహాపురుషునిదివ్య చరిత్రంబు గలసర్వేశ్వరమాహాత్మ్యంబు చిత్రంబుగా ముఖవచనంబులం దేటపఱిచి సంక్షేపరూపంబైనవాక్యగ్రంథంబొసంగె. దీనిం బరిశీలించి సర్వేశ్వరున కంకితంబుగాఁ దెనుంగున మృదువచన రచనా గౌరవం బేర్పడఁ బ్రబంధంబుగా నిర్మింపవలయు............

పయిదానినిబట్టి యీకవి యాతకుమున్ను వచనకావ్యముగా రచియింపఁబడినదానినిబట్టి యీపద్యకావ్యమును రచించినట్లు తెలియవచ్చుటయేకాక యితఁడు దామెర వేంకటాధిపునికాలములో నుండినట్లు కూడ స్పష్టమగుచున్నది. బహుళాశ్వచరిత్రమును రచియించిన దామెర

వేంకటాధిపుఁడు పదునేడవశతాబ్దారంభమునం దుండినవాఁడు. ఇతఁడతఁడుగాక యాతనిమనుమఁడయినను, కవి పదునేడవశతాబ్దమధ్యమునం దున్నట్లేర్పడుచున్నది. దీనినిబట్టి చూడఁగా నీతోభ్యచరిత్రము వేదాంత రసాయనమునకంటెఁ బూర్వమున రచియింపఁబడినట్టు కానఁబడుచున్నది. ఈకవి కవిత్వము మృదుమధురపాకము గలదయి హృద్యముగా నున్నది. కవనపటిమ తెలియుటకయి తోభ్యచరిత్రమునుండి కొన్నిపద్యముల నిం దుదాహరించుచున్నాను—

మ. ఇల కంపించినఁ దారకల్ చెదరినన్ హేమాచలం బెంతయున్
దలక్రిందై నను భానుఁ డస్తగిరిమీఁదం దోఁచినన్ దిగ్గజా
వలి యల్లాడిన వార్ధు లింకిన మనోవాక్కాయకర్మంబులన్
బలుకంబూనఁ డసత్య మెన్నిటికి మానం డాత్మధర్మస్థితిన్. ఆ. ౧.

మ. అకటా చేరెడుకూలిబియ్యమునకై యత్యంతనిత్యాన్నదా
నకళావైభవలక్ష్మికిన్ నిలయమా నాతల్లిహస్తాబ్జ మిం
తకృశీభావము నొంది క్రిందుపడఁగా నాగుండె యెంత్తే వికా
వికలై ప్రీలక నిల్చియుండెఁ గఠినోర్వీభృద్విపత్పాసిమై. ఆ. ౨.

ఉ. బాలుఁడు వీని నింతకును బాముల నొందఁగనీక పెంచితిన్
దాళఁగఁజాలఁ డాఁకలికి దప్పికి వేళ యతిక్రమించినన్
మే లొనరింపఁ గై కొనిన మిమ్ముఁక నేమనివేఁడుకొందు నా
జాలి దొలంగు టెట్లు మునిసత్తమ సత్కృప నానతీయవే. ఆ. 3.

ఉ. సంతసమొంది యప్పుడ వెసన్ మగుడం జని ప్రాణనాథ యా
వంతయుఁ జింతలేదు భవదాత్మజ మున్నుగలేచి పాదుకల్
కాంతునిమ్రోల నిడ్డ నెనకంబుగఁ దల్పము డిగ్గు నారతీ
కాంతునిబోలు నాఘనుని గన్నులపండువుగాఁగ జూచితిన్. ఆ. ౪.

# 44. చింతకుంట కోదండరామకవి

ఈకవి సునందాపరిణయమును నామాంతరముగల ప్రదీపచరిత్రము నైదాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఇతఁడు నందవరీక నియోగి బ్రాహ్మణుఁడు, అక్కనమంత్రిపుత్రుఁడు. కవి తన వంశజులలో సుప్రసిద్ధుఁడయి యుండిన రాయనభాస్కరు నిట్లు వర్ణించియున్నాఁడు—

సీ. ఘనతరౌదార్యదీక్షాకల్పితానల్పకరనిబద్ధసువర్ణకంకణుండు
ఆసేతుశీతనగాంతరరాట్సభామధ్యవిశ్రుతకీర్తిమండలుండు
కొండపల్లి వినకొండ దుర్గద్వయీదేశప్రజావనధీయుతుండు
సకలావనీపకసంతానయాచితవస్తుప్రదానప్రవర్తనుండు
అన్నవేమమహీశదత్తాగ్రహార।
మదకలాందోళికాశ్వసన్మణివిశేష।
భూషణాద్యష్టభూతివిభూషితుండు।
భానుతేజుండు రాయనభాస్కరుండు.

ఈకవి ౧౭౫౦ వ సంవత్సర ప్రాంతమునం దుండినవాఁడు. ఈతని కవిత్వము మొత్తముమీఁద రసవంతమయి హృద్యముగానే యున్నది. సునందాపరిణయములోని కొన్నిపద్యము లిం దుదాహరింపఁబడు చున్నవి—

శా. సేవార్థాగతకామినీనికరకాంచీకింకిణీకంకణా
రావంబుల్వివిధోరువాద్యపటలీరమ్యధ్వనుల్ భవ్యభూ
దేవాగ్రేసరగానసంయుతములై దిక్కుల్ తగ నిండఁగా
దేవాగారము లొప్పు నప్పురమునన్ దేదీప్యమానంబులై. ఆ. ౧.

ఉ. ఇమ్మెయిఁ బెట్టుచాయ లవియెన్నఁగ నేటికి నైజకాంతిచే
నిమ్మదిరాక్షి మోముసరి యిచ్చట నెచ్చట లేదు చూడ నీ
నెమ్మది సంశయం బయిన నిక్కము చేసెద నిప్పు డాన నా
తమ్ములమీఁదఁ బెట్టుకొనెదన్ ద్విజరాజుకుఁ జేయిసాఁచెదన్. ఆ. ౨.

ఉ. కుంజరయాన కాంచె నవకోరకనూనపరీతమంజరీ
మంజులపుంజరంజితసమంజసభవ్యనికుంజసంభ్రమ
ద్గుంజదమందషట్పరణకోటిరవాంచితసద్దిగంతమున్
గంజముఖీవిలాసపశుకాంతనిశాంతము నవ్వనాంతముక. ఆ. 3.

ఉ. అన్నువులార నావలపు నంగడిఁబెట్టకు రమ్మ చాలు మీ
మన్నన లింక నన్నుఁ బలుమాఱును వేఁడకు రమ్మ ప్రాణముల్
గ్రొన్ననవింటిదేవతకుఁ గొంకక యిచ్చెద నమ్మవాసి నే
మున్న రవంత పోవిడుట మోసమువచ్చెఁగదమ్మ బుద్ధికిన్. ఆ. 4.

ఉ. సంతమసంబుపోక నవసారసలక్ష్మికిఁ బోక యామినీ
కాంతకుఁగాక కోకకుళకంబులజోక యులూకపంక్తికిన్
జింతలమూఁక పద్మలకుఁ జెన్నగుఢాక ప్రభాతకాలపున్
వింతకురాక శోణరుచి విన్నగఁబ్రాఁకి చెలంగె దిక్కులక. ఆ. 5.

---

# 45. కైప మాయనకవి

ఇతఁ డుషాకల్యాణ మనఁబడెడి యైదాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఈతఁడు వైదికబ్రాహ్మణుఁడు; మహాదేవశాస్త్రికిని కామాక్షికిని బుత్రుఁడు. ఈకవి యుషాకల్యాణమునందుఁ దనజనకుని నిట్లు స్తుతించెను—

క. కామాహంకృతిహరణుఁడు
కామాక్షీధవుఁడు విబుధగణవినుతగుణ
స్తోముడు సర్వజ్ఞుఁడు ని
స్సీమయశోధనుఁడు వృషవిశేషప్రియుఁడుక.

గీ. చిద్విలాసకళానిధిశేఖరుండు
శ్రీమహాదేవుఁ డాశ్రితశ్రీకరుండు

కైపకులవార్ధి చంద్రలింగనకవీంద్ర
పుత్రుడై యొప్పె నాకవిపుణ్యమేమొ.

గీ. ఆమహాదేవు నప్రమేయప్రభావు
ధర్మవర్ధను ననుఁగన్నతండ్రి నాత్మఁ
దలఁచి తద్దివ్యపదపద్మములను గొలుతు
నకులనతులను బృధులవినుతతతులను.

ఈకవి నూఱుసంవత్సరములకుఁ బూర్వపువాఁ డగుటకు సందేహ ముండదు. ఇతఁడు తనపుస్తకమునిండను శబ్దాలంకారములను విశేష ముగా సమకూర్చెనుగాని పుస్తకమునందు వ్యాకరణదుష్టములైన ప్రయోగము లనేకములు కానఁబడుచున్నవి. ఈశృంగార ప్రబంధము కొంతవఱకు రసపుష్టికలదిగానే యున్నది. ఉషాకళ్యాణమునుండి కొన్ని పద్యముల నిం దుదాహరించుచున్నాను–

మ. త్రిజగన్మోహనదీపమో బహుజయశ్రీపూర్ణనిక్షేపమో
యజనైపుణ్యకలాపమోతపనచంద్రాగ్నిత్రయీరూపమో
ద్విజముఖ్యస్తుతలగ్నమం దొకమహాతేజంబు తద్భీష్మకా
త్మజగర్భంబున నుద్భవించెను సమస్తానందసంధాయియై. ఆ. ౧.

ఉ. భంబులు గోళ్ళు పల్లవనిభంబులు కాళ్ళు మనోజకాహళా
భంబులు జంఘ లౌర కరభంబులు సక్థులు శాతకుంభకుం
భంబు లురోజముల్ దరనభంబులు కంఠవలగ్నముల్ ద్విరే
ఫంబులు కుంతలంబులు శుభంబు లుషాసతిలక్షణంబులున్. ఆ. ౨.

చ. అతఁడును మారుదారుణశరావళిపాల్వడి కోర్వలేమి నో
సుతనుమణీ మనీష నిటు సోలుచు వ్రాలుచుఁ దూలనేల నీ
వితరపుఁజింతఁ దక్కి నుతి కెక్కిన పేరల నోలలాడుమా
దృతముగఁ జేతుఁగావితముఁ జెల్వము సల్పుముబల్కుము వ్చటల్ ఆ.3

ఉ. ఇయ్యెడఁ దియ్యమావిచిగు రెంతయు వింతగఁ దేనె లొల్కుచున్
సయ్యనఁజాలుమేలుజిగిచాలునఁ గ్రాలు ననూనవైఖరిన్
దొయ్యలి తావకాధరముతో సరికా దవునంచు సందియం
బయ్యెడిఁ దారతమ్య మరయంజను నీ నునుమోవి నియ్యవే. ఆ.౪.

ఉ. నాకులఁ బూర్వనాకుల వినంబడ నట్టివిధంబు లొప్పఁ దన్
దాఁకుచు మిన్ను ప్రాఁకుచును దద్దయు యుద్ధముసల్పుతన్మదో
ద్రేకులఁ దమ్మితేకులవలెన్ వాలకోటి కలంకరించి పె
ల్లాఁకలిగొన్నరోకలికి నాహుతిఁ జేసెను సీరి పోరిలోన్. ఆ. ౫.

---

# 46. వెలిదండ్ల వేంకటపతి

ఇతఁడు రాధామాధవసంవాద మను మూడాశ్వాసముల ప్రబంధమును రచియించి ప్రళయకావెరి నివాసుఁడగు మగదలరామదాసున కంకితము నొనర్చెను. ఈకవి తిరువేంగళాచార్యపుత్రుఁడు. కృతిపతియగు మగదల రామదాసామాత్యుఁడు గతశతాబ్దమధ్యమునకుఁ దరువాత నుండినవాఁడయినందునఁ గవి యిప్పటికి నూఱుసంవత్సరములక్రిందట నుండినవాఁడు. ఈతనికవిత్వము మనోహరముగానేయుండును. రాధామాధవసంవాదములోని మూఁడుపద్యముల నిందుఁ బొందుపఱుచుచున్నాను—

చ. పసుచులత్రోడ నాడఁ బసిబాలుఁడవా వలదన్న మాన వా
గడములు కొన్ని నేర్చితివి కల్లరి వైతివి కొల్లకాఁడవై
దుడుకులు చేయఁజాగితివి దొంగిలఁజొచ్చితి వేమిచెప్పినన్
వడిగఁ బరాకుచేసికొని వాకిటి కేగెదు పిల్వఁ బిల్వఁగన్. ఆ. ౧.

ఉ. ఏవగవారుచేసిన సహించి తనంతటివారిఁ జేయుచున్
దైవము దాత తల్లియును దండ్రియుఁ దానయి ప్రోవఁగా జగ
త్పావనమూర్తియౌ తనకుఁ బావనమే తనుఁగన్న దేవకీ
దేవిని దన్నుఁగన్నవసుదేవుని నాపదఁ బాచి ప్రోచుటల్. ఆ. ౨.

ఉ. ఒక్కతె భ్రాంతిచేఁ బొరల నొక్కఁడు మానుషఁబూఁటకాఁపె నే
నెక్కడిదాన నీవు మును పెక్కడివాఁడవు నాకు నీకు నే
మక్కఱ వెక్కసైన నొక రాడెడుపల్కులు నేన పల్కెదఁ
గ్రుక్కఁగ నాయెఁబోయె నవి కొన్నిదినాలుఋణానుబంధముల్. ఆ. 3

---

# 47. పట్టమెట్ట. సరస్వతి సోమయాజి

ఇతఁడు పృథుచరిత్ర మను ప్రబంధమును రచియించి దాక్షారామ భీమేశ్వరున కంకితముచేసెను. ఈకవి యాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; హారితసగోత్రుఁడు; పోతనామాత్యపౌత్రుఁడు; పెద్దనార్యపుత్రుఁడు; శివలంక గౌరనార్యునిశిష్యుఁడు. ఈశ్వరుఁడు స్వప్నమున సాక్షాత్కరించి తన్నుఁగూర్చి యిట్లు పలికెనని కవి గ్రంథాదిని చెప్పుకొని యున్నాఁడు—

సీ. నవఘంటసురతాణినామధేయమువాఁడు తాత, వెల్వలపల్లి పోతరాజు
కవిశేఖరుం డనఁ గవిధూర్జటి యనంగఁ బెనుపొందుటనకుండు పెద్దిరాజు
సవనదీక్షామహేశ్వరుఁడు శ్రీరఘునాథ సోమయాజి నిజాగ్రజుండు
గురుఁడు
తల్లి పాతివ్రత్యధర్మబుద్ధికదంబ కారుణ్యజగదంబ పేరమాంబ
నీకు మద్వారలబ్ధవాణీప్రసాద
మంగళవచంబు సకలవిద్యాస్థలములఁ

బట్ట మొట్టాంక వెల్వలఁ లివృషాంక
సోమయాజి సరస్వతిసోమయాజి.

ఉ. శైవులలోఁ పలం బరమశైవుఁడు వేదపురాణవాణిచే
దైవగురుండు నీగురుఁడు ధన్యుఁడు శ్రీశివలంకవారిలో
దేవనిభుండు భక్తిశివదేవుఁడు గౌరయగారు తత్కృపన్
బావనకీర్తిఁ గాంచితివి బాలసరస్వతి దీక్షితాగ్రణీ.

ఈకవి కవిత్వము శబ్దార్థాలంకార భూయిష్ఠమయిమృదుమధుర పదఘటితంబయిసలక్షణమయి హృదయకర్ణ రంజకముగా నున్నది. ఈతని పృథుచరిత్రమునందలి శబ్దాలంకారరీతిని జూపుటకయి యొకపద్యము నిందుఁ బొందుపఱుచుచున్నాను—

సీ. హస్తకంకణములు హస్తకంకణములు పదసంపదధికసంపద లొసంగ
మఖజాతవేదంబు ముఖజాతవేదంబు స్వర్గాపవర్గరాజ్యము లొసంగఁ
గళ్యాణతత్వంబు కళ్యాణతత్వంబు సగుణనిర్గుణవృత్తిచయ మొసంగ
సత్యానుకూల్యంబు సత్యానుకూల్యంబు సాధ్వీశ్వరత్వంబుసంఘటింపఁ
బరఁగుదైవతకులశిరః ప్రకటకుసుమ
మంజుమకరందధారాసమంజసాంఘ్రి
పద్మసన్నిధిసన్నిధిప్రభవవిభవ
శాశ్వతశ్రీకరుండు సర్వేశ్వరుండు.

ఈకవి గోదావరీ మండలములోనివాఁడనుట వేఱుగఁ జెప్పనక్కఱలేకయే కృతిదాక్షారామభీమేశ్వరుని కంకితము చేయఁబడుటచేతనే తెలిసికొనవచ్చును. ఇతఁడు నూఱుసంవత్సరములకుఁ బూర్వమునందుండినవాఁడు. ఇతని పృథుచరిత్రములోనికొన్నిపద్యముల నిందుదాహరించుచున్నాను—

చ. మలయుఁ బురంబునన్ నిరుపమానవిమానసమానధామకో
మలలలనామనోరమసమాగమభోగమదాంతతాంతతా

జలకలికానికారముఖసారసగంధసుగంధసారముల్
మలయమరుత్కిశోరములు మారవిహారకరప్రచారముల్. ఆ. ౧.

శా. చూపుంజూపును వియ్యమయ్యె సతికిన్ క్షోణీతలస్వామికిన్
దూపుందూపును వియ్యమయ్యె రతికిన్ దోర్దర్పరతిస్వామికిన్
జాపాభ్యాసము చూడుడీ సభ మహాచాతుర్య మన్నట్లు త
ద్భ్రూభారిప్లవచేష్ట లొప్పెం బనిచూపుల్ వ్రీడనుల్లంఘఁగన్. ఆ. ౨.

చ. కదలిరి పాతకోత్తములు గాముకులుం గవులు న్మహాకవుల్
మెదలిరి సత్ప్రియాణమతి మిశ్రితమిశ్రితతుల్ నిజాశ్రితుల్
పొదలిరి వాంఛితార్థపరిపూర్ణసువర్ణసువర్ణసంతతుల్
తదనుమతిం బురంబులకుఁ దత్పరదత్పరతత్పరాగతిన్. ఆ. 3.

చ. అలసితి రమ్మలార కుసుమాపచయం బొనరించి దండ మీ
యలయిక లేనడంతు నని యంబురుహాకరలక్ష్మిపంపు నె
చ్చెలు లనఁ జెల్వలం దరలిచెన్ జలజోత్పలకహ్లారవాసనా
లలితమదాళినీకలకలంబుల శీతలవాతపోతముల్. ఆ. ౪.

---

# 48. అవుడూరి కిచ్చయ్య

ఈకవి కాళిదాసప్రణీత మయినరఘువంశమహాకావ్యమును పది యాశ్వాసముల గ్రంథముగా రచియించెను. కిచ్చయ్య నియోగిబ్రాహ్మణుఁడు; గురువమామాత్యుని పుత్రుఁడు; హారితసగోత్రుఁడు; చెన్న కృష్ణశాస్త్రిశిష్యుఁడు. ఇతఁడు నూఱు నూటయేఁబదిసంవత్సరముల క్రింద టనుండినట్టు తెలియవచ్చుచున్నది. ఆంధ్రరఘువంశకావ్యము సంస్కృత కావ్యమంత మనోహరముగా లేకపోయినను మొత్తముమీఁద రసవంతము గానే యున్నది. కవిత్వశైలి తెలియుట కయి రఘువంశమునుండి రెండు మూఁడుపద్యముల నిందు బొందుపరుచుచున్నాను—

ఉ. ఉన్నతమర్త్యలభ్యపద మొందెదనన్మతి నూర్ధ్వబాహుఁడై
యున్న సగర్వఖర్వమనుజోత్తముకై వడి మందబుద్ధి యై
కొన్ననరుండు సాధుకవికుంజరకీర్తి వహించ నెంచినన్
సన్నుతిచేయఁబోవుదురొకో సత్కవులైనసమస్తభూజనుల్. ఆ. ౧.

చ. పొలఁతిరో! విన్ము మత్తియపుఁబూసలఁబోలెడుబాష్పవారిబిం
దులఁ బరిపంథిధాత్రిపవధూస్తనపాళిని బ్రస్తరించునీ
కలితమహారాజుఁడైనమహీకాంతునిచేత సమర్పితంబులై
యలరె గృహీతసూత్రకములై తగుమౌక్తికతారహారముల్. ఆ.౪.

మ. తనపై విశ్వసనంబు పంక్తిముఖధూర్తస్వాంబునన్మాన్పచెం
దనియీభూజను లియ్యెడన్ నిజచరిత్రంబంను విశ్వాస మొం
దినమీయాజ్ఞఁ బరిగ్రహింతుఁ దనయూత్పింగాంచి శోభిల్లు న
జ్జనకత్మావిభుకూర్మిపుత్రినని కౌసల్యాతనూజుం డనన్. ఆ. ౮.

ఈకవి రఘువంశముగాక మాధవాభ్యుదయ మను మఱియొక ప్రబంధమునుగూడ రచియించెను. ఈక్రింది రెండుపద్యములును మాధవాభ్యుదయములోనివి–

ఉ. అంతట నొక్కనాఁడు చతురాస్యుఁడు వేదచయంబుఁగానమిన్
వంతదురంతచింత బలవంతము పంతముసంతసిల్ల శ్రీ
కాంతనితాంతకాంతశతకంజయుగంబు మదిన్ ఘటించి య
శ్రాంతభయైకభక్తిఁ గిరసారసముల్మకుళించి యిట్లనున్.

శా. త్రుంతున్ సోమకు నుద్ధరింతు నిగమస్తోమంబు లంచున్ రమా
కాంతుం డొందె సువర్ణసంఘటితజాగ్రత్పుష్పవర్ణీకృతా
తాంతోత్తాలకరాళవాలహతి ఘూతప్రాదిసీశాపృష
త్సాంతానాహతివిప్లుతత్పురతరూద్యఘాసమీనాకృతిన్. ఆ. ౧.

# 49. తక్కెళ్లపాటి లింగన్న

ఆధునికుఁడైన యీకవియొక్క కాల మెప్పుడో నిశ్చయముగాఁ దెలియలేదుగాని యితఁ డించుమించుగా నూఱు నూటయేఁబదిసంవత్సరములక్రిందట నుండినట్లూహించఁదగియున్నది. నూఱుసంవత్సరములక్రిందట రచియింపఁబడిన లక్షణగ్రంథములలోసహిత మీతనిగ్రంథములలో నుండి లక్ష్యములుగాఁ గైకొనఁబడిన పద్యములు కానరావు. అట్లు కైకొనఁబడకపోవుట కీతనికవనము లక్షణవిరుద్ధముగా నుండుటయే కారణమయి యుండవచ్చును. కవి తాను రచియించిన గ్రంథములపేళ్ళ నుత్తరహరిశ్చంద్రకథలోని యీక్రింది పద్యమునఁ జెప్పికొనియున్నాఁడు—

సీ. తగ రచించితిని మదనమోహినీవిలా
    సంబు మెప్పుగ యౌవనంబునందు
భక్తిసూర్యతనయాపరిణయం బనెడు ప్ర
    బంధంబుఁ జెప్పితిఁ బ్రౌఢిమమున
నావెన్క విద్యుత్ప్రభావిలాసము వేడ్క
    ఘటియించితిని యక్షగానరీతి
నఱువది యేండ్లప్రాయమున నుత్తరహరి
    శ్చంద్రాఖ్యకథ యిది పారమతిని
వేంకటేశ్వర శ్రీరామవిభుల కెలమి
నంకితంబుగ మునుచెప్పినట్టికృతుల
రీతి నిది కృష్ణునకు సమర్పించి యిప్పు
డిలను ధన్యుండనైతి నార్యులు నుతింప.

వీనిలో మదనమోహినీవిలాసమును, సూర్యతనయాపరిణయమును, ఉత్తరహరిశ్చంద్రకథయు, పద్యకావ్యములనియు, విద్యుత్ప్రభావిలాసము యక్షగానమనియు, పైపద్యమువలననే తెలియవచ్చుచున్నవి.

ఈకవి నియోగిబ్రాహ్మణుఁడు; హారితసగోత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; చిట్టియ్య పౌత్రుఁడు; వేంకటపతిపుత్రుఁడు. ఈతని తల్లి పేరు సూరమ్మ. ఇతనిది రసవంతమైన ప్రౌఢకవిత్వముకాదు; యౌవనకాలమున రచియించిన గ్రంథములలోనేకాక యిరువదియేండ్లు వచ్చినతరువాత రచియించిన యుత్తర హరిశ్చంద్రకథలో సహితము లక్షణవిరుద్ధము లయినప్రయోగము లనేకములు కానఁబడుచున్నవి. ఈతనిగ్రంథములలోని రెండేసిపద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి.

మదనమోహినీ విలాసము.

ఉ. అక్కట మానివర్యుఁ డమరాధిపుతోఁ బలుకంగ నూరకే
గ్రుక్కిన నుండలేక ప్రతికూలుఁడనై పరుషంబువల్కి నే
నిక్కడి కేలవచ్చితి సహింపఁగరాని వియోగవహ్నిచేఁ
బొక్కఁగనేల దేవవిటపుంగవు లింతకు నవ్వకుందురే.

ఉ. కమ్మనివింటిబోయ యొడికంబుగ సంజమొఱుంగుటగ్గిచే
బముక కోకదంపతులపై వడిఁ బుప్పొడిమందు కాల్పఁగాఁ
గ్రమ్మితుపాకినాళమున దారున వెల్వడునుక్కుగుండ్లునా
దొమ్మిగఁ జిమ్మరేఁగె నలతుమ్మెద లెల్లసరోవరంబులన్.

సూర్యతనయా పరిణయము.

ఉ. ఒచ్చెము లేనిరూపమహిమోన్నతి యీపతికే తగుంగదా
యచ్చున నొత్తినట్లు వెలయున్ లిఖియింపఁగ నీకెచెల్లుఁగా
కిచ్చెలువన్ వరింపఁగలఁడే యొకఁ డెందును నన్నుఁగన్న యీ
పచ్చనిశాటివాఁడె తగుఁ బంకజలోచనఁ బెండ్లియాడఁగన్. ఆ.౨.

చ. హరి యలధర్మసూతిపురి నప్పటి కుండెను వింటిరే రమా
వరుఁ డిటువచ్చునో యనుచు వారక చూచితి మిన్నినాళ్ళు నేఁ
డరుదుగ నొక్కమాట విననయ్యె ముకుందుఁడు వేఁటవచ్చి ని
ర్గరవరసూనుతోడనని సత్యమొ లే కదియున్ మృషోక్తియో. ఆ.౧.

ఉత్తరహరిశ్చంద్ర కథ.

చ. జలరుహబాంధవాన్వయనిశాధవ! యోనరనాథ! నేఁడుగా
ఫలితము లయ్యె మాక్రతుజపవ్రతహోమతపఃప్రభావముల్
కలఁగి మహాపద ల్గడచి కాంతయు మీరును బుత్రరత్నముక్
వలనుగ సర్వరాజ్యవిభవంబు వహింపఁగఁ జూడఁగాంచుటన్.

మ. సకియా! యేను త్రిశంకుసూనుఁడ హరిశ్చంద్రుండు నాపేరు పా
యక సైన్యావళితోడ ఘోరమృగయావ్యాసక్తచిత్తుండనై
ప్రకటారణ్యగిరీంద్రసానువులు చేర న్వచ్చి వర్తించుచో
నొకక్రోడం బలయించి చిక్కు కరుదే నొక్కండఁ దీవ్రంబుగన్.

# 50. గుడిపాటి కోదండపతి

ఈకవి శృంగారరసమంజరి యనుపేర భానుమిశ్ర విరచిత మైన రసమంజరిని మూఁడు గుచ్ఛములనుగాఁ దెనిఁగించెను. ఈగ్రంథము శృంగారనాయికానాయకలక్షణములను దెలుపునది. కవి నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు. పూర్వకాలమునందు నందుఁడను చంద్రవంశపు రాజొకఁడు కర్ణాటకదేశమును పాలించుచుండెనఁట. అతఁడు స్వీయ మహిమచేత "యోగవాగ" ముల నెక్కి రహస్యముగా బోయి ప్రతిదిన మును కాశికాపురములో గంగాస్నానమును జేసి వచ్చుచుండెనఁట! ఈరహస్యము నతని భార్య కనిపెట్టి యొకనాఁడు తన్నుగూడ వెంటఁ గొనిపొమ్మని భర్తను నిర్బంధ పెట్టెనఁట. అతఁ డామె నిర్బంధమును మానుపుకోలేక భార్యను వెంటఁ గొనిపోగా, కాశీపురమును జేరిన తరు వాత నామె బహిష్ఠ యయ్యెనఁట. అందుచేత యోగవాగములు మయిలపోఁకి నడవకపోయినందున నతఁడు స్వపురమును జేరుట కుపా

యము త్రోఁపక పరితపించి గంగాతీరమునందున్న బ్రాహ్మణులను ప్రార్థింపఁగా వారు తమకుఁ గర్ణాటక రాజ్యమునందు వృత్తుల నొసఁగు నట్లు చముడేశ్వరీసన్నిధానమునం దాతనిచేతఁ బ్రమాణము చేయించు కొని స్నానము చేయించి యాతని భార్య నప్పుడే తమమంత్రప్రభావము చేత శుద్ధురాలినిజేసి యోగవాగములను నడిపించి యారాజదంపతులను స్వరాజధానికిఁ బంపివేసిరఁట. అటు తరువాతఁ గొన్ని సంవత్సరములకు కాశీదేశమున క్షామము సంభవింపఁగా నాశ్వలాయనసూత్రు లయిన యాబ్రాహ్మణు లేనూఱు కుటుంబములవారు బైలుదేఱి పదుమూఁడు గోత్రములవారు నందుని రాజధానికి వచ్చిరఁట! అప్పుడు రాజు తాను జీవనములు కల్పించెదనన్న బ్రాహ్మణులు వీరేయని చూపుటకై సాక్షు లను దేవలయునని కోరఁగా వారు కాశీకాపురమునుండి చముడేశ్వరీ మహాదేవినే గొనివచ్చి యామెచే సాక్ష్యమిప్పించిరఁట! అంతట రాజు వారిమహిమ కద్భుతపడి తనపేరిట నందవరమను గ్రామము గట్టించి వారి కగ్రహారముగా నిచ్చెనఁట. నందవరమునందుండిన బ్రాహ్మణులగు టచే వీరు నందవరీకు లనఁబడుదురు. వీరినే కరణకమ్మలనియు జెప్పు దురు. ఈ యోగవాగములకథ యెట్టి దయినను, వీరు క్షామము సంభ వించినప్పు డార్యావర్తమునుండి దక్షిణహిందూస్థానమునకు వచ్చి తెలుఁగుదేశములో వృత్తులను సంపాదించుకొన్న విషయములో సందేహ ముండదు. ఈతెగ బ్రాహ్మణు లిప్పుడు కృష్ణా కర్నూలు బళ్లారి మండ లములలో నధికముగా వ్యాపించి యున్నారు. వీరిలో నల్లసాని పెద్దన, రాయని భాస్కరుఁడు మొదలయినవారు మహాప్రసిద్ధులు. కవి మూఁడవ గుచ్ఛముయొక్క కడపటఁ దన్నుగూర్చి యిట్లు వ్రాసికొని యున్నాడు—

సీ. శ్రీకరనందవరీకాగ్రగణ్యుండు వహిమిఱు గుడిపాటివంశభవుఁడు
 బిరుదుగా నవఖండసురతానిపేరంది మహితుఁడౌ వేంగళమంత్రిపౌత్రుఁ

డతులితుఁడౌ రంగయామాత్యతనయుండు వీరమాంబానందవృద్ధికరుఁడు
సింగన్న వెంగళ శ్రీనిధు లనుజులై భాసిల్లు కోదండపతిఘనుండు
సరసకవితాచమత్కారసార్వభౌముఁ
డవని శ్రీరంగధామదయాశ్రయుండు
నెలమి రసమంజరిని రచియించె నందు
సరవిగాఁగఁ దృతీయగుచ్ఛంబు తనరు.

ఈపద్యమునుబట్టి కవి వేంగళమంత్రి పౌత్రుఁడనియు, రంగయామాత్యునకును వీరమాంబకును బుత్రుఁడనియుఁ దెలియవచ్చుచున్నది. ఇతఁ డాశ్వలాయనసూత్రుఁడు; భారద్వాజగోత్రుఁడు. ఈతఁ డేకాలమునం దుండినవాఁడో నిశ్చయముగాఁ దెలియదు. ఇన్నూఱుసంవత్సరముల క్రిందటనుండి యుండు నేమో! ఈతని కవిత్వమునందుఁ గొన్నిదోషము లున్నను గవిత్వము రసవంతమయినదే. రసమంజరిలోని యొక్కొక్క గుచ్ఛమునుండి యొక్కొక్క పద్యము నిం దుదాహరించుచున్నాను—

చ. జలదము నాథులం గురియఁజాలెనె నీళ్లనె చిమ్ముఁ, బచ్చికల్
కలయఁగ నించెఁగా గిరులు కాంతుల నీనెనె, యెల్లవృక్షముల్
ఫలము లొసంగుఁ గాని పతిపంక్తుల నిచ్చెనె, నిర్దయాత్మ హా
కులటకుఁగాఁగ నేమి యొనఁగూర్చెఁగ నేర్చితి వంబుజాననా. గు. ౧.

చ. పదరుచు నీ విటూరికిని బైనము పోయిన నన్నమాత్రలో
నదటున మేను చిక్కి వలయంబులు జాఱెను నీదియుంగరం
బదిర యొసంగినం గరమునందు ధరించెదఁ గంకణంబుగాఁ
జెదరక యిమ్మటంచు వెలచేడియ దోఁచు నెటువ్వాటుం బటుక్. గు. ౨.

చ. ప్రతిఫలితామృతాంశువును భామముఖంబని యెంచి నాయకుం
డతులితకేలిమీఱఁ బరిహాసముచేసిన నింతయేనియుఁ
బ్రతివచనంబు లేమిఁగని పైదలి మానముఁ జెందె నంచుఁ దా
నతిపులకాంకితంబయిన హస్తముచేఁ దశవుం బ్రియుంబునక్. గు. 3.

# 51. మల్లవరపు వాలేశ్వరుఁడు.

ఇతఁడు భళ్ళాణచరిత్ర మను నైదాశ్వాసముల ప్రబంధమును రచించెను. సింధుకటక రాజయిన భళ్ళాణుఁడు జంగము లడిగినదెల్ల నిచ్చుచు భక్తి చూపుచుండెనఁట! అతని భక్తిని పరీక్షింపవలె నని శివుఁ డొకనాఁడు జంగమువేషముతో తనకుఁ బతివ్రత యగు యువతి కావలె నని యడుగఁగా, రాజు తన పట్టణమునం దట్టి స్త్రీ దొరకనందున దన భార్య యగు చెల్లమ్మనే యా జంగమున కర్పించెనఁట! శయనగృహ మున కేగినప్పుడా జంగ మామెనంట సందేహపడుచుండఁగా, చెల్లమ్మయే ముందుకుఁ బోయి యా యతిథిని గౌఁగిలించుకొనునప్పటి కతఁడు మూఁడు నేత్రముల శిశు వయ్యెనఁట! అంతట నా దంపతు లతఁడు శివుఁడని తెలిసి కొని యారాధింపఁగా, ఈశ్వరుఁడు నిజస్వరూపముతో సాక్షాత్కరించి వారికి ముక్తి నిచ్చెనఁట!

వాలేశ్వరుఁడు పాక నాఁటి నియోగి యగు శైవబ్రాహ్మణుఁడు; గౌతమస గోత్రుఁడు; పోలయామాత్య పుత్రుఁడు. ఇతఁడు తన గ్రంథ మును మల్లవరపు నాగేశ్వరస్వామి కంకితము చేసెను. కవి తన్నుఁగూర్చి భళ్ళాణచరిత్రమునం దిట్లు చెప్పుకొని యున్నాఁడు—

సీ. అనఁ బాడఁ జదువఁ జెప్పను నేర్పు సర్వజ్ఞ భోజుండు మా తాత పోతరాజు
బహుపురాణజ్ఞుండు బాంధవాశ్రితకల్పభూజంబు మా తండ్రి పోలమంత్రి
పరమశాంతుఁడు కృపాపాథోధి మా పినతండ్రి విరూపాక్షదండనాథుఁ
డఖిలవిద్యానిధి యర్థార్థిజనచింతామణి మాతాత మత్సుతుఁడు సదాశివుండు
నే వితర్కింప పరకవితావిసేవ
వదనుఁడను బ్రాఁకనాఁ డింటివాఁడ శుద్ధ
శైవుఁడను గౌతమసగోత్రసంభవుండ
నెంచఁదగు మల్లవరపు వాలేశ్వరుండ.

* * * *

మత్తకోకిల. సన్నుతం బగునట్టి వేల్పు ప్రసన్నుఁడై మముఁ బ్రోవగా
విన్నకోటవిలాతిలోఁ గడువేడ్క మల్లవరంబునన్
బన్నగేశ్వరసుప్రతిష్ఠను భక్తరక్షణ చేయుచున్.
వన్నెమీఱఁగ నాగలింగ మనన్ వసించు మహోదయన్.

ఈకవి నివాసస్థలము కృష్ణామండలమునందలి విన్నకోటసీమలోని మల్లవర మయినట్లు పయిపద్యమువలననే విస్పష్ట మగుచున్నది. కవి యెప్పటివాఁడో నిశ్చయముగా తెలియరాదుగాని యిన్నూఱుసంవత్సరములక్రిందటివాఁడయినట్లు కనుపట్టుచున్నాఁడు. భల్లాణచరిత్రములోనివి రెండుపద్యముల నిం దుదాహరించుచున్నాను—

మ. భువి రుద్రాక్షను నెవ్వ రేని మది శంభుం డంచు భావించుచున్
జెవులన్ వక్షమునన్ శిరస్స్థలమునన్ జేదోయిఁ గంఠంబునన్
వివరింపంగ ధరింతు రాజనులకున్ వీక్షింపఁగా సాటిలే
రు విరించ్యంబుజనాభకిన్నరమరుద్యక్షేంద్రలోకంబులన్. ఆ. ౨.

ఉ. కప్పురవీడెమున్ నొసటఁ గస్తురిబొట్టును జెంద్రకావియా
దుప్పటివల్లెవాటు కలదో మఱి లేదొ యనంగఁ జాల మైఁ
జిప్పిలు భూతిలేపనము, జేతను సన్నపుగౌరిబెత్త మా
మొప్పులకుప్పరూపును మహోన్నతియు న్విలసిల్లఁ జెల్వుగన్. ఆ. ౪

# 52. చింతలపల్లి వీరరాఘవుఁడు

ఈకవి మధురవాణీవిలాస మనెడి మైదాశ్వాసముల ప్రబంధమును రచియించి శ్రీవేంకటేశ్వరస్వామి కంకితముచేసెను. కవి నియోగి బ్రాహ్మణుఁడు; ఆశ్వలాయన సూత్రుఁడు; వీరరాఘవ పౌత్రుఁడు; వేంకటార్య పుత్రుఁడు. కవి తన్నుఁగూర్చి మిత్రు లన్నట్లుగాఁ దనగ్రంథమునం దీక్రిందిపద్యములను జెప్పికొనెను–

శా. సాహిత్యంబుఁ గవిత్వమున్ వివిధశాస్త్రప్రజ్ఞ సత్కర్మతా
సాహిత్యంబును దత్త్వబోధమును ద్రిస్కంధాత్మక జ్యోతిషం
బూహాపోచాతురి దేవభక్తియును నీకొప్పున్ స్వభావంబులై
యాహా చింతలపల్లి రాఘవకవీ యాథ్యుంశ వీ వన్నటన్.

మ. అవధానంబు లనేకముల్నెఱపి రాజాస్థానముల్ చేరి వా
దవిధిన్ ధీరుఁడవై చతుర్విధకవిత్వప్రౌఢిమ ల్చూపి భూ
ధవద త్తద్విపఘోటకాదిబహుసత్కారంబు గైకొన్నమి
న్నవు నీ కబ్రమె వేంకటేశ్వరుఁడు స్వప్నంబుం బ్రసాదించుటల్.

* * * *

సీ. జాములో శతకంబు సంధించి కంకణాదులఁ గొంటి వలరాయ
దుర్గమునను
బహుళావధానముల్ పఱపి నాలుగునగల్ తేజి నందితి మల్లధీరువల్ల
వాగ్ధాటిసంప్రీతి దిగ్ధరాధిపద త్తవస్తువాహనములవార్తఁ గంటి
కూపవాపీతటాకోపవనుల్చేసి స్థిరకీర్తి చెందితి పురుతరముగ
సకలభూపాలసంస్థానశంసనీయ। నిజచతుర్విధకవితాభినేయపాండి
తీసమాధాక నాపూర్ణదిక్ప్రదేశ। వీరరాఘవ నీసరి విబుధు లేరి?

పయిపద్యములయందుఁ జేర్కొనఁబడినవన్నియు నిజములయిన పక్షమున, కవి యసమానపాండిత్యమును గవిత్వకౌశలమును గలవాఁ

డయినందుకు సందియముండదు. కడపటిపద్యమునందుఁ జెప్పఁబడిన మల్ల ధీరుఁ డెవఁడో యింకను విచారింపవలసియున్నది. కవి తుంగభద్రా ప్రాంతప్రదేశములయం దుండినవాఁడు. ఈతనికాలమేదో స్పష్టముగాఁ దెలియరాదుగాని యీతఁడు పదునెన్మిదవశతాబ్దమధ్యమునం దుండిన ట్లూహింపఁదగియున్నది. కవిపూర్వులలో సహితము కొందఱు విద్వత్కవు లుండినట్లు మధురవాణీవిలాసములోని యీక్రిందిపద్యములు తెలుపుచున్నవి—

సీ. ఏధన్యుహారితత్త్వబోధాప్తి కలపుష్పగిరిదుర్గ త్రోడైనవరము సాక్షి
యేవాగ్మిసుకుమారతావృత్తికిని బినాకినిచెంత సేవింపుచునికి సాక్షి
యేమాన్యునైశ్వర్యసామాన్యతకు రాజ్యకృతిశిరోభూషణ
క్ష్మాతియె సాక్షి
యేగ్రంథకారివంశాగ్రీయతకు ఘనప్రభుమానితం బైనబ్రతుకు సాక్షి
యట్టిఘనుఁ డేకులంబునఁ బుట్టి వారి
కలిమికపిలయెకా వర మడిగికొనియె
నట్టిచింతలపల్లివంశాగ్రయాయి
పల్లకిపదస్థుఁడై మించు నెల్లసుకవి.

మ. చతురుండై యవధానము ల్సలిపి దేశాయీలు మెచ్చఁగా మహో
న్నతుఁడై యప్పకవీశ్వరుండు గిరియానారీవతంసంబునం
దతివిద్యానిధి సాహితీనిపుణు రాజాస్థానసంపూజ్యా నం
చితవాగ్ధాటిఁ బ్రబంధకర్తఁ గవిసంజీవాఖ్యుఁ బుత్రుం గనెన్.

ఈకవి సంజీవాఖ్యుఁడు చంద్రాంగదోపాఖ్యానమును ప్రబంధమును రచియించెను. వీరరాఘవకవియొక్క కవిత్వము ప్రౌఢమైనది. ఈతని మధురవాణీవిలాసమునుండి రెండుపద్యము లిందుక్రింద నుదాహరింపఁబడుచున్నవి—

శా. కాసారస్థితిఁ బూని నీచులకు యోగ్యంబై విషప్రాయమై
గాసి న్మేకొనుకంటకంబుల నిజాంగం బెల్ల సచ్ఛిద్రమై
యేసూత్రంబున బల్మినేని బిస మాహేలావతీబాహుశా
ఖాసామ్యం బెటువొందు నా నిజ మథఃపాతిక్ సిరుల్పెంచునే. ఆ-౨

చ. వలనగుపుష్పమంజరులు బంగరుతీఁగెలు ముత్యపున్సరుల్
వెలయు పునుంగుతావు లిడ వెన్నెలకుప్పలువోలె రాజభో
గులు నగునవ్విలాసినులు కోట్నమునం దటు వట్టిధాన్యముల్
సొలసి సువాలు పాడుచును సుంకులు నించిరి మించి రమ్యత౯. ఆ-౫

# 53. రేచర్ల మాధవరాయకవి

ఈకవి చంద్రికాపరిణయ మనెడి యాఱాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఇతఁడు పద్మనాయకకులజుఁడు; సురభి మల్లక్ష్మమాపాల పుత్రుఁడు. ఈచంద్రికా పరిణయములోనికథ బాలసరస్వతికృతమైన చంద్రికాపరిణయములోనిదానికంటె వేఱయినది. ఇందు కథానాయకురాలగు చంద్రిక పాంచాలరాజుకూఁతురు. ఈకవి నూటయేఁబదిసంవత్సరముల క్రిందట నుండియుండవచ్చును. ఈకవి కవిత్వము తెలియుటకయి చంద్రికాపరిణయములోని రెండుపద్యముల నిందుఁ జూపుచున్నాను—

శా. వింటే మన్మథ మత్ప్రభుత్వమున కుర్విం బుట్టువిఘ్నావళిన్
గెంటం దార్చుచు మామకాత్మహితభంగి న్మించు నీ వుండుటల్
కంటంగానక బ్రహ్మభావముకడుం గాంక్షించి యొక్కండు పెక్
గొంటుందాపసుఁ డెచ్చినాఁ డిలఁ దపఃకుల్యాధ్వసంచారియై. ఆ-౨

చ. పలుచనివారికిం బొడమి భాసురపుణ్యజనాహితాత్మునిం
గలసి చెలంగ నొప్ప దని కల్మివెలంది తలంచి ధాత్రి ని
య్యలఘునకుక్ జనించె సముదంచిత పుణ్యజనాప్తు నొక్కరా
జు లలి వరింపఁగోరియని పొంపుగ నెంచిరి కొంద ఱాత్మలన్. ఆ-౫

# 54. అనియాది గణపతిదేవుఁడు

ఇతఁడు శివయోగసార మను గ్రంథమును రచియించెను. ఈవే దాంతగ్రంథము పూర్వోత్తరభాగములు గలదయి, భాగమొకటికి నాలు గేసి యాశ్వాసములుగలదిగా నున్నది. ఈకవి నియోగిబ్రాహ్మణుఁడు; మూలనామాత్యుని పుత్రుఁడు. ఈతనికవిత్వము ప్రౌఢమయి హృద్య ముగానున్నది. ఈతఁడే కాలపువాఁడో సరిగా తెలియదుగాని యిన్నూ ఱుసంవత్సరములకుముందే యుండినవాఁడయిన ట్లూహింపఁదగియు న్నాఁడు. శివయోగసారమునుండి కొన్నిపద్యముల నిం దుదాహరించు చున్నాము—

పూర్వభాగము.

చ. ప్రమదముతో నొకింతయినఁ బాత్రున కీగి మహాఫలం బగున్
భ్రమసి యపారవిత్తము లపాత్రున కిచ్చినఁ గీడు పొందు ఘూ
సము నొసఁగంగ దుగ్ధములఁ జాలఁగ ధేనువు లిచ్చు నట్టిదు
గ్ధములొసఁగన్ విసంబొలుకుఁగాదె భుజంగమయూథమిమ్మహిన్. ఆ ౧

ఉ. ఈక్రియ గర్భ మేర్పడిన నెంతయు భీతి జనింపుచుండఁ జిం
తాకులచిత్తయై కటకటా యిదియేమినిమిత్తమో కదా
నాకని కన్నుఁదమ్ముల ఘనమ్ముగ బాష్పము లేగుదేరఁగా
శోకభరాబ్ధిలో మునిఁగి సుందరి కోకిలవాణి యేడ్వఁగన్. ఆ. ౨.

మ. మొనయన్ జీవనచింతఁ బొట్టుపొరలై యేప్రొద్దువర్తించు నీ
చునియందుం గలశీలసూనృతగుణస్తోమంబు లిట్లన్నియున్
దనరం బక్వముకానికుంభమున యత్నంబార నిండంగఁ బో
సినవార్వారముభంగి నాశ మగుఁ జర్చింపంగ దేహంబుతోన్. ఆ-3

ఉత్తరభాగము.

శా. శాంతాకారుని నాత్మసంస్థితు శివున్ సత్కాంతిసంపన్ను న
శ్రాంతంబుం దమయాత్మలో సుజను లారాధింతు రాయీశు న

య్యంతర్యాగవిహీను లల్పమతు లుద్యద్బాహ్యకర్మైకవి
భ్రాంతుల్బాహ్యమునందుఁగొల్తురధికప్రాయాసముంబొందుచున్. ఆ. ౧

శా. దేహం బస్థిరమౌటఁ గన్గొని మదోద్రేకంబునం బొంద కా
దేహంబు న్మనమున్ ధనంబు నతిభక్తిన్ సద్గురుస్వామికిన్
నీహారాద్రిసుతామనోహరునకున్ నిత్యంబు సద్భక్తియు
క్తాహీనాత్ములకున్ వివేకులకు వా రర్పింతు రెల్లప్పుడున్. ఆ. ౨.

మ. గుహలోన న్వసియించునొండెఁ దిరుగున్ క్షోణీతలంబందు ని
స్పృహవృత్తిన్ వివిధక్రియాకుశలుఁడై పెంపొందుఁ గాదేని ప్ర
త్యహము న్నిష్క్రియుఁడై నసౌ నిజసమాధ్యాసక్తచిత్తుండు స
ర్వహితైకస్థితిఁ బెక్కుచేష్టలమరన్ వర్తించు స్వేచ్ఛాగతిన్. ఆ. ౪.

ఉ. బోరన భేదవాదములు పుణ్యము పాపము సంశయంబు శా
రీరమునన్ బ్రవృత్తులఁ బరిభ్రమఁ దృష్ణను బాసి యెవ్వఁడే
ధారుణి నిర్గుణం బయినతత్వముఁ జూవఁ జరించుచుండు నా
ధీరున కేలగల్గును మదిం దలఁప న్విధియు న్నిషేధమున్. ఆ. ౪.

---

# 55. వేంకటాచార్యుఁడు

ఈకవి ముక్తిచింతామణి యనుపేర జగన్నాథమాహాత్మ్యమును నాలుగాశ్వాసములగ్రంథమునుగా రచియించెను. ఈకవి వైష్ణవ బ్రాహ్మణుఁడు; యతిరాజకుల పెరుమాళ్ళాచార్యుల కుమారుఁడు.

"ఇట్లు గురుపరంపరానుసంధానపూర్వకంబుగా శ్రీజగన్నాయకుని కంకితంబుగా ముక్తిచింతామణిప్రబంధం తెనుంగు చేయుమని రాజమహేంద్రవరాధ్యక్షపద్మనాయకాగ్రేసర కోన తిమ్మరాయకృత కనకాంబరాభరణానులేపనపూర్వకసమర్చన ప్రేరితుండనై"

అని. కవి వ్రాసికొనియుండుటనుబట్టి రాజమహేంద్రపుర ప్రభువైన కోన తిమ్మరాజు ప్రేరణముచేత నీగ్రంథము చేయఁబడినట్టు తెలియవచ్చుచున్నది. ఈగ్రంథ మిన్నూఱు సంవత్సరములకు ముందే చేయఁబడినదేమో! జతన్నాథమాహాత్మ్యకవిత్వము రసవంతముగానే యున్నది. ఇందుండి కొన్ని పద్యములఁ జూపుచున్నాను—

శా. ధర్మాధర్మవిచారము ల్విహితసంధ్యాపూర్వయజ్ఞాది స
త్కర్మంబుల్ నిరతాన్నదాన నియతుల్ కాలానుగుణ్యక్రియల్
మర్మం బీపురుషోత్తమస్థలములో మర్త్యాళి కెల్లన్ భవ
న్నిర్మాల్యగ్రహణం బటంటి రిఁక నీసత్యక్రియల్ వ్యర్థమే. ఆ. ౧.

ఉ. నిద్దురరాఁ బరుండుటయె నిక్కపుమ్రొక్కగు నిద్రయోగమాఁ
దద్దయు వ్యర్థహింస క్రతుధర్మ మగున్ నిరతాన్నదుష్టమా
చద్ది మహాప్రసాద మగు సన్నుతియౌను నిరర్థకోక్తియే
ప్రొద్దును నిత్యవాసు లగుపుణ్యులకుం బురుషోత్తమంబునన్. ఆ-౨

ఉ. హీనుఁడు ముట్టినాఁ డనుచు నెంచి మదీయమహాప్రసాదమున్
దా నుపభుక్తియోగ్య మవి తత్పరబుద్ధిఁ బరిగ్రహింపకే
మానిన సద్విజుండు హృతమంగళుఁడై భవరోగభారియై
న్యూనతఁ జెంది పంచమనియోగమునందు వసించు నెప్పుడున్. ఆ-3

మ. జలజాక్షుండు రథంబుపైఁ గదలఁ దచ్ఛాయాసమాక్రాంతుఁడై
ఖలుఁడైనన్ ఘనపాపము ల్దలఁగు సాకాంక్షన్ దదుద్యద్ధ్వజా
కలనోద్భూతరజోభరాంకితుఁడు వాక్కాయాంతరాఘంబులన్
గెలుచుం దత్సురసింధుమజ్జనఫలోపేంద్రప్రభావుం డగున్. ఆ. ౪.

# 56. లింగకవి, గంగకవి

ఈయిరువురుకవులునుజేరి సీతావిజయ మనునామాంతరము గల శతముఖరామాయణమును రచించిరి. ఈయిరువురుకవులు వేదాద్రిపుర నివాసులు. వీరిలో నీలకంఠోపాసకుఁ డయిన లింగకవి తాను రచియించిన మొదటి మూఁడాశ్వాసములును చిన్నారెడ్డిపుత్త్రుఁ డగు పోచనృపాలున కంకితము చేసెను; నృసింహోపాసకుఁడగు గంగకవి తాను రచియించిన నాలవయాశ్వాసమును భోగనృపాలుని కంకితముచేసెను. ఈ యిరువురకవిత్వమును మొత్తముమీఁద రసవంతమయి నిర్దుష్టమయి హృదయంగమముగా నున్నది. ఈకవు లిన్నూఱుసంవత్సరములక్రిందట నుండినట్టు తెలియవచ్చుచున్నది. వీరి కవనధోరణి తెలియుటకయి శతముఖరామాయణములోని పద్యములొక్కొక్క యాశ్వాసమునుండి యొక్కొకటి యిం దుదాహరింపఁబడుచున్నది—

చ. శతముఖనామధేయుఁడొకచండనిశాచరలోకనాథుఁ డు
గ్రత నలపంక్తికంఠఘటకర్ణపురందరజిత్ప్రహస్తు లీ
క్షితిఁ బడు టంతయుఁ హితులచే విని రామునిమీఁద నాదటన్
ఘృతయుతపావకుండుబలెఁ గీలలు గ్రక్కుచుమండెఁగ్రక్కునన్. ఆ-౧

ఉ. రాముని బంక్తికంధరవిరాముని నీలపయోదకోమల
శ్యాముని మానిహృత్కుముదసంచయసోముని సత్యభాషణ
స్తోముని సార్వభౌముని విశుద్ధసుకీర్తిగుణాభిరాముని
ధీమణి యైనభానుజుఁడు దిగ్గనఁ గాంచి ముదంబు చేకొనెన్. ఆ. ౨.

శా. ఏరా యోరివనేచరాధమ భయం బింతైననున్ లేక ప్రా
కారంబు ల్వెసదాఁటి తెట్లు మఱి పీఁకందాఁటి దుర్భీషణా
కారం బొప్పఁగవచ్చు టెట్లు తగవల్కన్వచ్చి నాముందటన్
ధీరత్వంబున నిల్చు టెట్టు లిది చింతింప న్మహాశ్చర్యమా. ఆ. 3.

ఉ. రాయనుఁ బోకుమంటిఁగదరాయను నిన్నిఁక బాసి యోర్వలే
రాయను హా శతద్వయఃకరాయను మమ్మిఁక బాధపెట్టవే
రాయను నీతనూజుఁ గనరాయను నెక్కడఁగందురా కుమా
రాయను నల్ల నేల వినురాయను హా శతకంధరాయనున్. ఆ. ౪.

---

# 57. అంగర నృసింహకవి

ఇతఁడు రాజరాజాభిషేక మనునైదాశ్వాసముల ప్రబంధమును రచియించి, కొప్పుల వల్లభూవరున కంకితము చేసెను. ఈకవి రామకృష్ణ భట్టారకుని కుమారుఁడు. ఈకవి యేకాలపువాఁడో నిశ్చయముగాఁ దెలియరాలేదు. ఇతఁ డల్లసాని పెద్దనాదులను బేర్కొనక శ్రీనాథునివఱకును గలకవులనుమాత్రమే కవిస్తుతిలోఁ జెప్పియుండుటచేతను మధ్యకవులుమాత్రమే పేర్కొన్న చిమ్మపూడి యమరేశ్వరుని సంస్తుతించి యుండుటచేతను నృసింహకవి మధ్యకవులలోనివాఁ డేమోయని సందేహముకలుగుచున్నది. ఇతఁడు చేసినకవి స్తుతిపద్యముల నిం దుదాహరించుచున్నాను—

క. భారతఘట్టోల్లఘన । పారీణకళాధురీణబంధురధారా
ధీరప్రబంధగంధ । ర్వారూఢుని భట్టనన్నపార్యునిఁ దలఁతున్.

ఉ. అంజలిచేతుఁ బద్మజనిశాంతకరాంతనిరంతరోల్బణ
న్మంజులవల్లకీమధురమంద్రనినాదసముల్లసధ్వని
వ్యంజకవాఙ్నిగుంభనసమంచితనూతనసృష్టిచాతురీ
రంజితసత్కవీంద్రబుధరాజికిఁ దిక్కనసోమయాజికిన్.

ఉ. ఇద్ధగుణుం బ్రబంధపరమేశ్వరు నెఱ్ఱనప్రెగ్గడన్ మనంగ
పద్ధతి నిల్పి సూక్తిరుచిభాస్కరుఁడై నహుంళిక్కి భాస్కరున్

బుద్ధి ఘటించి సంతతము పూనిభజింతు వచఃప్రసాదసం
సిద్ధునిఁ జిమ్మపూడి కులశేఖరు నయ్యమరేశ సత్కవిన్.

క. పాథోధిపయోభర ని। ర్మాథచలద్ఘుమఘుమాయమానలహరికా
పాథేయదాయినూక్తి స। నాథున్ శ్రీనాథు నెమ్మనంబునఁగొలుతున్

ఈగ్రంథ మొకవేళ మధ్యకవులకాలములోని దేయైనను దీనియందు లక్షణవిరుద్ధములైన ప్రయోగములు కొన్ని కానఁబడుచుండుటచేత నప్ప కవీయాదులు తమలక్షణగ్రంథములలో నిందలిపద్యముల నుదాహరింపక పోయియుండవచ్చును. కృతిపతినిబట్టి సహితము కవియొక్క కాల నిర్ణయమును జేయుట కిప్పు డాధారములు దొరకలేదు. కృతినాయకు నకు కొత్తాపురము రాజధానియైన ట్లీక్రిందిపద్యమునఁ జెప్పఁబడినది—

సీ. ఏదు రయ్యె నేవీటికోటలోపల వైశ్యసుప్రతిష్ఠితుఁ డైనశూలపాణి
పాయలేఁ డేవీటిపర్యంతవనవాటి మిండరాయఁడు లక్ష్మీధవుండు
నిండారు నేవీట నెండకాలమునందు జలజాకరం బైనసాగరంబు
చదు రొందు నేవీట సార్వకాలిక ఫలస్ఫురితంబు వేడంగి పాఁకతోఁట
సురపురంబునకైన నబ్బురము లగుచు। విల్లసిఁగుచునుండు నేవీటిసిరులు
వసుమతీపాదపద్మసంవళితరత్న । నూపురంబగునట్టి కొత్తాపురంబు

ఈకొత్తాపురము విశాఖపట్టణమండలములోని కొట్టాము గ్రామ మేమో! ఈపురాధిపతియయిన కృతిపతి శూద్రకులసంజాతుఁడు.

సీ. మూర్ధాభిషిక్తులముకుటంబు లేరాజుపాదపీఠికకు సోపానపంక్తి
చతురబ్ధివలయితక్షితితలం బేరాజుబాహుదండమునకు బాహుదండ
భువనంబు లేలుకప్పురగంధి యేరాజులీలాకటాక్షపాళికకు నీడ
రజనికాంతజయంతరతికాంతు లేరాజురూపరేఖకుఁ బ్రతిరూపకంబు
లతఁడు పట్టుతలాటకేళాదిరాయ । రాజదేవేంద్రరాజాధిరాజచంద్ర
గాయిగోవాళజగనొబ్బగండబిరుద। శాలి కొప్పుల వల్లభూపాలవాలి.

మ. భరియించెం జతురర్ణవీవృతమహాభారంబు దోఃపీఠికన్
విరియించెన్ విమతాంధకారము సముద్వేలప్రతాపోన్నతిన్
గురియించెన్ ధనధాన్యరాశి కవిరాట్కోటీనివాసంబులన్
వరియించెన్ వరకీర్తికాంతఁ దనరన్ వల్లక్ష్మీశుం డిలన్.

ఇత్యాదిపద్యములలో బిరుదాంకములతో వర్ణింపఁబడి యుండుట చేతఁ గృతిపతి కవిచెప్పిన ట్లఖండభూమండలాధిపతి కాకపోయినను చిన్న సంస్థానాధిపతియైననైనట్టు కనుపట్టుచున్నాఁడు. స్పష్టముగాఁ దెలియువఱకును గవికాలము నిప్పుడు పదునాలువందలయేఁబదికి దరువాతికాల మనుకొందము. ఈకవిత్వమునందు లక్షణదోషము లనేకములు గలవు. ఇతఁడు ప్రబంధములోని యీ మొదటిపద్యములోనే వ్రాయుటయని యుండవలసినదానికి వ్రాసుట యని ప్రయోగించినాఁడు—

ఉ. శ్రీసతి చన్నుఁగ్రేవలను జెక్కుల నొక్కటఁ బత్రభంగముల్
వ్రాసుటకున్ విరించి నిటలంబుల నొక్కట భాగ్యవర్ణముల్
వ్రాసుటకున్ జతుర్భుజవిలాసము పూనినవేల్పు సత్కృపో
ల్లాస మెలర్పఁ బ్రోచు శుభలక్షణుఁ గొప్పుల వల్లభూవరున్.

ఇట్లు కొన్నిదోషములు కానఁబడుచున్నను మొత్తముమీఁదఁ గవిత్వము రసవంతముగానేయున్నది. రాజరాజాభిషేకములోని కొన్ని పద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి—

చ. పనివడి చెప్ప నేల శిశుపాలునివిక్రమచేష్టితంబు లా
తనిపనిపూని దానవపదాతులు వచ్చిరి వీరె వారె యం
చనిశము జెప్పవెట్టక సురావళి దిక్కులు చూచుచుండఁగా
ననిమిషనామ మొక్కటియు నర్థము దప్పకయుండె నిప్పుడున్. ఆ.౧.

ఉ. ఆగయ విన్నమాత్రమున నైనను జూచినమాత్ర నైన నె
వ్వారిమనంబులం బ్రణయవాసితమై యనురాగకందళం

బీరిక లెత్తుఁ గారణ మొకించుక లేకయుఁ బూర్వజన్మ సం
స్కారవిశేషమం ద్రదది వికస్వరమై కొనసాగు నుర్వరన్. ఆ. ౨.

చ. అమృతసరోవరంబుగ హిమాంశునిమూర్తి కరంగి లోనిచి
హ్నము వికచోత్పలప్రకరమై చెలువొందిన నందులోన సం
భ్రమమున నీదు లాడి జడిమంబున నంగము లూను నేని యా
హిమమున నించు కేని శమియించునొకో మదనాస్త్రవేదనల్. ఆ-3

శా. శుద్ధాంతఃకరణైకయోగ్య మగుచుఁ శోభిల్లునస్మద్వచో
రాద్ధాంతం బిది యిచ్చగింపక వృథా ప్రజ్ఞాపరిజ్ఞానస
న్నద్ధు ల్గొందఱు కేవలంబుగ వితండావాదులై తారసం
బద్ధోక్తుల్వచియించి రేని మదమార్ప న్వారి ఖండించెదన్. ఆ. ౪.

మ. మహిలో నీ కిటమున్న నేను విమతమ్మన్యత్వము ల్పూనుటల్
సహియింపం దగునంచు నిప్పుడును విజ్ఞాపింప మాకేటికిన్
గుహనానాటకసూత్రధార భువి నీక్రొవ్వాడిమాయావిధుల్
బహురూపంబులు పన్నఁగాఁ దిరుగ రే బ్రహ్మేంద్రచంద్రార్కులున్ ఆ-౫

---

## 58. సిరిప్రెగడ ధర్మనామాత్యుఁడు

ఈకవి నలచరిత్రము నాలాశ్వాసములపద్యకావ్యమునుగా రచియించి, శ్రీవేంకటేశ్వరుల కంకితము చేసెను. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; హారితసగోత్రుఁడు; తిప్పయామాత్యపుత్రుఁడు. ఇతఁడు నలచరిత్రములోఁ దనదండ్రి నిట్లు వర్ణించియున్నాఁడు—

ఉ. సూరినుతుండు తిప్పనయశోజలజాక్షికిఁ గ్రీడ సల్పఁగా
మేరుధనుర్ధరాచలము మేడ సుధాజలరాశి కేళికా
సారము పువ్వుఁదోఁట దివిషద్ధరణీరుహసంచయంబు నీ
హారమహీధరంబు కృతకాద్రియునై విలసిల్లు నెప్పుడున్.

తనతండ్రి యిందు ర్తిసీమలోనివాఁడనియు, ఈ క్రిందిపద్యములలోఁ దనమేనమామ పేరూరి నివాసుఁడనియు, కవి చెప్పుకొనుటచేత నీతఁడు గోదావరీ కృష్ణామండలములలోనివాఁడని తోఁచుచున్నది—

సీ. తన కేఘనుఁడు ప్రపితామహుం డగు లోహి
తసగోత్రుఁ డల పుల్లదండనాథుఁ
డెసఁగు నేఘనుతాత యసదృశోన్నతి పుట్ట
మాంబాధవుఁడుతిమ్మనాహ్వయుండు
పెనిచె నేఘనుతండ్రి తనకీర్తిలత లాశ
లంటఁ బెంపగు తిమ్మయప్రభుండు
వెలయు నేఘనుతల్లి విమలపతివ్రత
వివిధసద్గుణశీల వెంగళాంబ
యతఁడు తుమురుగోటివరవంశాబ్ధివిధుఁడు
సతతపేరూరి కేశవస్వామ్యధీన
మానసస్థిరుఁబరఁగు నామేనమామ
మతినిగురుసన్నిభుఁడు ధర్మమంత్రివిభుఁడు.

చ. విను మనఘాత్మ ధర్మసుకవీ భవదీయవచోవిలాసముల్
ఘనకవిహృద్వికాసములుగావె చమత్కృతిమీఱ నీవు నే
ర్చినగతి నిప్పు డానలచరిత్రము వేంకటశైలరాణ్ణివా
సునకు సమర్పణంబుగను శోభనలీల రచింపు పెంపుగన్.

ఈకవికాల మేదో నిర్ణయించుటకుఁ బుస్తకమునం దాధారము లేవియుఁ గానరాలేదు. ఇతఁడు శ్రీనాథుని వర్ణించియుండుటచేతఁ బూర్వ కవి కాఁడనుట నిశ్చయము. ఇతఁడాధునికుఁడయి యిన్నూఱుసంవత్సరములక్రిందట నుండియుండును. ఈతని కవిత్వము మొత్తముమీఁద నిర్దుష్టమయి యింపుగా నున్నది. నలచరిత్రములోనిపద్యములఁగొన్నిటి నిందు క్రిందఁ బొందుపఱుచుచున్నాను.

ఉ. ధారుణి వీరసేనవసుధావరువా లటువాల వీరు లా
పారసమిత్రుఁ దూఱి తనసన్నిధిఁ జేరినవారి కెల్ల జం
భారి యిడన్ సురద్రుకుసుమావళియే యుడివోయె నన్నచో
నౌర గణింపఁగాఁ దరమె యాఘనుఁ డోర్చినశత్రుసంఘముల్. ఆ-౧

శా. లీల న్నీలపుటాలమేడకడ లాలిం గేలిమై నుంచి జో
జోలక్ష్మీశకటాక్షవీక్షణయుతా జోజోశుభాకార జో
జోలావణ్యరమాకుమార యనుచుం జోకొట్టుచుం బాడి ర
న్నాళీకేక్షణ లానృపాలసుతు వీణాకోకిలాలాపలై. ఆ. ౨.

ఉ. వెన్నెల చందమామకును వెన్నెలకుం దగఁ జందమామయున్
సన్నుతలీల నంద మగుచందమునన్ ధరణీతలేశ యా
కన్నియ నీకు వేడ్క నలకన్నియ కీవును జోడుగూడ నేఁ
గన్నులఁ జూతు నేమొయని కాంక్షయొనర్చెద నెమ్మనంబునన్ ఆ-౩

ఉ. అర్థి ఫలప్రదాయక గుణాకర నైషధసార్వభౌమ కా
ర్యార్థుల మైన మమ్ములఁ గృతార్థులఁ జేయఁగదయ్య సర్వశా
స్త్రార్థము లెందు నీ వెఱుఁగనట్టివి లేవకదా పరోపకారా
ర్థమిదంశరీర మను టాత్మఁ దలంచఁగదయ్య ధీనిధీ. ఆ. ౪.

శా. నీతిం జూడు నరేంద్ర మీనతతుల న్మీనంబులే మ్రింగుటల్
ఘాతక్రీడఁ గుఠారకాష్ఠ మిల వృక్షవ్రాతముం ద్రుంచుటల్
జ్ఞాతిత్వంబునఁ గాదె జ్ఞాతు లెచటన్ సామాన్యులే చెల్లఁబో
జ్ఞాతిచ్ఛేదన లేనకిమ్మనెడుశాస్త్రంబుం బరీక్షింపవే. ఆ. ౫.

మ. లలనా ప్రాణసమాన వైనసిను నేలాపాయ దే నన్న నీ
పలుకే నమ్మి భవత్పదాంబుజసమీపక్షోణి నిద్రింపఁగాఁ
గలితవ్యాళమృగాదిజంతుభయదోగ్రం బైనయీకాననలో
పల న న్వీడఁగనాడి పో నధిప నీపాదంబు లెట్లాడెనో. ఆ. ౬.

# 59. గణపవరపు వేంకటకవి

ఇతఁడు శ్రీప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసమనెడి యేకాశ్వాసప్రబంధమును రచియించెను. ఇది యేకాశ్వాసగ్రంథమేయయినను, ఇందలి పద్యముల సంఖ్యమాత్రము నాలుగాశ్వాసముల గ్రంథములో సామాన్యముగానుండుదానికంటెఁ దక్కువగాలేదు. ఈకవి నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు; ఆశ్వలాయనసూత్రుఁడు; వసిష్ఠగోత్రుఁడు; అప్పయామాత్యపుత్రుఁడు. ఇతఁడు కృష్ణామండలములోని కొమ్మపల్లెసీమయందలి గణపవరగ్రామవాసుఁడు. ఇతఁడు పల్నాటిసీమవాఁడగుటచేతనే స్వానుభవముచేతను గాఁబోలును 'పలనాటి గొల్లలపాటజాతి' యని యచ్చటిగొల్లల పాటను నిరసించియున్నాఁడు. ఇతఁడు మిక్కిలి యాధునికుఁడే యయినను, ఇతని కాల మిదియనిమాత్రము సరిగాఁ దెలియదు. ఇతఁడును దనకు వేంకటేశ్వరుఁడు స్వప్నమున సాక్షాత్కరించి తన్నుఁ గూర్చి పలికినట్లు చెప్పుకొన్నపద్యములలోని యీక్రిందిపద్యమువలన నితఁడు పదునాఱవశతాబ్దాంతమునకు లోపలివాఁడుకాఁడని స్పష్టమగుచున్నది—

సీ. అల విన్నకోట పెద్దనలక్షణజ్ఞత శబ్దశాసనకవి శబ్దశుద్ధి
ప్రాబంధికపరమేశ్వరు నర్థమహిమం బుభయకవిమిత్రునిపదలలితత
శ్రీనాథువార్తాప్రసిద్ధి నాచనసోముభూరికాఠిన్యంబు పోతరాజు
యమకవిధము మల్లయమనీషిచిత్రంబు పింగళి సూరకవివరుశ్లేష
నాంధ్రకవితాపితామహునల్లికబిగి
ముక్కుతిమ్మనతేటయు భూషణునియ
లంకృతియు నీకె కలదౌ తలంపలక్ష
ణకవి యప్పయ వేంకటసుకవిచంద్ర.

ఈపద్యమునుబట్టిమాత్రమే కాక యితఁడవతారికయందుఁ దన్నుఁ గూర్చి చెప్పుకొన్న యితరభాగములనుబట్టికూడ విచారింపఁగా స్వాతిశయమును జెప్పుకొన్న యాంధ్రకవులలో నెల్ల నితఁ డగ్రగణ్యుఁ డయినట్టు కనఁబడుచున్నాఁడు. పయిపద్యమునందుఁ బదునాఱవ శతాబ్దాంతమందున్న పింగళి సూరనార్యునిని (రామరాజ) భూషణుని బేర్కొనుటచేత నీతఁడు పదునేఁడవశతాబ్దమునకు లోపలివాఁడు కాఁడనుటకు సందేహము లేదు. మఱియొకచోట నితఁడు తన గ్రంథమునందు "లక్షణసారసంగ్రహ సరస్వతీవిలాస సాహిత్య చింతామణి సత్కవిజనసంజీవని" యని లక్షణసారసంగ్రహమును కవిసంజీవనిని బేర్కొని యున్నాఁడు. ఇందలి లక్షణసారసంగ్రహము చిత్రకవి పెద్దన్న రచియించినదైనపక్షమునఁ గవి పదునేడవ శతాబ్దారంభమునకుఁ బదునెనిమిదవశతాబ్దమధ్యమునకుఁ దరువాతివాఁడును అగును. ఈగణపవరపు వేంకటకవి తనకుఁబూర్వులయిన కవుల కావ్యములలోనుండి గ్రంథచౌర్యమును విశేషముగాఁ జేసినవాఁడయినందున, ఆలక్షణసారసంగ్రహము కూచిమంచి తిమ్మకవిదే యైన పక్షమునఁ దిమ్మకవి గ్రంథములనుండియు చౌర్యము చేసినాఁ డని చూపుటకుఁ దగిననిదర్శనములు లేకపోలేదు. ఇరువురకవుల గ్రంథములలోని యీపద్యములను జూడుఁడు—

సీ. బింబోష్ఠియని నీవు పెరఁగరాదు శుకంబ
 సాంకవగంధి యీపంకజాక్షి
 పంకజాక్షి యటంచుఁ బదరకు త్రేఁటి చం
 పకజాలనాస యీపల్లవాంఘ్రి
 పల్లవాంఘ్రి యటంచు బాధింపకు పికంబ
 రామాంగి యీబిసప్రచయబాహ

బిసబాహ యని రాఁకు వెసనంచ జలద శి
రోరుహ యీ సుహిరోమరాజి
యహిప్రరోమాళి యంచు డాయకుము నెమ్మి
కార్ముకభ్రూలతిక యీ చోకారపుఁ జెలి
యనుచు శుకభృంగ పరభృత హంస నీల
కంఠ నికురుంబములఁ దద్ద కనలి పలికె.

అని తిమ్మకవి తన రసికజనమనోభిరామములోని చతుర్థాశ్వాసమునఁ జెప్పియుండఁగా గణపవరపు వేంకటకవి

సీ. చక్రస్తని యటంచు జగడించకు శశాంక
గురుతమోవేణి యీకుందరదన
మధురాధర యటంచు మట్టుమీఱకు తేఁటి
చంపకనాస యీజలజవదన
బిసబాహ యని మాఱు మసలకు రాయంచ
జలధరచికుర యీకలువకంటి
పల్లవకర యని త్రుళ్ళకు కోయిల
శ్రీరామమూర్తి యీకీరవాణి
వదన కుంతల యాడ సుస్వర సఖిత్వ
మెనసియుండుటకతన మీ కితవొనర్చు
ననుచు నళి చంద్ర పరభృత హంసములకు
భయము నయమునఁ దెలియఁగఁబలికె మఱియు.

అని చెప్పియున్నాఁడు. ఈయుభయులలో నెవ్వఁడు పూర్వుఁడో యాతని పద్యమును జూచి రెండవవాఁడు తనపద్యమునైనను వ్రాసికొని యుండవలెను, లేదా యిరువురునుగూడఁ బూర్వమున్న యిటువంటి పద్యమును మఱియొకదానినిజూచియైనను వ్రాసికొనియుండవలెను. వేంకటకవి గ్రంథచౌర్యము చేయువాఁడగుట తెలియుటకయి నరసభూపాలీయ

మునుండియు వేంకటేశ్వరవిలాసమునుండియునొక్కొక్క చిన్నపద్యము నిం దుదాహరించుచున్నాము—

క. ఔరా యోబనృపాలకు
మారా మను మదనసమరమాధుర్యుఁడవై
ధీరా నృసింహ కూడితి
మారామను మదనసమరమాధుర్యుఁడవై.

అని యీపద్యము కావ్యాలంకారసంగ్రహములో పాదయమకము నకు లక్ష్యముగా నీయఁబడియుండఁగా, వేంకటకవి.

క. ఔరా మాధవయజ్వకు
మారా మను మదనసమరమాధుర్యుఁడవై
ధీరా విటార్య యేలితి
మారామను మదనసమరమాధుర్యుఁడవై.

అని పైపద్యమునే పేరులుమాత్రముమార్చి పంచదశవర్ణయుక్త పాదయమకమని తన పుస్తకములో వేసికొనియున్నాఁడు. ఈకవి వేంక టేశ్వరుఁడు తన్నుద్దేశించి పలికినట్లు కొన్నిటిని, తానే చెప్పుకొన్నట్లు కొన్నిటిని, ఇతరులు తన్నుమెచ్చి పొగడినట్లు కొన్నిటిని, స్వరచితము లైన గ్రంథముల నామములను జెప్పుకొనియున్నాఁడు. ఇట్లు చెప్పుకొనఁ బడిన తారావళులు, యమశతకము, శృంగారరసమంజరి, కృష్ణమల్లకథ, బాలరామాయణ ద్విపదము, చాటుపద్యములు, లింగనిర్ణయము, ఆంధ్ర ప్రతాప రుద్రీయము, ఆంధ్రరసమంజరి, ఆంధ్రనిఘంటువు, ఆంధ్రకౌ ముది, గణయతి ప్రాసలక్షణ సీసమాలిక, ఆంధ్రప్రయోగరత్నాకరము, రేఫ అకారనిర్ణయము, షట్ప్రత్యయ ప్రస్తారసరణి, ఇరువదాఱు ఛంద ముల వచనము, అలంకారసారము, పరమభాగవతచరిత్ర, ఆంధ్రద్విరూప కోశము, కల్పితకల్పలత, ఆంధ్రవసంత తిలకభాణము, కఠిన ప్రాసశత కము, ఆంధ్రప్రక్రియాకౌముది, జాంబవతీవిలాసము, చండవిద్యావతీ

దండకము, చక్రవాళతారావళి, పురాణసారము, ప్రబంధరాజ వేంకటేశ్వరవిజయ విలాసము, అను గ్రంథములలో రెండుమూఁడుతక్క శేషించినవన్నియు నామమాత్రావశిష్టములయినవి. అట్లగుటకుఁ గారణము లేకపోలేదు. ఈకవి తానుజేసినపుస్తకములు లోకమునకుపయోగపడవలెనన్న యుద్దేశముతోఁగాక తనసర్వతోముఖ పాండిత్య ప్రకర్షమును లోకమునకుఁ బ్రకటింపవలెనన్న యుద్దేశముతో విశేషభాగము చేసినందున నీతనిపుస్తకముల కిట్టిగతి పట్టియుండును.

సంస్కృతములోనున్న జ్ఞానధనమును జనులకువెదచల్లవలెనన్న పరమార్థచింతతో మొట్టమొదట నన్నయభట్టారకాదులగు మహాకవులు పదునొకండవశతాబ్దారంభమునుండి సులభశయ్యను సంస్కృతగ్రంథములఁ దెనిఁగింపఁదొడఁగిరి. ఈభాషాంతరీకరణకార్యము పదునేనవశతాబ్దాంతమువఱకును. నవిచ్ఛిన్నముగా జరగుచువచ్చెనుగాని యిట్లు భాషాంతరీకరణమునకుఁ బూనుకొన్నవారిలోఁ గడపటివారగు శ్రీనాథాదులు తమపూర్వులకన్నఁ దాము ఘనులనిపించుకోవలెనన్న చింతచేతనో మఱి యేహేతువుచేతనో సంస్కృతపదభూయిష్ఠములైనదీర్ఘసమాసములతో నింపి రసమును జెఱుపక పోయినను తమగ్రంథములు బహుజనులకు దుర్గ్రాహ్యమైనకఠినశైలిని జేసిరి. ఇట్లాకాలములో భారత భాగవతరామాయణాదిముఖ్యగ్రంథము లన్నియుఁ దెలిఁగింపఁబడఁగా, అటుతరువాతఁ బదునాఱవశతాబ్దారంభమునం దల్లసాని పెద్దనాదు లొక క్రొత్తత్రోవఁద్రొక్కి కేవలభాషాంతరములు కాకుండఁ బురాణములలోని కథలను గైకొని స్వకపోలకల్పితములైన వర్ణనలను జేర్చి పెంచి శ్రీనాథాదులశయ్యనవలంబించి సరవంతముగా ప్రబంధములను జేయ నారంభించిరి. ఈపని నూఱు నూటయేఁబదిసంవత్సరముల వఱకును జరగుచురాఁగా, ౧౬౫౦వ సంవత్సరములోపల బహుమార్గముల నూతనప్రబంధము లనేకములు తెలుఁగునఁ జేయఁబడినవి. అంత

టితో నూతనసృష్టి బహుతరముగా నంతరింపఁగా, ఈవలివారు వసుచరిత్రమును మాతృకనుగాఁ గొని దానికి పాఠాంతరములో యనునట్లు పూర్వవర్ణనములనే తలలుమార్చి ప్రయోగించుచు వెనుకటిప్రబంధముల ననుకరించి తమప్రబంధముల నల్లఁజొచ్చిరి. చేసినదానినే పేరులుమార్చి మరలఁ జేయుచుండుటచేత నూతనార్థకల్పనలనుజేయుట దుష్కరమయి నందున నిటీవలివారిలోఁ గొందఱు మహాపురుషులాయర్థలోపమును పదాటోపముతోఁ బూరింపఁబ్రయత్నించిరి. పూర్వపువా రక్కడక్కడ సముచితముగా శబ్దాలంకారములను జేర్చుచు వచ్చినను భాషావధూటికిఁ బ్రాణ మైనయర్థసారస్యమును జెడఁగొట్టకుండిరి. ఇటీవలివారర్థసారస్యమునంతగాఁ బాటింపక నిఘంటువులవెదకి పదములేరికూర్చి బంధించి తమ సరస్వతిని హృదయాకర్షకముగాఁ గాకపోయినను కర్ణరంజకముగా నైనను జేయఁబాటుపడిరి. ఇట్టివారిలో నెన్నికగన్న కొందఱు బంధాదుల నతిమాత్రముగాఁజేర్చి యర్థసారస్యమును బూర్ణముగాఁ జెఱిచి యవయవములు విఱిచి తమభాషావధూటిని విరూపినిజేసి శవప్రాయను జేసిరి. మన యీవేంకటేశ్వరవిలాసకృతికర్తయు బలరామచరిత్ర కృతికర్తయైన గుడారు వేంకటదాసకవియుఁ గొంతవఱకీకడపటి తెగలోఁ జేరినవారు. ఒకఁడు తనపుస్తకమునకుఁ బ్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాస మని పేరు పెట్టుకొనఁగా నింకొకఁడు తనపుస్తకమునకుఁ బ్రబంధరాజశిరోభూషణ ప్రకృష్ట బలరామచరిత్రమని పేరుపెట్టుకొనెను. వేంకటదాసకవి

"నిరోష్ఠ్యమత్తేభవిక్రీడిత శార్దూలోత్పలమాలా తోటక మత్తకోకిల లయగ్రాహిమణిగణనికర పంచచామరస్రగ్విణీప్రమితాక్షర మణిభూషణ ద్రుతవిలంబిత కవికంఠభూషణ వినయస్వభూతాద్రుష్టహర్షణి రథోద్ధతాంబురుహ కవిరాజవిరాజిత గణసమకదండకార్యాగీత సీస ప్స్రగ్విణ కంద శ్లోకచూర్ణికా వచనకైవార గద్య కలికోత్కలికామంజ

రీద్విపద ధవళసువ్వాలశోభనారాత్రిక నానారగడభేదసప్తతాళైలా మహార్ణవమిలాలిశారదద్వాత్రింశద్రాగ నానావిధవిచిత్ర నాగబంధ పుష్పమాలికా బంధసంయుక్తకల్పిత కల్పవల్లీ చంపకమాలికా వృత్తము."

అని పేరుపెట్టి యొక పద్యములో ననేకబంధ గర్భవృత్తముల నిమిడింపఁగా, మన యీవేంకటకవి దీనిని మించునట్లుగా,

"బహువిధచిత్రకంకణ బంధద్విగుణితసీసచరణచతుష్టయగర్భిత ద్విపదకందద్వయ సమవృత్తచౌపదయుగళాటవెలఁది తేటగీతి మదనవిలసిత తురంగవృత్త బహువిధతాళవృత్తాష్టక ధవళశోభనగానారాత్రికగాన జంపెత్రిపుటార్ధచంద్రిక సువ్వాలలాలిపదైలామంజరి సమతాడిండిమతాళవృత్తమణిగణనికర తురగవల్గన రగడోదాహరణసంబుద్ధి కళికోత్కళికార్ధాహిరీ రాగదళ ముఖారిరాగాటకతాళదళ కాంభోదిరాగ రూపకతాళదళకాంభోదిరాగ సమపద కన్నడరాగ సాంగత్య కొరవంజిదళ రేవగుప్తిరాగ సమపద సావేరిరాగైకతాళదళ బిలహరిరాగాటతాళ సమపద పుష్పమాలికాబంధ గోమూత్రికాబంధ శార్ఙ్గబంధ షోడశదళపద్మబంధ పాదుకాబంధ నవరంగబంధ ఖడ్గబంధ గుచ్ఛబంధ ఛత్రబంధ చామరబంధ గదాబంధ చక్రబంధ నాగబంధ రథబంధ శంఖబంధ మృదంగబంధ పాదభ్రమకబంధ పాదార్ధభ్రమకవింశతిబంధ ఛేదకందానుష్టుప్ శ్లోకాంతర్గత చతుర్భద్ర నవరంగ సర్వతోభద్రాందోళికాబంధ యుక్తానులోమవిలోమ కందభాషాశేషకందకందాటవెలఁది గర్భితాంత్య త్రేటగీతి యుక్తచౌషష్టిభేదచిత్రసీసము"

అని పేరు పెట్టి యొకపద్యములోనే బహుబంధ గర్భవృత్తముల నిమిడ్చెను. కవి మిక్కిలి కష్టపడి పయిని జెప్పఁబడినరీతి గర్భబంధకవిత్వమును, ఏకాక్షర నిఘంటులను వెదకి—

క. కైకోకీకా కకుకై । కోకా కాకింక కూకి కూకకకుకోకీ
  కాకుకకు కేకకేకిక । కూకో కొకక్కూక కింక కోకై కోకా.

అనురీతి నేకాక్షరములతోడి చిత్రకవిత్వమును, ఒక్కదానిలో నేయితరపుస్తకములోను లేనంత యమితముగాఁ జెప్పి తనశిల్పివ్యాపార కౌశలము నెంత చూపినను, కాళ్లతో నడచి గమ్యస్థానమును చేరు సామాన్యమార్గము విడిచి యడ్డముగా భూమిమీఁదఁబడి కడుపుతో దొర్లి ప్రయాసపడి గమ్యస్థానమునుజేరి యసాధారణప్రౌఢిమను జూపిన బుద్ధిమంతుని శక్తిని మెచ్చుకొనునట్లె యిట్టి కవితాచమత్కృతులు మెచ్చుకొనఁ దగియుండునుగాని యంతకంటె నెక్కువ శ్లాఘాపాత్రములుగావు. నవరసరసికు లెప్పుడును హృదయాహ్లాదకరముగా నర్థకల్పనము చేసియు కర్ణరసాయనముగా మృదుమధురవాగ్గుంభనలతో భావములఁగూర్చియు మానసోద్దీపకముగా నీతి బోధనమొనర్చియు వర్ణనలు చేయఁగలిగిన కవినిమాత్రమే మెచ్చుకొందురుగాని కావ్యదోషములకు లక్ష్యము లగునట్లుగా నర్థగౌరవముఁ జెఱిచి పదముల విఱిచి పద్యములలోఁ బద్యములను దూర్చినవానిని మెచ్చుకోరు. ఈవేంకటకవివర్యుని కవనమునందు వ్యాకరణదుష్టములయిన ప్రయోగము లనేకములు కానఁబడుచున్నవి. ఈకవికాల మేదో సరిగాఁ దెలియ రాకపోయినను, ఈతని గ్రంథములోని సలాము సాహెబు ఫిరంగి తుపాకి మొదలగు పదప్రయోగములీతఁ డాధునికుఁడని ఘోషించుచున్నవి. బంధగర్భచిత్రకవిత్వముల కొఱకై శ్రమపడి కూర్చినభాగములను విడిచినపక్షమున, ఈతని కవిత్వము మొత్తముమీఁద రసవంతమయి పదలాలిత్యము కలదయి మనోహరముగానే యున్నది. ప్రబంధరాజ వేంకటేశ్వరవిజయవిలాసములోని కొన్ని పద్యముల నిందుఁ బ్రదర్శించుచున్నాము—

చ. తగునె నృపాలకన్యలకు దవ్వులనవ్వుల పువ్వులాట లీ
  వగలఁ జరింప నిందుఁ దగవా మగువా మగవార లుండఁగా

మగుడి పురంబుఁజేరఁ జనుమా వినుమా యనుమాన మేల నీ
సొగసు విలాస మంతమును సొంపును నింపును బెంపుమీఱఁగన్.

ఉ. వ్రేలిమి వ్రేల్పఁ డెప్పుడును వ్రేల్చు మొగంబు వగ్రూలలామకై
చాలుగ సంధ్యవార్చఁడు త్రిసంధ్యలవార్చును వంటవార్పులా
బాలికయింటఁ దండ్రి సలుపం గననొల్లఁడు దేవపూజ యే
వేళల లంజెతల్లి యిలువేలుపుమాత కిడుం బ్రణామముల్.

చ. అడిగినఁ దెచ్చువాఁడొ కడునందమునం గననైనవాఁడొ మే
ల్నడవడికాఁడొ వీటఁ దగునాయకమై చరియించువాఁడొ చే
విడిముడికల్గువాఁడొ తలవెంట్రుక లందఱు రాకుమారకుల్
ముడుపులు వానగాఁగురియ ముట్టవు కారణమేమి కూఁతురా.

శా. ఏమీ పల్కవు నేను బిల్వ దయ లేదే నీకు నాయయ్య ని
న్నేమంటిన్ సుకుమార నామొడను దప్పేదీ కుమారాగ్రణీ
నామీఁదన్ జల మేలరా తనయ నన్మన్నించరా పెన్నిధీ
నీముద్దు ల్గననోచినానుగద తండ్రీ నీతిపారంగతా.

---

# 60. వేముగంటి దత్తోజీపండితుఁడు

ఈకవి ప్రస్థానత్రయములో నొకటియైన భగవద్గీతా యోగశాస్త్రము
మును బద్యకావ్యముగాఁ దెనిఁగించెను. ఇతఁడు హారితసగోత్రుఁడు; నాగ
మాంబకును నాగోజీపండితునకును బుత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు;
మాధ్వమతస్థుఁ డని తోఁచుచున్నది. ఈయనకాలము మొదలయిన
వానినిగూర్చి యేమియు నిశ్చయముగాఁ దెలియదు. ఇతఁడు నూఱుసం
వత్సరముల లోపలివాఁడు కాఁడు. కృష్ణార్జునసంవాదమను నామాంత
రము గల యీయోగశాస్త్రములోని కొన్నిపద్యముల నిందుదాహరించు
చున్నాను——

ఉ. కోకలు జీర్ణమై చనఁగ గొబ్బున వానిఁ బరిత్యజించి తా
శ్రీకరనూత్నవస్త్రములఁ జెల్వుగఁ దాల్చినభంగి దేహి సు
శ్లోకుఁడు జీర్ణదేహములశోభకు రోసిన జీవమూర్తి యీ
లోకపుగోమలాంగముల లోలతఁ దాల్చును భద్రమూర్తియై. ఆ-౨

ఉ. నల్లలితంపుఁగర్మములు సాంద్రయశోనిధి సద్విరక్తిచే
నొల్లక సన్యసించి పటుయోగసుఖంబుఁ జెందుచుండుఁ దా
నెల్లెడ జీవుఁ బోలి కడుహేయపుఁదొమ్మిదితూంట్లమేనిలోఁ
ద్రుళ్లుచుఁ జేయనొల్లఁడుప్రతోషముతోనియమింపఁడన్యులన్. అ-౬

ఉ. వేదములన్ మఖంబులను విశ్రుతదానతపంబులన్ సము
త్పాదితమైనపుణ్యము నధఃకరణం బొనరించుయోగి య
య్యాదిమపూరుషోత్తమునిజార్థము నెమ్మది సంగ్రహించి ని
ర్వేదన లేక యార్య మగు విష్ణుపదంబును జెందు నర్జునా. ఆ. ౮.

ఉ. ఇంద్రియసౌఖ్యసంపదల నేమియుఁ గోరక వీతరాగుఁడై
సాంద్రయశుం డహంక్రియలచక్కటిఁ బోవక దూరవర్తియై
యింద్రజ మేనికిన్ జరయు మృత్యువు జన్మము వ్యాధులున్ విని
స్తంద్రత దుఃఖదోషములు, జాలఁగఁగల్గుటెఱుంగఁగాఁదగున్.ఆ-౧౩

ఉ. కామము రాగముం బలముఁ గల్గి యహంకృతి దంభయుక్తుఁడై
యేమనుజుండు శాస్త్రవిధి నెంతయుఁ దుచ్ఛముగాఁ దలంపుచున్
భూమికి భీకరం బయినభూరితపం బొనరింపుచుండు నా
పామరు నాసురక్రియలఁ బర్వినవానిఁగ నిశ్చయింపుమా. అ. ౧౭.

# 61. గుడారు వేంకటదాసకవి

ఈకవి బలరామచరిత్రమని సామాన్యముగా వాడఁబడు ప్రబంధరాజశిరోభూషణ ప్రకృష్ట బలరామచరిత్ర యను నాలాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఇతఁడు బలిజవంశజుఁడు; పైడిపాలగోత్రుఁడు; ఈతని తండ్రి గురవేంద్రుఁడు; తల్లి రంగమాంబ. ఇతఁ డాధునిక కవియే యయినను, కాలనిర్ణయము చేయుట కాధారములేవియుఁ గానరాలేదు. ఇతఁడు నూటయేఁబది సంవత్సరములక్రిందట నుండెనేమో! ఈతని కవిత్వము ప్రౌఢమైనది. బలరామచరిత్రమునుండి రెండుపద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి—

శా. నీరేజాక్షికి హారమౌక్తికతతుల్ నీలంబులై తైలముల్
జాలంగాఁ బగడంబులై పిదప వజ్రాకారము ల్బొంది వి
స్తారస్వేదకణంబులం దడిసి సున్నం బయ్యె నాదుర్దమ
స్మారస్ఫారశరాగ్ని హేమపట మచ్ఛచ్ఛాయమై తోఁచినన్. ఆ-3

ఉ. వారిధిధీరమానసుఁ డవారితతేజుఁడు నై జరాజకం
ఠీరవభావభీతహరిణీభవదున్మదవైరివీరుఁ డు
ద్దారుణమార్గణప్రకరదైన్యవిదారణదానదక్షుఁ డీ
భూరమణాగ్రణిం గనుము పుష్కరనేత్ర విదూరకాహ్వయున్. ఆ.౫.

# 62. కామనూరి కృష్ణయ్య

ఇతఁ డిందుమతీపరిణయ మనెడి యైదాశ్వాసముల ప్రబంధమును రచించెను. రఘువంశములోని యజమహారాజుచరిత్ర నీప్రబంధరూప మునఁ జేసినట్టు కవియే యీపద్యమునఁ జెప్పియున్నాఁడు:—

సీ. కాళిదాసకవిశ్రేష్ఠకల్పితంబు
భవ్యచరితంబు రఘువంశకావ్య మందు
నజునికథయాంధ్రభాషచేనలఘుమతిని
గృతిరచింపఁబూనితినలంకృతులుచెలఁగ.

ఈకవి నందవరీక బ్రాహ్మణుఁడు; గోవిందయామాత్య నందనుఁడు. ఇతఁడు నూటయేఁబదిసంవత్సరములనాఁటివాఁడయి యుండునేమో. ఈతనికవిత్వము మనోహరమైనదే. ఇందుమతీపరిణయములోని రెండు పద్యముల నిం దుదాహరించుచున్నాను:—

ఉ. అందు దిలీపభూపతనుజాగ్రణి దేశము మేలుబంతి మ
ధ్యందినపంకజాప్తనిభుఁ డాధరణీశుఁడె మేటి తత్సుతుం
డిందు వసంత చిత్తజ సురేశ్వరసూనులకన్న మిన్న వా
నందముఁ జెప్పఁ జూప వశమా యసమానపరాక్రమక్రమా. ఆ. ౧.

ఉ. అన్నకు మ్రొక్కి తత్కరుణ నాయితపెట్టినదంతపుంబసిం
డెన్నలరారుపల్లకి వసించి చొకాటపుఁదేటకెంపురా
కన్నెమెఱుంగుఁగేలఁ బూనఁగం ధరించె మధూకదామ మ
త్యున్నతమంగళప్రకటతూర్యరవంబులు మిన్నుముట్టఁగన్. ఆ. ౪.

## 63. వేంకటాచార్యుఁడు

ఈకవి భద్రరాజపుత్రచరిత్రమను నైదాశ్వాసముల ప్రబంధమును రచియించెను. కళాపూర్ణోదయమునందువలెనే యిందలికథలును కవిచే నూతనముగాఁ గల్పింపఁబడినవి; కాని కవిత్వ మంతప్రౌఢమయినది కాదు. ఇందలికథలను బోలిన కథ లనేకములు కొన్ని వైష్ణవగ్రంథములలోఁ గానఁబడుచున్నవి. ఈకవి వైష్ణవబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; ఆత్రేయసగోత్రుఁడు; శ్రీనివాసాచార్య పుత్రుఁడు. ఇతఁడు నూటయేఁబది సంవత్సరములక్రిందట నుండినవాఁ డయినట్లు చెప్పుచున్నారు. భద్రరాజ పుత్రచరిత్రమునుండి రెండు పద్యముల నిందుఁ జూపుచున్నాను—

శా. ఏనుం జెప్పినభంగిఁ జేసితివె కాశీశుండు ప్రత్యక్షమై
తా నిన్మెచ్చితిఁ గోర్కె వేఁడుమనినే ధన్యుండనైతిం గృపా
నానాసౌఖ్యశుభాకరంబుఁ బుత్రము న్నాకిమ్ము యంచే శివుం
డానందించి యొసంగెనే వరము నీవబ్భంగిఁ జేకొంటివే. ఆ. ౧.

ఉ. ఎవ్వరు నావిధంబు జలజేక్షణకుం దెలిపించి మేలు లో
నివ్వటిలం గరంగ సని నేర్పుదలిర్పఁగఁ దెచ్చి కూర్చి యీ
నెవ్వగఁ బాపువారె తమి నిల్వఁగఁగూడదు మేనఁ బ్రాణముల్
రవ్వడిఁ బోవుచున్నయవి రాదు భరింపఁగ నేమిచేయుదున్. ఆ. ౫.

---

## 64. మల్లంపల్లి నాగభూషణకవి.

ఇతఁడు బసవవిజయమను మూఁడాశ్వాసముల గ్రంథమును రచియించెను. ఇతఁడు వీరశైవమతస్థాపకుఁడైన బసవేశ్వరుని చరిత్రమును మాత్రమేకాక బసవచరిత్రాదులను రచియించిన పాలకురికి సోమనాథాదులనుగూర్చియు నిత్యాదిపద్యములలో వ్రాసియున్నాఁడు—

క. వీరప్రతాపరుద్రుఁడు । ధారుణిలోఁ గలుగుప్రజల ధర్మాత్ముండై
యారూఢి వెలయ నేలుచు । గారవమున నున్నయట్టికాలమునందున్.

సీ. ఫాలాక్షభక్తుండు భవపరిత్యాగి సమంచితభూతిరుద్రాక్షధారి
పంచాక్షరీమంత్ర పఠనపారీణుఁడు విమలఘనవ్రతవీరయశుఁడు
కావ్యకళాశాస్త్రకామితప్రవణుండు శాఖాగ్నిఫలపత్రజలము లైన
భవిచేతఁ జేకొనం డవి వినఁడోపఁడు భాతిమీఱంగను బాలకురికి
సోమనాథుఁ డనఁగ సురలు ప్రస్తుతిచేయ
సకల శాస్త్రములను జదివిచూచి
ప్రకటితముగ శివుని భక్తి యధికమని
బసవదేవుమహిమ ప్రబలఁజేసె.

ఈ కవి శైవబ్రాహ్మణుఁడు, హారితసగోత్రుఁడు; త్రిపురాంతకారాధ్యపుత్రుఁడు; ఇతఁడు నూటయేఁబది సంవత్సరములక్రిందట నుండినట్లు తెలియవచ్చుచున్నది. ఈతని కవిత్వమంత మంచిదికాక, వ్యాకరణవిరుద్ధములైన ప్రయోగములతోఁ గూడియున్నది. ఈతని బసవ విజయము లోనివి రెండు పద్యము లిందుఁ బ్రదర్శింపఁబడుచున్నవి—

చ. బసవపురాణకావ్యమును బ్రాభవ మొప్పఁగఁ బద్యగద్యలక్
భాసఁగఁగ నాంధ్రకావ్యములు బుద్ధిని దారచియించి చెప్పఁగాఁ
బసిగొని భూసురుల్ వినియుఁ బాయక గుంపులు కూడి రాజుతో
మసలకపోయి పాల్కురికిమాన్యుఁడు సోమన చేయుశాస్త్రముల్. ఆ.౧

చ. అధములు మీరు బ్రాహ్మణులె యందఱుఁ జూడఁగ నొక్కచాకి యా
పథమున వేదవాక్యములు పాడి పదంబుల మిమ్ము నందఱన్
బధిరులఁ జేసెఁగాని పరిపాల్పడి మీ రొకరైన వారితో
నెదుటను నిల్చి సంహితల నేర్పడఁ జెప్పఁగఁజాల రందఱున్. ఆ.౧.

# 65. చిత్రకవి సింగరార్యుఁడు

ఈ కవి బిల్హణీయమను మూడాశ్వాసముల ప్రబంధమును రచియించి శ్రీరామాంకిత చేసెను. ఈకవి యాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు. ఈతని యనంతరమున నీతని పుత్రుఁడగు నారసింహకవి తనతండ్రి రచియించిన గ్రంథమును దెచ్చి పండితకృష్ణస్వామి కిచ్చి యాతనివలన ధనస్వీకారము చేసినట్లును, వా రిద్దఱును గలిసి కృత్యాదియందలి కొన్ని పద్యములను గద్యములనుమార్చి గ్రంథమును గృష్ణస్వామి రచియించినట్లు దిద్దినట్లును జెప్పుచున్నారు. ఆ కొన్ని పద్యములను మార్చుటలోఁ గూడఁ గృష్ణస్వామికి నారసింహకవి సాహాయ్యమున్నదని తెలుపుటకుఁ గాఁబోలును బిల్హణీయమున నీ క్రిందిపద్యము వేయఁబడి యున్నది—

క. మున్నింద్రతనూభవునకు। వెన్నుఁడు సహాయుఁ డైనవిధమున సేనా
సన్నుతసద్గుణగణసం। పన్నుం డగుకవివరాధిపసహాయమునన్.

గ్రంథమునందుఁ బండితకృష్ణస్వామియే గ్రంథరచన చేసినట్లు చెప్పఁబడియున్నను నిజముగాఁ గృతికర్త సింగరయ్యయే యగుటకు నిదర్శనము ప్రథమాశ్వాసాంతమునందుండిన యీక్రింది చక్రబంధము నందుఁ గానఁబడుచున్నది—

శా. ధన్యా సింహభచంద్రకీర్తి వరవిద్యాపండితార్యక్రమా
గణ్యా గర్వితధనంజయా శివదముక్తాకృత్పరిగంకప్రభూ
జన్యారాజితభూరిశాత్రవసుభృజ్ఞావిద్రమావిక్రమా
మాన్యారాధన త్యాగభోగజయధామా నవ్యభాగోత్తమా.

ఈకావ్యము నూటయేఁబదిసంవత్సరములకుఁ బూర్వము రచియింపఁబడినట్లు తెలియవచ్చుచున్నది. ఇందలికథ మనోహరముగాను కవనము రసవంతముగాను గొంతవఱకున్నను దారాశశాంకమువలెనే యిదియు నీతిబాహ్యమైనందునఁ జదువఁ దగినదికాదు. మదనాభిరాముఁ

డనురాజు రూపయౌవనవతియగు యామినీపూర్ణతిలకకు సంగీతసాహిత్యములు చెప్పింపఁదలఁచి, సమస్తవిద్యలయందును సమర్థుఁడయిన బిల్హణుఁడను సంస్కృతకవీంద్రుని రావించి, అతఁడును రూపయౌవనసంపన్నుఁ డయినందునఁ దనకూఁతు నాతనికడ నొంటిగానుంచి చదివించుట కిష్టము లేనివాఁ డయి మంత్రితో నాలోచింపఁగా నతఁడు

మ. ఒకచిత్రవ్రత మున్న దిర్వురకు రాజోత్తంస సిద్ధంబుగా
నకలంకాకృతి యైననీతనయ యుజాత్యంధు న్వీక్షింప దా
సుకవీంద్రుండును గుష్ఠగాత్రి నెపుడుం జూడ న్మదిం గోరఁ డిం
దుకు నేమో వచియుంచు టే నెఱిఁగియుంకున్మన్నతత్కార్యమున్.

మ. కవిరాజాగ్రణి పుట్టుగు డ్డనుచు నీకంజాక్షికిం జెప్పి యా
కవికిన్ మీసుత కుష్ఠగాత్రియని వేడ్కం దెల్పి యవ్వారికిన్
భువి నన్యోన్యవిలోకనక్రియలు నేర్పుల్మీఱఁ గాకుండున
ట్లు విచారించెద నొక్కయుక్తి వినుఁ డిట్లున్ రాజదేవర్షభా.

అని రాజపుత్రి తాను జాత్యంధునిముఖముఁ జూడనని నియమముపట్టియున్నందున నామెతో నావిద్వాంసుఁడు పుట్టుగుడ్డివాఁడని చెప్పియు బిల్హణుఁడు కుష్ఠగాత్రిని జూడనని నియమముచేసికొనియున్నందున నాతనితో రాజపుత్రి కుష్ఠగాత్రియనిచెప్పియు నిరువురకు నన్యోన్యముఖావలోకనము లేకుండ నడుమ తెర వేసి చదివింప వచ్చునని యుపాయము చెప్పెను. రాజాయుపాయమునకు సంతోషించి తనకొమారితతోను విద్వాంసునితోను నమ్మఁబలికి వారి నొడఁబఱిచి యిరువురిమధ్యను తెరవేయించి కూఁతునాతనివద్దఁ జదివింప నారంభించెను. కుశాగ్రమతియైన యామినీపూర్ణతిలక యాతనివలన సంగీతసాహిత్యాదివిద్యల నభ్యసించి యల్పకాలములోనే కవిత్వముచెప్ప నేర్చుకొనెను. ఇట్లు కొంత కాలము జరగఁగా నొకనాఁటిరాత్రి క్రొత్తగా నుదయించిన పూర్ణచందునిజూచి కవి.

చ. జలనిధిపంక్తి మంచు మఱి చాయయుఁ జిహ్నము లేడిపిల్ల కం
దళితసురేంద్రనీలమణిధామ మటంచు వచింతు రంద ఱీ
కలువలతేనియందుఁ గలకందును నే ననుకొందు రాత్రియం
దలవడ్రమింగినట్టితమ మంతరసంస్థ మటంచు నెంతయున్.

ఇత్యాదివాక్యములతోఁ జంద్రవర్ణనము చేయఁజొచ్చెను. ఆవ
ర్ణన నాలకించి యామినీ పూర్ణతిలక

శా. అంధుం డెక్కడ చంద్రుఁ డెక్కడ తదీయంబైన యావర్ణనా
బంధం బెక్కడ యిట్టివింత గలదే భావింప నెచ్చోటనై
నం ధాత్రీంద్రుఁడు మాకు నిర్వురకు నందంబొప్ప నన్యోన్యహా
త్సంధానం బగు నంచుఁ జేసె నిటులం జర్చింప వేఱున్నదే.

పుట్టుగుడ్డివాఁడెక్కడ? చంద్రవర్ణనముచేయుటెక్కడ? రాజు
మాకిరువురకు నన్యోన్యసంధానము కలుగకుండ నీమిష కల్పించెఁగాబో
లుననితలఁచి, వ్రతభంగమయినను గానిమ్మని సాహసముచేసి తెరదీసి
చూచెను.

ఉ. ఆకడ బిల్హణాఖ్యకవి యత్తఱిఁ దామరసారిఁ గూర్చి యెం
తో కళ యుప్పతిల్ల వినుతుల్పచరింపుచునుండి యంతలోఁ
బ్రాకటబద్ధకాండపటిపై రమణీమణిమోముఁ జూచి య
స్తోకమహోదయాద్రిపయిఁ దోఁచిన చంద్రునిఁ బోల్చి యిట్లనున్.

ఆయావనపురుషుడు పండువెన్నెలఁ గాయుచుండఁగా సంపూర్ణ
పూర్ణిమాచంద్రబింబమును మీఱిన నిండుజవ్వనియొక్క ముఖచంద్రబిం
బము నొంటిగాఁ జూచిన తరువాత జరగినపని చెప్పనక్కఱయే లేదు.
ఇట్లుకొంతకాలము రాజపుత్రియుఁ గవీశ్వరుఁడును యథేష్టావిహారముల
నానందించుచుండఁగాఁ దెలిసి కావలివారు రాజునకు విన్నవింపఁగా
నతఁడు కూఁతుం జేరఁబిలిచి.

ఉ. కోరిన రాజకుమారకునకుం బ్రియమారఁగ నిన్ను నిచ్చి యెం
తో రహిమీఱి సౌఖ్యమున నుండెదనంచుఁ దలంచియున్న నా
కోరిక లెల్లఁ బోఁగలఁచి కొంకుఁ గలంకము లేక మత్కులం
బారఁగ దుర్యశంబు మహి నందఁగఁజేసితివమ్మ బాలికా.

అని కోపముతో బిల్హణుని శిరశ్ఛేదముచేయ నియమించెను. రాజభటుల లాతనిని వధ్యస్థలమున కీడ్చుకొనిపోవుచున్నారని విని రాజపుత్రి యిట్లు విలపింపఁ జొచ్చెనట—

మ. అరవిందంబులరీతిఁ జెన్నలరునీహస్తంబు లెట్లోర్చె ము
ప్పిరిగాఁ బెట్టిన కాలపాశమునకుఁ ముగ్ధాంగనాగానభ
వ్యరసోత్కర్షము లైననీశ్రుతియుగం బత్యుద్ధతోద్దీపకిం
కరనాదార్భటి కెట్లుతాళె మదనాకారా మనోనాయకా!

కవియును దన ప్రాణాపాయమును బాటింపక శోకపాడుగునను దన ప్రియురాలిని దలఁచుకొని యామెపయి నీరీతిని బద్యములు చెప్ప నారంభించెను—

ఉ. హా కమలాయతాక్షి చెలి హా సరసీరుహకుట్మలస్తనీ
హా కమనీయగాత్రి సతి హా నవమోహిని హా వధూమణీ
హా కనకాంగి నేను విడనాడితి నంచుఁ దలంచె దీవు నీ
లోకమునందు జీవునకు లోలతగాక స్వతంత్ర మున్నదే ?

కవి తలవరులు తన శిరమును ఖండింపఁబోవునప్పుడొక పద్యమును వ్రాసి రాజునకంపఁగా నతఁ డది చదువుకొని కవిని క్షమించి, బిల్హణునికిని తన పుత్రికకును గల యన్యోన్యానురాగమును విచారించి, తన కూఁతు నాతనికిచ్చి వివాహముచేసెను.

మ. పొలుపొందన్ ద్విజరాజశేఖరునకున్ భూభృద్వతంసంబు ని
శ్చలభావోన్నతిఁ గన్య నిచ్చుపగిదిన్ జ్యోత్స్నాకముఖ్యంబుగాఁ
బొలుపొందన్ ద్విజరాజశేఖరునకున్ భూభృద్వతంసంబు ని
శ్చలభావోన్నతిఁ గన్య నిచ్చె సుమనస్సంతానము ల్మెచ్చఁగన్.

# 66. రేవణూరి వేంకటార్యుఁడు

ఇతఁడు శకుంతలాపరిణయమను మూఁడాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఇతఁడు నందవరీక వైదిక బ్రాహ్మణుఁడు; శ్రీవత్స గోత్రుఁడు; తిరుమల కొండయార్యపుత్రుఁడు. ఈతఁడు తన శకుంతలా పరిణయము నొకానొక రాజున కంకితముచేయ నుద్దేశించియుండఁగా నొక కరణము విఘ్నమాచరించినట్టును, అందుచేతఁ దనకృతిని వేంకటేశ్వరుని కంకిత మొనర్చినట్టును, గవి యీ క్రింది వాక్యములలో వ్రాసికొని యున్నాఁడు—

వ. అపూర్వపూర్వకవిసుపర్వపానుగ్రహంబునఁ బుణ్యగుణకథాశ్రవణకుతూహలిక బుధసదానుబంధంబగు నొక్క ప్రబంధంబు సరససుమనోనుబంధంబుగా నిర్మింపం బూని యున్న సమయంబున నతిప్రభావసంపన్నుం డగు కశ్చిత్ప్రభుండు—

శా. శ్రీవత్సాన్వయు రేవణూరికులజున్ శ్రీపాదరేణుప్రభా
సౌవర్ణ్యస్ఫుటకావ్యకల్పకకవిన్ సంకీర్తనాచార్యపు
త్రీవంశోత్తము నందవైదికబుధాద్రిప్రోక్తవృత్తిస్వయం
భావుకన్ దిర్మల కొండయార్యసుతు శుంభద్వేంకటాభిఖ్యునిన్.

క. పిలువంబంచి యెదుర్కొని । మిలమిల నలఘుప్రభానమిద్ధాస్థాన
స్థలిఁ జాఁగిలి మ్రొక్కి వటీ కలితసుఖాసీనుఁ జేసి కలకల నగుచున్.

చ. కనుఁగొని చంద్రికాభిసుముఖప్రదనందవరాగ్రహారపా
వన ఘన పెద్దిభట్లకులవార్ధినిశాకర నీవు శ్రీనివా
సుని యలమేలుమంగకృపఁ జొక్కిన దిక్కరి వాంధ్రభూమిరా
డ్వినుతసభాస్థలీవననవీనపికంబవు కాకలీకృతిన్.

శా. సల్లాలిత్యభవత్కవిత్వపటిమాసందర్భవైదర్భికా
సల్లాపంబులు మామకీనకులస్వామీంద్ర కీలాద్రి రా

ణ్మల్లేశుండును మెచ్చ నొక్కకృతి నిర్మాణంబు గావింపుమా
నుల్లీపుల్లసుమోల్లసన్మధురధురీమాధుర్యకౌదార్యతన్.

మ. అని హేమాంబరరత్నభూషణసుగంధాలంకృతుం జేసి స
ద్ఘనసారస్ఫుటవీటికాదు లొసఁగన్ గైకొంచు వాణీవధూ
వనజాతాంఘ్రిఘులద్ఘలన్నటనజిహ్వాస్థానవాగ్గోస్తనీ
జనితానందమరందకందళనదీజంఘాలవేలాస్యుఁడై.

వ. అమ్మహాకవివరుండును దదీయవంశావతారసర్ణయవర్ణనానుపూర్వంబుగాఁ దత్ప్రబంధబంధురానల్పకల్పనంబొనరించి తత్సముచితకృతికన్యాకరణంబునకు నవకరణంబుగా నుపకరణంబగు నొక్కకరణంబు కృతఘ్నుండై విఘంబుచేసిన......శ్రీ వేంకటరమణునకు......దండప్రణామ పుష్పాంజలి ప్రపూర్ణభర సమర్పణంబుగా సమర్పించెద.

ఇంత చెప్పినవాఁడు కశ్చిత్ప్రభుండనక యాప్రభుఁ డెవ్వఁడో పేర్కొనియుండిన పక్షమునఁ గవికాలనిర్ణయమున కనుకూలపడియుండు నేమో! అయినను కవి తన శకుంతలాపరిణయమునందుఁ జేసిన యీకవి వర్ణనమునుబట్టి యితఁ డాధునికుఁడగుట స్పష్టమగుచున్నది—

మ. పరఁగన్ భారతకల్పనారతులు శబ్దస్ఫూర్తి సంధింప ని
ర్భరవృత్తిన్ బరమేశపోతఘను లాలంకారము ల్గూర్పఁ జూ
పరులై నట్టి పితామహాద్యులు నుతు ల్పాటింప నర్తించు నీ
సరసాంధ్రోక్తివధూటి కేను సుమనస్సంపూర్తి గావించెదన్.

ఈ కవి నూఱు నూటయేఁబదిసంవత్సరములక్రిందట నుండియుండవచ్చును. ఇతఁడు శబ్దాలంకారములనిమిత్త మమితముగాఁ బాటుపడి గ్రంథమునందు వ్యాకరణదుష్టములైన ప్రయోగముల ననేకములను జేసియున్నాఁడు. వసుచరిత్రములోని కల్పనలనుబోలిన కల్పనల ననేకములఁ జేసినను మొత్తముమీఁద నీతని కవిత్వము శబ్దాలంకార భూయిష్ఠమయి హృద్యముగా నున్నది. ఇతఁడు తాను రామచంద్రోపాఖ్యానమను మఱి

యొక గ్రంథమును జేసినట్లు చెప్పుకొనెనుగాని యాగ్రంథము దొరకలేదు. ఈతని కవితారీతిని జూపుటకయి శకుంతలాపరిణయములోని కొన్నిపద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. సింగము లెన్న నీరలకు సిద్ధముగా మొలబంటి మత్తమా
తంగశిరస్తటంబులు పదంపడి జొమ్ములబంటి యంచు సా
రంగచయంబు లెల్లను సరాసరిగా నెదిరింపలేక మా
వంగడపున్వ్యసనామణుల వాలికచూపులకున్ భయంపడున్. ఆ. ౧.

ఉ. శ్రేణులుగట్టి మౌనిజనశీర్ష జటాచ్ఛట లుద్గమింప న
క్షీణవిరాగయోగములు చెందును బల్లవరాజకోటికిన్
స్థాణులకున్ సరాగగుణసారతరాంకురలబ్ధి గల్గు పూ
బోణులమేని వాసనలు పొర్లినమాత్రఁ దదాశ్రమంబునన్. ఆ. ౨.

ఉ. వారనిప్రేమ నేగి రెటు వారనిశన్ విని మారునిర్దపున్
వారుప మైనయక్కలికి వారు వనంబునకున్ ఫలంబుల
వ్వారిగఁ దేరఁగాఁ జనిరి వారిఁ గనుంగొను గారవంబునన్
మీ రరుదేరఁగాఁ దెలిసి మీఱురు వారిటువత్తు రింతకున్. ఆ. ౩.

---

## 67. పోచిరాజు వీరన్న

ఈ కవి తాను కృష్ణార్జున సంవాదము, పంచకావ్యములు, విభూతి మహాత్మ్యము, మార్కండేయ చరితము, మనువంశపురాణము, ముక్తిదేవుకథ, ఆనందలహరి, సౌందర్యలహరి, సుభాషితము, అను గ్రంథములను రచియించినట్లు భల్లాణచరిత్రమున నీ క్రింది పద్యములలోఁ జెప్పుకొన్నాఁడు—

సీ. పదునాలు గగునేట మొదట, గృష్ణార్జున
సంవాదము ప్రబంధసరణియయ్యెఁ
బదునెన్మిదగునేటఁ బంచకావ్యము లాంధ్ర
పద్యకావ్యములుగాఁ బరిఢవిల్లె
నిరువది రెండగునేట విభూతిమా
హాత్మ్యంబు ద్విపదకావ్యముగ నొప్పె
నిరువదియాఱగునేట మార్కండేయ
చరితంబు రచితమై సంఘటిల్లె
ముప్పదగునేట మనువంశ ముఖ్యనృపపు
రాణము ప్రకల్పితంబయి ప్రకటమయ్యె
ముప్పదాఱగునేట శ్రీముక్తదేవు
కథ కథితమయ్యె నాచేతఁ గౌశలమున.
గీ. సంస్కృతంబై శంకరాచార్య విరచి
తంబు లానందలహరి సౌందర్యలహరి
భర్తృహరికృతమైన సుభాషితమును
శతకములుగాఁగ మత్ప్రకల్పితములయ్యె.

ఇందుఁ జెప్పఁబడినవానిలో నీపుస్తకముగాక మాకు మనువంశపురాణ మొక్కటిమాత్రము లభించినది. భల్లాణచరిత్రమును గవి బందరుపురములో నుండిన చిత్రకార (ముచ్చి) కులస్థుఁడయిన దాము ముగ్గన్న కంకితముచేసెను. బందరుపురమును చిత్రకారకులమును వర్ణించిన పద్యముల రెంటి నిందుఁ బొందుపఱిచెదను.

సీ. శ్రీకంఠ వైకుంఠ సేవావికుంఠ వందారుమందిరము బందారుపురము
నిరతోత్సవైశ్వర్యనికరాభిభూత బృందారకపురము బందారుపురము
సంతతాయాత యాచకజనవ్రాత మందారభాసురము బందారుపురము
సకలవర్ణాశ్రమాచార సంపత్యమందారతిభరము బందారుపురము

శిల్పిన ర్తక వ ర్తక చిత్రకార । సూత్రకారాదివివిధవిచిత్రకృత్య
దానధర్మపరప్రజోత్కరచకోర। కారవిందారికరము బృందారపురము.

ఉ. ఆపురి నుంద్రు దాముకులజాఢ్యులు మాౘక్తికసంప్రదాయు లు
దీపితకీర్తిరింఛోలు రతిధిప్రియశీలురు శూలిపాదపూ
జాపరతంత్రమంత్రగుణశాలు లఘూటవివేకులు లర్హా ధ
ర్మోపకృతిస్వభావమతియుక్తులు చిత్రవిధానశక్తులున్.

మనువంశపురాణము బెజవాడ మల్లేశ్వరస్వామి కంకితము చేయఁబడినది. దీనికి ఖండకపాలాఖ్యానమని నామాంతరము. కవి నియోగి బ్రాహ్మణుఁడు; తండ్రి వీరభద్రుఁడు; తల్లి మూర్తిమాంబ; నివాసస్థలము కృష్ణామండలములోని కొలకలూరు. ఇతఁడు కౌండిన్యగోత్రుఁడు. ఇతఁడు నూఱుసంవత్సరముల క్రిందటివాఁడయి యుండవచ్చును. ఈతనికవనధోరణి యీ క్రింది పద్యములవలనఁ దెలిసికోనచ్చును—

భ ల్లా ణ చ రి త్ర ము.

చ. కలువలసొంపు దాఱె భుజగంబులు పుట్టల దూఱెఁ దారకా
వళి రుచి జాఱెఁ జక్కవలవంతలు దీఱెఁ జకోరకవ్రజం
బులసుఖ మాఱె దమ్ములకు మోదము లూరె నిశాకరద్యుతుల్
వెలవెలఁబాఱెఁ దూర్పుదెస వెల్లడిగాఁ దెలవాఱె నయ్యెడన్. ఆ-౧

ఉ. ఇంటికిఁ దోడితెచ్చి యవనీశ్వరుఁ డవ్విటరూపుఁ డైనము
క్కంటిని బీరసంగతునిగా నొనరించి సపర్యసల్పి నే
జంటకు మాఱుఁగా దలఁచి జాజులు నించినసెజ్జఁ జేర్చి వా
ల్గంటినిజూచి పల్కెఁ గుతుకంబు మనంబునఁ దొంగలింపఁగన్. ఆ-3

మ ను వ ం శ పు రా ణ ము.

మ. ఖల! దుష్టాత్మ! మనుప్రభూత! బుధధిక్కారంబుఁ గావించి తీ
విల నీయన్వయ మింతనుండి వసుధాధీశత్వనిర్ముక్తమై

తిలఘూతవ్యవహారలక్షణముత్రో దీనత్వముం బూని ని
ష్కళమై యుండెడుఁగాత సర్వజనము ల్గర్వింపహైన్యంబునన్. ఆ-౨

శా. భూనాథో త్తము! మేదినీసురధనంబు ల్గోరఁగాఁ గూడ దీ
ధేనూ త్తంసము యజ్ఞకార్యమునకు న్నాదిద్రవ్యమౌఁ గావునన్
దీనిం బట్టఁగరాదు మీ రఖిలధాత్రీపాలకుల్ ధర్మని
ష్ఠానై పుణ్యులు మీ రెఱుంగనికథాసంఘుం బిలం గల్గునే. ఆ-౪

---

# 68. అయ్యలరాజు నారాయణకవి.

ఈకవి హంసవింశతికథల నయిదాశ్వాసముల పద్యకావ్యము నుగా రచియించెను. హంసవింశతియందు తెట్టమతమును రచియించిన కవు లీపద్యమునఁ జేర్పఁబడియున్నారు—

ఉ. అయ్యలరాజుఁ దిప్పసచివాగ్రణిఁ బర్వతరాజు రామభ
ద్రయ్యను భాస్కరాగ్రణిఁ బ్రధానవరుం డగుకొండధీరునిన్
జయ్యనఁ దిమ్మయప్రభుని సత్కవితారచనాఢ్యులైనమా
యయ్యలరాజువంశజుల నాదికవీంద్రుల సన్నుతించెదన్.

౧౫౭౫వ సంవత్సరమునందుండిన కవులను బేర్కొనియుండుటచేత నితఁడాకాలమునకుఁ దరువాత నుండినవాఁ డనుటస్పష్టము. ఇతఁ డిప్ప టికి నూఱుసంవత్సరముల క్రిందట ౧౭౦౦ద సంవత్సరప్రాంతములయం దుండియుండును. పైపద్యమునఁ బేర్కొనఁబడిన యయ్యలరాజవంశజుల యినకవులలోఁ బర్వతరాజును గొండయ్యయుఁ దిమ్మయ్యయుఁ జేసిన గ్రంథము లేవియో తెలియరావు. ఈకవితండ్రి సూరనార్యుఁడు; తల్లి కొండమాంబ; గోత్రము కౌండిన్యసగోత్రము. ఈతనికవిత్వములో లక్షణ విరుద్ధము లయిన ప్రయోగము లనేకములు గలవుగాని మొత్తముమీఁదఁ

గవిత్వము ప్రౌఢమయి రసవంత మయినదిగా నున్నది. ఈపుస్తకమునం దన్యదేశ్యము లనేకములు వాడఁబడియున్నవి. ఈతఁడు మాజాతులవారిని వర్ణించవలసివచ్చినప్పుడు మిక్కిలి కష్టపడి వారివారికుచితము లయిన యుపకరణాదులనామముల నన్నిటిని సంగ్రహించి వివరించియున్నాఁడు. ఈకథయొక్క ముఖ్యోద్దేశము

ఉ. మున్నలరావణాదుల సమృద్ధతి సాధ్వులఁగోరి యేమిసౌ
ఖ్యోన్నతిఁ జెంది రల్లగుట నుర్వ జనావళు లన్యకాంతలన్
బన్నగఁ గోరరాదు కడుఁబాతక మంచుఁ దలంచి యింతిపై
నున్నమనంబు ద్రిక్కని యథోచితపద్ధతి నుండె భూవరా.

అన్న ట్లొకపురుషునిమనస్సు నన్యకాంతనుండి విముఖముచేయుటయే యయినను, పుస్తకమునిండ అంకుపోయి బొంకాడి తప్పించుకొన్న యుపాయములే వర్ణింపఁబడియుండుటచేత నిది దుర్నీతిబోధకమయి నీతిపరులకుఁ బఠనయోగ్యము కానిదయియున్నది. ఈపుస్తకమునుండి కొన్నిపద్యము లిందుదాహరింపఁబడుచున్నవి—

శా. పన్నీట న్నయనంబు లొత్తెఁ దనువుం బాటీరపంకంబుతోఁ
జెన్నారం బద నిచ్చి గీఱి సిగ వేసెం దాయెతు ల్పొట్టె జీర్
సొన్నాపట్టెరుమాలు గట్టె జలతారుప్పట్టంచుడాల్మించుమేల్
మిన్నాసన్నపుదుప్పటంబు వగహాళిం గప్పెసొంపారఁగన్. ఆ-౧

చ. కమటము కట్లసంచి యొరగల్లును గత్తెర సుత్తె చీరముల్
ధమనియు శ్రావణంబు మొలత్రాసును బట్టెడ నీరుకారు శా
ణము పటకారు మూస బలునాణెపరీక్షలమచ్చు నాదిగా
నమరఁగ భద్రకారకసమాహ్వయుఁ డొక్కరుఁడుండునప్పురిన్. ఆ-౨

శా. పున్నాగంబును గెల్వఁజాలు రుచిరాంభోజాస్యవేణీరుచుల్
పున్నాగంబును నవ్వనోపు నెఱయన్ లోలాక్షియానంబులుం

బున్నాగంబును గేరిమీఱి మెఱయుం బూఁబోఁడినూగారుడాల్
పున్నాగంబును మించు నాభిచెలువంబున్ సారెవర్ణింపఁగన్. ఆ-3

మ. చతురోపాయసమర్థుఁ డప్రతికళాచాతుర్యధుర్యుండు వి
శ్రుతకార్యజ్ఞుఁడు రాజనీతిపదదక్షుం డింగితజ్ఞానుఁ డ
ద్భుతశక్తిత్రయపారగుండు గుణసంపూర్ణప్రభావుండు సం
తతభూపాదరణీయుఁ డొక్కరుఁ డమాత్యశ్రేష్ఠుఁ డుండుం బురిన్. ఆ-౫

# 69. వెణుతుర్ల వడ్డికవి

ఇతఁడు శృంగారరసాలవాల మనుపేరుగల మూఁడాశ్వాసముల యలంకారశాస్త్రమును రచియించెను. ఇతఁడు ప్రథమశాఖ బ్రాహ్మణుఁడయినట్టును రామభక్తుఁడయినట్లును శృంగారరసాలవాలములోని యీ క్రింది పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది—

ఉ. శ్రీరఘువీరభక్తిరససింధువిహారుఁడ శుక్లయాజుషా
చారుఁడ దేశికాంఘ్రిపరిచారుఁడ నే వెణుతుర్లవంశవి-
స్తారుఁడ వడ్డినామ కవిసత్తముఁడన్ రఘువర్యుపేర శృం
గారరసాలవాల మను కావ్య మొనర్తు జగద్ధితంబుగన్.

ఈ కవి కౌండిన్యసగోత్రుఁడు; వేంగనార్యపౌత్రుఁడు; మంగళగిరి పుత్రుఁడు. ఈతనికాలమేమో తెలియరాలేదుగాని కవిత్వము రసవంతమయినదిగాఁ గనుపట్టుచున్నది. శృంగారరసాలవాలములోని పద్యముల రెంటి నిందుఁ జూపుచున్నాను—

ఉ. నందనమున్ హసింపఁగలకోమలి కోమలదేహవల్లి పైఁ
గందళితంబు లయ్యె సితకాంతులు సంతత మమ్మొకుందు నిం
పొంద మనంబులోన నిడియున్న మనోభవుఁ డంచు నాతనిన్
గ్రందుగనేయు పుష్పశరగాఢరుచుల్పయిఁ దోఁచెనో యనన్. ఆ-౧

ఉ. అసలు కాన లిచ్చి కపటాత్మనఖు ల్పొదరిల్లు చేరగాఁ
దీసిన నందు నిందుముఖి తెల్లమిగా హరి లేమిఁ జూచి వి
శ్వాసముతోఁడుత స్మరలివచ్చునెడన్ మరలింప దచ్చటన్
భాసిలు చంచరీకములబారు గనుంగొను దృష్టిపెంపునన్. ఆ. 3.

---

# 70. కొత్తలంక మృత్యుంజయుఁడు

ఈకవి బృహన్నారదీయము, ధరాత్మజాపరిణయము, నిరోష్ఠ్యనల చరిత్ర, అనుపద్యకావ్యములను రచియించెను. ఇతఁడు శివబ్రాహ్మణుఁడు. శివాలయములలో నర్చకులుగానుండెడి యీతెగబ్రాహ్మణుల నీప్రాంతములయందు శివలవాండ్రని వాడుదురు. ఈతని నివాసస్థలము గోదావరీ మండలములోఁ గౌశికీతీరమందున్న కొమరగిరిగ్రామము. ఈకవి బోధాయనసూత్రుఁడు; భారద్వాజగోత్రుఁడు; విశ్వనాథపుత్రుఁడు. ఈతఁడించు మించుగా నూఱుసంవత్సరములక్రిందట నుండినవాఁడు. ఈతని మునిమనుమ లిప్పటికిని గోడి యను గ్రామములో జీవించియున్నట్టు వినుచున్నాము. ఈతని కవిత్వము హృద్యమయి సలక్షణముగా నుండును. ఇతఁడు రచియించిన పుస్తకములలో బృహన్నారదీయపురాణ మాఱాశ్వాసముల గ్రంథము; ధరాత్మజాపరిణయము నాలుగాశ్వాసములద్వ్యర్థికావ్యము; నిరోష్ఠ్య నలచరిత్ర మైదాశ్వాసముల చిత్రకావ్యము. ఈ కావ్యములలో ధరాత్మజాపరిణయమును కవి తన కాశ్రయుఁడైన యల్లూరి యప్పలరా జనుక్షత్రియుఁడు రచియించిన ట్లవతారికలోఁ

ఉ. ఎల్లజగంబులం గరుణ నేలెడువేలుపు నిందిరామనో
వల్లభు నాశ్రయించి యనవద్యతదీయకృపావిభూతి భూ
వల్లభసత్సభావిబుధవర్ణ్యకవిత్వవిరూఢిఁ గన్న శ్రీ
యల్లురి వంశసంభవుఁడ నప్పనృపాలక నామధేయుఁడన్.

ఇత్యాదిపద్యములచేఁ జెప్పినను, ఆశ్వాసాంత గద్యమునఁ దనపేరే వేసికొనియున్నాఁడు. ఈప్రాంతములయందలి క్షత్రియులు సామాన్యముగాఁ దాము మాధవవర్మసంతతివారమని చెప్పుకొనునట్లే యీయయ్యలూరివారును మాధవవర్మసంతతివారే యయినట్లు ధరాత్మజాపరిణయమునందు వంశకర్తగా మాధవవర్మ యిట్లు వర్ణింపఁబడెను—

ఉ. మాధవవర్మ నాఁగ నొకమానవభర్త జనించి విస్ఫుర
ద్బోధసమగ్రుఁడై కనకదుర్గను శ్రీజయవాటికాపురీ
సౌధవిహారిణిం గొలిచి చక్కఁగ దత్కరుణారసంబుచే
నీధర హేమవృష్టిఁ గురియించె నతిస్థిరకీర్తి మీఱఁగన్

కవినిగూర్చి వ్రాయఁదగిన విశేషము లంతగాఁ దెలియనందున, పూర్వోక్తగ్రంథములనుండి కొన్నిపద్యముల నుదాహరించి విరమించుచున్నాము—

## బృహన్నారదీయము.

చ. హృదయమున న్వివేక మొకయించుక లేనిదురాత్మునింటిసం
పదలు శరన్నదీజలముభంగి నశించు ననూయ యాత్మలోఁ
బొదలినవానిసంపదలు పోఁడిమిఁ దక్కును మారుతంబుతోఁ
గదియుతుపానలంబుక్రియఁ గంజభవాత్మజ యాలకింపవే. ఆ. ౨.

ఉ. ధ్యానవిహీనుఁ డయ్యు ననయంబు జితేంద్రియవర్గుఁ డయ్యెనా
యానరుఁ డెన్నఁడుం జెడని యట్టిపదంబున నుండు నిశ్చల
ధ్యానసమేతుఁ డింద్రియజయం బొకయించుక లేకయున్నఁ ద
ద్ధ్యానము నిష్ఫలం బగు నతండును మూఢుఁ డనం బ్రవర్తిలుౕ. ఆ. ౧

## ధరాత్మజాపరిణయము.

ఉ. అనఘ వసిష్ఠముఖ్యముని ముఖ్యు లవిబుధౌఘముఁ గూడి యమ్మహా
వనివిభుఁ బూర్ణభూతిభవు వర్ణితతేజునిఁ జూచు వేడుకం

జని విలసిల్లుతద్వీపులసంజనితభ్రమదాన్వితాధికా
ననసుమమం గనుంగొని మనంబున నుబ్బుచుఁ బల్కె రీగతిన్. ఆ-౨

ఉ. ఆగ్రహబుద్ధిచేత విషయంబు లశేషముగా జయించి లో
కాగ్రియబాహుశౌర్యగతి యాగవిహింపకుఁడై తనర్చు న
య్యగ్రునిమీఁద శాతశర మొక్కటి వేయఁగ సమ్మతింపుమా
నిగ్రహభూతవైరిగణ నీదగు పట్టికార్యసిద్ధికిన్. ఆ. 3.

ఉ. అచ్చట నచ్చట న్వెలయునచ్చపుఁబచ్చలతోరణంబులన్
రచ్చల హెచ్చులైననెలరాలయరంగులరంగుల న్సదా
లచ్చికి నాటప ట్టయినలచ్చనము ల్పరికించి చూచుచో
నొచ్చము లేనియచ్చెరువు నొందఁగఁజేసెఁ బురంబువారికిన్. ఆ-౪

నిరోష్ఠ్య నలచరిత్ర.

ఉ. అల్లలితాంగి చంచలకటాక్షనిశాతశరాళి నేయఁగాఁ
గల్లరి యైనచిత్తజుసిగాసిఁ దలంకితిఁ ద్రాసరీతి సం
ధిల్లఁగఁ గీరసంతతికి దీనత గాంచితి శారికాకకే
జల్లని తల్లడిల్లితిని జల్లనిగాలికి సంచలించితిన్. ఆ. ౨.

ఉ. చంచలరీతిగా నధికచంచలతం గనినట్టియిందిరా
చంచలనేత్ర నెల్లెడ నచంచలఁగా నెడఁదం దలంచి యా
చించినయర్థిరాజి నిరసించిననిర్గతకీర్తి కెంత చిం
తించిన నక్కటా తగిననిష్కృతి కల్గఁగ నేరదేగదా. ఆ. 3.

చ. అలిగినయ త్తఱిం గలఁక నందక సారదయానిరీక్షచే
నలరఁగఁ జేసినత్తఱి నహంకృతిఁ జెందక ధాత్రిరీతి ని
శ్చలత నిజేశసన్నిధిని సంతతహర్షనిశాంతచిత్తయై
చెలఁగెడికన్య ధన్యగతిచే నలరాడెడి సారసాననా. ఆ. ౫.

అంతర్వేది నృసింహస్వామి కంకితము చేయఁబడిన యీనిరోష్ఠ్య నలచరిత్రము కొన్ని వ్రాఁత ప్రతులలో—

"ఇది శ్రీమద్భవానీశ్వర శాశ్వత కృపాపాత్ర క్రొత్తలంక విశ్వనాథ పండితపుత్ర సకలసుకవి జనానుగ్రహసహాయ మృత్యుంజయనామ ధేయప్రణీతంబైన నలరాజచరిత్రము"

అను గద్యమునకు మాఱుగా

"ఇది శ్రీమ దంతర్వేది లక్ష్మీనృసింహస్వామి చరణారవిందైక రుద్ర రాజాన్వయాభరణ ధనంజయగోత్రపవిత్ర కూనవృపాలపుత్ర నిరర్గళ కవితావిలాస సంతోషితాశేష విద్వత్కవిరాజ తిరుమలరాజ ప్రణీతంబైన నలరాజచరిత్రము"

అను గద్యము కానఁబడుచున్నది. మృత్యుంజయకవి యీగ్రంథ మునొక్క కర్తృత్వమును ధనస్వీకారముచేత రుద్రరాజు తిరుమల రాజునం దారోపించి యుండును.

---

## 71. తిరుమలబుక్కపట్టణపు వేంకటాచార్యుఁడు

ధరాత్మజాపరిణయ మనుపేర మృత్యుంజయకవి రచించిన ప్రబం ధమువంటి దానినే యీకవి "యచలాత్మజాపరిణయము" అను నామము గల మూఁడాశ్వాసముల ద్వ్యర్థిప్రబంధము నొకదానిని రచియించి యున్నాఁడు. ధరాత్మజాపరిణయముకంటె నచలాత్మజాపరిణయము ప్రౌఢతరముగా నున్నది. ఈగ్రంథకర్త మిక్కిలి సమర్థుఁడు. ఇతఁ డాశ్వా సాంత గద్యమునందుఁ దన్నుఁగూర్చి యిట్లు వ్రాసికొనియున్నాఁడు—

"ఇది సర్వతంత్ర స్వతంత్ర సకలభాషావిశేష కవితాధురంధర ప్రతినవప్రబంధపరమేశ్వర శ్లేషయమక చక్రవర్తిబిరుదాంక తిరు మల-బుక్కపట్టణ శ్రీనివాస తాతాచార్యతనయ శ్రీమదణ్ణయా చార్య దీక్షితసుత పితృవ్య శ్రీనివాసాచార్య కృపాకటాక్షలబ్ధ

సకలపాండిత్య తర్కాలంకార వాగీశ్వర బిరుదాంక వేంకటా
చార్య ప్రణీతంబైన యచలాత్మజాపరిణయము."

ఈ వైష్ణవకవిగ్రామణి యేకాలపువాఁడో తెలియరాలేదుగాని మిక్కిలి యాధునికుఁడుకాఁడని తోఁచుచున్నది. అచలాత్మజా పరిణయములోని రెండు పద్యము లిందుక్రిందఁ బొందుపఱుపఁబడుచున్నవి—

ఉ. చల్లనివాఁడు పాదములచాయలఁ జేరిన నెల్లవారికిన్
గొల్లలుగాఁగ నూర్మికలుఁ గొబ్బున హంసకకంకణంబులున్
జల్లెడువాఁడు వాహినులసంఘటనం బ్రతికూలవర్తన
త్కుల్లకభూమిభృత్కులముఁ గ్రుంగఁగఁజేయునతండు మేదినిన్. ఆ-౧

ఉ. రాజకుమారశేఖరుఁడు రమ్యత నందిపయి న్వినోదమున్
రాజిల నార్యసంగతి యనంతసుఖాశ్రయ మంచు నెంచుచున్
దాఁ జనుదెంచెఁ దాపసహితస్థితి నవ్వల నివ్వల న్వనీ
రాజుల నుల్లసిల్లుమృగరాజులు తన్గని విస్మయింపడన్. ఆ-3.

# 72. కటికనేని రామయకవి

కువలయానందమని సాధారణముగా వాడఁబడెడి యలంకార శాస్త్రమును కువలయానందప్రకాశ మనుపేరితోఁ దెనిఁగించిన యీకవి చెఱుకునూళ్ళగోత్రుఁడు; సూరనకును బుచ్చమకును బుత్రుఁడు. కవి తనది పద్మనాయకకులమగుట యీక్రిందిపద్యముచే నిట్లుచెప్పియున్నాఁడు.

సీ. సకలజగజ్జనస్వర్గసోపానోర్మిగంగ యెచ్చట సీఘ్రగతి జనించె
పతిశాపజాశ్మతాపతితసతీశుద్ధభావకృద్రజ మెందుఁ బరిఢవిల్లె
సనకాదినిఖిలసన్మునిమనఃప్రకర ముల్మధుకరంబులమాడ్కి మలయునెచట
బలిబంధనోత్క్షేపకలితాబ్జజాండరోచులు కేసరాభ నెచ్చోటఁ గనియె
నట్టి నారాయణాంఘ్రిపద్మాంతరమునఁ
బుట్టినట్టి కులంబులఁ బూర్ణమహిమ

నాయకత్వముఁ గనుటచే నవ్యగరిమఁ
బ్రకటమయ్యెను పద్మనాయకకులంబు.

ఈ కవి గాలమేదో యెక్కడనుండినవాఁడో తెలియరాలేదు. ఆతఁడు నూఱు నూటయేఁబదియేండ్లక్రిందట నుండియుండవచ్చును—

గీ. సరసుఁ డకలంకవంశాబ్ధిచంద్రుఁ డనఘుఁ
డైన రంగార్యవర్యు సాహాయ్యమునను
గువలయానంద మిలను దెన్గున రచింపఁ
గడఁగితిని దుష్కరంబైన కార్యమునకు.

అను పద్యమునందుఁ గవి తానీగ్రంథమును రంగార్యుని తోడ్పాటుచేత రచించినట్లు చెప్పుకొనియున్నాఁడు. కవిత్వనైపుణి తెలియుటకయి కువలయానందప్రకాశముయొక్క మూడుఘట్టముల నుండియు మూఁడు పద్యము లిందుక్రింద నుదాహరింపఁబడుచున్నవి—

చ. అబలలయందుఁ గాంచనమునందు భ్రమ న్విధి కల్గఁజేసె నా
యబలలయందుఁ గాంచనమునందును భ్రాంతి దొలంగి నిష్ఠచేఁ
బ్రబలినవాఁడు చూడఁగ నరాకృతిఁ దాల్చి చెలంగుచున్నయ
న్నిబిడపరాక్రమక్రమవినిద్రుఁడు కేవలరుద్రుఁడే ధరన్. ఘ ౧.

చ. ధనికులమోము గన్గొనవు దబ్బఱ లాడవు వారి గర్వదు
ర్వినయవచస్తతు ల్వినవు వేమఱు వారల డాయఁబోవు క్ర
న్ననఁదినెదిచ్చ నూతనతృణంబుల నిద్దురరాఁగ నిద్దురం
గొనియెద వెందు నేమివ్రతగోష్ఠిని జల్పితొ తెల్పు మేణమా. ఘ-౨

చ. ధృతిని మధువ్రతంబులు విజేష్టమధువ్రపయైన పద్మసం
తతి ముకుళింపఁజేసె వెసఁదా నితఁ డంచుఁ దలంచి పంకజా
హితతబింబముల్ బలిమి నేర్చి వడిం గడు నాక్రమించి యం
చితముగ మేన నంకమునుచేసె విజం బిది యెన్నిభంగులన్. ఘ-3.

# 73. కొండమడుగు పురుషోత్తమకవి

ఈ కవి సానందగణేశ్వర మను మూడాశ్వాసముల గ్రంథమును రచించెను. పుస్తకము దీబగుంట వీరేశ్వరస్వామి కంకితము చేయఁబడినను, కవి తన గ్రంథమును కుంజేటి బుచ్చయ్య యను కోమటియొక్క ప్రార్థన మీఁద రచియించి యందుఁ గోమటి నీవిధముగా వర్ణించెను—

శా. సాలంకాయనమౌని పూర్వమున భాస్వద్దివ్యతేజోధనుం
డాలీలానిధివంశసంభవులలో నత్యుజ్జ్వలోదారవా
గ్జాలు రన్యత్యధనుల్ కుబేరసదృశుల్ సౌభాగ్యభాగ్యోదయుల్
మేలింపొందిన వైశ్యవర్ధనులు గాంభీర్యామితౌదార్యులున్.

కవి నియోగిబ్రాహ్మణుఁడు; భారద్వాజగోత్రుఁడు; గిరియప్ప నందనుఁడు. కవి తన కయ్యలూరు మొదలయిన యగ్రహారము లుండినట్టు వ్రాసికొనియున్నాఁడు. ఈతని కాలము సరిగా తెలియదు. నూఱు సంవత్సరముల క్రిందటివాఁడయి యుండును. సానందగణేశ్వరములోని రెండుపద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి.

ఉ. ఇంటికి నేగుదెంచి తనయింతిని గాంచి ప్రపంచవృత్తిగై
కొంటకుఁ బొంచి రత్నరుచికుండలమండితగండ యౌనవా
ల్గంటికి శంభుఁ డిచ్చినవరంబు కరం బనురక్తిఁ జెల్పిక
న్గొంటి భయంబుఁ దక్కు మికఁ గోమలికాముని లీలనేలెదన్. ఆ-౧

ఉ. మీనము లెట్లులం గడిమి మ్రింగుచు గాలములందు డిందు నెం
దేని పరాంగనారతికి దీకొనియే మిటు లైతి మింతె కా
దా నలినాయతేక్షణలయబ్రపుగుబ్బల గోరు లుంచఁగా
సోనగ నల్లవారినుపసూదుల గ్రుచ్చిరి మచ్చరంబునన్. ఆ. 3.

# 74. నాగులూరి శేషనారాధ్యుఁడు.

ఈకవి శ్రీపర్వతపురాణమనెడి యాఱాశ్వాసముల గ్రంథమును రచియించెను. ఈపుస్తకమునకు శ్రీశైలమాహాత్మ్యమని నామాంతరము గలదు. ఇతఁడు గ్రంథాదిని తెలుఁగు నిట్లు పొగడియున్నాఁడు—

చ. జనని సమస్తభాషలకు సంస్కృతభాష ధరాతలంబునన్
ఘనలలితార్థగౌరవవికాసి తెనుం గభిరమ్య మంతకున్
గనుఁగొనఁ జూతబీజమునకంటెను గోమల పత్రపుష్పశో
భనమృదుపల్లవాభినవబాలరసాలము సొంపు నింపదే.

ఆధునికుఁడే యయినను గవి యేకాలమునం దుండినవాఁడో సరిగా తెలియదు. ఇతఁడు నూటయేఁబదిసంవత్సరములక్రిందట నుండియుండవచ్చును. ఈతనికవిత్వము సరసమయినది. శైలిని జూపుటకయి శ్రీపర్వతపురాణమునుండి రెండుపద్యముల నిందుదాహరించుచున్నాను—

ఉ. శ్రీనగకంధరంబున వసించి చరించుపుళిందబృందముల్
భూనుతభోగమోక్షములఁ బొందఁగఁ జూచి నిలింపసంఘముల్
శ్రీనిలయాభిరామ మగుశ్రీగిరిమీఁదఁ జరింతు రిట్లు య
మ్మానితనాకసౌఖ్యమహిమంబుల నెల్లఁ దృణీకరింపుచున్. ఆ. 3.

శా. పాటింపందగు ముజ్జగంబులఁ బుగప్రత్యర్థిజూటాటవీ
కోటీకోటరపావనామరధునీఘూర్ణోత్తరంగావళీ
వ్యాటీకాయతవేణికానికరసమ్యక్పుణ్యలో యచ్ఛటా
చాటుత్వంబు వహించుశ్రీనగముపైఁ జంచజ్జలశ్రేణికల్. ఆ ౯.

# 75. వీణెము లక్ష్మీపతి

ఇతఁడభిమన్యు పరిణయమనెడి రెండాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఇతఁడు సృష్టికరణవంశజాతుఁడు. వీణెము కృష్ణరాజునకును రంగమాంబకును జనియించినవాఁడు. ఇతఁ డభిమన్యుపరిణయములోఁ దన్నుఁగూర్చి యిట్లు చెప్పుకొనుచున్నాఁడు.

ఉ. మాగధవంశసంభవుఁడ మానితవీణెకులావతంసుఁడన్
భోగబిడౌజుఁ డార్యజనపూజిత వేంకటకృష్ణరాజునన్
బాగుగ రంగమాంబకును నౌరసపుత్త్రుఁడ లక్ష్మణాఖ్యుఁడన్
శ్రీగలుగన్ రచించెదను నే నభిమన్యుచరిత్ర వేడుకన్.

ఇతఁ డెప్పు డెక్కడనున్నవాఁడో తెలియరాలేదు. దాదాపుగా నితఁడు నూఱుసంవత్సరముల క్రిందటివాఁడయి యుండును. ఈతనికవిత్వ మంత మంచిదికాదు. అందు ఛందోవ్యాకరణదోషము లనేకములు కానఁబడుచున్నవి. అభిమన్యుపరిణయములోని రెండుపద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. పన్నినవీరయోధులను బాహుబలంబున నుగ్గుసేయు సం
పన్నుఁడ వార్యసత్త్వుఁడవు పాండవపౌత్త్రుఁడ వైననిన్నునున్
జిన్నెల పువ్వులు న్సరులుఁ జెన్నుగఁ గూర్పను నేరనట్టియీ
కన్నియ లెట్లు నీమనసు కాంక్షఁ గరంగఁగఁ జేయువారలో. ఆ. ౧.

ఉ. నారదమౌనిమాట మది నమ్మితి నేఁడది కానిచందమై
దూరము నోట కానఁబడెఁ దుర్వ్యరవాదులఁ జుట్టపక్కముల్
వారును వీ రెదుర్కొనుచు వచ్చుటకియ్యదివేళ పోవుచు
న్నారిఁక విఘ్నము ల్గలవె నన్నిట దైవము మోసపుచ్చునే. ఆ. ౮.

## 76. సోమనారాధ్యుల సంగమేశ్వరారాధ్యుఁడు

శైవుఁడయిన యీకవి యహల్యాసంక్రందనవిలాసమను నెడి మైదాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఒక యెత్తుగీతములో

గీ. అట్టిసాహసవిక్రమార్కాంకుఁడైన
వాసిరెడ్డ్యన్వయాంభోధివరవిధుండు
చంద్రమౌళిక్షమాపాలజనవిభుండు
కొలువుదీరి మహోత్సవాకుంఠగరిమ.

అని కవి వాసిరెడ్డి చంద్రమౌళిప్రభువు తన్నుఁబిలిపించి వేఁడఁగా తా నహల్యాసంక్రందనవిలాసము నారాజమౌళి కంకితము చేసినట్లు చెప్పెను. ఈవాసిరెడ్డిచంద్రమౌళి కృష్ణామండలములోని యమరావతీ పురమును బరిపాలించిన కమ్మవంశజుఁడు. ఇతఁడు సుప్రసిద్ధుఁడయిన వాసిరెడ్డి వేంకటాద్రినాయని సోదరపుత్రుఁడు. ఈకవి కవిత్వము ప్రౌఢమయినదికాని యిందు వ్యాకరణదుష్టములైన ప్రయోగము లనేకములు కానఁబడుచున్నవి. ఈగ్రంథము నూఱుసంవత్సరములక్రిందట రచియింపఁ బడినది. అహల్యాసంక్రందనవిలాసమునుండి రెండుపద్యముల నిం దుదాహరించుచున్నాను—

మ. పరకాంతారతిదోష మంచు మది సంభావింపఁడో యన్యు లె
వ్వరు గన్నం దను నిందసేతు రనుభావం బెంతయుం బూనఁడో
నరుఁ డొక్కింత యెఱింగనేని సిలుగు ల్వాటిల్లునం చెన్నఁడో
పరమామోదమెకాని యింద్రునకుఁ బాపభ్రాంతి లే దేమియుక్. ఆ-3

చ. సరిసరి! నిన్నువంటి నెఱజాణలు పుట్టరే? వార లెల్ల నీ
కరణిఁ దలంతురే? చిఱుతకార్యము లిచ్చటఁ జెల్లునే? యహో
వరమపతివ్రతైనమునిభామినితో నెకసక్కె మేమి? నీ
గరిమము గానవచ్చె నిది కాదనరో వినరో బుధాగ్రణుల్. ఆ. ౨.

# 77. ములపాక బుచ్చన్నశాస్త్రి

ఈకవి వేంకటేశ్వరమాహాత్మ్యమును పద్యకావ్యమును రచియింయించెను. ఇతఁడు కోనసీమ ద్రావిడబ్రాహ్మణుఁడు. ఈబ్రాహ్మణులనే యీరామద్రావిడు లనియు, పేరూరి యఱవ లనియు, వాడుదురు. వీరు మొట్టమొదట నఱవవారే యయినను జిరకాలము క్రిందటనే యీయాంధ్రదేశమునకు వచ్చి తోఁట దొడ్లను సంపాదించి యిచ్చటనే నిలిచిపోయినవారగుటచే నఱవభాషను మఱచిపోయి యించుమించుగాఁ దెనుఁగు భాషనే స్వభాషనుగాఁ జేసికొనియున్నారు. వీరు తెనుఁగున గ్రంథరచన చేయుటయే యీవిషయమును దెలుపుచున్నది. ఈకవి కోదండరాముని పుత్త్రుఁడు; భార్గవ గోత్రుఁడు; గుండ్లూరియం దుండినవాఁడు. ఇతఁడు తనపూర్వులను గూర్చియు, తన్నుఁగూర్చియు, వేంకటేశ్వరమాహాత్మ్యమునం దిట్లు చెప్పియున్నాఁడు—

సీ. అనుపమకోనసీమాభిధాన ద్రావిడాన్వయంబునను విఖ్యాతిమీఱ
ములపాకవా రనుముఖ్యాన్వవాయులు కాశ్యప భార్గవ కౌశి కాత్రి
గోత్రజు ల్గల రందు గురుతరభార్గవగోత్ర సంజాతుఁడై కొమరుమీఱ
వేంకటపతి వాని కుంకువమీఱ వెంగాంబికయందు సుబ్బాభిధాన
విబుధవరుఁ డుద్భవించె నవ్విమలమతికి
బుచ్చమాంబికయందు సంపూర్ణ చంద్ర
మండలమురీతి సత్కళామండనుండు
రహి జనించెను గోదండరామవిభుఁడు.

* * * *

సీ. మల్లవంశోద్భవక్ష్మాపాలపాలిత గుండ్లూరిపురి నుండు గురుయశోండ
నాంధ్రగీర్వాణభాషాష్టభాషాకవిత్వాభి నిర్మాణమహత్వవిదుఁడ,

గాశికావిశ్వేశ కరుణాకటాక్షాభి భాషితబహుళప్రబంధచయుఁడ
హితనాటకాంతసాహిత్యనిత్యాభ్యస్తసకలపురాణార్థసారవిదుఁడ
సాంద్రములపాళ విద్వత్కవీంద్రవంశ
వార్థిచంద్రుండ సర్వసర్వంసహాభి
విశ్రుత కుకవికులగోత్రవిపులపక్ష
శాతపవియైన బుచ్చనశాస్త్రికవిని.

ఇతనికాలము తెలియదు. ఇతఁడు నూఱుసంవత్సరముల పయివాఁడయియుండును. వేంకటేశ్వరమాహాత్మ్యమునుండి మఱి రెండుపద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. సంగతిమీఱ మీచరణసారస మందు జనించినట్టి యా
గంగకు దక్షిణంబున నగాధతరం బగుదక్షిణాబ్ధికిన్
రంగగు నుత్తరంపుదెస రాజిలుపూర్వసముద్రపశ్చిమా
శం గన నొక్క తా వమరు సారతరోన్నతదండకాటవిన్. ఆ. ౧.

చ. గిరిజయు నీవు నెల్లపుడుఁ గిన్నర పన్నగ సిద్ధ సాధ్య భూ
సుర నరసంఘము ల్గొలువ సొంపు దలిర్పఁగ జేరి యాసరో
వరతటసీమనుండుఁ డభివర్ణన కెక్క భవత్సమాఖ్య ని
గ్గిరియు సరోవరంబు ననఁ గేవలమోదముతో హరుం డనున్ ఆ-౧

# 78. పాలవేకరి కదిరీపతి

ఈకవి శుకసప్తతియను కావ్యమును రచియించెను. ఈతని కవిత్వము హృద్యముగానే యున్నది కాని పుస్తకమంతయు దొరకలేదు. దొరకిన రెండాశ్వాసములనుబట్టి చూడఁగా నితఁడు ప్రౌఢకవి యగుటకు సందేహ మగపడదు. "ఇది శ్రీమత్కదిరీ నృసింహ కరుణాకటాక్ష వీక్షణ సమాగత కవితాధార పాలవేకరికుల కలశాంభోనిధి సుధాకర తాడిగోళ్ళ కరియమాణిక్య నృపహర్యక్షపౌత్ర పవిత్రచరిత్ర కదిరిధరా మండలాఖండ పుత్ర విద్వత్కవిరక్షానుసంధాయక కదిరీపతినాయక ప్రణీతంబైన" ఇత్యాది గద్యమునుబట్టి చూడఁగా కవి నాయకకుంజుఁడయినట్టును, కరియమాణిక్యనృపపౌత్రుఁ డయినట్టును కదిరిరాజపుత్రుఁ డయినట్టును దెలియవచ్చుచున్నది. కవి నెల్లూరిమండలములోనివాఁడు. ఇతఁడు తనగ్రంథమును శ్రీరామాంకితము చేసెను. ఈతనికాల మేదో తెలియరాలేదు గాని యితఁ డాధునికుఁ డగుటకు సందేహములేదు. శుకసప్తతినుండి రెండుపద్యముల నిం దుదాహరించుచున్నాను—

చ. అలజయకేతనుండు రుచిరాంగతిరస్కృతమీనకేతనుం
డెలమి మదిం దలిర్ప దయ నేలికయుం దలిదండ్రు లయ్యెడన్
దలఁచినకార్యభాగ ముచితజ్ఞులచే విని నీతికార్యవ
ర్తు లగునియోగిపుంగవులతోడ రహస్య మొనర్చి యిల్లనున్. ఆ-౧

మ. అక్కట దోసతోఁట యిదియైనఁ దదీయఫలంబు లమ్మి యీ
డొక్కయు సాఁకఁ గోరితిఁ గడు న్నడురేయిని వచ్చి యెవ్వరో
మక్కువలేక నాకడుపుమంటయుఁ బుచ్చుకొనంగఁ బ్లాని యీ
చక్కెరవంటిపండ్లు తినసాగిరటంచుఁ గృశించు నెంతయున్.

# 79. మాధవమంత్రి

ఇతఁడు భగవద్గీతలను నాలుగాశ్వాసముల పద్యకావ్యమునుగా రచియించెను. ఇతఁడు గోదావరీమండలములోని నియోగిబ్రాహ్మణుఁడు. గిరిమనమంత్రి పుత్రుఁడు; కిడాంబి వేంకటాచార్యుల శిష్యుఁడు. ఈతని గ్రంథమునందు లక్షణవిరుద్ధములైన ప్రయోగము లనేకములు గానఁబడు చున్నవి. అయిన నితఁడు తనగ్రంథమునందు దత్తోజీ పండితవిరచిత మయిన భగవద్గీతలలోకంటె వృత్తముల నధికముగా వేసియున్నాఁడు. ఇతఁడు తనకృతిని భద్రాద్రిరాముని కంకితము చేసెను. ఈతని పుస్తకము నుండి రెండుమూడు పద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి—

మ. ధరఁ బాలియ్యక లోభకాంక్షయుతుఁడై ధాత్రీశుల న్మిత్రులన్
గురురాజీక్రితఁ జంపఁగాఁ దలఁచి తాఁ గ్రూరాత్ముఁడై యున్నచోఁ
బొరిగొన్నన్ దురితంబు చెంకు విను మీపాత్రోల్ల నాకేల య
స్థిర మీకాయము దీనికై కులజులం ద్రెళ్ళింపఁగాఁ బాడిన్? ఆ-౧

శా. విద్వన్ముఖ్యుఁడు కర్మపుంజములు తా విధ్యుక్తమార్గంబుచే
మద్వాక్యంబులరీతి సల్పుచును నాత్మం గాంచి యవ్వేళలన్
హృద్వాసంబున మోహ ముప్పతిల వర్తించు న్మమత్వాది రా
గద్వేషంబులు లేక యోగి సమతన్ గంభీరుఁడై ఫల్గునా. ఆ. ౨.

చ. పరులు నుతింపఁ జాలు నని పల్కుఁ జిత్తములం దలంచి సు
స్థిర మగుబుద్ధి లేక ఫలసిద్ధిని గాంక్ష యొనర్చి దంభులై
యిరవగునట్టిజ్ఞానమున కెంతొవిరోధము చేయునట్టి యా
నరు లొనరించు యజ్ఞము ఘనంబుగ రాజసయజ్ఞ మర్జునా. ఆ. ౪.

# 80. గోపాలుని సింగయ్య

ఈకవి భారవికృతమైన కిరాతార్జునీయ మను సంస్కృతకావ్యమును నయిదాశ్వాసముల గ్రంథముగాఁ దెనిఁగించెను. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; మౌద్గల్యగోత్రుఁడు; భాస్కరామాత్యపౌత్రుఁడు; వీరనమంత్రి పుత్రుఁడు. ఈకవి కర్నూలు మండలములోనివాఁడు. ఇతఁడు తనగ్రంథమును శ్రీమదహోబల లక్ష్మీనృసింహస్వామి కంకితము చేసెను. ఈకవిపుత్రుఁ డెనుబదిసంవత్సరములక్రిందట జీవించియుండెను. కాఁబట్టి కవి నూఱుసంవత్సరములక్రిందటివాఁడు. ఈతని కవిత్వము రసవంతమయి సలక్షణ మయినదిగా నున్నది. కిరాతార్జునీయకావ్యములోని కొన్ని పద్యముల నిందుఁ బొందుపఱుచుచున్నాను—

చ. కొలిచినభృత్యకోటి ననుకూలత నొప్పెడు మిత్రులట్ల మి
త్రుల మఱి బంధువర్గములతో సరిగాఁ గను బంధుజాలమున్
వెలయఁ గృతాధిపత్యమున విశ్రుతవర్తనుఁబోలె నాదరం
బలరఁగఁ దన్మయుం డగుచు నారయు లెస్సగ సంతతంబునున్. ఆ. ౧.

ఉ. భానుకరప్రసారపరభాగతలస్ఫురదింద్రనీలసం
తానవిరాజమానరజతస్ఫటికాంచితకుడ్యదీధితుల్
మానుగ నెంచిచూడ దినమధ్యమునందును గౌముదీభ్రమన్
భూనుత మాటిమాటికిని బుట్టఁగఁజేసెడుఁ జూడు మిగ్గిరిన్. ఆ. ౨.

ఉ. కొప్పులు వీడఁగా నడిచి గ్రొజ్జఁగిదండలు జాఱఁగొట్టియున్
గప్పురగంధము ల్చెదరఁగా వెసఁ దాఁకియుఁ బెక్కునేరముల్
తప్పక యగ్గతి న్సలిపి తత్సతు లందలిభీతిచేబలెన్
దెప్పర మైనకంపమునఁ దేలుచునుండెను వీచు లత్తఱిన్. ఆ. 3.

మ. అటులైన న్మఱియేమియన్న విను మీ యారాజు నీప్రాణసం
కట మావేళను వచ్చిసూకరముఁ దా ఖండించి రక్షించె ని

న్నటుగానం బరమాప్తుఁ డంచు మదిలో హర్షించి వైరింప కొ
క్కటియైయుండు కృతజ్ఞతానిలయు లౌఁగా ధర సజ్జనుల్. ఆ. ౪

మ. జయవాంఛ ల్విడనాడుచుం బఱచునాసైన్యంబులం జూచినన్
దయపుట్టె న్మదిలోన నర్జునునకుం దర్కింప నశ్లేకదా
భయులై చిక్కినసీచశత్రుల దయం బాటించి రక్షించినన్
నయముం గీర్తి మహాత్ములౌనరుల కెన్నంగావె యుద్ధంబులన్.ఆ-౫

---

## 81. గూళికల్లు వేంకటరమణకవి

ఇతఁడు కనకరంజితశిఖామణీపరిణయమను విక్రమార్కునిగూర్చిన యేడాశ్వాసములపద్యకావ్యమును రచియించెను. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; వేంకటమాత్యునకును రంగమాంబకును కుమారుఁడు. ఇతఁడు హరివంశమునుగూడఁ దెనిఁగించినట్లు కవినిగూర్చి వేంకటేశ్వరుఁ డనినట్లున్న కనకరంజితశిఖామణీపరిణయములోని యీ క్రిందిపద్యము వలనఁ దెలియవచ్చుచున్నది—

సీ. నీయిష్టదైవంబ నిన్నుఁబ్రోచుచుండెడు శ్రీవేంకటేశుండ నీ వెఱుంగు
మోవత్స యిపుడు నీభావంబు తెలిసివచ్చితి గూళికల్వంశశేఖరుఁడవు
వేంకటామాత్యుఁడై వెలయుమంత్రికిజిక్క లేటివంశజయావధూటిరంగ
మాంబకుజనియించిమాపేరుగొన్న వేంకటరమణుఁడవుసత్కవివి మాకు
మునుపు హరివంశ మంతయుఁ దెనుఁగు చేసి
యంకిత మొనర్చితివి విక్రమార్కచరిత
మిఁకఁ బ్రబంధ మొనర్చి మాకిమ్ము సిరులు
శుభము లొసఁగెదనని పల్కె సుముఖుఁ డగుచు.

ఈ వేంకటరమణకవి నూఱుసంవత్సరములక్రిందట నుండినవాఁడు ఈతని కవిత్వము రసవంత మయినదే. కనకరంజితశిఖామణీపరిణయము లోని రెరిఁడుపద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. అంత నితాంతమూమకతపోగ్ని దహింపఁ బురంబుతో మహీ
కాంతుఁడు మిత్రబాంధవసకాయముతోఁ బరిదగ్ధుఁ డైన ని
శ్చింతయు ఘోరకాననము వృద్ధి వహించె మదీయజీవముల్
చింతిరి మ స్తకాంతరముఁ జెందుట నేదరి గానకుండెదర్. ఆ-౧.

చ. తెలిపినవారు రంజిలుచు దేవర దేవరకు న్వరంబు ని
ర్మలమతి నిచ్చెఁ గావునఁ గుమారుని మారునివంటివాని న
ర్మిలి గలవాని సర్వజనమిత్రుని మిత్రునిమాడ్కి సత్ప్రితా
పలసితుఁ గాంచి యొప్పము శుభంబుల భంబులఁజేనిచాడ్పునన్. ఆ-౫

---

## 82. కృష్ణకవి

ఇతఁడు శకుంతలాపరిణయ మనెడి మూఁడాశ్వాసముల ప్రబంధ మును రచించెను. ఈకవి మైత్రేయసగోత్రుఁడు; నారసింహార్యునిపుత్రుఁడు కవి తన యింటిపే రేదో తా నేతెగ బ్రాహ్మణుఁడో చెప్పకోలేదుగాని శకుంతలాపరిణయ ప్రథమాశ్వాసములోని యీ క్రింది పద్యములనుబట్టి చూడఁగ నితఁడు వైష్ణవుఁ డై నట్లూహింపఁదగి యున్నది—

మ. నను రామానుజపాదపద్మయుగళీనవ్యావ్యయధ్యానపా
వనహృద్భాగవతావతంసపదసేవాసక్తచిత్తుర్ మరు
త్తనయారాధనచారులబ్ధ కవితాధార్యు సదారూఢభా
వన నాస్థానకవిన్ నిజాశ్రితుని బిల్వాంబంచి పల్కెం గృపన్.

క. పాత్రుఁడవై మైత్రేయస। గోత్రుఁడవై నారసింహగురువర్యునకున్
బుత్రుఁడవై వెలయుదు వీ। ధాత్రిన్ మాపనుపు సేయఁదగుఁ గృష్ణకవీ.

ఈ గ్రంథము చిఱుమామిళ్ళ ప్పాపయ్య యను కమ్మనాయని ప్రేరణమువలన రచియింపఁబడినది. కవి నూఱుసంవత్సరముల క్రిందటివాఁడు. ఈ గ్రంథము పిల్లవసుచరిత్ర మని దాక్షిణాత్యులు కొందఱనుకొనుచున్నారు గాని యీ ప్రాంతములయందు దీని కట్టిప్రసిద్ధి లేదు. అబ్బనామాత్య విరచితమైన కవిరాజమనోరంజమును, సూరకవి ప్రణీతమైన కవిజనరంజనమును, పిల్లవసుచరిత్రమని యిచ్చటివారు చెప్పుదురు. ఈ గ్రంథకవిత్వము శ్లాఘ్యమైనదే యైనను, పిల్లవసుచరిత్రమని చెప్పఁదగినంత శ్రేష్ఠముగా లేదు. ఈ కవి యనేక పద్యములను వసుచరిత్రాది ప్రబంధములనుజూచి వానిలోని పద్యములవలె రచియించి యున్నాఁడు. ఇందుకు నిదర్శనముగా వసుచరిత్రములోని పద్యము నొకదానిని శకుంతలాపరిణయములోని పద్యము నొకదానిని చూపుచున్నాను—

ఉ. కొండఁట విల్లు వేదలలకుండలిరాజఁట నారి యమ్మనం
తుండఁట బైటిపల్లియలఁ దున్నినవాఁడఁట యొండురెండు భ
ర్గుం డిది నింకుపౌరుష మొకో యని గెల్వవె ముజ్జగంబు లు
ద్దండత నొక్కతుంటవిలు దాలిచి యుంటివె గందుతూపులన్. వసుచ

ఉ. తుంటఁట కార్ముకంబు కరదొట్టిన తేంట్లఁట వింటినారి చే
నంటినవాడుతూపు లఁట యప్పులపాలఁట కేతనంబు వా
గంటిపులుంగు గుఱ్ఱమఁట కాయము లేదఁట నీకు లోకముల్
కొంటెతనంబున న్గెలిచితో లిది యచ్చెరియంబు మన్మథా. శకుంత.

ఇందప్రశస్తంబులగుప్రయోగంబులును గొన్నికానఁబడుచున్నవి.

క. ఆఖేటమునకు ధాత్రీ। లేఖర్షభుఁ డనుమతింప లేలెం డనుచున్
శ్లాఖించుచుఁ బడవాళుల। లాఖవమునఁ బనిచి రగ్గలంబుగ వారల్.

ఇందు శ్లాఖించు 'లాఖవము' అను పదము లపప్రయోగములైనను గావలెను, ఖఘుల కొండొంటికిఁ గూర్చిన యప్రశస్తప్రాసము లైనను గావలెను. ఈ పుస్తకములోని మంచిభాగము లనేకములు కాళిదాసుని

యభిజ్ఞానశాకుంతల నాటకమునుండి తెనిఁగింపఁబడినవి. అభిజ్ఞాన శాకుంత లములోని మనోహరములైన నాలుగు శ్లోకములలో రెంటిని గవి యీ క్రిందిరీతిని దెనిఁగించియున్నాఁడు—

చ. కనుఁగవ బాష్పపూరములు గ్రమ్మెడు గద్గదభిన్నమై యెలుం
గనువున రాదుసూ హృదయ మాకులమయ్యెడు మేను స్రాన్పడుం.
బెనిచినవాని కింతవగఁ బిమ్మటిఁ గ్రమ్మెడుఁ గన్నవారలుం
దనయను బంపలేక పరితాపభరంబున నెట్లు సైతురో.

మ. గురు శుశ్రూషలుసేయుమీ సవతులన్గూర్మి న్విలోకింపుమీ
పరివారమ్ములఁ బ్రోవుమీ సిరుల గర్వస్ఫూర్తిఁ గైకోకుమీ
పురుషుం దూఱకుమీ సతుల్ నడచు నేర్పు ల్నీకు సూచించితిన్
దరుణీ లోకమతల్లి చేకొనవె మాతల్లీ మదీయోక్తులన్.

ఇట్లున్నను మొత్తముమీఁదఁ గవిత్వము ప్రౌఢమనియే చెప్ప వచ్చును. కవిత్వప్రౌఢిమ తెలియుటకయి శకుంతలా పరిణయములోని రెండుపద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి—

ఉ. మోద మొనర్చెఁ బుష్పాదుల ముగ్గులపై నొఱపైన ముగ్గలన్
దేదఁగి పూలబొక్కెములఁ గెందలిరాకుల తోరణంబులన్
బ్రోది వహించు పక్వఫలపుంజములన్ శుకకోకిలాళి స
న్నాదములన్ నికుంజభవనంబుల నీలనృపాలసూతికిన్. ఆ. ౧.

శా. పాథఃస్నానంబులు పల్కు నేల నృపతీ పన్నీరకర్పూరక
ర్పూరస్ఫారపటీరసౌరభపయఃపూరంబె జంద్రాతపం
బారామానిలసేవనంబు మును మీ రక్శాంతముం గాంతురా
హారాళంబుగఁ బుత్రగాత్రమిళనం బెట్లుండునో చూడుఁడీ. ఆ. 3.

# 83. వల్లూరి నరసింహకవి

ఇతఁడు నాగ్నజితీపరిణయమను మూఁడాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఈకవి యాపస్తంబసూత్రుఁడు; కౌండిన్యగోత్రుఁడు; హనుమత్కవిపుత్రుఁడు; ఆఱువేల నియోగికులపవిత్రుఁడు; నూఱుసంవత్సరములక్రిందటివాఁడని తోఁచుచున్నది. ఈతనికవిత్వము రసికజన హృదయాహ్లాదకరముగా నున్నది. కవితాపటిమ తెలియుటకై నాగ్నజితీపరిణయములోని మూఁడుపద్యములనెత్తి చూపుచున్నాను—

చ. తనయునిముద్దుపల్కు చెవిఁ దార్కొన సంతసమందుచున్నత
జ్జనకునిరీతి మామకవచఃప్రకరంబు వినంగఁగోరి మీ
రెనసినవేడ్క నిట్లు సెల విచ్చుట నాయెడఁగూర్మిఁగాదె మీ
పనుపున విన్నవించెదను బద్మదళాక్షుశుభప్రసంగముల్. ఆ. ౧.

ఉ. వందుర నేల యిట్లు మగువా తగనా నగువాన జూడ కీ
యందటిలోనఁ జెప్పవుగదా పగదాయగదా యటంచు నా
గందు రటంచు నిట్ల యుడుగక నుడుగం దొడఁగందలంచి నీ
కందువ లింక మారు కొఱగాదఱగా లెఱగాను నెచ్చెలీ. ఆ. ౨.

ఉ. కోసలుఁ డాత్మ నే నృపులకున్ వృషభంబులఁ బట్టరామికిన్
గాసిలి వీనిఁ బట్టుకొని కట్టినవానికిఁ గన్య నిత్తు నే
బాస యొనర్చినాఁడ నని పల్కితి నింకిటుఁ దప్పి తేని పెన్
దోసము వచ్చు నీకొమరెతో జతగూర్పఁగ నెవ్వఁ డబ్బునో. ఆ.3.

# 84. గొంతేటి సూరన్న

ఇతఁడు కృష్ణాభ్యుదయ మనెడి యైదాశ్వాసములపద్యకావ్యమును రచించెను. ఈకవి తన్నుఁగూర్చి కృతిపతి యైనబొల్లాప్రెగడ కామమంత్రి పలికినట్లుగా గ్రంథాదియం దీపద్యమును వ్రాసికొనియున్నాఁడు—

మ. ననుఁ గొంతేటిలసత్కులుఁ జెలిమియానన్ దాను వీక్షించిసూ
 రన నీ వక్కజ మైనసత్కవివి యార్యశ్రేణు లగ్గింప భ
 క్తిని గృష్ణాభ్యుదయప్రబంధము జగద్దేయప్రమేయంబుగా
 నొనరం జెప్పుము మెప్పులుప్పతిల సద్యోగానురాగంబునన్.

ఈకవి నియోగిబ్రాహ్మణుఁడు; భారద్వాజగోత్రుఁడు; కామయామాత్యపౌత్రుఁడు; కాశిరాజపుత్రుఁడు. ఈతనికవిత్వ మంతశ్రేష్ఠ మయినదని చెప్పఁదగినదికాదు. ఇతఁడు నూఱుసంవత్సరములక్రిందట నుండినవాఁడు. కృష్ణాభ్యుదయములోని రెండుపద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి—

ఉ. దేవకిగర్భగోళమున దేవశరణ్యుఁ డగణ్యపుణ్యనం
 భావితభద్రమూర్తి యగుపంకజనాభుఁడు భవ్యలాభుఁడై
 శ్రీవెలయం బ్రవిష్టత వసించె జగజ్జనరక్షణక్షమన్
 భావభవాబ్జభూప్రభవభావుకుఁ డయ్యును ధీవికాసతన్. ఆ. ౨.

చ. పదముల వ్రాలి బాలకునిపై దయసేయుము తప్పు చేసితిన్
 సదమలచిత్స్వరూప యదుసత్తమ యుత్తమ మైననీకథా
 భ్యుదయము గోరి నీదు పదపుష్కరము ల్గనవచ్చినాఁడ నా
 కొదవలు దీర్ప దేవతలకున్ సిరిగూర్పఁ దనర్పనీవెకా. ఆ. ౪.

## 85. బేతపూడి కృష్ణయ్య

ఈకవి జానకీరాఘవ మను నయిదాశ్వాసముల ప్రబంధమును రచియించి దానిని కమ్మప్రభు వయిన యడపా నారప్ప కంకితము చేసెను. ఈపుస్తకమునుగాక కవి యలమేలుమంగావివాహము, పండితమనోభిరామము, అన్యగ్రంథములను రచించిన ట్లవతారికలోని యీక్రిందిపద్యము వలనఁ దెలియవచ్చుచున్నది–

సీ. మఱి శ్రీమదలమేలుమంగావివాహంబు
శ్రీజగన్నాయకార్పితము చేసె
రహిఁ బండితమనోభిరామశృంగారకా
వ్యము ధవళాద్రిరాయనికి నొసఁగెఁ
బహుకల్పనానల్పబంధురోక్తులతోడ
రచియించె జానకీరాఘవంబుఁ
బ్రాకటప్రసాదపంచాక్షరీమంత్ర
జపపరాధీనరసజ్ఞుఁ డితఁడు
హరికథలెకావ్యములుచేసెనాంధ్రభాష
యందుమధ్యక్తుఁడితనిచెన్నొందుకావ్య
రత్నమైనట్టిజానకీరాఘవంబు
శ్రీకరం బగు నారథాశ్రితలేంద్ర

ఈకవి శ్రీవత్సగోత్రుఁ డైన ఋ ఉవేలనియోగి. ఈతనికవిత్వము సరసముగానే యున్నది. ఇతఁడు నూఱుసంవత్సరములక్రిందటివాఁడయియుండును. జానకీరాఘవమునుండి రెండుపద్యము లిం దుదాహృతము లగుచున్నవి–

చ. పృథులకుచప్రకారములు బింబఫలాధరసద్రుచుల్ సుధా
మధురపికానులాపములు మత్తమయూరవిహారముల్ శుభ
గ్రథనవినీలవద్భ్రమరకంబులు కప్రపుఁజెక్కులున్ వనీ
మధుకరవేణికల్గనరు మాధవుఁ డం దనురాగమూనఁగన్. ఆ. ర.

శా. ఆకోదండము రామభద్రుడు సముద్యల్లీల నీక్షించి తాఁ
గైకోఁ జూచి ప్రదక్షిణంబుగ భుజాగర్వంబుతో వచ్చి పూ
జాకల్పంబుగ దానిఁ బుచ్చుకొని నిస్సారంబుగా నంతఁ దా
నాకర్ణాంతముగాఁగఁ దీసి విఱిచెన్ హరిప్రభావంబునన్. ఆ. ౫.

## 86. బనవరాజు నాగేంద్రకవి

ఇతఁ డానందసుందరీచాతుర్యవిలాస మను మూఁడాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఈకవి యాఱువేలనియోగి; పాపనామాత్యుని కుమారుఁడు. ఇతఁడు సుమారు నూఱుసంవత్సరములక్రిందట నుండి యుండును. ఆనందసుందరీచాతుర్యవిలాసమునుండి రెండుమూఁడు పద్యములను గవి కవిత్వకౌశలమును జూపుటకయి యిందుఁ బొందుపఱుచుచున్నాను—

ఉ. క్షోణిప యాతఁ డక్కుధరకూటశిఖాంతరమందుఁ గాంచె న
క్షీణజలోచ్ఛలన్మదజశీకరబంధురసింధురార్భక
శ్రేణిని హంసకోకబకచిత్రితరమ్యవిశాలసైకత
శ్రేణిని దీర్ఘవేణిని బళిప్రభురాణినిఁ గృష్ణవేణినిన్. ఆ. ౨.

ఉ. భూనుత యాతఁ డక్కమలపూరములోపలఁ గాంచె నుల్లస
ద్భానుసహస్రరమ్యమణిభాసితభోగవిభూషు నాననో
న్మానితకైటభారిగుణమంజరసౌఖ్యసిర స్తదోషు నం
భోనిధికానవాకలితభూధరబాహువిశేషు శేషునిన్. ఆ. ౨.

ఉ. దైన్యముదక్కి చాపశరదారుణఖడ్గము లూనపట్టి య
న్యోన్యవధాశచేఁ బెనఁగునప్పుడు చూడు మురారిశక్తిన
త్యున్నతిఁ దద్బలంబు నధికోజ్జ్వలయోధులు పిచ్చలింపఁగా
జన్యమునందుఁ గూల్చెదను జక్రిని శుక్రుఁడు తల్లడిల్లఁగన్. ఆ 3.

# 87. మాచవరపు పాపనామాత్యుఁడు

ఇతఁడు నందవరీకచరిత్రమను రెండాశ్వాసముల గ్రంథమును రచియించెను. ఈ నందవరీకులచరిత్ర మీపత్రికే యింకు వ్రాయఁబడినది. కవి నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు; శ్రీవత్సగోత్రుఁడు; వేంకటాచల మంత్రిపుత్రుఁడు. ఇతఁడు తన వాసస్థలాదులనుగూర్చి యిట్లు చెప్పుకొని యున్నాఁడు—

సీ. శ్రీమించు వినుకొండసీమలో నల్ల య
నంతవరం బనునగర మొకటి
కొమరొప్పు బెల్లముకొండ దేశంబున
మానితంబై యొప్పు మాచవరము
గ్రామద్వయంబునఁ గాణాచి యేకభో
గముమీఱ వెలసిన ఘనయశుండు
పెద్దనామాత్యుండు ప్రియురాలు జ్ఞానాంబ
వారికి జనియించె వరసుతుండు
పాపనాహ్వయుఁ డనఁ బ్రఖ్యాతుఁడై యొప్పు
నాతనిభార్య శ్రీయచ్చమాంబ
వారికి ముగురుపుట్టిరి వరుస సుతులు
ముదముతోడుత వసుధఁ ద్రిమూర్తు లనఁగ
నగ్రజుఁడు వేంకటాచలం బనెడుపేరఁ
బ్రణుతి కెక్కెను విభవసౌభాగ్యగరిమ.

క. ఆతనిదేవి పతివ్రత । సీత నరుంధతినిబోలి సృష్టిని వెలసెన్
జేతోమోదంబున సం । ప్రీతిని శ్రీకొండమాంబ ప్రియము జనింపన్.

ఉ. శ్రీపరమేశుసత్కరుణ శ్రీవిలసిల్లఁగ వారికిన్ సము
ద్దీపితచారుమూర్తు లతిధీయుతు లిద్దఱుపుత్రు లందులోఁ

బాహన నగ్రజుండ నయి భాసిలి సత్యము దేవభక్తియున్
బ్రాపుగనమ్మి సద్గురుసపాదములే గతియంచు నున్నడన్.

(నందవరము లిప్పు డనేకములు కానఁబడుచున్నవి. పూర్వకాలమునందు నంగుఁ డేలినట్టియు నందవరీకుల కియ్యఁబడినట్టియు నందవరము కర్నూలుమండలములోనిదయినట్టు కవి యీ క్రింది పద్యమున వర్ణించియున్నాఁడు—)

సీ. అందమై విలసిల్లుఁ గందనోల్సీమలో నందవరం బనునగర మొకటి
తత్పట్టణంబు సౌందర్యంబుఁ గొనియాడ, జిత్ర మెవ్వారికి విచిత్రమరయ
సుందరంబగుచు సంక్రందనపురిఁబోలి యిందిరాదేవికి మందిరముగఁ
గడురమ్యమై చాలఁ గర మొప్పుచుండును గూపతటాకములొక్క-
మరుమిగులఁ

బంకజాకరవిలసిత పద్మనికర । మధుర మకరందరసపానమత్తమధుప
నరసఝంకృతసంగీత సంకులంబు।నగు చురంజిల్లు మిక్కిలియువనియందు

పయిపద్యములోని యనావశ్యకములయిన పదములప్రయోగము నుబట్టియే యీ కవిత్వ మంత మంచిదికాదని చదువరు లెఱుఁగవచ్చు. ఇతఁడు నూఱు నూటయేఁబది సంవత్సరముల క్రిందటివాఁడేమో ! నందవరీకచరిత్రము రెండాశ్వాసములనుండియు రెండేసిపద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి—

మ. దివమం దెల్లను రాజ్యభారముఁ దగం దీర్చున్ ఘనరీ రాత్రులం,
దవలీలం జని జాహ్నవీసలిలమ్మం దారూఢిగా స్నానమున్
సవిశేషంబుగఁ జేయుచున్ నిరత మీచందంబునన్ రాజ్యముం
గవుఁ డంహోరహితప్రభావతనుఁడై గాంభీర్య మింపొందఁగన్. ఆ-౧

ఉ. ఒక్క మహానుభావుఁ డిటవచ్చి దయారస మొప్పతిల్లనల్
దిక్కుల దివ్యతేజములు దీటుకొనంగడు సత్ప్రభావుఁడై

మక్కువ యోగవాగ మనుమంత్రము నా కుపదేశ మిచ్చి తాఁ
జక్కఁగ నిచ్చి పాదుకల సంభ్రమ మొప్పఁగ నేగె నంతటన్. ఆ-౧

ఉ. నందవరంబు మాకును ఘనంబుగ నచ్చట ధారపోసె ద
త్సుందరిఁ దాను గూడుకొని శుభ్రతరం బగుజాహ్నవీజలం
బందుఁల గాన వచ్చితిమి యాతనితోడుతఁ దెల్పి వేగ మా
కుం దగఁ జెప్పుమన్న ననుకూలత నచ్చెరియంబు తోఁపఁగన్. ఆ-౨.

ఉ. భూసురకోటి వచ్చుటకు భూపతి యాత్మఁ గలంగి దానముం
జేసితి మున్ను వీరల కజేయులు గావునఁ దప్పినన్ విప
ర్యాసముఁ బ్రత్యవాయమును రాఁగల దిచ్చిన విత్తహీనమౌ
మోసమువచ్చెనెట్లనుచు మోమొకయించుక వంచెనంతలోన్. ఆ-౨.

---

# 88. కృష్ణదాసకవి

ఇతఁడు రాధాకృష్ణవిలాస మనుపేర జయదేవ విరచితమైన గీత గోవిందమును మూడాశ్వాసముల కావ్యమునుగా రచియించెను. ఈతని తండ్రి వేంకటదాసుఁడు. ఈతఁడు శూద్రకులజుఁడని తోఁచుచున్నది. అయినను కవిత్వము హృద్యముగానే యున్నది. రాధాకృష్ణవిలాసము లోని మూఁడు పద్యముల నిం దుదాహరించుచున్నాను—

చ. అలఘుభుజాబలంబులు నొయారము లత్యసమానసాహసం
బులు నెర వైనసాదనలు పోటరిపంతము లేకవీరతల్
చలమరితెంపులున్ జవవిలంఘనముల్ విలసన్నియుద్ధతుల్
కలిగినకాల్బలంబు కటకంబున డంబున నొప్పు నెప్పుడున్. ఆ-౧.

ఉ. కూరిమిచేయు దిక్పతులకోరిక లీరికి లెత్త రావణో
ధారశిరంబులం దునిమి దద్దిశలన్ బలిపెట్టి సర్వభూ

భార మడంచి మౌనిజనభావనల న్విహరించినట్టి దు
ర్వారబలాభిరామ ధృతరాఘవరూప నినున్ భుజించెదన్. ఆ.౨.

ఉ. ధ్యానముచేతఁ జూచెద సుధానిధితోఁ బ్రతివచ్చునట్టిరా
ధానన మిప్డు కోపజనితారుణమై కడు వంకలై బొమల్
పై నమరంగ శోణకమలంబునఁ ద్రిమ్మరు చంచరీక సం
తానరమద్విలాసములు తార్కొనియుండక మానవేర్చునే. ఆ-3.

---

# 89. చెన్నూరి శోభనాద్రి

ఇతఁడు బిల్హణునికథను శృంగారసుధాసముద్రపూర్ణచంద్రోదయ మనుపేరను నాలుగాశ్వాసముల ప్రబంధమునుగా రచించి గుమ్మడవు పాపనృపతి కంకితముచేసెను. కృతిపతిగాని కృతికర్తగాని యెప్పు డుండినవారో తెలిసినది కాదు. కృతిపతి పద్మనాయకకులసంభవుఁడయి గుళ్ళ పాటి పురాధీశ్వరుఁ డయిన జగ్గనప్రభుని కుమారుఁడు; కృతికర్త యాఱు వేల నియోగియైన చెన్నూరి రామచంద్రుని కుమారుఁడు. కవిత్వము ప్రౌఢముగా నున్నది. శృంగారసుధాసముద్ర పూర్ణచంద్రోదయ మనెడి యామినీపూర్ణతిలకకథనుండి రెండుమూఁడుపద్యముల నిందుదాహరించు చున్నాను—

చ. చక్కనివాఁడు మాటలకు జాణ కళాగమసాహితీచణుం
డక్కట బిల్హణుం డితనియందము చూచిన మందయాన ల
మ్మక్కయటంచు భర్తలను మాని పయింబయివచ్చి నిచ్చలుం
జొక్కకయుండురే రతులఁ జొప్పగునే మన కీతఁ డుండినన్. ఆ. ౨.

ఉ. అంధుఁడు బిల్హణుండు తనయా తెరచాటున నుండి నీవు స
ద్గ్రంథము లన్నియుం జదువఁగావలె నీతఁడు బుద్ధిమాతవా
తంధయసార్వభౌముఁ డని తండ్రి విధించిన నమ్మియుంటి జా
త్యంధుఁడ వేని యాతఁడుసుధాంశునిఁ గాంచనుశక్తుఁ డెట్టులో? ఆ-3

మ. తనయా రాజకుమారుల న్విడిచి విద్వాంసున్ గ్రహింపంగ నీ
మన సెట్లొప్పెను రాజకన్యవుగదా మర్యాదయా నా ధరన్
విన వే పెద్దలు చెప్పుచుందురుగదా విద్వత్సుదారిద్ర్యతా
యని తద్వాక్యము వ్యర్థమయ్యెనుగదా హా యేమిచేయందగున్.

---

# 90. కోటీశ్వరుఁడు

ఈకవి భోజకన్యాపరిణయమనెడి యైదాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఈతనిది రసవంతమైన కవిత్వమే కాని యందందు వ్యాకరణవిరుద్ధము లయిన ప్రయోగములు కానఁబడుచున్నవి. భోజకన్యాపరిణయమునందు రుక్మిణికిఁ గృష్ణునితోడి వివాహకథ చెప్పఁబడియున్నది. కవి నియోగిబ్రాహ్మణుఁడు; చక్రప్పకును మంగమ్మకును నందనుఁడు. ఈతనికాలము మొదలయినవానినిగూర్చి యేమియుఁ దెలియదు. ఇతఁడు నూటయేఁబదిసంవత్సరముల క్రిందట నుండియుండవచ్చును. ఈతని ప్రబంధములోని యొక్కొక్క యాశ్వాసమునుండి యొక్కొక్క పద్యము నిందుఁ బ్రదర్శించుచున్నాను-

ఉ. కోమలి యోరు చందనము కుంకుముతోడనుగూర్చి యంత న
త్తామరసాక్షుమై నలఁదఁ దద్దయు నొప్పె మనోహరాకృతిన్
సోముఁడు నీరజాప్తుఁడును జూడ్కులయందు వసించియుండుటన్
గౌముదిఁగూడి యాతపము గ్రమ్మి వెలుంగనునంద మొందుచున్. ఆ-౧

మ. జనభీతిప్రదఘోషపంకజననస్ఫారాయశశ్శ్రీప్రాప్తిఁ జీ
వనరాశిం దప మొంది శంఖముకలస్వానామృతౌఘంబు శో
భనరేఖాత్రయభాసురంబు నయి తద్భామాగళత్వంబుఁ బొం
దిన ముక్తావళి తద్భవత్వమున నే చెందెన్ హారవామాకృతిన్. ఆ-౨

మ. అన నబ్జాస్య యనున్ వయస్యలకు నీయబ్జాక్షిఁ గైసేయుమం
చని నే సొమ్ములపెట్టె తెచ్చి మణిభూషానేకము ల్పూనఁబో
యిన నొండేనియుఁ బాటిగామిఁ జెలి యేమే చెల్ల నాసొమ్ము లే
వని ఖండించునుగాని నేర దెఱుఁగన్ స్వప్రాప్తకారోన్నతిన్. ఆ.3

శా. భద్రేభంబులఁగూల్చుసింహముగతిన్ బ్రత్యర్థిభూపాలుర
ౌద్రోల్లాసవిలాసము ల్మెఱయఁ బోరన్ గెల్చి నానాదిగ
క్షుద్రశ్రీలకు నాటపట్టగుచుఁ బొల్చు న్వాసవుండో యన
మద్రాధీశుఁ డితండు చూచితివె శ్రీమద్రాజబింబాననా. ఆ. ౪.

చ. సురవరదత్తమండనవిశోభితుఁడై హరి యిట్లు రుక్మిణీ
వరిణయకాంక్షు నుండుటయు భానుఁడు కన్గొని తాను నట్ల యా
హరికి ననర్ఘరత్నముల నర్పణ చేయఁదలంచి యోయన
బరువడిఁ బశ్చిమాంబునిధిపారమున న్నిలిచెన్ ద్వరాదృతిన్. ఆ.౫

---

# 91. చల్లపిళ్ల నరసకవి

ఇతఁడు యామినీపూర్ణతిలకావిలాసమనుపేరితో బిల్హణచరిత్రము నాలుగాశ్వాసముల శృంగారకావ్యమునుగా రచియించినకవి. ఈతని కావ్యము పూర్వోక్తమయిన బిల్హణీయమునకంటె మిక్కిలి రమణీయముగా నుండును. ఈ కవి వైదిక బ్రాహ్మణుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు; భారద్వాజసగోత్రుఁడు; కామకవి పుత్రుఁడు. ఈ కవి తాను గొంతకాలము క్రిందట మృతుఁడయిన పిఠాపురపు రాజుగారి పితామహుఁడగు శ్రీరావు నీలాద్రిరాయనింగారి కాలములోఁ దదాస్థానములోని కేడియను గ్రామమునం దుండినట్టు యామినీపూర్ణతిలకావిలాసములో నీ క్రింది పద్యమునఁ జెప్పికొనియున్నాఁడు—

సీ. త్రిభువనపూతకృతిక్రియగల్గు గౌతమీతీరవిస్తీర్ణ ధాత్రీప్రసిద్ధ
తరమైన కంకణపురవరసంస్థానభూతిఁ జెందినవాఁడ భూసురుండ
శ్రీరామనామమంత్రారాధనపరుండ సకలవిద్వన్మహాజనహితుండఁ
బూజ్యతరప్రాజ్యరాజ్యసత్పిఠికాపురవరసామ్రాజ్యపరివృఢుండు
విమల రేచర్లగోత్రపవిత్రమూర్తి। రావు వేంకటనీలాద్రిరాయనృపతి
చేత సత్కృతినొంది ప్రసిద్ధినొందినట్టి నరసయనామవిఖ్యాతయశుఁడ.

కడియ మనెడి యీ గ్రామము రాజమహేంద్రవరమునకు మూఁడు క్రోసుల దూరమున కాకినాడకాలువయొడ్డున నున్నది. శ్రీ రావు వేంకట నీలాద్రిరాయనింగారు నూఱుసంవత్సరములక్రిందట నుండినవారై నందున నాతని కాలములో నుండిన కవియు దాదాపుగా నూఱుసంవత్సరముల క్రిందటివాఁడు. ఈయన కవిత్వము రసవంతమయి ప్రౌఢముగా నున్నది. ఈయన కవనరీతిని దెలుపుటకయి యామినీపూర్ణతిలకావిలాసములోని కొన్ని పద్యముల నిం దుదాహరించుచున్నాను—

చ. నిరుపమసాహసాతిశయనిర్భరదుర్భరవైరివీరసం
హారణరణోత్సవోచితవిహారమహారథికప్రదత్తస
త్పరిణయకార్యధుర్యతరధాణధణంధణనాదఘంటికా
నురమితనిర్జరీజనమనోరథముల్ రథము ల్పురంబునన్. ఆ-౧.

చ. ఘనకబరీస్తనాకృతులు కంధరమై ధరమై రమైక్యమై
చను నొగిఁ గంఠవక్త్రములు సాదరమా దరమా రమాకమా
దినుసుగ వాగ్ముఖాంగములు తేనెలతో నెలతో లతో క్తితో
నెనయగు నాభిజంఘగతి హేమకరిన్ మకరిన్ గరి న్నగున్. ఆ-౨.

ఉ. అమ్మకచెల్ల! చెల్ల నగు నల్లికజెల్లికపూటలాడి చి
త్రమ్ములు పన్ని నన్నిటులు దారిచి మీ రిపు డంద ఱొక్కటై
గమ్మని గేలిసేయ నొడిగట్టితి రమ్మ పనేమి మాటలన్
నమ్మఁగరాదు మిమ్మనుచు నర్మిలి వేఱొకతీరు మీఱెనన్. ఆ-3.

చ. కలువ లెసంగఁ దామరలు కంది ముడుంగ దెస ల్వెలుంగ వె
న్నెలలు చెలంగ జక్కవలు నెక్కొని సేగి మునుంగఁ జీఁకటుల్
బలిమి నడంగ వేగొమరుఁ బ్రాయపువారల డెంద మందమై
పొలు పలరంగ వారినిధిఁ బొంగఁగఁజేయుచు రాజు రాజిలెన్. ఆ.౮.

శా. స్వామీ నేరము లేదు నావలన నీసర్వంబు నీకృత్రిమ
స్తోమంబు న్నను భ్రాంతి ముంప సమయాస్ఫూర్తిన్ మదీయానన
క్షేమాలోకనబద్ధకాండపటరాజిం గూర్చి తోఁగాదె మ
త్ప్రేమానందకరాశయగ్రహణకారి ప్రాప్తిగా మున్నుగన్. ఆ-౨.

ఉ. రాముశరప్రయోగము సురప్రభువజ్రము చక్రిచక్రమున్
ధామనిధిప్రియాత్మజునిదండము కామరిపుత్రిశూలముల్
భూమి నొకప్డు రిత్త యయిపోయినఁ బోవుఁగాక యీకవి
స్వాములవాక్ప్రయోగమును బ్రహ్మకు నైనఁ దరంబె త్రిప్పఁగన్.

---

## 92. అయ్యగారి వీరభద్రకవి

ఈకవి రాఘవ యాదవ పాండవీయ మను మూడాశ్వాసముల త్ర్యర్థి కావ్యమును రచియించెను. ఈతఁ డాఱువేలనియోగి యైన శైవుఁడు; కౌండిన్య గోత్రుఁడు; సోమనారాధ్య పుత్రుఁడు. ఈతఁ డేకాలమునం దుండినవాఁడో నిశ్చయముగాఁ దెలియరాదు. ఇతఁడు నూఱు నూట యేఁబదిసంవత్సరములక్రిందట నుండియుండవచ్చును. మూఁడర్థములు గల పద్యముఁనుబట్టి కవననైపుణి యిట్టిదని చెప్పుటకు వలనుపడదు. ఇట్టికవిత్వ రచనయే కష్టము. అయినను గవి యవతారికలోఁ జెప్పిన—

ఉ. హారి కిరీంద్రవిగ్రహవిహారికి నాశ్రితబృందదుఃఖసం
హారికి ధూతదేవవివహారికిఁ గౌస్తుభసజ్జ్వలన్మణీ

హారికి హస్తపద్మగమహారికి సాగరబాలికామనో
హారికి వాహనప్పణవహారికి శౌరికిఁ గేలు మోడ్చెదన్.

సీ. నిండుచందురుడాలు నీటు నేలఁగఁజాలు
మొగముపైఁ జిఱునవ్వు మొలకలొందవఁ
దెలిముత్తెములమించు ప్లేటనూటాడించు
నెలకూనయును దలఁ దళుకు లీనఁ
గొదమతుమ్మెదబారు నదలించితనరారు
కడచూపు లక్కుటికంబు నించ
జోడులేదని తెల్పు సొగసుకుత్తుకనల్పు
మేవన్నెలకు వింతమిసిమి నొసఁగ
నలువ మొదలైనవారు తన్గొలిచిరాఁగ
గిబ్బ బాబాపయింబొల్చియుబ్బరముగ
నెలమి చెన్నారఁగావాకఁగలనుగానఁ
బడియెముక్కంటికన్నులపండువుగను.

ఇత్యాదిపద్యములనుబట్టి చూడఁగా నితఁ డాంధ్రగీర్వాణపద బహుళముగా మంచికవిత్వము చెప్పఁగలవాఁ డనియే తోఁచుచున్నది. ఈతనిగ్రంథములోనివి కొన్నిపద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి.

శా. నానారత్నవిభూషితాఖిలజనానందదానుసంధాయిశృం
గానూనంబులు చారుగంధసుమనఃప్రాచన్మహాపాదపా
ళీనవ్యంబులు సద్వృషాభిరతముల్ లీలార్థగోత్రాళు లెం
తో నేత్రోత్సవదంబు లౌదుఁ జెలువొందుం దత్పురంబందునన్. ఆ-౧

ఉ. ప్రాంచితరీతి రాముఁడు పరాశరజాతుఁడు కృష్ణమూర్తి దా
మించినవేడ్క నంప జడివీఱఁగఁ బెంచి విరాధరాజితో
దంచదనూనలీలల నుదాత్తముగా యవనాభ్రము న్నతు
ల్లాంచుచు నింద్రకీలధరలాలితదీప్తి నతొండు భాసిలన్. ఆ. ౨,

ఉ. రాముని ధర్మరాజు రణరంగవిరాజితు నచ్యుతప్రభుఁ
జీమది మర్త్యుగాఁ దలఁచి నీతివిహీనతఁ బోరఁబోకుమీ
సామము మేలు తద్విభుఁడు శస్త్రబలంబున మేటి భూమిలోఁ
గామిని రత్నయుక్తముగఁ గ్రక్కున నిచ్చి కులంబుఁ బ్రోవుమా. ఆ-3

---

## 93. ఘట్టుప్రభువు

ఇతఁడు సురాభాండేశ్వరము, కుచేలోపాఖ్యానము, యాజ్ఞవల్క్యచరిత్రము, అను మూఁడుపద్యకావ్యములను రచియించెను. ఇతఁ డెల్లామాత్యునిపుత్రుఁడు. ఈకవి యాజ్ఞవల్క్య నియోగిబ్రాహ్మణుఁడయి నట్టు కనఁబడుచున్నాఁడు. ఇతఁడు కుచేలోపాఖ్యానములోఁ దన్నుఁ గూర్చి యిట్లు వ్రాసికొనియున్నాఁడు—

సీ. భ్రమరాంబికావరప్రభవదివ్యకవిత్వ
విద్యాప్రవీణత వెలసినాఁడ
ఘటికాశతగ్రంథఘటనాసమంచిత
చాతుర్యమహిమకుఁ జాలినాఁడఁ
బ్రాఢిమ నేకైకపత్రమానమహాప్ర
బంధ కల్పనశక్తిఁ బ్రబలినాఁడ
మఱియు నాశువు చిత్రమాధుర్యవాక్య ప్ర
గల్భనంబున నుతు ల్గాంచినాఁడ
శ్రీకుధరమల్లికార్జున శ్రీపదాబ్జ
మత్తభృంగాయమానసన్మానసుండ
సత్కవీశ్వర కరుణాప్రసాదవశుఁడ
ఘట్టుప్రభునామధేయ విఖ్యాతయశుఁడ.

ఈ కవి నెల్లూరిమండలము నివాసుఁడయినట్టును, అప్పటి కెనుబది సంవత్సరముల క్రిందట నుండినట్టును, నెల్లూరిమండల చరిత్రమునందు వ్రాయఁబడియున్నది. కాఁబట్టి కవి యిప్పటికి నూఱుసంవత్సరముల క్రిందట నుండినవాఁడు. ఈతనికవిత్వ మంతగా నిర్దుష్టమయినదియు ప్రౌఢమయినదియుఁ గాకపోయినను, మంచి లోకోక్తులతోను న్యాయములతోను నిండియుండి ద్రాక్షాపాకమునఁ జదువువారి కింపుగానుండును. ఈతఁడు రచియించిన యాజ్ఞవల్క్యచరిత్రము ప్రస్తుతమున నావద్ద లేదు. దక్కిన గ్రంథములనుండి కొన్ని పద్యముల నిం దుదాహరించుచున్నాను—

## కుచేలోపాఖ్యానము.

శా. చిత్రం బెన్నఁగఁ జిన్ననాఁడె తనయుల్ శిక్షానుగుణ్యుల్ తుదన్
బాత్రుల్గా రతిదండకార్యములకున్ బ్రాయంపువారైన ని
ద్ధాత్రిం జుట్టములట్ల చూతవలదా తండ్రుల్ తనూజాతులున్
బుత్రం మిత్రవదాచరేత్తనుచు నేప్రొద్దున్ శ్రుతుల్ చాటఁగన్. ఆ-౧.

ఉ. కామితవస్తుజాతములు గల్గి దయాపరులైన పుణ్యులన్
బ్రామత నిచ్చి పుచ్చుకొనుభావమునం దలపోయఁ డెంతయున్
గ్రామము క్రొత్తదైనఁ దన కర్మము క్రొత్తయె పెక్కుమాట లిం
కేమి యదృష్టహీనునకు నెచ్చటి కేఁగినఁ గల్గునే సిరుల్. ఆ-౨.

ఉ. అన్నము లేకయుండిన లయంబగు దేహము రక్తమాంసముల్
సున్నగు నింద్రియస్ఫురణ సుక్కు మదాశిశయంబున దూరమౌ
నన్నులమిాఁది ప్రేమ చెడు నచ్యుత నీపయి నిల్చుమానసం
బెన్నటికైన జ్ఞానులకు హెచ్చు దరిద్రతసాటి యే సిరుల్. ఆ-3.

## సురాభాండేశ్వరము.

చ. తవిలినమోహపాశమున దైన్యముఁ బూని మనోవ్యథం గడుం
దివురుచు విన్నయై యవనిదేవుఁడు ప్రార్థనచేసి మ్రొక్కఁగా

నువిదయుఁ జేరికిఁ గొనక యూరక యేగెను నిర్దయాత్మయై
శివశివ మిక్కిలిం గఠినచిత్తులుగారె లతాంగు లిమ్మహిన్.

చ. పరమవివేకశీలుఁడవు బాపఁడ వుత్తమవంశజుండ వీ
వెఱుఁగవె యొండ్ల భామినుల నీగతిఁ గోరుట ధర్మమే మహా
దురితము లైనపట్లఁ గడుదూరముగా నెడలించి మోహముల్
మఱచుట ధర్మ మండ్రు మతిమంతులు వేదపురాణసమ్మతిన్

---

# 94. ముప్పిరాల సుబ్బరాయకవి

ఇతఁడు కృష్ణాభ్యుదయమనెడి యైదాశ్వాసముల ప్రబంధమును రచియించి, చక్కిలాల వేంకయామాత్యున కంకితముచేసెను. ఆగ్రంథమునఁ గవి తన్నుఁ గూర్చి యిట్లు చెప్పుకొనియున్నాఁడు.

మ. నను శ్రీనాథకథాసుధారససరిస్నాతాగ్రఘోషాంబుగా
హానదూరీకృతసర్వకల్మషు హేరంబాస్యానుగ్రహ ప్రాప్తసా
రనిరాఘాటసితాంతశోభికవితారాజ్యాప్వితున్ సత్సుధీ
జనసంతానవిధేయుఁ జూచి పలికెన్ సంతోష ముప్పొంగఁగన్.

సీ. అతిశయోత్ప్రేక్షోపమాద్యలంకారముల్
దొలఁకంగ ముద్దులు గులుకుఫణితిఁ
పద్యకావ్యముగాఁగఁ బ్రద్యుమ్నచరితంబు
రసికు లానఁగను రచనచేసి
తలరుచు ద్విపదగా వెలయ సావిత్రిచ
రిత్ర యొనర్చితి చిత్రలీల
భద్రాద్రిఁ దగు రామభద్రునిపై నొక్క
శతకంబుఁ జేసితి చతురఫణితి
నేయెడ నరస్తుతులు నీవునేయ వైన
భ్రాతృవాత్సల్యమెసఁగఁ బ్రబంధమొకటి

చెప్పినా కంకితంబుగఁ జేయుమిపుడు
సుకవినుతగుణసముదాయ సుబ్బరాయ

పయిపద్యములనుబట్టి యీకవి ప్రద్యుమ్నచరిత్రమును సావిత్రీ చరిత్రమును భద్రాద్రి రామశతకమునుగూడ రచియించినట్టు తెలియ వచ్చుచున్నది. ఈకవి యెప్పటివాఁడో తెలియరాలేదుగాని నూఱుసం వత్సరములకంటెఁ బూర్వపువాఁడు. ఈతని కవనము మృదువయి మధు రముగా నున్నది. కృష్ణాభ్యుదయములోని కొన్నిపద్యముల నిం దుదా హరించుచున్నాను—

ఉ. సంకుమదాదిగంధయుతసారసమీరము మీఱివీవఁగాఁ
గంకణఝుంకృతు ల్వెలయఁగా సురసుందరు లొయ్య నొయ్యనన్
బొంకముమీఱ నూఁపఁగను భోగికులాధిపుడో లికన్ రమా
పంకజగంధిఁ గూడుకొని బంధురహర్ష తరంగితాత్ముఁడై. ఆ. ౨.

చ. విను చెలి జోడుకోడెలగు వేఁడివెలుంగును రేవెలుంగునున్
వనజదళాయతాక్షునకు వారిగుహాసనుఁ డిం పొనర్పఁగాఁ
గనుఁగవఁజేయ నాసయనుకాంచనపుష్పము నాశ్రయించి వా
రనిశము పుష్పవంతు లనునాఖ్య వహించిరి ముజ్జగంబులన్. ఆ. 3.

ఉ. మారుశరాళికిన్ మలయమారుతపాళికి మంజులాళికిన్
మీఱుమరాళికిన్ జిగురుమెక్కెడుసీలిగయాళికిన్ శశాం
కోరుకరాగ్రకేళికి మయూరకదంబము కేళికిన్ సితాం
భోరుహనేత్ర కుంది తలపోయఁదొడంగె మనంబులోపలన్. ఆ. ర.

చ. కొనిమొద రుక్మిణీసతిని గోపవధూవిటుఁ డడ్డమైన మా
ర్కొనిమొద మద్భుజాబల మకుంఠితమైతగ నెల్లమీరె క
న్గొనిమొద రంచు బంధుజనకోటికిఁ దెల్పుచుఁ జైద్యుఁ డంతటన్
గని మొదురైనవారు నగఁ గ్రక్కునవచ్చె నృపాలుపీటికిన్. ఆ. ౫.

# 95. ప్రయాగ కామేశ్వరకవి

ఇతఁడు గోపాలలీలాసుధాలహరి యను మూఁడాశ్వాసముల ప్రబంధమును రచియించి రామతీర్థస్వామి కంకితము చేసెను. ఈకవి విశాఖపట్టణమండలపువాఁడు; వైదికబ్రాహ్మణుఁడు; కౌశికగోత్రుఁడు; నారసింహపౌత్రుఁడు; సర్వేశ్వరపుత్రుఁడు. ఇతఁడు నూఱు సం॥ రముల క్రిందట నుండినవాఁడు. కవిత్వము మంచిదేయైనను శృంగారవర్ణనము నితఁడు మిక్కిలి పచ్చిగాఁ జేసినందునఁ బుస్తక మిప్పటివారు చదువుట కంతగా యోగ్యమయినదికాదు. ఈప్రబంధమునుండి రెండుపద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. దుండగ మేలచేసెదవు తోయజసాయక దండనిల్చి కో
దండము డించి మాచెలికిదండము పెట్టుము రెండుకన్నులన్
నిండిననీరు దోయిటను నించి శపించుఁ దదశ్రువారి నిక్
దండనచేయుఫాలశిఖతండ్రిసుమీ కడుశిక్ష చేయఁగన్. ఆ. ౨.

మ. యమునాతోయము దోయిటంగొని సముద్యల్లీల వేఱొక్కభా
మముఖాబ్జంబునఁ జల్ల నానెలఁతయు న్మార్జోమ్ము గావించుచో
దుమికెం దుమ్మెదచాలుపుల్లనవపాథోజంబుపై నాఁగ శ
క్రమణీరోచులనీనుకొప్పు విడి వేగం గ్రమ్మెఁ దద్వక్త్రముల్. ఆ.3.

---

# 96. అనంతనార్యుఁడు

ఈకవి గాధేయోపాఖ్యానమను నేకాశ్వాసశృంగారప్రబంధమును రచియించి కామాంబకును జిన్నప్రభునకును బుత్రుఁడగు కృష్ణభూపాలుని కంకితము చేసెను. ఇతఁడు తాళవలింపకవికుమారుఁడు. ఈ కవినిగూర్చియు నీతని కాలమునుగూర్చియు మఱేమియుఁ దెలియరాలేదు. ఇతఁడు నూఱేండ్లకు లోపలివాఁడుకాఁడు. ఈతని కవిత్వము హృద్యమయి యన

పద్యమయియున్నది. కవితామాధుర్యమునుజూపుటకై గాధేయోపాఖ్యానములోని పద్యముల రెంటి నిందుక్రిందఁ బొందుపఱుచుచున్నాను—

ఉ. మానక యింతవంత దరమా సురమాన్యపదంబుగన్న మ
న్నీని కిదేల వట్టివగ నీకృపచే వగ నేవగ న్జగ
న్మానిత తత్తపోమహిమ మానుప నాదువిలాసమోపు నీ
పూనికమోపు నాపయినిమోపు వెత న్విడుమోపురందరా.

చ. చిలుకలకు న్వచోగురుతఁ జెందుచు సప్తవిధస్వరంబులన్
బలుమఱుఁ దేనియ ల్గులుకఁ బాడెడు నీలలితాంగిఁజూచి లో
కులు మఱి కీరవాణియును గోకిలవాణియనంగఁ దోన చి
ల్కలు మఱి రామరామయనుఁ గన్నులఁ గెంపు వహించుఁ గోవిలల్.

---

# 97. భైరవకవి

(ఇతఁడు రత్నశాస్త్రమును దెనుఁగునఁ బద్యకావ్యమునుగా రచియించెను. ఇతఁడు గౌరనసుతుఁడు. ఇతఁడు భ్రమరాంబికా వరప్రసాదముచేతఁ దనకుఁ గవిత్వము వచ్చినట్లీ క్రిందిపద్యములలోఁ జెప్పుకొనియుండుటచేత కర్నూలుమండలమువాఁ డయినట్టు తోఁచుచున్నది.)

క. తన్నుఁ బ్రియమార వేఁడిన।మున్నుమునీంద్రులకగస్త్యముని చెప్పినయా
సన్నుతమణిలక్షణములు।చెన్నుగఁ గ్రోడీకరించి చెప్పెదఁ దెలియన్.

క. భ్రమరాంబికామహేశ్వర।సముచితనిరవద్యహృద్యసాహిత్యకళా
క్రమవిమలప్రతిభాసం।క్రమణుఁడ మతిశాలినైన గౌరనసుతుఁడన్.

"భైరవుఁడ నుభయభాషాపరీణుఁడ" నని కవియే తన సంస్కృతాంధ్రభాషాద్వయపాండిత్యము కలదని చెప్పుకొనెను. ఈతని కవిత్వము మొత్తముమీఁద చక్కఁగానే యున్నది. రత్నశాస్త్రములోని రెండు పద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి.

ఉ. నీరదము ల్దిగంతములనిండి తటిద్ఘనగర్జితంబు లిం
పార యహోగ్రవృష్టికురియం బ్రభవించు నింతాతకాంతితో
నారయఁ గుక్కుటాండసమమైపడుముత్యము లంతరిక్షసం
చారులు పట్టుకొందురు వెసన్ వసుధం బడకుండ నేర్పునన్.

ఉ. చేత ధరింప మానవులచెంతను జేరవు భూతకోటు లే
రీతిని దుష్టవిద్య లొనరించిన నెక్కువు క్రూరజీవముల్
ఘాతలు సేయలేవు సతిగర్భముమోప సుఖప్రసూతియా
నాతతభాతితోఁ బ్రతిదినంబును బ్రీతి యొనర్పుఁ గేతువున్.

---

# 98. అనమగుర్తి రంగయ్య

ఇతఁడు యాదవగిరిమాహాత్మ్య మనెడి యైదాశ్వాసముల పద్య కావ్యమును రచియించెను. ఇతఁడు నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు; తిమ్మయామాత్య తనూభవుఁడు. ఈకవి తనగ్రంథమును రావూరివేంగా మాత్యున కంకితముచేసెను. కవియెప్పటివాఁడో సరిగా తెలియదుగాని నూఱుసంవత్సరములకుఁ బూర్వపువాఁ డనుటకు సందేహము లేదు. ఈతనికవిత్వము శ్రావ్యముగానే యున్నది. యాదవగిరి మాహాత్మ్యములోని రెండుమూడుపద్యముల నిం దుదాహరించుచున్నాను—

చ. పిడుగులఁబోలు నెండసెగఁ బెట్టినపైరులు వాడిపోయినన్
మడిమడిఁ దప్ప కేతములు నాటుచు బావులు త్రవ్వి కారుపై
రిడి యొకకొన్నిబాన లటు లెత్తుచు గాడ్పులదూలి సారె నీ
రెడలినఁ జూచి యొక్కతడి యిత్తురు హాలికు లశ్రుధారలన్. ఆ-3

చ. బెళఁకులు నేర్చెఁ జూపు తిరిపెల్లు లవారిగఁజల్లె మేనిడాల్
కెలఁకులఁ జూడఁజూడఁ బెరిగెం జనుఁబూపలు నిగ్గుదేరెఁ జె

క్కిలికవ సన్ననూలువడి కెన్నడు మెక్కడనుండివచ్చెనో
చెలు లొకనాఁడు నేరుపనిసిగ్గు వధూటికి నాఁడునాటికిన్. ఆ. ౪.

ఉ. వాలికచాగు వ్రేఁగుజడ వారిపయింబడి తేలియాడుచున్
వ్రాలఁగ, నీలహంస మది వారిరుహంబని డాయ, నొక్క ప్రో
యాలి మెఱుంగుమోమమరె నవ్వల నివ్వల రాహు కేతువుల్
బాళిని డాయ వారియెడఁబర్వినపర్వసుధాంశుఁడో యనన్. ఆ. ౫.

---

# 99. తామరపల్లి తిమ్మయ్య

ఇతఁడు శేషధర్మమ నెడి యైదాశ్వాసముల పద్యకావ్యమును రచియించి శ్రీరామాంకితముచేసెను. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; శరణయామాత్యునిపుత్రుఁడు. ఇతఁడుండినకాలమేదో తెలియదు. నూఱు సంవత్సరములక్రిందట నుండియుండును. ఇతనికావ్యమునం దపప్రయోగములు కొన్నిగలవుగాని కవిత్వము మొత్తముమీఁద చక్కనిధారకలదయి శ్రావ్యముగా నుండును. ఈతని శేషధర్మములలోని కొన్నిపద్యముల నిం దుదాహరించుచున్నాను-

ఉ. తోడికులాంగన ల్మణులతోఁ గనకంబులతోడ వెండితో
వాడలవాడలన్ సిరికి వన్నెలు వెట్టుచు నాథపుత్రులం
గూడి సుఖింపఁగా మనము కూటికిఁ గూరకుఁ జిక్కి బిడ్డల
ల్లాడఁగ నెల్లకాలము మహాత్మకనుంగొనుచుండ శక్యమే. ఆ. ౧.

మ. మును పోషించినపుత్రమిత్రవనితాముఖ్యుల్ స్వకర్మంబులం
జని యొందేఁ జన వారికై జపతపస్స్వాధ్యాయము ల్మాని దు
ర్జనులం గూడి పరాపకారనియతిం బ్రాభత్వము ల్చూప నా
పెనుపాపంబున గర్భవేదనలు పై పెల్లయ్యె నెల్లేగుదున్. ఆ. 3.

ఉ. అక్కడనున్నయాపశుమృగాదులు తావకపాదపద్మముల్
దిక్కని ముక్తికామినికి దీవన లిచ్చు సుపర్వు లింతయున్
చిక్కమ యిగ్గిరీంద్రమున నిల్వఁగవచ్చును బుణ్యశాలికిన్
గక్కసమా మహాదురితకర్మలకుక్ వసియింప నిచ్చటన్. ఆ. ౫.

---

# 100. నారన సూరన

ఇతఁడు వనమాలివిలాసము నను కావ్యమునుజేసి, కొండూరి యక్కదండనాథున కంకితముచేసెను. నావద్దనున్న యీ గ్రంథముయొక్క ప్రతి యసమగ్రమయినది; అవతారిక లేదు. కృతిపతిమంత్రియు దండనాథుఁడు నయి యజ్ఞముచేసిన నియోగిబ్రాహ్మణుఁడు. కవి నారనామాత్యుని కుమారుఁడైన నియోగివిప్రుఁడు. ఇతఁ డాధునికుఁ డని చెప్పుటకుఁ గవికాల నిర్ధారణముచేయుటకుఁ బుస్తకమునం దాధారమేదియుఁ జిక్కలేదు. ఈతని కవిత్వము సలక్షణమయి మృదువుగానున్నది. వనమాలివిలాసములోని కొన్ని పద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. గొజ్జఁగినీరుపోసి సమకూర్చినచందనవారిఁదోఁచి లా
మజ్జకతాళవృంతముల మాటికిఁ ద్రిప్పఁగ రాలుశీకరం
బజ్జలజాక్షుచెక్కిళుల యందుఁ దనర్చె ముఖేందుసుజ్వరం
బుజ్జనచేయఁ గూడఁబడియున్న యుడుప్రకరంబుచాడ్పునన్. ఆ-౧.

చ. మెఱయు కపోలపాళికలమీఁదఁ జలన్మణికుండలద్యుతుల్
గిఱికొన ఫాలభాగమునఁ గించి దుదంచితనర్తనంబులై
నెఱికురు లింపుచేయఁ గమనీయవిలోచన లూఁచి రాదలల్
కొఱలి భవద్యశోమహిమ గోమలి మాటికిఁ జెప్పుచుండఁగన్. ఆ-౨

చ. కలమధురంబులైన కలకంఠివచోరచనానిగుంభనం
బులు విని సిగ్గుచం బలుకుపూనికలెల్లను బోవడించి మూఁ

గఁ వలె నోళ్లు మూసికొని కాననసీమలఁ జేరియున్న కో
కిలముల బుజ్జగించి పలికించు మధూదయ మాత్మసంగతిన్. -ఆ-3.

ఉ. తొల్లియు మోసపోయితివె తోయరుహానన పెక్కుమారులో
చెల్ల మదీయధూర్త్యములచేత నె యిప్పుడు నమ్మికొనె నీ
యుల్లము సారె నెత్తు లిడుచున్నది యీక్రియ నాడుమంచు నా
కల్లతనంబు లింతటివిగాఁ దలపోయ నరాళకుంతలా. ఆ-౪.

---

# 101. బోడూరి పెదరామామాత్యుఁడు

ఇతఁ డాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; భారద్వాజగోత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; శివరామమంత్రికిని సీతమాంబకును బుత్రుఁడు. ఇతఁడు శివరామాభ్యుదయ మను ద్వ్యర్థికావ్యమును రచించెను. ఇతఁ డీ గ్రంథమును గురజాల పేరయార్యుని ప్రేరణమునఁ జేసెను. కవి కృతి పేరకుని తన గ్రంథమునందు—

సీ. ఏమంత్రికులపూర్వుఁ డిలఁ జనుత్తారభారత మందె శ్రీరంగరాజునాముఁ
డేమంత్రిముత్తాత యీమల్లయజ్వ దాక్షాయణీపరిణయగ్రంథమందె
నేమంత్రితాత యజ్ఞామాత్యుఁ డొనరించె సప్తసంతానముల్ సరవితోడ
నేమంత్రిపిత పార్వతీశ్వరుఁ డాదిమదాతయై పద్యగద్యంబు లందె
నట్టి గురుజాలకులకలశాబ్ధివిధుఁడు
రసికుఁ డివటూరి మల్లనారాధ్యశిష్యుఁ
డభవపూజాధురంధరుఁడైన పేర
ఘనుఁడు సాంఖ్యాయనసగోత్రుఁడెనయు సిరుల.

ఇట్లు వర్ణించి, అతఁడు తన్నుఁ గూర్చి పలికినట్లుగా నీ క్రింది పద్యములను జెప్పికొనియున్నాఁడు—

సీ. అనఘభారద్వాజమునిగోత్రజాతు నాపస్తంబసూత్రుఁ బ్రశస్తచరితు
ఘనుని-బోడూరి వేంకటమంత్రివరునప్త మహితధీబాపయమంత్రిపౌత్రు

శివరామమంత్రికి సీతమాంబకు సూనులై మించు బాపార్యరామరామ
ఘనులు ముప్వురిలోన గణన కెక్కిన పెదరామకవీంద్రుఁడు శ్రీరమ్యచరితుఁ
జిత్రయమకాంధ్రసంస్కృతశ్లేషకవిత
రచనసేయంగ నేర్చి భారతికరుణను
రాజవిద్వత్సభలయందుఁ బూజితుఁ డగు
నన్నుఁ బిలిపించి పలికెఁ బ్రసన్నఫణితి.

సీ. నీవంశపూర్వధీనిధి కొండకవి చెప్పె భార్గవాభ్యుదయప్రబంధ మెలమి
నీయన్న బాపమంత్రి రచించె నొగినుషాకన్యకాపరిణయకావ్య మెసఁగ
సీతమ్మఁ డసముఁడై నిరోష్ఠ్యజానకీకళ్యాణకృతి రామకవివరుండు
నీవు ప్రౌఢోక్తిని నిర్మించినావు కౌసల్యాపరిణయాది సరసకృతుల
మఱి యుదాహరణాది చమత్కృతులను
సంస్కృతాంధ్రకవితఁ జెప్పఁజాలినట్టి
ప్రౌఢసత్కవి వీవె ధరాతలమున
గలితగుణగణ్య పెదరామకవివరేణ్య.

ఈపెదరామకవి సంస్కృతాంధ్రకవులను స్తుతించినపిమ్మట శ్లేష కావ్యములకు మార్గదర్శియైన పింగళి సూరనామాత్యునిటు పొగడి యున్నాఁడు.

ఉ. శ్లిష్టకవిత్వవైఖరివిచిత్రత రాఘవపాండవీయము
తుష్టముగా రచించి జగదేకనుతుం డగుని ధాత్రిలో నవ
స్రష్ట యనంగఁ బద్మభవసన్నిభుఁ డైనమహాకవీశ్వరా
భీష్టసమప్రభావుఁ డగుపింగళిసూరకవీంద్రుఁ గొల్చెదన్.

కావ్యప్రేరకుఁ డైన గురుజాల వేరయార్యుని యభీష్టప్రకారముగా నీగ్రంథమును గోదావరిమండలములోని యాచంటగ్రామమునందలి రామ లింగేశ్వరస్వామి కంకితము చేయుటచేతనే కవి గోదావరిమండలములోని వాఁడగుట స్పష్టమగుచున్నది. ఈతని కాలము నిశ్చయముగాఁ దెలియ

రాదుగాని యితఁడు నూఱుసంవత్సరముల క్రిందటివాఁడని తోఁచుచున్నది. ఈతనికవిత్వధార యనర్గళమయి మృదువుగానున్నది. కవితాధోరణి తేటపడుటకయి శివరామాభ్యుదయములోని రెండుపద్యము లిందు దాహరింపఁబడుచున్నవి—

చ. తరమె నుతింపఁగా నగణితస్ఫురితాంకతఁ దద్ధరాధినే
తరసికుఁడౌ ననంత వసుధారథుఁ డుగ్రపురారి భీముఁడు
ర్వర నుతి కెక్కి మించె వృషవాహసమాఖ్యుఁ డహీనసద్గుణో
త్కరవరుఁ డాజిభీకరనితాంతపరాక్రమశాలి యౌ ననన్. ఆ. ౧.

మ. అలరన్ దత్పునఃమారభాసురసహాయంబొప్పఁగా దారకో
జ్జ్వలనామాహితదానకాంక్ష విబుధాంచద్భర్త్రయాదాన నా
కులసత్సంతతిఁ జూడవచ్చె నమితాత్ముం డింపుమీఱఁగ మం
జులతారామమహాధ్వరాజితవరాఁశు ల్గల్గునవ్వీటికిన్. ఆ. ౨.

---

## 102. రామావర్ఝుల కొండుభట్టు

ఈకవి కపిలగోసంవాద మనుపేర నధ్యాత్మవిద్యాప్రతిపాదకమగు నాఱాశ్వాసముల పద్యకావ్యమునురచియించి యహోబిలనృసింహస్వామి కంకితముచేసెను. ఇతఁడు వైదికబ్రాహ్మణుఁడు; హారితసగోత్రుఁడు; నరసావధానికిని అక్కమకును పుత్రుఁడు. ఇతఁడించుమించుగా నూఱుసంవత్సరములక్రిందటి వాఁడని తోఁచుచున్నది. ఈతని కవిత్వము మృదువయి నాతికఠినమయి శ్రావ్యముగానున్నది. కపిలగోసంవాదములోని యొక్కొక్క యాశ్వాసమునందలి పద్యము నొక్కొక్కదాని నిం దుదాహరించుచున్నాను—

ఉ. ద్వైతముచే ననిత్యసుతదారధనాద్యఖిలైహికోత్సవ
వ్రాతములందు దైవతనివాసుఖంబులయందు లోలుఁడై

పాతరలాడువారల కపారత నిత్యసుఖాబ్ధిఁదేల నే
భాతి లభించు సద్గురుకృపామహిమం బొడఁగూడ దేనియున్. ఆ ౧

శా. ఔనా మీమదులం దసూయ యనసూయాదేవిపైఁ బూన మే
మానాతిం జెనకంగఁ జాలుదుమె మీయాలాపము ల్గూర్వరా
ద్యైనం బోయెద మందు నేమగునొ యం చాదేవదేవోత్తముల్
గానం బోయిరి యమ్మునీంద్రమునిసతిన్ గాపట్యవేషంబులన్. ఆ. ౨

శా. వేదాంతార్థసముజ్జ్వలాగ్ని భవసద్విజ్ఞానదీపంబుఁ దా
నాదిన్ మానసముం గరంగఁగ సముద్యల్లీలమైఁ బూని స
మ్మోదం బొప్పఁగ హృద్గృహాంతరవసన్మోహాంధకారంబు వి
చ్ఛేదంబై చనఁజొచ్చియుండఁగలయన్ శేషాహిభూషున్ బరున్ ఆ-3

ఉ. ఆపరమేశ్వరుండు సకలాంతరబాహ్యములందు నెల్లఁ దా
వ్యాపకుఁ డౌట లింగతనువందును బింబితుఁ డయ్యె నంతఁ జే
రూపరి జీవుఁడై మిగులరూఢిని గర్తను భోక్తనంచు సం
తాపము నొందుచుండుఁ దనుఁ దాఁ గనలేమిని నెల్లభంగులన్. ఆ-౪.

మ. ప్రతిబింబంబు లనంగ దుర్విషయసుప్తజ్ఞాదిదుర్వాసనల్
సతతంబున్ మదిలోనఁ బాదుకొన నిశ్చాంచల్యముం బొంద నీ
కితరభ్రాంతులఁ ద్రిప్పుచున్ శ్రవణవాగిత్యాదిసంసర్గసం
గతులం బర్వికొనంగ లేనియవియాఁ గౌటిల్యమాలిన్యముల్. ఆ-౫.

చ. చక్కెర పుచ్చకాయవలె సంతనగా నొనరించియుంచ నం
దెక్కడనైనఁ జేఁదు గలదే విను యాత్మయఖండరూపమై
పిక్కటిలంగ వేఱొకటి భేదము తోఁచునె యెట్లుచూడఁ దా
నొక్కటిమొక్కటే నిజము నొక్కటి యన్నదియున్విచిత్రమే. ఆ-౬.

# 103. మారయకవి

ఇతఁడు మైరావణచరిత్రమును పద్యకావ్యముగా రచియించెను. ఈ కవి నియోగిబ్రాహ్మణుఁడు; సర్వయామాత్యునికుమారుఁడు. అక్కడక్కడ వ్యాకరణదోషములు కానఁబడుచున్నను మొత్తముమీఁద నీతని కవిత్వము మృదువయి మనోహరముగా నున్నది. కవనధోరణి తేటపడుటకయి మైరావణచరిత్రములోని రెండుమూఁడు పద్యముల నిం దుదాహరించుచున్నాను.–

ఉ. చెప్పఁగరానిమాయల విచిత్రపురూపులు దాల్చి యింక వాఁ
డెప్పుడువచ్చునో యిటకు నేమఱియుండినఁ గార్యమంతయుం
దప్పునుగానరాఘవులు తద్దయుఁ గాంచువిధంబు గొబ్బునన్
జొప్పడఁ జెప్పుఁడీ తెలియ సూనృతవర్తనులార నావుడున్. ఆ-౧.

ఉ. మారుని మోహనాంబకమునూడ్కిని బ్రాణము లైదు నున్నబం
గారపుబొమ్మరీతిఁ దొలుకారుమెఱుంగులప్రోకభంగి శృం
గారరసంబునం దొలఁకఁగట్టిన పువ్వులమొత్తురీతి న
న్నీరజగంధివచ్చి తగ నిల్చెను బ్రీతిని భర్తముందటన్. ఆ-౧.

చ. దనుజ దురాత్మ నీకు నిఁకఁ దస్కరవృత్తిని జొచ్చి మాయలన్
దినకరవంశ్యులం దొడరి తెచ్చినపద్ధతిఁ బోవరాదు నా
ఘనతరవాలరోమమునఁ గట్టి జగంబులు మెచ్చ నిన్ను న
య్యనిమిషులెల్ల భీతి నిట కడ్డమువచ్చినఁ గావఁ జంపెదన్. ఆ-౨.

---

# 104. పరశురామపంతుల లింగమూర్తి

ఈకవి సీతారామాంజనేయమనెడు మూఁడాశ్వాసముల వేదాంతగ్రంథమును రచియించెను. ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; రామమంత్రికిని తిమ్మాంబకును బుత్రుఁడు; మహాదేవయోగి శిష్యుఁడు. ఈగ్రంథము

ప్రథమాశ్వాసము తారకయోగమును గూర్చియు, ద్వితీయాశ్వాసము సాంఖ్యయోగమునుగూర్చియు, తృతీయాశ్వాసము రాజయోగ మనఁబడెడి యమనస్కయోగమునుగూర్చియు, తెలుపును. ఈ సీతారామాంజనేయ సంవాదము బహుజనులచేఁ జదువఁబడెడు జనప్రియమైన పుస్తకముగా నున్నది. కవిత్వము నిర్దుష్టమయి హృద్యముగా నున్నది. ఈకవి తన పాండిత్య ప్రకటనమునకయి యిట్టి వేదాంతగ్రంథమునందు సహితమేకాక్షరద్వ్యక్షర పద్యములను జొప్పించియున్నాఁడు. ఇతఁడు నూఱు సంవత్సరములకుఁ బూర్వమునం దుండినట్లు తెలియవచ్చుచున్నది. సీతారామాంజనేయ సంవాదమునుండి కొన్ని పద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. ప్రాపుగ రామనామము నిరంతరమున్ భజియించువారికిం
బాపము లేదటంచుఁ బెనుపామును బట్టఁగవచ్చు నగ్నిసం
దీపితలోహఖండము నతిత్వరితంబుగ మ్రింగవచ్చు బ
లోపము పెంచుపెద్దపులికోఱలు దీయఁగవచ్చునిద్ధరన్. ఆ-౧.

ఉ. నమ్మి మనమ్ములో ననుదినమ్ము వెలుంగుచిదాత్మసత్ప్రభా
వమ్మె నిజమ్ము నేను విధనమ్మును సంజననమ్ము రూపవ
ర్ణమ్ములుఁ గర్తృకార్యకరణమ్ములు వర్ణగుణాశ్రమాభిమా
నమ్ములు నాకు లేవనుఘనమ్మగు నావచనమ్ము నెమ్మదిన్. ఆ-౨.

శా. గానంబు న్నటనంబుఁ దాళగతులం గావించుచున్ జారు వి
ద్యానైపుణ్యముఁ జూపుచున్ శిరముమీఁదం గల్గు పెందొంతరల్
బూనం గైకొను నాట్యశీలునిగతిన్ బుంఖానుపుంఖోజ్జ్వల
న్నానార్థానుభవజ్ఞుఁడయ్యు బుధుఁడానందాత్ముఁ గాంచున్మదిన్. ఆ-౩.

## 105. పరశురామపంతుల రామమూర్తి

ఈ కవి శుకచరిత్రమనెడి యైదాశ్వాసముల వేదాంత గ్రంథమును రచియించెను. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; సీతారామాంజనేయ సంవాదమును రచియించిన లింగమూర్తిపుత్రుఁడును శిష్యుఁడును; ఈతని తల్లి లింగాంబ. కవి తనతండ్రినిగూర్చియు దన్నుఁగూర్చియు నిట్లు చెప్పు కొనియున్నాఁడు—

సీ. ఆత్మభూతుఁడుగాని యాత్మభూతుఁడుగాఁడు
నిగమాగమాంతార్థ నియతిదోఁప
బురుషోత్తముఁడుగాని పురుషోత్తముఁడుకాఁడు
సజ్జనానుగ్రహసరణి మెఱయ
మృత్యుంజయుఁడుగాని మృత్యుంజయుఁడుకాఁడు
సర్వప్రపంచోపశమన మమర
నమృతసిద్ధుఁడుగాని యమృతసిద్ధుఁడుగాఁడు
ఘనరసనిధినమంధనము దనర
ననుచుఁ దా వ్యతిరేకాన్వయప్రసిద్ధి
నలరి ప్రత్యక్షముగ నజుఁ డచ్యుతుండు
నభవుఁడమరేంద్రుఁడై యొప్పెనవనినతఁడె
లింగమూర్తియునాగురులింగమూర్తి.

గీ. అమ్మహాలింగమూర్తి లింగాంబికాకు
మారుఁడఁ దదీయసేవానుమతుఁడఁ బరశు
రామపంతులకులకంజరాజికర్య
మాకృతినిబొల్చు రామనామకుఁడ నేను.

ఇతఁడు నూఱుసంవత్సరములక్రిందటివాఁ డయినట్టు తోఁచుచు న్నది. ఇతఁడు రచియించినది వేదాంతగ్రంథ మయినను కవిత్వము

మృదువయి హృదయరంజకముగా నున్నది. శుకచరిత్రములోని కొన్ని పద్యములను గవితాధోరణిని జూపుటకయి యిం దుదాహరించు చున్నాను—

ఉ. కాయవనంబునన్ ధనువుగా భృకుటిం గుటిచేసి నారిగా
వాయువు గూర్చి చూపులనువాఁడిశరంబులఁ బూని షణ్ముఖున్
బాయనిదృష్టి మాటుగొని మానసముఖ్యమృగంబులన్ సుఖో
పాయముగా వధించుమృగయారతు లుందురు రప్పురంబునన్ ఆ-౧.

మ. లలనా యావనభూమి కెల్లపుడు వాలాయంబుగా నప్సరో
లలనారత్నము లేగి యార్యురులపాలం గల్గునేమంతిశా
లల నాతీరరసాలజాలముల నేలాన్దోలలం గేళిలీ
లల నాటల్గొని యాడుచుందురు బాలా కంటివే యిచ్చటన్. ఆ-౨.

ఉ. ఏనెటినైనఁ ద్రిప్పిన హృదింద్రియబుద్ధు లహర్నిశంబు పూ
ర్వానుభవాభిలాషవిషయంబులకే చను వాని మల్పి నా
నానిగమాంత శాస్త్రవచనశ్రవణాదుల నిల్పు తత్సమా
ధానమె మన్మనఃపరనిధానముగాఁగొని యభ్యసించెదన్. ఆ. 3.

ఉ. యోగిజనాశ్రితానిలనియోగము సాధకలత్యలక్షణో
ద్యోగము దేవదత్తవినియోగము సంతతముక్తి కామినీ
భోగము నిత్యసత్త్వగుణపూగము దృష్టపరాత్మజీవసం
యోగమునొందజేయుభవయోగవియోగమురాజయోగమున్. ఆ-౪

మ. జనకుం గాంచితి భేదవాదమతముల్ చెండాడితిన్ శక్తివా
దిని భంగించితి నాగమాంతమతముక్తిన్నిల్పి మెప్పింప స
న్గని మోదించినముక్తికాంతను మహాకల్యాణయుక్తంబుగా
నెనయంగూర్చె నతండు దానిఁగొని యే నేతెంచితి న్వేడుకన్. ఆ.౫.

# 106. వేగినాటి కొండనార్యుఁడు

ఈకవి వివేకసింధువ నెడి మైదాశ్వాసముల వేదాంతగ్రంథమును రచించెను. ఇతఁడు వేగినాటి నియోగిబ్రాహ్మణుఁడు; శ్రీవత్సగోత్రుఁడు. మొట్టమొదట నీవివేక సింధువును నాంధ్రవచనకావ్యమునుగా రచియించిన ముకుందయోగిని కవి యీక్రింది పద్యమున స్తుతించియున్నాఁడు—

మ. వినుతింపన్ భవరోగవైద్య మగునీవేదాంత శాస్త్రంబు పా
వనమైయుండఁ బ్రవీణతన్ వచనకావ్యం బొప్పఁగాఁ జేసి స
జ్జనులం బ్రోచినపుణ్యమూర్తి విమలస్వాంతుండు విజ్ఞానశా
సనుఁడైనట్టిముకుందయోగికి నమస్కారంబు గావించెదన్.

ఈకవియు నూతేండ్ల క్రిందట నుండియుండవచ్చును. శుకచరిత్రము నందు వలెనే యీవివేకసింధువునందును వ్యాకరణ విరుద్ధములైన ప్రయోగములు కొన్ని కనఁబడుచున్నను మొత్తముమీఁద కవిత్వము మృదువయి శ్రావ్యముగానున్నది. కవనరీతి తేటపడుటకయి వివేకసింధువు నుండి కొన్నిపద్యము లిం దుదాహరింపఁ బడుచున్నవి—

చ. కడువడిఁ గర్మమార్గ మనుకాఱడవిం బడి విభ్రమించుచున్
జడమతి నింద్రియార్థఫలసంచితతిక్తకషాయసారముల్
దడఁబడఁగ్రోలి దుర్వ్యసనదాహమునన్ వెగ డొంది నుక్కి మీ
యడుగులు గాంచితిన్ ననుఁ గృపామృతమానఁగనిచ్చి ప్రోవవే. ఆ ౧

మ. వడిగాఁదీసి ధనుర్ధరుండు విడువం బాణంబు నొందాఁక న
వ్వడిగల్గున్ శర మంతదాఁక నడుచున్ వమ్మైన యచ్చోటనే
పడుఁ బ్రారబ్ధపుఁగర్మవేగమున నాపర్యంతమున్ దేహముల్
పడ వావేగము తూలినం బడును జూ భగ్నంబులై మేదినిన్. ఆ-౨

మ. సమతన్ మేఘుఁడు వారిధారలు మహిన్ సంప్రీతి వర్షింపఁ బ
ల్లములై యుండినచోట్ల నీరు నిలుచున్ రక్షింపఁగాబండపై

దుముకున్నీగము నిల్వ దల్లగుట నెందుం బాత్ర మూహించి యు
త్తమునందుం దగ బ్రహ్మవిద్య నిలుపన్ ధర్మంబు చింతింపఁగన్. ఆ-3.

మ. తనువుల్ స్వప్నమనోరథంబులక్రియన్ దండోపతంసంబులై
యనయంబుం బొడచూపుఁ బోవు నివి కర్మాధీనసంప్రాప్తముల్
ఎనయ న్నాకును వీనితోఁ దగులు లేదెల్లప్పుడున్ నే ఘనుం
డను నిత్యుండ నిరామయుండ విమలుండన్ సాక్షిచైతన్యుఁడన్. ఆ-4

ఉ. అప్పుడు పుట్టినట్టిశిశువందును జవ్వనులై మిటారియై
యొప్పులకుప్పయైన వికచోత్పలలోచనయందు వార్ధకం
బుప్పతిలంగ నున్నముదియుగ్మలియందును నిర్వికారుఁడై
చెప్పెడి దేమి యెందు సమచిత్తుఁడు పండితుఁ డెంచిచూడఁగన్. ఆ-4

## 107. వాసుదేవయోగి

ఈ కవి జీవప్రబోధమనెడు నాలుగాశ్వాసముల వేదాంతగ్రంథమును రచియించెను. యోగశాస్త్రములను పేర రచియింపఁబడిన వేదాంత గ్రంథములలో ననేకములకంటె నిందలి కవిత్వము సలక్షణమయి హృదయంగమముగా నున్నది. కవి యేకాలపువాఁడో తెలియదుగాని నూఱు సంవత్సరముల పయివాఁ డని తోఁచుచున్నది. జీవప్రబోధములోని రెండు పద్యముల నిం దుదాహరించుచున్నాను—

చ. అనవిని జీవుఁ డిట్లనుఁ బ్రయత్నముఁ బ్రాప్యపదంబు లేక తా
ననయము ఖండమై జగములందును గారణకార్యరూపతం
బెనఁగొనియున్న యాత్మ కొకపిండపదంబుఁ బ్రయత్నసాధన
బును నన గల్గునే యనుచు బుద్ధికిఁ దోఁచెడి వీనిఁ జెప్పవే. ఆ-3.

ఉ. అంధతమఃప్రకృత్యనుగతాత్ముల శుద్ధశరీరశుద్ధిచే
బంధవిముక్తి గోరి కరిభంగిని నీట మునుంగ దేహదు
ర్గంధము వాయుఁగాక భవకర్మనిబంధవిముక్తి కల్గునే
బంధురరాగదోషములఁ బాసిన శుద్ధతఁ గాక జీవుఁడా. ఆ-4.

# 108. కానాల నరసింహకవి

ఈ కవి హరివంశములోని యాశ్చర్యపర్వమునందలి శేషధర్మముల నెనిమిదాశ్వాసముల పద్యకావ్యమునుగా రచియించెను. ఈతఁడు నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు; వాసిష్ఠగోత్రుఁడు; వేంకటేశయామాత్య పుత్రుఁడు; ఈతని వాసస్థలము తటికొండగ్రామము; ఇతఁడు తన శేషధర్మగ్రంథమును తటికొండ నృసింహస్వామి కంకితము చేసెను. ఈతనికాల మేదియో తెలియరాలేదు. ఇతఁడు తన గ్రంథమునందు—

"గీ. ఆంధ్రవిద్వజ్జనాచార్యు నన్నపార్యు
సుజనగుణమానసోత్పలసోము సోము
సురుచిరాలంకృతిభ్రాజి సోమయాజి
సత్కవిసనాథు శ్రీనాథు సన్నుతింతు."

అని యాంధ్రకవులను వర్ణించుచోఁ దమనందవరీకులలో సుప్రసిద్ధులైన పెద్దనాదికవులనుసహితము వర్ణించియుండలేదు. ఇంతమాత్రముచేత నితఁడు పెద్దనాదికవులకంటెఁ బూర్వుఁడనికాని వారితోడి సమకాలికుఁడని కాని చెప్ప వలనుపడదు. ఇతఁ డించుమించుగా నూఱు నూటయేఁబది సంవత్సరములక్రిందట నుండి యుండవచ్చును. అక్కడక్కడఁ గొన్ని విలక్షణములైన ప్రయోగము లున్నను కవిత్వము మొత్తముమీఁద మృదువయి నిరర్గళధార కలదిగా నున్నది. ఈతని శేషధర్మములలోనుండి కొన్ని పద్యముల నిం దుదాహరించుచున్నాను.

చ. పటుతరమేఘమండలవిభాసితసౌధచయోపరిస్థితో
త్కటవరహేమకుంభసముదాయధగద్ధగితోరుకాంతివి
స్ఫుటచపలాకృతి న్మెఱయుఁజూడఁగ వచ్చినవారలెల్ల ని
చ్చటఁ గలచంచలల్ కడునచంచల లంచుభ్రమింతురెంతయున్. ఆ-౧

చ. ఘనవిషజంతుపూరిత మగాధము కూపము దీనిఁజూడు నీ
వొనరఁగఁ గూఁతు నియ్యవు తిలోదక మియ్యవు గాన దాన మా

తనువులు జీర్ణతం బొరసె దారుణరూప సమేతకూపముం
దును బడియున్నవార మతిదుఃఖసమాకులతన్ మహాత్మకా. ఆ-౨

శా. దారాపత్యయుతుం డకించనుఁడు విద్వాంసుండు వేదాంతమా
ర్గారూఢుండును వృత్తిహీనుఁడును నిత్యానందుఁడున్ శ్రోత్రియుం
డై రాజిల్లిన బ్రాహ్మణోత్తమున కత్యానందులై జీవనం
బీరే దాతలు పొందరే సుగతు లుర్వీశా ధరామండలిన్. ఆ-3

ఉ. నీసము లెందఱో శమనునిం గనఁబోయిరి నీకుఁజావురా
దాసకుఁ బుట్టినిల్లయి మహాకలుషంబు లొనర్చి సభ్యులన్
మోసముచేసి నేఁ డిటులుమూల్గినఁ బోవునె తత్ఫలంబు నిన్
బాసినఁ గల్గు మా కఖిలభాగ్యము లేగుము కాలుప్రోలికిన్. ఆ-౪

మ. అనుచున్ దూఱి మహీవరా సుతకళత్రార్థంబుగాఁ బాపచిం
తన లర్థార్జనఁజేసి వారి నిరవందం బ్రోతు రంతంబునన్
దనవెంటం జనుదెంతురే కడపటన్ దా నొక్కఁడే పోవుటల్
గనియున్ మోహలతానిబద్ధు లగుచున్ గానంగలే రింతయున్ ఆ-౫

మ. సతియుం దానును బుత్రపౌత్రయుతుఁడై సంప్రాప్తసర్వేష్టుఁడై
యతిసంతోషమున్మీఱఁగా మెలఁగి దేహాంతంబునన్ లోకపా
లతతుల్ పూజ లొనర్ప సర్వసుఖసంప్రాప్తుండునై క్రమ్మఱన్
క్షితిపైఁ బుట్టెను జక్రవర్తి యగుచున్ జైత్రోముదంబొప్పఁగన్. ఆ-౬

చ. పొలుపగు కాంచనంబుఁ దిలపుష్పము నచ్చెలి నాసికోపమం
బలరఁగవచ్చి దానిసమ హాటకుఁజాలక యూర్ధ్వదృష్టిఁ గొ
మ్మలఁ దలక్రిందుగాఁ దపము మానుగఁజేసి ఫలించువేళ మే
నులు విడిచెన్ నలంగఁడై ఘనుండయియన్ బలవద్విరోధియై. ఆ-౭

ఉ. నీవును దీపదానములు నెమ్మిగఁ జేయుము దాన మోక్షమున్
శ్రీవరుఁ డిచ్చు జ్ఞానమును జేకుఱు జ్ఞానముచేత మోక్షమున్
భూవర నీకుఁ గల్గు హరిపూజ లొనర్పుము కార్తికంబునం
దీవితేతిహాసము మహిన్ వినువారికిఁ గల్గుసౌఖ్యముల్. ఆ ౮

## 109. రామనామాత్యుఁడు

ఈకవి గయోపాఖ్యాన మనెడి రెండాశ్వాసముల ప్రబంధమును మును రచియించెను. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; తిమ్మనమంత్రి పుత్రుఁడు. గయోపాఖ్యానమునకు కృష్ణార్జున సంవాదమని నామాంతరము గలదు. ఈతఁడు నూఱుసంవత్సరముల క్రిందటివాఁడయి యుండవచ్చును. ఇతఁడు తనగ్రంథమును శ్రీమదహోబిల నృసింహస్వామి కంకితము చేసెను. ఈతని గ్రంథమునందు లక్షణవిరుద్ధములైన ప్రయోగములనేకము లున్నను, మొత్తముమీఁద కవిత్వము సరసముగానేయున్నది. గయోపాఖ్యానములోని పద్యములు రెండిందు క్రిందఁ జేర్పబడుచున్నవి.

ఉ. వారిజనాభ నీవనుప నాసవనందనుఁ డున్నచోటికిన్
జేరి హిమాద్రిధైర్యునకుఁ జెప్పితి బుద్ధులు పెక్కురీతులన్
భూరిదయాబ్ధి యాఘనునిబుద్ధికి నేమని యెంచిచూప నీ
ధారుణిఁ బాండవేయులకు దాపునుదండయు నీవెకా హరీ. ఆ. ౧.

ఉ. ఏమని చెప్పవచ్చు జళి యీబలపార్థులబాహువీర్యముల్?
రామునిసాటి వత్తురు శరాసనవిద్యను వీరిధైర్యముల్
హేమమహీధరంబునకు నెక్కువ వీరలతోడ మార్కొనన్
సోమధరుండు వాసవుఁడు సూర్యకులోద్భవుఁడైన నోర్తురే. ఆ. ౨.

---

## 110. పోచన

ఈకవి చంద్రాభ్యుదయ మను ప్రబంధమును. రచియించెను. ఇతఁడు వైదిక బ్రాహ్మణుఁడు. ఈతనితండ్రి నృసింహసోమయాజి. ఈ చంద్రాభ్యుదయము అమ్మనమంత్రి కుమారుఁడగు చిన్నయామాత్యున కంకితము చేయఁబడినది. ఈకవికాల మేదో తెలియరాలేదు. ఇతఁడు నూఱుసంవత్సరములకంటెఁ బూర్వమునందుండినట్లు తోఁచుచున్నది. ఈప్రబంధము శబ్దాలంకారములతోనిండి శ్రావ్యముగా నున్నది. చంద్రా

భ్యుదయములోని పద్యములు రెం డిందుక్రిందఁ బొందుపఱుపఁబడు చున్నవి—

చ. తిమిరపుఁజవ్వనంబున నతీతసతీతనువృత్త మైనచి
త్తముతమి పౌరవారవనితా జనతాజనితానురాగయో
గమున మునింగి దర్పకవికారము ఘోరముగా ఘటింపఁ న
క్కొమరుమిటారిబారిపడి కుంఠితవృత్తిఁ గ్రమక్రమంబునన్. ఆ. ౧.

చ. అన విని గుండె జల్లుమన నవ్వనితామణి యమ్మచెల్ల యీ
యన మదనాతురత్వమని యాత్మఁదలంచి తలంచి సాధ్వసం
బున వెఱఁగుం దడంబడఁగఁ బొంపిరి నిట్లను భర్తతోడ ని
య్యనువునమిమ్ముఁబ్రోవఁగ మహాత్మ యొరుల్ మన కెవ్వరియ్యెడన్ ఆ. ౨

---

# 111. పెనుపల్లె బాపనామాత్యుఁడు

ఈకవి సీతావిజయమను నేకాశ్వాసప్రబంధమును రచించెను. ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; కోనయామాత్యపుత్రుఁడు. ఈతని కవిత్వమునందు లక్షణవిరుద్ధములైన ప్రయోగము లక్కడక్కడఁ గానఁబడుచున్నవి. కవనరీతి తెలియుటకయి సీతావిజయమునుండి రెండు పద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి—

ఉ. పోల శిలాసనుండు శివపూజ యొనర్చుచు నుండి యంతలో
నాలమువార్త కర్ణములయందు వినంబడ నుల్కి యుగ్రుఁడై
చాలును దేవపూజయని చారులఁ గన్గొని యేమి మత్పురిన్
జాలఁగ సందడు ల్గలుగుచందము తోఁచెను జెప్పుఁ డంతయున్.

ఉ. భూరిరయంబునం దొడరి భూసుత కన్నుల నెఱ్ఱచేసి యో
రోరి శతాస్య త్రుంగి తని యొక్కటి బాణసహస్రకోటి తా
నారజనీచరేంద్రు తనువందును గ్రుచ్చిన నెత్తు రొల్కఁగాఁ
బోరుచు వాఁడు నొప్పెసఁగఁ బూచిన మోదుగుచెట్టుకై వడిన్.

---

# 112. చదువుల సోమలింగయ్య

ఈ కవి మదనసాయక విలాసమనెడి యైదాశ్వాసముల శృంగార ప్రబంధమును రచియించి శ్రీశైలమల్లికార్జునున కంకితముచేసెను. ఇతఁడు శైవబ్రాహ్మణుఁడు; గారుత్మతద్యుతిగోత్రుఁడు. వేంకటాచలమయారాధ్యునకును అన్నపూర్ణమకును పుత్రుఁడు. ఇతఁడేకాలపువాఁడో సరిగాఁ దెలియరాదు. ఇతఁ డించుమించుగా నూఱుసంవత్సరములక్రిందట నుండి యుండును. ఈతని కవిత్వము మృదుమధురపాకమున వెలయుచున్నను నిర్దుష్టమైనది కాదు. ఒక్కొక్క యాశ్వాసమునుండియొక్కొక్కటిచొప్పున నిందుక్రింద నుదాహరింపఁబడిన పద్యములనుబట్టి కవియొక్క కవిత్వరీతి కొంతవఱకు తేటపడవచ్చును—

చ. చని శశికాంత సంఘటితచారుసువర్ణవికారసౌధముం
దును నెనలేని గద్దెపయి దోరముగాఁ గొలువుండి సాధుస
జ్జనపరివారయుక్తుఁడయి సత్యముఁ దప్పక మూఁడులోకముల్
తనదుయశంబు గప్పఁగను దద్దయు రాజ్యము చేయుచుండఁగన్. ఆ-౧

చ. అని దరిఁజేరి బాలకుని నక్కునఁ జేరిచి చెక్కుదోయి ము
ద్దొనరిచి చుంచు దువ్వుచు మృదూక్తులు పల్కి కడిందిప్రేమ నె
మ్మనమున నల్లిబిల్లికల మాటికి నల్లుకొనంగ నక్కుమా
రునిముఖచంద్రదర్శనవిలోచనకైరవుఁ డౌచు నయ్యెడన్. ఆ. ౨.

చ. తెలివాలురుమంజిముత్తెములు తీరుగనిల్పిన క్రేవఁ జక్కనౌ
బలువగు కెంపుగుంపుల శుభస్థితకాంతులు చల్లుమేలుక
మ్మలకు నివాళులిచ్చు కనుమచ్చికలున్ జెలువొందఁ దాని పు
వ్వులసర మొక్కకేల నిడి యొప్పుగ నప్పురి కేఁగుచుండఁగన్. ఆ-3.

ఉ. ఉల్లము చల్లగాఁ గనినయొప్పులకుప్పపయిన్ సుమాస్త్రముల్
పెల్లుగ నేసినట్టికడుపెద్దవు నీ కొకలక్ష్యమా నవో

త్ఫుల్లసరోజలోచనలపొంక మడంచుట మన్మథా ధరన్
తల్లికి ముక్కుగోసి పినతల్లికిఁ గమ్మలొసంగనేర్తురే. ఆ-౮.
ఉ. మారుని గేరు వీని సుకుమారశరీరము నవ్యచంద్రికా
సారము తీరు హాసము సుసారసనారము లౌర కన్నులిం
పారెడు గండుతుమ్మెదలబారులనేల్కురు లౌర వీనిసిం
గారము నీరజాసనునికైన మదిం దలఁపంగ శక్యమే. ఆ-౫.

---

# 113. శ్రీధరమల్లె వేంకటస్వామి

ఇతఁడు బ్రహ్మోత్తరఖండము నయిదాశ్వాసముల పద్యకావ్యమునుగాఁ దెనిఁగించెను. ఇతఁడు బడగలనాటి కన్నడవంశజుఁడు; ఆశ్వలాయనసూత్రుఁడు; భారద్వాజగోత్రుఁడు; అయ్యనార్యతనూజుఁడు. కవి యీ గ్రంథమును జ్యోతిరామనాదుల ప్రేరణముచే రచియించి, సిద్ధవటమునకు సమీపముననున్న యంబాపురమందలి పార్థివేశ్వరస్వామి కంకితము చేసెను. ప్రేరకులయిన రామనయు లక్ష్మీనారాయణుఁడును జెంగల్వరాయఁడును దన్నుఁగూర్చి పలికినట్లుగాఁ గవి యీ క్రిందిపద్యములలోఁ జెప్పుకొన్నాఁడు—

శా. శ్రీమద్వేంకటరామనామునిఁ గవిశ్రేష్ఠున్ రమావల్లభ
ప్రేమాపాంగవిశేషలబ్ధకవితాభివ్యక్తసూక్త్యన్వితుం
గామారిస్తవభక్తియుక్తు విలసద్గాంభీర్యధైర్యాఢ్యు న
న్నామోదంబునఁ జూచి పల్కిరి సముద్యత్కౌతుకం బొప్పఁగన్.

*   *   *   *   *

క. ఖండేందుధరప్రియ మా । ఖండలభాగ్యప్రదంబు కల్మషలతికా
ఖండన మగుబ్రహ్మోత్తర । ఖండము రచియింపు పద్యకావ్యముగాఁగన్.

ఈ కవి యీ బ్రహ్మోత్తరఖండమును రచియించి యెనుబదిసంవత్సరము లయినట్టు గ్రంథాంతమునందలి యీ క్రింది పద్యమునుబట్టి తెలియవచ్చుచున్నది—

సీ. శరవర్షగణనంబు శైలరామమునీందుపరిమితంబై ధాత్రిఁబరఁగుచుండు
యువనామసంవత్సరోపేత కార్తికమాసరాజిత పౌర్ణమాసియందు
ధన్యులు విష్ణువర్ధనసగోత్రులుజ్యోతిసుబ్బన్నపుత్రులు సుగుణమణులు
రామన్నలక్ష్మినారాయణచెంగల్వరాయఁడు ననముప్వు రమలయశులు
చిత్తమున భక్తి వెలయ బ్రహ్మోత్తరాఖ్య
ఖండ మాంధ్రప్రబంధంబుగా ఘటించి
యెలమి సంబాపురపుఁ బార్థివేశ్వరునకు
భాసురముగ సమర్పణఁ జేసి రపుడు.

పయిపద్యమునుబట్టి శాలివాహనశకము ౧౭౩౭వ సంవత్సరము నందన్నఁగా క్రీస్తుశకము ౧౮౧౫వ సంవత్సరమునం దీగ్రంథము రచియింపఁబడినట్టు స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నది. ఈగ్రంథమునం దక్కడక్కడఁ గొన్నివ్యాకరణదోషము లున్నను మొత్తముమీఁదఁ బుస్తకము హృదయరంజకముగానేయున్నది. బ్రహ్మోత్తర ఖండములోని పద్యములు కొన్ని యిం దుదాహరింపఁబడుచున్నవి—

ఉ. ఓమునిసార్వభౌమ మహిమోజ్జ్వల మీ రిట కేఁగుదెంచుటన్
నామది సంతసం బొదవె నాదుగృహంబు పవిత్ర మయ్యె మ
త్కామితము ల్ఫలించెఁ గడుధన్యుఁడ మాన్యుఁడ నైతి నంచు నా
భూమివిభుండు పల్కుచును బూజలొనర్చె మహాముదంబునన్. ఆ. ౧

శా. ఆరాజేంద్రుఁడు కంఠసూత్రరహితన్ వ్యక్తాంజనాపాంగి శృం
గారప్రాభవహీనగాత్రి గళితగ్రైవేయహారాదికన్
దూరీభూతశుభాంగరాగతిలకన్ దుర్వారశోకార్దితన్
సారాచారపరాయణం గనియె నాసాధ్వి న్విచిత్రంబుగన్. ఆ. ౩.

మ. రణదుద్యన్మణిదీప్యమానకనకగ్రైవేయకోటీరకం
కణహారాంగదనూపురాదుల నలంకారంబు గావించిరి
క్షణమాత్రంబునఁ బాయఁద్రోచి కడువేడ్కన్ లక్ష్మిఁ రుద్రాక్షభూ
షణము ల్దాల్తురు వారలిర్వురు మహోత్సాహంబుదీపింపఁగన్. ఆ-౭

---

# 114. ఓరుగంటి సోమశేఖరకవి

ఈకవి రామకృష్ణార్జున రూపనారాయణీయమను నాలుగాశ్వాసముల త్ర్యర్థి కావ్యమును రచియించి శ్రీపూసపాటి నారాయణరాజుగారి కంకితము చేసెను. పుస్తకముయొక్క పేరుచేతనే యిందు రాఘవయాదవపాండవార్థము లిమిడియున్నవని తెల్లమగుచున్నది. ఈకవి వైదిక బ్రాహ్మణుఁడు; కౌండిన్యసగోత్ర సంభూతుఁడు. ఇతఁడు సంస్కృతాంధ్రములయందు చక్కని వైదుష్యము కలవాఁడయి కవితారచనయం దత్యంత సామర్థ్యము గలవాఁడుగా నుండెను. ఇతఁడు నూఱుసంవత్సరముల లోపలివాఁడు. ఈతని త్ర్యర్థికావ్యములోనివి కొన్నిపద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి—

శా. సంభూతాతివిభూతి దర్పకకళాసంపన్నుఁ డారాజు స
ద్గాంభీర్యాంబుధి యెలె సర్వధరణిన్ గాంగేయచాపోరుసం
రంభప్రాభిసహాయుఁడై విమరసారన్యాయమార్గంబుతో
శుంభత్కీర్తి మహోత్పలప్రియకులస్ఫూర్తుల్ విజృంభింపఁగన్. ఆ-౧

ఉ. సంతస మొప్పఁ దోఁచెను వసంతము మంజులకోకిలస్వనా
క్రాంతము కోరక ప్రకర కాంతము బంభరగానశోభితా
శాంతము సర్వమంగళనిశాంతము మోచితమానమానినీ
స్వాంతము ధూతసత్పథికశాంతము ఫుల్లలతాంతతాంతమై. ఆ. ౨.

చ. సుజనకృత స్తవా జనకసూక్తి యలంఘ్య మదెన్ని చూడఁదా
నిజము సమక్షమందుఁ దగనిన్ను సమర్థునిగాఁ దలంచి తత్
ద్ధ్వజము నుతింపఁ బంచుపని వారకచేయ సుధర్మసంస్థితిన్
గుజనులు స్రుక్క శ్రీహరిని గొల్చినవాఁడనయంబు నెమ్మదిన్. ఆ.3.

శా. కళ్యాణీభవదర్పితోగ్రవరసత్కారుణ్యాతతిన్ సద్విపత్
కళ్యాణీధరవిష్ణువన్యవసతీకాండప్రభూల్లంఘనా
కళ్యాణాతిశయంబు నాకు నిచటన్ గల్గెన్ని రాఘూటమై
కళ్యాణాంబరకాంతుఁజేయుమకృపన్ గాంభీర్యధీమ్రొక్కెదన్. ఆ. ౪.

---

# 115. ముదుంబి వేంకటాచార్యుఁడు

ఈకవి రసప్రదీపికయనెడు మూడాశ్వాసముల వైద్యగ్రంథమును జేసెను. ఇతఁడు శ్రీవైష్ణవుఁడు; శ్రీవత్సగోత్రుఁడు; వేదాంతాచార్యపుత్రుఁడు. ఇతఁడు గోదావరీమండలములో నూఱుసంవత్సరములకు లోపలనుండినవాఁడు. కవిత్వమునందుఁ గొన్ని స్ఖాలిత్యములు గలవు. రసప్రదీపికలోని రెండుమూఁడుపద్యముల నిందుదాహరించుచున్నాను—

ఉ. పారదగంధకంబు లొకభాగము నాలుగుభాగముల్ నవా
సారము కుప్పెఁబెట్టి పదిజాములు వండినఁ గెంపుసొంపుతో
ధారుణిఁ బుట్టు సిందుర ముదారత నడ్డిగమెత్తు నిచ్చినన్
బోరన రోగపుంజములఁ బోవహరించు నమోఘవీర్యమై. ఆ ౧.

చ. ఘృతమునఁ గొండపిప్పలి మిరెంబులతోఁడుత నభ్రకంపు సం
తతమును జిన్నమెత్తు గొన దారుణమౌ కఫవాతపిత్తసం
యుతగ్రహణీక్షయంబుల వియుక్తప్రమేహగుదాంకురంబులన్
గతముగఁజేసి దీపనము గల్గఁగఁజేయు నమోఘవీర్యమై. ఆ_౨.

ఉ. మంచి సువర్ణభస్మము క్రమంబునఁ గొన్నను రాజయక్ష్మముల్
సంచితకర్మజంబులగు సర్వరుజంబుల భూతవేధలన్
ద్రుంచి యమోఘవీర్యమయి దోర్బలముల్ ఘనకాంతి తేజమ
త్యంచితబుద్ధిమార్గము చిరాయు వొసంగును మాసచంద్రమా. ఆ-3.

---

# 116. అక్కెనపల్లి నృసింహకవి

ఈ కవి యాదిలక్ష్మీవిలాసము, వల్లభాంబాపరిణయము, ఓఘవతీపరిణయము, అను మూడు ప్రబంధములను రచియించెను. వీనిలో నోఘవతీపరిణయము శ్రీగొడే జగ్గారాయనింగారి పుత్రులగు శ్రీసూర్యప్రకాశరాయనింగారి కంకితముచేయఁబడి తత్సోదరపుత్రులగు శ్రీమహారాజా గొడే నారాయణగజపతిరాయనింగారిచే ముద్రింపింపఁబడినది. ఈ గ్రంథము శాలివాహనశకము ౧౭౩౯ వ సంవత్సరమునందు రచింపఁబడినట్లు గ్రంథాంతమందలి యీ సీసపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది—

సీ. శాలివాహనశకసంవత్సరంబు లజాగ్నిభూధరతుషారాంశులైన
యీశ్వరాబ్దంబున నెసఁగు వైశాఖమాసంబున శుక్లపక్షమున మూర్తి
శశిసంఖ్య భౌమవాసరమున శుభవేళ నక్కెనేపలి నృసింహకవి యోఘ
వతిపెండ్లికథ సమున్నతిమీఱెడి గొడెజగ్గారాయసూర్యప్రకాశరాయ
మణికిరాజ్యాయురారోగ్యమహితపుత్ర
పౌత్రనికరాభివృద్ధిగా భవ్యబుద్ధిఁ
గృతి యొసంగెను దద్యశం బతిశయిల్లి
జగతి నాచంద్రతారార్కముగఁ జెలంగ.

ఇతఁడు కృష్ణామండలములోని యెల్లమంద నివాసుఁ డయినను తన యాదిలక్ష్మీవిలాసమును గోదావరీమండలములోని యంతర్వేది

నృసింహస్వామి కంకితము చేసెను. ఆదిలక్ష్మీవిలాసము నాలుగాశ్వాసములుగల ప్రౌఢకావ్యము. వల్లభాంబాపరిణయ మను విఘ్నేశ్వరుని పెండ్లికథ మూఁడాశ్వాసముల ప్రబంధము. ఇది పులిపాక సీతయామాత్య పుత్రుఁ డయిన రామమంత్రి కంకితము చేయఁబడినది. ఈ కవి నియోగి బ్రాహ్మణుఁడు; కౌండిన్యగోత్రుఁడు; జోగయామాత్య పుత్రుఁడు. ఈకవి నూఱుసంవత్సరములకు లోపలివాఁడు. ఈతని కవిత్వము రసవంతముగా నున్నది. ఈతని పుస్తకములోని యీ క్రింది పద్యములవలన నీతని కవితాధోరణిని గొంత తెలిసికొనవచ్చును—

## ఆదిలక్ష్మీవిలాసము.

ఉ. మాయలు నింద్రజాలములు మా కవి క్రొత్తలుగావు మామనో
నాయక యిప్పు డీవు రతినాయకసాయకభిన్నకాయునై
పాయని మోహమందుననుఁ బన్నుగఁ గౌఁగిటఁగూర్చి యెయ్యెడన్
శ్రీయుతసౌఖ్యవైఖరులుచేరఁ దలంపులుదీఱఁ గూడుమా. ఆ-౧.

ఉ. ఎక్కడిగొల్లవాఁడ విది యెక్కడిజాణతనంబు దొంగవౌ
టెక్కడిపౌరుషంబు మది నింత తలంపక ప్రాలుమాలినన్
దక్కెనె నీకుఁ గోక లవి తక్కకయిమ్మిఁకఁ గామవలివే
యక్కలతోడ నీసరసి నాడఁగఁ జీరలు దొంగిలింతువే. ఆ-౨.

ఉ. వారిజనేత్ర మీచరణవారిజముల్ హృదయాంబుజంబునన్
గూరిమినిల్పి యెల్లపుడుఁ గొల్చురమాసతియంచు రుక్మిముం
దారయలేక చైద్యునకు నంగన నిచ్చెదనన్నమాట బ
ల్నారసమట్లు కర్ణమున నాఁట ననుం గృపఁ గాంచి యిట్లనెన్. ఆ-౪.

## వల్లభాంబాపరిణయము.

చ. అరయఁగ సిద్ధసాధ్యగరుడామరకిన్నరనాగయక్షకిం
పురుషులయిండ్లలో నెలమిఁ బుట్టెదఁ జేనెఱుపొట్ట మీ గణే

శ్వరునకుఁ బెద్ద దేల యనిశంబును బొట్టిగ బ్రహ్మచారియై
పరఁగెడిమేటికిన్ గతెనభావులతో నిల వియ్య మేటికిన్. ఆ-౨.

చ. ముద మొదవించు ముచ్చటల మించును గంధముఁ బెంచుసౌఖ్యము
ల్గనుఱఁగ నించు నించువిలుగొంచుఁ జరించువజీరుశాస్త్రసం
పద గడియించు సత్పురసపద్ధతుల న్నిరసించు మించు ని
మ్మదిరయటంచు నెంచుచు నుమానుగ గ్రొవ్విరిమించు బోఁడ్లొగిన్. ఆ-౨

ఓ ఘ వ తీ ప రి ణ య ము.

ఉ. మేలగుమేలు గూర్చుటకు మీ రరుదెంచితి రంటివౌబళీ
చాలు భవన్మనోరథముచక్కఁలభించుఫలం బటంచు నా
లోలవిశాలనేత్ర మొదలోఁ గలతియ్యనివిల్తు నొయ్యనన్
మేలుకొనంగఁజేసి యొలమిం జన సంయమిరాజు సయ్యనన్. ఆ. ౧.

ఉ. అంతట నేర్చె విద్య లిసుమంత కొఱంత యలంతలేక భూ
కాంతునిముద్దుపట్టి యజుకాంతయె యంచుసమస్తసజ్జనుల్
వింతగ సంతసించి తను వేయివిధంబుల సన్నుతింప న
త్యంతకళావినోదమహిమాతిశయంబు శయంబుఁ జేరఁగాన్. ఆ. ౪.

---

# 117. పైఁడిపాటి వేంకటనృసింహకవి

ఈకవి నృసింహవిలాస మను మూడాశ్వాసములగ్రంథమును రచియించెను. ఈతఁ డారువేలనియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; శరమర్షణగోత్రుఁడు; లక్ష్మీపతికిని వేంకమాంబకును బుత్రుఁడు. ఈతఁడు నెల్లూరిమండలములోని పైఁడిపాటి గ్రామనివాసుఁ డయి గ్రామచతుష్టయమునందు స్థావరజీవనము కలవాఁ డయినట్లు నృసింహవిలాసములోని యీక్రిందివచనమువలనఁ దెలియవచ్చుచున్నది—

సీ. క్షితితలంబున నొప్పు కృష్ణాపినాకినీదివ్యనదీమధ్యదేశభూమిఁ
గడుఁబూర్వవార్ధికిఁ బడమట యోజనదూరమై తగుఁ గందుకూరు
మఱియు
నదియె సీమానామమైయొప్పు నాకందుకూరికిఁదనరు వాయవ్యదిశను
బాలేట దానికిఁ బాలస్త్యదిశఁ బైఁడిపా డొప్పుదానికిఁ బశ్చిమమున
నెగడుఁ జతుకుపాడు సీబ్రూతి వేంపాడుఁ
జెలఁగు గాద్పుమూల నిలవరయన
నమరుపురచతుష్టయం బిస తృణకాష్ఠ
జలసమృద్ధి సిరుల నలరుచుండు.

గీ. గ్రహణవేళ గోపరాజు రామన గోల
కొండప్రభువుచేతఁ గొనినదాన
మహిమ దుష్టమతుల మడియించి స్థావర
జీవనములు ద్విజులఁజేర్చె మున్ను

వ. తదీయానుగ్రహాలబ్ధం బైనయేతద్గ్రామచతుష్టయ స్థావరజీవనజీవితు
లయిన మదీయవంశజులు ఈc.

ఈకవియొక్క కాలమేదియో కానరాదుగాని యితఁ డాధునికుఁ
డయినట్టు తెలియవచ్చుచున్నది. నృసింహవిలాసములోని రెండుపద్యము
లిందుక్రిందఁ బొందుపఱుపఁబడుచున్నవి—

మ. శశి పక్షక్షయ మెన్ని యక్షయకళాసంప్రాప్తికిన్ ధాతృహృ
ద్వశుఁడై దీని సృజించుకాలమున వక్త్రింబయ్యెనో తా మహ
ర్నిశ మూర్ధ్వస్థితి నుంట రోసి తొలఁగెన్ రేఖేఁ డటంచుం దదం
ఘ్రిశయాక్రాంతనఖాకృతిం బొలిచెనో క్రిందై క్వచిత్తాకరల్. ఆ-౨

శా. పోరా వేఁటకు వేఁటకాండ్రు గహనంబు ల్గ్రిమ్మరక? గ్రమ్మఱక
రారా రాతిరి కైన? వా రలసులై రాకున్న నార్తాత్రికై
యీరీతిం దపియించుబోంట్లు కలరే యెందైనఁ? జంద్రాస్యలా
ఘోరారణ్యముఁ జొచ్చి చూడఁగలరే గోవిందు రేజాములన్. ఆ-3

# 118. కొటికెలపూడి వేంకటకృష్ణకవి

ఇతఁడు శ్వేతాచలమాహాత్మ్యమను మూడాశ్వాసముల గ్రంథమును రచియించి, బొబ్బిలిపురాధీశ్వరుఁ డగు రాయణప్ప రంగరాజున కంకితము జేసెను. ఈకవి వైదికబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; హారితసగోత్రుఁడు; శివరామపౌత్రుఁడు; వేంకటరామపుత్రుఁడు. కృతిపతి తన్నుఁగూర్చి పలికినట్లు కవి తనగ్రంథములో నిట్లు వ్రాసికొని యున్నాఁడు—

మ. నను శ్రీమజ్జనకాత్మజాధిపపదన్యాసప్రఫుల్లాంతరం
గుని వాణీకరుణాకటాక్షకలనాంకూరత్సుధామాధురీ
వినుతాంచత్కవితాప్రతోషితమహావిద్వత్కవిగ్రామణిన్
ఘనకార్తాంతికతాండిలేయుఁ గడువేడ్కం బిల్చి తా నిట్లనెన్.

చ. హితులు మదన్వవాయజుల కెల్ల బురోహితు లార్యలోకపా
లితకవితాప్రకల్పితదిలీపచరిత్రముఖోజ్జ్వలత్ప్రబం
ధతతులు హారికాగ్రణు లుదారగుణాన్వితచిత్తుల స్మదా
శ్రితులు సమస్తసూరినుతశేముషు లెన్నఁదరంజె మిమ్ములన్.

సీ. ధీరత మేఘసందేశంబు తెనిఁగించి ప్రీతి దిలీపచరిత్ర మనెడు
గొప్పప్రబంధంబుఁ జెప్పి శ్రీరాముల కర్పించితివి మున్ను నేర్పుమీఱఁ
గార్తాంతికులు మెచ్చఁగా శ్రీపతిగ్రంథగతిని మామకజాతకము లిఖించి
మా కొసంగితి విప్పు డేకాగ్రచిత్తత నంచితంబుగఁ దెనిఁగించుచున్న
కూర్మమాహాత్మ్య మొసఁగుము కూర్మిమాకు
రమ్యచారిత్ర వేంకటరామపుత్ర
కీర్తిదౌదార్య వేంకటకృష్ణమార్య
యనుచు బహుమతిచేయ నాహ్లాదమునను

కృతిపతిపూర్వులు సర్వజ్ఞసింగమనాయని సంతతివారయిన రావు కులజులయినట్టును, వారిలో లింగప రంగనాయఁడు బొబ్బిలిసంస్థానమును స్థాపించినట్లును, గవి యీ క్రింది పద్యములలోఁ జెప్పియున్నాఁడు—

మ. హరిపాదంబునఁ బద్మనాయకులు గంగాస్వీతులై యుద్భవిం
చిరి తత్పాదజులం దతిప్రబలులై శ్రీరావువంశ్యోల్బలం
గిరి తద్రావు కులీనులం దలరె గాంగేయస్తుతౌదార్యశౌ
ర్యరసోపేతుఁడు రాజశేఖరుఁడు సర్వజ్ఞుండు సర్వజ్ఞుఁడై.

క. ఆలలితాన్వయసంభవుఁ। డై లింగపరంగరాయఁ డలరె నిజభుజా
భీలాసిదళితరిపునృప। ఫాలాస్థూలస్ఫురత్కపాలుం డగుచున్.

క. బెబ్బులి రిపునృపు లసియెడు। గిబ్బల కితఁ డంచు జనులుకీర్తింపఁగఁ దా
బొబ్బిలిపట్టణ మేలెడు। నిబ్బరుఁడగు లింగపావనీవరుఁ డెలమిన్.

బొబ్బిలి చినరంగారాయనికి దత్తపుత్త్రుఁడును గృతిపతియునైన రాయణప్ప రంగారాయనింగారు ౧౭౦౧ వ సంవత్సరము మొదలు ౧౭౩౦ వ సంవత్సరము వఱకును రాజ్యపాలనము చేసినందునఁ దదాస్థాన కవియైన యీ వేంకటకృష్ణకవి యిప్పటికి డెబ్బదిసంవత్సరములకుముందే యీగ్రంథమును రచియించినట్లు చెప్పవచ్చును. ఈయన కవిత్వమునందు లక్షణదోషములు కొన్ని యున్నను కవనము మృదువయి మధురముగా నున్నది. శ్వేతాచలమహాత్మ్యములోని కొన్నిపద్యము లిం దుదాహరింపఁ బడుచున్నవి—

శా. ఆమాటల్విని భూవిభుండు నిజభార్యన్ సద్వ్రితాసక్తికిన్
శ్రీమన్మాధవభక్తికిన్ బొగడి ధాత్రిన్ మూఢచిత్తుండనై
భామారత్నముపాటిబుద్ధి గణుతింపం బూనఁగాలేక యీ
సోమార్కం బపకీర్తిపా లయితినంచున్ లోన జింతిల్లుచున్. ఆ. ౧.

ఉ. వేరొకభూవరాత్మజుఁడు విద్రుమగుచ్ఛము రత్నకంకణో
దారకరారవిందమునఁ దాల్చె లతాంగి నను న్వరించినన్

భూరిశుభక్రమాకలన బోటిపదాంబుజ మీతెఱంగునం
గూరిమిత్తోడఁ బట్టుకొనఁ గోరెదనంచును డెల్పుకై వడిన్. ఆ-౨.

శా. జంబాలుం డనుమాని కొన్నిదినముల్ జాయాన్వితుండై తను
ర్వీం బుణ్యస్థితినుండి గర్భవతినారిం బాసి స్వర్గంబు చే
రంబోవంగ శమీసమీపమున గర్భస్థార్భకుం బెట్టి నె
య్యం బొప్పారఁగఁ జేసెఁ దత్తరుణి దా నగ్నిప్రవేశంబొగిన్. ఆ-3.

---

# 119. కాకరపర్తి కృష్ణకవి

ఈ కవి శశిరేఖాపరిణయము, ముఖలింగక్షేత్ర మాహాత్మ్యము అను కావ్యములను జేసెను. ఇతఁడు వైదికబ్రాహ్మణుఁడు; తిరుపతి పాత్రకవికిని సీతమాంబకును తనూజుఁడు. ఈపాత్రకవి సత్యభామాకృష్ణ సంవాదాది గ్రంథములను రచియించి శ్రీమహారాజా గోడే నారాయణ గజపతిరాయనింగారి పూర్వుఁడైన జగ్గారాయనింగారివలన నగ్రహారాదులను బడసెనఁట. ఈ కృష్ణకవి విశాఖపట్టణ మండలమువాసివాఁడు. ప్రపౌత్రుఁ డిప్పుడు జీవించియుండుటచే నితఁడు నూఱుసంవత్సరముల లోపలివాఁడు. ఈయనకవిత్వము దోషరహితమయి హృదయంగమముగా నున్నది. కవికృతపుస్తకద్వయము నుండియు రెండేసిపద్యముల నుదాహరించుచున్నాను—

## ముఖలింగక్షేత్ర మాహాత్మ్యము.

చ. అరుదుగ సర్వలోకనిచయం బతివేలఘనాంధకారభీ
కరవిపదబ్ధిలోఁ బడ నకారణవైరమునన్ వనూజ్జ్వల
త్తరణిముఖప్రచారములు తప్పఁగఁజేయుచు నన్నిదిక్కులన్
బెరిఁగెను వింధ్యభూధరము వీతమహాంబునిధీ తపోనిధీ. ఆ-౧.

ఉ. ఈనగవైభవాతిశయ మెన్నఁగ శక్యమె ధాతకైన జాం
బూనదరౌప్యరత్నముఖభూరిమనోహరవస్తువిస్ఫుర
త్సానుచరస్మరుద్దనుజచారణకిన్నరసిద్ధసాధ్యసం
తానసమృద్ధి నొప్పు వితతంబగుమేరునగంబుకైవడిన్. ఆ-3.

శశిరేఖాపరిణయము.

ఉ. మానుల నెట్లు ప్రోచితివొ మానసవీథిఁ దలంపఁ బాపముల్
మానకథాంతరాత్ముఁ డవమానమునుం దగఁజేయుచుండెఁ గృ
ష్ణానను గావవే యనెడునాపలు కిప్పు డొకించుకైన నీ
వీనుల సోఁకకుండు టిదివింత జనార్దన కంసమర్దనా. ఆ ౧.

చ. అనవిని వానితోడ విజయాత్మజుఁ డిట్లనియెన్ దురాత్మ యీ
వనమును గుత్తగొంటివిర వచ్చినవారి నెఱుంగ కీవు పో
మ్మనుటకు నీవె యీజగతియందును విక్రమశాలివా మదం
బున నిటుపల్కఁగాఁ దగదు పొమ్మిపుడూరక వైర మేటికిన్. ఆ-౨.

పయిపుస్తకముగాక కోనపల్లి నివాసుఁడగు వేంకటరంగకవి రచితమైన దొకటియు, అప్పప్పయను భట్టరాజ రచితమైన దొకటియు, శశిరేఖాపరిణయ మనుపేర రెండాధునికప్రబంధములు ముద్రింపఁబడి యున్నవి. వానినుండియు రెండేసి పద్యముల నిం దుదాహరించెదను—

వేంకటరంగకృత శశిరేఖాపరిణయము.

శా. శుద్ధాంతంబున భైరవార్చనకళాశుద్ధిన్ జరాసంధుఁ డు
ద్యద్ధైర్యంబున నిత్య మొక్కనృపుఁ గ్రోధావేశసంభూతస
ద్బుద్ధిం బట్టి కరుక్కరుక్కనఁగఁ దోడ్తో శీర్షముం ద్రుంచి శ
శ్వద్ధాత్రిం బలి యిచ్చుచుండె విలసద్బాహాబలోదగ్రుఁడై. ఆ. ౧.

ఉ. అందఱికంటె ముందుగనె హాయిగ మజ్జనభోజనంబు లం
దందు నొనర్చి సాత్యకిసహాయముగా వసుదేవదేవకీ

నందను లవ్విధంబు దళనాయకకోటి కెఱుంగఁ జేసి జల్
దుందుభికాహళాదిపటుతూర్యరవంబులు బోరుకల్గఁగన్. ఆ. 3.

అప్పప్పకృత శశిరేఖాపరిణయము.

ఉ. అన్నలు మాటలాడుసమయంబున లేచి సుభద్ర ప్రీతితో
నన్నయశాలి యైనముసలాయుధుఁ గన్గొని నీమఱందియున్
న న్నిటఁ బంపుచుండి పరిణామము వేఁడె భవత్కుమారియా
కన్నియ మత్సుతాగ్రణికిఁ గారుణికోత్తమ పెండ్లి చేయవే. ఆ. ౧.

ఉ. పోరున ధార్తరాష్ట్రులను భూరిమదం బడఁగించి పిమ్మటన్
సీరిని మిక్కిలిన్ భయముఁ జెందఁగఁ జేసిననీపరాక్రమం
బౌర నుతింప వ్యాళపతి కైనను శక్యము గాదటంచు నా
మారుతిపుత్రునిం బొగడి మక్కువతోడఁ గిరీటి యంతటన్. ఆ.౪

---

# 120. కృ ష్ణ య్య

ఈకవి పార్వతీపరమేశ్వరపరిణయ మనెడి మూడాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఈతఁడు స్మార్తబ్రాహ్మణుఁడు; భారద్వాజ గోత్రుఁడు; చంద్రసూర్యపుత్రుఁడు. ఈతని వాసస్థలము పినాకినీతీరము నందలి కామలాపురము. ఈతఁడుండినకాల మేదియో తెలియరాదుగాని యితఁ డేఁబది యఱువదియేండ్ల క్రిందట నుండిన ట్లూహింపఁదగియున్నది. ఈతని కవిత్వమునందుఁ గొన్ని వ్యాకరణ దోషములు గలవుగాని మొత్తముమీఁదఁ గవిత్వము శ్రావ్యమయి కొంతవఱకు శ్లాఘ్యముగానే యున్నది. పార్వతీపరమేశ్వరపరిణయములోని పద్యములఁ గొన్నిటి నిం దుదాహరించుచున్నాను—

ఉ. ఆపురిఁ గాంచి నిర్జరు లహర్నిశమున్ మదిలోన నెన్నుచున్
గాపుర మున్న నాకమునకంటెను మేలని చూచువేడుకన్

దాపునఁ జేరిరో యనఁగఁ దత్పురసౌధసమీపవర్తులై
గోపవిభుండులోనుగను గొల్చినరీతిగ నుందు రాస్థలిన్. ఆ. ౧.

ఉ. ఈవిధి వచ్చువిప్రుఁగని యీశ్వరుఁ డర్ఘ్యము నొసంగి యిట్లనున్
భూవినుతార్య యీధరను భూమిసురుల్ సుఖులై చరింతురా
యీవనమందుఁ బుష్పములు మేలగుకాయలు పండ్లు పత్రముల్
కావలెనన్నఁ గల్గుఁగద కారణ మేమిట రా విధాత్మజా. ఆ. ౨.

. పంచశరుండు నిల్లనుచుఁ బల్కి విరించికి సమ్మదంబుగా
మించులమించుశంకరుని మేనిరుచు ల్గన నాకు శక్యమే
మంచిది యేమియైన నిఁక మద్దళముల్ గొలువంగ నేగదన్
వంచనలేక నన్నిలను వర్తిలఁజూడుఁడు పోయివచ్చెదన్. ఆ. 3.

# 121. తరిగొండ వెంకమ్మ

ఈమె మంచి విద్వాంసురాలు. ఈమె చేసినపుస్తకములు తరిగొండ నృసింహస్వామి కంకితము చేయఁబడినవి. తరిగొండ కడపమండలములో వాయిల్పాడునకు నాలుగుమైళ్ళదూరములో నున్నది. ఈమెరచియించిన గ్రంథములలో రాజయోగసార మను ద్విపదకావ్యమును వేంకటాచలమాహాత్మ్యమను పద్యకావ్యమును ముద్రింపఁబడియున్నవి. ఈమె తాను భాగవతము ద్వాదశస్కంధములను ద్విపదకావ్యముగా రచియించినట్లు వేంకటాచలమాహాత్మ్యములోని యీ క్రిందిపద్యములోఁ జెప్పుకొన్నది.

సీ. దారునిర్మితవీణ నారూఢిఁ బల్కించు గాయక పురుషునికరణి గాను
బురుషోత్తముఁడు దయాపూర్ణుఁడై నాజిహ్వయందుఁ దావసియించి యరుదుగాను
బలికించుఁ గావున భాగవతపురాణ మనఁగ నే ద్విపదకావ్యంబుగాను
ద్వాదశస్కంధము ల్తగఁ జెప్పి హరికిసమర్పించి శ్రీవేంకటాద్రిమహిమ

మతనిపై రమ్యపద్యకావ్యంబు చేసి
శ్రీనివాసునకే సమర్పింపనుంటి
నీఁగ త్రోయధిఁ దాటఁబోయినవిధమున
నాస్వతంత్రత కిల బుధు ల్నవ్విపోరె.

ఈ పుస్తకములోని—

క. అల కాశినుండి వెలువడి। వలనుగ మాకొలను నందవరపురమందే
నెలకొనికులదైవతమై।యలరుచుచుమమ్మేలుచౌడమాంబనుగొలుతున్.

అను పద్యమునుబట్టిచూడఁగా నీమె నందవరీక బ్రాహ్మణస్త్రీ యైనట్టు తెలియవచ్చుచున్నది. ఈమె తనభర్తయొక్క నామగోత్రములను జెప్పకొనక "వసిష్ఠగోత్రపవిత్ర కృష్ణయామాత్య తనూభవ" యని తాను కృష్ణయామాత్యుని కూఁతురయినట్టుమాత్రము చెప్పకొనుటచేత నీమె బాలవితంతువయి తన కాలమును వేదాంతగ్రంథపఠనాదులయందుఁ గడపిన ట్లూహింపఁ దగియున్నది. ఈమె ౧౭౪౦ వ సంవత్సరమునందు జీవించి యుండినట్లు బ్రౌణ్‌దొరగారు తమ నిఘంటువునందు వ్రాసియున్నారు. కాఁబట్టి యీమె యేఁబదిసంవత్సరములక్రిందట నుండినట్లు తెలియవచ్చుచున్నది. ఈమెకుఁ బూర్వమునం దుండినబ్రాహ్మణస్త్రీలు రచియించిన పద్యకావ్యము లేవియు నిప్పుడు కానరావు. ఈమెకవిత్వమునందల్పదోషము లక్కడక్కడఁ గానవచ్చుచున్నను మొత్తముమీఁద కవన మతికఠినముగాక మృదుమధురరచనను గలదయియున్నది. వారాంగన యయిన ముద్దుపళనివలె శృంగారవర్ణనమని యవాచ్యములు పలుకక కులాంగన కుచితమయినరీతిగానే వర్ణించుచు వచ్చుటయే కాక శృంగారవాక్యములు వచించుటసహితము తన కనిష్టమని సూచించుటకయి శృంగారరసాధిదైవతమయిన కృష్ణుని నిట్లు నుతించియున్నది—

శా. శృంగారాకృతితోడ వచ్చి పదముల్ శృంగారసారంబుతో
డం గూఢంబుగఁ జెప్పు నీవనఁగ నట్లేఁ జెప్పలే నన్న నా

ముంగోపంబునఁ జూచి లేచి యట నే ప్రొక్కంగ మన్నించి త
చ్ఛృంగారోక్తులు తానె పల్కికొను నా శ్రీకృష్ణు సేవించెదన్.

ఈ పద్యమునుబట్టిచూడఁగా నీమె తాను బుస్తకమునం దక్కడక్కడ సందర్భోచితముగా రచించిన శృంగారపద్యములుకూడఁ దనవి గాక కృతిపతి విరచితములే యని లోకమునకుఁ జూప నుద్దేశించినట్టు కనఁబడుచున్నది. ఈమె కవిత్వరీతిని దెలుపుటకయి కొన్నిపద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి—

## వేంకటాచలమాహాత్మ్యము.

ఉ. రామనృపాల ఘోరతరరావణశౌర్యవిఫాల భవ్యసు
త్రామసురార్యయోగిజనతాపసపాల కృపాలవాల శ్రీ
భూమిసుతాత్మలోల పరిపూర్ణసుకీర్తివిశాల వానర
స్తోమముతోడ వచ్చు మిముఁజూచి కృతార్థుల మైతి మిద్ధరన్. ఆ-౧

ఉ. ఇంతట యోగపూరుషుఁడు హెచ్చఁడు తగ్గఁడు సంతతంబునే
కాంతమున న్వసించుఁ దనయందుఁ బరాత్మను జూచుచుండు వి
భ్రాంతులు తన్నుఁ దిట్టినను గ్రమ్మఱ వారిని దాను దిట్టఁ డీ
శాంతుఁడు రాజయోగి ఘనసద్గురుఁ డంచు వచింపఁగాఁ దగున్. ఆ-౩.

చ. అడవికి వేటఁబోయి విపులాద్భుతఘోరమృగాళి నచ్చటన్
బొడగని భీతి నొందితివొ భూతము సోఁకెనొ లేక తాళ్ళపై
వడి చెడజాతి ప్రొగ్గితివొ వాగులలోఁబడి లేచివచ్చితో
కొడుక నిజంబుఁ జెప్పు మిఁక గొబ్బున నొక్కచికిత్స చేసెదన్. ఆ-౪.

ఉ. ఆకురవంజి యిట్లనియె నాపకు రమ్మని పిల్వవచ్చినా
రాఁకొనినాఁడు బిడ్డఁ డిపు డమ్మల నక్కల నేడనైన నే
జోకఁగఁజేరి వారలకు సోదె నిజంబుగఁ జెప్పకుండినన్
నాకడుపెట్లు నిండు నని నవ్వుచుఁ బల్కుచు మూల్గి యిట్లనెన్. ఆ-౫.

## రాజయోగసారము.

ద్విపద. కాయ మస్థిరమని కానంగలేక
పాయక సంసారబద్ధులై మమత
వదలక కామార్థవాంఛితు లగుచు
మదమత్తు లగుచు దుర్మార్గత నొంది
మదిలోన నబ్బి కామక్రోధలోభ
మదమోహమత్సరా ల్మాటికిఁ బెంచి
సంపదగలిగిన సామర్థ్య మనుచు
సొంపుమీఱిన తుచ్ఛసుఖ మిచ్ఛగించి
కామాంధులై తమగతి గానలేక
భామలవలలోనఁ బడి లేవలేక
తఱిగని యీషణత్రయవార్ధిలోను
మఱిమఱి మునుఁగుచు మమత రెట్టింప
నాలుబిడ్డలకని యర్థంబుఁగూర్చి
కాలంబు నూరకే గడపుచునుండి
యంతకాలము వచ్చినప్పుడు యముసిఁ
జింతఁజేయుచు హింసచేఁ గందికుంది
కూపంబులోఁ బడి కొన్నినాళ్లుండి
పాపాత్ములగుచుఁ బ్రపంచంబునందుఁ
బుట్టుచుఁ గిట్టుచుఁ బొరలుచుండెదరు.

ఈతఱిగొండ వెంకమ్మకుఁ దరువాతఁ దెలుఁగులోఁ బద్యకావ్యములను రచియించిన స్త్రీ లెవ్వరును గానఁబడరుగాని శతకములు రచించినవారు కొంద ఱందందుఁ గనఁబడుచున్నారు. ఇట్లు శతకములు రచియించిన స్త్రీలలో శ్రీరాజా గోడేనారాయణ గజపతిరాయనింగారి

మేనత్తయగు మదిన సుభద్రయ్యమ్మగా రగ్రగణ్యురాలుగాఁ గానవచ్చు చున్నది. ఆమె ౧౭౮౧ వ సంవత్సరమునందు జననమొంది యించుమించుగా తరిగొండ వేంకమాంబతో సమకాలికురాలుగా నుండినది. ఈమె రచియించిన శ్రీరామదండకము, రఘునాయకశతకము, కేశవశతకము, కృష్ణశతకము, రాఘవరామశతకము మొదలయినశతకము లొక్క-సంపుటముగా నీనడుమను బ్రకటింపఁబడినవి. ఈమె కవనకౌశలమును జూపుటకయి రెండుపద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. శ్రీరమణీకళత్ర సరసీరుహనేత్ర జగత్పవిత్ర స
త్సారసబృందమిత్ర సురసన్నుతిపాత్ర నరేంద్రపుత్ర శృం
గారసమగ్రగాత్ర జనకర్మవిదారణకృచ్చరిత్ర శ్రీ
నారదమౌనిగీతచరణా రఘునాయక దీనపోషకా.

ఉ. మన్నన దప్పియున్నయెడ మక్కువగల్గినవారి నేనియున్
దిన్నఁగ మందలించినను దెల్లముగా మది నొవ్వకుండునే
యన్నరు ధార్తరాష్ట్రునకు నాదరమొప్ప హితోపదేశ మి
ట్లెన్నఁగఁజేసి యావిదురుఁ డేమిఫలంబును జెందెఁ గేశవా.

ఇప్పుడు తెలుఁగుదేశమునం దంతటను బాలికాపాఠశాలలు స్థాపింపఁబడి స్త్రీవిద్య ప్రబలుచున్నందున మంచిగ్రంథములను రచింపఁగల కులకాంతలు శీఘ్రకాలములోనే బైలుదేఱుదురుగాక!

# 122. పిండిప్రోలి లక్ష్మణకవి

ఇతఁడు లంకావిజయమనఁబడెడు రెండాశ్వాసముల ద్వ్యర్థి కావ్యమునుజేసెను. ఇతఁ డాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు; భారద్వాజగోత్రుఁడు; గోపాలామాత్యపుత్త్రుఁడు. ఈకవి గోదావరిమండలములోని రామచంద్రపురమునకు సమీపముననున్న కుయ్యేరను గ్రామమునకు కరణము. ఈగ్రామమును గుత్తచేసిన రావు ధర్మారాయఁడను పద్మనాయకకులజుఁ డీకవియొక్క లంకనేల మూఁడు పందుము లపహరింపఁగాఁ గోపావేశముచేత యౌవనమునం దితఁడు ధర్మారావును రావణాసురునితోఁ బోల్చుచుఁ దనక్షేత్రాపహరణకథను రామాయణపరముగా శ్లేషార్థము వచ్చునట్లు రచియించెను. ఇతఁడు తిట్టు కవిత్వమునకుఁ బేరుపడినవాఁడు. ఈవిషయమును గూర్చి లంకావిజయ మునఁ గవియే యిట్లు వ్రాసికొనియున్నాఁడు—

క. తెలియువిను రామకవ్యా । దులు సూరకవిప్రముఖపృథుప్రతిభావం
తులు భీమ శ్రీనాథు । ల్వెలయఁగ నాకరణిఁ దిట్టలే రూఢమతిన్.

ఇతఁ డిట్లు యౌవనదశయందుమాత్రమే కాక వార్ధకమువచ్చి యవసానదశ సమీపించువఱకునుగూడ నల్పములైన యైహికలాభముల నిమిత్తము పరులను దూషించుచు భూషించుచుఁ బద్యములను జెప్పి కాలము గడపుచుండెను. ఈలంకావిజయమునకు రావణదమ్మీయమని నామాంతరము. కవి సమర్థుఁడేయైనను రాఘవపాండవీయాదులవలె రావణదమ్మీయ మంతప్రౌఢముగా లేదు. కవి గ్రంథమునందు రామాయణకథ కనుకూలముగాఁ దనకథను మార్చుకొనుచు నల్పసంఖ్యగల రెండర్థముల పదములతోనే గ్రంథమునంతను బూరించినాఁడు. ఈగ్రంథములోని—

క. లేదమ్మా కష్టము నీ । కేదమ్మా నేగి భీతి ఘృణ నీ వొందక్
రాదమ్మా యిఁక మిన్నక । పోదమ్మా యుక్తి నిజము పొలుపుగ దమ్మా.

గీ. ఏడుపందు ముల్లోకంబు లెఱుఁగ లంక
నేలకాల పరక్షేత్ర ప్రాప్తి మేలుగాదు
పేర్మి నా భూమిజాత సంప్రీతితోడ
వీడు మదిఁ యె సౌఖ్యము లిచ్చు వేయు నేల.

ఉ. ప్రాజ్ఞత నెవ్విధంబునను రాముని కీడగుసాటి రావు స
ర్వజ్ఞ నృసింహుఁ డాయనసువంశమునన్ జనియించి చెడ్డదు
ష్ప్రాజ్ఞుఁడ వీవు కానకు విచారము లన్నియు మాని ధర్మగో
ష్ఠిజ్ఞులు మెచ్చుచొప్పు కని సీతను వే విడుమంత మేలగున్.

గీ. జ్యేష్ఠుఁడా లక్ష్మణాగ్రజక్షేత్ర మీవు
వదలకుండిన మోసంబు వచ్చునింకఁ
జండనిర్భీకవనచారి పిండిప్రోలి
కవికులవరుతోరిపుత ముఖ్యముగ వలదు.

ఇత్యాదిపద్యముల ననేకులు మెచ్చుకొనుచున్నారు. లక్ష్మణకవి లంకావిజయమును క్రీస్తుశకము ౧౭౯౭ వ సంవత్సరమునందుఁ జేయ నారంభించెను. అప్పటి కితని కిరువదియైదుసంవత్సరముల ప్రాయ ముండిన పక్షమునఁ గవి ౧౭౭౦ వ సంవత్సరప్రాంతములయందు జనన మొంది యుండవలెను. ఈతఁడు ౧౮౪౦ వ సంవత్సరప్రాంతమువఱకును సజీవుఁడయి యున్నందున నించుమించుగా డెబ్బదియేండ్లు బ్రతికియుండెననుటకు సందేహములేదు. ఇదియొక్కటితప్ప నితఁడు రచియించిన గ్రంథము వేఱేదియు లేదు.

మ. అరయ స్వర్ణనఁ జేతుఁ దారకపదవ్యాక్రాంతవర్తిన్ గురున్
స్ఫురదుత్తుంగబలాతిరేకకలుషీభూతారిజీవున్ ఘనాం

గిరి సాఖ్యాతు బుధౌఘపూజితపదుం క్షేమంకరాంచ త్తపో
భరసంతోషితసర్వమానిధిమణున్ వాచస్పతి న్నార్యనిన్.

ఈపద్యములో వాచస్పతినార్యుని ననియుండవలసినదానికి వచస్పతిన్నార్యనసియు,

చ. అని తలపోయుచో నల ప్రజాపతి చేసినమేర దప్పకం
బనివడి నద్రిచారు లసమానమహారుణధామయుక్తితో
డన పరవాహినీశనికటంబున కేగ నరివ్రజంబుచే
యు నతను సంగరంబునకు నోపక పాఱెను జోళ్ళువీడఁగన్.

ఈపద్యములోఁ దప్పక యని యుండవలసినదానికిఁ దప్పక నసియు, నందందుఁ గొన్ని వ్యాకరణదుష్టములయిన ప్రయోగములున్నను మొత్తముమీఁదఁ గవిత్వము సలక్షణమయి మృదుమధురపదఘటిత మయియున్నది. ఈతని రచనాకౌశలమును జూపుటకయి లంకావిజయములోని మఱిరెండుపద్యముల నిం దుదాహరించుచున్నాను—

చ. తమ్ములు నీదుపల్కులు హితమ్ములుగాఁ గొనిచేయ నార్యజా
తమ్ములు నీసుసద్గుణశతమ్ములు సంస్తుతిచేయఁ బక్షపా
తమ్ములు లేక న్యాయకలితమ్ములుగాఁ గ్రియలొప్ప సర్వభూ
తమ్ములు విశ్వసింప సుకృతమ్ములు వర్ధిలునట్లు చేయుమీ. ఆ. ౧.

ఉ. తమ్ములు సద్గృహమ్ములు సుతప్రకరమ్ములు సొమ్ము లిష్టవ
ర్గమ్ములు వైభవమ్ములు జగమ్ములఁ గ్రమ్మఁగ నెమ్మి నుండి పా
ప మ్మనిశ మ్మొనర్చుట నెపమ్ముగఁ గీడగు నాదుపల్కు వే
దమ్మని రూఢినమ్ము విహితమ్ముఁ గులమ్ముబలమ్ము నిమ్ముగన్. ఆ-౨

ఈకవికాలములో సంస్కృతాంధ్రభాషాపాండిత్యమునందును సంగీతసాహిత్యముల యందును సుప్రసిద్ధుఁడయిన శిష్టు కృష్ణమూర్తినామక విద్వత్కవి యొకఁ డుండెను. అతనికిఁ దన కున్నంతపాండిత్యము తెలుఁగునందే కాని సంస్కృతమునందు లేదని లక్ష్మణకవియెడల ననాదరభావము

కలిగియుండెను. ఆయనకుఁగల గర్వమును తనయెడలఁ గలతిరస్కార భావమును గనిపెట్టి యీలక్ష్మణకవి యెట్లయిన నాతని గర్వభంగము చేయవలెనని సమయము వేచియుండెను. ఇట్లుండఁగాఁ గృష్ణమూర్తికవి తాను రచించిన సర్వకామదాపరిణయము ప్రబంధమును రామచంద్ర పుర సంస్థానాధిపతియైన కాకర్లపూడి రామచంద్రరాజుగారి తమ్ముఁడైన జగన్నాధరాజున కంకితముచేయుటకయి కాజలూరు గ్రామమునకుఁ బోవుట తటస్థించెను. ఆపుస్తకమును జదివించి విద్వత్కవిసమ్ముఖమున వినుటకు నిర్ణయింపఁబడిన దినమునందు లక్ష్మణకవి యనాహూతుఁడ య్యును సభకుఁబోయి కృష్ణమూర్తికవిని బదుగురిలోఁ బరాభవింపవలె నన్నదృఢ నిశ్చయముతోఁ గూరుచుండియుండెను. సర్వకామదాపరిణ యములోని—

చ. తరణి శశాంకు లాభరణదంభమున న్వదనాక్షికైతవాం
బుగుడసితోత్పలాగ్రమున ముద్రియ కుంతలదేశ మాక్రమిం
చి రొకఫలంబు గాన నగుఁ జివ్వనుచుం బరమాపయుక్తి ని
బ్బరముగ నంతసాంతముగ బ్రహ్మ యొనర్చినసీమపొల్పగుఁన్.

అనుపద్యమును జదివినప్పుడు లక్ష్మణకవి విని తలయూఁచి నవ్వి యిందలి నాయిక నేత్రాక్షియయిన యవలక్షణరాశియనియు, కన్నులు నల్లగలువలనిచెప్పి వానిపైని సూర్యచంద్రులున్నట్లు చెప్పుటచేత నొక కన్ను సూర్యకాంతిచే ముకుళించు కలువయై గ్రుడ్డిది కావలెననియు, ఆభరణదంభమునవచ్చి సూర్యచంద్రులు కుంతలదేశ మాక్రమింపఁగా నిరువురకును దగవురాకుండ బ్రహ్మ సరిహద్దేర్పాటుచేసినట్టుగా పాపట యున్నదని వర్ణించుటచే సూర్యచంద్రుల నలంకరించినపిమ్మటఁ బాపటఁ దీయుదురో ముందుగా పాపటదీసి తరువాతనే సూర్యచంద్రుల నలంక రింతురో యీకవి తెలియనివాఁడనియు, ఇటువంటియాక్షేపణము లనేక ములుచేసెను. ఇవి సరళములైన సదాక్షేపములు కాకపోయినను సభకు

వచ్చినవా రనేకు లాయాక్షేపములకు హర్షించి చప్పటలు గొట్టినందు నను, జగన్నాథరాజుగా రాకృతినందుట కిష్టపడనందునను, కృష్ణమూర్తి కవిగా రవమానితులయి సభనుండి లేచిపోవలసినవారయిరి.

లక్ష్మణకవి యితరులమీఁదఁ బద్యములను జెప్పుచు వివాహాదు లకుఁబోయి కవీశ్వర సంభావనములను గొనుచు ధనార్జనము చేయుచుం డెను. ఇతఁడు తన మేనల్లుఁడగు చింతలూరి మంగన్నకు విరోధముగా వ్యాజ్యము తీర్పు చెప్పినందునకయి యప్పటి పండిత సదరమీనగు శంకర మంచి యనంతశాస్త్రిని శ్లేషార్థముతోఁ దిట్టినపద్యములలో నొకదానిని, ఆవ్యాజ్యము నుపర్యభియోగము తెచ్చినప్పు డాకాలమునందు రాజమ హేంద్రవరమున మండలన్యాయాధిపతిగా నుండి తెలుఁగునిఘంటువులను జేసిన బ్రౌనుదొరగారిమీఁదఁ జేసినపద్యములలో నొకదానినిమాత్ర ముదాహరించి యీతనినిగూర్చి యింతటితో విరమించెదను.—

మ. అవురా శంకర మంచివాఁడవె యనంతాఖ్యుండవై తీర్పెఱుం
గవు మంగన్నరఁజేసి నీవు బుధమార్గభ్రష్టతన్ జోగిరా
గవరా లంది పినాకినిం బశుపతీకల్లోలునిం బట్టి స
త్యవధూసత్వము దానియం దిడితి వాశాయత్తు లిట్లే కదా.

ఉ. పప్పసచేసె నాబ్రతుకు పండితుఁ డింకెటునిల్తు నంచు నే
నిస్పృహవృత్తి నుండఁగను నిన్నటిరేఁ గలలోనఁ గోర్టువా
రిస్పిసియీలుపట్టి రిఁక నేర్పడ న్యాయముతీర్తుమంచు ధై
ర్యాస్పదసూక్తిఁ బల్కినటులైన మిముం గొడగానవచ్చితిన్.

# 123. అల్లమరాజు రామకృష్ణకవి

ఈ కవి కవిచకోరచంద్రోదయ మనెడు నాలుగాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఇతఁడారామ ద్రావిడబ్రాహ్మణుఁడు; రంగానాథార్యపుత్రుఁడు; హారితసగోత్రుఁడు. తన గ్రంథమును దాక్షారామ భీమేశ్వరుని కంకితముచేయుటచేతనే కవి గోదావరీమండలములోనివాఁడగుట స్పష్టమగుచున్నది. తన్నుఁగూర్చి భీమేశ్వరుఁ డిట్లన్నట్టు కవి తన కవిచకోరచంద్రోదయమునందుఁ జెప్పుకొనియున్నాఁడు.

సీ. అమరఁగ వైనతేయవిజయంబును సత్యభామావిలాసంబు భాసురముగ
గౌతమీమాహాత్మ్యకథయును ద్రౌపదీపరిణయ మలసుశోభావివాహ
మసమానహనుమదాఖ్యానంబును సుకవిజనమనోరంజనంబ నెడు కావ్య
మవనిలో రచియించినట్టి ప్రోడవు నీవుగావున నీవాక్యకలితలలిత
మాధురిమఁ గ్రోలుచుండె నామానసంబు
తనివిదీఱదు నా భక్తుఁడనుచు నిన్ను
నెన్నుటలుగాదు కాని నీకన్న ధరణిఁ
గలరె కవితాసుధాధార లొలుకఁబలుక.

పయి పద్యమునుబట్టి కవి వైనతేయవిజయము, సత్యభామా విలాసము, గౌతమీ మాహాత్మ్యము, ద్రౌపదీ పరిణయము, సుశోభా వివాహము, హనుమదాఖ్యానము, సుకవిజనమనోరంజనము అనుకావ్యములనుగూడ రచియించినట్లు తెలియవచ్చుచున్నది. ఈతని కవిత్వము నిర్దుష్టము కాకపోయినను ప్రౌఢమయి హృదయాహ్లాదకరముగా నున్నది. ఇతఁ డెనుబదిసంవత్సరముల క్రిందట నుండినవాఁడు. కవి యీకవిచకోర చంద్రోదయమును శాలివాహనశకము ౧౭౫౭ వ సంవత్సరమునకు సరియైన మన్మథాబ్దమునం దనఁగా క్రీస్తుశకము ౧౮౩౫వ సంవత్సరమునందు రచియించినట్లు గ్రంథాంతమున వ్రాసికొనియున్నాఁడు. ఈ కావ్యమునందలివి కొన్నిపద్యము లిం దుదాహరింపఁ బడుచున్నవి.

ఉ. భారము నొప్పు పుష్పఫలభారవినమ్రమహీజరాజశో
భారమణీయసానుచరభవ్యనభశ్చరభామినీవిపం
చీరవమాధురీకలితజృంభితగానఘుమంఘుమార్భటీ
పూరితనూత్న రత్నయుతభూరిదరిం గనియెన్ మహాగిరిన్ ఆ-౧.

ఉ. మారుని మీఱు వీని సుకుమారము మారమణీసహోదరున్
గూరిమి నోముమోము తళుకు ల్వలుకల్ నెఱజాణవైఖరిన్
గేరు నయారె నిర్జరులఁ గిన్నరులు న్నరు లెన్న వీనిసౌం
దర్యమె చూడ నింపగు జయంతు జయింతు నటన్న రీతులన్. ఆ-౨

కవిచకోరచంద్రోదయమునకుఁ దరువాతఁ గవి రచియించిన గ్రంథములు కొన్ని నాకీటీవల లభించినవి. ఇతఁడు రచియించిన యితర గ్రంథములు—మదాలసా పరిణయము, శంతనువిలాసము, అధ్యాత్మ రామాయణము, అచ్చ తెలుఁగు భాగవతము, రామకృష్ణీయము. ఇందలి కడపటి పుస్తకము ఆంధ్రశబ్దచింతామణికి వ్యాఖ్యానము. ఈరామకృష్ణీయములోని యీ క్రింది పద్యమువలన నీతని నివాసస్థానము పిఠాపురమునకు సమీపముననున్న చేఁబ్రోలుగ్రామ మయినట్లు తెలియవచ్చుచున్నది.

సీ. సిరిమించు శ్రీపీఠపురసమీపంబునఁ బరఁగు చేఁబ్రోల్పురవాసి నగుచు
నల్లమరాజాన్వయాగ్రణి యగు రంగధామార్యవర్యుని తనయుఁడనయి
యెల్లపార్యాగ్రణి కెనయఁబౌత్రుండనై రామకృష్ణకవియన్ నామమెలమి
బూని శ్రీదక్షవాటీనికేతనుఁడైన భీమేశు కరుణచేఁ బెంపు నొంది
సకలజనులకుఁ దెలిసెడి సరణిగాఁగ
నన్నపార్యుఁ డొనర్చినయట్టి సూత్ర
ములను దెలిఁగింతు సూక్ష్మభంగులను బాల
బోధమగునట్లు సుకవు లుప్పొంగుచుండ.

ఈకవి కాలముచేసి యేఁబదిసంవత్సరములు దాఁటినవి. ఈతఁడు శంతనువిలాసమును శాలివాహనశకము ౧౭౬౩ వ సంవత్సరమునకు సరి

నైన క్రీస్తుశకము ౧౮౭౧వ సంవత్సరమునందు ముగించినట్లా పుస్తకాంత మందలి యీ పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

సీ. అవనిలో శాలివాహనశకాబ్దము లగ్నిశాస్త్రశైలశశాంకసంఖ్యనెన్నఁ
బ్లవనామవత్సర ప్రథితకార్తికశుద్ధసప్తమీ భౌమవాసరమువఱకు
సిరిమించు శ్రీపీఠపురసమీపంబునఁబోలుపొందుచేఁబ్రోలుపురనివాసుఁ
డలరునల్లమరాజకులరత్నమునురంగధామార్యసుతుఁడనౌ రామకృష్ణ
కవివరుఁడు దక్షవాటికాగారవాసుఁడైన భీమేశు సత్కృపానూనగరిమ
శంతనువిలాసమురచించె సరసఫణితి నఖిలసత్కవిబృందంబులౌననంగ.

ఈ కవికృతములైన గ్రంథములలోని పద్యములు కొన్ని యిందుదాహరింపఁబడుచున్నవి—

మదాలసాపరిణయము.

ఉ. న్యాయముగా దయో లలన నవ్వెడనాడిచనంగఁ గోయిలల్
కోయసికూయఁ జందురుఁడు గొంకక వెన్నెలఁగాయ మారుఁడున్
సాయక జాలమేయఁ గడుషట్పదముల్ రొదసేయ నే నినుం
బాయఁగఁజాలఁజాలనను బాలకవుంగిటఁ జేర్చిప్రోవవే.

అచ్చతెలుఁగు భాగవతము.

సీ. కూఁకటిమూలడాల్గొన బెల్లనదలించి జమిలిముక్కాలిరాసంతు నొంచి
కైగల్లుమెకపుమూఁకలనెల్ల సగిమించి కారుమబ్బుల నెఱసౌరుకుంచి
చిచ్చుకన్దొరయత్తి హెచ్చువన్నెఁగలంచి విప్పుగన్ దొరరాల
చొప్పుద్రుంచి
చీఁకటిప్రోఁకలగెలువ మెల్లనుడించి కాటుకమలవన్నెఁగీటడంచి
పొగల తెగల జిగాజిగి మిగులవంచి
దండితెక్కలికాండ్లకు మిండగీండ్ల
కింపుగా మబ్బు మసిచల్లునింపు దోఁప
నెల్లకడలందు నంతంత నిరులు గవిసె.

శంతనువిలాసము.

చ. పగలును రేయి పద్మకులబాంధవసోములు తత్పురంబునన్
దగుమణివప్రముం గడిసి తారటువోవఁగలేక యోరగా
నొగినిరువంకలం జనుచు నొప్పుగ నుత్తరదక్షిణాయనా
ఖ్యగతిఁ జెలంగి రెంతయు నఖండవిలాసము తోఁచుచుండఁగన్. ఆ-౧

ఉ. హారము (?) సైచదాయె మణిహారములుం బొడియయ్యె నేఁడు నీ
హారముఁబోలి నాదు వ్యవహారము లెంతయు డిందె మేనిక
ల్హారము లెండె బల్లయవిహారమునన్ మరుఁడేఁచసాఁగె నా
హారమణీలలామ యిఁకనైన ననున్ దయ నేలుకోఁగదే. ఆ-౫.

# 124. కాకరపర్తి బుచ్చిపాత్రకవి

ఈ కవి సత్యవతీపరిణయ మనెడి యైదాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఇతఁడు వైదికబ్రాహ్మణుఁడు; కాశ్యపగోత్రోద్భవుఁడు; ముఖలింగక్షేత్ర మహాత్మ్యాది కావ్యములను రచియించిన కృష్ణకవి పుత్రుఁడు. ఈ కవియొక్క మనుమఁడును సోదరపుత్రుఁడును జీవించి యుండుటచేఁ గవి యేఁబది యఱువదిసంవత్సరములక్రిందట నుండినవాఁ డనుట స్పష్టము. కవి కథాంశమును రచియించి గ్రంథమును శ్రీరాజా (మహారాజా) గోడే నారాయణ గజపతిరాయనింగారి జనకున కంకితము చేయఁ దలంచెనుగాని యతఁడు కృత్యాదిపద్యములను, ఆశ్వాసాద్యంత పద్యములను రచియింపకయే మృతినొందెను. అటుతరువాత శ్రీమహా రాజా గోడే నారాయణ గజపతిరాయనింగారి కోరికపయిని కవికి పారం పర్యమున సోదరపుత్రులగు వేంకటశాస్త్రిగారును పౌత్రులగు సీతారామ శాస్త్రిగారును గ్రంథోపోద్ఘాతమును, ఆశ్వాసాద్యంత పద్యములను పూరించి కృతిని ౧౮౭౭ వ సంవత్సరమునందు శ్రీరాజా గోడే నారాయణ గజపతిరాయనింగారి కంకితము చేసిరి. వీరిచేఁ గృత్యాదియందు రాజాగారి

వంశాభివర్ణనము విశేషముగాఁ జేయఁబడినది. సత్యవతీచరిత్రమునందలి కవిత్వము నిర్దుష్టమయి హృద్యముగానున్నది. కవనమార్గమును జూపుట కయి సత్యవతీపరిణయములోని కొన్ని పద్యముల నిం దుదాహరించు చున్నాను—

చ. ఇలఁ గలకోటలన్ గెలిచి యెన్నిక కెక్కుఁబురీలలామకో
జ్జ్వలమణివప్రమం చరసి వారిజసూతి తదంఘ్రిసీమఁ బ
చ్చలచెలువంపుటందియల సద్బిరుదాంకము సంఘటించెనా
నలరు నమేయశైవలయుతాంబుకదంబముఖేయ మప్పురిన్. ఆ ౧.

చ. పరమతపోధనప్రవరు భవ్యగుణప్రకరుం డపఃకృశాం
గరుచిరు భస్మభాసురు నఖర్వతటిత్పటలోజ్జ్వలజ్జటా
భరు మృగకృత్తికాదరు సుపాణిధృతాక్షసరుం గమండలు
స్ఫురితకరుం గనుంగొనియె శోభితదండధరుం బరాశరున్. ఆ-౨.

చ. సమధికరాజ్యలక్ష్మి యనుచందనవల్లిక జావ్న వేయదు
ర్దమఫణిరాజు చేరనివిధం బొనరింపఁగఁ జాలినట్టి మం
త్రముల తెఱంగుఁ జూపఁగను బ్రౌఢి వహించెనవేని రాజకా
ర్యము ఫలియించు మంత్రివర రాజహిత ప్రతిపాదనాదరా. ఆ-3.

ఉ. ఎల్లెడలందుఁ జీకటుల హెచ్చులు చెల్లెఁ బయోధివృద్ధి పా
టిల్లెఁ జకోరభుక్తులు ఘటిల్లె వియోగిహృదంతరంబు భే
దిల్లె రథాంగదంపతుల తేజము డొల్లె రతీశునాజ్ఞ వ
ర్తిల్లెను జంద్రికాప్రతతి దిక్తరుకోటులవల్లె నయ్యెడన్. ఆ-౪.

మ. అవనీనాయకు లందఱు న్వినుఁడు గుర్వర్థానుసంధానగౌ
రవమొప్పన్ సమయస్థితిన్ సలిపితిన్ బ్రవ్యక్తమౌనట్లు స
త్యవతీదేవికి నుద్భవించినసుతుం డర్హుండు ప్రస్ఫారకౌ
రవరాజ్యంబు భరింపఁగా సకలగోత్రావల్లభు ల్గొల్వఁగన్. ఆ. ౫.

# 125. శిష్టు కృష్ణమూర్తికవి

ఇతఁడు సర్వకామదాపరిణయము మొదలయిన యాంధ్రకావ్యములను రచియించినకవి. ఇతఁడు వైదికబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; వాసిష్ఠగోత్రుఁడు; సర్వశాస్త్రిపుత్రుఁడు. సంవత్సరము సరిగా తెలియదుగాని యితఁడు గోదావరిమండలమునందలి రామచంద్రపురము తాలూకాలోని గొల్లపాలెమనుగ్రామమున ౧౭౭౦వ సంవత్సరము నకును ౧౭౮౦వ సంవత్సరమునకు మధ్యకాలములో జననమొందెను. ఈతనికి రెండుసంవత్సరములప్రాయము వచ్చినప్పుడు స్వగ్రామమువిడిచి తండ్రి కుటుంబసహితముగా రామచంద్రపురమునకు లేచివచ్చి యక్కడ నిల్లు కట్టుకొని స్థిరముగా కాపుర మేర్పఱుచుకొనెను. ఈబాలుఁడు కొంతకాలము రామచంద్రపురములోఁ జదువుకొని తరువాత అయినవిల్లి గ్రామమునకుఁ బోయి బులుసు అచ్చయ్యగారివద్దఁ గావ్యనాటకాదు లభ్యసించితరువాత నింకొకరివద్ద వ్యాకరణాలంకార శాస్త్రముల నభ్యసించి మరల రామచంద్రపురము వచ్చునప్పటికీతనికి సంస్కృతాంధ్రములయం దసదృశపాండిత్యమును కవనసైపుణియుఁ గలుగుటయే కాక సంగీతమునందును నిరుపమాన సామర్థ్యము గుదిరెను. ఆశుకవిత్వమును జెప్పుటలోను గర్ణరసాయనముగాఁ బురాణమును జదువుటలోను కృష్ణమూర్తిగారిని మించినవా రాకాలములో మఱి యెవ్వరును లేరు. ఇతఁడు పురాణము చెప్పునప్పుడు పుస్తకమునుమూసి చదువుచున్నను పయికథలు దడవుకొనక తన కవిత్వములో రసవంతముగాఁ జదువ సామర్థ్యము గలవాఁడఁట! ఈయనశక్తిసంపదను జూచి రామచంద్రపురపు జమీందారగు కాకర్లపూడి రామచంద్రరాజుగారును తదనుజుఁడగు జగన్నాథరాజుగారును కృష్ణమూర్తిగారి నాదరించి తమసంస్థానములో నుంచుకొనిరి. ఆయిరువురిలో జగన్నాథరాజుగారికిఁ గవియం దధికానురాగము.

వీరిరువురికంటెను కాకర్లపూడి వేంకటకృష్ణరాజుగారికి కృష్ణమూర్తిగారి యం దెక్కువదయ యగుటచేత నాతఁడీవిద్వత్కవి కయినవల్లిగ్రామములో పదిపుట్లభూమి దానము చేసెను. అయినను నీటియాధారము లేకపోవుటచేత భూమి లాకాలమునం దిప్పటివలెఁ బండకుండెను. ఇట్లు కృష్ణమూర్తిగారు తనకు నలువదియైదు సంవత్సరములయిాడువచ్చువఱకును రామచంద్రపురములో నుండెను. ఈకాలములో రామచంద్రపురము తాలూకాలోని కుయ్యేరు గ్రామములో పిండిప్రోలి లక్ష్మణకవి యను సుప్రసిద్ధాంధ్రకవియుండెను. పండితులలో కవులలో యిద్దఱొక్కచోట నుండినప్పుడు పరస్పరస్పర్థ లేకుండుట మనలో నరుదు. లక్ష్మణకవి యావఱకేరావణదమ్మీయమును రచియించివయస్సునందుఁ గృష్ణమూర్తిగారికంటె నిరువదియేండ్లు పెద్దవాఁడయి యాంధ్రకవిత్వమునందాఱితేఱినప్రౌఢుఁడు. తన కున్నంతసంస్కృతపాండిత్యము లేదని యాతని నధిక్షేపించి కృష్ణమూర్తికవి పెద్దవీఁగుచుండెను; తనవలె నాంధ్రకవిత్వము చెప్పనేరఁడని యాతని నాక్షేపించి లక్ష్మణకవి తృణీకరించుచుండెను. కృష్ణమూర్తికవి పాండిత్య మెంత యెక్కువ కలవాఁడైనను లౌకికజ్ఞాన మధికముగా లేని శుద్ధశ్రోత్రియశిఖామణి; లక్ష్మణకవి యల్పపాండిత్యము కలవాఁడేయైనను లోకానుభవమును యుక్తిచమత్కారమును నధికముగాఁ గల లౌకికశిరోరత్నము. అట్లగుటచే నిరువురుఁ దారసించినప్పు డెల్ల లక్ష్మణకవియే మేలుచేయి యగుచుండెను. ఈవైరకారణమునుబట్టియే కాజలూరిలో సర్వకామదాపరిణయ పఠనకాలమునందుఁ గృష్ణమూర్తిగారికిఁ బరాభవము సంభవించెను. అట్లు శృంగభంగము నొంది యాయవమానమును సహింపలేక తరువాత నల్పకాలములోనె కృష్ణమూర్తిగారు రామచంద్రపురమును విడిచి వెడలిపోయిరి. జ్యేష్ఠుఁడగు రామచంద్రరాజుగారుండఁగా స్వరాజధానిలో ననుజుఁడగుజగన్నాథరాజు కృతినందుట యనుచితమని యాసభ కాజలూరిలో జరపఁబడెను.

కృష్ణమూర్తికవి సేతుయాత్రకుఁ బోయి వచ్చుచుండఁగా నాతని ప్రఖ్యాతిని విని కాళహస్తిప్రభు వగు దామెర వేంకటపతిరాయనింగా రాయనను తమసంస్థానమునం దుండవలసినదని వేఁడుకొన్నందున కృష్ణమూర్తిగారక్కడఁ బదునాలుసంవత్సరములుండిరి. కవి నాదరించిన యీవేంకటపతిరాయనింగారు గోదావరీమండలమునందే జనన మొందిన వారయి కాళహస్తి రాజపత్నిచేత స్వీకరింపఁబడిన దత్తపుత్రుఁడై ౧౭౩౭వ సంవత్సరము మొదలుకొని ౧౭౭౧వ సంవత్సరమువఱకును రాజ్యముచేసెను. కాళహస్తి సంస్థానములో నీయనకు నెల కఱువదిరూపాయలు జీత మేర్పఱుపఁబడెను. కాళహస్తికి వెళ్ళకపూర్వమో వెళ్ళి వచ్చినతరువాతనో కాకినాడలో నైదుసంవత్సరములు గోదావరీమండల కరగ్రాహివద్ద సిరస్తాదారుగానుండిన తుళసింగసెట్టిగారియింటఁ బురాణము చెప్పుచునుండి యాయనప్రోత్సాహముచేత శ్రీనీతిశాస్త్రమనెడి యేకాశ్వాసగ్రంథమును రచియించెను. ఆగ్రంథమునందుఁ గవి తుళసింగసెట్టి నిట్లు వర్ణించెను—

సీ. శార్ఙ్గభృచ్చరణాంబుజనిసేవ యొనరించు సజ్జనసంతతి సత్కరించు
నాశ్రితకోటి సమ్యగ్గతి నలరించు నాత్మబంధుజనాళి నాదరించు
సరళనీతిపథానుషంగాప్తి విహరించుఁ బరిజనాసత్కృతిఁ బరిహరించు
నగణితానుపమానసుగుణలీలఁ జరించు నార్యగుణాత్తుల ననుసరించు
ననుదినంబున ననిశంబు ఘనతఁ బ్రబలు
నట్టి తుళసింగసెట్టి నన్నఖిలబుధుల
మ్రోలనుతియించి యోకృష్ణమూర్తిసుకవి
సంఘటింపుము శ్రీనీతిశాస్త్రమనుచు.

ఈయన కవిత్వరీతిని దెలుపుటకయి మఱి రెండుపద్యము లీశ్రీనీతిశాస్త్రములోనివి యిం దుదాహరించుచున్నాను—

ఉ. మన్ననచేయు నుబ్బ నవమానముచేయఁగ గ్రుక్కకే పతిం
జెన్నలరంగఁ గొల్చుచు విశిష్టతమాత్మకులప్రతిష్ఠ సం
పన్నము చేయుచుం దనను బంధులచేతఁ బొగడ్తఁగన్న య
య్యన్నులమిన్నచే జగము లన్నియు నిల్చు నటంచు నెంచెదన్.

ఉ. ఎచ్చటనో ప్రయాసపడి యేమయినం బతి తెచ్చి వేసట
బిచ్చినఁ గొంచె మేనియు మహీయముగా మది నెంచి బాంధవు
ల్మెచ్చఁగ నొచ్చె మించుకయు లేనిసమగ్రగుణంబు పెంపునన్
హెచ్చఁగఁజేయు భర్త్రియశ మిట్టిసతి న్వినుతింతు రందఱున్.

ఈ పుస్తకముగాక యీతఁడు విరచితమైన వేంకటాచల మాహాత్మ్య మొకటికూడ ముద్రింపఁబడి యున్నదిగాని దానిరచన కవియొక్క ప్రఖ్యాతికిఁ దగినంత శ్రేష్ఠముగాఁ గనఁబడలేదు. కాళహస్తిలోఁ బ్రవేశించిన కొంతకాలమునకే కవిచే రచియింపఁబడిన వేదారణ్యమాహాత్మ్యముకూడ శ్రీతుళసింగసెట్టికే యంకిత మొనర్పఁబడినందునఁ గాళహస్తి పోకముందే యాతనివద్ద నుండెనేమో యని సందేహముకలుగుచున్నది. కాళహస్తిలో నున్నకాలమున నీకవిపుత్రుఁడయిన సర్వశాస్త్రి యమరుకమును సంస్కృతమునుండి తెనిఁగించి కాళహస్తిసంస్థానాధీశ్వరుని కంకితము చేసెను. ఈయమరుకములోని రెండుమూఁడు పద్యముల నిం దుదాహరించుట కేవలాప్రస్తుతప్రశంస కాకపోవచ్చునని యట్లుచేయ సాహసించుచున్నాను.

శా. శ్రీమించు దగు కాళహస్తినగరీసీమంబు ధామంబుగా
సేమం బాశ్రితకోటి కీఁవగు ప్రశస్తింబొల్చు నాసామియా
సామిరాకృత భూమి భృద్వరతనూజా కామి సేమంబుతో
శ్రీమద్దామెర వేంకటేంద్రులకు వాసింగూర్చు నిష్టార్థముల్.

చ. అవునవుఁ దెల్లమయ్యె వృథయాపలుమాటలు లేఁకేమి సామి నీ

కివురని నీదు ప్రేమరస మిట్లు గనేని స్వభావచంచలం
బవు హాతజీవితంబు చనునంతన మా కొక బాధ కల్గునే.

చ. మును మన కించుకంతయును మూర్తివిభేదము గానలేదు నె
మ్మనమున మీఁదం ౦ బ్రియానుస్వాము గల్గెఁ బరస్పరంబు న
య్యో యిపుడు నీకు భర్తృపద మేను బాంధ్యయానంగ నైతి జీ
వనగతవజ్రకర్కశా బాటిలె నిట్టిఫలంబు నేఁటికిన్.

ఈకృష్ణమూర్తికవి కాళహస్తిలో నున్నప్పుడు చేయఁబడిన ప్రధాన గ్రంథ మింకొకటి గలదు. ఆ కాలములో నీయనకును చెన్నపురి శాస్త్ర పాఠశాలలో నాంధ్రపండితుఁడైన పరవస్తు చిన్నయసూరిగారికిని సిద్ధాంత కౌముదిలోని సూత్రవిచారము కొంత నడచెను. మన పండితులు సాధారణముగా మత్సరగ్రస్తులగుట సుప్రసిద్ధమేగదా? అట్టివా రీర్ష్యచేతఁ దమకు లాభము లేకపోయినను బరులకు నష్టము కలుగుటనే తమ యభీష్టసిద్ధిగా భావించి కొన్నిసమయములయందుఁ బరుల కీర్తికి భంగము కలిగింపఁజూతురు. అంతకుఁబూర్వము కొంతకాలముక్రిందటఁ జిన్నయసూరి బాలవ్యాకరణమును రచియించెను. దానితో సరిపోల్పఁదగిన యాంధ్ర వ్యాకరణ మావఱకు వేఱొకటిలేదు. ఇట్లుండఁగాఁ గృష్ణమూర్తిగారిచేఁ జేయఁబడిన వ్యాఖ్యానముతోఁ గూడిన హరికారిక లనఁబడెడి యాంధ్ర వ్యాకరణ సూత్రగ్రంథ మొకటి యటుతరువాత నల్పకాలమునకు వెలువడెను. అదియే హరిభట్టకృతమై యథర్వణాదులచేఁ బేర్కొనఁబడిన కారికావళి యైనపక్షమునఁ జిన్నయసూరి తన వ్యాకరణములోని సూత్రములన్నిటిని హరికృతగ్రంథమునుండి దొంగిలించి తనపేరిటఁ బ్రకటించినట్లు స్పష్టమగును. అయినను మూలగ్రంథములోఁ జూపఁబడిన లక్ష్యములు కొన్ని యథర్వణాచార్యుల కీవలి యాధునిక గ్రంథములలోనివగుటచేత వ్యాఖ్యానమునుమాత్రమేకాక మూలగ్రంథమునుసహితము కృష్ణమూర్తిగారే రచియించిరేమోయనిపలువురు సందేహపడుచున్నారు.

అట్టి గ్రంథమును రచియింపఁగల సామర్థ్య మావిద్వత్కవికిఁ గలదనుటకు సందేహము లేదు. ఈయన యిటువంటి గ్రంథకల్పనముచేయ సంశయ పడువారుకారని చూపుటకయి చరమదశయందు మాడుగల్లులో నున్నప్పు డొక్కరాత్రిలోఁ జేసిన ట్రీయన కారోపింపఁబడిన యశ్వశాస్త్రకథ కొంత తోడుపడుచున్నది.

కృష్ణమూర్తికవిగారు కాశీనుండి స్వదేశమునకువచ్చి శ్రీరాజా గంగాధర రామారావుగారిచెద్ద పిఠాపుర సంస్థానములోఁ బ్రవేశించుట కయి నాలుగయిదు మాసము లచటనుండి కృషిచేసిరిగాని ప్రయత్నము సఫలమయినదికాదు. శ్రీరాజాగారే నూఱురూపాయలును జోడుశాలువలు నిచ్చి యాయనకు సెలవిచ్చిరి. తరువాత నాతఁడు తనకుమారుని యత్త వారియూరయిన జగ్గమ్మపేట గ్రామమునకుఁ బోయి యక్కడఁ గొంతకాలముండి తత్సంస్థానాధిపతి ననుసరించెను. పిఠాపుర సంస్థా నాధిపతియయిన శ్రీరాజా రావు నీలాద్రిమాధవరాయనింగారి భోగ భార్యాపుత్రుఁడును జగ్గమపేట సంస్థానాధిపతియునగు శ్రీరాజారావు వేంక టరాయఁడుగా రాయనకు సంవత్సరమున కిన్నూఱురూపాయలు వచ్చు మాన్యమును రెండుశాలువలు నిచ్చి సత్కరించిరికాని నెలజీత మేర్పఱచి తమ యాస్థానపండితునిగాఁ జేకొనలేదు. తరువాత నీకవి యైనవల్లిగ్రామ ములోఁ గొంతకాలము వసించి యక్కడనుండి శ్రీజగన్నాథయాత్రకుఁ బోయి పురుషోత్తమక్షేత్రమును సేవించి మరల వచ్చునప్పుడు త్రోవలో మాడుగల్లుసంస్థానమునకుఁ బోయి తత్సంస్థానాధిపతియగు శ్రీకృష్ణభూపతి గారిని సందర్శించెను. ఆయన విద్వత్కవుల నాదరించు రసికాగ్రగణ్యుఁ డగుటచేత వేయిరూపాయలువచ్చు భూము లిచ్చి కృష్ణమూర్తిగారిని తమ సంస్థానములో నుంచుకొనెను. ఈకవి మాడుగల్లు ప్రవేశించిన తరు వాతఁ దానుజేసినజగన్నాథయాత్రనుగూర్చి నీలశైలనాథీయ మనుపేర సంస్కృతములో నొకగ్రంథమును రచించెను. రెండుసంవత్సరము లాసం

స్థానములోనుండి కృష్ణమూర్తిగారు ౧౮౭౦ వ సంవత్సరమునకుఁ దరువాత నెనుబదియేండ్ల ప్రాయమున నక్కడనే కాలధర్మము నొందెను. ఈయన సంస్కృతమున యక్షోల్లాస మనుకావ్యమును, వల్లవీ పల్లవోల్లాసము, మదనాభ్యుదయము ననుభాణములను, రామాయణకథను జెప్పు కంకణబంధమును, హారికారికలను, నీలశైలనాథీయమును, ఆంధ్రమున సర్వకామదాపరిణయమును, వేంకటాచలమాహాత్మ్యమును, పీఠారణ్యమాహాత్మ్యమును, పంచతంత్రమును, వసుచరిత్ర వ్యాఖ్యానమును, రచియించెను.

---

# 126. మంత్రిప్రగడ సూర్యప్రకాశకవి

ఈకవి మాడుగొల్లు సంస్థానమున కృష్ణభూపతిగారి యాస్థానకవిగానుండి, కృష్ణార్జున చరిత్రమను రెండాశ్వాసముల ద్వ్యర్థికావ్యమును సీతారామచరిత్ర మనెడి యాఱాశ్వాసముల ప్రబంధమును భీమలింగ శతకమును రచియించెను. ఈయన యాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; శరభరాజామాత్యపుత్రుఁడు. ఈయన నలువదిసంవత్సరములక్రిందటఁ గాలధర్మమునొందెను. ఈయన కవిత్వము మృదుమధుర పదగుంభితమయి మనోరంజకముగా నుండును. కవితారచనను జూపుటకయి యీకవి గ్రంథములలోనివి కొన్నిపద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి—

కృష్ణార్జున చరిత్రము.

మ. రమణీ నీగుణరూపసంపదకు లోఁ రంజిల్లి గోపాలకుం
డమితారాతివిదారితామరసపత్రాక్షుండు కాంత్యుజ్జ్వల
త్కమనీయాకృతి రాజదర్జునసమాఖ్యాశాలి ధీరుండు బా
సుమనోరత్నము నీయధీన మగుచున్ శోభిల్ల జేసెంజుమీ. ఆ. ౧.

చ. కుతలమునందు భాగ్యమునకుం దగుకార్యము చేయునంత వి
శ్రుతయశయౌ సుభద్ర కరిసూదనవిక్రముఁ డైన గోపరా
ట్సుతునకు సమ్మతంబుగ విశుద్ధగుణాకర భూరిపుణ్యక
వ్రత మొగిఁజేయఁగాఁదగుఁవివాహమహోత్సవమానసంభ్రజల్ ఆ-౨

## సీ తా రా మ చ రి త్రి ము

శా. ధాత్రాదిక్రతుభుగ్వరుల్ ఘనతపోధారేయుమౌ నీదుచా
రిత్రం బెన్న నశక్తు లే జడుఁడ వర్ణింపన్ సమర్థుఁడనే
పుత్రీభూతసరస్వతీధవసితాంభోజాక్షరుద్రుండ వో
యత్రీ యత్రివిగాక నీకు సరియే యన్యాగ్రజన్మాగ్రణుల్. ఆ. 3.

చ. కనకకురంగ మేల వనిఁ గన్పడె గ్రక్కున దానిఁదేరఁ బో
య్మని పతి నేలపల్కితి నహమ్మతి నారఘుభర్త దానివెం
టను జన నేల యగ్రజుని డాయఁగ లక్ష్మణు నేలపంచితిన్
జనవరుఁ బాసి యే నిచటఁ జావఁగ నిన్నిపొసంగె దైవమా. ఆ-౪

చ. నను శర ణొందినన్ దనుజనాయకు రావణునైన ఁబ్రోతు నీ
తనిఁ గరుణించుటెంత శపథం బిదిగావున మీర లేగి చ
య్యనఁ గొనిరండు వీని కభయంబు నొసంగితినన్న భానునం
దనుఁడు కృపాంబురాశియగు దాశరథిం గని పల్కె నమ్ముఁడై. ఆ ౬

## భీ మ లిం గ శ త క ము.

క. తత్పురుషబహువ్రీహుల । సత్పురుషులు రామదాసశబ్దార్థమిలన్
ద్వత్పరముగఁ జెప్పుదురు జ । గత్పావన భీమలింగ కలుషవిభంగా.

క. ఏసురవరులం దైనన్ । నీసామర్థ్యంబు గలదె నిఖిలాధీశా
దాసీకృత జననీకృత । కౌసల్యా భీమలింగ కలుషవిభంగా.

# 127. ఫక్కి వేంకట నరసయ్య

ఈ కవి శకుంతలాపరిణయ మనెడి మూడాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఇతఁడు సృష్టికరణవంశజుఁడు; భరద్వాజగోత్రుఁడు; నారాయణమంత్రి పుత్రుఁడు. ఇతఁడు విశాఖపట్టణములోని క్రైస్తవోన్నత పాఠశాలయం దాంధ్రోపాధ్యాయుఁడై యుండెను. ఈ కవి యీ శకుంతలా పరిణయము నఱువది సంవత్సరముల క్రిందట ననఁగా ౧౮౩౬వ సంవత్సరమునందు ముగించెను. ఇతఁడు అమరపదకల్పద్రుమము, నారాయణ స్తవము, మదనసాయకాపరిణయము, కవిదర్పణచ్ఛందము, నారాయణశతకము, కుమారీశతకము అను గ్రంథములనుగూడ రచియించెను. ఈతని కవిత్వము సలక్షణమయి మనోహరముగానున్నది. శకుంతలాపరిణయములోని కొన్ని పద్యముల నిం దుదాహరించుచున్నాను—

మ. తనరన్ బున్నమ రేలఁ దత్పురవరోద్యత్సౌధసంచారికల్
వనజారిన్ ఘనసారఖండమని కేలంబట్టి దీపాగ్రసీ
మను ధూపక్రియఁ జూపఁ గంది చెలులం బ్రార్థింపఁగా వీడినన్
జనియెన్ వాసికినాఁటనుండి కలిగెం జంద్రాఖ్యయుం జిహ్నమున్. ఆ-౧

చ. తొలకరికాదు మిం చనఁగఁ దోయజబాంధవుఁ డస్తమింపలే
దలజలజారిరేఖయన నంతటనంతట నాడుచుండె మే
ల్తళుకుకడానిబొమ్మయనఁ దావులపూవులదీవెయో యనన్
గిలకిల చిల్కపల్కులనొగిం బదపద్యము లుగ్గడించునే? ఆ-౨.

చ. సరిసరి పొమ్ము బాల యొక చక్కని బాలునిఁజూపి వీఁడు నీ
వరసుతుఁ డేనురాణి నని నావిరిఁ జెప్పఁ దొడంగుచుంటి వీ
దొరలును మంత్రులున్ ఘనబుధుల్ ననుఁ బాయక యుందు వెప్డు వీ
రెఱుఁగనిరీతిగా నడవి నెన్నఁడు నిన్నుఁ బరిగ్రహించితిన్? ఆ-3.

# 128. వేల్పూరి వేంకటేశ్వరకవి

ఇతఁడు గోవ్యాఘ్రచరిత్రమును, విచిత్రరామాయణమును పద్య కావ్యములుగా రచియించెను. ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; మౌద్గల్య గోత్రుఁడు; బ్రహ్మనామాత్య పుత్రుఁడు. ఈతని నివాసస్థలము విశాఖ పట్టణ మండలములోని విజయనగర సంస్థానమునందలి రావివల్సయను గ్రామము. కవి ౧౮౫౧ వ సంవత్సరమున స్వర్గస్థుఁ డయినందున, దాదాపుగా నిప్పటి కేఁబదిసంవత్సరములక్రిందట నుండినవాఁడు. అక్కడక్కడ వ్యాకరణవిరుద్ధములైన ప్రయోగములు కానఁబడుచున్నను, మొత్తముమీఁద నీతని కవిత్వము మృదువయి శ్రావ్యముగానున్నది. కవికృతములైన రెండు కృతులనుండియుఁ గొన్ని పద్యముల నిం దుదాహరించుచున్నాను.

గో వ్యా ఘ్ర చ రి త్ర ము.

చ. మధుకరపంక్తిఝుంకృతులు మత్తమయూరనిశాతషడ్జముల్
పృధుతరకోకిలధ్వనులుఁ బెంపలరారు శుకప్రసంగముల్
శిథిలముగాని శారికలచింద<ఱ>వందఱచే వనాళిఁ బెం
పొదవఁగ నొప్పెఁ బుష్పమధురోజ్జ్వలసత్ఫలసంకులంబులై.

ఉ. సంతతిలేక డెందమునఁ జాలఁగ డస్సి వ్రతోపవాసముల్
సంతత మేనొనర్చి కడుసంతస మొప్పఁగ వేల్పుటేండ్ల మ
త్యాన్వంతమునందు నిల్చి హిమశైలసుతేశ్వరు నిందుమౌళి న
త్యంతసుభక్తిఁ గొల్చి సుతు నంచితవాంఛ ఫలించఁగాంచితిన్.

వి చి త్ర రా మా య ణ ము.

ఉ. మామ యిదేటిమాట వినుమా మనమాఱడిఁజెందె నింక నా
సామిపదంబులాన కొనసాగదు తొల్లిటిభంగి దానవ
గ్రామణియింట నున్న జనక ప్రభుకూఁతురి నేలుకొంట కా
రాముని కొప్పె నొప్ప దనరాదు ప్రభుత్వముగల్గువారలన్. ఆ-౧.

ఉ. పుట్టి జగంబులోఁ గల భూసురుల న్మునులన్ నృపాలురన్
బట్టి వధించి వజ్రధరుపాలికి నేగి సుపర్వకోటులం
గొట్టి సమస్తలోకములకున్ ములుసూపె నతండు నారదుం
డట్టితఱి న్వైకుంఠపురమందు మురారిని జేరి యిట్లనెన్. ఆ-౨.

చ. కళుకులు దేరుబల్మిసిమికాంచనరత్నమయూఖముల్ దిశా
వలయముఁ బర్వ నచ్చరలు వైభవలీల నటింపఁ గిన్నరుల్
బలసి రథంబు చుట్టును సభక్తిని గొల్వ సిరోజబాంధవుం
డిల కరుదెంచెనో యన ధనేశుఁడు రాఁగ వియన్నిరీక్షుఁడై. ఆ-౩.

ఉ. ఇచ్చి నృపాలుఁ డిట్లనె మునీశ్వర నీ కెదురాడి నిల్వనా
చిచ్చరకంటిసామికిని జెల్లదు నేనన నెంత యీసుతుల్
సచ్చరితుల్ సురారు లతిసాహసు లాహవకోవిదుల్ కడుం
గుచ్చితు లస్త్రశస్త్రముల గోప్య మెఱింగినటింతు రెప్పుడున్. ఆ-౪

మ. ఎదిరిం దన్ను నెఱుంగలేక మహిలో నెవ్వాఁడు సన్నిట్లు బె
ట్టిదుఁడై నాసయు వీనులుం దునిమె కాఠిన్యంబున న్మున్ను నేఁ
జెదరంజేసిన దేవదైత్యవరులం జింతింపఁ గో చూడు మా
కదనక్ష్మాస్థలిఁ గూల్తు వానిఁ దెలియంగాఁ బల్కవే సోదరీ. ఆ. ౫.

మ. శరసంధాన మొనర్చు ప్రౌఢిమయు లక్ష్యం బూహఁ గావించు నే
ర్పరుబాహాబలవిక్రమంబు సమరోద్యోగంబు సవ్యాపస
వ్యరిపుక్షీణమహాస్త్రపాతములు రౌద్రాకారముం గన్న నా
పౌరుషం బో వెఱపొందు నీశుఁ డయినం బుత్రానిజంబింతయున్ ఆ-౬.

ఈవిచిత్రరామాయణము గోపీనాథరచితాంధ్రవచనకావ్యము ననుసరించి యీకవిచేఁ బద్యరూపమునఁ జేయఁబడినది. ఈవచనకావ్యము ననుసరించియే యిటీవల గోదావరీమండలస్థ వెలగతుఱ్ఱుగ్రామనివాసియు నాపస్తంబసూత్రుఁడును శ్రీవత్సగోత్రుఁడును నుమామహేశ్వర సూపుత్రుఁడును నగు నరసింహదేవర వేంకటశాస్త్రియును వైదిక కవియు

నొక పద్యకావ్యమును రచియించియున్నాఁడు. ఈవర్ధమానకవిచే రచియింపఁబడిన విచిత్రరామాయణమునందును వ్యాకరణదుష్టము లైన ప్రయోగములనేకములు కానఁబడుచున్నను మొత్తముమీఁద నీతనిగ్రంథము మొదటిగ్రంథమునకంటె నధిక రసవంతముగానున్నది. ఇందలిపద్యములనుగూడఁ గొన్నిటి నిం దుదాహరించుచున్నాను—

ఉ. రామ విరాజమానరిపురాజకిరీటమణిప్రభాసుమ
స్తోమ సుపూజితాంఘ్రి యఘసూదనతారకనామ నీరద
శ్యామ సురేంద్రవందితవిశాలపరాక్రమ కీర్తికామినీ
కామ కఠోరరాత్రిచరకాండవిఖండనభండనప్రియా. బాల.

ఉ. తెల్లనిమేనివానిఁ గడుతియ్యనిమాటలవానిఁ గప్పుడాల్
చల్లెడుగొంతువాని బులిచాలతోలు బుజాలపైని రా
జిల్లఁగ జేయువాని దెసచీరెలనూనినవాని నెత్తిపైఁ
జల్లనివెల్గుఁ దాలిచినసామిని జూచియహీంద్రుఁ డెంతయున్. అయో

ఉ. ఓసి యభాగ్యురాల పడియుండక యింట నిటేలవచ్చినా
వే సకలంబుఁబోయె నినుఁ బెండిలియాడినపూఁటనుండి నే
బ్రాసివి నీవు వేశ్మమునఁ బాదము పెట్టితి వంతకంతకుం
గా సొక లైన బట్టకొనఁ గట్టఁగి లే దిఁక లేచిపోఁగదే—అరణ్య.

శా. ఆకంఠీరవనాదము న్విని మహాహంకారసంయుక్తుఁడై
నాకేశాత్మజుఁ డాహవంబునకు సన్నాహంబుతో నేగి నే
నాకయ్యంబున నింద్రపుత్రకసహాయార్థంబు శాఖామృగా
నీకంబు ల్గొలువంగ వెంటజనితిన్ స్నేహంబుపెంపొందఁగన్. కిష్కింధ

ఉ. ఎవ్వఁడవోరి యేమిపని కిచ్చటవచ్చితి నిల్వునిల్వు నీ
క్రొవ్వడఁగించి ప్రొద్దుకొమరుండువసించిన టెంకి కంపెదన్
మవ్వపుదెబ్బఁ జూడు మని మారుతివక్షమునందు మోఁదె నీ
వెవ్వతెవంచు గ్రుద్ది పడనీడ్చె సమీరసుతుండు రక్కసిన్—సుందర.

శా. ఏమీ దానవవీరులార యమవహ్నీంద్రాదులన్ గెల్చు సం
గ్రామోత్సాహము లెందుఁబోయెఁ బటుదర్పం బేటికిన్
మీమీయిమ్ముల కేగియుంటి రిదియేమీ వైరిక్ష్మేజంబు మీ
సామర్థ్యంబును విక్రమక్రమరణోత్సాహంబులం జెల్వఁగన్— యుద్ధ.

---

## 129. తిరుమలబుక్కపట్టణపు చినతాతాచార్యుఁడు

ఈకవి వడ్లమన్నాటి వెంకప్ప సోమయాజులగారి ప్రేరణముచేత విశ్వగుణాదర్శమును పద్యకావ్యమునుగాఁ దెనిఁగించెను. ఇతఁడు శ్రీనివాసాచార్యునిపౌత్రుఁడు; వేంకటాచార్యునిపుత్రుఁడు. ఇతఁడు నలువది యేఁబదియేండ్లక్రిందట కృష్ణామండలములో నుండినవాఁడు. కృతిప్రేరకుఁడైన వడ్లమన్నాటి వెంకప్పసోమయాజులగారి యజ్ఞమూలముననే కృష్ణామండలములోని వైదికనియోగిబృందములో రెండుకక్ష లేర్పడినవి. ఈ కవియొక్క కవిత్వమునందుఁ గొన్ని వ్యాకరణదుష్టములైన ప్రయోగము లున్నను మొత్తముమీఁద కవనరచన సరసముగా నున్నదనియే చెప్పవచ్చును. ఆంధ్రవిశ్వగుణాదర్శములోని రెండుపద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి—

చ. ఘనవన భూముల న్మెలఁగి కన్నము వేసి గృహాళివిత్తముం
గొని చనువారి దొంగ లనఁగూడునె పోషకులైనవారిలె
క్కను గడుబొంకుపుచ్చి తదఖర్వధనంబులు దొంగిలింతు రీ
గణకులె దొంగ లీగణకకర్ములనే భజియింతు రీజనుల్.

చ. సురభితమాలముం గుసుమశోభితసాలము వీక్షణార్హబం
ధురతిలకాతిసాలము విధూతమహాదురితౌఘమూలమున్
సరసరసాలమున్ బనసజాలము మాధవకేళిలోలమున్
బరమగుణాలవాలమును బాయక చూడుము శేషశైలమున్.

## 130. మాడభూషి నృసింహాచార్యుఁడు

ఈకవి పల్లవీపల్లవోల్లాస మను మూడాశ్వాసముల ప్రబంధమును నూజవీడు సంస్థానాధిపతి యగు శ్రీశోభనాద్రి అప్పారావుగారి ప్రేరణమువలన రచియించెను. ఇతఁడు శ్రీవైష్ణవ బ్రాహ్మణుఁడు; నైధ్రువకాశ్యపగోత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; వేదాంతాచార్యులపుత్రుఁడు. ఈకవి యిరువది ముప్పది సంవత్సరముల క్రిందట నుండినవాఁడు. ఈయనకవిత్వము సలక్షణమయి నాతికఠినమయి శ్రావ్యముగానున్నది. పల్లవీపల్లవోల్లాసములోని రెండుపద్యముల నిం దుదాహరించుచున్నాను—

చ. తనయులు పెక్కుగల్గినను దన్వికిఁ బుత్రిక పుట్టకున్న ని
  త్తనువు నిరర్థకం బని మొదం దలపోయుదు రింతు లంచుఁ దా
  మనమునఁ గొంతసేపు నృపమాని చింత యొనర్చి యేమిసా
  ధనమునఁ గన్యకావదనదర్శనజన్యముదంబు గల్గునో. ఆ. ౧.

ఉ. పాండుతనూభవుండు తనబాంధవు లత్తఱి సంతసిల్లఁగా
  గాండివ మెత్తెఁ బందిగిచి కల్పకృశానుసమానుఁడై లస
  త్కాండముల న్నిగిడ్చి నృపకాండములం దెగటార్చి పేర్చి త
  త్కాండమునన్ ముదం బెసఁగ 'దద్దయునొత్తెను దేవదత్తమున్. ఆ. 3

---

## 131. కోటమరాజు నాగయ

ఈకవి యధ్యాత్మరామాయణమును పద్యకావ్యమునుగా రచియించెను. ఇతఁ డారువేలనియోగిబ్రాహ్మణుఁడు; కాశ్యపగోత్రుఁడు; భాస్కరమంత్రికిని శాయాంబకును బుత్రుఁడు. ఇతఁడు కృష్ణామండలములో ముప్పది నలువదిసంవత్సరముల క్రిందట నుండినవాఁడు. కాణాదము పెద్దనకవికృతమైన యధ్యాత్మరామాయణమువలె కవిత్వమంత

ప్రౌఢముగా నుండకపోయినను మొత్తముమీఁద హృద్యమయి నిర్దుష్ట మయియున్నది. అధ్యాత్మరామాయణములోని కొన్ని పద్యము లిందుఁ జూపఁబడుచున్నవి—

ఉ. ధరణీదేవ భవత్తపోమహిమ చోద్యం బయ్యె నిన్మెచ్చితిన్
వర మే నిచ్చెద హైహయుం దునిమి గర్వగ్రస్తులౌ రాజులన్
ధరణిం జే రడఁగించి కశ్యపున కీధాత్రీతలం బిచ్చి శాం
తరుచిందాల్చుము దాశనొందిపితృహత్యాపాపంబువారింపఁగన్ - బాలకాం

ఉ. రామ త్రిలోకవిశ్రుతు విరాధు నెఱుంగవె మద్భయంబునన్
వేములు మౌను లీవనము వీడి పలాయితు లైరి నీవు మీ
నేమము గోరెదేని యిట సీతను డించి నిరాయుధుండవై
భూమినదృశ్యవై ఖరినిబొమ్మురయమ్మునఁదమ్మునితోడుతన్ - అర॥కాం

ఉ. ఏనెఱిఁగించి నంతటనె యిమ్మకరాలయ మెంత దాటి లం
కానగరంబుఁ దుత్తుమురుగా నొనరింపఁగఁ జాలుఁ గార్ముక
జ్యానినదప్రము క్తశరజాలములన్ రఘుసత్తముండు నీ
పైని మనంబుపెట్టి యొకపంతునుదెమ్మనఁడారగింపఁగన్ - సుందరకాం

మ. మునివర్యుల్ విజయోస్తుతే యనఁగ సమ్మోదంబుతో నేగి యు
న్న నియోగించినభంగి నాలవణునిం జక్కాడి నిర్భీతిమై
జను లెల్లన్ వసియించుపట్టణము లిచ్చంజేసి తద్రాజ్యపా
లన నై పుణ్యముతోడ నిం పెసఁగఁ గళ్యాణీ భవానీసతీ. ఉత్తరకాం

# 132 కరాలపాటి రంగయకవి

ఈకవి భూతపురీమాహాత్మ్యము, కవిజనమనోహరము అను రెండు పద్యకావ్యములను రచియించెను. ఇతఁడు వైష్ణవ వైశ్యకుల సంజాతుఁడు. ఇతఁడు ౧౭౧౨ వ సంవత్సరమున జనన మొంది ౧౭౭౬వ సంవత్సరమునందుఁ బరమపదము నొందెను. ఇతఁడు చెన్నపురిలోఁ గొంతకాలము పచ్చప్పగారి పాఠశాలయందును గొంతకాలము రాజధానీ శాస్త్ర పాఠశాలయందును నాంధ్రపండితుఁడుగానుండెను. మొట్టమొదట నాంధ్రభారత భాగవత రామాయణములను లేఖకప్రమాద జనితదోష రహితములుగాఁ బరిష్కరించి ముద్రింపించిన దితఁడే. ఇతఁడు తనతండ్రిని రామకవియని పేర్కొనుటయేకాక తనతాతయైన నారాయణ సూరికూడ కావ్యరచన మొనర్చి కర్ణాటరాజులను మెప్పించినట్లు భూత పురీమాహాత్మ్యమునం దీక్రిందిపద్యములతోఁ జెప్పియున్నాఁడు—

ఉ. పాయక యేమహామహునిభవ్యవచోగరిమం బశేషభూ
నాయకగోష్ఠిసత్కవిజనంబులచే ననిశంబు వర్ణితం
బై యరవద్యతం బరఁగు నాగుణశాలి కరాలపాటి నా
రాయణసూరిమౌళి దనరారె సుధీజనపద్మహేళియై.

మ. సకలార్య స్తవనీయభవ్యకవితాసంప్రీతకర్ణాటభూ
పకులాధీశ్వరదత్తమత్తగజశశ్వద్దానధారాసము
త్సుకరోలంబకదంబఝాంకరణవచ్ఛుంభద్గృహప్రాంగణుం
డకలంకాశయుఁ డమ్మహాకవికులాధ్యక్షుండు సామాన్యుఁడే.

ఈకవి భూతపురీమహాత్మ్యములో మూఁడాశ్వాసములు రచియించు నప్పటికే యవసానకాలము సంప్రాప్తమయినందున గ్రంథము ముగియ లేదు. ఈతని కవిత్వము నిర్దుష్టమయి మృదుమధురపదభూయిష్ఠమై రస వంతముగానున్నది. అయినను వ్యతిరేకక్త్వార్థకముమాత్రము గ్రంథమునం

దక్కడక్కడ ద్రుతప్రకృతికముగాఁ బ్రయోగింపఁబడి యున్నది. శైలి తేటపడుటకయి యీతని గ్రంథములనుండి కొన్నిపద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి.

## కవిజనమనోహరము.

ఉ. పోయెఁగదే ననుం గడచి పోటరియై యదె వాఁడు రారె రా
రేయని వారుఁ దానును సమిద్ధరయంబున వెంటనంటి య
గ్గాయకపుంగవుం గదిసి గట్టిగఁ బట్టుకొనుండు నెమ్మెయిం
ద్రోయఁగ లేక చిక్కువడె దుష్టనిశాటుల నోర్వ శక్యమే.

ఉ. అక్కటికంబులేని దనుజాన్వయజాతుఁడ వయ్యు నాఁకటన్
స్రుక్కుచు ధార్మికత్వము విశుద్ధమనోగతిఁ బాయలేక న
న్నక్కడు ప్రీతితోననిచి తీయుపకారము నీసుశీలముం
దక్కొరులందుఁ గల్గునె బుధప్రియవర్తన నీకుఁదక్కఁగన్.

## భూతపురీమాహాత్మ్యము.

ఉ. జారులు లేరు పేరుకొనఁ జారులకాని యనారతం బనా
చారులు లేరు తత్త్వసువిచారులకాని సరోషభీషణా
కారులు లేరు నిచ్చు లుపకారుల కాని విమర్శచేయఁగాఁ
బౌరులలోన నమ్మనుజపాలధరా పరిపాలనంబునన్. ఆ-౧.

ఉ. ఈశ గిరీశ నేరమి సహింపుము డింపుము రోష మప్రతీ
కాశము నీమహత్త్వ మెఱుఁగం దగువారము కాము సత్కృపా
పేశలదృష్టిఁ గన్గొను మపేతకళంకులఁ జేయుమయ్య లో
కేశ శరణ్యదీనులము హీనుల మెంతటివార మల్కకున్. ఆ-౨.

ఉ. అమ్మునివర్యుభార్య వినయమ్ము భయమ్ముఁ బ్రియమ్ము నెప్పుడున్
నెమ్మది సందడింప మగనిం బరిచర్యలఁ దృప్తుఁ జేయుచున్
సమ్మద మారఁగా నతిథిసంఘముఁ దన్పుచు దేవతావితా
నమ్ముల భక్తిఁగొల్చుచు గుణమ్ములు సాధుగణమ్ములెన్నఁగన్. ఆ-3.

---

# 133. దామరాజు లక్ష్మినారాయణ

ఇతఁడు బృందావనవిహార మనెడి మూఁడాశ్వాసముల పద్యకావ్యమును రచియించెను. ఇతఁడాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; శ్రీవత్స గోత్రుఁడు; శివరామామాత్యపుత్రుఁడు. ఇతఁడు తన బృందావనవిహారమును మల్కాపురములోని సీతారామస్వామి కంకిత మొనర్చెను. ఇతఁడు తరువాత గోదావరిమండలములోని యేలూరునకు వచ్చి యచ్చట నివాస మేర్పఱచుకొన్నట్టు తెలియివచ్చుచున్నది. ఈతనిసంతతివారు మూఁడు తరములనుండి యేలూరునం దున్నారు. ఇతఁడఱువదిసంవత్సరముల క్రిందట నుండినవాఁడు. ఈతని కవిత్వమునందు వ్యాకరణదోషము లనేకములు గానవచ్చుచున్నను, మొత్తముమీఁదఁ గవిత్వము మృదువుగాను మనోహరముగానునున్నది. బృందావనవిహారములోని రెండుమూఁడు పద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. ధారుణిలోనఁ జూచి విశదంబుగ నెంచిన స్త్రీల కందముల్
చారుగుణప్రధానములు చక్కఁదనంబున కేమిలెక్క యా
నారసగంధికిన్ మిగులఁ జక్కఁదనంబుకు భూషణంబుగా
మీఱె లసద్గుణావళియు మించుగ సొంపుగ నెన్నిభంగులన్. ఆ-౧.

మ. కులగోత్రంబుల లేక నిర్మలముగా గూఢీకృచాధిక్యని
స్తులమాధుర్యనిరూపదీపకలితస్థూలైకతాసిద్గుణో
జ్జ్వలులై జన్మములంచుఁ బూనుకొని కృష్ణస్వామి రాముండు గొ
ల్లలకుం జేతురు చేయరానిపనులన్ లజ్జించెదం జెప్పఁగన్. ఆ-౨.

చ. మొఱలిడువారి మొఱ్ఱ లవి ముందుగ వించును వెంటనుండు నా
కఱమఱలేదు వారియెడ న్యాయముగా విహరింతు నెంతుఁ ద
త్తఱమున వారియాపదలు దాటఁగఁజేయుదుఁ దత్క్షణంబునన్
మఱవక నన్నుఁ గొల్చుటకు మాటుగనుండెద నింతె చూడరే. ఆ-3.

# 134. త్యాగరాజ మొదలి

ఇతఁడు శుద్ధద్రావిడియైనను దెనుఁగుభాషయం దత్యంతాభిమానము గలవాఁడయి యాంధ్రభాషయందుఁ జక్కనిపాండిత్యము సంపాదించి పెక్కుగ్రంథములను జేసినవాఁడు. ఇతఁడు చేసినగ్రంథములలో విద్వత్కర్ణామృతమను నామాంతరముగల సుబ్రహ్మణ్యవిజయమనెడి యైదాశ్వాసముల ప్రబంధము ప్రధానమయినది. ఈకవిచే రచియింపఁబడిన పుస్తకములలో ఛందోగత్నాకరమను చిన్నఛందస్సుకూడముద్రింపబడియున్నది. ఇతఁడు ౧౮౩౦ వ సంవత్సరప్రాంతమునందు జననమొంది యిరువదియైదు సంవత్సరములక్రిందటఁ గాలధర్మమునొందెను. ఇతఁడు నారాయణమొదలారి కుమారుఁడు. ఈగ్రంథరచనకాలమునందితఁడు ఇంజనీరింగు డిపార్టుమెంటులో అసిస్టాంటు ఓవరుసీయరుగానుండెను. ఇతఁడు తాను మొట్టమొదట నాంధ్రభాషాభ్యాసముం జేయుటనుగూర్చి యిట్లు వ్రాసికొనియున్నాఁడు—

"బాల్యంబునప్రథమంబాంధ్రభాష నభ్యసించుటమనోదర్పణపారదంబుగదా? నాలుగేఁడులు నిండినతోడనే లసదుచ్చారణ సస్యవృద్ధిగోరు మానవహాలికులు జిహ్వావలజంబునకు హాలంబుగానెంచు నాంధ్రభాష నాకు ప్రథమముం దభ్యాసమయ్యె. సమధికోచ్చారణలేని ద్రవిడదేశస్థులలో నొకండ నయ్యు నాకలవారికిఁ గల లేమి లేమియయ్యె. సంస్కృత ద్రావిడ హూణప్రముఖభాషలనాయాసలభ్యంబులయ్యె."

ఇతఁడు తన చిన్నపాత్తములకు సహితము పెద్దపేరులుపెట్టి యాత్మస్తుతిని గొంతయధికముగాఁ జేసికొన్నను, మొత్తముమీఁద నీతని కవిత్వము సలక్షణమయి హృద్యముగా నున్నది. కవితారచనను జూపుటకయి సుబ్రహ్మణ్యవిజయములోని కొన్ని పద్యములిం దుదాహరింపఁబడుచున్నవి—

మ. భువనంబు ల్జడమయ్యె భంగతతులం బొందెం బురవ్రాత మెం
దవనత్వంబులు లేక చిక్కెముని ముఖ్యావాసముల్ జంతుసం
ఘువిభ ల్వారిత మయ్యె లోకరమవీఁక న్వంక రయ్యె న్నవైం
దవభూపా యిఁకనైనఁ గర్బురకులోద్భూతి మాయించవే. ఆ. ౧

ఉ. నెమ్మది యల్కఁ గొంత భయనీతిని వల్దనిపల్కె మేనిపైఁ
గ్రమ్మెడిపుల్కె లొల్కె భయరాగముచిల్కె మరుండు దైవకా
ర్యము దలంచి మోహనశరంబు కరంబునఁ బూని యిక్షుచా
పమ్మున నుంచినైనఁ దెగువం దివియంగ హరుండు వేడుకన్ ఆ. ౨.

చ. తన కపరాధసంచయశతం బొనరించిన నోర్చుఁగాని తాఁ
దననతపాళి నేర్చినమదస్మయయుక్తుని నొప్పఁడైనఁ దు
న్మ నతఁడు గాన దేవతలు పొందినవా రతనిం దదీయులన్
సనయతఁగూడి తద్వినతిసల్పి సుఖింపుము దానవేశ్వరా. ఆ. ౩.

ఉ. తారల నెన్నవచ్చు నలదైత్యబలేశుల నెన్నరాదు కాం
తారతృణాళి నెన్ననగుఁ దచ్చతురంగబలంబు నెన్నరా
దార పయోధియుం దిసుక నారసి యెన్నఁగవచ్చుఁ దద్బలో
దారమహాయుధాంబకకదంబము నెన్నఁగరాదు బ్రహ్మకున్. ఆ. ౪.

మ. ఘనమాయావులు నిత్యచంచలులు నిష్కాముల్ స్వకార్యానుకూ
లనవోపాయవిధిజ్ఞు లస్థిరమృషాలాపుల్ కృపాశూన్యు లెం
దునుఁ బుంవర్యులు దేవదేవు లెపుడున్ దుర్వారసంపత్సమూ
ర్తిని తాంతాంధులు పల్కె నేల మగవారి న్నమ్మఁగా వచ్చునే. ఆ. ౫.

# 135. ఓగిరాల జగన్నాధకవి

ఈకవి సుమనోమనోభిరంజన మనుపేర నైదుల్లాసములప్రబంధ మును రచియించెను. ఈతఁడాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; గోదావరీ మండలములోని నీలపల్లిగ్రామ నివాసుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; భారద్వాజగోత్రుఁడు; వేంకటేశ్వరామాత్యపుత్రుఁడు. ఇతఁడు తనచర మదశయందు కాకినాడపురముననుండి సుధీరంజనియను మాసపత్రిక కధి పతియయి సుమారు పదునేనుసంవత్సరములక్రిందట లోకాంతర గతుఁ డయ్యెను. ఈయనయు నీయన పెదతండ్రికుమారుఁడైన రంగనాథకవియు మఱికొందఱును సుప్రసిద్ధులైన శ్రీమంత్రిప్రెగడ వేంకటరామపంతులవారి యొద్ద లక్షణ గ్రంథములను జదివి నంచికవీశ్వరులైరి. శ్రీమదోగిరాల రంగనాథకవినిగూర్చి యీజగన్నాథకవి తన సుమనోమనోభిరంజనమునం దిట్లు వ్రాసియున్నాఁడు—

గీ. వారిలో రంగనాథుండు పండితోప
లాల్యమానసవీనకల్యాణకల్ప
వల్లికాముఖ్యరసవత్ప్రబంధరాజ
కల్పనాదక్షుఁడై ఘనఖ్యాతి మెఱసె.

ఈరంగనాథకవి జగన్నాథకవికంటెను సమర్థతరుఁడనియు నధిక లక్షణవేత్తయనియుఁ బేరువడసినను, ఇతఁడు చేసినగ్రంథము లేవియు ముద్రింపఁ బడకుండుట శోచనీయముగా నున్నది. ఏతత్కవికృతమయిన ద్విరేఫదర్పణ మిప్పు డముద్రితగ్రంథచింతామణి యందు ప్రకటింపఁ బడుచున్నది.

జగన్నాథకవి తన ప్రబంధమును ౧౮౭౯ వ సంవత్సరమునందు ముద్రింపించినను, ఆవఱకెతఁడు ముప్పదియైదుసంవత్సరముల క్రిందటనే దానిని ముగించియుండెను. ౧౮౭౮ వ సంవత్సరమున నేను పాఠశాలలోఁ

జనవుకొనుచుండినకాలములో సుమనోమనోభిరంజనములోని మొదటి మూడాశ్వాసములను వ్రాసికొనియున్నాను. అయినను కవి యీనుప్పది సంవత్సరములలోను గ్రంథమునకు మెఱుగుపెట్టి సంస్కరించి యెక్కువ వన్నె తెచ్చెను. ఈ గ్రంథమును సర్వకలాశాలాధ్యక్షులు పట్టపరీక్షకుc బఠనీయ గ్రంథమునుగా ననేకపర్యాయములు నిర్ణయించి యుండుటచేతనే దాని ప్రాశస్త్యము వెల్లడి యగుచున్నది. కవిత్వము రసవంతమయి నిర్దుష్టమయి యనర్గళధార కలదిగా నున్నది. కవనరీతి తెలియుటకయి సుమనోమనోభిరంజనములోని పద్యములc గొన్నిటి నిం దుదాహరించు చున్నాను.

మ. నిరతాన్యోన్యమనస్సముద్భవసపత్నీవైరమూలాపనో
దరతిన్ గొబ్బునc జిత్రభానుననుc జిత్రత్వాహిరాట్సాయికిన్
సరవిన్ స్వస్తిగుల న్వచించుకొన నిచ్చంబోవు మార్తాండజాం
బరశైవాలినులో యనందగుc బురద్వార్ణీలహీరప్రభల్. ఉ. ౧.

చ. చందురునందుc గల్గురుచి సంపెగతావియుc బారిజాత మా
రందమునందుc గూరిచి హిరణ్మయరాగచయంబు చల్లుచున్
బొందుగ మేళవించి మెఱపుం బళుకుల్ పయిcబూసి యాశతా
నందుcడు నేర్పుమీఱ జతనంబుగc జేయcగcబోలు నాసతిన్. ఉ-౨.

చ. చిలుకవహాలుమావజీ రనుకృషీవలుc డంగనచి త్తవప్రమున్
జలజకలంబలాంగలములన్ దళనం బొనరించి కృష్ణను
జ్జ్వలగుణబీజ మంటి యతిబంధురరాగరసంబునింపc గో
మలసుమనోరథాంకుర మమందముగా జనియించి మించెమన్. ఉ-3.

చ. అరిదరపాణిమానసముపం దవదాత్మమృదూర్ధ్వపుండ్రకాం
తరవరవర్ణినీమృదులనవ్యపరాగవిధీయమానసుం
దరతరచిత్రకద్యుతి గనంగ మసారమణీధరాధరో
పంశరదభ్రమధ్యతలభాసితటిల్లతరీతి నొప్పెడున్. ఉల్లాస-౪.

చ. కలువలరాచరాచనొసలు గాన్కొనువెన్నెలచేఁ గరంగఁగాఁ
దొలఁకు జలప్రవాహములు తోరపుఁ గ్రొవ్విరి తేనెసోనలం
గలయుచు సర్వతోముఖముగా నిలఁ బర్వుచు గానఁ గాశీ
తలనుణసౌరభంబులకుఁ దావలమై తనరారు మాధవా. ఉ-౫.

---

# 136. నడకుదుటి రామనకవి

ఇతఁడు ప్రభులింగలీలను, హరిమీడేస్తవము, ఆత్మానాత్మవివేక చూడామణి అను సంస్కృతగ్రంథములను దెనుఁగునఁ బద్యకావ్యములనుగా రచియించెను. ఇతఁడారువేలనియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు; కౌశికగోత్రుఁడు; లక్ష్మీనృసింహుఁడను నామాంతరముగల బుచ్చనామాత్యునిపుత్రుఁడు. ఈకవి ౧౭౨౧ వ సంవత్సరమునందు జననమొంది ౧౭౭౭ వ సంవత్సరమున లోకాంతరగతుఁడయ్యెను. ఇతఁడు మొట్టమొదట గోదావరీమండలమునందలి రామచంద్రపురము తాలూకాలోని శహాపుర గ్రామమునకు కరణముగానుండి, పెద్దాపురమునకుఁ జేరువనున్న తిరుపతిగ్రామముయొక్క కరిణికమును గ్రామమునందలి భూములును దన యత్తవారివి గాఁగా శహాపుర కరణికమును దన జ్ఞాతులకు వదలివేసి ౧౭౮౩ వ సంవత్సరమున సకుటుంబముగాఁ దిరుపతిగ్రామమునఁ బ్రవేశించెను. ఇతఁడు రచియించిన గ్రంథములలోఁ బ్రభులింగలీల పాల్కురికి సోమనాథుని ద్విపదకావ్యానుసారముగా నైదాశ్వాసముల పద్యకావ్యముగా రచియింపఁబడినది. తక్కినవి రెండును శంకరాచార్యులవారి సంస్కృతగ్రంథములనుండి యాంధ్రీకరింపఁబడినవి. ఇందు వివేకచూడామణియైదాశ్వాసముల గ్రంథము. ప్రభులింగలీల ౧౭౫౫ వ సంవత్సరాంతమునందును, హరిమీడేస్తవము ౧౭౬౫ వ సంవత్సరమునందును రచియింపఁబడినట్టు కవివంశమువారు చెప్పుచున్నారు. వివేకచూ

డామణి శాలివాహనశకము ౧౭౯౩వ సంవత్సరమునం దనఁగా హూణ శకము ౧౮౭౧ వ సంవత్సరమున రచియింపఁబడినట్టు కవియే గ్రంథమునం దీపద్యమునఁ జెప్పుకొనియున్నాఁడు—

గీ. శాలివాహనశకమధ్యసాగరగ్ర
హర్షి శశిసంఖ్యవత్సరాభ్యర్హితంబు
నగు ప్రజోత్పత్తివత్సరంబందు మాఘ
పూర్ణిమకు గ్రంథకల్పనపూర్తి యయ్యె.

ఈతని కవిత్వమునం దక్కడక్కడఁ గొన్ని వ్యాకరణవిరుద్ధములైన ప్రయోగము లున్నను మొత్తముమీఁద శైలి రసవంత మయియున్నది. ఇతనికవిత్వరీతి తెలియుట కయి యొక్కొక్కగ్రంథమునుండి రెండేసి పద్యముల నిం దుదాహరించుచున్నాను—

ప్ర భు లిం గ లీ ల.

ఉ. నే నొకమాట పల్కెదను నీ వటుచేసి మదిష్ట మిచ్చి నీ
దానిఁగఁ జేసికొమ్మవిశథప్రధవాహ్యుఁడవై చెలంగు కా
దేని భవత్ప్రతిజ్ఞ జగదీశ్వర పొల్లగు దానఁ బాతకం
బే నినుఁ జెందుఁగాని వినుమీ ననుఁ బొందఁగ లేవు నావుడున్. ఆ-౨.

శా. ఆవిజ్ఞాపన మాలకించి దయతో నాయయ్యవారింటికిన్
దా విచ్చేయ నమాత్యవర్యులు మహాధర్మానుషక్తుల్ శమ
ప్రావీణ్యుల్ బసవన్న చెన్నబసవప్రఖ్యాతనాముల్ దగన్
సేవ ల్చేయుచు వెంబడిం జనిరి తుష్టింజెందు భావంబులన్. ఆ-3.

హ రి మి శ్రే స్త వ ము.

శా. దేహాదివ్యతిరిక్తుఁ డాత్మయని వేత్తృత్వంబు గైకొన్న నా
త్మైహార్ధాత్మకబ్రహ్మముక్ తెలివియుక్ దీపించుచున్నక్ ధరన్
దేహాల్ లొందఱు ముక్తి లేక చెడి రింతేకాక యాత్మత్వధీ
దేహోద్యాకృతినుండి వెండియును సందేహంబు లేకుండఁగన్.

శా. ఏవిజ్ఞానశిఖాస్వరూపు రవివహ్నీందూపలబ్ధిస్థలిన్
భావిక్ష్యాప్తి భవహృద్విభాంతు నుతిసత్పాత్రున్ సమస్తార్థ్య సం
సేవ ల్భక్తినొనర్చి యాత్మగతు నీజీవత్వముం దేమహా
భావు ల్బొత్తురొ వాని సంసృతితమోభానుక్ హరిం గొల్చెదన్.

ఆత్మానాత్మవివేకచూడామణి.

చ. నియమయమాదియోగపరినిష్ఠితహృత్పరిభావితంబు ధీం
ద్రియవిగతానుభావితము దివ్యము నింద్యపదార్థహీన మ
వ్యయ మనవద్యభూతివిషయాగమ మెయ్యది యట్టిబ్రహ్మమీ
వయితివి డెందమం దరయుమంచు వచించె రఘూద్వహోత్తమా. ఆ-3

మ. పుటపాకంబునఁ గాంచనం బతులమై పూర్వద్యుతిం జెందునే
ట్లటులే ధ్యానముచే గుణత్రయమలత్యాగంబుగాఁగం బరి
స్ఫుటసచ్చిత్సుఖనిత్యదివ్యనిజసంపూర్ణప్రభక్ బొందు ను
త్కటుఁడై కోవిదుఁ డంచుఁ జెప్పె మతిసీతాదృక్చకోరాత్రిజా. ఆ-ర.

---

# 137. మాడభూషి వేంకటాచార్యకవి

ఈవిద్వత్కవి భరతాభ్యుదయ మనెడి నాలుగాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఇతఁడు శ్రీవైష్ణవబ్రాహ్మణుఁడు; నైధ్రువ కాశ్యపాన్వయుఁడు; నృసింహాచార్య నందనుఁడు. ఇతఁడు సంస్కృతాంధ్రములయం దత్యంతపాండిత్యము గలవాఁడయి, శతలేఖినీపద్యసంధాన సామర్థ్యమును అష్టావధాననైపుణియు వ్యస్తాక్షరీకౌశలమును గలవాఁడయి యుండెను. ఈకవి గోదావరీమండలములోని పెంటపాడు గ్రామవాసియై కృష్ణామండలములోని నూజవీడు సంస్థానమునందు చిరకాలముండి విద్వానభినవ పండితరాయాది బిరుదాంకములఁ నందినవాఁడు.

చిన్నతనమునం దీయన ధారణాశక్తి యత్యద్భుతమైనదిగా నుండెను. అప్పు డితఁడు ద్విసంధాగ్రాహియగుటయేకాక రెండుమాఱులు చదివినపద్యమును తలక్రిందుగా నొప్పగించుటకును నెనిమిదిభాషలలో వ్యస్తాక్షరి చెప్పుటకును సమర్థుఁడయి యుండెను. ఈయన రెండుసంవత్సరముల క్రిందట వైకుంఠపదస్థుఁ డయ్యెను. ఈయన కవిత్వము నిర్దుష్టమయి మధురమై శ్రావ్యముగానున్నది. కవిత్వరీతి భరతాభ్యుదయములోని యీ క్రిందిపద్యములవలనఁ గొంతవఱకు తేటపడవచ్చును.

చ. పిలిచిన నుత్తరం బిడదు పిల్వఁబదే యిదేవత్తునంచుఁ దాఁ
బలుకును బల్కరించు చెలిపై నలుగున్ నలుదిక్కులార్తితోఁ
బలుమఱుఁ జూచు మస్తకము వంచు వెసం దలయూఁచు నాశకుం
తల ధరణీపురందరగతవ్యాకమూఁ ససర్వవృత్తియై. ఆ-౧.

చ. చానలు గాంచి రొక్కెడ సపారమసారమణిప్రణీతసౌ
పానపరంపరాసితవిభాపటలంబు తదంతరుల్లస
త్సూనలతాప్రదత్తనవదోహదధూమవిలీలఁ దోఁప సు
శ్రీనగరారు చారుసరసీరుహధామశిరోలలామమున్. ఆ-౨.

ఉ. కాంచితె సూత యీమృగము గంతముఁ ద్రిప్పి రథంబు సారెకుం
గాంచుచుఁ బోవుచు న్విశిఖఘాతభయంబునఁ బూర్వకాయమున్
వంచి సగంబు మేసినతృణంబు శ్రమంబునఁ నేలవ్రాలఁగా
నించుక యుర్విఁ జాల దివి నేగెడు నందక గంతువేయుచున్. ఆ-౩.

చ. వనితలు పుట్టినింట బహువర్షము లుండఁగరాదు భర్తతో
నునికియె యుత్తమం బది యటుండఁగనిమ్ము సమస్తరాజశో
భనమకుటార్చితాంఘ్రి యగు పార్థివశేఖరు ధర్మపత్నివ
య్యు నిటులు బీదరాలివలె నుండఁగ నేల సతీశిరోమణీ. ఆ-౪.

# 138. పెనుమచ్చ బుచ్చిరాజు

ఈకవి పరతత్త్వప్రకాశిక యనెడి యెనిమిదాశ్వాసముల వేదాంత గ్రంథమును రచియించెను. ఇతఁడు క్షత్రియుఁడు; ధనంజయగోత్రుఁడు; వేంకటపతిరాజకుమారుఁడు. ఈ కవి తాను కర్లపాలెము గ్రామనివాసుఁ డయినట్టును, సూర్యవంశపు రాజయినట్టును వ్రాసికొనియున్నాఁడు. భాగవతములోని కపిల దేవహూతి సంవాద మాధారముగా నీ గ్రంథము పెంచి వ్రాయఁబడినది. ఇతఁడు తొంబదిసంవత్సరములు జీవించి కొన్ని యేండ్లక్రిందటనే కాలధర్మము నొందినట్లు తెలియవచ్చుచున్నది. అక్కడక్కడ లక్షణవిరుద్ధములైన ప్రయోగములు పెక్కులున్నను, కవిత్వము చక్కఁగానే యున్నదని చెప్పవచ్చును. పరతత్త్వప్రకాశికలోని రెండు పద్యము లింకక్రిందఁ బొందుపఱుపఁ బడుచున్నవి—

ఉ. కోరి భుజింపఁగాఁ దగినకోవిదు నాత్మవివేకశీలసం
చారు పికారదూరు శ్రుతిశాస్త్రపరీవృతనిశ్చ యూర్జిత
త్సారమరందబిందువిలసన్మధుపానవికాసభాసురున్
ధారుణి సర్వసంశయవిదారుని ధీరుని సద్గురూత్తమున్. ఆ-3.

చ. మనసు సుషుప్తి నొక్కవడి మానుగ గ్రుగ్గినఁ జేయుకార్యముల్
కనఁబడ వేమియున్ మనసు క్రమ్మఱ మేల్కని యీతఁ డాతఁడున్
మన మనుచుండఁగాఁ గల సమస్తముఁ దోఁచు మనోవినాశమై
తనరినఁ జిత్తమింద్రియసదాగతులున్ లయ మౌను దానితోన్. ఆ-2.

# 139. మండపాక పార్వతీశ్వరకవి

ఈ విద్వత్కవి శతకములు మొదలైనవి యెనుబది గ్రంథములవఱకును రచియించినను, ఈయనచే రచియింపఁబడి ముద్రింపఁబడియున్న గ్రంథములలో శ్రీరాధాకృష్ణ సంవాదమను నాలుగాశ్వాసముల ప్రబంధము ప్రధానమైనదిగానున్నది. ఈయన వైదికబ్రాహ్మణుఁడు; పారాశర గోత్రుఁడు; కామేశ్వరపండితపుత్రుఁడు. ఈకవియొక్క తండ్రితాతలుకూడ కవీశ్వరు లయినట్లు రాధాకృష్ణసంవాదమునందు కవి యీక్రింది పద్యమునఁ జెప్పియున్నాఁడు.

సీ. శ్రీమీఱ నుభయభాషామిశ్రసత్కృతుల్
తదధిజ్ఞు లెన్న మదంకితములు చేసి
యశముఁ గాంచినపేర యమనీషిమణికిఁ బౌ
త్రత్వంబుఁ గార్తికవ్రత మహత్త్వ
శివమహాత్మ్యాద్యనేక విధప్రబంధంబు
లొనరించి సత్కవివినుతిఁ గనిన
పారాశరసగోత్రపావనుం డగుమండ
పాక కామేశ్వరపండితునకు
మహితపుత్రత్వమును గాంచి బహువిచిత్ర
చిత్రిశతిముఖ్యసత్కృతుల్ చెప్పి మెప్పు
వడసితివి గద కులకీర్తి వర్ధిలంగ
సరసగుణసాంద్ర పార్వతీశ్వరకవీంద్ర.

ఈ కవి విశాఖపట్టణమండలములోని బొబ్బిలిసంస్థానమం దాస్థాన కవీశ్వరులలో నొకఁడుగా నుండినవాఁడు. ఈ పార్వతీశ్వర శాస్త్రిగారు ౧౭౩౩ వ సంవత్సరమునందు జననమొంది ౧౮౯౭ వ సంవత్సర మధ్యమున పరమపదమునొందిరి. ఈ కవి సంస్కృతాంధ్రములయందు మంచి పాండిత్యము గలవాఁడయి మృదుమధుర నిరర్గళధారతోఁ జతుర్విధ కవి

త్వమును జెప్పుచు వచ్చుటయేకాక వినయ సౌశీల్యాది గుణసంపత్తిగల వాఁడయి యుండెను. పూర్వోక్తమయిన రాధాకృష్ణసంవాదము రావు వారను నామాంతరముగల వెలుగోటివార నెడి గృహనామముచే వెలయు శ్రీ వేంకటగిరి సంస్థానాధిపతుల వంశానుక్రమమును వర్ణించెడు గ్రంథము. శతకములును, దండకములును గాక యీకవి రచియించిన గ్రంథములలో కాంచీపురమహాత్మ్యము, అమరుకకావ్యము, ప్రబంధసంబంధనిబంధన గ్రంథము, శ్రీకృష్ణాభ్యుదయము, కొంతపెద్దవి. ఇప్పు డీయన గ్రంథము లలో నొక్క రాధాకృష్ణసంవాదమునుండి మాత్రము కొన్నిపద్యముల నిం దుదాహరించుచున్నాను—

శా. సాంగోపాంగముగా సితం డఖిలవిద్యల్ నేర్చినాఁ డోర్చినాఁ
డంగీకారము నింతఁ బట్టు మృదుచర్యం బేర్చినాఁ డేర్చినాఁ
డంగారప్రకటీమాత్రపంక్తి నరిసైన్యారణ్య మిట్లయ్యె నే
సాంగత్యంబుననో వృథాకపటభాషం దీర్చినాఁ డత్తఱిన్. ఆ-౧.

ఉ. వ్రాయఁడు లెక్క లొక్కటికి రంగకరంగ మెఱుంగుపూఁతలన్
బూయఁడు భిత్తిభాగముల ముఖ్యవిధానములందు మందతం
బాయఁడు బాంధవాదులకువారికిఁ జేయఁగలట్టి సత్కృతుల్
చేయఁడు వేఱె మీ కిపుడు చెప్పఁగ నేటికి మీ రెఱుంగరే. ఆ-౨.

మ. అఖిలభూలోకధురంధరత్వ మిపు డీశ్వద్రాజగోపాలకృ
ష్ణనరేంద్రుండు వహించె నాకభర మైనం బూనుదుంగాక యం
చు నృపానుజ్ఞను గోరవచ్చెఁ ఫణీశుండో తదేకేచ్ఛ వ
చ్చినప్రాక్కచ్ఛపమో యనం దనరెఁ దచ్ఛ్వేతాతపత్రంబటన్. ఆ-3

ఉ. తత్సరభర్తృ ఘట్టితకతమ్మునఁ బ్రాభవ మొందివోలె నం
దుత్సవ మయ్యె నింక సుర లుండఁగ నేటికిఁ బొం డటంచు నం
చత్సమధన్వనిం గసరుజాడ గనంబడఁ దామ్రచూడముల్
తత్సమయంబునన్ మొరసెఁ దామరసప్రతిమానలోచనా. ఆ-౪.

# 140. సత్యవోలు భగవత్కవి

ఈకవి ఆఱువేల నియోగిబ్రాహ్మణుఁడు జనార్దనామాత్య పుత్రుఁడు; భారద్వాజగోత్రుఁడు. ఈతఁడు గోదావరీమండలములో నించు మించుగా నూటయేఁబది సంవత్సరములక్రిందట నుండినవాఁడు. ఇతఁ డేనుఁగు లక్ష్మణకవి మొదలగువారికి సమకాలీనుఁ డని చెప్పుదురు. ఈకవి రచియించినగ్రంథములలో రుక్మిణీపరిణయ మనెడు నాలుగాశ్వాస ములప్రబంధము ప్రధాన మయినది. తాను నూఱుశతకములను జేసినట్టు కవియే తనగ్రంథమునం దిట్లు చెప్పుకొనియున్నాఁడు—

క. ధీరత శతశతకంబులుఁ । దారావళులున్ దశావతారావళులున్
జారూదాహరణంబులు । శ్రీరాజితదండకములుఁ జెప్పినవాఁడన్.

ఇతఁడు చెప్పిన రుక్మిణీపరిణయములోని దశావతారపద్యములు తెలుఁగుదేశములోఁ బలువురచేఁ జదువఁబడుచున్నవి. కవిత్వమునం దల్పదోషములు కొన్ని యున్నను మొత్తముమీఁద నీతనికవనము మృదుమధురపదగుంభిత మయి రసవంత మయి శ్రావ్యముగా నున్నది. రుక్మిణీపరిణయములోని యీక్రిందిపద్యములు కవియొక్క సామర్థ్యమును దెలుపుచును—

ఉ. ఏసతి నాత్మలోఁ దలఁప నెల్లజగంబుల జంతుకోటి కా
యాసము లేక కల్గు సరసాన్నము లాసతి యవ్విదర్భసిం
హాసనవాసియింట శిశువాట నొసంగిరి పాయసాన్నము
ల్లాసముమీఱ నాఱవనెలన్ నెలఁతల్ ద్విజబంధుకోటితోన్. ఆ. ౧.

ఉ. శ్రీకరమూర్తి వైననినుఁ జేరి భజింపఁ దలంపుచుండుటన్
నీకృపఁ గోరుచుండు టది నేరము గాదు సమస్తదేవతా
నీకము చూడ మున్ను సిరి నీదగుపేరెదఁ జేరఁగోరదే
నాకడనే జనించెను ఘనాఘనధామసమూహమోహముల్. ఆ. ౨.

చ. అరయుచు రుక్మిముఖ్యనిఖిలాధిపు లాధిపురోగరోగని
ర్భరుల తెఱంగునన్ బాగరి క్రమ్మఱ ముమ్మర మైనధైర్యవి
స్ఫురణ మెలర్ప దర్పయుతశూరత ఘోరతరాస్త్రశస్త్రభీ
కరకరులై సముజ్జ్వలితగర్జితగర్జితభూతజాతులై. ఆ. 3.

సీ. జమదగ్నిగర్భవాసమునఁ బుట్టి వివిధవిద్యాతపోధనుర్విద్యల కధి
పతివై ప్రబలి యుదంబ్రాహ్మ్య మిదంక్షాత్ర మని మునిరాజచిహ్నా
ముల శాప
చాపనై పుణిఁ జూపి పాపభూపతుల శరాసికఠోరకుఠారధార
నస్రధారాప్రవాహములుగా శతధా సహస్రధాఖండించి యానదులను
దర్పణము భూమిభూదేవతార్పణమును
జేసినపరశురాముడవే పవని నిను భ
జింతునై కుంఠనాథలక్ష్మీసనాథ
రక్షణపరాయణుండ నారాయణుండ. ఆ. 8.

---

# 141. గురురాజకవి

ఈకవి శైవధర్మములను తొమ్మిదాశ్వాసముల గ్రంథమును రచియించి బళ్ళారిమండలములోని జోహారాపురాధిపతి యైన సంజీవి రెడ్డిగారి కంకితము చేసెను. ఇతఁ డిరువది ముప్పదిసంవత్సరముల క్రిందట నుండినవాఁడు. కవిత్వము నిర్దుష్ట మని చెప్పుటకువలను పడకపోయినను మొత్తముమీఁదఁ బుస్తకము రసవంతముగా నున్నదని చెప్పవచ్చును. కవికృతము లయినకావ్యాదులనుగూర్చి కృతిపతి పలికినట్లుగా గ్రంథము నందీక్రిందిపద్యములు చెప్పఁబడినవి—

గీ. అలఘుతరభద్ర పడకండ్లకులసముద్ర
వరకుముదమిత్ర శుభభరద్వాజగోత్ర

విపులదాక్షిణ్య సౌజన్యవినయధన్య
కావ్యనైపుణ్య గురురాజకవివరేణ్య.

సీ. ప్రతిపద్యయమకచిత్రశ్లేష పద్మావతీపరిణయనామదివ్యనాట
కంబు నెంతయుఁ దాదృశం బగురుక్మిణీపరిణయాభిధగద్యపద్యకృతిని
గుణయుతాలంకారమణిమాలికను రాఘవేంద్రాష్టకంబుఁ బ్రాసైకతగను
చాటుధారాసహస్రంబులఁ గావించి యనిరుద్ధచరితాహ్వయాంధ్రనాట
కంబు నొనరించి తెనుఁగించి కలితభర్తృ
హరిశతకముల మృదులకర్ణాటకృతుల
సలిపి ధారుణీపాలాదిసభలలోన
గరము బహుమతు లందితి ఘనుఁడ వీవు.

కవియొక్క కవనరీతి తెలియుటకై శేషధర్మములనుండి రెండు పద్యముల నిందుదాహరించుచున్నాను:-

శా. సత్యంబే పిత మాత భ్రాత మిగులన్ సత్యంబె సంభోక్తయున్
సత్యంబే తగుపాపహంతయు నొగిన్ సత్యంబె శ్రీధారియున్
సత్యంబే జగతిన్ సుహృత్తు సుఖమున్ సత్యంబె బాంధవ్యమున్
సత్యంబే యని చెప్పుచుండు రెపుడున్ సంఖ్యావదగ్రేసరుల్. ఆ-3.

ఉ. నాసవవంద్య నీకిదియె వందన మంబుజలోచనా చతు
ర్మాసములందు నే రతిని మానసచాపలముం ద్యజించి బ
ల్వాసిగ సద్వ్రతంబు నిఁక వారక మీఱి యహర్నిశం బొగిన్
జేసెద నీకృపన్ విహగశేఖరకేతన శ్రీనికేతనా. ఆ-౫.

# 142. అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి

ఈ కవి యల్లమరాజు రామకృష్ణకవి తమ్ముఁడు. ఈతఁడు చేసిన గ్రంథములలో శ్రీ బచ్చు రామేశనామక వైశ్యశిఖామణి కంకితముచేయఁ బడిన శ్రీకృష్ణకళ్యాణ మనెడి మూఁడాశ్వాసముల ప్రబంధ మొకటి యచ్చుపడి యున్నది. ఈ గ్రంథములోఁ గృతిపతి కవిచేఁ జేయఁబడిన పుస్తకములను బేర్కొనుచు క్రింది పద్యమునఁ జెప్పఁబడినది—

సీ. ప్రత్యక్షర శ్లేషపద్యాళి నూర్గుల కృష్ణభూపతిసభఁ గీర్తిఁ గంటి
రహి మణిధ్వజచరిత మొనర్చి యెన్నుల రామునదోరచేతభూమిఁ గొంటి
రసవదలంకారవనహారమై చతురిను ప్రబలఁ గూర్చితివి భద్రాపరిణయ
మమరంగఁ దెలిగించితాత్మబోధము నాగమగుప్రశ్నోత్తరరత్నమాల
శేషధర్మేతిహాసవిశేష మంధ్రభాషగనొనర్చి యుడుతల పాఁపయనచి
వప్రతిష్ఠితలింగమహ రిరాముని భువ కర్పించితివి పుణ్యాభివ మొసఁగ.

ఈ కవి వాసస్థలము గోదావరీమండలములోఁ బిఠాపురమునకు సమీపమున నున్న చేబ్రోలను గ్రామము. ఈతఁడు ద్రావిడ బ్రాహ్మణుఁడు; హరితసగోత్రుఁడు; రంగనాథార్యపుత్రుఁడు. ఈకవి వృద్ధదశలోఁ గొన్ని సంవత్సరముల క్రిందట లోకాంతరగతుఁ డయ్యెను. ఈతనికవిత్వము నిర్దుష్టమయి మనోహరముగా నుండును. కవిత్వప్రౌఢిమ తెలియుటకయి శ్రీకృష్ణకళ్యాణములోని కొన్ని పద్యముల సిం దుదాహరించుచున్నాను.

చ. చెలిమినిగాదె క్రొత్తలు వచించెదవో యదువంశనాథ నీ
యలఘుభుజాబలశ్రితులమా మముబోటుల మీవు లేనిచోఁ
జెలువుఁడు లేనియింతులటు చింతిలుచుండుము నీవు చెంగటన్
వెలసిన నింద్రునితోడఁ దగువేల్పులరీతి సుఖింతు మెంతయున్. ఆ-౧.

మ. చనునే కృష్ణ భయప్రకంపితులమై శస్త్రాదుల న్వీడి యా
తసితో సంధికి నేగుటల్ మనకు శుద్ధక్షత్రివంశంబునన్

జననం బందియు నాత్మబాహుబలమున్ శౌర్యంబుఁ గోల్పుచ్చి భీ
తి నొరుం గూడుట రాజధర్మ మగునే ధీరు ల్వీన స్మాత్తురే. ఆ-౨,

ఉ. ముద్దుల మూటఁగట్టు నగుమోముహరాంగు తరాగపాళికిన్
హద్దులుదిద్దు ముత్తియులఁగుందము కుందమిళిందబృందమున్
సద్దణఁగించిమించు రదనంబుల చక్కఁదనంబు వేణిడా
లద్దిర యుద్ది దీని కిదియా నిధియా గుణరత్నరాజికిన్. ఆ-3.

---

# 143. గోపీనాథము వేంకటకవి

ఈ కవి వైదికబ్రాహ్మణుఁడు; నెల్లూరిమండలములోని కావలి తాలూకాలోని లక్ష్మీపుర గ్రామవాసి. ఇతఁడు శ్రీ వేంకటగిరి సంస్థానమునం దాస్థానకవీశ్వరుఁడుగా నుండి ప్రసిద్ధి కెక్కినవాఁడు. ఈకాలపుఁ గవులలో నితఁడు బహుమహాగ్రంథములను రచియించినవాఁడు. భాస్కర రామాయణాదులు వాల్మీకివిరచిత మూలగ్రంథానుసారముగా నుండలే దని మూలగ్రంథములో నున్నదానికంటె నెక్కువకాని తక్కువకాని లేకుండునట్లు సరిగా వాల్మీకిరామాయణ మంతయు నితఁడు పద్యకావ్యముగాఁ జేసెను. మఱియు నితఁడు బ్రహ్మకైవర్త పురాణములోని కృష్ణజన్మఖండము నెనిమిదాశ్వాసముల పద్యకావ్యముగాను, మాఘకవి కృత మయిన శిశుపాలవధను నాలుగాశ్వాసముల పద్యకావ్యముగాను, శ్రీ భగవద్గీతాశాస్త్రమును, దెనుఁగున రచియించి మెప్పించి వేంకటగిరి సంస్థానాధీశ్వరులచే నొక యగ్రహారమును బడసెను. ఇతఁడు మిక్కిలి వృద్ధుఁడయి కొన్నియేండ్లక్రిందటఁ బరమపదము నొందెను. ఈతని కవిత్వము మొత్తముమీఁద సలక్షణ మయి నాతికఠినమయి హృద్యముగా నున్నది. ఈయన గ్రంథములలోని కొన్నిపద్యము లిం దుదాహరింపఁ బడుచును వి.

## రా మా య ణ ము.

చ. ఘనగుణశాలి ప్రాణమునకంటెఁ బ్రియుం డగురామచంద్రునిన్
జననుతు నొంటిఁ బంపి నిమిషం బయినన్ మనఁజాల వంశవ
ర్ధనుఁ డగునట్టి యీతలిరుఁ బ్రాయపుముద్దులకుఱ్ఱఁ డేల నీ
యనుమతి నేన వచ్చెద సురారులఁ జంపి మఖంబు గావఁగన్. బా॥కాం.

ఉ. చంద్రునివంటి నెమ్మొగము చాఁగెడుకన్నులు వృత్తదంష్ట్రముల్
సుందరపల్లవాధరము సోగకురుల్మణికుండలప్రభా
బంధురకర్ణయుగ్మమును బారెఁడుచేతులుఁ గల్గురాము నిం
పొందఁగఁ జూడకున్న నిలుపోపఁ దరంబెసుమంత్రయుత్తలిన్. అయో.

చ. యువతిరణాళికిం జొరవ యీశ సదాగతిరాకకైనఁ బ
ల్చునపడ శర్ధిసైకతముఁ జల్లిన రాలఁగనీక దట్టమై
దనుజవిముక్తకాండములఁ దట్టుచు దిక్కులరామకాండముల్
సునిసితభంగి నిండుటయుఁ జూచి సురల్వెఱఁగందిరయ్యెడన్. అరణ్యా.

ఉ. భూవరవర్య యెవ్వని సముద్ధతిఁ జావుటకై కడంగి సు
గ్రీవునితోడ నెయ్య మొనరించి తదీప్సితసిద్ధిఁ గోరి వ
న్నీవిధిఁ జంపి తట్టిదనుజేంద్రుని రావణుఁ గీటడంచి నీ
దేవిని నెందుడాఁచినను దెచ్చియొసంగనెయొక్కఁ ప్రేల్మిడిన్. కిష్కింధా

ఉ. ఓరిదురాత్మ యిందు బుధు లుండరొ యుండిన నీవు వారలం
జేరవొ సాధువాక్యములు చేకొన వొల్లవొ శిక్షలేమి నా
చారవిహీనమై సకలసజ్జనగర్హిత మయ్యె నీమతం
బారయ నీకతంబున నిశాటకులంబు చెడున్నిజంబుగన్. సుందరకాం.

మ. మరియున్ రావణి సాయకంబులు ధనుర్మౌర్విం దగం గూర్చి బ
ల్గరులాడం దెగనిండఁదీసి వెస వక్షం బుచ్చిపో నేసినన్
గురుబాణక్షతజాతరక్తకలితాంగుండై సుమిత్రాసుతుం
డరయం బొల్చె విధూమవహ్నిగతిఁ బుష్పాఢ్యద్రుమప్రక్రియన్.
యుద్ధకాం.

## కృష్ణ జన్మ ఖండము.

చ. సలలితశుద్ధతోయములు చారుమణీదళపద్మకైరవో
త్పలములు గంధలుబ్ధకసుపానసుభ్రమరగీతనాదముల్
కలరవచక్రకుక్కుటమరాళమనోహరమంజుశబ్దముల్
గలిగి మనోజ్ఞసంపదలఁ గ్రాలు విశాలసరోవరం బొగిన్. ఆ. ౩.

మ. పరికింపం గడు దుర్లభం బవనిలోఁ బ్రాణేశ కాంతామణీ
పురుషప్రేమగుణాతిరిక్త మనిశంబుం బూతచారిత్రయుక్
స్మరనారజ్ఞయు సాధ్వియుక్ రసికయున్ జాతుర్యసంయుక్తయా
తరుణీరత్న మెఱుంగు సత్పురుషుఁడుక్ దత్త్వంబు చింతింపఁగన్. ఆ-౮

## శిశుపాలవధము.

శా. సామర్థ్యంబున మాఱులేనిబల మన్యాం బన్విధి న్నీతిమ
ర్యాదమర్యాద నెఱింగి పోవుబల మన్యం బిట్టు లీరెంటికిన్
నేమం బేర్పడ భూరితేజమునకుం జీకట్లకుంబోలె బ
ల్సామానాధికరణ్య మెట్లు గలుగున్ జర్చింప లోకంబునన్. ఆ. ౧.

చ. అలఘుధనుష్ప్రభావము గుణాతిమహత్త్వము ముష్టిశక్తియో
యిలయు దిగంతముల్ గగన మీనుచు నున్నవో సేమిచిత్రమో
తెలియఁగరాదు శౌరిసముదీర్ణశరంబులు చిత్రజల్లుల
ట్లలవడ నొక్కరీతిఁ గురియం దొడఁగెన్ ధ్వనిపూర్వకంబుగన్. ఆ. ౪.

## భగవద్గీత

ఉ. మెండుగ వృష్టికాలమున మిన్నక పాఱునదీప్రవాహముల్
నిండి చలింపకున్న యలనీరధిఁ జేరినమాడ్కి నెవ్వఁడుం
దండిగ సర్వకామములు తప్పకచేరు నతండు శాంతుఁడై
యుండు సకాముఁడై ననరుఁ డొందఁడు శాంతిని పాండునందనా.

చ. అలయక యోగు లీతనిఁ బ్రయత్నము సేయుచు నాత్మయందు ని
శ్చలముగ నున్నవానిఁగ [illegible] రజ్ఞులై యని
శ్చలమతిహీను ల[illegible] జాలఁ బ్రయత్నము చేసియున్ సము
జ్జ్వలుఁ డగునీశ్వరుం దెలియఁ జాలరు భారత నిక్క మింతయున్.